# శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళి

## పదునైదవ సంపుటము

## ధర్మోపన్యాసములు - చతుర్థభాగము

ప్రకాశకులు

**శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము**

**శ్రీవ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంధాలు పాఠకలోకానికి సుపరిచితాలే ఈ గ్రంధాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంధాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంధాలుగా ముద్రింపబడివున్నాయి వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంధ రాశిగా ''శ్రీమలయాళసద్గురు గ్రంధావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది ఇంచుమించు ఆగ్రంధాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా

లుంటాయి ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము

శ్రీ వ్యాసాశ్రమం

ప్రకాశకులు






శ్రీ మలయాళ సద్గురు గ్రంధావళిలో ఇది పదునైదవ సంపుటము శ్రీవారి రచనలలో ధర్మోపన్యాసములు ఇంతకు ముందు ఐదు సంపుటాలుగా ముద్రింప బడ్డాయి అందులో నాలుగు సంపుటాలు మొదటి సారిగా **1949, 1953, 1960, 1961** సంవత్సరాలలో శ్రీవారి కాలములోనే క్రమంగా వెలువడ్డాయి అవి పలుసార్లు పునర్ముద్రణ పొందాయి ఈ నాల్గింటిలో చేరనివి, తరువాత యధార్థ భారతిలో ప్రచురింప బడినవి అయిన శ్రీ సద్గురు స్వాములవారి వ్యాసాలు మాతృశ్రీ చోడే వెంకటరమణమ్మగారి కృషి ఫలితంగా ఐదవ సంపుటంగా **1990**-లో వెలువడ్డాయి

ఈ సంపుటాలలో శ్రీ సద్గురు దేవులు సనాతన వేదాంత జ్ఞానసభ, సాధుమండలి, ఓంకారసప్తాహము మొదలైన కార్యక్రమాలలోనూ, పర్యటన కాలములో వివిధ ప్రదేశాలలోనూ చేసిన ఉపన్యాసాలు, ఉపదేశాలు మరియు కొన్ని ధార్మిక సంస్థలకు పంపిన సందేశాలు, స్వయంగా వ్రాసిన వ్యాసాలు చోటు చేసుకొన్నాయి

పలు సందర్భాలలో శ్రీవారు కావించిన ప్రసంగాలకు గ్రంధరూపం కల్పించిన రచయితల వివరాలు ఈ గ్రంధావళి పండ్రెండవ సంపుటము తొలిపలుకులో పేర్కొనడం జరిగింది ఈ సంపుటంలో ప్రధానంగా శ్రీవారి రచనలే చేర్చడమైనది

ఈ గ్రంధావళి ప్రచురణ ప్రణాళికలో ధర్మోపన్యాసాలు ఐదు సంపుటాల లోని రచనలతోపాటు **1950** లో వెలువడిన శ్రీవ్యాసాశ్రమ రజతోత్సవ సంచికలోని శ్రీవారి వ్యాసాలను కూడా చేర్చడమైనది ఈ ముద్రణ క్రమములో మొత్తం ధర్మోపన్యాసాలను నాలుగు సంపుటాలుగానే ప్రచురిం[illegible]ని భావించి అలా చేయడం వల్ల ఈ సంపుటాలు ఒక్కొక్కటి ఇంచుమించు 500 పుటలకు విస్తరించాయి

ఇపుడు క్రింది విధంగా పూర్వముద్రిత సంపు[illegible]ంపబడ్డాయి

| పూర్వ సంపుటాలు | క్రొత్త సంపుటాలు<br>శ్రీమలయాళ సద్గురు గ్రంధావళిలో |
|---|---|
| అ) ధర్మోపన్యాసాలు మొదటి సంపుటము మరియు రెండవ సంపుటములోని తొలి 138పుటలు | 12సంపుటము ప్రధమభాగము |
| ఆ) రెండవ సంపుటములోని తక్కిన భాగము మరియు మూడవ సంపుటములోని తొలి 244 పుటలు | 13వ సంపుటము ద్వితీయ భాగము |
| ఇ) మూడవ సంపుటములోని తక్కిన భాగము మరియు నాల్గవ సంపుటము పూర్తి | 14వ సంపుటము తృతీయ భాగము |
| ఈ) ఐదవ సంపుటము మరియు రజతోత్సవ సంచికలోని శ్రీవారి వ్యాసావళి | 15వ సంపుటము చతుర్ధ భాగము |

పూర్వం ముద్రితమైన 'ధర్మోపన్యాసాలు - ఎంచమ భాగము'లో "1 యధార్థ భారతి అవతరణ కారణము - తన్నామౌచిత్యము" అను శీర్షికతో వున్న వ్యాసం 'శ్రీమలయాళ సద్గురు గ్రంధావళి - రెండవ సంపుటము - స్వబోధ సుధాకరము'లో ముద్రింపబడి వున్నది అట్లే పై గ్రంధములో చివరి అంశముగా వున్న "2. స్వాతంత్ర్య దిన సందేశము" అన్న విషయము 'శ్రీమలయాళ సద్గురు గ్రంధావళి పదునొకండవ సంపుటము - ఉపదేశామృతము'లో ప్రకటింపబడి వున్నది

రజతోత్సవ సంచికలో 'దృష్టిభేదము' అను విషయమునుండి 'ప్రవృత్తి - నివృత్తి మార్గములు' అను విషయము వరకు ఇరవై అయిదు వ్యాసములు శ్రీవారివి చేర్చబడి వున్నాయి అందులో "3 బ్రహ్మచర్యము", "4 గాయత్రీ మన్త్రము" అను శీర్షికల క్రింద వున్న అంశాలు ఆ పేర్లతోనే వెలువడిన రెండు ప్రత్యేక గ్రంధాలకు పీరికలే ఈ గ్రంధావళి ప్రచురణ ప్రణాళికలో ఆ రెండు గ్రంధాలు ఈ పీరికలతో సహా ఇతరత్రా చేర్చడమైనది. కాబట్టి ఈ పదునైదవ సంపుటము నుండి పై నాలుగు అంశములను తొలగించడమైనది

మరియు ధర్మోపన్యాసములు పంచమ భాగములో 'సదుపదేశములు' అను ఒకే పేరుతో అయిదు అంశాలుగా ముద్రించబడిన విషయాల నన్నింటినీ క్రోడీకరించి ఈ సంపుటములో "సదుపదేశములు-I, సదుపదేశములు-II" అని రెండు శీర్షికల క్రింద సమకూర్చడమైనది పాఠకులు గమనించగలరు

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ శుభసందర్భంలో శ్రీవారి రచనలను ఇలా సంపుటాలుగా ప్రచురించే సదవకాశం కలగడం శుభావహం ఆత్మోన్నతిని ప్రసాదించే ఈ గ్రంధావళిని భక్తులు ఆదరంతో పఠించి కృతకృత్యులై శ్రీ గురుదేవుని అనుగ్రహానికి పాత్రులగుదురుగాక!

**శ్రీవ్యాసాశ్రమము** **సముద్రాల లక్ష్మణయ్య**
**30-8-2000**

# విషయ సూచిక



రాయవేలూరు - ఆసుపత్రిలో

మహర్షి సద్గురు శ్రీమలయాళస్వాములవారు



# ధర్మోపన్యాసములు

## చతుర్థ భాగము

### బంధవిముక్తి

ఆత్మవిముక్తిని కలుగజేసినవారు శ్రీదయానంద సరస్వతీస్వాముల వారు మన భారతదేశములో వర్తమానయుగములో లోకవిముక్తిని కలుగ జేసిన వారు మహాత్మగాంధీగారు ఆత్మవిముక్తిని కలుగజేసిన దయానంద సరస్వతీ స్వాములవారున్ను, మహాత్మాగాంధీగారున్ను, ఉభయులున్ను చిర కాలము భారతీయులకు స్మరణీయులు బాహ్య ప్రపంచమును పరాధీనము నుండి విడుదల చేసినవారు గాంధీ మహాత్ములు ఆలాగున ఆత్మవిమోచన మును చేసిన వారు దయానంద సరస్వతీ స్వాములవారు ఇవి రెండును పరస్పర సంబంధము కలిగియేయున్నవి ఒకదానికొకటి సహాయ పడును ఇవి దేహి, దేహములవంటివి దేహము, మనస్సు రెండును శుద్ధములై మంచి స్థితిలో నున్నపుడే మానవుడు ఇహపరసుఖముల రెండింటిని పొందగలుగును స్వరాజ్యము మనకు ఉన్నప్పటికిన్నీ, స్వారాజ్యము అనగా ఆత్మరాజ్యములో ఇంకను భారతీయులు అనేకులు అస్వతంత్రులయ్యే ఉంటున్నారు అనగా ఆత్మరాజ్యములో ఇంకను పరాధీనులే స్వరాజ్యముకన్న స్వారాజ్యము పవిత్ర మైనది, చైతన్యవంతమైనది, శాశ్వతమైనది సర్వేశ్వరుడు మానవునియొక్క యిహ సౌఖ్యమునకు సమానముగా ఏర్పఱచియుండు పృధివి, జలము, అగ్ని, వాయు, ఆకాశాదులు ఏలాటివో ఆలాగున ఆత్మసౌఖ్యమునకు పరమేశ్వరుడు మనకు వేదములను అనుగ్రహించియున్నాడు పంచభూతములలో ఏ యొక్క భూతమైనను, మనకు లభించనిచో మనమేలాగున శాంతిని

ఆత్మసుఖమును పొందజాలమో, ఆలాగున భగవం తుడు ఆత్మసుఖము కొఱకు మనకొసంగిన వేదములు, వేదాంతములును సంపూర్ణముగా అనుభవములోనికి వచ్చినప్పుడే ఆత్మసుఖమును, శాంతిని పొందగల మనియు, లేనిచో పొందలేమనియు భారతదేశములో గల సర్వజనులు తెలిసి కొన్నప్పుడే మనము ఆత్మసుఖమును, స్వారాజ్యమును పొందిన వారము కాగలుగుదుము స్వరాజ్యమును భారతీయ స్త్రీ, పురుషులు అందరున్నూ ఏలాగున త్యాగమొనర్చి, శ్రమకోర్చి పడసిరో ఆలాగున వేదము, వేదాంతము సర్వమానవుల హక్కని గ్రహించి సంపాదించినప్పుడే కృతార్థులు కాగలరు అయితే స్వరాజ్య సంపాదనకు జైలుశిక్ష, లాఠిచార్జి మొదలైన బాధలు పడవలసివచ్చెను

ఈ ఆత్మరాజ్య సంపాదనకు అట్టి శ్రమలేవియున్నూ లేవు బాలగంగాధర తిలక్‌గారు స్వరాజ్యము మన జన్మహక్కని చెప్పినట్లు భారతీయులందరూ స్వారాజ్యము తమ జన్మహక్కని దృఢము చేసికొని దానికి సంబంధించిన వేదాధ్యయనము, తపస్సు, బ్రహ్మచర్యము మొదలగు వానిలో ప్రయత్నము చేయవలెను ఇప్పుడెవరున్నూ వేదము చదువుటలోను, తపస్సు చేయుట లోను, బ్రహ్మచర్యము శీలించుటలోను మిమ్ములను అడ్డుపరచువారు లేరు మీ సోమరితనము ఒక్కటియే మీకు అడ్డునిలిచినది దానిని తొలగించిన చాలును ఇప్పుడు వేదము చదువుటలోను, బ్రహ్మచర్యము శీలించుటలోను, తపస్సుచేయుటలోను మీకు సహాయముగా అనేకసంస్థలు గలవు ఆర్ష కాలములో ఆర్యసంతతివారు పురుషులు కనీసము 25 సంవత్సరముల వరకున్నూ, స్త్రీలు 22 సంవత్సరములవరకున్నూ ఏలాగున బ్రహ్మచర్య వ్రతము శీలించి గురుకులములో వేదాధ్యయనపరులై యుండిరో అట్టి ధర్మమును శీలించిన చాలును ఆత్మశక్తిగల పుణ్యజీవులు స్త్రీలైనను, పురుషులైననూ, నైష్ఠిక బ్రహ్మచర్యమునుగాని లేక బ్రహ్మచర్యమునుండి సన్న్యసించుట గాని చేయవలెను

**రవిర్వాయుర్యథా వృష్టిర్లోకానాం హితకారణమ్ ।**
**తథా భవన్తి వేదాశ్చ సర్వేషాం మోక్షసిద్ధయే ॥**

దీని అర్థము పైన చెప్పినదే

**పురాకల్పే కుమారీణాం మౌంజీబంధన మిష్యతే ।**
**అధ్యాపనం చ వేదానాం సావిత్రీవచనం తథా ।**
**బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయచ స్వాయ చారణాయ ॥**

దీనినే శ్రీ దయానంద సరస్వతీస్వాములవారు ఎక్కువ ప్రచారము లోనికి తీసుకొని వచ్చిరి



# గీతోపదేశము

శ్రీ గాంధీగారు గీతాప్రబోధము ప్రారంభించుటకు ముందుగా నేను (ఈ ఉపాధి) అచ్చటచ్చట భక్తులచే గీతాపారాయణము చేయించుచు, గీతార్థమును చెప్పుచున్నప్పుడు అంతటను తగిన ఆశ్రమములు, మఠములు, స్థలములు గలిగి యుండెడివి గావు గీతాపారాయణమునకున్ను, గీతార్థము శ్రవణము చేయుటకున్ను, సర్వవర్ణములలోగల స్త్రీ పురుషులు విశేషముగా వచ్చుచుండిరి కొన్ని స్థలములలో భజనపందిళ్లుగాని, పాకలు గాని చాలక పోయిన వీధులలోను, మామూలు ప్రదేశములలోను భక్తులు కూర్చుండి విను చుండిరి అప్పుడు వర్ణాశ్రమములు చాల బలముగా నుండేకాలము కొందరు పండితులు ఈ భగవద్గీత యెంత పవిత్రమైన గ్రంథము ఈలాగున బయలు ప్రదేశములో జాతి, వర్ణ, ఆశ్రమ, స్త్రీ, పురుషాది భేదములేక అందరికిన్ని చెప్పవచ్చునా? యని అడుగుచుండిరి దానికి ప్రశాంతముగా ప్రసన్న భావముతో తగినంత సమాధానము చెప్పుచు రావడమైనది

మహాత్ములగు గాంధీగారి పుణ్యావతారముచే ఆ ప్రశ్నలన్నియు

అంతర్ధానములైనవి శ్రీ గాంధీగారు అగ్రజాతినుండి అంత్యజాతి వరకున్ను సర్వమానవులకు శ్రీ భగవద్గీతను ఉపదేశించివచ్చుటయే దానికి కారణము పూర్వము అందరికిన్ని చెప్పవచ్చునా? యని ప్రశ్నించెడు కాలమున శ్రీ కృష్ణభగవానుడు భగవద్గీతను కురుక్షేత్రమున ఏలాగున సర్వజనులు వినేలాగున ఉపదేశించెనో, ఆలాగున ఈ జనసమూహమునకు ఎప్పుడుచెప్పే కాలము గలుగునా? యని అడిగే వారితో సమాధానము చెప్పుచూ రావడమైనది చాతుర్మాస్యవ్రతమున రెండు సార్లు కృష్ణానదీ తీరములోను, రెండుసార్లు గోదావరీనదీ ప్రదేశములోను చెప్పుటకు అవకాశము గలిగెను పై చెప్పిన విషయము అట్టి సమయమున అచ్చట సమావేశమైయుండు జనసముదాయమునకు తెలుపడమైనది అచ్చోట ఈ ఉపాధికి గలిగిన గీతను గురించిన భావములన్నియు ప్రశాం తముగా తెలుపడమైనది, అచ్చట సమావేశమైన శ్రోతలందరికిన్ని ఇది విదితము, శ్రీకృష్ణభగవానుడు భావికాలమున ఈలాంటి ప్రశ్నలు రావచ్చు నని హృదయములో తలంచియే, కురుక్షేత్రమున ఈ గీతాధర్మమును ఉపదేశించెను ఇది రహస్యముగా ఎవరైన కొందరు పుణ్యజీవులకు మాత్రమే యేకాంతముగా చెప్పవలసియున్నచో భగవానుడు కురుక్షేత్రమున ఆలాటి మైదాన ప్రదేశములో పద్దెనిమిది అక్షౌహిణీసైన్యముల మధ్య దీనిని చెప్పి యుండరు అట్లు ఏకాంత ప్రదేశమున, రహస్యముగా భగవానుడుపదేశించి యుండిన ఇప్పుడు పైన ప్రశ్నించిన వారి ప్రశ్నలకు మనము సమాధానము చెప్పజాలము, ప్రధమ, ద్వితీయ, జర్మనీ యుద్ధకాలములో మన (ఇంగ్లీషు) వారి సైన్యముల ప్రయాణమున్ను, సేనల నివాస స్థలములున్ను మీరు చాలా మంది చూచియే యుందురు వేలాది సైన్యములకు కావలసిన వసతు లన్నియు, యుద్ధకాలమున ఇంగ్లీషుప్రభుత్వము ఏర్పరచినట్లు, కురుక్షేత్ర సైన్యమునకున్ను యేర్పాటు చేసియే తీరవలెను అనగా క్షౌరము చేయుటకు మంగలివారలు, గుడ్డలు ఉతుకుటకు చాకలివారలు, పారిశుద్ధ్యము చేయు టకు పాకీవారలు, గుఱ్ఱములను, ఏనుగులను మేపేవారలు, వంటచేసే

వారలు మొదలగు జనులందరున్ను అప్పుడున్ను ఉండియే తీరవలెను వీరందరున్ను గీతాశాస్త్రము విని జన్మసాఫల్యమును చేసికొనవలెనను తలంపు శ్రీ భగవానునకుండుట వలననే అట్టి ప్రదేశములో గీతాధర్మము నుపదేశించుటకు కారణమైనది

మరియు శ్రీకృష్ణభగవానుడు పూర్ణ పురుషుడు ఆరడుగుల యెత్తుండును అప్పుడు పన్నెండడుగుల యెత్తునుండి శ్రీభగవానుడు గీతాధర్మము నుపదేశించెను ఎత్తు జాస్తిగానుండిన చాలదూరమునకు వినబడును ఇప్పుడుగూడ కాంగ్రెస్ మొదలగు మహాసభలలో ఉపన్యాసవేదిక యెంత యెత్తులో కట్టెదరో మీలో చాలా మంది చూచియే యుందురు రహస్యముగా పుణ్యప్రదేశములలో పుణ్యాత్ములకే చెప్పవలసియుండిన, శ్రీ కృష్ణభగవానుడు - ఎచ్చటనో పుణ్య ప్రదేశమున ఏకాంతమున పవిత్ర ప్రదేశమున గీతను శ్రీ భగవాను డుపదేశించునే గాని ఈలాగున జనబాహుళ్యములో వర్ణాశ్రమము లను పాటింపక, స్త్రీ, పురుష భేదము లేక గీత చెప్పవచ్చునా యను ప్రశ్న వచ్చును సామాన్యజనులు యంత్ర సహాయముతోగాని, మోట(కపిల)తో గాని, తమభూమి సరిహద్దులో కావలసిన నీరుమాత్రమే తోడుదురు వర్ష మన్ననో ఏకదేశములోగల ప్రదేశమంతటిని నేలాగున జలముచే సమృద్ధిగా తడుపుచుండునో, సంకుచితబుద్ధికిన్ని, విశాలబుద్ధికిన్ని తారతమ్య మీలాగున నుండును స్వార్థశీలురకున్ను, నిస్వార్థపరులకున్ను గల భేదమిది జీవి బుద్ధికిన్ని ఈశ్వర బుద్ధికిన్ని నుండే భేదమిట్టిది మరియు శ్రీ భగవద్గీత పుణ్యాత్ములకు, నైష్ఠికులకు, బ్రహ్మనిష్ఠులకు మాత్రమే చెప్పవలసినదగుచో, ద్రోణాచార్యులు, భీష్మాచార్యులు, ధర్మరాజు మొదలగు ప్రముఖులెందరో యుండిరి లేనిచో సన్న్యాసులకు, విరక్తులకు, ఋషులకు మాత్రమే చెప్ప వలసియున్నచో అప్పుడున్న ఆలాటి మహాత్ములకు కొరతయేమియు లేదు

అలాగుననే భగవానుడు చేసియుండినచో పై జెప్పిన ప్రశ్నలు జన సముదాయములో (దూరుకొని) ఇప్పుడుగూడ రావచ్చును ఇదంతయు ఆలోచించుకొనియే శ్రీ భగవానుడు రణమధ్యములో పన్నెండడుగుల యెత్తు

నుండి ఈ గీతాశాస్త్రము బోధించుటకు కారణమైనది లేనిచో ఈ జనులందరు భీష్మాచార్య, ద్రోణాచార్యులవలె బ్రహ్మవేత్తలా! ధర్మరాజు వంటి పుణ్యా త్ములా అని తప్పక అడుగుదురు

మరియు ద్రోణాచార్యులవంటి బ్రాహ్మణులకే చెప్పియుండినచో ఈ గీతాశాస్త్రమునకు బ్రాహ్మణుడే అర్హుడు బ్రాహ్మణేతరులకు అర్హతలేదను వాదముగూడ వచ్చును అదిన్నిగాక భగవద్గీత అందరున్ను చదువరాదు సన్న్యాసులైపోతారు, వైరాగ్యము గలిగి గృహము వదలిపోతారు కావున అందరున్ను చదువకూడదని యిప్పుడుగూడ శాస్త్రార్థము దెలియనివారు చెప్పుదురు కనుకనే క్షత్రియవంశములో, గృహస్థాశ్రమములో నుండు అర్జునునకు ఉపదేశించుటకు కారణమైనది గీతాశాస్త్రము సంపూర్ణముగా విని అర్థమును అవగాహన చేసికొనిన అర్జునుడు గృహస్థాశ్రమమును విడిచి యెచ్చటికో పారిపోలేదు తన స్వధర్మమును నిర్వహించుకొని మోక్షమునకు అర్హుడైనాడు మరియు ద్రోణాచార్య, కృపాచార్యాదులకు చెప్పియుండినచో, ప్రజలను శాసనములో పెట్టి నడిపేశక్తి వారికుండదు రాజ్యపాలనము అప్పుడు క్షత్రియుల హస్తగతమైయుండెను అట్లయిన పై బ్రాహ్మణుల కున్నూ, ఈ వలనుండు వైశ్యశూద్రాదులకున్నూ ధర్మమును బోధించిన ప్రజా పాలనము చేయుటకు అవకాశము గలుగదని తలంచియే అర్జునున కుపదేశించెను మరియు బ్రాహ్మణుల కుపదేశించిన ప్రజాపాలనశక్తి వారికి లేనందుచే బ్రాహ్మణేతరులు ధర్మము ననుసరించి నడువకుందురేమో? వైశ్యశూద్రాదులకు ఉపదేశించియుండిన రాజ్యపాలనశక్తి అప్పుడు వీరికి లేనందుచే క్షత్రియ బ్రాహ్మణాదులు లక్ష్యము చేయరేమో? ఈ భావమును మనస్సు నందుంచియే అర్జునునకుపదేశించిరి

మరియు ఒకవేళ అర్జునున కుపదేశింపతలచినను ప్రత్యేక సమయ మున, ఉపదేశించకూడదా? సంగ్రామ మధ్యమున నేల ఉపదేశించ వలెనను ప్రశ్నకూడ ఒకటికలదు అట్లైన నిప్పుడు మామూలుగా గురువులు ఏకాంత మున శిష్యుల కుపదేశించినట్లే యుండును. కాని ప్రత్యేక విశిష్టత

దానికుండదు సామాన్యముగా ఒక పోట్లాట, కలహము, కొట్లాట జరుగునప్పుడే మనస్సెంత చంచలమై యుండునో అట్లుండగా పదునెనిమిది అక్షౌహిణుల సైన్యములో "ప్రవృత్తే శస్త్ర సం పాతే" అని చెప్పినటుల యుద్ధసన్నద్ధులై రణభేరి మ్రోగించుచుండగా, శంఖధ్వనుల శబ్దము మిన్నుముట్టుచుండగా, యుద్ధమునకు కారణ పురుషుడగు అర్జు నుని మనస్సు గాలిలో పెట్టిన దీపమువలె చంచలమైయుండు తరుణమున గీతా బోధామృతము ఏకాగ్రచిత్తముతో శ్రవణముచేసి నిశ్చల మనస్సు కలిగి కృతార్థుడనైతినని చెప్పగా, ఆ గీతామృత మహిమ (లాహరి) యెటువంటిదో వివేకశీలురు, ప్రభావశాలురు తెలుసుకొనవచ్చును అర్జునునకు కలిగియుండు అంత ప్రపంచవిషయము, యుద్ధ సమాచారము ఇప్పుడుండు గృహస్థుల కెవరికైన నుండదుగదా? అట్టైన స్వల్పమైన గృహ కృత్యములను నిర్వహించుకొని గీతాపారాయణముచేసి నిశ్చల ధ్యానము కలిగి, ఎందుకు జ్ఞానమును పొందకూడదు? ఎందుకు స్వధర్మమును పాలించకూడదు? ఈ తత్త్వసారమంతయు గ్రహించి, గీతాపారాయణము చేసికొని గీతలో చెప్పినట్లు అనుష్ఠానము గలిగియుండిన, తప్పక ఈ సంసారము నుండియే మోక్షము పొందవచ్చును అక్షౌహిణీ నిర్ణయము

## అమరకోశము - క్షత్రియ వర్గము

**ఏకేభైకరథా త్ర్యశ్వా పత్తిః పంచపదాతికా ।**
**పత్త్యంగైస్త్రిగుణైస్సర్వైః క్రమాదాఖ్యా యథోత్తరమ్ ॥**

**సేనాముఖం గుల్మగణౌ వాహినీ పృతనా చమూః ।**
**అనీకినీ దశానీకిన్యక్షౌహిణీ ॥**

ఒక ఏనుగు నొకరథమును మూడు గుఱ్ఱములును, ఐదుగురు కాలిబంట్లును గల సేనపేరు పత్తియనబడును అట్టి మూడు పత్తులుచేరి ఒక సేనాముఖ మనబడును అట్టి సేనా ముఖములు మూడయినచో నొక గుల్మ మగును, అట్టి గుల్మములు మూడు ఒక గణమగును అట్టి గణములు

మూడయినచో ఒక వాహిని యగును అట్టి వాహినులు మూడు చేరినచో ఒక పృతన యగును, అట్టి పృతనలు మూడయినచో ఒక చమువనబడును అట్టి చమువులు మూడు కలిసి ఒక అనీకిని యగును అట్టి అనీకినులు పది చేరి ఒక అక్షౌహిణి యగును

అనగా ఒక అక్షౌహిణికి (2,18,700) రెండు లక్షల పదునెనిమిదివేల ఏడునూర్లు సంఖ్యయగును

అనగా

21,870 ఏనుగులు, 21,870 రథములు, 65,610 గుఱ్ఱములు, 1,09,350 కాలిబంట్లు మొత్తం 2,18,700 (రెండులక్షల పదునెనిమిదివేల ఏడునూర్ల సంఖ్య ఒక అక్షౌహిణి యగును )

ఇందులో కాల్బలములు మాత్రం (భటులు) పద్దెనిమిది అక్షౌహిణులకు చేరి (19,68,300) పందొమ్మిదిలక్షల అరువది యెనిమిదివేల మూడు నూర్లు



# యుగనిర్ణయము

శ్రీమహర్షి మలయాళస్వాములవారు గోదావరి పుణ్యతీరమున శ్రీ విళంబినామ సంవత్సర చాతుర్మాస్య మహావ్రతము పూర్తిచేసి యేకాంతమున నిర్మల ప్రదేశమునందుండగా ఫలానవాడనగు శ్రీధరుడను నేను విధి వద్దండ ప్రణామమొనరించి పరమభక్తితో యుగ భేదమును గూర్చి సవినయముగా నడిగితిని మహాత్మా! మునివరా! తాము క్రిందటి దినమున యుగ బేధమును గూర్చి మహాసభలో ప్రబోధించితిరి కృత, త్రేతా, ద్వాపర ములలో కలియుగములో అనగా ఈ నాల్గింటిలోను కలియుగము ఎల్లప్పు డుండునని యానతిచ్చితిరి అనగా కృతయుగములో కృతయుగము, కృత

యుగములో త్రేతాయుగము, కృతయుగములో ద్వాపరము, కృతయుగములో కలియుగము - ఇట్లు ఈ నాల్గుయుగము లెల్లప్పుడును, ఒక్కొక్క దానిలో అంతర్భూతములుగా నుండునని తెలిపితిరి దీనియొక్క సత్యము నాకు విశద పడే లాగున విస్తరించి చెప్పి నన్ను కృతార్థునిగా జేయ ప్రార్థించుచున్నాను అంతేగాక ఈ ధర్మరహస్యము శాస్త్రము నందెచ్చటనైన ఇదివరలో మునివరేణ్యులు తెలిపియున్నారా?అదియును సెలవీయ వలయును

ఉత్తరము - బుద్ధిసూక్ష్మతయు, నేకాగ్రతయు, హృదయనిర్మలత్వ మును గల ఆత్మసోదరా! వినుము ఈ తత్త్వసారము తెలియకనే ఈ వర్తమాన కలియుగమున సామాన్యజనులు ఇది కలియుగము, సత్యమునకు, ధర్మము నకు, బ్రహ్మచర్యమునకు, సన్న్యాసమునకు, ఏకపత్నీ వ్రతమునకు, పాతివ్రత్యమునకు ఇది కాలము కాదనియు చెప్పుచు జ్ఞాననిష్ఠనుండి పవిత్రా త్ములను, పుణ్యాత్ములను గూడ వారి వారి వ్రతనిష్ఠ నుండి పతితులుగా నొనర్చుచున్నారు కావున ఈ సమయమునకు ఈ ప్రశ్న చాలా తగి యున్నది దీని వలన ధర్మసారము తెలియక యుండువారికి సత్యసారము గోచరించి ధర్మపరులై ఈ జన్మములోనే మోక్షమును పొందగలరు

మొట్టమొదట కృతయుగములో ధర్మదేవత నాలుగు పాదములతో గూడి యుండుననియు, త్రేతాయుగములో మూడుపాదములతోను, ద్వాపర యుగమున రెండు పాదములతోను, కలియుగమున ఏకైక పాదముతో నుండునని భాగవతాది పురాణములలో తెలుపడమైనది కావున ఆ పాదచతుష్టయము తెలిసి కొనవలయును 1 సత్యము, 2 దయ, 3 తపస్సు, 4 దానము ఈ నాలుగు గుణములు కలవాడు కృతాది నాలుగు యుగములలో నేయుగములో నుండినను ఆ పుణ్యాత్ముడు కృతయుగమున నుండువాడే సత్యము లోపించి దయ, తపస్సు, దానము కలిగినవాడు ఏయుగము నందున్నవాడైనను, త్రేతాయుగమున నున్నవాడు సత్యమున్నూ, దయయు క్షీణించి తపస్సును, దానమును కలిగినవాడు ఏ యుగములో

నుండినను ద్వాపరమందుండు వాడే సత్య, దయా, తపస్సులు మూడును క్షయించి ఈదాన మొక్కటి మాత్రముండువాడు ఏ యుగమునందుండి నను కలియుగమున నున్నవాడు ఈ దానమున్నూ లేనివాడై క్రూరుడై ప్రాణ హింసాపరుడై యుండు వాడేయుగమునందుండు వాడైనను, అతి కలియుగ మున నుండువాడు అనగా సంపూర్ణ కలిపురుషునకు సదృశు డగును. అనగా తీవ్రముగా కలియుగము విజృంభించినవాడేయగును ఇతడు కలిపురుషు నకు మిత్రుడని గ్రహించవలయును

## జాతి నిర్ణయము

2 ప్రశ్న - తాపసవర్యా! మరియొక ధర్మసందేహము కూడ కలదు అదేమన ఇది వరలో తమ ధర్మోపన్యాసములలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులలో ఒక్కొక్కదానిలో నాలుగు జాతులు కలవని సెలవిచ్చితిరి ఈ సందేహమును నివృత్తిచేయ ప్రార్థించుచున్నాను దీనికిని ప్రమాణమేదైన కలదా? అదియును సెలవీయ కోరుచున్నాను శాస్త్ర ప్రమాణము లేనిచో పండితు లంగీకరించరు

ఉత్తరము - ఓ కుశాగ్రబుద్ధిగల సోదరా! ఇదియును మంచిప్రశ్నయే లోకమున కెంతయో ఉపకారమైనది గీతయందు శ్రీకృష్ణ భగవానుడు దీనిని తెలిపియున్నాడు శమము, దమము, తపస్సు, సత్యము, అధ్యయనము గల వాడు ఏ జాతిలో పుట్టినవాడైనను, అతడు బ్రాహ్మణుడనియు, శౌర్యము, తేజస్సు, ధైర్యము, కలిగి ధర్మమును పాలించువాడు క్షత్రియుడనియు, కృషి, గోరక్ష, వాణిజ్యము, ధనార్జనబుద్ధికలవాడు, ఏ జాతిలో జన్మించినవాడైనను, వైశ్యుడనియు, స్వబుద్ధితో నాలోచించి స్వయం జీవనము నిర్వహించుశక్తి లేనివాడై పరులనాశ్రయించి జీవనము గడుపువాడు శూద్రుడనియు గ్రహించుకొనవలయును ఈ పై చెప్పిన నాలుగు వృత్తులు స్వభావముగా గలవాడు ఆ యా వర్ణములతో గూడినవాడనియు గ్రహించుకొనవలయును. ఈ సత్యమెరింగిన మాత్రమే తమ తమ స్వభావములను మార్చుకొనుట

కవకాశము కలుగును ఇందు నిమ్నస్థితిలో నుండువారు ఉన్నతస్థితిలోనికి వెళ్ళుటకును, ఉచ్చస్థానములో నుండువారు నీచస్థితిలోనికి జారిపోకుండుట కును అవకాశ మేర్పడును ఈ సత్యము సర్వజనులకును గోచరపడునప్పుడే స్వరాజ్య స్వా రాజ్యములు రెంటిలోను సమర్థులై ఇహపర సుఖములను మానవులు పొందగలరు



# జీవితయాత్ర

మనము దినమొకటింటికి 24 వేల మైళ్ళు సూర్యుని చుట్టూ ప్రయాణము చేయుచున్నాము దీనిని సామాన్యముగా ఎవరును తెలుసుకొనుట లేదు మనము పుట్టినప్పటినుండి భూమిపై ఒకచోట ఉన్నటుల తలంచుచున్నాము ఈ ప్రయాణము జాగ్రత్సుషుప్తులలో గూడా జరుగుచునే యున్నది దృష్టాంతముగా మీచేతిపై గల గడియారము జాగ్రదవస్థలోను, సుషుప్త్యవస్థలోను నడచుచునే యున్నదిగదా! అయితే మనము ఆత్మోన్నతి పథములో, దైవమార్గములో ఎంతదూరము వెళ్ళితిమో దీనిని ఎవరును సామాన్యముగా గ్రహించుట లేదు ఆత్మోన్నతి మార్గమునటు ఉండనిండు జీవితదశలో శారీరకేంద్రియములందలి మార్పులనుగూడ మనము గ్రహించుట లేదు ఇందువల్లనే అంత్యకాలమును దుఃఖముతో గడుపవలసి వచ్చుచున్నది మాయ జీవుని ఆత్మోన్నతి మార్గమును చూడనీయక యీదృశ్య విషయముల లోనే కాలమును గడుపులాగున చేయుచున్నది ఇదియే ప్రకృతియొక్క శక్తి దిన మొకటింటికి 24 వేల మైళ్ళ దూరము మనము పోవుచుండిన, సంవత్సరమునకు 87,60,000 ఎనుబదియేడు లక్షల అరువదివేల మైళ్ళ దూరము వెళ్ళుచున్నాము ఓహో! యెంతదూరము!

సామాన్యముగా ఒకరైలులో దూర ప్రయాణము చేయువాడు మదరాసు నుండి బయలుదేరినచో కొంత దూరము అరవదేశము, ఆ భాష,

ఆ ప్రజలను చూచుకొని, ఆంధ్రదేశమున ప్రవేశించిన ఆ జనులను, ఆ భాషను, వారి స్వభావములను చూచి, మఱల ఒరిస్సాలో ప్రవేశించిన ఆ భాషను, ఆజనుల స్వభావాదికమును కళ్ళారచూచి, మరల బెంగాల్, హిందూ స్తాన్, పంజాబ్, కాశ్మీర్ మొదలైన దేశములను, వాటి భాషలను, వారివారి విభిన్నదుస్తులను, వివిధ భోజనాదులను ఏలాగున దర్శించుచున్నాడో ఆలాగున ఆత్మమార్గములో మనము ప్రయాణము చేయుచుండిన ఎన్నియో క్రొత్త క్రొత్త భావములను గని ఉండగలము ఆలాగున దైవమార్గములో ప్రయాణము చేయకపోవుటయే సృష్టియొక్క వైచిత్ర్యమును, ఈశ్వరుని యొక్క మహిమను జీవేశ్వరులయొక్క భేదమును కట్టకడకు అమృతత్వ మును, ఆనందమయమగు బ్రహ్మమును కనుగొనక పోవుటకు కారణము ధారణా ధ్యాన సమాధులను అభ్యసించెడు పరమయోగులు, లేక పరమ భక్తులు, ఆత్మజ్ఞాన విచారణపరులు, క్రొత్త క్రొత్త విషయములను కనుగొని ప్రపంచమునకు బోధించుటకు ఇదియే కారణము లేనిచో ఒకే విషయమునే వారు ఎల్లప్పుడును చెప్పుచుండిన జనులు గుంపులుగుంపులుగా వారి దగ్గరకు ఎందుకు వెళ్ళుదురు! మీలో నెవరైనా ఒక రైలు పెట్టెలోగల అన్ని కిటికీలను మూసివేసుకొని పరుండి నిద్రపోవు చున్నటుల తలంచుడు అట్లైన వేలకొలది మైళ్ళదూరము మీరు వెళ్ళినను ఇన్ని మైళ్ళ దూరము వచ్చినటుల తెలియక పోవుటయే గాక ప్రపంచమున ఈశ్వర సృష్టిలో గల యే వైచిత్ర్యమును గాని మీరు ఎరుంగజాలరు గదా! ఆలాగున ఒక స్టీమరులో, ఒక గదిలో తలుపులన్నియు మూసివేసి మీరు నిద్రించుచుండిన మీరు ఎన్ని వేలమైళ్ళు దూరము వచ్చినదియు, సముద్రము యొక్కయు, ద్వీపముల యొక్కయు, ద్వీపాంతరముల యొక్కయు ఆ విచిత్రసృష్టి సౌందర్యమును, ఆయాదేశములను, దేశవాసులను, వారి ఆహార విహారములను వేటిని తెలియజాలరో, అట్లే అజ్ఞాన దశలో నుండు, అవిద్యావరణ హృదయ గ్రంధి లోపల నుండు జీవునియొక్క స్థితియు నుండునని గ్రహించేది పై జెప్పిన విధముగా రైలు బండిలోగాని, ఓడలో ప్రయాణము చేయునప్పుడుగాని, రైలు

పెట్టె యొక్క కిటికీలను, ఓడలోని తానుండు గదియొక్క తలుపులను తెరచి వేసి నిద్రపోకుండ ప్రయాణము చేయుచుండిన సృష్టియొక్క వైచిత్ర్యమును, మహిమను చూచి యెంత ఆనందింపగలరు? లోకచరిత్రమును ఎన్ని గ్రంథములుగా వ్రాయగలుగుదురు? ఆలోచించుకొనుడు ఆత్మమార్గములో అనుష్ఠానము చేయువానియొక్కయు, చేయనివానియొక్కయు స్థితి యీలాగుననే యుండును కావుననే గీతయందు శ్రీకృష్ణభగవానుడు "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః" అని తెలిపెను అజ్ఞానము చేత జ్ఞానము ఆవరింపబడి యుండుట చేత జీవులు మోహమును పొందుచున్నారు

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**
**తేషామాదిత్య వద్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥**

అట్టి అజ్ఞానమును జ్ఞానముచేత నెవరు నాశము చేయుచున్నారో, అట్టివారలకు జ్ఞానము సూర్యునివలె అనగా సూర్యుడు వస్తువులను ప్రకాశింపజేయునట్లు ఆపర బ్రహ్మస్వరూపమును ప్రకాశింపజేయుచున్నది కారు చీకటి గదిలో అనగా తలుపులు కిటికీలు మూయబడియుండు గదిలో ఉండువానికిని, వసంతకాలములో సూర్యుడు ప్రకాశించుచున్నపుడు బయట ఉండువానికి నెంత తారతమ్యము గలదో, ఆవరణ సహిత హృదయము గలవానికిని ఆవరణ రహిత హృదయము గలవానికిని ఇంత భేదముగలదు తన ఆత్మ ఈశ్వరాంశ స్వరూపమనియు, లేక ఈశ్వరస్వరూప మనియు, పరమాత్మ స్వరూపమనియు, అమృతస్వరూపమనియు, ఆనందస్వరూప మనియు వేదాంతశాస్త్రము ఉపదేశించుచునే యున్నను, అట్టి ఆనందమును, అమృతత్వమును, శివత్వమును, ఆత్మ పొందకపోవుటకు ఆవరణమే కారణము కావుననే శ్రుతి -

**భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః ।**
**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే ॥**

అని తెలిపినది పరావరమైన ఆ పరమాత్మ సాక్షాత్కారము గలుగునప్పుడు హృదయ గ్రంధులు (ముళ్ళు) అన్నియు భేదింపబడు చున్నవి సమస్త సంశయములున్నూ పటాపంచలై పోవుచున్నవి ఈ జీవుని యొక్క సమస్త కర్మలున్ను నశించిపోవుచున్నవి ఆహాహా! ఎట్టి పరమ సత్య మును శ్రుతి ఉపదేశించుచున్నది! ఈస్థితి గలుగునపుడు 'శివోఽహ' మని ఆత్మ తాదాత్మ్య భావమును పొందుచుండును తాదాత్మ్యస్థితిని పొందుటకు ముందు ఈశ్వరోపాసన చేయునప్పుడు 'దాసోఽహ' మని భావింపబడు చున్నది ఇక కేవలము ఆవరణావృత జీవులు 'దేహోఽహ' మనియే తమను తలంచుచుందురు అయ్యో! మూడవది యెంత దీనావస్థ! మొదటిది ఉత్తమ పక్షమనియు, రెండవది మధ్యమ మార్గమనియు, మూడవది అధమమైన పాప మార్గమనియు దెలిసికొనుడు ఈ రెండు, మూడు ఆవరణములు తొలగి జీవుడు మొదటిదగు ఉత్తమ మార్గమును, లేక ఉత్తమోత్తమ మార్గమును పొందుటకు మార్గమును గీతలో శ్రీకృష్ణభగవానుడు ఏకాదశాధ్యాయమున ఉపదేశించెను

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥**

ఇట్టి విశ్వరూపమును ధరించిన నేను మదేకనిష్ఠమైన భక్తిచేతనే యధా ర్థముగా దెలిసి కొనుటకున్ను, దర్శించుటకున్ను, ఐక్యమగుటకున్ను సాధ్య మైన వాడనగుచున్నాను

అనన్యమైన భక్తిచేత గలిగిన ప్రయోజనము ఇచట మూడు విధము లుగా ఉపదేశింపబడినది- 1 జ్ఞాతుం, 2 ద్రష్టుం, 3 ప్రవేష్టుం అని గ్రహించేది ఇచట 'తత్త్వేన' అని ఒక పదము ప్రయోగింపబడినది. వేదాన్త తత్త్వ విచారణవల్ల గలిగెడు ఏబ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గలదో అది తదేకనిష్ఠ గల భక్తివల్లనే గలుగును ఇట్టి భక్తికి సర్వజనులున్నూ అధికారులు, వేదమును చదువ వలయుననిగాని, బ్రాహ్మణుడై పుట్ట వలయుననిగాని తలంచనవసరమే లేదు దేహపరిణామమును గురించి ద్వితీయాధ్యా

యమున భగవాను డుపదేశించినది చూడుడు

**దేహినోஉస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।**
**తథా దేహాన్తర ప్రాప్తిర్ధీర స్తత్ర న ముహ్యతి ॥**

ఇదియు జీవితయాత్రకు సంబంధించినదని గ్రహించేది దేహ ధారి యగు జీవునకు ఈ శరీరమునందు బాల్యదశయును, యౌవన దశయును, వార్ధక్య దశయును ఏప్రకారము గలుగుచున్నవో, అదే విధముగా మఱియొక దేహమును పొందుటయు నగుచున్నది ఆ కారణమువలన ఆత్మస్వరూప మిట్టిదని యెరింగినవాడు మోహమును పొందడు.

ఇదియు దుఃఖరాహిత్యము గలుగుటకున్ను, అమృతత్వమును పొందుటకున్ను ఒక గొప్ప దివ్యోపదేశమని మరువకుడు, ఈ విషయమునే బాలురు గూడా తెలుసుకొనేలాగున శ్రీశంకరభగవత్పాదులు భజగోవింద మున ఉపదేశించిరి

**దినయామిన్యౌ సాయం ప్రాతశ్శిశిరవసన్తౌ పునరాయాతః ।**
**కాలః క్రీడతి గచ్ఛత్యాయుస్తదపి న ముఞ్చత్యాశావాయుః ॥**

ఇదియు జీవునియొక్క పరలోక ప్రయాణమును గూర్చి బోధించిన దగును పగలు, రాత్రి, సాయంకాలము, ప్రాతఃకాలము, శిశిర ఋతువు, వసంత ఋతువు, సంవత్సరము వీటి యొక్క పునఃపునరాగమనముచే జీవునియొక్క కాలము, ఆయుస్సు ఆనందముగా గడిచి పోవుచున్నది కాని అతనియొక్క ఆశాపాశము మాత్రము వీడుటలేదు అనగా ఈలాగున కాలము తన జీవితమును హరించుకొని పోవుచున్న సంగతి జీవుడు తెలుసు కొనుటలేదు ఎంత ఆశ్చర్యము! అనగా తాను జన్మించిన దానికి ప్రయోజన మేదియో గ్రహించుకొనుట లేదని భావము, మఱియు

**బాలస్తావత్ క్రీడాஉஉసక్త స్తరుణస్తావ త్తరుణీసక్తః ।**
**వృద్ధస్తావచ్చిన్తాஉஉసక్తః పరమే బ్రహ్మణి కోஉపి న సక్తః ॥**

బాల్యకాలమంతయు ఆటపాటలందును, యౌవన కాలమంతయు

యువతులతో గడపుటతోను, వార్ధక్యకాలమంతయు తాను సంపాదించిన ధనగృహాదులు ఏమైపోవునో అను విచారముతోను కాలము గడచిపోవు చున్నది, ఈలాగున జీవితమంతయు వ్యర్థముగ గడచిపోయిన తరువాత మరల ఎపుడు ఆత్మశాంతి కొఱకు, మోక్షము కొఱకు పరమేశ్వరుని భజించ గలరు! జ్ఞానముకొఱకు బ్రహ్మవిచారము ఎప్పుడు చేయగలరు! ఆహా! జీవుల యొక్క అవస్థ యెటువంటిది! ఆశ్చర్యము

**పునరపి జననం పునరపి మరణం పునరపి జననీజఠరే శయనమ్ ।**

**ఇహ సంసారే బహుదుస్తారే కృపయాఽపారే పాహి మురారే ॥**

మాటిమాటికి పుట్టుట గిట్టుట, తిరిగి మాతృగర్భమున ప్రవేశించుట, ఈరీతిగా నిరంతరము ఈ ప్రపంచమున గమనాగమనములు, జరుగుచునే యున్నవి కరుణానిధివగు ఓ పరమేశ్వరా! దుస్తరమైన ఈ సంసార సాగ రమునుండి నన్ను దయతో కాపాడుము

శ్రీశంకర భగవత్పాదులు ఎంతటి గంభీరార్థముతో కూడిన ఈ ' భజ గోవిందము'ను రచించిరో ప్రజ్ఞావంతు లాలోచించుకొందురుగాక! కట్ట కడపట భక్తిమార్గములో నిలపడమైనది శంకరులు భక్తి మార్గమును, యోగ మార్గమును చెప్పలేదనియు, జ్ఞాన మార్గమునే ఉపదేశించిరనియు చెప్పు వారలు 'శివానందలహరి' మొదలగు గ్రంథములను చూచుదురుగాక!



# ప్రమాదవాక్యము

వేదాంతులలో కొందరు ప్రమాదవాక్య మొకటి చెప్పుదురు అదేమన అనుష్ఠానము, ఆచరణ, నియమము, గురువుల కంత అవసరము లేదనియు, శిష్యులకు మాత్రమే ఉండవలసినది అనియు బోధింతురు గురువుల వర్తనము శిష్యులు చూడకూడదనియు, వారు చెప్పినట్లు నడుచుకొనవలె ననియు బోధింతురు, దానికి దృష్టాంతముగా వైద్యుని యొక్క ఆహార

ఆచరణాదులను రోగులు చూడవలసినది లేదనియు, వైద్యులు చెప్పినట్లు రోగులు ఆచరణ గలిగియుండవలసినదనియు వారి మతము.

ఇది చాలా ప్రమాదముతో కూడిన వాక్యము అంతేగాక ఇది ఒక విధమగు మోసము వైద్యులలో కొందరు కొంత రోగము కలిగి యుండిన తప్పక వారున్నూ రోగివలె ఔషధ పథ్యములు గలిగి యుండవలసినదే గదా! అయితే వైద్యులకు రోగము కలిగియుండిన మాత్రమే గదా అట్లు చేయ వలసియుండునని ప్రశ్న యొకటి గలదు లేనిచో అక్కర లేదుగదా! దీనికి సమాధానమేమన రోగ చిహ్నములు వైద్యునియందు కనబడుచుండినచో అతడున్నూ తప్పక ఔషధ పథ్యములతో కూడి ఉండవలెను అనగా ప్రకృతి గుణములు ప్రాకృత విషయములు గురువులకుండినచో వారు ఇంకను ప్రకృతి దోషరహితులు కాలేదనియు, ప్రకృతి విముక్తి పరమగు జీవన్ముక్తి కలుగలేదనియు తలంచి తప్పక వారున్నూ నియమనిష్ఠులై ఉండవలెను గురువులయొక్క వర్తనమును అనుసరించియే శిష్యులు ప్రవర్తించెదరు ఇది మరువరాని వాక్యము, "యధా రాజా తధా ప్రజాః" రాజు ఎట్లుండునో ప్రజలున్నూ అట్టి స్వభావము గలిగియే యుందురు ఆలాగుననే "యధా గురుః తధా శిష్యః" గురువు యొక్క పద్ధతి ననుసరించియే శిష్యులు కూడ ప్రవర్తింతురు కీటకము భ్రమరమును భావించి భావించి యేలాగున తుమ్మెదగా మారుచుండునో, ఆలాగున శిష్యుడు కూడ సదా గురువును భావన చేయువాడగుట వలన అట్టి స్వభావము కలవాడే అగును ఇది మరువ రాని సత్యము

అతీంద్రియ జ్ఞానముగల సిద్ధ పురుషులు ఒకానొకప్పుడు లోకోద్ధారము కొరకు విధి నతిక్రమించి ప్రవర్తించినను అది శిష్యుడనుసరించ నక్కర లేదు గురువు చెప్పిన వాక్యమును అనుష్ఠించిన చాలును ఇది అందరికిన్నీ సంబంధించినది కాదు అట్టి గురువులు విషామృతములను సమానముగా చేయువారు తక్కిన వారికి ఈ వాక్యము అన్వయించదు మరియు అతికరుణాస్వరూపులగు గురువులు కొన్ని నియమములు తమ

కవసరము లేనప్పటికిన్నీ తమ ఆచరణము అనుసరించియే శిష్యులు ప్రవర్తిం చెదరని తలంచి శిష్యుల కొఱకు అనుష్ఠానము కలిగియేయుందురు ఒక శ్రీమంతుడుండెను అతనికి ఒకానొక కుమారుడుండెను అతడు బాల్యావస్థ లో అతి ప్రేమతో తండ్రితో కూడ భుజించెడివాడు ఆ పసివానికి ఒక జబ్బు వచ్చెను, వైద్యుడు భోజన విషయములో కొన్నిమార్పులు చేసెను అనగా పథ్యమేర్పరచెను తండ్రిని విడిచి భుజింపని వాడగుటవల్లను, తండ్రికి పుత్ర వాత్సల్య మెక్కువగుటవల్లను తండ్రి కూడా కుమారునకు ఆరోగ్యము కలుగు వరకు వైద్యు డేపథ్యము విధించెనో తానున్నూ అదే నియమముతో జీవించెను ఇదే యధార్థమైన శిష్యవాత్సల్యము గల గురువులయొక్క విధానము లేబ్రాయములో గోవు ఎట్లు పోవుచుండునో దూడయున్నూ గోవు ననుసరిం చియే పోవును నిజముగా గురుశిష్యుల యొక్క ధర్మము ఈలాగున నుండును ఈ విషయమై శ్రీకృష్ణభగవానుడు గీతయందేమి ఉపదేశించెనో చూడుడు

**యద్యదాచరతి శ్రేష్ఠస్త త్త దేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ (3 - 21)**

ఉత్తముడు ఏయే కర్మను ఆచరించుచున్నాడో, ఇతరమైన ప్రపంచ జనముకూడ ఆ యా కర్మమునే ఆచరించుచున్నది మరియు అట్టి ఉత్త ముడు ఏయే వాక్యమును ప్రమాణముగా చేయుచున్నాడో, ప్రపంచ జనులు కూడ దానినే ప్రమాణముగా నమ్మి చేయుచుందురు

**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।**
**నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ (3 - 22)**

ఓ అర్జునా! నాకు చేయదగిన కర్మమేదియును లేదు, మరియును మూడు లోకములయందును, కొంచెమైనను నాచేత పొందబడనిది గాని, పొందదగినది కాని లేదు అయినను కర్మమునందు ప్రవర్తించుచునే యున్నాను

**యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ॥**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ (3 - 23)**

ఓ అర్జునా! నేను సర్వకాలముల యందును, జాగరూకుడనై కొంచె మైనను పొరబాటులేక కర్మలను చేయకపోతినేని లోకములోని మానవులం దరును నావలెకర్మలను చేయక యూరకుందురు అట్లు చేయకపోవుటచేత భ్రష్టులగుదురు

**ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।**
**సంకరస్య చ కర్తా స్యా ముపహన్యామిమాః ప్రజాః ॥ (3 - 24)**

నేను కర్మలను చేయకుందునేని ఈ జనులును చెడుదురు కర్మ సంకరమునకు కర్తనుగాగూడ అగుదును ఈ జనులను చెడగొట్టినవాడనగు దును

దీనికన్న పరమ ప్రమాణము మరియేమి కావలయును. జీవులయందు ఎంత కరుణ గలిగి భగవానుడు ఈ వాక్యము చెప్పెనో తెలిసికొనిన చాలును గురుగీత యందు పరమ శివుండు పార్వతీ దేవికి ఉపదేశించినది చూడుడు

**చాతుర్యవాన్ వివేకీచ అధ్యాత్మజ్ఞానవాన్ శుచిః ।**
**మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే ॥**

చతురతగలవాడై, వివేకియై, అధ్యాత్మ జ్ఞానసంపన్నుడై, బాహ్యాంతర శుద్ధిగలవాడైన ఎవని మనస్సు నిర్మలమైయుండునో వానికిమాత్రము గురు శబ్దము శోభించును చతురుడనగా, ఏపని ఏకాలమున ఎట్లు చేయవల యునో అట్లు చేయువాడును, సమర్థుడును అగువాడు చతురుడనబడును

**గురవో నిర్మలా శాంతాః సాధవో మితభాషిణః ।**
**కామ క్రోధ వినిర్ముక్తాః సదాచారా జితేంద్రియాః ॥**

అత్యంత నిర్మల హృదయముగలవారై, పరమశాంతులై, సాధనచతు ష్టయ సంపత్తి గుణములతో కూడిన సాధువులై, మితభాషణము గలవారై

కామక్రోధములగు అరిషడ్వర్గము లేనివారై, సదా సన్మార్గప్రవర్తకులై ఇంద్రియ ములను జయించిన వారు మాత్రము గురువులగుట కర్హులు అగుదురుగాని ఇంద్రియలోలురు అధికారులు కారని పరమశివుం డుపదేశించెను

**ఫాషండినః పాపరతా నా స్తికా భేద బుద్ధయః ।**
**స్త్రీలంపటా దురాచారా : కృతఘ్నా బక వృత్తయః ॥**

పాషండులు (దైవ, వేదనిందకులు) పాపకృత్యములు చేయువారు, నాస్తికులు, స్త్రీలోలురు, దురాచారులు (దురాచారగుణములు గలవారు), కృతఘ్నులు (తమకు ఇతరులు చేసిన ఉపకారమును మరచినవారు), బక వృత్తితో కూడినవారు (హృదయములో గల దుర్గుణములను బైటచూపక కొంగవలె ధ్యానము చేయుచు సమయము వచ్చినప్పుడు తమకార్యములను సాధించువారు) ఇటువంటి స్వభావము గలవారు వర్జనీయులు

**ఇంద్రియేషు చ సర్వేషు వాగుపస్థౌ మహాబలౌ ।**
**ఆదౌ తయోర్జయే యత్నం కుర్యాద్యోగీ విశేషతః ॥**

ఇంద్రియము లన్నిటిలోను జిహ్వేంద్రియ, గుహ్యేంద్రియములు మిక్కిలిబలము గలవి కావున యోగియైనవాడు ప్రప్రథమమున ఈ రెండిం ద్రియములనే జయించుటకు (స్వాధీనము చేయుటకు) విశేషముగా ప్రయ త్నించవలయును ఈ రెండింటిలో జిహ్వేంద్రియమును ముందుగా జయిం చిన మాత్రమే గుహ్యేంద్రియము జయించబడును ఏలన జిహ్వేంద్రియ ముచే భుజింపబడిన ఆహారములే గుహ్యేంద్రియమును ప్రేరణచేయును

**శైలే శైలే న మాణిక్యం మౌక్తికం న గజే గజే ।**
**సాధవో న హి సర్వత్ర చందనం న వనే వనే ॥**

కొండలలో ఎచ్చట చూచినను రాళ్లు గుట్టలు గుట్టలుగా కనిపించి నను, వానిలో మాణిక్యమెంత దుర్లభమో, ఆలాగున గజము లనేకములు న్నను గజముత్యము గల ఏనుగెంత దుర్లభమో, ఆలాగున వనములలో

ఎచ్చట చూచినను విస్తారముగా పలు విధములగు వృక్షములు కనిపించినను, శ్రీగంధపు చెట్లెట్లరుదుగా కనుపించునో, ఆలాగున ఎచ్చట చూచినను సాధువులు (గురువులు) గుంపులు గుంపులుగా కనుపించినను నిజమగు సాధనానుష్ఠానము గల సాధువు (గురువు) లభించుట కడుంగడు దుర్లభము అని అష్టావక్రమునీంద్రుండు జనకున కుపదేశించెను

**మృద్వాసనే సమాసీనో జితచిత్తేంద్రియ క్లమః ।**
**ఓమిత్యుచ్చారయేత్తావన్మనో యావత్ప్రసీదతి ॥**

మెత్తని ఆసనమందు కూర్చుండి ఇంద్రియాది వృత్తులను నిశ్చలముగా జేసికొని మనస్సు లీనమై బ్రహ్మాకారవృత్తి గలుగు పర్యంతము ఓంకారమును పరమాత్మ పరముగా భావనచే ధ్యానము చేయవలయును

ఇదే మనోజయమునకును, మనోనిర్మలత్వమునకున్ను సాధనమగును మెత్తని ఆసనమున ఎంతసేపు కూర్చుండినను కాలునొప్పి కలుగదు, లేనిచో అప్పుడప్పుడు కాళ్ళు మార్చుకొనుచుండవలయును శ్రీ కృష్ణభగవానుడును ఈలాగుననే ఉపదేశించెను

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥**

ఈ కామము, క్రోధము రజోగుణముచే గలిగినవి ఇది మహాశనుని వంటిది, మహాపాపస్వరూపము ఆత్మ జ్ఞానమునకు ఇది పరమ శత్రువు

మహాశనుడనగా అగ్ని, ఇది హవిస్సు, ఘృత సమిధలచే తృప్తి పొంద జాలదు పై జెప్పిన హోమసాధనములచే అంతకంతకు వృద్ధియగునే గాని శమించదు ఆలాగుననే కామాది విషయములు ఎంత కెంత కనుభవించినను అంతకంతకు పెరుగునే గాని తరుగవు

**తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాననాశనమ్ ॥**

కావున మొట్ట మొదట ఇంద్రియ మనోబుద్ధులు ఆధారముగా గల ఏ కామము జీవుని మోహ పెట్టుచున్నదో, జ్ఞానమును, విజ్ఞానమును, నశింప జేయునది యగు పాపస్వరూపమైన ఈ కామమును ప్రయత్న పూర్వకముగా జయింపుము మరియు ఈ విషయమై వేదాంత శాస్త్రముపదేశించినది చూడుడు

**మణి మంత్రౌషధైర్వహ్ని : సుదీప్తోఽపి యథేన్ధనమ్ ।**
**ప్రదగ్ధుం నై వ శ క్తః స్యాత్ప్రతిబద్ధస్త థైవచ ।**

**జ్ఞానాగ్నిరపి సంజాతః ప్రదీ ప్తః సుదృఢోఽపి చ ।**
**ప్రదగ్ధుం నై వ శక్తః స్యాత్ప్రతి బన్ధస్తుకల్మషమ్ ॥**

మణి మంత్రౌషధములచే కట్టబడిన అగ్ని హూత్రుడు గొప్పగా ప్రజ్వ లించి యుండినదైనను ఏలాగున తృణమునైన దహింపచేయ శక్తిలేనిదై యుండునో, ఆలాగున వేదాంత జ్ఞానము గొప్పగ చెప్పగల శక్తి గలిగి యుండి నను, విషయాది దోష ప్రతిబంధముండిన అజ్ఞానమును నశింపజేయ శక్తి గలిగియుండదు ప్రతిబంధము వర్తమాన ప్రతిబంధమనియు, భావి ప్రతి బంధమనియు, భూత ప్రతిబంధమనియు మూడు విధములు వానిలో వర్త మాన ప్రతిబంధము గొప్పది దానియందు విషయాసక్తి లక్షణము మహా చెడ్డది ఇది వేదాంత పంచదశియందు కనందగును



# మాయయొక్క వైచిత్ర్యము

సృష్టియొక్క వైచిత్ర్యము అచింత్యము ఆత్మ అకర్తయై, సాక్షియై, స్వప్రకాశజ్ఞాన స్వరూపమై యుండినను దేహేంద్రియ మనోబుద్ధ్యాదుల క్రియలన్నియు, ధర్మము లన్నియు మాయాశక్తి వల్ల ఆత్మయందు ఉన్నట్లు జీవులు చూచుచున్నారు దృష్టాంతముగా ఒక విషయము తెలిపెద ఏదైన ఒక్క రోగ కారణముచే తల తిరుగు స్వభావము గలవాడు ఒక మంచముపై

పండుకొనియుండిన తల తిరిగెడు సమయమున, తానున్నూ, ఆ మంచ మున్నూ తిరుగుచున్నట్లున్ను, ఈ రెండున్నూ పైకిలేచి క్రిందపడిపోయే లాగుననున్నూ తోచును ఇది తల తిరిగెడు స్వభావముగల అందరికిన్నీ అను భవము తల తిరిగెడు స్వభావమువల్ల తన దేహమున్నూ, మంచమున్నూ తిరిగి క్రిందపడినట్లు స్పష్టముగా తోచుచుండును ఆ తిరుగుడు నిలచిన తరువాత ఆలోచించుకొనిన తానున్నూ, ఆ మంచమున్నూ, ఆ ఇల్లున్నూ నిశ్చలముగానే యున్నట్లున్ను, రోగముచే ఆలాగున తిరిగినట్లు తోచినదేగాని తనకున్ను, మంచమునకున్ను, గృహమునకున్ను తిరుగుడులేనట్లు తెలిసి కొన్నట్లు ఆత్మ జ్ఞానము కలుగునప్పుడు తాను నిత్య శుద్ధ స్వయం జ్ఞాన ప్రకాశ అచలుడను బోధము కలుగును తక్కిన రోగారోగ్య సుఖదుఃఖము లన్నియు దేహేంద్రియ మనోబుద్ధుల ధర్మమని గోచరింపగలుగును. ఇదే నిజమైన ఆత్మజ్ఞానము, అనుభవజ్ఞానము ఈ విషయమై గీతలో 4వ అధ్యాయములో శ్రీకృష్ణ భగవానుడుపదేశించినది చూడుడు

**కర్మణ్యకర్మ యః పశ్యేత్‌దకర్మణి చ కర్మ యః ।**
**స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥**

ఎవ్వడు కర్మయందు అకర్మనున్ను, అకర్మయందు కర్మనున్ను చూచునో అతడు మనుష్యులలో బుద్ధిమంతుడును (వివేక జ్ఞానము కల వాడగును) సమాధి నిష్ఠగల యోగియు, సకలములైన కర్మలను చేసిన వాడుగను అగును ఈ శ్లోకము గొప్ప లోతైన భావముతో కూడినది ఒకడు నదిపై వేగముగల పడవలో ప్రయాణము చేయుచుండిన నదీ తీరములో గల వృక్షము లన్నియు వెనుకకు పరుగెత్తి పోవునట్లు తోచును నిజముగా ఆలో చించిన పడవ పోయెడు వేగము తనయందే ఉన్నప్పటికిన్ని నిశ్చలముగా నుండు వృక్షాదులు వెనుకకు పరుగెత్తినట్లు చూచుచున్నాము గదా! మాయ యొక్క శక్తియు, ప్రకృతియొక్క స్వభావమున్ను ఈలాగున నుండును కావున ప్రకృతి పురుషుల జ్ఞానము గలవాడే యోగియు, జ్ఞానియు అగునని భగవానుడు ఉపదేశించెను కావుననే గీత 13వ అధ్యాయములో

**క్షేత్ర క్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ।**

క్షేత్రక్షేత్రజ్ఞుని యొక్క నిజమైన జ్ఞానము ఏది గలదో అదే నిజమైన జ్ఞానమనియు, అది శ్రీకృష్ణభగవానుని మతమనియు ఇచ్చట ఉపదేశించడ మైనది మరియు పెద్ద పట్టణములోగాని, మహారణ్యములోగాని, సముద్ర ములో ప్రయాణము చేయునప్పుడుగాని కొందరికి దిగ్భ్రమ కలుగును అది సత్యమనియే వారికి తోచును దిగ్భ్రమ యనగా - తూర్పు పడమరగాను, పడమర తూర్పుగాను, దక్షిణము ఉత్తరముగాను, ఉత్తరము దక్షిణముగాను తోచును ఇది అందరిక్నీ అనుభవములో గల జ్ఞానము ఇక మీకు సులభముగా తెలిసికొనుటకు మరియొక దృష్టాంతము తెలిపెద మీ శరీరపు ఎత్తునకు సమముగా కొంచెము పెద్దదైన ఒకఅద్దమును ఒకగోడలో తగిలించి మీకుడిప్రక్క చెవిలో ఒక పుష్పముగాని, పెన్సిలుగాని, మరి ఏదైనా ఒక వస్తువుగాని పెట్టుకొని దర్పణమున చూడుడు అప్పుడు కుడిప్రక్క ఉన్నది ఎడమప్రక్కగాను, ఎడమప్రక్క ఉన్నది కుడిప్రక్కగాను స్పష్టముగా మీకు గోచరించును కావుననే సామాన్యులు ఇది నా అనుభవజ్ఞానమని పలుకుచుం దురు వారు చెప్పినది నిజమే అది భ్రమ జనిత జ్ఞానమా? లేక భ్రమ రహిత జ్ఞానమా? అని తెలిసికొనడము ప్రయాసము కావుననే వేదాంత జ్ఞానములో తనయొక్క స్వానుభవము అని మాత్రము చెప్పిన చాలదనియు, గురుశాస్త్ర జ్ఞాన ముండవలయుననియు చెప్పుదురు గురుశాస్త్ర జ్ఞానమునకున్ను, తన అనుభవమునకున్నూ సరిపోయిన అది నమ్మవచ్చును కావుననే అనాదినుండి గురుశాస్త్ర జ్ఞానముగా, ఋషి పరంపరగా జ్ఞానోపదేశము ఉండవలెనని శాస్త్ర ములు విధించెడి రహస్యము గీత అధ్యాయము 18న భగవంతుడు తెలిపినది చూడుడు.

**అధర్మం ధర్మమితి యా మన్యతే తమసా౽౽వృతా ।**
**సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ ॥**

ఓ అర్జునా! ఏ బుద్ధి అజ్ఞానముచే మూయబడి అధర్మమును ధర్మ

మనియు, ధర్మమును అధర్మమనియు సకల వస్తువులను విపరీతముగను (ఒకదానిని మరియొకటిగను) తలంచునో, అట్టి బుద్ధి తామసమైనది అజ్ఞాన మనియు, తమస్సనియు, మోహమనియు, భ్రమయనియు చెప్పినను ఒకే అర్థమని గ్రహించేది దీపముయొక్క స్వభావము ప్రకాశవంతమైన దైనను, చిమ్నీ యొక్క తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు రంగులతో కూడిన అద్దములు అమర్చియుండు లాంపులో నలువైపుల అద్దముయొక్క రంగును అనుసరించి తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు వర్ణముగానే దీపము ఉన్నట్లు చూడగలరు ఆలాగున తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు రంగులుగల అద్దము కన్నులకు పెట్టుకొని చూచిన ఆ యా రంగుల ననుసరించియే ఏ వస్తువునైనా చూడగలరు అంతఃకరణము మూడు గుణములతో కూడినది దానివల్లనే ఎవరున్నూ దేనినైనా చూడగలరు శుద్ధసత్త్వముతో గూడిన హృద యము గలవారికే యేవస్తువు ఏలాగున నుండునో దానియొక్క యధార్థ తత్త్వము తెలియనగును కావుననే వేదాంతశాస్త్రములో అంతఃకరణము శుద్ధమగు లాగున మొదట అనుష్ఠానము చేయవలెనని చెప్పుదురు మూడు గుణములకు సాక్షియై, స్వప్రకాశమై, జ్ఞానస్వరూపమై, ఆనందమై, ఆత్మ యుండినను అంతఃకరణ గుణముల ననుసరించియే యెవరైనను దేనినైనను గ్రహించుకొనగలుగుదురు కావున మనోనిర్మలత్వము కలుగనిచో తన యొక్కయు, దేహేంద్రియముల యొక్కయు, దృశ్యము యొక్కయు యధార్థజ్ఞానము ఎవరున్నూ తెలిసికొనజాలరని శాస్త్రములు చెప్పెడి రహస్యము ఈ విష యమై ద్వితీయాధ్యాయమున స్థితప్రజ్ఞుని లక్షణములో ఒక శ్లోకము గలదు

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥**

సమస్త ప్రాణులకు ఏది రాత్రిగా నుంటున్నదో, అట్టి రాత్రి ఇంద్రియని గ్రహముగల యోగికి పగలుగా నుండును ప్రాణులకు పగలుగా నుంటు న్నదో అది ఆత్మావలోకనము చేయుచుండిన మనన శీలునకు (మునికి)

రాత్రిగా నుంటున్నది ఓహో! దీనియొక్క అర్థము ఎంతగొప్పదో తెలుసు కొనిన జ్ఞానియొక్కయు, అజ్ఞానియొక్కయు స్థితి తెలుసుకొనవచ్చును అజ్ఞాని యే యొక్క ఇంద్రియాది విషయ సుఖముల యందు జాగరూకుడై ప్రవర్తించి అనుభవించునో, అది ఆత్మజ్ఞానియగు యోగికి రాత్రివలె కనబడక యుండును ఆలాగున జ్ఞానియగు యోగి యేయొక్క ఆత్మసుఖమందు స్వప్రకాశ జ్ఞానమందు జాగరూకుడై ప్రవర్తించి ఆత్మసుఖమనుభవించునో, అది అజ్ఞానికి రాత్రివలె కనబడక యుండును ఇది యెంత విపరీతజ్ఞానమో, జ్ఞాని, అజ్ఞానులయొక్క ప్రవర్తనయు ఆలాగుననే యుండును జ్ఞానికి ఆత్మ జ్ఞానమందు పగలువలె స్పష్టముగా అంతయు కనుపించును ఆజ్ఞానికి అది రాత్రివలె ఏదియు కనిపించకయుండును, అజ్ఞానికి నే ఇంద్రియాది విషయములు పగలువలె కనుపించునో, దానియందు ఆత్మసంయమి యగు యోగికి రాత్రివలె ఏమియు కనుపించదు అనగా - ఇంద్రియాది విషయ ములు ఆత్మజ్ఞానికి గోరించకనే యుండును దీనివల్ల ఇంద్రియాది విషయ ములలో ప్రవర్తించువాడు అజ్ఞాని అనియు, ఇంద్రియాది విషయములలో ప్రవర్తించక ఆత్మానందములో నుండువాడే యోగియనియు గ్రహించుకొన వలెను యోగియైనవాడు ఏయొక్క స్వప్రకాశానందమును అనుభవించునో, అజ్ఞాని అయిన వానికి అదేమియు గోచరింపక కారు చీకటివలెనుండును అజ్ఞాని అయినవాడు ఏ విషయ సుఖములు ఆనందముగా అనుభవించునో, జ్ఞానియైన వానికి అది రాత్రివలె చీకటివలె, గోచరింపకయే యుండవలెను దీనినిబట్టి జ్ఞానియొక్కయు, అజ్ఞానియొక్కయు ప్రవృత్తి తెలిసి కొనవచ్చును. ప్రకాశమగు పగలు గుడ్లగూబకు ఏమియు తెలియని కారుచీకటిగా నుం డును. కాకులకు అది ప్రకాశమగు పగలుగా నుండును. గుడ్లగూబలకు రాత్రులలో బాగుగా ప్రకాశించును అది కాకులకు రాత్రిగా నుండును. ఏమియు ప్రకాశించదు దీనిని బట్టి జ్ఞానులను, అజ్ఞానులను వారి వారి ప్రవర్తన ననుసరించి కనుగొనవచ్చును ఈ భ్రమ విషయమై శంకర భగవత్పాదులు ఆత్మబోధలో తెలిపినది చూడుడు

**వ్యాపృతేష్వింద్రియేష్వాత్మా వ్యాపారీవ వివేకినామ్ ।**
**దృశ్యతేఽభ్రేషు ధావత్సు ధావన్నివ యథా శశీ ॥**

లోకమందు చంద్రునిపై చేరియుండెడి మబ్బు పోవు వేగము చంద్రుని యందు తోచినట్లు శ్రుత్యుక్తానుభవము లేనివారికి ఆత్మతో చేరియుండు దేహేంద్రియాది రూపములగు నుపాధులను, తమ వ్యాపారములను ఆత్మ యందు తోపింపజేయుచున్నది కాని యధార్థముగా విచారించిన చంద్రుని యందు మేఘగతమైన చలనము లేనట్లు ఆత్మయందు వాని వ్యాపారములు లేవని ముముక్షువు గుర్తెరుంగవలెను

శరత్కాలమున శుక్లపక్షమందు తెల్లని మేఘములు వాయు వేగమున పరుగెత్తునపుడు మేఘమునకు పైభాగముననుండు నిశ్చలముగా నుండు చంద్రుడు పరుగెత్తునట్లు గోచరించును గదా! ఇదే మాయయొక్క వైచిత్ర్యము కూటస్థుడై, అచలుడైయుండు ఆత్మకిన్నీ, ఇంద్రియాదులకున్నూ ఇట్టి యవస్థ ఇంద్రియ జ్ఞానము లేనందుచే కలుగుచుండును

**అజ్ఞానాన్మానసోపాధేః కర్తృత్వాదీని చాత్మని ।**
**కల్ప్యంతేఽంబుగతే చంద్రే ఛలనాది యథాఽంభసః ॥**

నీటిలో నగపడు చంద్రునియందు ఆనీటియొక్క కదలడము మొదల గునవి అవివేకము చేత తోచులాగుననే, విచారింపనందున నేను గుర్తెరుగను అను వ్యవహారము చేత నిశ్చయింపబడ్డ అజ్ఞానమను మనోరూపోపాధివల్ల కలిగెడు వృత్తులు, గుణములు, ఆత్మయందు కల్పింపబడు చున్నవేగాని, యధార్థముగా విచారించినచో నీళ్ళచలనము చంద్రునియందు లేనట్లు, ఆత్మయందును మనస్సంబంధమైన వృత్తులు, గుణములు లేవని తెలిసి కొనవలెను

ఈ శ్లోకమున్నూ పైచెప్పిన దానికి సంబంధించినది ఇదిన్నీ రాత్రి యందు శుక్లపక్షమున నీటిలో చూడగలరు చంద్రుడు చలింపక యుండి నను, నీటిలోగల చలనము చంద్రునియందు ఉన్నట్లు గోచరించును గదా!

విచారించిన చంద్రునియందు చలనము లేదుగదా! ఇదే ఆత్మ విచారణముచే కలిగెడు ప్రయోజనము

**యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।**
**యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

దేనిలాభము కంటె వేరులాభము లేదో, ఏ సుఖముకంటె వేరు సుఖము లేదో, ఏజ్ఞానముకంటె వేరు జ్ఞానములేదో అదియే బ్రహ్మమని నిశ్చ యించి తెలిసికొనవలెను

ఈ యవస్థ కలుగునప్పుడే నిజమైన వైరాగ్యమున్నూ, నిజమైన భక్తి యున్నూ, నిజమైన జ్ఞానమున్నూ కలిగినట్లు నిశ్చయించుకొనేది

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్ ॥**

లోకమందు సర్వత్ర ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డివాడు తప్ప అందరును చూచినప్పటికిన్నీ, వాడు ఆ సూర్యుని చూడనేరనట్లు సచ్చిదానం దాత్మ సర్వత్ర వ్యాపించి యున్నప్పటికినీ, శ్రవణాదులవల్ల విచారించి తెలిసి కొన్న ఆత్మజ్ఞానియే ఆ యాత్మను తన్నుగా చూచుచున్నాడు గాని దేహేంద్రి యాదులను ఆత్మగా భ్రమించిన అజ్ఞాని చూడ నేరనందున అందరికినీ ఆయాత్మ అగపడదనుట



# శ్రాద్ధకాలము

శ్రీభగవద్గీత మాహాత్మ్యము వరాహపురాణమందు ఆది మహావిష్ణువు భూదేవి కుపదేశించినట్లు కలదు. ఇది ఇరువదిమూడు శ్లోకములు పద్మ పురాణమందు శ్రీపరమశివుడు శ్రీపార్వతీదేవికి ఒక్కొక్క అధ్యాయమునకు ఒక్కొక్క మాహాత్మ్యమును పదునెనిమిది అధ్యాయములుగా ఉపదేశించెను.

అది ఒక్కొక్క కథారూపముగా ఉంటున్నది ఏ యే అధ్యాయము ఎవరెవరు చదివి మోక్షము పొందిరో, వారల పేర్లుకూడా కలవు దానిని నైమిశారణ్యమందు సూతమహర్షి శౌనకాదిమహర్షులకు ఉపదేశించెను ఇది మహాభగవద్గీత యందు వ్యాసాశ్రమమువారు మూల శ్లోకములను తెలుగు అర్థముతో ముద్రించియున్నారు శ్రాద్ధకాలమందు, గురుపూజాకాలమందు, యజ్ఞకాలమందు, భోజనసమయమునచదువుచు, ఏకాగ్రబుద్ధితో ఎవరు వినుచున్నారో వారు పొందెడి ఫలమును దీనియందు నిరూపించడమైనది భోజనము చేయు విధానము నాలుగు విధములుగా నుంటున్నది మౌనముగా, దైవ భావముతో భుజించుట మొదటిది, వీరు భుజించు అన్నాదులు సాక్షాత్ భగవంతుడు భుజించినట్లుండును భగవంతుడు స్వయముగా భుజించినచో పెట్టే దాతలకు ఎంత పుణ్యము కలుగునో పై చెప్పినవారికి పెట్టేవారికిన్ని అట్టి ఫలము గలుగును ఆలాగున భుజించువానికి గూడా సాక్షాత్తు భగవత్స్వరూపమే తన ఆత్మయను జ్ఞానము ఉదయమగును ఇది మొదటి పక్షము పూర్వకాలపు బ్రాహ్మణోత్తములు, యతీశ్వరులు ఆలాగున భుజించేవారగుటవల్లనే అప్పటి రాజులు, ధనవంతులు అగ్రహారములు, మాన్యములు, సమారాధనలు, అన్నదానములు, దేవాలయములు, మఠములు, సంస్కృతపాఠశాలలు అట్టివారికి దానము చేసిరి

**రెండవపక్షము :** సమారాధనలు, వనభోజనములు జరుగునప్పుడు ఒక పరమభక్తుడు భగవన్నామ సంకీర్తనలుగాని, నామస్మరణముగాని, పద్యములుగాని పఠించుచుండును దాని యొక్క భావమేమన, భక్తులు ఆ దైవనామమును విని భుజించుటవల్ల గొప్ప పుణ్యము గలుగునను భావమే, ఆలాగున భుజించు వారికి అన్నము పెట్టే దాతలకు ఒక పరమభక్తునకు అన్నము పెట్టినచో ఎంత పుణ్యము గలుగునో, అంత పుణ్యము గల్గును అట్టి పుణ్యము అన్నదాతలకున్ను, భోక్తలకుకూడా కలిగి కొంతకాలమునకు పరమ భక్తులగుదురు ఈ రెండున్ను ఉత్తమోత్తమ ఉత్తమ పక్షము లనంబడును

**మూడవ పక్షము :** పైచెప్పిన ప్రకారము శ్రాద్ధ, గురుపూజా, వనభోజ

నాది సమయములలో ఒకరికొకరు మాట్లాడుచు ఆ హైకోర్టుకేసు ఏమైనది? హిందూపత్రిక, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ పత్రికలో నిన్నటి రోజున వ్రాసినది చూచితిరా? ఆ ధాన్యము ఎంత అమ్ముచున్నది? ఈ వ్యాపారము ఇప్పుడెట్లు న్నది? ఆ పరీక్ష యేమైనది? ఈలాగున మాట్లాడుచు, నవ్వుచు, భోజనము చేయుట యేదిగలదో, అట్టివారికి అన్నము పెట్టువారికిన్నీ, ఆలాగున భుజించువారికిన్నీ ఏలాటి పుణ్యమున్నూ గలుగదు. ఇది మధ్యమపక్ష మన బడును.

**నాలుగవ పక్షము :** ఇది అధమము, భోజన సమయములో హీనమైన వాక్యము నుచ్చరించుకొని, ఆకూర బాగులేదు ఈకూర బాగులేదు, ఈ అన్నము బాగులేదు అని మాట్లాడుచు, వండే వారిని తిట్టుచు, కొంచెము కొం చెము నోటిలోపెట్టి 'ఛీ' యని చెప్పుచు పారవేయుచు, కోపావేశపరులైనచో భుజించువారికి పెట్టే వారికిన్నీ అశాంతియు, ద్వేషమున్నూ కలుగునేగాని, పుణ్యము కొంచెమైనను కలుగదు పుణ్యము కలుగకపోయినను పోనీ, అశాంతియున్నూ, ఉద్రేకమున్నూ మాత్రమే కలుగును

ఐదవది మరియొకటి కలదు అది అధమాధమము శాస్త్ర నిషిద్ధము అందువల్ల దాని నిచట విస్తరింప బూనలేదు అది దొంగలించి తినుటయు, దొంగ వృత్తితో జీవించుటయు, బ్లాకు మార్కెట్టుతో సంపాదించి తినుటయు, చేయవలసిన పని సరిగా చేయక వచ్చెడు జీతము కూలి మొదలగు డబ్బుతో జీవించుటయగును దీనివల్ల మనస్సు మరింత మలిన మగును కావున ఈ విషయమై ఎట్టి పవిత్రభావముతో భోజనము చేయవలయునో, అట్టి సమయ మున గీతాపారాయణము చేసినచో ఎంతపుణ్యము కలుగునో, ఆ విషయమై మహాభగవద్గీతలో చెప్పినది చూడుడు, కావుననే భోజన సమయములో సన్న్యాసులు, పుణ్యాత్ములు, పరమభక్తులు గీత పదునైదవ అధ్యాయము పారాయణముచేసి భుజింతురు. ధ్యానము చేయునప్పుడు ఎంత పవిత్ర భావము కలిగియుండవలయునో, భుజించునప్పుడు కూడ అట్టిభావన కలిగి యుండవలయును భుజించే అన్నము రసమై, రక్తమై, మనస్సై మారుచుం

డును మనస్సు శాంతితో నుండవలసియుండిన భోజనము చేయునప్పుడు ప్రశాంతభావమున్నూ, దైవచింతయున్నూ కలిగి యుండవలెనని చెప్పుటకు కారణమిదే కావుననే భోజన సమయమున కాళ్ళు చేతులు కడుగుకొని, మడివస్త్రము ధరించి, విభూతి మొదలగునవి ధారణ చేసి భుజించవలెనని శాస్త్రము విధించుచున్నది మొదటి లక్షణముగల భోజనముచే కలిగెడు ప్రయోజనము గీతలో తెలిపినది చూడుడు 'జ్ఞానీ త్వాత్మైవ మే మతం' అని శ్రీకృష్ణభగవాను డుపదేశించెను ఆత్మజ్ఞాని యైనవాడు నేనే యనియు, ఇది తన మతమనియు బోధించెను జ్ఞానులపై ఇట్టి కరుణ గల వాక్యము భగవాను డుపదేశించుట వల్లనే ఇప్పటికిన్నీ జనులకు, సాధువులపై పరమ భక్తులపై ఇంత మాత్రమైన విశ్వాసము కలిగియున్నారు పదునైదవ అధ్యాయమున శ్రీకృష్ణు డుపదేశించినది చూడుడు

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥**

నేను వైశ్వానరుడను పేరుగల జఠరాగ్ని స్వరూపుడనై, సకల ప్రాణుల శరీరములయందును ప్రవేశించి, జఠరాగ్నిని ప్రజ్వలింపజేయు ప్రాణాపానము లను వాయువులతో జేరి, భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యమను పేర్లు గల నాలుగు విధములైన ఆహారమును పచనము చేయుచున్నాను ఇది మొదటి పక్ష భోజన లక్షణమని గ్రహించేది ఇట్టి భావన కలిగి భుజించిన మాత్రమే అట్టి ఫలము సిద్ధించును లేనిచో కలుగదు ఎలక్ట్రిక్ వైరులో కరెంటు ఉన్నప్పటికిన్నీ 'బటన్' దానితో తగులునపుడు మాత్రమే దీపమెట్లు ప్రకాశించునో, ఇదిన్నీ అలాగుననే యుండును ఏలన, అన్ని ప్రాణుల హృద యములలోను భగవంతుడు సాక్షిగా నుండి వెలుగుచున్నాడని శాస్త్రము తెలుపుచుండినను, భావన గలవారికి మాత్రమే గదా! ఆ ఫలము సిద్ధించును తక్కిన వారికి అట్టి జ్ఞానము కలుగదుకదా! భావనయొక్క సత్యమున్నూ ఈలాగున నుండునని విజ్ఞులు గ్రహించేది ఇక మహాభగవద్గీత మాహాత్మ్య మును తెలిపినది నిరూపించెద

**పితౄనుద్దిశ్య యః శ్రాద్ధే గీతాపాఠం కరోతి వై ।**
**సంతుష్టాః పితరస్తస్య నిరయాద్యాంతి సద్గతిమ్ ॥**

ఎవడు శ్రాద్ధభోజన కాలమున పితృదేవతలను గూర్చి గీతాపఠనము చేయునో, అతనియొక్క పితృదేవతలు సంతుష్టులగుచున్నారు మరియు ప్రేతలోకము నుండి విముక్తులై పుణ్యాలోకమును పొందుచున్నారు

**గీతాపాఠేన సంతుష్టాః పితరః శ్రాద్ధతర్పితాః ।**
**పితృలోకం ప్రయాంత్యేవ పుత్రాశీర్వాదతత్పరాః ॥**

ఈ విధముగ పితృదేవతలు శ్రాద్ధముచే మరియు గీతాపఠనముచే ప్రసన్నులై, పుత్రులను ఆశీర్వదించి పుణ్యాలోకమునకు పోవుచున్నారు. పుత్రులైనను, దేహ సంబంధులైన వారెవరైనను శ్రాద్ధ భోజనకాలమున స్వయముగా గీతాపారాయణ చేసినను లేక ఇతరులచేత చేయించినను ఈ పుణ్యము వారికి లభించును

**యశ్శృణోతి చ గీతార్థం కీర్తయేచ్చ స్వయం పుమాన్ ।**
**శ్రావయేచ్చ పరార్థం వై స ప్రయాతి పరం పదమ్ ॥**

ఎవడైతే గీతార్థమును వినుచున్నాడో, స్వయముగా స్మరించుచున్నాడో, మరియు నితరులకు వినిపించుచున్నాడో వాడు పరమపదమును పొందుచున్నాడు

**గీతాపాఠం చ శ్రవణం యః కరోతి దినే దినే ।**
**క్రతవో వాజిమేధాద్యాః కృతాస్తేన సదక్షిణాః ॥**

ఎవడు ప్రతిదినము గీతను పఠించుచున్నాడో మరియు శ్రవణము చేయుచున్నాడో వాడు సమస్త అగ్నిష్టోమ యాగాదులను మరియు దక్షిణ సహితమైన అశ్వమేధాది క్రతువులను చేసినవారితో సమానుడగుచున్నాడు

**యోగిస్థానే సిద్ధ పీఠే శిష్టాగ్రే సత్సభాసు చ ।**
**యజ్ఞే చ విష్ణు భక్తాగ్రే పఠన్యాతి పరాఙ్గతిమ్ ॥**

ఎవడైతే, యోగీశ్వరుల యొక్క స్థానమునందు, సిద్ధపీఠములందు, శ్రేష్ఠ పురుషుల యొక్క సమ్ముఖమునందు, సత్పురుషుల సభలయందు, యజ్ఞమునందు మరియు విష్ణుభక్తుని యొక్క ఎదుట గీతను పఠించునో వాడు సర్వోత్కృష్టమైన మోక్షమును పొందుచున్నాడు

**గీతాఽధీతా చ యేనాపి భక్తిభావేన చేతసా ।**
**తేన వేదాశ్చ శాస్త్రాణి పురాణాని చ సర్వశః ॥**

ఎవడైతే భక్తి భావముచే మనస్సును సంలగ్న పరచి గీతాధ్యయన మును చేయునో, వాడు సమస్తవేదములను, సర్వశాస్త్రములను సమస్త పురాణములను కూడా చదివిన వానితో సమానుడు

**దేవకీనందనః కృష్ణో గీతాపాఠేన తుష్యతి ।**
**యథా న వేదైర్దానైశ్చ యజ్ఞతీర్థ వ్రతాదిభిః ॥**

ఎటుల దేవకీనందనుడైన శ్రీకృష్ణభగవానుడు గీతాపఠనముచే సంతుష్టుడగుచున్నాడో అటుల వేదాధ్యయన దానయజ్ఞతీర్థములు మరియు వ్రతాదులచే సంతుష్టుడగుట లేదు

**షాలగ్రామ శిలాగ్రేతు దేవాగారే శివాలయే ।**
**తీర్థే నద్యాం పఠేద్యస్తు వైకుంఠం యాతి నిశ్చితమ్ ॥**

ఏవడైతే సాలగ్రామము ఎదుట, దేవ మందిరమునందు, శివాలయము నందు, తీర్థములకడ, నదియొడ్డున గీతాధ్యయనము చేయుచున్నాడో వాడు వైకుంఠమును పొందుచున్నాడు, ఇది నిశ్చయింపబడినది

**యే శృణ్వన్తి పఠన్త్యేవ గీతాశాస్త్రమహర్నిశమ్ ।**
**న తే వై మానుషా జ్ఞేయా దేవా ఏవ న సంశయః ॥**

ఎవరైతే దివా రాత్రములు గీతను చదువుచున్నారో, మరియు వినుచున్నారో, వారలు కేవలము మనుష్యులుగారు మరెవరనగా దేవతలే ఇందులో సంశయమేమియు లేదు

ఈ శ్లోకమందు 'శృణ్వన్తి' అని ప్రయోగించుటవల్ల, పారాయణము చేయుటకు శక్తిలేనివారు శ్రవణము చేయుచుండినను చాలునని తెలుపడ మైనది ఇక గీతాపుస్తకముయొక్క దానఫలమును గురించి తెలిపినది చూడుడు ఈ విషయము ఈ గ్రంధములో తప్ప మరెచ్చటను కనిపించుట లేదు

**శతపుస్తక దానం చ గీతాయాః ప్రకరోతి యః ।**
**పితృలోకం ప్రయాత్యేవ పుత్రాశీర్వాదతత్పరః ॥**

ఎవరు నూరు భగవద్గీతా పుస్తకములను దానము చేయుచున్నారో వారు తమ పుత్రులను ఆశీర్వదించు వారలై అనగా పుత్రులకు సర్వ శుభ ములు గలుగునట్లు ఆశీర్వదించుచున్నవారై పుణ్యాలోకమును గూర్చి పోవు చున్నారు పూర్ణ దానమనియు, అర్ధ దానమనియు, పాతిక దానమనియు, శక్తి కొలది దానమనియు దానములో ఇట్టి భేదము కలదు పూర్ణ దానము నూరు పుస్తకములు, మధ్యమ దానము ఏబది, పాతిక దానము ఇరువది అయిదు, ఇక వారి వారి శక్తి ననుసరించి ఎంత యైనను చేయవచ్చును

**గీతాదాన ప్రభావేన సప్త కల్పావధీః సమాః ।**
**విష్ణులోకమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥**

గీతా దానముయొక్క ప్రభావముచే విష్ణులోకమునందు ఏడు కల్ప ముల సంవత్సరముల పర్యంతము విష్ణువుతో కూడా ఆనందము పొందు చున్నాడు

**సమ్యక్ శ్రుత్వా చ గీతార్థం పుస్తకం యః ప్రదాపయేత్ ।**
**తస్మై ప్రీతోఽస్మి భగవాన్ దదామి మనసేప్సితమ్ ॥**

ఎవడు గీతార్థమును విని, గీతాపుస్తకమును దానము చేయుచున్నాడో వానికి మనోవాంఛిత ఫలమిచ్చెదనని శ్రీకృష్ణభగవానుడు ప్రతిజ్ఞ చేసి పలికెను "పుస్తకం యః ప్రదాపయేత్" దీనియందు ఏకవచన ప్రయోగముండుటవల్ల ఒక్క పుస్తకమైనను దానము చేయవచ్చును పద్మ పురాణాంతర్గతమగు

పార్వతీపరమేశ్వరసంవాదమును సంస్కృతము నుండి ఎవరున్నూ తెనుంగున అనువదించియుండలేదు దీనిని మహాభగవద్గీతలో చేర్చి, వ్యాసాశ్రమము వారు ముద్రించిరి ఇక శ్రాద్ధకాలమున, యజ్ఞకాలమున, ఉపనిషత్తులను పఠించినచో గల ప్రయోజనమును గురించి కఠోపనిషత్తున తెలిపినది చూడుడు

**మూ ॥ య ఇమం పరమం గుహ్యం శ్రావయేద్బ్రహ్మ సంసది ।**
**ప్రయతశ్శ్రాద్ధ కాలే వా తదానంత్యాయ కల్పతే ।**
**తదానంత్యాయ కల్పత ఇతి ॥**

ఓ నచికేతసుడా! అతి రహస్యమైన, శ్రేష్ఠమగు ఈ ఉపనిషత్తును బ్రహ్మసభయందుగాని, శ్రాద్ధకాలమందుగాని, భోక్తలకు ఎవడు వినిపించునో, ఆ శ్రాద్ధము అనంత ఫలము కొరకు సమర్థమగుచున్నదని శ్రుతి స్తుత్యర్థమై పలికెనని యముడు చెప్పెను

ఈ కఠోపనిషత్తు నచికేతసుడను ఋషి కుమారునకు యమధర్మ రాజు ఉపదేశించినదగుటవల్ల యముడు చెప్పినదని ఇచ్చట వ్రాయబడినది ఈ యుపనిషత్తును బ్రహ్మవేత్తల సభ యందుగాని, శ్రాద్ధకాలమందుగాని, యజ్ఞకాలమందుగాని ఎవడు బోధించునో, వాడు అనంత ఫలమును, పుణ్యమును పొందగలడని తెలుపడమైనది కావుననే "శ్రావయేత్" అని ప్రయోగించడమైనది "శ్రావయేత్" అనగా వినిపించునో యని ప్రయో గించుటవల్ల ఉపనిషత్తులు, భగవద్గీతలు సర్వజనులకు తెలుప వలయునని ఈశ్వరాజ్ఞ కాని, ఎవరికిన్నీ వినిపించకూడదు, రహస్య ముగా నుంచ వలెనని అర్థముకాదని నవీనయుగములో పుట్టిన జిజ్ఞాసువులు, ముముక్షువులు గ్రహించెదరు గాక! మహాత్ముల సభలయందు శ్రాద్ధకాలమందు, యజ్ఞము నందు పఠించే లాగున చెప్పుటకు కారణమేమన అచ్చోట్లలో అనేక జనులు చేరుచుందురు అచ్చట పఠించిన అందరును వినగలరని భావము ఇక ఉత్తర గీతయందు శ్రీకృష్ణభగవానుడు తెలిపిన అతి పావన వాక్యమును వినండి కృతార్థులు కండి

**యద్యేకో బ్రహ్మవిద్భుంక్తే జగత్తర్పయతేఽఖిలమ్ ।**
**విధేయమపి సత్కారం యద్యల్పమపి తద్భవహు ॥**

బ్రహ్మవేత్తయగు వాడొకనికి తృప్తిని కలుగ జేసిన యెడల ప్రపంచ మంతటికి తృప్తిని గలుగజేసిన వాడగుచున్నాడు అట్టి బ్రహ్మవేత్తకు అతి స్వల్పమైన సత్కార మాచరించినను, అదియే మిక్కుట మగుచున్నది

బ్రహ్మవేత్త సమస్త ప్రాణులలో గల ఆత్మయు, తన ఆత్మయు ఒకటే అని భావము గలవాడగుట చేతనే అట్టి వారల నొక్కరిని తృప్తి పరచినచో, లోకమంతటిని తృప్తినొందించిన వాడగునని తెలుపబడినది బ్రహ్మవేత్తలు అల్ప సంతోషము గలవారు. కనుకనే కొంచెమిచ్చినను అది గొప్ప ఫలమును కలుగజేయునని చెప్పుట అంతేకాదు వారలెప్పుడును తృప్తులు ఇతరులవలె ఎంత దొరికినను తృప్తినొందని వారి వలె నుండరు

**మూ॥ తస్మాద్బ్రహ్మవిదే దేయం యద్యస్తి వస్తు కించిత్ ।**
**కుక్షౌ తిష్ఠతి యస్యాన్నం యోగాభ్యాసేన జీర్యతే ॥**
**స విస్తరతి దాతారం దశ పూర్వాన్దశాపరాన్ ॥**

కావున ఏదైన వస్తువును బ్రహ్మవేత్తయగు వానికే ఇవ్వవలయును యోగాభ్యాసియగు మహాత్మునకు అన్నము పెట్టినవాడు తన కంటె పూర్వు లగు పది తరముల వారిని, తన తర్వాత రాబోవు పది తరముల వారిని తరింపజేయును అంత పుణ్యము గలదని భావము మరియు "యద్యస్తి వస్తు కించిత్" బ్రహ్మవేత్తకు కొంచెమైనను ఇచ్చినచో అదివ్యర్థము చేయరు స్వార్థమున కుపయోగపరచరు పరోపకారము కొరకే వినియోగపరతురు అందువల్లనే అట్టి వారికి ఇవ్వవలెనని శ్రీకృష్ణభగవాను డుపదేశించెను "యోగాభ్యాసేన జీర్యతే" అట్టి బ్రహ్మవేత్తలు సదా బ్రహ్మభావములో నుండువారగుటవల్ల వారికి పెట్టిన అన్నము జ్ఞానాగ్ని, యోగాగ్ని, ధ్యానాగ్నిలో జీర్ణమగుటవల్ల అంతటి ఫలము గలుగుచున్నది సామాన్య జనుల కఠిజఠ రాగ్నియందో, వ్యవహార విచారణాగ్నియందో, కామాగ్నియందొ జీర్ణమైపోవును

అందువల్ల అది ప్రయోజనములేదని భావము వేదమంత్ర పూర్వకముగా వేదనిష్ఠగలవాడు హోమగుండములో హవనము చేయుదానికి ఎంత ఫలము గలుగునో, అట్లుగాక అట్టి హోమద్రవ్యమే అట్టి హవిస్సే చెత్త చెదారము మంటవేసెడు అగ్నిలో వ్రేల్చినచో ఏదైనా ఫలము సిద్ధించునా? ఇదే పైన నిరూపించిన దానియొక్క భావమని గ్రహించేది

**యతిర్యస్య గృహే భుంక్తే తస్య భుంక్తే హరిస్స్వయమ్ ।**
**హరిర్యస్య గృహే భుం క్తే తస్య భుంక్తే జగత్త్రయమ్ ॥**

యతి ఎవని గృహమునందు భుజించునో ఆ ఇంట శ్రీమహావిష్ణువు భుజించినటుల తలంచవలయును అట్టి శ్రీమహావిష్ణువునకు తృప్తి కలుగు నెడల జగత్త్రయము భుజించినటుల యగును

**యతిహస్తే జలం దద్యాద్భైక్షం దద్యాత్పునః పునః ।**
**తద్భైక్షం మేరుణా తుల్యం తజ్జలం సాగరోపమమ్ ॥**

యతీశ్వరుని చేతియందు జలమిచ్చినను అది యనంత మగును భిక్ష మిచ్చిన మేరువుతో తుల్యమగును, జలమిచ్చిన సముద్రముతో సమాన మైనదిగా నగును

జలమిచ్చుట భోజన సమయమున ఆపోశన మిచ్చుట యగును అనగా ఒక ఉద్ధరిణి తీర్థము చేతిలో పోయుట యగును భైక్షమన ఒక కబళ మన్నము భిక్షము పెట్టుట యగును లేక భిక్షాన్నము పెట్టుటయని గ్రహిం చేది ఒక ఉద్ధరిణి తీర్థము సముద్రమంత పెరుగును భిక్షాన్నము మహామేరు వంత వృద్ధియగును. ఇచ్చట బ్రాహ్మణ, అబ్రాహ్మణ, స్త్రీ, పురుష భేదము కనుపించలేదు కావుననే "తస్మాద్బ్రహ్మవిదే దేయం" అని ప్రయోగించ బడినది బ్రహ్మవేత్తయని మాత్రము తెల్పడమైనది సారవంతమైన భూమిలో, సామాన్య భూమిలో, నిస్సారభూమిలో పైరు వేసిన ఎట్లుండునో, ఆ లాగున బ్రహ్మవేత్త యొక్కయు, సామాన్య జనము యొక్కయు, జ్ఞానము లేని వారి యొక్కయు హృదయమునకు భేదము గలదు సుక్షేత్రమున పైరు

విశేషముగా పండును సామాన్య భూమిలో సామాన్యముగాను, సారహీన క్షేత్రమున నిస్సారముగాను పండును గదా! అట్టి భూమి సన్న్యాసులదైనను, బ్రాహ్మణులదైనను, అబ్రాహ్మణుల దైనను, స్త్రీలదైనను, మరి ఎవరిదైనను భూసారము ననుసరించి అట్లు భేదములుగా ఫలించును కావున ఎవరిదై నను హృదయమును మాత్రము చూచుకొనిన చాలును



# గీతామృతము

కొందరు మీరు గీతామృతమును పానము చేసితిరా? అని అడుగు దురు అనగా - గీతామృతమును అనుభవించితిరా? యని వారి భావము శ్రీకృష్ణభగవానుడు చెప్పిన భగవద్గీతయంతయు గీతామృతమే కదా! యని సమాధానమిచ్చిన వారు తృప్తిపొందరు, భగవద్గీత యంతయు శ్రీకృష్ణ గీతామృతమని అంగీకరించినను గీతయందు గీతామృతము భగవానుడు ఎచ్చట ఉంచియున్నాడు? అని వారు మరల ప్రశ్నింతురు ఇదిన్నీ ఒక విధ మగు న్యాయమే, గీతలో అనేక ధర్మములు శ్రీకృష్ణభగవానుడు ఉపదేశించి నను, అమృతము ఎచ్చట ఉంచియున్నాడు? అని అడుగునప్పుడు అది మనము నిరూపించవలయును ధర్మమున కతీతము అమృతము గీత దశమోఽధ్యాయమున అర్జునుం డీలాగున పలికెను

**విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।**
**భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥**

ఓ కృష్ణమూర్తి! నీయొక్క సర్వజ్ఞత్వాది యోగవిశేషమును, లీలావిభూతి యును, సవిస్తరముగా మరల చెప్పుము ఏలయనగా నీవాక్యామృతమును వినుచున్న నాకు తృప్తి లేకున్నది "భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్" ఈ శ్లోకమున "శృణ్వతో నా స్తి మేఽమృతమ్" ఇచట అమృతశబ్దము ప్రయోగించినాడు. ఇందువల్ల భగవద్వాక్యమగు గీత అమృత

సదృశమని గ్రహించవలయును భగవద్వాక్యముల్లో అమృతమునందు భకులు ఆసక్తియు, అభిరుచియు, ఆనందమును కలిగియుండవలెను, ఎంత వినినను చాలును అనునది ఉండరాదు ఆలాగుననే అమృతత్వము పొందిన మహాత్ముల వాక్యములున్నూ భక్తులకు, ముముక్షువులకు ఎంత శ్రవణము చేసినను తృప్తి కలిగియుండరాదు అనగా మరల మరల వినవలయునను బుద్ధియే యుండవలయును అమృతత్వము పొందిన మహాత్ముల వాక్యములు అమృత సదృశముగా నుండునని గ్రహించేది ఈ అమృతత్వమునే "నాచికేతుడు"యమధర్మరాజును ప్రార్థించి అనుభవించినాడు, గురువు యొక్క లక్షణమున్నూ, శిష్యునియొక్క లక్షణమున్నూ ఈలాగున నుండ వలెను గురువు అమృతమయుడున్నూ, శిష్యుడు శ్రవణాసక్తియు గలిగి యుండవలెనని నిరూపించబడినది కఠోపనిషత్తు

**అన్యత్రధర్మా దన్యత్రాధర్మా దన్యత్రాస్మాత్కృతాకృతాత్ ।**
**అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్త త్పశ్యసి తద్వద ॥**

ఎయ్యది శాస్త్రవిహిత ధర్మముకంటె వేరైనది, అధర్మముకంటె వేరైనది, కార్యకారణ భూతమైన దాని కంటె వేరైనదియు, భూత భవిష్యత్ వర్తమానము కంటె వేరైనదిగా ఉంటున్నదో దానిని నీవు ఎరుంగుచున్నాడవు దానినే నాకు బోధింపుము

ఇదే నిజమైన సత్యము, నిజమైన అమృతము దీనికే "బ్రహ్మజ్ఞానామృతమని" పేరు ఇది జనన మరణములను రహితమొనర్చునది ఇది ఒక వస్తువు కాదు అనగా ఒక పదార్థము కాదు, అమృతమే ఇది దీనికే బ్రహ్మామృతము, జ్ఞానామృతము, ఆత్మామృతమని పేర్లు ఈ అమృతమును పొందవలెను ఇది క్షీరసాగరోత్పన్న అమృతము వంటిదికాదు అది జరానెరలను రహితమొనర్చి దేవత్వమును కలుగజేయునదే కాని దైవత్వమును కలుగజేయునది కాదు ఇది దైవత్వమును కలుగజేయునది ఆలాగున లంబికా యోగముచే అమృతపానము కలుగునని కొందరు యోగులు చెప్పుదురు హఠయోగ ప్రదీపమున దీనియొక్క విధానము కలదు ఈ యోగామృత

మున్నూ జరానెరలను గలుగనియ్యక చిరకాలము ఉండేలాగున చేయునే కాని, జనన మరణ రహితమగు మోక్షమును కలుగజేయు శక్తి కలదికాదు ఏలన అది ఒక విధమగు పదార్థమే యగును పదార్థ మెంత మంచిదైనను అది పృధ్వీతత్త్వముతో కూడినదేగాని, ప్రకృతి కతీతము కాదు అయితే, బహుకాలము యౌవనస్థితిలో నుండవచ్చును కాని పృథివ్యాది పంచభూత ములు నశించినప్పుడు అట్టి యోగియుకూడా తప్పక విలయమొందును కావుననే ఆత్మజ్ఞానులు పరమభక్తులు ఈయోగ విధానామృతమును అంత గౌరవించరు అయితే అదిన్నీ అతి సామాన్యమని తలంచరాదు లోకములో బహుకాలముండవచ్చును అనేక ధర్మకార్యములు నిర్వహించుకొనవచ్చును కాని అది శాశ్వతమని మాత్రము తలంచవలదు గీతలో అమృతము భగవానుడు ఎచ్చట నుంచినాడో అది మీకు చూపెద త్రయోదశాధ్యాయ మున 13వ శ్లోకమున

**జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృత మశ్నుతే ।**
**అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥**

ఏది తెలియదగినదో, దేనిని తెలుసుకొని అమృతత్వమును పొందు దురో, అట్టి దానిని స్పష్టముగా చెప్పెదను వినుము దేనిని చెప్పబోవుచున్నానో అది ఆది లేనిదియు, నిరతిశయమునగు బ్రహ్మము అది సత్పదార్థము కాదనియు అసత్పదార్థమును కాదనియు చెప్పబడుచున్నది దానిని స్పష్ట ముగా చెప్పుచున్నాను

ఇదే ముముక్షువులు జిజ్ఞాసువులు తెలిసికొనదగిన బ్రహ్మపదము శ్లోకారంభములో "జ్ఞేయం య త్తత్ప్రవక్ష్యామి" అని ప్రయోగించడ మైనది ఈఅధ్యాయమున మొదటనే అర్జునుడు ఆరు ప్రశ్నలను వేసినాడు దానియందు కట్టకడపట "జ్ఞానం జ్ఞేయం చ కేశవ" జ్ఞానమనగా ఏమి? జ్ఞేయమనగా ఏమి?కట్ట కడపటిది "జ్ఞేయం" జ్ఞేయమనగా తెలిసికొనదగిన వాటన్నింటిలోను ముఖ్యముగా తెలుసుకొనదగిన దేది అని భావము ఎనిమిదవ శ్లోకమునుండి పంద్రెండవ శ్లోకము వరకు జ్ఞానమును గూర్చి

ఉపదేశించెను అది 'అమానిత్వము' మొదలుగా గలది ఇది ముముక్షువులు గీతలో తెలిసికొనవచ్చును ఇచ్చట వ్రాయబూనిన వ్యాసము పెరుగును

ఈ జ్ఞానము ఉపదేశించిన తరువాత జ్ఞేయమును చెప్పుటలోనే దీని యొక్క కీలకము గలదు జ్ఞానమనగా జ్ఞానికి ఉండవలసిన గుణములని గ్రహించేది ఇది ఎటువంటిదన ప్రమిద, వత్తి , తైలము గాలిలేని స్థలములో పెట్టిన తరువాత "జ్యోతి" అనగా దీపము వెలిగించేలాగున ఉంటున్నది ఇప్పుడుండే వారలు "జ్ఞేయము నుపదేశించుము జ్ఞానము మరల సంపాదించుకొనవచ్చునని చెప్పునట్లుంటున్నది ఆ వాక్యమెటువంటిదన ప్రమిద లేదు, వత్తియును లేదు, చమురు అసలే లేదు, గొప్ప గాలి కొట్టు చున్నది దీపము వెలిగించుము అను వాక్యమెట్లుండునో, ఇదిన్నీ అటు వంటిదే శ్రీకృష్ణభగవానుడు ఈ నవీన వాక్యమును నమ్మక, పూర్విక ఋషి సంప్రదాయము ననుసరించి బోధించెను, అది ఎట్లున్నదనగా, గాలిలేని ప్రదేశమున ప్రమిద, వత్తి, నూనె పెట్టిన తరువాత దీపము వెలిగించినట్లు న్నది ఆ దీపము నిరాటంకముగా వెలుగును, చీకటిని పోగొట్టును ప్రాచీన సంప్రదాయమునకున్నూ నవీన సంప్రదాయమునకున్నూ ఎంత భేదముం డునో విజ్ఞులు తెలుసుకొనవచ్చును ఈ జ్ఞేయము పదమూడవ శ్లోకము నుండి పందొమ్మిది శ్లోకముల వరకు ఏడు శ్లోకములచే శ్రీకృష్ణభగవాను డుపదేశించెను ఈ జ్ఞానజ్ఞేయముల రెండింటిని తెలిసికొనిన మరల ముముక్షువులు, సాధకులు, భక్తులు తెలిసి కొనదగినది లేదు

మరియు అమృతమును గురించి పదునాలుగవ అధ్యాయమున చెప్పి నది చూడుడు

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**

**జన్మ మృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

జీవుడు దేహోత్పత్తికి కారణ భూతములైన సత్త్వ, రజ, స్తమోగుణ ముల నతిక్రమించి, అనగా దేహమును విడనాడక మునుపే బ్రహ్మజ్ఞానము

చేత త్రిగుణముల నణచి పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖములు మొదలగు వానిని చెందక జీవన్ముక్తుడై అమృతత్వమును పొందుచున్నాడు అనగా ముక్తుడగుచున్నాడు ఇదే నిజమైన అమృతపానము కాని, క్షీరసాగరోత్పన్న అమృతముగాని, యోగామృతముకాని కాదని ధీమంతులు గ్రహించుకొనవలెను గీతాపారాయణ చేయువారందరున్ను, ఇట్టి అమృతపానము చేయవలయుననియే శ్రీకృష్ణభగవానుని ఆశయము కావున సత్త్వగుణమును కూడ అతిక్రమించవలయును అపుడే జీవన్ముక్తి, మోక్షము గలుగునని మరువకూడదు అదే విశుద్ధసత్త్వము, మామూలు వ్యవహారములో ఈ ప్రకృతితో కూడిన సత్త్వగుణమే ప్రతిపాదించబడును కావుననే ఒక పుణ్యాత్ముని, ఒక సిద్ధాత్ముని గురించి చెప్పునపుడు అతడు మంచి సత్త్వగుణ స్వరూపుడు అని వచించుటకు కారణము విశుద్ధ సత్త్వగుణమును గురించి వివేకచూడామణి యందు శంకరులు తెలిపినది చూడుడు కావున ముముక్షులు తమోగుణము, రజోగుణము, సత్త్వగుణముల లక్షణములను గ్రహించుకొనవలయును అపుడే ఆ గుణములను రహిత మొనర్చుటకు సాధ్యపడును రోగియైన వాడు ఇది పథ్యము, ఇది అపథ్యము అని శాస్త్రము చేతగాని, వైద్యుని చేతగాని తెలిసికొనక పోయినచో ఇది భుజింప వచ్చును, ఇది భుజింపకూడదు అని ఎట్లు గ్రహించగలుగును? కావున భవరోగవిముక్తి చెందదలంచు విరక్తులు ఈ మూడు గుణములను లెస్సగా గ్రహించుకొనవలయును తమోగుణమును, రజోగుణమును వైరాగ్య పురుషులు రహిత మొనర్చుకొనియే యున్నారు సత్త్వగుణమును కూడా రహితమొనర్చవలయునని చెప్పుటలో అది గ్రహించి, ఆచరణలో నుంచుట చాలా ప్రయాసము విశుద్ధ సత్త్వము -

**విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదః స్వాత్మానుభూతిః పరమా ప్రశాంతిః ।**
**తృప్తిః ప్రహర్షః పరమాత్మ నిష్ఠా యయా సదానందరసం సమృచ్ఛతి ॥**

విశుద్ధ సత్త్వము యొక్క గుణములు - ప్రసన్నత, ఆత్మాను భవము, మిక్కిలి శాంతి (ఉపరతి లేక శమము), సంతుష్టి, అత్యంతానందము, బ్రహ్మ

నిష్ఠ. ఇట్టి గుణములు గలవారు సదానందరసమును అనుభవించు చున్నారు ఇట్టి స్థితి జీవన్ముక్తావస్థలో కలుగును వైరాగ్యము గల వారు ఈ లక్షణములు గలిగి యుండవలయును మీరెవరైనను ఒక ఉన్నత పరీక్షకు చదువుచుండిన పరీక్షకు వెళ్ళి కూర్చుండుటకు ముందుగా తాను చదువవలసిన గ్రంథములు కంఠస్థము లైనవా అని తనలో తాను ఎట్లు వితర్కించుకొనునో, ఆలాగున మోక్షమను పరీక్షలోఉండు సాధకులు మూడు గుణములు రహితములైనవా, విశుద్ధ సత్త్వము అలవాటు పడినదా, అని యోచించుకొనవలయును, పరీక్షకు ఏర్పడిన మార్కులలో కొన్నిటిలో ఉత్తీర్ణులై, కొన్నిటిలో ఉత్తీర్ణులు కానిచో, మరల దానిని మరుసంవత్సరములో చదివి ఎట్లు ఉత్తీర్ణులు కావలసియుండునో, ఆలాగున ఈ జన్మలో పూర్తిసిద్ధి గానిచో, మరుజన్మము ఎత్తి దానిని పూర్తి చేయవలయును మరు సంవత్స రములో పరీక్షలో ఉత్తీర్ణులు కానివారు ఆవలిసంవత్సరమున చదివి ఎట్లు ఉత్తీర్ణులు కావలసియుందురో ఆలాగున ఈ జన్మలో ముక్తుడు కానివాడు మరియొక జన్మమెత్తి జీవన్ముక్తుడు కావలసియుండును దానియందును ముక్తుడు కానిచో, ముక్తుడగువరకు జన్మము వచ్చుచునే యుండును కనుకనే జీవులలో అనేక తరగతుల వారలు కనిపించుటకు కారణము ఆరవ అధ్యాయమున తెలిపినది చూడుడు

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।**
**అనేక జన్మ సంసిద్ధః తతో యాతి పరాం గతిమ్॥**

పట్టుదలతో ప్రయత్నించుచున్న యోగనిష్ఠుడు పాపరాహిత్యము గలవాడై, అనేక జన్మములయందు అభ్యసించుటవలన పొందదగిన యోగ సిద్ధిని పొందినవా డగుచున్నాడు, అటు పిమ్మట అట్టి యోగసిద్ధిని పొందిన తరువాత సర్వోత్తమమగు మోక్షసిద్ధిని పొందుచున్నాడు. ఈ యోగ మార్గములో అభ్యాసి యనియు, ఆరూఢుడనియు ఇరుతెగలవారు గలరు అభ్యాసియైన వానికి సంపూర్ణ త్రిగుణరహితము కాదు అందువల్లనే అభ్యాసము చేయువాడని పేరు వచ్చినది ఆరూఢుడైన వాడు సంపూర్ణ

విషయ రాహిత్యము గలిగియుండును కావుననే, ఈ ఉభయులయొక్క లక్షణములను శ్రీభగవానుడు వివరించి చెప్పెను

**ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥**

యోగభ్రష్టుడు అశ్వమేధాది యాగములు చేసినవారు పొందునట్టి పుణ్యలోకములను పొంది, అక్కడ బహుకాలము స్వర్గసుఖము ననుభవించి, సదాచారము గలవారును, శ్రీమంతులును అయిన వారి యొక్క గృహము నందు పుట్టుచున్నాడు

అభ్యాసపరుడైయుండి వాసనాక్షయ, మనోనాశము గలుగని వానిస్థితి యిట్లుండును వాడు ఉత్తమమైన పుణ్యలోకమును పొంది అక్కడ స్వర్గసుఖ ముల ననుభవించి మరల పవిత్రవర్తనముగల శ్రీమంతుల కులములో పుట్టును "శుచీనాం శ్రీమతాం గేహే' అని ప్రయోగించుటవల్ల పవిత్రవంశ ములో, శ్రీమంతుల కుటుంబములో పుట్టుటకు కారణమేమన! శ్రీమంతులు గానిచో సౌఖ్యము ననుభవించుటకు ఉండదు పవిత్రకులము కానిచో నిర్మల మగు ఆహారవ్యవహారము లుండవు అందువల్లనే, ఈ రెండు గుణములను ప్రత్యేకించి చెప్పుటకు కారణమైనది శ్రీబుద్ధదేవుడు, జనకచక్రవర్తి, విశ్వా మిత్రాదులని గ్రహించేది

**అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।**
**ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥**

రెండవ వానిలక్షణము - బుద్ధిమంతులైన జ్ఞానులయొక్క వంశము నందే జన్మించుచున్నాడు, ఈలాటి జన్మమేది గలదో, అదే ఈలోకము నందు మిక్కిలి అరుదైనది శ్రీశంకరులు, మధ్వాచార్యులు, రామకృష్ణపరమ హంస, సమర్థ రామదాసుగారలు మొదలైనవారు ఇట్టి శ్రేణిలో చేరినవార లని గ్రహించేది. పూర్వము మలినమగు బంగారము కొన్నిసార్లు స్పుటము చేసినప్పుడే చెడు లోహములు పోయి అపరంజి బంగారము కాగలుగును

ఒక్కొక్క స్ఫుటముచేత కొంత కొంత శుద్ధమగు చుండును సంపూర్ణ మలిన లోహము నశించునపుడు అపరంజి బంగారమగును కావుననే జీవులలో కొందరు ముక్తాత్ములు, కొందరు సత్త్వగుణము కలవారు, కొందరు వైరాగ్య పురుషులు, కొందరు సామాన్య భక్తి వైరాగ్య జ్ఞానము కలవారే కనిపించు చున్నారు

**మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణ సుఖదుఃఖదాః ।**
**ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత ॥**

**యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ ।**
**సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥**

ఓ అర్జునా! ఇంద్రియములకు శబ్దాది విషయములతోడ కలిగెడు సంయోగములు శీతోష్ణములను, తన్మూలకముగ సుఖదుఃఖములను కలుగ జేయునవి, రాకపోకలు కలిగినట్టివియు, స్థిరములు కానట్టివియు అగు చున్నవి కావున వానిని ఓర్చుకొనుము, ఏలయనగా సుఖదుఃఖములయందు సమభావము గలవాడును, కార్యనిర్వహణమందు దృఢచిత్తము కలవాడును నైన ఏ పురుషునైతే ఈ మాత్రాస్పర్శములు బాధింపవో, ఆ పురుషుడు అమృ తత్త్వము నొందగలడు ఇట్టి లక్షణములు గలవాడే అమృతపానమునకు అర్హుడు ప్రపంచములో ఎట్టి మహనీయుడైనను ఏదైన ఒక కార్యము చేయునప్పుడు స్తుతి నిందలు, లాభనష్టములు తప్పక కలుగుచుండును దానిని సహించి కార్యము నిర్వహించేవాడే గీతామృతమును పానముచేయుట కర్హుడు ఇట్టి నిగ్రహశక్తి కలిగియుండేలాగున కార్యశూరులు చూచుకొన వలయును అయితే తనలో లోపము గలిగి లోకము చేయుచుండు దూషణ భూషణలను సహించుట తమోగుణలక్షణము అట్టి యేలాటి దోషములును లేక లోకము చేయుచుండు స్తుతినిందలను సహించెడు శక్తి గలిగి యుండ వలెను లేనిచో ఏకార్యమున్ను ఎవరున్ను చేయజాలరు ఆదూషణలు, నిందలు స్థిరము గావు సత్యము తెలియువరకే లోకము చేయుచుండును

నిజము తెలిసిన తరువాత పశ్చాత్తాపపడి క్షమాపణ కోరుచుండును కావుననే మొదటి శ్లోకములో 'తాంస్తితిక్షస్వ భారత' అని ప్రయోగించిరి అట్టి శక్తిలేనిచో కార్యము నిర్వహింపజాలడు అమృతత్వమున్నూ లభించదు కావున గీతామృతమును గ్రోల దలంచువాడు ఇట్టి శక్తి కలిగి యుండవలెను

**యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥**

ఎవరైతే ఈ అధ్యాయమందలి పదమూడవ శ్లోకము మొదలు పందొమ్మిదవ శ్లోకము వరకు చెప్పబడినదియును, ధర్మమునుండి తొలగ నిదియును, అమృతమైన అద్వేష్టృత్వము మొదలుగా గల ధర్మ సముదా యమునందు శ్రద్ధ గలిగియు, పరమాత్మయే పరమగతిగా తలంచుచు నుంటున్నారో, అట్టి భక్తులు నాకత్యంత ప్రీతి గలవారగుదురు.

ఈ శ్లోకమున 'ధర్మ్యామృతం' అని ప్రయోగించినారు భగవద్ధర్మ మును అనుష్ఠించువాడే భగవదమృతమును పానము చేయుట కర్హుడగును సాధారణ జనులు తమకు భగవంతునియందు భక్తి గలిగియున్నదని తలంతురు అది చాలదు భగవంతుడు తమపై ప్రీతి గలిగి యున్నాడా? యని తలంచువారరుదు ఇదే దీనిలో గల కీలకము భగవంతునికి ప్రీతిగలిగి యుండవలసి యుండిన, ఈ అధ్యాయమున చెప్పిన పదమూడవ శ్లోకములో కల అద్వేష్టృత్వాది గుణములు కలిగియుండవలయును లేనిచో భగవత్కృప కలుగదు, అమృతము లభించదు

**బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమమృతస్యావ్యయస్య చ ।**
**శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ ॥**

నేను నాశనములేని మోక్షస్థానమును (అమృతస్థానమును) సనాతన మగు ధర్మస్వరూపమును, ముఖ్యమైన నిత్యానంద స్వరూపమునగు బ్రహ్మ మున కాశ్రయ భూతుడను

ఇచ్చట గీతామృత స్వరూపమును నిర్ణయించడమైనది అదే పై జెప్పిన లక్షణము దీనినే ముముక్షులు, భక్తులు అనుభవించవలయును ఈ అమృతత్వమును ఉపనిషత్తులలో అనేక స్థలములలో ప్రతిపాదించడమైనది ఉపనిషత్సారమే గీతయగుటవల్ల, పైనిరూపించిన గీతయున్నూ ఈ అమృతత్వమును పలుసార్లు నిరూపించడమైనది కఠోపనిషత్తు చూడుడు

**మూ॥ పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూ**
**స్తస్మాత్పరాఙ్ పశ్యతి నాన్తరాత్మన్ ।**
**కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్ష**
**దావృత్తచక్షు రమృతత్వమిచ్ఛన్ ॥**

ఓ నచికేతసుడా! బ్రహ్మ సర్వేంద్రియములను ఆత్మభిన్నములగు శబ్దాది విషయములను గురించి ప్రకాశించు వానినిగా సృజించినాడు కాననవి విషయములను గురించియే ప్రకాశించునుగాని, ఆత్మస్వరూపమును చూడలేవు ఐనను ఒకానొక ధీరుడు అమృతత్వమును (మోక్షమును) గోరువాడై ఇంద్రియములను బాహ్యవిషయములనుండి మరలించి యాత్మస్వరూపమును జూచుచున్నాడని యముడు పలికెను

**మూ॥ పరాచః కామానమయ న్తి బాలా**
**స్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్ ।**
**అథ ధీరా అమృతత్వం విదిత్వా**
**ధ్రువమధ్రువేష్విహ న ప్రార్థయన్తే ॥**

ఓ నచికేతసుడా! అజ్ఞానులు బాహ్య కామములను గోరి, జనన మరణాది రూపమైన యనర్థ సమూహమును పొందుచున్నారు కనుక జ్ఞానులు అమృతత్వమును (మోక్షమును) శాశ్వతముగా తెలుసుకొని సంసారమునందు అనిత్యములగు వస్తువులను కోరరు

**మూ॥ య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః ।**
**తదేవ శుక్రం తద్బ్రహ్మ త దేవామృతముచ్యతే ।**

**తస్మిల్లో కాశ్రితాస్సర్వే తదునాత్యేతి కశ్చన। ఏతద్వైతత్ ॥**

ఓ నచికేతసుడా! సుషుప్తిని చెందియున్న సర్వజీవులయందు సర్వ కామముల గోరుచు ఏయాత్మస్వరూపము జాగ్రత్త నొందియున్నదో, అదే నాశము పొందని అమృతత్వము (ఆత్మ), పరిశుద్ధ బ్రహ్మస్వరూపము దాని యందే సర్వ ప్రపంచములున్నవి దాని నెవడును నతిక్రమింపడు ఇదే నీవడి గిన యాత్మస్వరూపమని యముడు పలికెను

**మూ॥ ఊర్ధ్వమూలో అవాక్శాఖ ఏషోఽశ్వత్థస్సనాతనః ।**
**తదేవ శుక్రం తద్బ్రహ్మ త దేవామృత ముచ్యతే।**
**తస్మిల్లోకాశ్రితాస్సర్వే తదునాత్యేతి కశ్చన। ఏతద్వైతత్ ॥**

ఓ నచికేతసుడా! స్వర్గనరకాది లోకములే అడ్డముగా వ్యాపించునట్టి కొమ్మలుగాగల, ప్రాచీనమగు క్షణభంగురమైన ఈ సంసార వృక్షమునకు వేరుగానుండెడి ఊర్ధ్వము నందలి బ్రహ్మస్వరూపమేదియో, అదే అమృ తత్వము, జరామరణాది నాశరహితమగు బ్రహ్మస్వరూపము దాని యందే సమస్త లోకములున్నవి దానిని ఎవడును అతిక్రమింపలేడు ఇదే నీవడిగిన యా పరబ్రహ్మస్వరూపము

**మూ॥ అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకోఽలిఙ్గ ఏవ చ ।**
**యద్జ్ఞాత్వా ముచ్యతే జన్తురమృతత్వం చ గచ్ఛతి ॥**

ఓ నచికేతసుడా! మనుష్యుడు ఏ యాత్మస్వరూపమును తెలిసికొని, సంసారబంధము విడిచి, అమృతత్వమును పొందుచున్నాడో, (ముక్తుడగు చున్నాడో) ఆయాత్మ బుద్ధ్యాది లింగశూన్యమై, అవ్యక్తరూపమగు నాకాశాది కము కంటె వ్యాపకమై యున్నదని యముడు పలికెను

**మూ॥ యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః ।**
**అథ మర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనమ్ ॥**

ఓ నచికేతసుడా! బుద్ధికి నేను, నా సంబంధమైనది, సాధనము అను

ఈ రూపములైన అజ్ఞాన కల్పితములగు త్రాటియొక్క ముడులవలెనే దృఢములగు నీ బంధములు ఎప్పుడు నశించుచున్నవో, అప్పుడు ఇచ్చటనే మను జుడు అమృతత్వము నొందుచున్నాడు (ముక్తుడగుచున్నాడు) ఇదియే యుపదేశమని యముడు పలికెను

'ఇహ' యని ప్రయోగించుటవల్ల ఈ దేహముతో కూడి యున్నప్పుడే, ఈ లోకమునందున్నప్పుడే అమృతపానము చేసిన వాడగుచున్నాడు

**మూ॥ అఙ్గుష్ఠమాత్రః పురుషో௨న్తరాత్మా**
**సదా జనానాం హృదయే సన్నివిష్టః ।**
**తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ**
**తం విద్యాచ్ఛుక్రమమృతం తం విద్యాచ్ఛుక్ర మమృతమితి ॥**

ఓ నచికేతసుడా! జనులు తమ సంబంధమగు హృదయమందుండు నంగుష్ఠ మాత్రమైన పురుషస్వరూపమగు నన్తరాత్మను శ్రేష్ఠమగు జ్ఞానము చేత తన శరీరమునుండి ముంజగడ్డివలన దాని ఈనెను వలెనే వేరుపరచి, ఆయంతరాత్మను అమృతత్వముగా, అనగా పరిశుద్ధమగు బ్రహ్మస్వరూప ముగా తెలిసికొనవలెనని యముడు పలికెను

ఇకను ఈ కఠోపనిషత్తులో అమృత శబ్దము లనేకములు గలవు పాఠకులకు విసుగు కలుగునని తలంచి, అంతమాత్రము వ్రాయడమైనది ముంజయనగా దర్భ ద్విజులు ఉపనయన కాలమున మౌంజీ బంధనము చేయుదురు దర్భయొక్క పొరలను తీసివేసి, మధ్యయుండు ఈనెలుతీసి, ఉపయోగపరచెదరు ఇది దేవాలయములో ధ్వజారోహణ సమయము నందును, ఒక విగ్రహమునుండి మరియొక విగ్రహమునకుగాని, మరియొక స్థలమునకుగాని దేవతావాహనము చేయునప్పుడును ఈ త్రాటినుపయోగ పరతురు ఇది చాలా పవిత్రమైనది ఆలాగున ఆత్మానాత్మ విచారణపరులు దేహేంద్రియ మనోబుద్ధ్యాది అనాత్మను తొలగించి, సాక్షియగు ఆత్మను, బ్రహ్మమును పొందవలయును, అదే అమృతము ఇది సాంఖ్యయోగక్రమ

మగును అరటి చెట్టుయొక్క పొరలగు పట్టలను తీసివేసి, లోపలనుండు అరటి వూసను అనగా అరటి బొందెను ఎట్లు తీసికొనెదరో, తీసికొని కూరలు చేయుదురో ఆలాగున ఆత్మానాత్మ విచారణచేసి అనాత్మను తొలగించి, ఆత్మను గ్రహించుకొనవలయును అదే అమృతము, అద్వైతము, బ్రహ్మము, శివము ఈ విషయమై ధాన్యమును దంచి, పొట్టుతీసి, బియ్యమును గ్రహించునట్లున్ను, పండుయొక్క తోలును బెరడును తొలగించి గుజ్జును గ్రహించునట్లున్ను, కొబ్బరికాయ పీచును, చిప్పను తీసివేసి లోపలి నీరును, కొబ్బెరను గ్రహించి భుజించునట్లున్నూ, దేహేంద్రియాది మనోబుద్ధ్యాదులను తొలగించి సాక్షియగు శివత్వమును, అమృతత్వము, దైవత్వమును పొందవలె నని గ్రహించేది ఏ బీజమైనను పొట్టుతోకూడి యుండువరకు మాత్రమే మొలచును, పొట్టు తీసివేసిన మరల అంకురించదు సామ, ఆవాలు, మొదలు టెంకాయ విత్తనమువరకును పరీక్షించుకొనవచ్చును. ఆలాగున అవిద్యా హృదయ గ్రంధి అజ్ఞానావరణము ఉండువరకు మాత్రమే, జీవులు పునర్జన్మము నెత్తుదురు అవిద్యావరణము నశించిన, నిత్యముక్తుడగును ఉత్తర గీతయందు శ్రీకృష్ణభగవాను లుపదేశించినది చూడుడు

**యథాఽమృతేన తృప్తస్య పయసా కింప్రయోజనమ్ ।**
**ఏవం తత్పరమం జ్ఞాత్వా వేదైర్నాస్తి ప్రయోజనమ్ ॥**

అమృతపానముచే తృప్తినొందిన వానికి ఉదకముచే నేమి ప్రయోజనము? అటులనే, పరమాత్మసాక్షాత్కారము చేసికొనిన పిదప వేద శాస్త్రములచే నేమి ప్రయోజనము?

అనగా వేదములో చెప్పిన కర్మకాండములు అవసరము లేదని భావము ఇచ్చట జ్ఞానమును అమృతముగా వర్ణించడమైనది

**జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః ।**
**న చాస్తి కిఞ్చిత్కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్ ॥**

బ్రహ్మసాక్షాత్కార జ్ఞానామృతముచే తృప్తిచెంది కృతకృత్యుడగు

యోగికి చేయందగిన కార్యంబేమియు లేదు ఉండెనేని అతడు కృతకృత్యుడు కాడు కావున తాను చేయవలసిన కృత్యములు కొంచెమైనను మిగులక పూర్తిగా చేయవలయును ఒక పరీక్షలో ఉత్తీర్ణుడు కావలసియుండిన, దానికి సంబంధించిన కృత్యములను పూర్తిగా చేయవలయును గదా! కృతార్థుడనగా, చేయవలసిన కృత్యములను సంపూర్ణముగా చేసినవాడని యర్థము అప్పుడే కృతార్థుడగును అవధూత గీతయందు శ్రీదత్తాత్రేయులు తెలిపినది చూడుడు దీనియందు అమృత శబ్దము లనేకములు గలవు

**కథం రోదిషి రే చిత్త హ్యాత్మన్యేవాత్మనా భవ ।**
**పిబ చిత్త కలాతీత మద్వైతం పరమామృతమ్॥**

ఓ చిత్తమా! నీవేల బాలునివలె నేడ్చుచున్నావు? బాలురకు పానీ యంబు తృప్తికరంబు గావున, నీవును దేవతలపేక్షించు నమృత కిరణంబు కన్న ఉత్కృష్టమైన మాయాతీతుండు నద్వితీయుండునగు బ్రహ్మవిచారమను మేలైన అమృతమును త్రాగుము

**విషరూపస్య రౌద్రస్య మోహమూర్ఛా ప్రదస్య చ ।**
**ఏకమేవ వినాశాయ హ్యమోఘం సహజామృతమ్॥**

తమోగుణ సంబంధమైనట్టి, మోహమనెడు మూర్ఛకుస్థానమైనట్టి విష స్వరూపమై, సంసారమును నాశము చేయుటకు పాపములేని జ్ఞానమనెడి అమృతమొక్కటే ప్రసిద్ధముగా సమర్థమైనది

ఇక భక్తి విషయమై ముకుందమాలయందు చూడుడు నిజమైన అనన్యమైన భక్తియున్ను, నిజమైన జ్ఞానమున్ను ఒకటియేయగును జ్ఞానామృతమన్నను, భక్తి రసామృతమన్నను, ఒకే అర్థమునే గలుగజేయును. అయితే సాకారమనియు, నిరాకారమనియు కొంతభేదము కనుపడవచ్చును జ్ఞాని ఇదంతయు, బహ్మమయముగా, ఆత్మమయముగా, అమృతమయ ముగా అనుభవించును భక్తులు ఇదంతయు భగవన్మయముగా, పరమాత్మ మయముగా, అమృతమయముగా అనుభవించెదరు ఈ రెండింటిలోను

దృశ్యవిషయము లేదు అయితే ఈ రెండున్నూ అతీత విషయములే సామా న్యుల కందుబాటులో నుండునవి కావు

**మూ॥ సరసిజనయనే సశఙ్ఖచక్రే**
**మురభిది మా విరమస్వ చిత్త రన్తుమ్।**
**సుఖతరమపరం న జాతు జానే**
**హరిచరణస్మరణామృతేన తుల్యమ్॥**

ఓ మనసా! పద్మములవంటి కన్నులుగలవాడును, శంఖ చక్రములు గలవాడుననగు మురహరునియందు రమించుటకు వెనుదీయకుము హరి చరణస్మరణమనెడి అమృతముతో సమానమైన మిక్కిలి యానందమును గలుగజేయు మరియొక వస్తువును ఒక కాలమందును నెఱుంగను

దీనియందుగూడ 'అమృత'శబ్దము ప్రయోగించడమైనది "హరిచరణ స్మరణామృతేన తుల్యమ్"

**హేలోకాశ్శృణుత ప్రసూతి మరణవ్యాధేశ్చికిత్సామిమాం**
**యోగజ్ఞా స్సముదాహరన్తి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః।**
**అన్తర్జ్యోతిరమేయమేకమమృతం కృష్ణాఖ్యమాపీయతాం**
**తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణమాత్యన్తికమ్ ॥**

ఓ జనులారా! జనన మరణ వ్యాధి కొక చికిత్స చెప్పెదను వినుడు దానిని యాజ్ఞవల్క్యాదులైన మునులు చెప్పియున్నారు అంతర్జ్యోతి స్వరూపం బును, అప్రమేయమును, ముఖ్యమునగు శ్రీకృష్ణుడను పేరుగల యమృ తము నాస్వాదింపుడు. ఆ పరమౌషధము అత్యంత సౌఖ్యమును కలుగ జేయును

దీనియందును అమృత శబ్దము ప్రయోగించడమైనది "అంతర్జ్యోతి రమేయ మేక మమృతం"

**హేమర్త్యాః పరమం హితం శృణుత వో వక్ష్యామి సంక్షేపత**
**స్సంసారార్ణవమాపదూర్మిబహుళం సమ్యక్ప్రవిశ్య స్థితాః ।**
**నానాజ్ఞానమపాస్య చేతసి నమో నారాయణాయేత్యముం**
**మన్త్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః ॥**

ఆపదలనెడి యలలచే బహుళమగు సంసారసముద్రమును పొంది యుండు మనుజులారా! మీకు హితమొకటి సంగ్రహముగా చెప్పెదను వినుడు నానావిధమైన అజ్ఞానమును వదలి మనస్సునందు ప్రణవముతో గూడిన "నమో నారాయణాయ" యను మంత్రము ప్రణామముతో మాటి మాటికి వల్లింపుడు

దీనియందు "నమో నారాయణాయేత్యముం మన్త్రం సప్రణవమ్" అను అష్టాక్షరి మహామంత్రము నుపదేశించెను వైష్ణవభక్తులలో ముఖ్యులగు వారు కులశేఖరాళ్వారులు ఇందువల్ల ప్రణవము అనగా ఓంకారమును అందరున్నూ పఠించవచ్చునా? యను సందేహమున కవకాశము లేదు శ్రీకృష్ణచైతన్యప్రభువు మొదలగువారలు ఈ భక్తిసారమృతపానముచేతనే భవరోగమును జయించిరి

**బద్ధేనాఞ్జలినా నతేన శిరసా గాత్రైస్సరోమోద్గమైః**
**కంఠేన స్వరగద్గదేన నయనేనోద్గీర్ణ బాష్పామ్బునా ।**
**నిత్యం త్వచ్చరణార విన్దయుగళధ్యానామృతాస్వాదినా**
**మస్మాకం సరసీరుహాక్ష! సతతం సమ్పద్యతాం జీవితమ్ ॥**

తామరరేకులవంటి కన్నులు గలిగిన కృష్ణా! అంజలి చేయు హస్తముల తోడను, వంగిన శిరముతోడను, గగుర్పాటుతో కూడిన గాత్రముతోడను, డగ్గుత్తికగల కంఠముతోను, ఆనందబాష్పములు గల కన్నులతోను, నిత్యము నీ చరణ కమల ధ్యాన మనెడి యమృతమును పానము చేయుటయందు మాకు సదా జీవనము కలుగునుగాక!

**వ్యామోహప్రశమౌషధం ముని మనోవృత్తి ప్రవృత్త్యౌషధం**
**దైత్యేన్ద్రార్తికరౌషధం త్రిభువనీ సంజీవనై కౌషధమ్।**
**భక్తాత్యన్తహితౌషధం భవభయ ప్రధ్వంసనైకౌషధం**
**శ్రేయఃప్రాప్తికరౌషధం పిబ మనః శ్రీకృష్ణ దివ్యౌషధమ్॥**

ఓ మనసా, నీ వ్యామోహమును అణచునట్టి ఔషధమును, మునుల యొక్క మనోరధ వృత్తికి ఔషధమును, దైత్యేంద్రియులకు దుఃఖమునొసంగు ఔషధమును, మూడులోకములు ఉజ్జీవించు ముఖ్యమైన ఔషధమును, భక్తులకు మిగుల హితము కావించు ఔషధమును, సంసార భయమును పోగొట్టు ప్రముఖౌషధమును, శ్రేయస్సును పొందునటుల జేయు ఔషధము నగు శ్రీకృష్ణుడను దివ్యమైన మందును పానము చేయుము

శ్రీమద్భాగవతములో గల "గోపికా గీతము" నందున్న ఒక శ్లోకమును వ్రాసెద శ్రీ భాగవతములో అమృతశబ్దములు గల శ్లోకములనేకములు గలవు అవన్నియు వ్రాసిన వ్యాసము పెరిగిపోవును ముముక్షువులు, భక్తులు భాగవతములో చూచి అమృతపానమును చేయుదురు గాక!

**తవ కథామృతం తప్తజీవనం కవిభిరీడితం కల్మషాపహమ్ ।**
**శ్రవణమంగళం శ్రీమదాతతం భువి గృణంతి యే భూరిదా జనాః ॥**

కృష్ణా! నీ కధామృతము తాపత్రయసంతప్తులగు జీవులకు జీవన మొసంగునది, కవులచే పొగడబడినది, కల్మషముల నణచునది, శ్రవణ మాత్రమున సమస్త శుభముల నొసంగునది, శోభా సంపన్నమైనది, మిక్కిలి విస్తారమైనది, ఇట్టి నీ కధామృతమును ఇతరుల కెవ్వరు పంచిపెట్టెదరో, వారే పుణ్యాత్ములని భావము

ఈ చెప్పినదంతయు ఆత్మస్వరూపమును గురించి, పర బ్రహ్మ స్వరూపమును గురించి, విష్ణుభక్తిని గురించి చెప్పినదేకాని, శివభక్తి గూర్చి చెప్పలేదని ఈశ్వరభక్తులు తలంచనక్కరలేదు. ఈ అమృతము ఎవరిస్తారు? ఎచట ఉంటున్నది అని శివభక్తులు సందేహపడ నక్కర లేదు. దక్షిణామూర్తి

బంగారు కలశములో తన ఎడమచేతిలో పెట్టుకొని తన దగ్గరకు వచ్చేవారికి ఇస్తున్నాడు దక్షిణామూర్తి స్తోత్రమున చూడుడు

**స్ఫటికరజతవర్ణం మౌ క్తికీమక్షమాలాం**
**అమృతకలశవిద్యాం జ్ఞానముద్రాం కరాగ్రే ।**
**దధతమురగకక్ష్యం చంద్రచూడం త్రినేత్రం**
**విధృత వివిధ భూషం దక్షిణామూర్తిమీడే ॥**

స్ఫటిక రజతముల వంటి స్వచ్ఛమైన వర్ణముగలవాడును, ముత్యములతో చేయబడిన జపమాలను ధరించినవాడును, అమృత కలశము గైకొనినవాడును, విద్యానిధియు, హస్తముల చివర చిన్ముద్ర ధరించిన వాడును, కక్ష్య భాగమున సర్పములు గలవాడును, శిరస్సుపై చంద్రుడు ఒప్పుచున్నవాడును, త్రినేత్రుడును, పెక్కు భూషణముల ధరించినవాడునగు శ్రీదక్షిణామూర్తిని స్తుతించెదను

ఈ ధ్యానశ్లోకమున "అమృత కలశవిద్యాం" అని ప్రయోగించినది చూడుడు గీతలో అమృతము ఎచ్చట నుంచబడినదో అది తెలిసికొనుటకు సాధ్యముకాని వారికిన్నీ, శ్రీదక్షిణామూర్తి నుపాసించి, అమృతమును పానము చేయుటకు సాధ్యము కాని వారికిన్నీ, పరమశివుడు "గురుగీత" యందు పార్వతీదేవికి ఒక ఉపాయము నుపదేశించెను ఇది శాస్త్రజ్ఞానము తెలిసికొనుటకు శక్తిలేని వారికిన్నీ, ఈశ్వరోపాసనచేసి, అమృత మును సంపాదించుటకు సాధ్యము కానివారికిన్నీ భక్తులపై కరుణగలిగి, పరమ కారుణికుడగు పరమశివుం డుపదేశించినదని మరువకుడు

**సులభం తు గురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే ।**
**లబ్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్త మన్వేషతే క్షితౌ ॥**

కన్నులకు ప్రత్యక్షముగా కనబడెడు శ్రీ గురుమూర్తిని వదలి, కంటికి గోచరముకాని దైవోపాసన చేసికొని, మోక్షము బొందదలంచువాడు లబ్ధమైన ధనమును విడిచి, భూమియందు నిక్షేపము కలదని తలంచి త్రవ్వువాడు ఎట్టి

మూఢుడో అట్టివాడే

**చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు యస్స్మరేత్ ।**
**హస్తస్థముదకం త్య క్త్వా ఘనస్థమభివాంఛతి ॥**

దృష్టికి సాక్షాత్తుగా కనుపించెడు గురుదేవుని పరిత్యజించి, నేత్రముల కగోచరమగు శాస్త్రమును చదివి, జ్ఞానమును సంపాదించ దలంచువాడు చేతిలో గల జలపాత్రమును త్యజించి, జలమున కాధారము మేఘము గదా! యని తలంచి మేఘమును గూర్చి వెదకు వానివలె మూర్ఖుడగును

ఈ విషయమై రామకృష్ణపరమహంస ఇట్లుపదేశించిరి ముత్యముల వ్యాపారము చేయు వర్తకులు ఏ దేశములలో ముత్యములు ఉత్పత్తి యగు చుండునో, అచ్చోటినుండి తెప్పించి, హారమును కట్టి అమ్ముచుందురు ముత్యాలహారము కావలయునని తలంచువారికి ఆ దుకాణము వారి దగ్గరకు వెళ్ళిన వెంటనే హారము సంపాదించుకొనవచ్చును అట్లుగాక ముత్య ముల కాధారము ముత్యపు చిప్పలు గదా! యని తలంచి, సముద్రములో దిగి, ముత్యపు చిప్పలను సంపాదించి ముత్యాలహారమును అలంకరించుకొన దలంచువారివలె శాస్త్రసాగరములో మునిగి జ్ఞానమును సంపాదించుకొన నుద్దేశించువాడును ఉండునని వచించిరి సముద్రములో ఏ ప్రదేశమున, అగాధమైన లోతులో ఎట్లు ముత్యపుచిప్పలుండునో, ఆలాగున శాస్త్రసముద్ర ములో ఎచ్చటనో ఆత్మజ్ఞానమున్నూ గూఢమైయుండును మహాత్ములగు గురువరేణ్యులు అట్టి శాస్త్రములను చదివి, జ్ఞానమును సంపాదించు కొనియుందురు. కావున అట్టి అమృతత్వమును పొందిన మహనీయాత్మ లను ఆశ్రయించిన జ్ఞానము సులభముగా పొందవచ్చును

**నమోఽస్తు గురవే తుభ్యం సహజానందరూపిణే ।**
**యస్య వాగమృతం హన్తి విషం సంసారసంజ్ఞికమ్ ॥**

సహజముగా ఆనందరూపుడవై యుండు నోగురుదేవా! నీకు నమస్కారము ఏగురుదేవునియొక్క వాగమృతముచే విషసదృశమగు

సంసారదుఃఖము శమించునో అట్టి గురుదేవునికి నమస్కారము దీనియందు "యస్య వాగమృతం" అని యుండుటవల్ల గురుదేవుని యొక్క వాక్యములను అమృతముగా నిరూపించడమైనది

**నమోఽచ్యుతాయ గురవేఽజ్ఞాన ధ్వాన్తైక భానవే ।**
**శిష్యసన్మార్గపటవే కృపాపీయూష సింధవే ॥**

నాశరహితుడున్నూ, అజ్ఞాన తిమిరమునకు భాస్కరుని వంటి వాడున్నూ, శిష్యులను సన్మార్గములోనడుపుటకు సమర్థుడున్నూ, 'కృప'యను అమృతమునకు సముద్రుడునగు పరమ గురుదేవా! నీకు నమస్కారము దీనియందు "కృపాపీయూషసింధవే" అని ప్రయోగించడమైనది పీయూష మనగా అమృతమని అర్థము ఈలాటి అమృత శబ్దములు గురుగీతలో ఎన్నియో కలవు



# భగవద్గీత హింస నుపదేశించుచున్నదా?
# లేక అహింస నుపదేశించుచున్నదా?

ఇట్టి ప్రశ్నలు అనేకు లడుగుచుందురు వీరు విద్యావంతులున్ను, ప్రజ్ఞాశాలురును, ధనవంతులును నైయున్నారు, ఐతే వీరికి సత్త్వగుణము స్వల్పముగాను, రజోగుణము ఎక్కువగాను కలిగియుండును అయితే వీరు ప్రాపంచిక వ్యవహారములో మంచి నైపుణ్యముకలవారు, తమోగుణస్థులు కారు కావుననే గీత పదునాలుగవ అధ్యాయమున " రజః కర్మణి భారత" రజోగుణము కలవారు కామ్యకర్మపరులై యుందురని భగవాను డుపదేశించెను మహనీయులందరున్నూ, తత్త్వజ్ఞానులందరున్నూ, ఆత్మవేత్తలందరున్నూ, భక్తులందరున్నూ, భగవద్గీత అహింసనే ఉపదేశించుచున్నదని చెప్పుదురు ఈ విషయమై హింసనే భగవద్గీత ఉపదేశించుచున్నదని చెప్పువారు

ఈక్రింది విధముగా ప్రశ్న చేయుదురు వీరున్నూ మంచి ధీమంతులే యుద్ధము చేయుట పాపమని అర్జునుడు తలంచి, హింసాత్మకమగు ఈ యుద్ధమును నేను చేయజాలనని శ్రీకృష్ణభగవానునితో చెప్పినప్పుడు ఎన్నెన్నియో విధముల ఉపదేశించి, అర్జునునిచే యుద్ధము చేయించెను అ 1 శ్లో॥ 36 'పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః' ఈ యుద్ధములో ఈ జనులను వధించినచో పాపమే కలుగును కాని మరియేమియున్నూ కలుగదు అట్టి కారణమువల్ల యుద్ధము నేను చేయను అ 2 శ్లో॥9 "నయోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ" నేను యుద్ధము చేయను అని చెప్పి ధనుర్బాణములను విడచిపెట్టి, ఊరక కూర్చుండెను అట్టి వానికి ఎన్నెన్నియో బోధలు చెప్పి శ్రీకృష్ణుడు యుద్ధమునే చేయించి నందుచే, భగవద్గీత హింసనే బోధించుచున్నది దీనికన్న తార్కాణము మరి యేమి కావలెను?

**కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।**
**అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥**

ఓ అర్జునా! యుద్ధము చేయుటకు సన్నద్ధమైన ఈ విషమసమయము నందు స్వర్గము కలుగజేయనిదియు, అపకీర్తికి కారణమైనదియునైన ఈ శోకరూపమగు పిరికితనము నీకెట్లు కలిగెను?

**క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయదౌర్భల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥**

ఓ అర్జునా! నీవు అధైర్యమును పొందకుము నీకు అధైర్యమును పొందుట తగదు ఓ పరంతపా! హీనమైన ఈ అధైర్యమును విడిచిపెట్టి లెమ్ము అని శ్రీకృష్ణుడుపదేశించుటవల్ల భగవద్గీత హింసనే బోధించుచున్నది ఈ శ్లోకమున అర్జునుని పరిహసించినట్లు కనబడుచున్నది. కావుననే "క్లైబ్యం మాస్మగమః పార్థ" అని ప్రయోగించినాడు. క్లైబ్యమనగా క్లీబత్వము, క్లీబత్వ మనగా నపుంసకత్వము అర్జునుని శ్రీకృష్ణుడు స్త్రీ యున్నూ, పురుషుడున్నూ

కాని నపుంసకునిగా పరిహసించి చెప్పి యుద్ధమునే చేయించెను ఇట్టి హేతువువల్ల భగవద్గీత హింసనే తెలుపు చున్నది ఇది పూర్వపక్షియొక్క వాక్యము

మొదటి అధ్యాయమున్ను , రెండవ అధ్యాయము కొంతవరకున్ను చదువునప్పుడు బహిర్దృష్టి కలవారికిన్నీ, రజోగుణముతో కూడినవారికిన్నీ ఈలాగుననే గోచరించును అంతర్దృష్టి కలవారికిన్నీ, సత్యగుణము కలవారికిన్నీ భగవద్గీత అహింసనే బోధించునట్లు అర్థము కాగలుగును హింసాత్మ్మలగు క్రూరులను వధింపకపోయినచో, అహింసాత్మ్మలగు పుణ్యాత్మ్మలను రక్షింపజాలరు కావుననే లోక కంటకులగు దుర్మార్గులున్ను, అధర్మపరులునగు దుర్యోధనాదులను నశింపజేసి, ధర్మాత్మ్మలును, పుణ్యాత్మ్మలునగు ధర్మరాజాదులనున్ను, ప్రపంచములో గల పుణ్యాత్మ్మలనున్ను రక్షించుటకు శ్రీకృష్ణభగవానుడు యత్నించెను, తార్కాణముగా చూడుడు పోలీసు డిపార్టుమెంటు వారు బందిపోటు దొంగలను ఘాతకులను, హింసాత్మకులను వధించియైన, గ్రామీణులను, సజ్జనులను, ధర్మాత్మ్మలను రక్షించుచున్నారు దీనివల్ల పోలీసు అధికారులు లోకము హింసాత్మకమై యుండవలయునను భావము కలవారా? లేక అహింసాత్మకమై ప్రపంచ ముండవలెనను భావము కలవారా? దీనిని గూర్చి ఆలోచించిన గీత అహింసను, లేక హింసను బోధించుచున్నదా? యని అర్థము తెలిసికొన గలరు

ప్రపంచములో సారమైన వస్తువు బాహ్యమున నిస్సారముచే ఆవరించ బడియున్నది నిస్సారమును తొలగించి, సారమునే జనులు గ్రహించు చుందురు సారమును త్యజించి, నిస్సారమును గ్రహించు వారెవ్వరున్ను లేరు ఆలాగున భగవద్గీత యొక్క పూర్వవాది చెప్పిన బాహ్యార్థము కూడ గ్రహించుకొనవలయును చూడుడు - టెంకాయ (కొబ్బరికాయ) గలదు, బాహ్యమున పీచున్ను, చిప్పయున్ను కలిగియున్నది ఈ రెండింటిని భుజించు వారెవరైనగలరా? వీనిని త్యజించి, అంతరంగములో గల కొబ్బరిని,

నీరును భుజించి, త్రాగిజనులు సుఖింతురు ఆలాగున అరటి పండు గాని, చీనీపండుగాని, బాదంకాయలు గాని బాహ్యమునగల తోలును, బెరడును తొలగించి గుజ్జును పప్పును ఉపయోగపరచునట్లు పూర్వవాది చెప్పిన బాహ్యార్థమును త్యజించి, అంతరార్థమును గ్రహించుకొనవలయును అప్పుడు గీతయొక్క సారము అహింసాత్మకమని మనకు గోచరము కాగలు గును అందువల్లనే శ్రీరామకృష్ణాద్యవతారములు క్షత్రియ వంశమునందు జరిగినవి దుష్టనిగ్రహము శిష్టసంరక్షణము క్షత్రియునికి ధర్మము, కావుననే దుష్టనిగ్రహము క్షత్రియునికి హింసాత్మకమైనను అహింసాత్మకమని శాస్త్రము విధించినది అయితే క్షత్రియ జన్మములో జన్మించిన వారందరికిన్నీ ఇది విధించినది కాదు ప్రజాపాలనము చేయు వారెవరైనను, వారు క్షత్రియులలో చేరినవారే వారు కూడ దుష్టనిగ్రహము చేసి శిష్టరక్షణము చేయవలసినదే కాని, ఎవరికిన్నీ ఏద్రోహమున్నూ చెయ్యని సాధుజీవులను చంపవచ్చునని అర్థము కాదు రామకృష్ణాద్యవతారములు బ్రాహ్మణ జన్మములో ఎత్తకపోవుటకు కారణమిది బ్రాహ్మణ జన్మము అహింసాత్మక మైనది ఈ విషయము శ్రీకృష్ణభగవానుడు

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ (4 - 8)**

నేను ధర్మ నిష్ఠగలవారి యొక్క రక్షణము కొరకును, అధర్మపరులై సాధుసజ్జనులను బాధించు వారియొక్క వినాశము కొరకును, ధర్మమును లెస్సగా స్థాపించుట కొరకును ప్రతియుగమునందును పుట్టుచున్నాను అనగా ధర్మము నశించి, అధర్మము పెరుగునపుడంతయు శ్రీభగవానుడు లేక భగవదాజ్ఞ పొందినవారు అవతరింతురు

యుగ శబ్దమునకు కాలమనియు అర్థము గలదు "పరిత్రాణాయ సాధూనాం" అను వాక్యమును సాధువులు, పరమభక్తులు ఆపత్కాలము వచ్చునప్పుడు పఠించుచుందురు భగవంతునిగూర్చి స్తోత్రము చేయుచుం దురు "సాధూనాం" అని ప్రయోగించుట వల్ల ఈ వాక్యము ఒక జాతిని

గురించిగాని, ఒక్క మతమును గురించికాని, ఒక దేశమును గురించికాని భగవానుడు చెప్పినది కాదు కట్టకడపట మనుష్యులను గురించిగాని, పశువులను గూర్చిగాని చెప్పినది గాదు సర్వప్రాణులను గురించి కరుణ కలిగి పలికిన వాక్యము ఎవడైనా క్రూరుడు సాధుస్వభావముగల స్త్రీలను గాని, పురుషులను గాని ఏ జాతివారినిగాని బాధించుట చూచి, ఎందుకు వారిని బాధించవలెను? వారు సాధుస్వభావముగలవారు అని అనుట వినుట లేదా? ఆలాగున ఒక గోవునుగాని, కుక్కనుగాని ఎవరైనా బాధించుచుండిన, అది సాధువైన ఆవు, సాధువైన కుక్క దాని నెందుకు బాధించవలెను? అని పలుకుట వినుట లేదా? "దుష్కృతాం' అని యొక పదము గూడా దాని యందు గలదు సాధువులని గాని, బ్రాహ్మణులని గాని తలంచువారు ఈ పదముయొక్క అర్థము కూడా గ్రహించుకొనవలెను దుష్కృత్యము తన యందేదైనా గలదా? యని అంతరాత్మలో ఆలోచించుకొనవలయును

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థనమధర్మస్య తదాఽఽ త్మానం సృజామ్యహమ్॥**

ఓ అర్జునా! ధర్మమునకు క్షీణదశ ఎప్పుడెప్పుడు కలుగు చున్నదో, అధర్మము ఎప్పుడెప్పుడు వృద్ధి యగుచున్నదో, అప్పుడు అధర్మము నణచుటకును, ధర్మము నుద్ధరించుటకును నన్ను నేనే సృజించు కొనుచున్నాను, అనగా అవతరించుచున్నాను

ఈ శ్లోకమునందు "యదా యదా హి" యని ప్రయోగించుటవల్ల కృత, త్రేతా, ద్వాపర, కలియుగములలో ఒకేసారి అవతరించుచున్నానని అర్థము కాదు ఎప్పుడెప్పుడు అధర్మము విజృంభించి ధర్మమునకు హాని కలుగునో, అప్పుడప్పుడని గ్రహించుకొనవలెను అదిన్ని రామకృష్ణాద్యవ తారముల వంటి జన్మము ఉండవలయునని లేదు ఏ కాలమున అధర్మము అభివృద్ధియై, ధర్మము నశించునో అప్పుడప్పుడు అధర్మము నణచి, ధర్మము నుద్ధరించెడు జన్మము కలుగునని గ్రహించవలయును కావుననే ఒక్కొక్క

మహనీయుడు జన్మించునప్పుడు అట్టివారిని మనము అవతార పురుషులని తలంతుము అది ఏరూపముగా అట్టి వారు జన్మింతురో 10వ అధ్యాయములో చూడుడు- "తేజః తేజస్వినామహమ్" తేజస్సులలో బ్రహ్మతేజస్సు గల వారున్నూ, "సత్త్వం సత్త్వవతామహమ్" సత్త్వగుణముగల వారలలో విశుద్ధసత్త్వము గలవారున్నూ, "జ్ఞానం జ్ఞానవతామహమ్' జ్ఞానవంతులలో ఆత్మజ్ఞానము కలవారున్నూ ఈలాగున నుందురు ఈసత్యమును తెలిసికొనిన చాలును ఈ అధ్యాయములో పరమసారమగు విజ్ఞానపరమగు 41వ శ్లోకమున చెప్పినది చూడుడు-

**యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్॥**

ఈశ్వర సంబంధమైన దానిగాను, కాంతియుక్తమైనదిగాను, దృఢమైన ఉత్సాహముతో కూడినదిగా నుండు వస్తువేది గలదో, ఆ వస్తువును ఈశ్వర శక్తి యొక్క అంశము వలన పుట్టిన దానినిగానే నీవు తెలిసికొనుము

దేనియందు ఎవనియందు ఈశ్వర సంబంధగుణము, లక్ష్మీ సంబంధమైనగుణము, ఊర్జిత అనగా తేజోవత్సంబంధ గుణము గలిగి యుండునో, అదంతయు భగవత్సంబంధమైన దని తెలిసికొని అట్టి వానిని నాస్వరూపముగా గ్రహించుము

ఇచ్చట బ్రాహ్మణాది జాతినిగురించిగాని, సన్న్యాసాశ్రమము గురించిగాని, స్త్రీని గూర్చిగాని, పురుషుని గూర్చిగాని, హిందూ మతమును గూర్చిగాని, ఇతర మతమును గూర్చిగాని చెప్పలేదు దైవగుణము ఎవరియందు నుండునో అట్టివారి నందరిని దైవాంశ స్వరూపులుగా గ్రహించుమని చెప్పడమైనది ఎంత విశాలమైన భావముతో, సమత్వబుద్ధితో ఉపదేశించినదో చూడుడు ఇదే భగవద్గీతకు ఇంతగొప్ప తనము కలుగుటకు కారణము ఇది కరెన్సీనోటువంటిది అది "రఫ్" కాగితము రాజముద్ర యుండుట వల్ల దానికి ఒక్క రూపాయి మొదలు అయిదు, పది, నూరు,

అయిదువందలు, వెయ్యి, పదివేల వరకు వెల కలిగియున్నది కాగితము చూచినచో ఒక నయాపైసాకి అట్టి కాగితము లెన్నియో దొరుకును రాజ చిహ్నముండుట వల్ల ఇంత విలువ కలిగెను కావున మీరు జాతిని గురించి చూడకుడు గుణమును గురించి చూడుడు ఇదే పరమార్థోపదేశము

అంతేగాక, అ 7 "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" ఆత్మజ్ఞానియైనవాడు నేనే అని నామతము అని భగవానుడు స్వయముగా చెప్పెను అవతారము లలో పూర్ణావతారము అంశావతారము - ఇట్టి భేదములు గలవు భాగవతము చూడుడు

"అది సకలావతారంబులకు మొదలి గనియైన శ్రీమన్నారాయణ దేవుని విరాజమానంబైన దివ్యరూపంబు దానిం బరమ యోగీంద్రులు దర్శింతు రప్పరమేశ్వరు నాభికమలంబువలన, సృష్టి కర్తలలోన శ్రేష్ఠుండైన బ్రహ్మయుదయించె నతని యవయవ స్థానంబుల యందు లోకవిస్తారం బులు గల్పింపబడియె మొదల నద్దేవుండు కౌమారాఖ్య సర్గంబు నాశ్ర యించి, బ్రహ్మణ్యుండై దుశ్చరంబైన బ్రహ్మచర్యంబు చరియించె రెండవ మారు జగజ్జననంబు కొఱకు రసాతలగతయైన భూమినెత్తుచు, యజ్ఞేశుండై వరాహదేహంబు దాల్చె, మూడవ తోయంబున నారదుండను దేవఋషియై కర్మనిర్మోచకంబైన వైష్ణవతంత్రంబు చెప్పె నాలుగవపరి ధర్మభార్యా సర్గంబునందు నరనారాయణాభిధానుండై దుశ్చరంబైన తపంబు చేసె పంచమావతారంబునం గపిలుండను సిద్ధేశుండై యాసురియను బ్రాహ్మణు నకు తత్త్వగ్రామ నిర్ణయంబుగల సాంఖ్యంబు నుపదేశించె నాఱవ శరీరం బున ననసూయా దేవియందు నత్రిమహామునికిం గుమారుండై యలర్కునికి ప్రహ్లాదముఖ్యులకు నాత్మవిద్య దెలిపె, నేడవ విగ్రహంబున నాకూతియందు రుచికి జన్మించి, యజ్ఞుండన ప్రకాశమానుండై యామాది దేవతలతోడం గూడ స్వాయంభువ మన్వంతరంబు రక్షించె అష్టమమూర్తిని మేరుదేవి యందు నాభికి జన్మించి, యురుక్రముండనం బ్రసిద్ధుండై విద్వజ్జనులకు పరమహంస మార్గంబు ప్రకటించె, ఋషులచేత కోరంబడి, తొమ్మిదవ

జన్మంబున పృధుచక్రవర్తియై భూమిని ధేనువుంజేసి, సమస్త వస్తువులం బితికె చాక్షుషమన్వంతర సంప్లవంబున దశమంబైన మీనావతారంబు నొంది మహీరూపంబగు నావనెక్కించి వైవస్వతమనువు నుద్ధరించె, సముద్రమధన కాలంబునం బదునొకండవ మారు కమఠాకృతిని మందరాచలంబు తన పృష్ట కర్పరంబున నేర్పరియై నిలిపె ధన్వంతరి యన పండ్రెండవ తనువున సురాసుర మధ్యమాన క్షీరపాథోధి మధ్యభాగంబున నమృత కలశహస్తుండై వెడలె బదుమూడవదియైన మోహినీ వేషంబున సురా సురుల మోహితులం జేసి, సురల నమృతాహారులం గావించె పదునాలుగవదైన నరసింహరూపం బునన్ గనకకశిపుని సంహరించె, పదునేనవదియైన కపట వామనావతారం బున బలిని పదత్రయంబు యాచించి, మూడులోకంబుల నాక్రమించె బదునారవదియైన భార్గవ రామాకృతిని కుపితభావంబు దాల్చి బ్రాహ్మణ ద్రోహులైన రాజుల నిరువది యొక్కమారు వధియించి, భూమి నిఃక్షత్రంబు గావించె పదునేడవదియైన వ్యాసగాత్రంబున అల్పమతులైన పురుషులం గరుణించి వేదవృక్షంబునకు శాఖలేర్పరచె పదునెనిమిదవదైన రామాభిధా నంబున దేవకార్యార్థంబు రాజత్వంబునొంది, సముద్రనిగ్రహాది పరాక్రమంబు లాచరించె ఏకోనవింశతి వింశతి తమంబులైన రామకృష్ణ రూపంబులచే యదువంశంబునందు సంభవించి, విశ్వంభరాభారంబు నివారించె నేకవింశతి తమంబైన బుద్ధ నామధేయంబునన్ గలియుగా ద్యవసరంబున రాక్షస సమ్మోహంబు కొఱకు మధ్యగయాప్రదేశంబున జినసు తుండై తేజరిల్లు యుగసంధియందు వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరింప విష్ణుయశుండను విప్రునికిం గల్కియను పేర నుద్భవింప గలం డని ఇట్లనియె

పూర్వపక్షి - పదునెనిమిది అక్షౌహిణీసైన్యములను నశింపచేయుట హింసాత్మకము గాక, ఎట్లు అహింస యగును?

ఉత్తరము - అమరకోశక్షత్రియ వర్గమున అక్షౌహిణి సంఖ్య నిర్ణయించడమైనది అదంతయు వ్రాసిన వ్యాసము పెరుగునని తలంచి

మానివేయడమైనది అమరకోశమున చూచుకొనవచ్చును 18 అక్షౌహిణులకు మొత్తము కాల్బలము అనగా సైన్యము పందొమ్మిది లక్షల అరువది ఎనిమిదివేల మూడు వందలు (1968300) ఇప్పుడు భారతదేశమున నలభై కోట్ల జనులున్నారు ఈ ప్రకారము లెక్క వేసిన పందొమ్మిది లక్షల అరువది ఎనిమిది వేల మూడువందల సైన్యముండుట అంత గొప్పతనము కాదు అదిన్నీగాక, వారు యుద్ధమునకై వచ్చిన సైన్యములేగాని నిరపరాధు లగు మానవులు కారు అందువల్ల అది గొప్ప హింస కాజాలదు, అహింసను స్థాపించుట కొరకు ధర్మబద్ధమగు యుద్ధములో గల హింస హింసకాదని ఇదివరలో తెలుపడమైనది? భగవంతుడు కరుణాస్వరూపుడు, దయా సముద్రుడు కానిచో భక్తులు, యోగులు, మునివరేణ్యులు పరమాత్మను దయాస్వరూపుడని గాని, కరుణాసముద్రుడనిగాని ప్రార్థింపజాలరు కావున భగవద్గీత అహింసను ఉపదేశించినదేగాని, హింసను బోధించినది గాదు గీతలో హింసను గురించి ఒక వాక్యము కూడా లేదు అహింసను గురించి ఎన్ని వాక్యములు గలవో చూడుడు

**"అహింసా సమతా తుష్టిః"** **(10 - 5)**

**"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ"** **(12 - 13)**

**"అమానిత్వమదంభిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్'** **(13 - 8)**

**"అహింసా సత్యమక్రోధం"** **(16 - 2)**

**"బ్రహ్మచర్య మహింసా చ'** **(17 - 14)**

ఇకను ఇలాటి పదములు అచ్చటచ్చట ఎన్నియో కలవు గీత హింసను తెలుపునదైనచో, పరమ పావన పుణ్యమూర్తులగు సాధువులు, పరమభక్తులు, సన్యాసులు మునులు, బ్రాహ్మణులు మొదలగు వారలు గీతను చేతితో ముట్టుదురా? గీత హింసను బోధించునదైనచో, దానిని పారాయణ చేయు వారికి శాన్తి కలుగునా? సహనము సిద్ధించునా ? కావున గీత కరుణారస పూరిత అహింసాత్మక గ్రంధమని విజ్ఞులు గ్రహింతురు గాక! పరమభక్తులు

నమ్ముదురుగాక గీత అ.6 15 చూడుడి!

**యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ నియత మానసః ।**
**శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి॥**

మనోనియమముగల యోగి ఎల్లప్పుడాత్మను పరమాత్మ యందైక్య పరచి, ధ్యానించెడు అలవాటుగలవాడై, బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమే అంత్యముగా గలదియు, నాయందుండు నట్టిదియునగు ప్రకృతి శమించిన పరమ శాంతియగు నిర్వాణమును పొందుచున్నాడు



# సంస్కారాద్ద్విజ ఉచ్యతే

ద్విజుడనగా రెండవ జన్మకలవాడనియు, లేక రెండు జన్మములు కలవాడనియు అర్థము మాతృ గర్భమునుండి పుట్టుట ఒక జన్మము మరల సంస్కారముచే ఏర్పడినది మరియొక జన్మము గురుకులమునకు వెళ్ళిన విద్యార్థులు గాని, విద్యార్థినులు గాని, లేక మహాత్ములుండు మఠమునకు గాని ఆశ్రమమునకుగాని వెళ్ళిన ముముక్షువులగు స్త్రీ పురుషులు సంస్కారము చేత జన్మము మారినవారుగా, అనగా రెండవ జన్మము గల వారుగా నుండవలెను పాత బండిని రిపేరు చేయు శిల్పుల శాలకు పంపి, రిపేరైన బండిని చూచి, లోకము ఇది క్రొత్తబండిగా ఉన్నట్లుండునని ఎట్లు చెప్పుదురో, ఆలాగున గురుకులమునకు వెళ్ళిన వారిని చూచి, గురుకుల, మఠ, ఆశ్రమములకు వెళ్ళి వచ్చిన వారిని చూచి, ఇతని జన్మమే మారిపోయినది ఆశిల్పి ఎంత సమర్థుడు! అని చెప్పే లాగున నుండవలెను అయితే, పాత బండిని రిపేరు చేయునప్పుడు పాతబడిన సామానులు కొన్నిటిని తీసివేసి, క్రొత్త సామానులను అమర్చవలసియుండును అంతేకాదు బండి, పట్టా, ఇరుసు, శీలలు విరిగి పోయియుండిన, లేక వంకరపోయియుండిన ఆ సామానులు కొలిమిలో పెట్టి కాల్చి, అతుకవలసి యుండును వంకరపోయి

యుండిన కొలిమిలో కాల్చి, సుత్తితో కొట్టి చక్కపరచవలసియుండును ఆలాగున గురుకుల, ఆశ్రమాదులకు వెళ్ళుటకు ముందుగా పాత స్వభావమగు చెడుగుణములుండిన, వానిని త్యజించి అట్టి స్థానములలో మంచి స్వభావమును, మంచిగుణములను, అనుష్ఠానములో నుంచవలెను పూర్వముండిన కోపము, అసత్యభాషణము, దొంగతనము, సోమరితనము, అజాగ్రత్త, అశ్రద్ధ మొదలగు దుష్టస్వభావములను హృదయమునుండి తొల గించి శాంతము, కరుణ, విరక్తి, సత్యము, శ్రద్ధ, ఉత్సాహము, అధ్యయనము, పరోపకారము, వైరాగ్యము, యోగము మొదలగు ఉత్తమగుణముల నలవరచు కొనవలయును అంతేగాక, గురుశిక్షణ, ఉపవాసము, తపస్సు మొదలగు పరమ ఋషుల వర్తనములో తనమనస్సును ఐక్య పరచుకొన వలయును పాతసామానును అట్లే ఉంచిన, బండి ఏలాగున నూతనముగా తయారు కాజాలదో, ఆలాగున గురుకులాదులకు వెళ్ళినను తన స్వభావమును మార్పు చేయకపోయినచో ప్రయోజనమేమి? పూర్వ కాలము ఒకే జన్మములోనే మనుజుడు నాలుగు జన్మములుగా మారెడు అనుష్ఠానము లుండెను

**జన్మనా జాయతే శూద్రః సంస్కారాద్ద్విజ ఉచ్యతే ।**
**వేదపాఠేన విప్రస్స్యాత్ బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః ॥**

పుట్టుకలో శూద్రావస్థలో నుండును శూద్ర శబ్దమునకు అర్థమేమనగా శౌచాచారములు లేనివాడని భావము తరువాత సంస్కారముచేత ద్విజుడగు చున్నాడు అనగా రెండవ జన్మము కలవాడగుచున్నాడు సంస్కారమన ఉపనయన, గాయత్రీ, జపాధ్యయనములగును తరువాత వేదాధ్యయన, బ్రహ్మచర్య, తపస్సులచే విప్రుడగుచున్నాడు అనగా శ్రేష్ఠుడగుచున్నాడని భావము తరువాత బ్రహ్మజ్ఞానము కలుగునప్పుడు బ్రాహ్మణుడుగా మారుచుండును ఇదే నిజముగా మానవునియొక్క పరమావస్థ యని గ్రహించవలయును పూర్వకాలము సంస్కారాదులచే మనుజు డీలాగుననే పరిణామము పొందుచుండెను ఇప్పుడు గూడా, ఆర్యసమాజములో ఈపద్ధతి

కలదు వేదమందు ఇట్టి ప్రమాణముండుట వల్లనే దయానందసరస్వతీ స్వాములవారు ఇట్టి పద్ధతి నవలంబించిరి ఆర్యుల కాలమున పైచెప్పిన విధముగా ఒకే జన్మములోనే సంస్కారమువల్ల నాలుగు జన్మములుగా మారు చుండెను ఓహో! ఎంత పవిత్రమైన పద్ధతి ఆలాగున నుండినచో ఈ జనులందరు ఎంత పావనాత్ములై ఒకే జన్మములోనే మోక్షమును పొందియుందురుగదా! లోకము ఎంత ఉచ్చస్థానములో చేరి యుండును? అట్లు లేకపోవుటచేతనే భారతదేశము మహమ్మదీయుల యొక్కయు, ఇంగ్లీషువారి యొక్కయు ఆక్రమణమునకు లోబడి, పతితమగుటకు కారణ మైనది దైవకృపచేతను, పరమఋషుల కరుణచేతను మరల మనకు స్వరాజ్యము వచ్చెను పైజెప్పిన విధముగా గురుకుల సంస్కారము ఏర్పడినచో, పూర్వకాలపు ఆర్యులయొక్క ఉచ్చస్థానమును పొందగలము సంస్కార విషయమై శ్రీ శంకరభగవత్పాదులు తెలిపినది చూడుడు

**శ్రద్ధాభక్తిభృతాం విశేష విదుషాం శిక్షావతాం యోగినాం**
**మిథ్యావస్తుని వస్తుతాం విజహతాం త్యాగే గతే గాఢతామ్ ।**
**సత్యే సత్యతయా స్ఫురత్యవిరతం చిత్తే చమత్కారిణి**
**స్వైరం స్ఫూర్జతి నిర్వికల్ప పరమానందస్వరూపో హరిః ॥**

ఎవరికైతే గురువచనములలోను, మరియు వేదాంత వాక్యములలోను సంపూర్ణ శ్రద్ధ యున్నదో, సర్వాంతర్యామియైన ఆ సర్వేశ్వరునియందు ఎవరికైతే అనన్య భక్తి యున్నదో, ఎవరైతే అనాత్మరూప నిరోధన చింతనతో యోగాభ్యాసము చేయుదురో, ఎవరైతే బాహ్యపదార్థములను నిజమను కొనరో, ఎవరి త్యాగమయితే పరపక్వమైనదో, ఎవరి చిత్తములో శాంతము మరియు ఏకాగ్రబ్రహ్మాత్మతత్త్వమే ఎల్లప్పుడు పరమాత్మ సత్యరూపములో వ్యక్తమగునో వారి పరిశుద్ధ తన్మయ చిత్తములో నిర్వికల్ప పరమానంద స్వరూపుడైన శ్రీహరి సదా స్వచ్ఛందరూపముతో విహరించుచుండును

రెండవ జన్మమునకు మరియొక అర్థము కలదు తల్లిదండ్రులచేత ఏర్పడినది, జడమైనది ఈ స్థూలదేహము గురుదేవుండు ఆత్మానాత్మ

విచారణ చేయించి, దేహములో గల దేహియగు ఆత్మను దైవస్వరూపముగా ఉపదేశించి, "తత్త్వమసి" మహా వాక్యములు ప్రబోధ మొనర్చుట రెండవ జన్మమగును "తత్త్వమసి" అనగా అదే నీవు, ఈ దేహేంద్రియ మనోబుద్ధు లకు సాక్షియైయుండు ఆత్మయే, బ్రహ్మమే నీవని ఉపదేశించుట యగును "తత్, త్వం, అసి" అదే నీవు గాని ఈ దేహేంద్రియ మనోబుద్ధులు కావని అర్థము ఈ విషయమందు మనుస్మృతి ఉపదేశించిన మహావాక్యములు చూడుడు ఇదే సంస్కార లక్షణమగును

**ఉత్పాదక బ్రహ్మదాత్రోర్గరీయాన్ బ్రహ్మదః పితా ।**
**బ్రహ్మజన్మ హి విప్రస్యప్రేత్య చేహ చ శాశ్వతమ్ ॥**

పుత్రునికి వేదగ్రహణార్థమై జ్ఞానరూపమైన రెండవ జన్మనొసంగు ఆచార్యుడు తండ్రికంటె శ్రేష్ఠుడు బ్రహ్మగ్రహణార్థమైన జన్మము బ్రహ్మ ప్రాప్తిఫలమైనందున ఇహపరముల రెండింటియందును నిత్యమైనది దేహమును జనింపజేయుటలో తండ్రి కారకుడు, దేహములో నుండు దేహియగు నాత్మను జనింపజేయుటలో, ఆత్మజ్ఞానమును కలిగించుటలో ఆచార్యుడు కారకుడు అట్టి ఆత్మజ్ఞానము ఇహమందును, పరమందును సుఖమును కలుగజేయును కావున తల్లిదండ్రులకన్న గురుదేవుడు అధికు డని చెప్పుటయయినది తల్లిదండ్రులు ఈ స్థూలదేహము నొసంగిన వారలు అది నశించును గురుదేవుడో, ఈ దేహములోగల "దేహి"ని అనగా ఆత్మను దైవరూపముగా ఉపదేశము నొసంగినవారు అది శాశ్వతము, అమృతము, శివము కావుననే మాతాపితరుల కన్న గురుదేవు డధికుడని తెల్పుడమైనది సర్వజంతువులున్ను, జన్మించుటలో సమానములు ఇది మొదటి జన్మమన బడును అట్టి జన్మములో నుండు ఆత్మజ్ఞానమును జనింపజేయుటలో గురుడు కారణుడు అట్టి రెండవ జన్మముగలవాడే 'ద్విజు' డనబడును ద్విజుడనగా రెండవ జన్మము గలవాడని అర్థము ఇట్టి రెండవ జన్మము గలవాడు ద్విజులలో జన్మింపక పోయినను ద్విజుడే అట్టి రెండవజన్మము పొందనివాడు ద్విజులలో జన్మించినను ద్విజుడు కాజాలడు

ఇక సంస్కారమును గురించి యోగవాసిష్ఠమున వసిష్ఠ మునీంద్రు డుపదేశించినది చూడుడు

**యథైకం చ సువర్ణాది మిళితం రజతాదినా।**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవో౽ప్యహంయుతః ॥**
**యథైవ హి సువర్ణాది క్షారాదేః శోధితం శుభమ్ ।**
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవో౽పి సంస్కృతేః ॥**

ఏలాగున అపరంజి బంగారమును సువర్ణకారుడు ఆభరణములుగా చేయునప్పుడు వెండి, రాగి మొదలగు లోహములను చేర్చుటవల్ల అది తెల్ల బంగారమై తక్కువ వెల గలదగుచున్నదో, ఆలాగున ఈ జీవుడు కేవలము ఈశ్వరస్వరూపుడై యున్నప్పటికిని అహంకార మమకారాది రాగద్వేషములతో ప్రకృతి విషయములతో కూడి జీవభావమును పొందుచున్నాడు అట్లైనను ఆ మలిన బంగారమును మరల స్ఫుటము చేయునపుడు చెడులోహములు వదలి పోయి ఎట్లు అపరంజి బంగారమగుచున్నదో, ఆలాగున ఆత్మసంస్కారము చేత ప్రాకృతగుణములు నశించునప్పుడు ఈ జీవుడు గూడా శివుడగుచున్నాడు ఇదే సంస్కారముయొక్క ప్రయోజనము ఇట్టి సంస్కారము పొందనివాడు గురుకులములో నుండినను, గురుస్థానములో నుండినను ఏమి ప్రయోజనము? ఆహా! ఎటువంటి ఉపదేశము దీనికన్న ముముక్షువులకు ఇక ఏమి ఉపదేశము కావలెను? శ్రీశంకర భగవత్పాదు లుపదేశించినది చూడుడు (వేదాంతడిండిమము)

**ద్విజత్వం విధ్యనుష్ఠానాత్ విప్రత్వం వేదపారతః ।**
**బ్రాహ్మణ్యం బ్రహ్మవిజ్ఞానాదితి వేదాంతడిండిమః ॥**

విధిని, శాస్త్రము నియమించిన దానిని అనుష్ఠించుట చేత మానవుడు ద్విజుడగుచున్నాడు వేదపఠనము చేత విప్రుడగుచున్నాడు, బ్రహ్మజ్ఞానము చేత బ్రాహ్మణు డగుచున్నాడు అని వేదాంత భేరి మ్రోగుచున్నది ఆహా! ఎటువంటి యుపదేశము!

ఇటువంటి సత్యము తెలిసికొనక పోవుటయే గదా మానవులు ఉన్నతస్థితికి రాకపోవుటకు కారణము! పాతబండి రిపేరు చేయునప్పుడు పాత సామానులు కొన్నిటిని తీసివేసి క్రొత్తసామానులు కొన్నింటిని చేర్చవలసి యుండునని మొదటనే నిరూపించిన దానికి క్రొత్తసామానులెవ్వి? ప్రాతబడిన సామానులెవ్వి? ఈవిషయమై శ్రీకృష్ణ భగవానులు 13వ అధ్యాయమున 8వ శ్లోకమునుండి 12వ శ్లోకము వరకు ఉపదేశించినది గ్రహించుకొనుడు దీనికి “జ్ఞాన” మని శ్రీభగవానుడే నామకరణము చేసెను ఇచ్చట సంగ్రహముగా నిరూపింపబడును లేనిచో వ్యాసము పెరుగును గీతలో మీరు చూచుకొనవచ్చును

**అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్ ।**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥**

**ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।**
**జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥**

**అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు॥**

**మయి చానన్యయోగేన భ క్తిరవ్యభిచారిణీ ।**
**వివి క్తదేశసేవిత్వ మరతిర్జనసంసది ॥**

**అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।**
**ఏతద్జ్ఞాన మితిప్రో క్త మజ్ఞానం యదతోఽ న్యథా ॥**

1. అమానిత్వం = ఆత్మస్తుతి లేకుండుట, 2 అదంభిత్వం = డంబా చారము లేకుండుట, 3 అహింసా = పరప్రాణులను బాధింప కుండుట, 4 క్షాంతిః = సహనము కలిగి యుండుట, 5 ఆర్జవం = ఋజు స్వభావము కలిగియుండుట 6 ఆచార్యోపాసనం = గురుసేవాపరుడై యుండుట, 7 శౌచం = బాహ్యాభ్యంతర శుద్ధి గలిగియుండుట, 8 స్థైర్యం = స్థిరబుద్ధిత్వము గలిగియుండుట 9 ఆత్మవినిగ్రహః = మనోనిగ్రహము

గలిగియుండుట, 10 ఇంద్రియార్థేషు వైరాగ్యం = ఇంద్రియవిషయములందు విరక్తి గలిగియుండుట, 11 అనహంకార ఏవచ = అహంకారము లేకుండుట, 12 జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ = జననము, మరణము, జరా, వ్యాధులచే గలిగెడు దఃఖమున్ను, దోషము నెరుంగుట, 13 అసక్తిః = ఏ వస్తువులయందును ఆసక్తి లేకుండుట, 14 పుత్రదారగృహాదిషు = ఆలుబిడ్డలు, ఇండ్లు మొదలగువానియందు, అనభిష్వంగః = తగులని మనస్సు గలవాడై యుండుట, 15 నిత్యం = ఎల్లప్పుడును, ఇష్టానిష్టోప పత్తిషు = ఇష్టానిష్టములయందు, సమచిత్తత్వం చ = సమబుద్ధి గలిగియుండుట, 16 మయి = నాయందు, అనన్యయోగేన = నాకంటె ఇతర మగు దేనియందును మనస్సును చేర్చనివాడై, అవ్యభిచారిణీ = ఎట్టి విపత్తులలో గూడా చలించని, భక్తిఃచ = భక్తికలిగి యుండుట, 17 వివి క్తదేశసేవిత్వం = విజనస్థలములయందుండ గోరుట, 18 జనసంసది = జనసమూహమునందు, అరతిః = ప్రీతిలేకుండుట, 19 అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం = సదా ఆత్మధ్యానమునందు మనస్సును నిలుపుటయు, 20 తత్త్వజ్ఞానార్థదర్శనమ్ = తత్త్వజ్ఞానమువలన కలిగెడు మహాప్రయోజనము ఇట్టిదని యెరుంగుటయు, ఏతత్ = ఇది, జ్ఞానం ఇతి = జ్ఞానమని, ప్రోక్తం = చెప్పబడినది, అతః అన్యథా యత్ = దీనికి వేరైనదేది గలదో, అది, అజ్ఞానం= అజ్ఞాన మనబడుచున్నది ఈ ఇరవైయున్నూ ముముక్షువులు సంపాదింప దగినవి వీనికి అన్యమైన ప్రాకృత విషయములు అజ్ఞానమని గ్రహించు కొనవలయును ఇదే క్రొత్తబండికి కావలసిన హేయాదేయములైన సామాను లని గ్రహించుకొనవలయును ఇదిఎట్లు త్యజించవలయునో, ఏలాగున గ్రహించవలెనో కఠోపనిషత్తున యమధర్మరాజు తెలిపినది చూడుడు

**మూ॥ అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా**
**సదా జనానాం హృదయే సన్నివిష్టః ।**
**తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముంజాదివేషీకాం ధైర్యేణ**
**తం విద్యాచ్ఛుక్రమమృతం తం విద్యాచ్ఛుక్రమమృతమితి ॥**

ఓ నచికేతసుడా! జనుడు తన సంబంధమగు హృదయ మందుండు అంగుష్ఠమా త్రమైన పురుష స్వరూపమగు నంతరాత్మను, శ్రేష్ఠమగు జ్ఞానము చేత తన శరీరమునుండి ముంజగడ్డివలన దాని ఈనెనువలెనే వేరుపరచి, ఆయంతరాత్మను పరిశుద్ధమగు బ్రహ్మస్వరూపముగా తెలిసికొనవలెనని యము డుపదేశించెను ముంజగడ్డియనగా దర్భయగును ఉపనయన కాలమున మౌంజీబంధనము కొరకు దర్భయొక్క పొరలను తీసివేసి, మధ్యనుండు ఈనెలు తీసి త్రాడుగా పేనుదురు దీనికే మౌంజీబంధనమని పేరు ఈ విషయమై ఆత్మబోధలో శంకర భగవత్పాదులు తెలిపినది చూడుడు ఈస్థితిని పొందుటయే రెండవ జన్మమనంబడును

**వపుస్తుషాదిభిః కోశైర్యు క్తం యుక్త్యవఘాతతః ।**
**ఆత్మాన మాంతరం శుద్ధం వివిచ్యాత్తండులం యథా ॥**

లోకములో జనులు వడ్లు మొదలగు ధాన్యములనుండి బియ్యమును గ్రహించుటకు దంచడము చేత పొట్టు, తవుడు మొదలగు వానిని వేరుపరచి తెలిసికొనెడి ప్రకారముగానే పంచకోశములవలెనే తోచు ఆత్మను శ్రవణ మనననిదిధ్యాసనములచేత శోధించి, వీనికంటె విలక్షణుడైన సత్యజ్ఞానానంద స్వరూపుడై యుండు ఆత్మ తానే యని తెలిసికొనవలయును ఇదే సంస్కా రము యొక్క లక్షణము



# గీతాబోధ

శ్రీభగవద్గీత చెప్పినట్లు మానవజీవితమంతయు నిష్కామ కర్మ యోగముతో గడపుటయే శ్రీకృష్ణమతమని కొందరు వాదించుదురు అట్టి భావము కూడా గీతలో లేదని చెప్పుటకు లేదు నిష్కామ కర్మయోగమువల్ల అంతఃకరణశుద్ధి గలిగి జ్ఞేయైక స్వరూపమగు ఆత్మలో, దైవములో, బ్రహ్మములో నిలుకడ గలుగువరకు ఆవాదమునకు బలమున్నా,

ప్రాణమున్నూ గలదు కొందరి సంస్కారము ఎల్లప్పుడును ఆలాగుననే యుండేలాగున కూడా ఉండును కాని అది సత్యమని మాత్రము నమ్ముటకు లేదు శ్రీకృష్ణభగవానుడు కురుక్షేత్రములో అర్జునుని కుపదేశించిన వాక్యము లన్నియు యమునాద్వీపములో నుండు వేదవ్యాస మహర్షి ఛందోబద్ధముగా అనగా శ్లోకరూపముగా పదునెనిమిది అధ్యాయములతో కూడిన మహత్తర మగు, పరమ పావనమగు గీతాశాస్త్రముగా రచించిరి జీవితాంతమువరకు నిష్కామ కర్మయోగమునే చేయవలెనని శ్రీకృష్ణాశయమైనచో, తనకుమారు డున్నూ, శిష్యుడున్నూ అగు శుకబ్రహ్మఋషి కేవలము తపోరూపమగు జ్ఞానము నుపదేశించుటకు కారణమేమి? వేదాంత శాస్త్రమంతటియొక్క ప్రాణము ఆజ్ఞేయైక బ్రహ్మమును పొందుటయేయగును అట్టి స్థితిని పొందని జ్ఞానము గలవారి జన్మము ప్రాణములేని శరీరము వంటిదని గ్రహించు కొనవలయును ఈసత్యమును శ్రీభగవానుడు హృదయములో నుంచుకొని, జనబాహుళ్యములో విషయవిరక్తి గలిగి అంతఃకరణ శుద్ధి ఏర్పడియుండు తీవ్రముముక్షువులు తక్కువగా నుంటున్నారని గ్రహించి, అట్టివారు నిర్మల హృదయులగుటకున్ను, విషయవిరక్తులు కావలెనను తలంపుతోను నిష్కామ కర్మ యోగమును బహుళముగా ఉపదేశించి, విషయవిరక్తియు, అంతఃకరణ శుద్ధియు గల వైరాగ్య జీవులకు జ్ఞానతత్త్వమును అచ్చటచ్చట ఉపదేశించుచు వెళ్లెను అట్టి వాక్యములు గీతలో కొద్దిగానే యుండును వానిని ద్వితీయా ధ్యాయమున స్థితప్రజ్ఞుని లక్షణములో భగవానుడు కుమ్మరించెను తీవ్ర ముముక్షుత్వముగల జీవులు ఆ శ్లోకములను రోజు పారాయణములో నుంచి అనుష్ఠించవలయును శ్రీగాంధీగారికి ఇది యెంతయో ముఖ్యతమమైనది వారు దీనిని ప్రత్యేకముగా ఒక చిన్న పొత్తముగా తయారుచేసి తన అంతే వాసులకు తెలుపుచుండేవారు దానిలో ఒక శ్లోకమును మాత్రము ఇచట మచ్చునకు తెలిపెద

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥**

ప్రాణులన్నిటికిని నేది రాత్రి యగునో, దానిలో ఇంద్రియము లణగిన యోగియైనవాడు మేలుకొనియున్నాడు, దేనిలో ప్రాణులు మేలుకొనియు న్నవో, అది పరమార్థతత్త్వమును చూచుచున్నవాడైన మునికి రాత్రివంటిది యగును

సూక్ష్మమగు ఆత్మ తత్త్వోపదేశమంతయు ఈలాగున గూఢము గానేయుండును ఇచట తలక్రిందుగా అర్థము చెప్పడమైనది అజ్ఞాన స్థితిలో నుండు జీవులకు ఏది పగలో, పరబ్రహ్మ తత్త్వమును చూచుచుండు యోగికి అది రాత్రిగానే యుండును పరమార్థతత్త్వమగు పరబ్రహ్మమును ఏ యోగులు చూచుచుందురో, అజ్ఞానస్థితిలోనుండు జీవులకు అది రాత్రి వంటి దేయగును అజ్ఞానమును రాత్రిగాను జ్ఞానమును పగలుగాను శాస్త్రము వర్ణించడమైనది ఓహో! ఎంత రహస్యోపదేశము? ఒక్కరికి పగలుగా నున్నది ఇంకొకరికి రాత్రిగాను, ఒక్కరికి రాత్రిగా నుండునది మరియొకరికి పగలుగాను ఇచట వర్ణించడమైనది ఈ సత్యమును, ఈ పరమ రహస్యో పదేశమును తెలిసికొనిన ఒక్కరు చేయు పనిని చూచిన ఇతడు అజ్ఞానస్థితి యగు రాత్రిలో నుండేవాడా? లేక జ్ఞానస్థితియగు పగలులో నుండేవాడా? తెలిసికొనుటకు అవకాశము గలదు అజ్ఞానస్థితిలో నుండువారు ఇంద్రియ సౌఖ్యములగు విషయము లనుభవించుకొని, దాని వృద్ధికొరకు పనిచేయుచుం దురు జ్ఞానైకస్థితిలో నుండువారు విషయములను విషముగా తలంచి, జ్ఞానా మృతము ననుభవించి, దాని అభివృద్ధికొరకే నిరంతరము ప్రయత్నించు చుందురు ఇదే దీనిలో గల రహస్యము కావున నివృత్తి మార్గస్థులగు విరక్తు లైన జ్ఞానులు మనోవాక్కాయకర్మలచే నిరంతరము జ్ఞానాభివృద్ధికి కారణము లగు కార్యములనే చేయుచుందురు చెప్పుచుందురు ఆలాగున విషయ సుఖము ననుభవించెడు అజ్ఞాన స్థితిలో నుండువారు ఆ ప్రపంచ సుఖము కొరకే పని చేయుచుందురు వచించుచుందురు ఇది ప్రత్యక్షానుభవముచేత కనుగొనవచ్చును ఈవిషయమై పతంజలి మహర్షి యోగశాస్త్రమునందు వచించినది చూడుడు

**సూ॥ అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతి రవిద్యా ॥**

అనిత్యవస్తువును నిత్యవస్తువుగాను, అశుచివస్తువును శుచిత్వము గాను, దుఃఖవస్తువులను సుఖమని అనుకొనుటయు, అనాత్మవస్తువుల నాత్మ వస్తువులుగా తెలిసికొనుటయు ఏది గలదో అది అవిద్య యనబడును దీనికి అజ్ఞానమనియు, మాయయనియు, భ్రమజ్ఞానమనియు పేరులు అనిత్యము లగు దేహేంద్రియాది వస్తువులను నిత్యవస్తువులుగా తెలిసికొనుటయు, నిత్యమైన ఆత్మను తెలిసికొనకపోవుటయు, అశుచియైన దేహాదులను శుచిగా భ్రమించుటయు, దుఃఖకరమగు విషయ సుఖములను సుఖకరముగా తలంచుటయు, అనాత్మయైన దేహాదులను ఆత్మయని తెలిసి కొనుటయు, ఆత్మయగు తన దైవత్వమును తెలిసికొనక పోవుటయు అవిద్యా ప్రభావమని గ్రహించేది ఇదే మాయయొక్క స్వభావము కావుననే గీతాచార్యుండు

**అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా ।**
**సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ ॥**

ఓ అర్జునా! ఏ బుద్ధి అజ్ఞానముచేత కప్పబడి అధర్మమును ధర్మ మనియు, ధర్మమును అధర్మమనియు, సకల వస్తువులను విపరీతములు గను, తలంచుచున్నదో, ఆబుద్ధి తామసమైనది

జ్వరాది రోగము కలవారికి రుచియైన పదార్థములు అరుచిగా గోచరించును ఇది ప్రత్యక్షానుభవము సర్పవిషము ఎక్కినవారికి కారమైన మిరియాలు చప్పగాను, ఉప్పదనము గల ఉప్పు చప్పనగాను, చేదైనవేపాకు తీపిగాను నుండును ఇదే విపరీతమని గ్రహించేది ఔషధసేవచే రోగము శమించి రాగా రాగా రుచికరమైన పదార్థములు రుచిగా గోచరించును ఆలాగున మంత్రౌషధములచే విషము తగ్గునప్పుడు మిరియాలు కారము గాను, ఉప్పు ఉప్పదనముగాను, వేపాకు చేదుగాను ఉండును ఇదే దానికి దృష్టాంతము కావుననే వైద్యులు రోగిని పదార్థములు రుచిగా నుంటున్నవా? అని అడుగుదురు విషవైద్యులు, పాము మంత్రకార్లు మంత్రించుచు

మిరియాలు నమలుమని చెప్పుదురు మిరియాలు కారముగా నుండున నియు, లవణము ఉప్పగా నుండుననియు, వేపాకు చేదుగా నుండుననియు చెప్పుచుండిన సర్పవిషము తగ్గిపోయినదని గ్రహించుకొనెదరు ఆలాగున అజ్ఞానమనెడు విషము తలకెక్కిన వారికి పుణ్యకర్మయందు ప్రీతి ఉండదు పాపకర్మయందే ప్రీతి యుండును అదే దానికి గుర్తు దైవకృపచేతను, ఏదో తెలిసిగాని, తెలియకగాని చేసిన పుణ్యవిశేషముచేతను పాపము నశించు నప్పుడు అతనికి పుణ్య విషయమునందు ప్రీతి జనించును ఇదే దానికి గుర్తు

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యంతవంతః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥**

ఇంద్రియ విషయ సంబంధమువలన కలుగు భోగములు ఏవియో, అవి ఇహమునందును, పరమునందును దుఃఖమునకే కారణములు, ఆద్యంతములు గలవి ఓ అర్జునా! జ్ఞాని (యధార్ధమెరిగిన వివేకి) వాటిలో రమించుట లేదు

విషయ సుఖము మొదట సుఖముగా కనుపించి, మరల దుఃఖమునే కలుగజేయును కావుననే "దుఃఖయోనయః" అని ప్రయోగించిరి మరియు "ఆద్యంతవంతః" ఆద్యన్తములతో కూడినది అనగా శాశ్వతమైనది కాదు, కావున బుద్ధి శుద్ధము కలిగిన వివేక జ్ఞానులు పైజెప్పిన రెండు దోషములు గల విషయములలో ప్రవర్తించరు అదే వివేక జ్ఞానము గల దానికి గుర్తు మాంసఖండమందుగాని, ఎర్రయందుగాని గాలమునుంచి జాలరివాడు మత్స్యమును పట్టును బైట చేపలకు రుచికరమగు మాంసము, ఎర్రలు ఉండినను లోపల గాలము కలదను జ్ఞానము కలిగిన దానిని తినునా? తెలియనందుచే మ్రింగుచున్నది జాలరివాడు పట్టి చంపుచుం డును ఆలాగున ఎలుకలు పట్టెడు బోనులో మంచివాసన గల, రుచిగల వడలను గారెలనుగాని, ఇక రుచికరమైన, సువాసనగల పదార్థములనుగాని పెట్టియుందురు అది తినవలెనను అభిలాషతో ఎలుకలు ప్రవేశించును బోను మూతపడి పోవును

దానిలో పడిన ఎలుకలను బోనుపెట్టినవాడు చంపివేయును ఇట్టి వివేక జ్ఞానము మూషికములు కలిగియుండిన బోనులో ప్రవేశింపవుగదా! కావున దీర్ఘాలోచనయు, వివేక జ్ఞానమున్నూ లేని మానవులు ఒక్కొక్క విషయములో ప్రవేశించి ఎన్నెన్ని దుఃఖములకు కారణ భూతులగు చున్నారో, మరణము గూడా సంభవించుచున్నదో ఇది అందరికిన్నీ తెలిసిన విషయమే, ఇదంతయు మాయయొక్క ప్రభావము

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మ యోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥**

బ్రహ్మనిష్ఠుడైనవాడు శబ్దాది బాహ్యవిషయములలో ఆసక్తిలేని అంతః కరణము గలవాడై, ఆత్మయెడ ఏసుఖము కలదో, అట్టి అక్షయమగు సుఖమును పొందుచున్నాడు, అతడు బ్రహ్మధ్యాన నిష్ఠాసమాధితో కూడిన హృదయము కలవాడై, నిరతిశయానంద బ్రహ్మసుఖమును పొందుచున్నాడు

విషయ సుఖములను అనుభవించు వారియొక్కయు, నిర్విషయ మగు బ్రహ్మసుఖము ననుభవించు వారియొక్కయు స్థితి ఈలాగున నుండును

**విషయేంద్రియ సంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥**

ఏది విషయములు, ఇంద్రియములు ఇవి సంబంధించుటవలన కలుగునట్టిదో, మొదట అమృతముతో సమానమైనదిగను, కడపట విషము వలెనున్నదో, అట్టి సుఖము రాజసమని చెప్పబడినది పగలు కాకులకు కన్ను బాగుగ కనుపించును కాని గ్రుడ్లగూబలకు కనుపించెడు రాత్రి కాలమున కాకులకు కనుపించదు ఇట్లే అజ్ఞానుల యొక్కయు, జ్ఞానుల యొక్కయు దృష్టులుండునని గ్రహించుకొనవలయును ఆలాగున జ్ఞానులకు విషయాది దృశ్యము గోచరమే కాకూడదు అనగా అందు ప్రవృత్తి కలిగియుండరాదు



# మీరు ఋషిసంతతి లోనివారు

మీరు ఋషి సంతతిలోనివారు అది మీరు మరచిపోయినారు. దానిని మీరు తెలిసికొన్న చాలును జన్మసాఫల్యమును, మోక్షమును గూడ పొంద గలరు ఇది గీతయందు దశమాధ్యాయమున శ్రీ కృష్ణభగవాను డుపదేశించి నదే

**మహర్షయస్స ప్త పూర్వే చత్వారో మనవ స్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥**

లోకమునందు ఈ ప్రజలు ఎవరివలన పుట్టిరో, అట్టి పూర్వికులైన సప్తమహర్షులున్ను, స్వాయంభువాది మనువులున్ను మద్గతభావములై నాసంకల్పమువలన పుట్టినవారగుచున్నారు అనగా ఈ ప్రజలందరున్ను మనుమహర్షివల్లను, సప్తఋషులవలనను పుట్టిరి మనుసంతతి వారగుట వలననే మనుజులనియు, మానవులనియు, మనుష్యులనియు పేర్లు గలిగెను ఈ పేర్లు గలవారందరున్ను మనుమహర్షి సంతతివారే ఈ అర్థము అమర కోశాది నిఘంటువులలో చూడగలరు ఇదొకటి గ్రహించిన మీజన్మమేదో, మీవంశమేదో తెలిసికొనగలరు అప్పుడు మీరు మనువంశీయులని దృఢ మైన బోధము గలవారగుదురు ఇదొక్కటియే మిమ్ములనుద్ధరించును మీరు నిద్రలోనుండునపుడు సార్వభౌములైనను, గవర్నరు జనరలైనను, మహాబ్రాహ్మణ వంశములో పుట్టిన పండితోత్తములైనను, లేక యతీశ్వరు లైనను మీరెవరని మీకేలాగున తెలియక పోవుచుండునో, ఆలాగున అజ్ఞాన మైన సుషుప్తిలో నుండుటవలన మీయొక్క ఆత్మశక్తిని, దైవశక్తిని, వంశశక్తిని మరచి పోయితిరి నిద్రనుండి లేచిన తరువాత తాను సార్వభౌముడననియు, గవర్నరు జనరలనియు, మహా బ్రాహ్మణ వంశములో పుట్టిన పండితుడ ననియు, యతీశ్వరుడననియు ఎట్లు జ్ఞాపకము వచ్చునో, ఆలాగున ఈతత్త్వ మెరిగిన మీకు పరమఋషుల దివ్యత్వము, దైవత్వము బోధపడును ఎట్లు ఆత్మయొక్కమరపు కలిగినదో, వేదాంత శాస్త్ర ముపదేశించినది చూడుడు

**గ్రహావిష్టో ద్విజః కశ్చి చ్ఛూద్రోఽహమితి మన్యతే ।**
**గ్రహనాశాత్ పునః స్వీయం బ్రాహ్మణ్యం మన్యతే యథా॥**

**మాయావిష్ట స్తతో జీవో దేహోఽహమితి మన్యతే ।**
**మాయానాశాత్పునః స్వీయం రూపం బ్రహ్మాస్మి మన్యతే ॥**

ఒక వేద వేదాంగ పారంగతుడగు బ్రాహ్మణోత్తముని ఒక లంబాడి గ్రహమునీశ్వరుడు ఆవేశించెను అత్తరి ఎవ్వరడిగినను తాను శూద్ర మునీశ్వరుడనని చెప్ప ప్రారంభించెను వానికి కూడా గ్రహావేశ సమయమున బ్రాహ్మణుడను బుద్ధిపోయి తాను శూద్రుడనే బుద్ధి కలిగెను ఆ గ్రహమును తొలగించిన పిమ్మట నేలాగున బ్రాహ్మణత్వమను తన నిజబోధ నిశ్చయ మెట్లుకలిగెనో, ఆలాగున మాయ అను గ్రహముచే జీవుడు పట్టుబడుటచే తాను దేహమనియు, బద్ధుడనియు, అల్పుడగు జీవుడనియు, ఫలానా కులము గలవాడనియు తలంచి దుఃఖించుచున్నాడు, ఆమాయ తొలగిన పిమ్మట నిజరూపమగు బ్రహ్మత్వము ప్రకాశించి తాను నిత్యముక్తుడ ననియు, బ్రహ్మస్వరూపుడనే అనియు బోధ గలుగును

ఇది మానవజన్మములోగల మొదటి మార్పు అని తలంచేది ఈస్థితికి వచ్చినచో శ్రేష్ఠవంశమందు జన్మించిన పరమ ఋషుల సంతతివారే తామనియు, అట్టి ఋషులకు వేదవేదాంతాదులలోను, తపస్సులలోను, జ్ఞానములోను ఎంత హక్కు గలదో అంత హక్కు తమకుగూడ గలదనియు దృఢజ్ఞానము గలుగును అప్పుడు జీవితమంతయు క్రొత్తదగు పరిణామము పొందును అత్తరి పరమ శ్రేష్ఠులగు ఆర్యులలోను, ఋషివంశములోను గలవారికి ఎంత అధికారము బ్రహ్మవిద్య యందుగలదో తమకున్ను అంత అధికారము కలదని దృఢజ్ఞాన ముదయమగును అత్తరి మలినమగు బంగా రము స్ఫుటము చేసిన ఎంత మార్పు గలుగునో, ఇతని జీవితములోను అంత మార్పు గలుగును

**జీవశ్శివశ్శివో జీవస్స జీవః కేవలః శివః ।**
**తుషేణ బద్ధో వ్రీహిస్స్యా త్తుషాభావేన తండులః ॥**

**ఏవం బద్ధస్తథా జీవః కర్మనాశే సదాశివః ।**
**పాశబద్ధస్తథా జీవః పాశముక్తః సదాశివః॥**

జీవుడే శివుడు, శివుడే జీవుడు, ఆ జీవుడే సాక్షాత్తు శివుడు పొట్టుచే కప్పబడినప్పుడు వడ్లగింజనియు, పొట్టు పోయిన వెంటనే బియ్యమనునట్లు కర్మముచే కట్టుబడినవాడు జీవుడు, కర్మవిముక్తిచే సాక్షాత్తు శివుడగును అని స్కందోపనిషత్తు ఏ బీజమైనప్పటికిన్నీ పొట్టుతోగూడి యుండునప్పుడే అంకురించును పొట్టు తీసివేసిన మరల మొలవదు ఆలాగున మూలావిద్య యగు కర్మ ఉండువరకే జీవునకు జననమరణములు కలుగును అది పోయిన ముక్తాత్ముడున్ను, శివస్వరూపుడున్ను అగును ఇప్పుడు మనము మానవ జీవితమను మూడంతస్థులతో గూడిన మోక్షసౌధమునకు దృఢమైన పునాది వేయడమైనది పునాది గట్టిగలేనిచో హర్మ్యము స్థిరముగా నిలువనట్లు ఇట్టి ఋషిత్వము గలుగనిచో మీ అనుష్ఠానము లెవ్వియు నిలువజాలవు ఇది మొదటి స్థితి

ఇక రెండవ స్థితిలో పై జెప్పిన స్థిరత్వమేర్పడినచో ఈఋషిత్వము గూడ గొప్పది కాదను తత్త్వముదయమగును ఏలన ఇది శరీర సంబంధము, ఆత్మశరీరముకాదు, దానికి సాక్షిగనుండు జ్ఞానస్వరూపము అది ఈశ్వరాంశము అని జ్ఞానము ఆవిర్భవించును మొదట జ్ఞానము కలుగనిచో ఒక సార్వభౌముని వంశములో చేరిన వాడెట్లో అంతే ఫలము గలుగును ఈ రెండవ జ్ఞాన ముదయించినచో సార్వభౌముని కుమారుడగు యువరాజను బోధము కలుగును అప్పుడు ఈశ్వరాంశులే జీవులను ధర్మరహస్యము గోచరించును అత్తరి కుమారరాజు వంటి ఉత్సాహము, సంతోషము, గొప్ప తనము ఆవిర్భవించును గీత పదునైదవ అధ్యాయములో శ్రీకృష్ణభగవాను డుపదేశించినది చూడుడు "మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః"

సనాతనుడగు జీవాత్మ నారాయణుడగు నాయంశమే యైయున్నాడు దీనికన్న పరమ ప్రమాణము మరియేమి కావలయును? ఈ విషయమునే ముండక శ్రుతియు తెలుపుచున్నది

**మూ॥ త దేతత్సత్యం యథా సుదీప్తాత్ పావకాద్విస్ఫులిఙ్గాః**
**సహస్రశః ప్రభవ న్తే సరూపాః ।**

**తథాఽక్షరా ద్వివిధాస్సోమ్య భావాః**
**ప్రజాయన్తే తత్రచైవాపి య న్తి ॥**

ఓ శౌనకుడా! ప్రకాశించి మండుచుండెడు అగ్నిహోత్రమునుండి మిణుగురులు ఆ అగ్నికి సమానరూపము కలవై ఎట్లు జన్మించునో ఆ ప్రకారము ఆ అక్షరపరబ్రహ్మమునుండి అనేకవిధములగు జీవములు ఆ పరబ్రహ్మకు సమానమై పుట్టి దానియందే లీనమగుచున్నవి ఆ అక్షర పరబ్రహ్మము సత్యమైనది దానికి వేరగు సమస్తము అసత్యమయినది

జీవేశ్వరభిన్నత్వవాదులు ఈ ప్రమాణమును అంగీకరింతురు జీవేశ్వర అభిన్నత్వవాదులు అగ్నిహోత్రమునుండి జనించిన అగ్నికణములు అగ్నికేలాగున భిన్నములు కావో, ఆ నిప్పు కణములను దూదిలో పీచులో పెట్టి ఊదుచు వెలుగచేసి కట్టెలు వేసినచో ఏలాగున మొదటి అగ్నిహోత్రము వంటిదగుచున్నదో, ఆలాగున జీవునియొక్క ఉపాధిని తొలగించి ధ్యానము చేసిన అతడే శివుడు కాగలడని చెప్పుదురు ఈ విషయమునే శ్రీశంకభగవత్పాదులు అపరోక్షానుభూతియందు తెలిపిరి

**సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వం చ శాశ్వతమ్ ।**
**బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథా భవేత్ ॥**

బంగారమునుండి తయారగు కుండల వలయాదులు ఏవిధముగా బంగారముగానే యున్నవో అదే విధముగా బ్రహ్మమునుండి జనించెడు జీవకోట్లు బ్రహ్మస్వరూపముగానే ఉండును బ్రహ్మమునకన్న అన్యము కావు

**బ్రహ్మణస్సర్వభూతాని జాయన్తే పరమాత్మనః ।**
**తస్మాదేతాని బ్రహ్మైవ భవన్తీత్యవధారయేత్ ॥**

సర్వభూతములున్ను బ్రహ్మము నుండియే పుట్టుచున్నందున సర్వమును బ్రహ్మస్వరూపమే యని నిశ్చయించవలయును.

**సర్వయోనిషు కౌంతేయ మూర్తయ స్సంభవన్తి యాః ।**
**తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥**

ఓ అర్జునా! దేవ, పితృ, మనుష్య, పశు, పక్ష్యాది సకల యోనుల యందు పుట్టు పలువిధములైన శరీరములకు మాయ (ప్రకృతి) తల్లి యనియు, పరమేశ్వరుడనగు నేను గర్భాధాన కర్తయగు తండ్రిననియును తెలిసికొనుము

ఈ విషయమై వేలకొలది ప్రమాణములుగలవు సంక్షిప్తముగా జిజ్ఞాసువులకు ఇంతమాత్రము తెలుపడమైనది ఈ శ్లోకమున భగవంతుడే బీజరూపముగాను, తండ్రిరూపముగానున్నట్లు తెలుపడమైనది బీజ మేలాగున వృక్షమున కన్యము గాదో దానిని పెంచినచో ఎట్లు మహావృక్ష మగుచున్నదో, ఆలాగున బీజరూపముగానుండు జీవుని తపోధ్యానాది యోగములచే వృద్ధిపరచిన శివరూపుడగును ఆలాగున తండ్రి గొప్పవాడై నను శైశవావస్థలో నుండు శిశువునుపెంచి విద్యాభ్యాసాదులు నేర్పిన ఆ శిశువు ఎట్లు తండ్రివంటి వాడగుచున్నడో, ఆలాగున యువరాజైనవాడు తండ్రి యనంతరము పట్టాభిషిక్తుడై మహారాజగుచున్నాడో, జీవుని యొక్క స్థితియు ఆలాగుననే ఉండునని అనుష్ఠానపరులు గ్రహింతురు గాక!

ఇక మూడవ స్థితిలో ప్రవేశించవలసియుండును అప్పుడే ఇది పూర్తి యగును గీతలో జ్ఞానయోగప్రారంభమగు త్రయోదశాధ్యాయమున ఈ శ్లోకమును భగవానుడుపదేశించెను

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ॥**

బ్రహ్మాది స్తంబ పర్యంతముగల సకలోపాధులయందును, ఉపాధి భేదముచే వేరుగానున్నను, పరమార్థ జ్ఞానముచేత నొక్కటే యగు ఆత్మయే నేనని తెలిసికొనుము ఇట్టి క్షేత్ర క్షేత్రజ్ఞులను తెలిసికొనెడి జ్ఞాన మేది గలదో, అదే నిజమైన జ్ఞానమని నామతము

వేదాంత శాస్త్రములో దాసభావము, అంశభావము, అంశిభావము - ఈలాటి బేధములు కొన్ని గలవు ఇది ఉత్తమ, మధ్యమ, కనిష్ఠాధికారుల ననుసరించి యుండును దాసభావము ద్వైతమతమును, అంశభావము విశిష్టాద్వైతమును, అంశిభావము అద్వైతమతమును కూడియున్నది కావుననే శ్రీరామచంద్రుడు ఆంజనేయులతో తన అనుభవమును చెప్పేలాగున తెలిపినపుడు ఈశ్లోకమే తనయొక్క అనుభవమని ఆంజ నేయుడు తెలిపెను

**దేహబుద్ధ్యా తు దాసోఽహం జీవబుద్ధ్యా త్వదంశకః ।**
**ఆత్మబుద్ధ్యా త్వమేవాహమితి మే నిశ్చితా మతిః ॥**

దేహబుద్ధితో నీకు దాసుడను, జీవబుద్ధితో మీకు అంశస్వరూ పుడను, ఆత్మబుద్ధితో చూచిన నీవే నేను, ఇదే తనయొక్క అనుభవమని తెలిపెను

కావుననే వేదాంతశాస్త్రము తన స్వబుద్ధితో విచారణచేయకూడ దనియు, అనుభవజ్ఞులగు మహనీయులద్వారా గ్రహించవలసియుండు ననియు తెలుపడమైనది కావుననే అనుభూతి ప్రకాశము నందు విద్యారణ్య గురు డీలాగున తెలిపెను.

**వేదాన్తానామనేకత్వా త్సంశయానాం బహుత్వతః ।**
**వేద్యస్యాప్యతి సూక్ష్మత్వాన్న జానాతి గురుం వినా ॥**

వేదాంతము అనేకభావములతో కూడినదనియు, ఎట్టి సూక్ష్మబుద్ధి గలవానికైన, అనేక సంశయములు వచ్చుననియు, తెలిసికొనవలసిన బ్రహ్మము అతిసూక్ష్మ మగుటవలన బ్రహ్మసాక్షాత్కార జ్ఞానముగల గురు

దేవుని అనుగ్రహము లేనిచో ఎవరున్ను తెలిసికొన జాలరనియు చెప్పుటకిదే కారణము

**ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ ।**
**ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥**

ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి అందరును ఉత్కృష్టులే జ్ఞానియో నాయొక్క స్వరూపుడే యని నాయొక్క అభిప్రాయము ఏలననగా, ఆ జ్ఞాని యగువాడు నాయందు చేర్చబడిన మనస్సుగలవాడై నన్నే సర్వోత్తమమగు ప్రాప్యమునుగా నెంచియున్నవాడు

"జ్ఞానీత్వాత్మైవ మేమతం" అని భగవంతుడు జ్ఞానియగు వాడు నేనే యని సెలవిచ్చిన దానికన్న మరి యేప్రమాణము కావలయును?

**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।**
**వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥**

ఎవడు అనేక జన్మములలో నాచరించిన పుణ్యసంస్కారమువలన అంతఃకరణము శుద్ధమై, కడపట సమస్తమును వాసుదేవ మయమను జ్ఞానము గలవాడగుచు నన్ను పొందుచున్నాడో, అటువంటి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు

శ్రీకృష్ణభగవానుడే అట్టి వానిని మహాత్ముడనియు, మిక్కిలి దుర్లభుడనియు చెప్పుట వలన అట్టి జ్ఞానము గలుగుట సామాన్యము గాదని తెలిసికొనవచ్చును ఇంక ఈవిషయమై గీతాప్రమాణమును ఎక్కువగా చూపదలంచలేదు

**ఆత్మా క్షేత్రజ్ఞ సంజ్ఞోఽయం సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తై రేవ విగతశ్శుద్ధః పరమాత్మేత్యుదాహృతః ॥**

ఈ ఆత్మయే క్షేత్రజ్ఞుడని, త్రిగుణములతో కూడి ఉన్నపుడు చెప్ప బడును జీవుడనియు అత్తరి పేరు గలిగి ఉండును ఈ మూడు గుణముల

నుండి ఎప్పుడు విముక్తి పొందునో, అప్పుడు పరమాత్ముడనియు, శుద్ధాత్ముడనియు, జ్ఞానాత్ముడనియు పిలువబడును

ఇదే ఆత్మసాక్షాత్కారము, జీవన్ముక్తి, బ్రహ్మప్రాప్తి, మోక్షమని విజ్ఞులు గ్రహించేది శంకరభగత్పాదులు ఆత్మ బోధలో ఈలాగున తెలిపిరి

**రజ్జుసర్పవదాత్మానం జీవం జ్ఞాత్వా భయం వహేత్ ।**
**నాహం జీవః పరాత్మేతి జ్ఞాతశ్చేన్నిర్భయో భవేత్ ॥**

నరుడు చీకటిలో సోకిన త్రాడు త్రాడని తెలియమింజేసి, దానియందు పామను భ్రాంతి యుదయించి భయమును, వణకును పొందు రీతిగా పరిపూర్ణాఖండానంద రూపుడయిన ఆత్మను జీవుండని తలంచినందున అతడు దుఃఖమును, భయమును పొందుచున్నాడు జ్ఞానము కల్గి ఆత్మయందు జీవుడు అను భావము పోయి తాను పరమాత్ముడనని బోధము కలుగునప్పుడు నిర్భయుడగుచున్నాడు ఇక మానవులకు కావలసిన శాంతియు, సుఖము ఎట్లు కలుగునో ఆ విషయమై కఠోపనిషత్తునందు తెలిపినది చూడుడు అందరికిన్నీ ఆత్మశాంతియు ఆనందమున్ను గదా! కావలసినది

**ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా**
**ఏకం రూపం బహుధా యః కరోతి।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాః**
**తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

ఓ నచికేతసుడా! యే యాత్మ సమానాధికములు లేనిదై ఒకటియయిన తన శుద్ధ ఘనస్వరూపమును నామరూపభేదములచేత అనేక విధముల జేయుచున్నదో, బుద్ధి గుహయందుంచబడిన యాపరమాత్మను ప్రత్యక్షము జేసికొనిన జ్ఞానులకు నిత్యమగు బ్రహ్మానందసుఖము గలుగుచున్నది అనగా శాశ్వతానందము గలుగుచున్నది

**నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా -**
**మేకో బహూనాం యో విదధాతి కామాన్ ।**

**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాః ।**
**తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషామ్ ॥**

ఓ నచికేతుసుడా! యే పరమాత్మ సర్వజనులకు. వారి వారి కర్మ ఫలానుగుణముగ ఫలము నిచ్చునో, నశించువానిలో నశింపనివాడై బ్రహ్మాదిస్తంబ పర్యంతముండు జీవులకు చేతనాస్వరూపుడై యుండునో, అట్టి యాబుద్ధి గుహయందుండు పరమాత్మను మరలింపబడిన సర్వేంద్రియ వృత్తులు గల వారై యేజ్ఞానులు జూచుచున్నారో వారికి నిత్యమగు పరమ శాంతి గలుగుచున్నది

కావున ఆనందమును, శాంతియును కోరువారికి ఈ కఠోపనిషత్తు పరమ గురుస్వరూపమై ఉపదేశించుచున్నది

తైత్తిరీయమును ఈపరమ సత్యమునే తెలుపుచున్నది

**"యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవ న్తి ।**

**యత్ప్రయన్త్యభిసంవిశ న్తి, తద్విజిజ్ఞాసస్వ తత్ బ్రహ్మేతి"॥**

ఏ పరమాత్మవలన ఈ భూతములు పుట్టుచున్నవో, పుట్టినవై ఏ దేవుని వలన జీవించుచున్నవో, ఏ ఈశ్వరుని గూర్చి పోవుచున్నవో, లయ మును చెందుచున్నవో, అట్టిపరబ్రహ్మమును తెలిసికొనుమా! అదేబ్రహ్మము కైవల్యోపనిషత్తు తెలిపిన దానిని మీ సన్నిధానములో తెలిపి విరమించెద

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపఞ్చం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్త్యాదికమగు ప్రపంచమును తన ఆత్మయని ఎరింగినచో సమస్త బంధములనుండి విడివడుచున్నాడు అనగా ముక్తుడగు చున్నాడు మోక్షమును పొందుచున్నాడు



నుండి ఎప్పుడు విముక్తి పొందునో, అప్పుడు పరమాత్ముడనియు, శుద్ధాత్ముడనియు, జ్ఞానాత్ముడనియు పిలువబడును

ఇదే ఆత్మసాక్షాత్కారము, జీవన్ముక్తి, బ్రహ్మప్రాప్తి, మోక్షమని విజ్ఞులు గ్రహించేది శంకరభగత్పాదులు ఆత్మ బోధలో ఈలాగున తెలిపిరి

**రజ్జుసర్పవదాత్మానం జీవం జ్ఞాత్వా భయం వహేత్ ।**
**నాహం జీవః పరాత్మేతి జ్ఞాతశ్చేన్నిర్భయో భవేత్ ॥**

నరుడు చీకటిలో సోకిన త్రాడు త్రాడని తెలియమింజేసి, దాని యందు పామను భ్రాంతి యుదయించి భయమును, వణకును పొందు రీతిగా పరిపూర్ణాఖండానంద రూపుడయిన ఆత్మను జీవుండని తలంచి నందున అతడు దుఃఖమును, భయమును పొందుచున్నాడు జ్ఞానము కల్గి ఆత్మయందు జీవుడు అను భావము పోయి తాను పరమాత్ముడనని బోధము కలుగునప్పుడు నిర్భయుడగుచున్నాడు ఇక మానవులకు కావలసిన శాంతియు, సుఖము ఎట్లు కలుగునో ఆ విషయమై కఠోపనిషత్తునందు తెలిపినది చూడుడు అందరికిన్నీ ఆత్మశాంతియు ఆనందమున్ను గదా! కావలసినది

**ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా**
**ఏకం రూపం బహుధా యః కరోతి।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాః**
**తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

ఓ నచికేతసుడా! యే యాత్మ సమానాధికములు లేనిదై ఒకటియయిన తన శుద్ధ ఘనస్వరూపమును నామరూపభేదములచేత అనేక విధముల జేయుచున్నదో, బుద్ధి గుహయందుంచబడిన యాపరమాత్మను ప్రత్యక్షము జేసికొనిన జ్ఞానులకు నిత్యమగు బ్రహ్మానందసుఖము గలుగుచున్నది అనగా శాశ్వతానందము గలుగుచున్నది

చున్నవి, అయితే బుద్ధాది మహనీయులందరు జనులకు ధర్మమును, జ్ఞాన మును, దైవతత్త్వమును బోధించలేదా యని ప్రశ్న యొకటి బయలుపడ గలదు అయితే ఆ పరమ సత్యమును, ఆ దైవత్వమును పొందేవరకు ఆ మహనీయాత్ములు ఏకాంతమున ఏకాగ్రత గలిగియుండిరనియు, దానిని పొందిన తరువాత జనసమూహమునకు వచ్చి బోధించిరనియు వారి చరిత్రలో మనము కనుగొనగలము భారతీయ పరమ ఋషులను అనుస రించి మరల చెప్పనవసరము లేదు ఘటము కాలిన తరువాత నీటిలో నుంచి నను, వానలో తడిసినను కరుగదు, కాలకముందు నీటిలో నుంచినను, వానలో తడిసినను కరుగునను తత్త్వము ముముక్షువులు గ్రహించుకొనిన చాలును ఈ విషయమై పరివ్రాజకోపనిషత్తు ఉపదేశించినది చూడుడు

**అనేన విధినా సర్వాంస్త్యక్త్వా సంగాన్ శనైశ్శనైః ।**
**సర్వద్వంద్వై ర్వినిర్ముక్తో బ్రహ్మణ్యేవావతిష్ఠతే ॥**

బ్రహ్మనిష్ఠుడు మెల్లమెల్లగా సమస్త బంధములను, దానికి సంబం ధించిన ప్రతి బంధములను వదిలి సుఖదుఃఖ, లాభనష్ట, శీతోష్ణాది ద్వంద్వ ముల త్యజించి పరబ్రహ్మమందే యుంటున్నాడు దీనియందు 'శనైశ్శనైః' అని ప్రయోగించుట వల్ల ఈ యింద్రియాతీతస్థితి ఒకేసారి సిద్ధించినది కాదనియు, అనేకసార్లు నింపాదిగ యత్నము చేయవలెననియు ఉపదేశించడ మైనది ఈ సత్యమునే ఆత్మసంయమ యోగమగు ఆరవ అధ్యాయమున శ్రీకృష్ణభగవాను డుపదేశించెను

**శనైశ్శనై రుపరమేద్బుద్ధ్యా ధృతి గృహీతయా ।**
**ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥**

ఆత్మభావమును, బ్రహ్మభావమును అవలంబించి దృఢమైన బుద్ధి చేత మనస్సును ఆత్మయందు నిలకడగా జేసి మెల్లమెల్లగా ఆత్మప్రాప్తిని పొందవలయును లేక మనస్సును ఆత్మలో లయపరచవలయును తరువాత ఆత్మతత్త్వము కంటె నితరమైన దానిని కొంచెమైనను చింతన చేయకూడదు

## నారద పరివ్రాజకోపనిషత్తు

**ఏకో భిక్షుర్యథోక్తస్స్యా ద్ద్వావేవ మిథునం స్మృతమ్ ।**
**త్రయో గ్రామస్సమాఖ్యాతః ఊర్ధ్వన్తు నగరాయతే ॥**

**నగరం న హి కర్తవ్యం గ్రామో వా మిథునం తథా ।**
**ఏతత్త్రయం ప్రకుర్వాణః స్వధర్మాచ్చ్యవతే యతిః ॥**

**రాజవార్తాది తేషాం స్యా ద్భిక్షావార్తా పరస్పరమ్ ।**
**స్నేహపైశున్య మాత్సర్యం సన్నికర్షాన్న సంశయః ॥**

బ్రహ్మచింతకుడు ఒక్కడుండుట యుక్తము ఇద్దరు కలిసియుండిన సంసారమనియు, అనగా భార్యాభర్తలతో కూడియుండు వానివలెనుండు ననియు, ముగ్గురు కూడియుండిన గ్రామమనియు, అంతకన్న ఎక్కువ మంది చేరిన నగరమనియు చెప్పబడును నగరమును ఎప్పటికి కూడా చేయ కూడదు ఆలాగున గ్రామమునుగాని, మిధునము (గృహమును, సంసా రమును) ఎప్పటికినీ చేయకూడదు మిధున, గ్రామ, నగరముల జేయు బ్రహ్మనిష్ఠుడు స్వధర్మమునుండి జారుచున్నాడు ఆలాగున మిధునమును, గ్రామమును, నగరాదులను చేయువారికి లోకవార్తలు, భిక్షావార్తలు పర స్పరము కలుగును ఒకరొకరు చేరుటవల్ల ఒకరికొకరికి స్నేహము, లోభము, మాత్సర్యము మొదలగు ప్రకృతి గుణములు తప్పక కలుగును ఇందులో సందేహము లేదు పరస్పర సంబంధముచే నాత్మధ్యాన నిష్ఠ తగ్గి లోకవార్తలు ప్రబలి రాగద్వేషాదులకు నిలయము ఏర్పడునను విషయము ఇందుచే నిరూపించడమైనది ఇదే ప్రకారము గీతలోను భగవానుడు తెలిపెను

**యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః ।**
**శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥**

మనోనియమము గల యోగి ఎల్లప్పుడూ ఆత్మను పరమాత్మయం దైక్యపఱచి ధ్యానించెడు అలవాటు గలవాడై బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమే అంత్యముగా గలదియు, నాయందుండు నట్టిదియునగు ప్రకృతి శమించిన

పరమశాంతిని పొందుచున్నాడు

**యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః ।**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥**

యోగనిష్ఠాపరుడు నియమింపబడిన మనోబుద్ధీంద్రియములు గల వాడును, ఆశ లేనివాడును, అనగా దేనిని కోరనివాడును, దేనిని సంపా దించుట యందిచ్ఛలేనివాడును, ఏకాంతస్థల మందొంటరిగా నున్న వాడు నగుచు ఎల్లపుడును మనస్సును ఆత్మయందు లయపరుపవలెను

**యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే ।**
**నిస్పృహస్సర్వ కామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥**

లెస్సగా నియమింపబడిన మనస్సు ఎప్పు డాత్మయందే నిల్చియుంటు న్నదో అప్పుడు వాడు సమస్త కోరికలయందు అపేక్షలేని వాడై యోగసిద్ధిని పొందినవాడని చెప్పబడుచున్నాడు

**యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః ।**
**సుఖేన బ్రహ్మ సంస్పర్శ మత్యంత సుఖమశ్నుతే ॥**

ఇదివరకు చెప్పబడిన విధముగా సర్వకాలములయందును మనస్సును ఆత్మయందనుసంధానము చేయుచున్నవాడును, పాపరహితుడు నైన ధ్యానయోగి అనాయాసముగా బ్రహ్మసాక్షాత్కార రూపమును, సర్వోత్తమ మైన శాశ్వత బ్రహ్మసుఖమును పొందుచున్నాడు

**బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥**

నిర్మలమైన బుద్ధిగలవాడును, ధైర్యముచే దృఢమైన మనోనిగ్రహము కలవాడును, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడు ఇంద్రియ విషయము లనెడి అభిలాషను విడచినవాడును, రాగము, ద్వేషము మొదలగు ద్వంద్వ ములలో తగలనివాడై,

**వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥**

ఏకాంతవాసియు, శుద్ధమైన కొద్ది ఆహారము గలవాడును, స్వాధీనము చేసుకొనబడిన వాక్కు, కాయము, మనస్సు గలవాడును, సదా ధ్యానయోగ మందాసక్తి గలవాడును, ఇహపర భోగముల యందు లెస్సగా వైరాగ్యము కలవాడునై,

**అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।**
**విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే ॥**

అహంకారమును, నేను బలవంతుడనను దురభిమానమును, గర్వమును, కామమును, కోపమును, పరవస్తు పరిగ్రహమును విడిచి మమ కారములేనివాడు బ్రహ్మాత్మైక్యజ్ఞానమును పొందుట కర్హుడగుచున్నాడు పై శ్లోకమున పధ్యమును శ్రీభగవానుడు తెలుపడమైనది ఈ గీతా వాక్యమును విచారణ చేసిన భగవద్గీత ఏకాంతమున కనులు మూసుకొని, ముక్కు పట్టుకొని యుండేలాగున తెలుపలేదనియు, సదా కర్మయోగమునే చేయవలె ననియు చెప్పువారు భగవద్గీతకు ఎంత అర్థము గ్రహించగలరని, తమలో జీర్ణింప గలిగిరని విజ్ఞుల కర్థము గాగలదు ఇప్పుడు గూడా గొప్ప లోకోద్ధార కులు, ఆత్మజ్ఞాన ప్రబోధకులు ఉండినచో వారు జనులకు ధర్మము, జ్ఞానము, నిష్కామ కర్మయోగమును బోధించువారైనను, వారుండుటకున్నూ, ధ్యానము చేయుటకున్నూ, గ్రంథమును వ్రాయుటకున్నూ ప్రత్యేక స్థల మున్నూ, సమయమున్నూ ఏర్పరచియుండుటలేదా! ఇక ఈ విషయమై శ్రీమద్భాగవత ఏకాదశస్కంధమున అవధూత యదుసంవాదమను గాథ యొకటి గలదు అవ ధూతలవారికి ఇరువది నలుగురు గురువులలో ఈ కన్యకయు యొక గురువైయుండెను

**క్వచిత్కుమారీ త్వాత్మానం వృణానాన్గృహ మాగతాన్ ।**
**స్వయం తానర్హయామాస క్వాపి యాతేషు బంధుషు ॥**

**తేషామభ్యవహారార్థం శాలీన్రహసి పార్థివ ।**
**అవఘ్నన్త్యాః ప్రకోష్ఠస్థా శ్చక్రుశ్శంఖా స్స్వనం మహత్ ॥**

**సా తజ్జుగుప్సితం మత్వా మహతీ వ్రీడితా తతః ।**
**బభంజై కైకశ శ్శంఖాన్ ద్వౌ ద్వౌ పాణ్యోరశేషయత్ ॥**

**ఉభయోరప్యభూద్ఘోషో హ్యవఘ్నన్త్యాస్స్మ శంఖయోః ।**
**తత్రాప్యేకం నిరభిదదేకస్మాన్నాభవద్ధ్వనిః ॥**

**అన్వశిక్షమిమం తస్యా ఉపదేశమరిన్దమ! ।**
**లోకాననుచరన్నేతాంల్లోక తత్త్వ వివిత్సయా ॥**

**వాసే బహూనాం కలహో భవేద్వార్తా ద్వయోరపి ।**
**ఏక ఏవ చరే త్తస్మాత్కుమార్యా ఇవ కంకణః ॥**

ఓ రాజా! ఒక గ్రామమందొక బ్రాహ్మణ గృహమున తనమాతా పిత్రాది బంధుజనము గ్రామాంతరము వెళ్ళినందున కుమారిమాత్రము ఒంటరిగా నుండెను అట్టి సమయమున కన్యక యొక్క వివాహనిర్ణేతలగు పెద్దలరుదెంచిరి ఇంట తల్లిదండ్రులు లేనందుచే స్వయముగనే అర్ఘ్యపాద్యా దులచే వారిని సత్కరించెను వారు వచ్చుసరికి ఇంటియందు బియ్యము లేకుండెను అపుడాకుమారి తన మాతాపితరు లరుదెంచి ధాన్యమును దంచి బంధుజనమునకు వంటచేయుట ఆలస్యమగునని యెంచి తానే రహస్య ముగా ధాన్యమును దంపనారంభించెను అపుడు తన చేతియందున్న గాజు లొకటొకటి కొట్టుకొని పెద్దగా శబ్దించెను ఆశబ్దములను బంధువులు విన్నచో వీరు ఇంత దరిద్రులు, ఆపూట, కాపూట దంచుకొని తిని జీవించునట్టి క్షుద్రులని తలంతురేమోయని చాల అసహ్యించుకొని లజ్జావనత వదనయై చేతులకున్న గాజులన్నియు పగులగొట్టి ఒక్కొక్కచేతికి రెండేసి కంకణముల మాత్రము మిగిల్చెను మరలా దంపసాగెను ఆరెండును పరస్పరము కొట్టు కొని ధ్వనించెను అప్పుడా రెండింటిలో ఒక్క దానిని తీసివైచెను పిమ్మట ఏలాటి శబ్దమును గలుగలేదు కామక్రోధాది శత్రుసంహారకుడగు ఓరాజా!

లోకతత్త్వముయొక్క జిజ్ఞాసచే సంచరించుచున్న నే నాకుమారినుండి కుమారి యొక్క కంకణములవలె అనేకు లొకచోట నున్నయెడల కలహములు సంభవించుననియు, ఇద్దరున్నను వ్యర్థసంభాషణాదులు కలుగ వచ్చుననియు, గాన ఒంటరిగనే సంచరింపవలయును అనెడి యుపదేశ మును గ్రహించితిని కాన ఈమెనున్ను గురువుగా చేసుకొంటిని



# గమనిక

ప్రపంచములో మఠములు అనగా ఆశ్రమములు, విద్యాలయములు, ఆసుపత్రులు, గలవారిలో చాలామందిన్ని మా ఆశ్రమమునకు మా విద్యా లయమునకు, మావైద్యాలయమునకు తగిన సహాయము లేదు, ధనము లేదు, అందువల్ల బీదరికములో నుంటున్నాము అని సహాయమును గూర్చి అనేకులను అర్థింతురు దీనియందు నాకు నమ్మకము లేదు ఆశ్రమములకు తగిన గురువులున్ను, విద్యాలయములకు తగిన ఉపాధ్యాయులున్ను, అసుపత్రులకు తగిన వైద్యులున్ను లేకపోవుటయే అభివృద్ధి చెందకపోవుటకు కారణము గాని మరియే కారణమున్ను లేదు ఒకవేళ వారు (ఆసంస్థలకు) స్థాపించిన ప్రదేశములు బీద ప్రదేశములుగా ఉండినను గురువులు, ఉపాధ్యా యులు, డాక్టర్లు సమర్థులు, విద్యావంతులు, త్యాగశీలురు, పరిశ్రమించు స్వభావము గలవారైనచో దూరప్రదేశమునుండి గాని, విదేశముల నుండిగాని తగినవారు అచ్చటికి వచ్చి కావలసిన సహాయము చేయుదురు

1 తగిన గురువులు లేనిచో బ్రహ్మవిద్య వృద్ధికి రాదు

2 తగిన పండితులు లేనిచో విద్య అభివృద్ధి నొందదు

3 తగిన వైద్యులు లేనిచో వైద్యాలయము ఉన్నతస్థితి నొందజాలదు.

4 తగిన వ్యవసాయికులు లేనిచో వ్యవసాయము వృద్ధికి రాదు.

5 తగిన విశ్వాసముగల పశుపాలకులులేనిచో పశుగణము వృద్ధినొందదు.

6 తగిన సమర్థత గల రాజులు లేక పాలకులు లేనిచో రాజ్యము చక్కని స్థితిలో నుండదు

7 తగిన యోగ్యతగల హోటలువారు (యజమాని, వంటవారు) లేని హోటలు అభివృద్ధి నొందరు

8 మహాకవులు లేని దేశము విద్యాభివృద్ధి గాంచజాలదు అన్ని సంస్థల యొక్క స్థితియు ఈలాగుననే యుండును



# గౌరవము

అందరున్నూ తమ్ము గౌరవించవలెనని తలంచుచుందురు ఆతలంపు చాలా మంచిది ఐతే దానికి తగిన కార్యము తాము చేయక ఉన్నతోన్నత విద్యయున్నూ, విద్యాతపస్సులున్నూ గలవారిని లోకము గౌరవించుట చూచి, తమకు అట్టి గౌరవము లేదని తలంచి అసూయపడిన ప్రయోజన మేమి? తమ ఆత్మను తామే హింసించుకొను వారగుదురేగాని మరి లాభముండదు ఎవరిని లోకము గౌరవించుచున్నదో, దానికి కారణ మగు ఉన్నతోన్నత విద్యనుగాని లేక విద్యను, తపస్సునుగాని తాము సంపా దించునప్పుడు లోకము స్వయముగానే తమను గౌరవించగలదని తలంచి సహించి ఒక్కసారి ఆ సర్వోన్నత పదవిని సంపాదించకపోయినను, కొంచెము కొంచెము ఆర్జించుకొని, సర్వోన్నత పదవిని పొందేలాగున చేయవలెను ఒకవేళ ఈ జన్మములో సర్వోత్కృష్టమగు ఆ ఉత్తమోత్తమ పదవిని పొందక పోయినను, తప్పక మరుజన్మమున పొందగలరు ఇతరుల గౌరవమును చూచి సహింపజాలక బాధపడుట కన్న ఓహో! అతడు లోకముచే ఎంత గౌర వింపబడుచున్నాడు? అతడు ఎంత కష్టపడి చదివినాడు? ఎంత తీవ్రమైన

తపస్సు చేసినాడు? ఎంత త్యాగము చేసినాడు? ఎంత కాలము సర్వసంగ పరిత్యాగియై పరమేశ్వరుని అనన్యభక్తితో భజించినాడు? ధ్యానము చేసినాడు? మనసా! అందువలన గదా? అతనికి ఇంత లోకపూజ్యత కలిగిన దని తలంచి, సంతోషపడిన అతని జీవితము అతిత్వరలోనే పావనమై పరమా నందమును, పరమశాంతిని పొందగలుగును ఈ విషయమై భగవద్గీతలో తెలిపినది చూడుడు

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।**
**తత్స్వయం యోగ సంసిద్ధః కాలే నాత్మని విందతి ॥**

ఈ లోకమున జ్ఞానమునకు సమానమైనది, పావనమైనది మరి యొకటి లేదు యోగసిద్ధిని పొందినవాడు కాలక్రమమున ఆజ్ఞానమును తాను గనే తన యెడ పొందుచున్నాడు అనగా ఆ జ్ఞానమును తన ఆత్మ యెడ చూచుచున్నాడు

"కాలేనాత్మని విందతి" అని ప్రయోగించుటవల్ల, యోగ, ధ్యాన, తపస్సులు ప్రారంభించిన వెంటనే సిద్ధి కానేరదనియు, కాలము పరిపక్వావస్థ వచ్చునప్పుడే అది సిద్ధించుననియు భగవానుడుపదేశించెను బీజము పెట్టి పోషించినను, కాలము వచ్చినప్పుడుగదా ఫలించును ఐతే కాలమువచ్చి నప్పుడు ఫలించునని తలంచి ఊరకుండరాదు సరియైన సంరక్షణ చేయు చుండవలయును అట్లైన కాలము పరిపక్వావస్థకు వచ్చునప్పుడు ఫలించును. అట్లు చేయనిచో కాలవిలంబన మగునదే గాక నశించి పోవచ్చును

సాధకులందరున్నూ గ్రహించవలసిన విషయమిది విత్తనము పెట్టి పోషించువారు సన్న్యాసులైనను, గృహస్థులైనను, బ్రాహ్మణులైనను, అబ్రాహ్మణులైనను, పురుషులైనను, స్త్రీలైనను భూదేవికి పక్షపాత మేమియు లేదు భూసారము ననుసరించి పోషణ, సంరక్షణ ననుసరించియే యెవరికై నను ఫలము సమానముగానే కలుగుచున్నది. ఆలాగున హృదయశుద్ధి గలిగి ధ్యానబీజమును పెట్టి రాగద్వేష విషయాదులగు పశువులు మేయనీక కల్ల

(కంప) కట్టి పోషించిన జ్ఞానఫలమును సమానముగానే అందరున్నూ పొంద గలరు బీజముపెట్టిన వారు బ్రాహ్మణుడని తలంచి లేక సన్న్యాసులని తలంచి లేక పురుషులని తలంచినను సుక్షేత్రము కానిదానియందు పెట్టి సం రక్షణ సరిగా లేనిచో ఆ బీజము వృక్షమై ఎట్లు ఫల పుష్పాదుల గలుగ జేయును?

**యుఞ్జన్నేవం సదా౽౽త్మానం యోగీ నియతమానసః ।**
**శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥**

మనోనియమము గల యోగి ఎల్లప్పుడాత్మను పరమాత్మ యందైక్య పరచి, ధ్యానించెడు అలవాటు కలవాడై, బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమే అంత్య ముగా గలదియు, నాయందుండునట్టిదియు నగు ప్రకృతి శమించిన పరమ శాంతిని పొందుచున్నాడు

దీని యందు "నియతమానసః" మనస్సును లెస్సగా పరమాత్మ యందు లయమొనర్చినవాడుగా ఉండవలయునని తెలుపడమైనది

**యుఞ్జన్నేవం సదా౽౽త్మానం యోగీ విగతకల్మషః ।**
**సుఖేన బ్రహ్మ సంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే ॥**

ఎల్లప్పుడు మనస్సును ఆత్మయెడ స్థిరపరచుకొని పాపములన్నియు తొలగినవాడైన యోగి, బ్రహ్మముతో చేరుటయనే బ్రహ్మముగనే అగుటయనే మేలైన సుఖమును ఆయాసము లేక అనగా సులభముగ పొందుచున్నాడు అనగా బ్రహ్మానందానుభవ రూపముగనే యున్నాడని తాత్పర్యము

"యోగీ విగతకల్మషః" ధ్యానపరుడు త్వరలోనే సర్వకల్మషములు నశించినవాడై శుద్ధాత్ముడగుచున్నాడు, ఏలాగున మలినమైన (తెల్ల) బంగారము స్ఫుటము చేయుటవల్ల చిలుము నశించి, అపరంజి బంగార మగుచుండునో, తపస్సుయొక్క ఫలితమున్నూ ఈలాగున నుండునని సాధకులు గ్రహించుకొనవలెను మలినమైన బంగారము మొదట అపరంజి

బంగారముగానే యుండెను బంగారు పని చేయువారు ఆభరణములను మరల మరల మార్పుచేసి, నగలుగా చేయునప్పుడు రాగి, వెండి కలపడ మువల్ల మలినమైన బంగారమై పోయినది మరల స్ఫుటము చేయుటవల్ల ఇతర లోహములు పోయి అపరంజి బంగారమగుచున్నది తెల్లబంగారమై యున్నప్పుడు తక్కువ వెల గలదగుచున్నది స్ఫుటముచే చిలుము తీసివేసిన తరువాత అపరంజి బంగారపు విలువ ఏర్పడుచున్నది ఆలాగున ఈ జీవులన్నియు మొదట ఈశ్వరస్వరూపులే అనేక జన్మములలో చేసిన మలిన కర్మములచే దుఃఖజీవులగుచున్నారు ఐనను భయపడనక్కరలేదు ఇప్పటి నుండియే మంచి తపో నిష్ఠాదులను చేసినచో శుద్ధాత్ములై, జ్ఞానాత్ములై ఈశ్వరస్థితిని పొందగలరు ఈ విషయమై పతంజలి మహర్షి తెలిపినది చూడుడు

**సూ॥ "కాయేన్ద్రియశుద్ధిరశుద్ధిక్షయాత్తపసః"**

తపస్సు వల్ల దేహము ఇంద్రియములు, మనస్సు మొదలైన వన్నియు శుద్ధము లగుచున్నవి

దీనికన్న పరమ ప్రమాణమున్నూ, మీకు ధైర్యమున్నూ మరి ఏమి కావలయును? ఉపనిషత్తులున్నూ ఈలాగుననే ఉపదేశించుచున్నవి "తపసా కిల్బిషం హన్తి" తపస్సుచేత అనగా ధ్యానము చేత పాపములన్నియు నశించుచున్నవి అజ్ఞానము విలయమగుచున్నది

**ప్రశాన్తమనసం హ్యేవం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శా న్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్ ॥**

మిక్కిలి శాంతి నొందిన మనస్సు గలవాడైనట్టియు, శమించిన రజో గుణము గలిగినట్టియు, పాపరహితుడై నట్టియు, తమోగుణము పూర్ణముగా నశించినట్టియు, బ్రహ్మస్వరూపుడైనట్టియు, అనగా జీవన్ముక్తుడై నట్టివాడగు ఈ ధ్యాననిష్ఠుని ఉత్కృష్టమైన బ్రహ్మానందము స్వయముగా నిచ్చుటనే పొందుచున్నది "హి" యని ప్రయోగించుటచే ఈ దేహముతో నున్నప్పుడు

ఈ లోకమునందే కలుగుచున్నదని భావము

"ఉపైతి శా న్త రజసం" అని ప్రయోగించుటవల్ల ధ్యానముచేత తమో, రజోగుణములు త్వరలో నశించునని తెలుపడమైనది ఇదే స్ఫుటముచేత బంగారము శుద్ధపడునని తెలుపుటకు కారణము "బ్రహ్మభూత మకల్మ షం" కల్మషము అనగా అవిద్య, అజ్ఞానము మాయ నశించి బ్రహ్మస్వరూపు డగునని ఉపదేశించడమైనది "హి" అని ప్రయోగించుటవల్ల అట్టి బ్రహ్మ నందము, బ్రహ్మప్రాప్తి జీవన్ముక్తి ఇచ్చుటనే, ఈదేహముతో కూడి యున్న ప్పుడే గలుగునని భావము జీవించియునప్పుడే ముక్తి కలుగునని 'జీవన్ముక్తి' అను పదమున కర్థము

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।**
**అనేకజన్మ సంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥**

పట్టుదలతో యత్నించుచున్న యోగనిష్ఠుడు పాపరాహిత్యము గల వాడై అనేక జన్మముల యందు అభ్యసించుటవలన పొందదగిన యోగసిద్ధిని పొందినవా డగుచున్నాడు అటు పిమ్మట అట్టి యోగసిద్ధిని పొందిన తరువాత సర్వోత్తమమగు మోక్షసిద్ధిని పొందుచున్నాడు

"ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః" అని ఉపదేశించుట వల్ల ప్రయత్నశీలుడై అనుష్ఠాన పరుడైన సాధకుడు త్వరలోనే అన్ని ప్రకృతి విషయములనుండి విముక్తుడగుచున్నాడని భగవానుడు ఉపదేశించెను ఈ భగవద్వాక్యమును ఆధారము చేసికొనియే మొట్టమొదట అనుష్ఠానపరుడు ఈ జన్మములో ముక్తుడు కాకపోయినను, మరుజన్మము లోనైనా లేక తరు వాతనైనా ముక్తుడు కాగలడని తెలుపడమైనది కొందరు పుణ్యజీవులు పూర్వ జన్మ సంస్కారజీవులు విరక్తులై యుండుటకున్ను, కొందరు కొద్దికాలము గృహస్థాశ్రమము నందుండి విరక్తులగుటకున్నూ, మఱికొందరు ఎక్కువ కాలము సంసారములో నుండి వైరాగ్యము గలవారగుటకున్ను అనుష్ఠాన ములో ప్రయత్నాతిశయమే కారణమగుచున్నది వామదేవాది మహాత్ములు

గర్భములో నున్నప్పుడే ముక్తాత్ములై యుండుటకున్నూ, శుకబ్రహ్మర్ష్యాదులు పుట్టుకతోనే విరక్తులైయుండుటకున్నూ, యాజ్ఞవల్క్యాది ఋషులు కొంత కాలము గృహస్థాశ్రమములో ఉండిన పిదప విరక్తులగుట కున్నూ అదియే కారణము ఆలాగున స్త్రీలలో సులభాయోగిని, గార్గి మొదలైన వారు పుట్టుకతోనే భవబంధరహితులై యుండుటకున్నూ, మైత్రేయి మొదలగు వారలు కొలదికాలము గృహస్థాశ్రమమునందుండి విడుదలపొంది పోవుట కున్నూ అదియే హేతువని గ్రహించుకొనవలయును పై శ్లోకము అనేక జన్మ ములు చెప్పుటవల్ల ఇక మీద అనేకజన్మములని తలంచవలదు ఇప్పటికే మీకు నివృత్తి మార్గములో అనుష్ఠానమార్గములో అనేక జన్మములు గడిచి నందుచేతనే ప్రాకృత విషయములు నశించి విరక్తులై శుద్ధాత్ములగుదురని గ్రహించవలెను

**పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।**
**జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥**

పూర్వజన్మములో యోగానుష్ఠానపరుడై ఉండియు, సంపూర్ణముగా విషయవాసన నశింపనివాడైనచో ఈజన్మములో సంసారములో కొంత కాల ముండినను, పూర్వజన్మసంస్కారబలము బలాత్కారముగా వాని మనస్సును లాగి, విరక్తి కలుగజేసి ధ్యానములోనికి ప్రవేశపెట్టుచుండును బ్రహ్మ విచారముచేసి తరించవలెనను తలంపు గలవాడు కూడా వేదములో ప్రతి పాదించిన ఈశ్వరుని క్రమముగా పొందుచున్నాడు తరించవలెనని ఆచరణ చేయనివాడు గూడా క్రమముగా ఈశ్వరుని పొందుచున్నాడని చెప్పుచుండగా అనుష్ఠానము చేయువారిని గూర్చి మరల చెప్పవలయునా? జనులారా! మీరు అనుష్ఠానము చేయక పోయినను, అనుష్ఠానము చేసి తరించవలెనను సంకల్పమైనను చేసికొనుడు దానికి మీ కేలాటి ప్రయాసమును లేదుగదా! జీవులపై ఎంత కరుణ కలిగి భగవంతు డీవాక్యమును చెప్పెనో యోచించు కొనుడు

**అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్**
**ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥**

పూర్వజన్మములో శుద్ధాత్ములై ఈజన్మములో ఇతరులను తరింప జేయుటకొరకు జన్మించెడు మహాత్ములు కొందరు గలరు అట్టివారే యోగులైనవారి వంశములో జన్మించుచున్నారు ఈలాంటి జన్మమేది గలదో, అది లోకములో చాల అరుదుగానే యుండును ఇట్టివారు ముక్తులై యుం డియు బద్ధులను విముక్తులుగా చేయుటకు జన్మింతురు అట్లుకానిచో బద్ధజీవులను ఎవరు విముక్తులుగా చేయగలరు? వీరు సామాన్యజీవులు గాక కారణ పురుషులై యుందురు



# ఏ యోగము గొప్పది?

ఈ పృచ్ఛకుని ఆశయ మేమన 1 కర్మయోగము గొప్పదా? 2 భక్తి యోగము గొప్పదా? 3 లేక జ్ఞానయోగము గొప్పదా? అని అతని అభిప్రా యము ధ్యానయోగము పైమూడు యోగములలోను అంతర్భూతమై యున్నది ఈ నాలుగు యోగములున్నూ వాటి స్థానములలో ఒక్కొక్కటిన్నీ గొప్పదే అట్లుకానిచో ఆయా శాస్త్రమునకు స్వాతంత్ర్యముండదు అస్వాతంత్ర్యమే సిద్ధించును అప్పుడు అది స్వతంత్రశాస్త్రము కానేరదు వేదము కాండత్రయాత్మకమై యున్నది గీతలో మొదటి ఆరు అధ్యాయ ములు కర్మయోగమును గురించియు, ఏడునుండి పండ్రెండువరకు గల ఆరు అధ్యాయములు ఉపాసనాయోగమును, అనగా భక్తియోగమును గురిం చియు పదమూడునుండి పదునెనిమిదివరకు గల ఆరు అధ్యాయములు జ్ఞానయోగమును గురించియు తెలుపుచున్నవని మహనీయులయొక్క ఆశయము ధ్యానయోగము అనగా ఆత్మసంయమయోగము ఆరవ అధ్యా యములో ఉపదేశించుటవల్ల ఈ ధ్యానయోగము తక్కిన మూడు యోగ

ములకున్ను ఉండవలయునని గ్రహించవలసినదై ఉంటున్నది ఏలన ధ్యానములేని వారు పైమూడు యోగములలోను ఎవరున్నూ లేరు, ఒక గోవునకు నాలుగు పాదములు సమానముగా నుండగా ఏపాదము గొప్పది? అని అడిగినట్లున్నూ, లేక చతుష్స్తంభములపై నిలబడియుండు ఒక మండపమునకు వీనిలో ఏ స్తంభము గొప్పదని అడిగిన ఎట్లుండునో, పై జెప్పిన ప్రశ్నయును అలాంటిదే ఐనను ఒక్కొక్క జీవుని పూర్వజన్మ సంస్కారము ననుసరించి కర్మయోగమందుగాని, భక్తియోగమందుగాని, జ్ఞానయోగమందుగాని ప్రవృత్తి గలుగును ఇది వారి సంస్కారము ననుసరించి కలిగినదేగాని గీతయొక్క ఆశయము ననుసరించి కలిగినది కాదు అని విజ్ఞులు గ్రహించిన చాలును

ఉపాసనామార్గములో పూర్వజన్మసంస్కారము ననుసరించి ఒకరికి శివభక్తియందుగాని, మరియొకరికి విష్ణుభక్తియందుగాని, ప్రీతియు, ఆధిక్యమున్ను గలిగి యుండవచ్చును అదిన్నీ పూర్వజన్మ సంస్కారమేగాని మరియొక దానివలన కలిగినది కాదు శ్రీకృష్ణభగవానుడు పై నుదాహరించిన మూడు యోగములనేగాక పదునెనిమిది అధ్యాయములలో పదునెనిమిది యోగముల నుపదేశించెను దీనిచే శ్రీకృష్ణభగవానుడు సర్వజ్ఞుడని మనము తెలిసికొన్న చాలును ఒక్కయోగముచేతనే మోక్షము గలుగుచుండగా ఇన్ని యోగములు ఏల చెప్పవలెనని కొందరు తలంతురు అదెటు వంటిదనగా ఒక జనరల్ ఆస్పత్రిలోనికి ఒకసాధువు వెళ్ళి అచ్చటనుండు ప్రధాన డాక్టరుతో మందులస్టోరులోనికి వెళ్ళి అయ్యా! ఒక్క ఔషధముచే రోగము నశింపగా ఇన్ని మందులు ఎందుకు ఉండవలెనని అడిగెను ఈసాధువుగారు పెద్ద డాక్టరుగారికి బాగా తెలిసినవారు. ఆయన ఓంకార ఉపాసన ఒకటే చేసే వాడు, తక్కిన మార్గములలో ఇష్టము లేనివాడు డాక్టరుగారు "స్వామీ" అజ్ఞానము ఒక్కటే అయినను అ[illegible]నేక విధము[illegible]గా పరిణామము చెంది, జనులను ఏలాగున బాధించుచున్న[illegible]ో ఆలాగున ర[illegible]గముచే కలిగిన దుఃఖము ఒక్కటే అయినను, రోగముల[illegible]నేక రూపముల[illegible]గా పరిణామము

పొంది జనులను బాధించుచున్నవి అందు వలన ఒక్కొక్క రోగమునకున్నూ, ఔషధములు వేలువేలుగా ఆయుర్వేదము విధించుచున్నది" అని సమాధానము చెప్పెను ఒక రోగమునకు ఏర్పడియున్న ఔషధము మరియొక రోగముపై పని చేయజాలదు భవరోగమున్నూ ఆలాటిదే కావుననే వేదము భవరోగనివృత్తికిన్నీ, పరమాత్మ ప్రాప్తికిన్నీ కర్మ, ఉపాసనా, యోగ, జ్ఞానములను అనేకసాధనలను ఉపదేశించుచున్నది ఏలన జీవుల సంస్కారము లనేకములు

అంతవరకును ఆ సాధువుగారు ఓంకారరూపమగు పరబ్రహ్మోపాసన మాత్రమే చేయుచుండెను ఆయన ఒక విద్వాంసుడు కాకపోయినను, గొప్ప జ్ఞాపక శక్తియు, పరమ శాంతియు గలిగి మంచి బ్రహ్మనిష్ఠ కలిగి యుండెడి వాడు డాక్టరు గారికి ఈయనపై మంచి భక్తి గలదు డాక్టరుగారి వాక్యమును విన్నప్పటినుండి ఆయన కర్మోపాసనాది మార్గములన్నింటిని శివకేశవాది నామస్మరణము లన్నింటిని అంగీకరించి ఉపదేశించుటకు ప్రారంభించెను సర్వజ్ఞులగు మహాత్ములు ఈలాగుననే యుందురు తక్కిన వారలు గొప్ప వారై యున్నప్పటికిన్నీ యేదో యొకవిధమగు హృదయ సంస్కారమునకు, సంకుచిత భావమునకు లోబడినవారలని మనము గ్రహించుకొనిన చాలును ఈ విషయమై ద్వాదశాధ్యాయమునందు సర్వజ్ఞుడగు శ్రీకృష్ణభగవానుడు ఐదు విధులను చెప్పెను వీనిలో మీకు ఏది సాధ్యమగునో ఆ మార్గము ననుసరించిన మోక్షమును పొందవచ్చునని తెలుపడమైనది

## 1. జ్ఞాన యోగము

**మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ (12 - 8)**

ఈశ్వరుడగు నాయందు అనగా పరమాత్మయందు లేక పర బ్రహ్మమునందు మనస్సును, బుద్ధిని లయపరచుము, చేర్చుము ఇట్లు చేసితివేని నిశ్చయముగా అప్పటినుండి నాయందే యుండగలవు ఈ

విషయమునందు సందేహము లేదు ఇచ్చట ఈశ్వరుని బ్రహ్మమును ఒకే రూపముగా నిరూపించడమైనది ధ్యాన యోగమందు నిశ్చలమైన భావనకలిగి యుండవలెనని తెలుపడమైనది

## 2. ధ్యానయోగము

**అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।**
**అభ్యాస యోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ! ॥ (12 - 9)**

నేను చెప్పిన విధముగా నొకవేళ చిత్తమును నాయందు (ఆత్మ యందు) స్థిరమైన దానినిగా నిలుపుటకు సమర్థుడవు కాకపోతివేని పిమ్మట అభ్యాసయోగముచేత నన్ను పొందుటకు ప్రయత్నము చేయుము అభ్యాసయోగమనగా యమ నియమాది అష్టాంగ యోగములని గ్రహించేది జ్ఞానయోగమందు అనగా "అహంబ్రహ్మాస్మి" అను భావనయందు మనస్సు నిలుపక పోయినచో అభ్యాసయోగముచే అట్టి స్థితి పొందేలాగున చూడ వలయును

## 3. భక్తియోగము

**అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ ।**
**మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధి మవాప్స్యసి ॥ (12- 10)**

అభ్యాసము చేయుటయందును, సమర్థతలేనివాడవైతివేని నాకు ప్రీతికరమగు కర్మల చేయుటలో ఆసక్తిగలవాడ వగుము నాకు ప్రీతికరమైన కర్మలను చేయుచు నైనను మోక్షసిద్ధిని పొందగలవు

## 4. కర్మయోగము

ఈ కర్మయోగము కొంతభాగము పై చెప్పిన భక్తి యోగములో కలిసి యున్నది ఏలన భక్తి యోగమునకు కరణములు ఉండే తీరవలెను

**అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।**
**సర్వ కర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ (12 - 11)**

ఇదియును చేయుటకు అశక్తుడవైతివేని నన్నుగూర్చిన యోగము నవలంబించినవాడవై అటుపిమ్మట నియతమనస్కుడవై సమస్త కర్మముల ఫలములను విడచిపెట్టుట యనునది చేయుము పై శ్లోకమున భక్తియోగ మును చెప్పునప్పుడు కర్మయోగ సిద్ధాంతమగు ఫలాసక్తిని విడిచి చేయ వలెనని నిరూపించియుండలేదు తదేక భగవన్నిష్ఠతో చేసేలాగున తెలుపడ మైనది ఇప్పుడు సమస్త కర్మలయొక్కఫలమును కోరక భగవదర్పిత మనస్సు గలవాడై కర్మయోగమును చేయుటకు ఉపదేశించడమైనది భగవంతుడు జీవుల కనుగుణముగా నాలుగు మార్గముల నుపదేశించెను ఈ సత్యమును తెలసికొన జాలక కొందరికి ధ్యాన ధారణశక్తి లేకపోవుట వల్ల తమకు అట్టి నిష్ఠ కలుగలేదని తలంచి దుఃఖపడుదురు కావున అట్టివారు నామస్మరణ, భక్తియోగము నవలంబించిన చాలును దానికిన్నీ అనగా నామసంకీర్తన భజన కీర్తనాదులు చేయుటకు కారణాంతరముచే అవకాశము లేనివారు తాను చేయు సమస్త కార్యములను ఫలాసక్తి విడిచి, భగవదర్పణ బుద్ధితో చేయు చుండిన చాలును దీనివలన కూడా మోక్షము పొందనచ్చును కొందరికి ఇంటిలో స్వాతంత్ర్యము లేనందుచే నామస్మరణ, గీతాపారాయణాది పూజలు చేయుటకున్నూ అవకాశము లేనందున సంకటపడుదురు వీరిలో పురుషులు కొద్దిమంది మాత్రమే యుందురు స్త్రీలు చాలామంది ఉంటు న్నారు ఇంటిలోగల ప్రతిబంధముచే నామసంకీర్తన భజన గీతాపారాయణ భగవత్పూజాదులు చేయుటకు అనుకూలము గాకపోయినదిగదా! యని తలంచి దుఃఖపడుదురు అట్టివారికి తమ నియతమగు గృహకృత్యములు చేసికొని భగవదర్పణ బుద్ధి మాత్రము కలిగియుండిన చాలును వీరున్నూ తరింపగలరు జీవులపై ఎంతో కరుణ గలిగి భగవానుడు ఈ నాలుగు మార్గముల నుపదేశించెను. ఇందువల్ల కర్మయోగము గొప్పదా లేక భక్తియో గము గొప్పదా లేక జ్ఞానయోగము గొప్పదా అని ప్రశ్నించువారు ఏది గొప్పదో

తెలిసికొనవచ్చును

ఐతే 1 జ్ఞానయోగము, 2 ధ్యానయోగము, 3 భక్తియోగము 4 నిష్కామకర్మయోగము వరుసగా పైనుండి క్రిందికి చెప్పినను, క్రిందనుండి పైభాగమునకు చెప్పునప్పుడు 1 కర్మయోగము, 2 భక్తియోగము, 3 అష్టాంగయోగము 4 జ్ఞానయోగమని మనము గ్రహించుకొనవలయును అట్లైన మొదట కర్మయోగము అనుష్ఠించిమాత్రమే తక్కిన మూడు యోగములను క్రమముగా పొందగలమని నిర్ణయించు కొనవలయును వేదాన్తశాస్త్రము యొక్కపద్ధతి, క్రమము ఈలాగున నుంటున్నది నిష్కామ కర్మయోగముచే అంతఃకరణశుద్ధియు, ఉపాసనయోగముచే విక్షేపనివృత్తి యు, ధ్యానయోగముచే చిత్తైకాగ్రతయు, జ్ఞానయోగముచే మోక్షమున్నూ గలుగునని వేదాన్తక్రమము ననుసరించి శ్రీ భగవాను డుపదేశించెను ఇవి అనాదిగ వచ్చుచుండు వేదాన్త పద్ధతియని విజ్ఞులు గ్రహించేది ఇది ఈశ్వర నిర్ణయము ఐతే ఒక్కొక్క యోగము ప్రపంచములో క్షీణించునప్పుడు ఒక్కొక్క మహాత్ముడు దాని నుద్ధరించుటకు భూలోకమున పుట్టుచుండును వారువచ్చునప్పుడు వారుపదేశించెడు మార్గమే సత్యమనియు, జ్ఞానమనియు తెలుపుచుందురు లేనిచో వారిమతము నిలువ జాలదు జనులున్నూ దాని యందు ప్రవేశించరు ఇదొకపద్ధతి జ్ఞానయోగము క్షీణించినప్పుడు శంకరా చార్యులు అవతరించి దానిని నిలబెట్టెను భక్తియోగము క్షీణదశకు వచ్చినప్పుడు శ్రీరామానుజాచార్యులు, శ్రీకృష్ణచైతన్యులు ఆవిర్భవించి, భక్తి కాధిక్యమొసంగిరి, ఆలాగున కర్మయోగము క్షయమొంది రాగారాగా శ్రీమధ్వాచార్యులు, శ్రీ గాంధీగారలు ఉద్భవించి, కర్మయోగమునకు ఆధిక్యమొసంగిరి మతముల యొక్క నడత ఈలాగున నుండును. వేదన్తడిండిమమునందు శంకరులు చెప్పినది చూడుడు

**కర్మాణి చిత్తశుద్ధ్యర్థం ఐకాగ్ర్యార్థముపాసనా ।**
**మోక్షార్థం బ్రహ్మవిజ్ఞానమితి వేదాన్త డిండిమః ॥**

అంతఃకరణ శుద్ధికొరకు నిష్కామయోగమున్నూ, చిత్తైకాగ్రత కొరకు ఉపాసన యోగమున్నూ, మోక్షము కొరకు జ్ఞానయోగమున్నూ ఉపదేశింప బడినట్లు వేదాంతభేరి ఘోషించుచున్నది అంతఃకరణములో మలవిక్షేప ఆవరణములను మూడుదోషములు గలవు ఆత్రిదోష నివారణకొరకు త్రివిధయోగములను ఉపదేశించినట్లు మనము గ్రహించుకొనవలయును మరియు త్రయోదశాధ్యాయమున తెలిపినది చూడుడు

**ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ (13 - 25)**

పరమాత్మను తనయందున్నవానినిగా శుద్ధమనస్సుతో కూడిన ధ్యానయోగముచేత కొందరున్ను,మరికొందరు ఆత్మానాత్మ విచారణ పరమగు సాంఖ్యయోగముచేతను, ఇక కొందరు నిష్కామకర్మయోగము చేతను చూచుచున్నారు ఇచ్చట 1 ధ్యానయోగము (ఇది జ్ఞానాయోగముతో చేరినది ) 2 ఆత్మానాత్మ విచారణ పరమగు సాంఖ్యయోగము, 3 నిష్కామకర్మయోగము, ఈలాగున మూడు పద్ధతులు తెలుపడమైనది ఇది ఇచ్చట ఎందుకు నిరూపించడమనగా కర్మయోగమే గొప్పది అదే శ్రీకృష్ణ మతము, అదే గీతయొక్క ఆశయము అని చెప్పువారు గ్రహించుటకొరకు నిరూపించడమైనది పైచెప్పిన నాలుగు యోగములున్నూ, ఇచ్చట చెప్పిన మూడు యోగములున్నూ గాక మరియొక ప్రత్యేక యోగమును నిరూపింప బోవుచున్నారు పై చెప్పిన ఏడు యోగములను అనుష్ఠించుటకు శక్తి లేనివారై, ముదుసలివారలై యుండువారిపై కరుణ గలిగి, ఈ ప్రత్యేక యోగమును శ్రీకృష్ణభగవాను డుపదేశించెను

**అన్యేత్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ (13 - 26)**

మరికొందరు పైన చెప్పిబడిన ధ్యానయోగము, సాంఖ్యయోగము కర్మయోగము అను వాటిలో దేనినైనను ఆచరించి, పరమాత్మను ఎరుంగ

లేనివారైనచో, పరమదయాళురగు గురువులవలన "పరమాత్మనిట్లుపాసన చేయుడు" అని ఉపదేశింపబడినవారై స్వయముగా వేదాన్తశాస్త్ర విచారణము నందు సమర్థులై సద్గురూపదేశమున విన్న దానియందాసక్తి గలవారై యుండినచో, మరణరూపమగు సంసార సాగరమును తప్పక తరింతురు దీనికి గురుయోగమని పేరు పైన చెప్పిన వృద్ధులగు స్త్రీ పురుషులే గాక, విద్య నేర్చి సారము గ్రహింప శక్తిలేని ఇతరులు గూడా ఈ గురుయోగమును శీలించిన చాలును పై చెప్పిన యోగులకన్న వీరు ముందుగా మోక్షమును పొందగలరని భగవానుడు అభయమిచ్చెను "అతితరంతి" అని ప్రయోగించు టకు కారణమిదే శాస్త్రములు చదివిన వారికి అనేక సందేహములు కలుగును వీరికి అట్టి సంశయములు కలుగవు గురువాక్యములో ఒక్కటే భల్లూకపు పట్టుగలిగి యుందురు అందువల్లనే పైనుదాహరించిన వారి కన్న వీరు ముందుగా మోక్షమును భగవత్ప్రాప్తిని పొందగలరని భగవంతు డుపదేశించెను మరియు వారికి ధైర్యము కలుగుటకున్నూ దయ గలిగి భగవానుడిట్లు వచించెను కావున ముదుసలి వారలున్నూ, విద్యలేని వారున్నూ ఇక భయపడనక్కరలేదు పై నుదాహరించిన యోగములలో ఏదో ఒకటైనను దృఢముగా అనుష్ఠించిన చాలును అన్నియు అనుష్ఠించలేరని సంశయపడ నక్కరలేదు ఈ విషయమై ఐదవ అధ్యాయములో తెలిపినది చూడుడు

**సాంఖ్య యోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః ।**
**ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ॥ (5 - 4)**

జ్ఞానయోగఫలము వేరు, కర్మయోగఫలము వేరని అవివేకులు చెప్పు చున్నారు జ్ఞానులట్లు చెప్పుట లేదు ఏలననగా రెంటిలో నొకదానిని గాని బాగుగా ననుష్ఠించిన వాడు రెండింటి యొక్క ఫలమైన మోక్షమును పొందు చున్నాడు మోక్షము బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము అను నాలుగు ఆశ్రమములకు సంబంధించినదని గాని, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, స్త్రీ పురుషాదులకు సంబంధించినదనిగాని చెప్పుటకు లేదు ఇదే

పరమ సత్యము ఆత్మశుద్ధిగలవారైనను ఈ జ్ఞానమును పొందవచ్చును, అంతేగాదు, భేదము గలదని చెప్పువారల గురించి శ్రీభగవానుడే వారిని 'బాలాః' అని చెప్పిరి భేదము చెప్పువారి మాటలు పిల్లవారి మాటలవలె అర్థము లేనివని భగవానుడే తెలిపెను దీనికన్న ఇక మీకు అభయము ఏమి కావలయును? అట్టి వారిని 'న పండితాః' అని గూడా తెలిపిరి వారు పండితులు కారు అని అర్థము

**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।**
**ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥ (5 - 5)**

జ్ఞాన నిష్ఠులైన సన్న్యాసులచే ఏమోక్షస్థానము పొందబడునో, అట్టి మోక్షస్థానము గృహస్థులగు నిష్కామకర్మయోగులచేతను పొందబడును సాంఖ్యయోగమును, కర్మయోగమును ఒకేఫలము గలవిగా నెవ్వండెరుంగునో, అతడు సరిగా శాస్త్రజ్ఞాన మెరింగినవాడు 'యః పశ్యతి స పశ్యతి' అని ప్రయోగించుటవల్ల పై చెప్పిన ఉభయులున్నూ పొందెడు గమ్యస్థానమొక్కటే యని యెవడు జ్ఞానదృష్టితో చూచినవాడో, వాడే నిజముగా చూచినవాడగును తక్కినవారు శాస్త్రములో గ్రుడ్డివారలు ఓహో! ఎంత పరమ సత్యమును భగవంతు డుపదేశించెను ఇక కర్మయోగము గొప్పదా? జ్ఞానయోగము గొప్పదా? సన్న్యాసము గొప్పదా? లేక సంసారము గొప్పదా? అని సంశయించువారికి అవకాశము లేదు ఇక పండ్రెండవ అధ్యాయమున చెప్పిన నాలుగు మార్గములను, పదమూడవ అధ్యాయమున తెలిపిన మూడు పద్ధతులను సంగ్రహించి, అష్టమాధ్యాయమందు రెండుమార్గములుగా భగవంతు డుపదేశించెను ఇవి రెండున్నూ ఉండవలసినవే దానియందు మొదటనే ఏడు ప్రశ్నలు గలవు కట్టకడపటి ప్రశ్న ఏమన 'ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః'? ప్రాణప్రయాణకాలములో ఆత్మనిష్ఠ గలవారు, భగవన్నిష్ఠగలవారు, ఎట్లుండిన భగవంతుడవగు నిన్ను పొందగలరు? ఇది ప్రతివారికిన్నీ కావలసిన విషయము గదా! ఇచ్చట గూడా బ్రాహ్మణాది జాతులను గూర్చిగాని, సన్న్యాసాది ఆశ్రమముల గురించిగాని,

స్త్రీ పురుషుల గూర్చిగాని లేదు ఇదే గీత యొక్క విశాల భావమున్ను, విశ్వాత్మక బుద్ధియున్ను అగును

**అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥ (8 - 5)**

ఎవడైతే మరణ కాలమునందు నన్నే స్మరించుచు, లేక ధ్యానించుచు దేహమును విడిచి పోవుచున్నాడో, వాడు నాయొక్క విష్ణుస్వరూపమును లేక మోక్షమును పొందుచున్నాడు ఈ విషయమునందు కొంచెమైనను అనుమానము లేదు

**సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్ ॥ (8 - 12)**

సకలేంద్రియములను చక్కగా నియమించి, మనస్సును హృదయమునందు నిరోధించి, తనయొక్క ప్రాణమును, ప్రాణమును ప్రేరణచేసెడు ముఖ్య ప్రాణమగు ఆత్మను మూర్ధస్థానమునందు (బ్రహ్మరంధ్రమునందు) లేక బ్రహ్మభావమునందు ఉంచి, యోగధ్యానము స్థిరముగా చేయువాడగుచు ఉత్కృష్టమైన మోక్షమును పొందుచున్నాడు

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥ (8 - 13)**

బ్రహ్మమును ప్రతిపాదించునట్టి "ఓం" అనునట్టి ఏకాక్షరమగు ప్రణవమును ఉచ్చరించుచున్నవాడును, ఆ ఓంకారమునకు అర్థమైన పరమాత్మయగు నన్ను స్మరించుచున్నవాడును, శరీరమును విడుచుచున్నవాడై యెవడు పోవుచున్నాడో, అట్టివాడు సర్వోత్తమమైన గతిని, మోక్షమును, బ్రహ్మమును పొందుచున్నాడు

ఇక ప్రణవమును అందరు ఉచ్చరించవచ్చునా? లేదా? యను సంశయమున కవకాశము లేదుగదా! మీకు భగవద్వాక్యమున నమ్మకము

గలదా? లేక ప్రపంచములోగల సామాన్య మనుష్యుల వాక్యములో విశ్వాసము గలదా? హైకోర్టు విధి తెలిసియున్నవారికి క్రిందికోర్టుల వాక్యమును గురించి భయము కలుగునా? మీరే నిర్ణయించుకొనవలసి యుందురు "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్" అను దానియందు ఓంకారమును ఉచ్చరించినంత మాత్రమున చాలదనియు, "మామనుస్మరన్" ఓంకారార్థ మగు పరబ్రహ్మమును భావన చేయవలయుననియు ఉపదేశించడమైనది ఇచ్చటనే పొరపాటు కలుగుచున్నది అది కలుగనీయక చూచుకొనవలయును ప్రణవము నుచ్చరించి పరబ్రహ్మభావన చేయకపోయినచో, తుపాకిమందును ఫిరంగిలో కూర్చి గుండు వేయక కాల్చినట్లుండును అది ధ్వనిమాత్రము ఉండునేగాని, లక్ష్యమును భేదింపజాలదుగదా! ప్రణవోపాసకులు దీనిని మనస్సునందుంచు కొనవలయును

**అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।**
**తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః ॥ (8 - 14)**

ఓ అర్జునా! ఏధ్యానయోగి ఇతర విషయమైన చింతలేనివాడై, బ్రతికి యున్నంత వరకును, ఎడతెగక నన్ను స్మరించుచుండునో, సర్వకాలముల యందును సమాహితచిత్తుడైన యట్టి యోగికి నేను సులభుడనై యుందును ఈ శ్లోకమందు నామస్మరణయొక్క, సంకీర్తన యొక్క, భజన యొక్క ప్రభావము తెలుపడమైనది కావుననే "తస్యాహం సులభఃపార్థ" అని ప్రయోగించుట వల్ల ఈనామస్మరణ సంకీర్తన మార్గము మోక్షమునకు సులభమని భగవానుడే తెలిపెను ఇది సులభమార్గమని చెప్పినప్పుడు పైన చెప్పినది కఠినమార్గమని అర్థమగుచున్నది దీనికి ధ్వన్యర్థమని పేరు. ధ్వన్యర్థమనగా శబ్దశక్తి ద్వారా ఒక అర్థము గ్రహింపబడగా, వ్యంజనాశక్తితో తదతిరిక్తమగు మరియొక అర్థము గ్రహించుట ఎట్లన "వీడు నాకనిష్ఠ పుత్రుడు"! అని చెప్పినప్పుడు జ్యేష్ఠపుత్రుడు ఉన్నాడని ఆధ్వనిలోనే అర్థము ఇమిడి యున్నది ఐతే అట్టి కఠిన మార్గమున్నూ, ప్రణవోపాసనయున్నూ చెప్పనిచో భగవద్గీతకు ప్రభావమే ఉండదు పండితులు, బ్రహ్మనిష్ఠులు,

సన్న్యాసులు భగవద్గీతను ముట్టనేముట్టరు అది భగవంతునికి తెలుసును గీత యేదో సామాన్యజనులకు నామస్మరణ చేసికొని తరించుట కేర్పడిన గ్రంథమని పై చెప్పినవారు తలంతురు కావున మొదటి శ్లోకములో, వేదములో, ఉపనిషత్తులో, యోగశాస్త్రములో చెప్పిన అగాధమగు గంభీరార్థ మును ఉపదేశించి, దానికి శక్తిలేని వారికి రెండవదగు నామస్మరణ, సంకీర్తన ముపదేశించడమైనది దీనియందు గూడా 1 "అనన్యచేతాః" 2 "సతతం" 3 "నిత్యశః" 4 "నిత్యయుక్తస్య యోగినః"అని నాలుగు విశేణములు తెలుపడ మైనది నామస్మరణము చేయువారు, సంకీర్తన పరులు ఈ నాలుగు లక్షణ ములు తమకు కలిగియున్నవా? లేవా? యని తమలో తాము ఆలోచించు కొనవలయును నామస్మరణము మాత్రముచేసి, అట్టి విశేషణములు లేనిచో ఔషధసేవ మాత్రము చేసి, పథ్యము మాత్రము చేయని వారిగతియే తమకు కలుగునని మనస్సులో నుంచుకొనవలయును



# మనో నిరోధ రహస్యము

చాలామందిన్నీ మాకు మనస్సు ధ్యానములో ఏకాగ్రత నొందలేద నియు, ధ్యేయాకారము అవగాహనము కాలేదనియు, ఆ ధ్యానకాలములోనే మనస్సనేక విషయములలోనికి పరుగెత్తి పోవుచుండుననియు చెప్పుదురు ఈవాక్యము వారికి నియమము లేదని చెప్పకయే చెప్పుచున్నది మనస్సు ధ్యానములో తదేకనిష్ఠగలిగి, నిశ్చలత గలిగి, ధ్యేయాకారమగు ఆత్మలోగాని, జ్ఞేయమగు దైవములో గాని నిలుపవలసియుండిన వారు నాలుగు నియమ ములను తప్పని సరిగా కొంతకాలము అనుష్ఠానములో నుంచవలయును. అట్లైన వారి మనస్సు ఎంతకాలము ధ్యానములో ఏకాగ్రత గలిగి, నిరోధము గలిగి జ్ఞేయమగు ఆత్మలో నిలుపవలసి యుండునో, అంతసేపు నిశ్చేష్ట కలిగి ఉండిపోవును. (1) ఆహార నియమము (2) నిద్రానియమము. (3) శరీర

పరిశ్రమనియమము (4) ధ్యాన నియమము శరీరము ఒక యంత్రము వంటిది అలారము కొట్టెడి గడియారమును మీరు చూచియున్నారు గదా! ఏటైమునకు ఘంట కొట్టవలయునో, ఆసమయమునకు తప్పక ఘంట వాయించుచుండును కావుననే మహనీయులైనవారు పై నుదాహరించిన చతుర్విధ నియమములను అనుష్ఠించుచున్నారు అట్లు లేని కారణము చేతనే ధ్యానములో మనస్సు ఏకాగ్రత గలిగి నిలువకపోవుటకున్ను, దృశ్య విషయములోనికి పరుగెత్తి పోవుచున్నది ప్రకృతిలోనే, సృష్టిలోనే ఈశక్తి యుంటున్నది, మీరెవరైనను ప్రాతఃకాల ఉపాహారమునుగాని, మధ్యాహ్న భోజనముగాని, రాత్రి ఆహారముగాని నియమముగా కొన్ని రోజులు శీలించి వచ్చుచుండినచో, ఆ సమయము వచ్చుసరికి మీకు ఆకలి కలుగుచుం డును విసర్జనమున్ను ఆలాగుననే యుండును ప్రాతఃకాలమున ఐదు గంట లకుగాని, ఆరు గంటలకుగాని మీకు బహిర్భూమికి వెళ్ళు అభ్యాసముండిన ఆ సమయమునకు శుద్ధముగా విసర్జనము జరుగును ఇతర సమయము లలో ప్రయత్నించినను విసర్జనము జరుగదు ఇది మీ అనుష్ఠానములో చూచుకొనవచ్చును

సృష్టియొక్క శక్తినిగురించి మరియొక్క విషయము తెలిపెద సముద్ర తీరమునకు కొన్నిమైళ్ల దూరములో నదీతీరమున నివసించువారందరికిన్ని ఈ సత్యము గోచరించును చంద్రోదయమున సముద్రము పొంగుచున్నట్లు మీరు శాస్త్రములో వినియున్నారు కారణము కనుగొనుటకు యత్నించు వారు అరుదు చంద్రోదయమున సముద్రము పొంగుటకు కారణమేమన చంద్రుడుదయించు రేఖలోనికి వచ్చునప్పుడు భూమిని ఆకర్షించుచుండును భూమియొక్క ఆ భాగమును చంద్రుడాకర్షించుటవల్ల ఆ భాగము కొంతపైకి లేచుటవల్ల జలము తక్కిన భాగములోనికి ప్రవహించుచుండును దృష్టాంత ముగా ఒక పళ్ళెములో నీరుపోసి, ఒక అంచును కొంచెము పైకి లాగివేయండి నీరంతయు మరియొక ప్రక్కకు పోవుచుండును మీరు పట్టుకొనిన ఆ భాగమునే నింపాదిగా క్రిందికి దింపినచో క్రమముగా ఆనీరంతయు పళ్ళెము

లోపల అంతటను సమాన స్థితిలోనికి వచ్చును ఇదే సముద్రము యొక్క ఆటు పోటులకు కారణము చంద్రోదయమందును, చంద్రాస్తమయము నందును, దినమునకు రెండుసార్లు ఇట్లు జరుగుచుండును చంద్రోదయ మున భూమి ఏ భాగముపైకి ఆకర్షింపబడుచుండునో, మరల చంద్రుడు భూమికి మధ్య భాగమునకు వచ్చునప్పటికి ఆరుగంటల సమయము పట్టును మరల చంద్రుడు భూమధ్యరేఖనుండి క్రమంగా అస్తమించుటకు ఆరు గంటలు పట్టును అప్పుడు ఆ భాగమునకు భూమి ఆకర్షింపబడుటవల్ల సముద్రజలము ఆ ప్రక్కకు పోవుచుండును నదియొక్క ఆటుపోటులకు కారణమిది

ధ్యానముయొక్క రహస్యమున్ను ఇట్లుండును మనస్సు అంత ర్ముఖము అగుటకున్ను, బహిర్ముఖమున తిరుగుటకున్ను కారణము ఇదియే యగును మనస్సుయొక్క అధిదేవత చంద్రుడు, ఈ తత్త్వమును గ్రహించియే యోగులు సంయమనిష్ఠ గలవారైయుండిరి ఐతే ఇది సూర్యో దయమువలె ప్రాతఃకాలముదయించుట, సాయంకాలము అస్తమించుట వంటిది కాదు చంద్రోదయాస్తమయములకు, సూర్యోదయాస్తమయముల కున్ను రెండు ఘడియలు మార్పుగలదు కనుకనే శుక్లపక్షపాడ్యమి మొదలు ఆ పక్షమంతయు చంద్రోదయమునకు రెండుగడియల మార్పు గలుగును మరియొక్క సృష్టి సూక్ష్మమును గూర్చి తెలిపెద సూర్యో దయమున తామర పుష్పము క్రమముగా వికసించును సూర్యాస్తమయమున నింపాదిగా ముడుచుకొనిపోవును పద్మ సరస్సు సమీపములో వెళ్ళి కూర్చుండిన దీనిని మీరు తెలిసికొనగలరు ఆలాగున భాస్కరోదయమున కువలయము ముకుళించుకొని, సూర్యాస్తమయమున వికసించుచుండును తామరపువ్వు లకు పగలు జాగ్రత్తయు, రాత్రులందు నిద్రయుగలుగును. కలువలకు పగలు నిద్రయు, రాత్రిలో జాగరణము సృష్టిలోనే గలిగియున్నది. మరియు ఉసిరిక చెట్టుయొక్కయు, గోగుచెట్టుయొక్కయు సమీపమున మీరు అస్తమయకాలములో వెళ్ళిచూచిన ఆకులన్నియు ముడుచుకు పోవుచుం

డును ఆవృక్షములకు రాత్రి నిద్రాకాలము, మరల ప్రాతఃకాలమున పత్రము లన్నియు వికసించుచుండును కావున వృక్షలతాదులకు కూడా నిద్ర జాగృతులు కలవు ఆలాగున జంతువర్గములో గూడగలదు గుడ్లగూబలకు పగలు నిద్ర, రాత్రి జాగరణము ఈలాగున పక్షులలోను, వృక్షలతాదుల లోను గలవు కావుననే సంయమి ఈ సత్యమును కనుగొని అనుష్ఠించుటవల్ల మనోనిరోధము కలిగి యుండును కావున పైజెప్పిన నాలుగు విధులను కొంతకాలము మీరాచరించినచో అప్రయత్నముగా, సులభముగా మనో నిగ్రహమును చేయగలరు ఈ విషయము గీత 6-వ అధ్యాయమున శ్రీకృష్ణ భగవానుడుపదేశించెను

**యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥**

ఉచితమైన ఆహారవిహారములు గలవాడును, కాలోచితమైన యనుష్ఠానములను నెరవేర్చుటయందు ఉచితమగు ప్రవర్తన గలవాడును, ఉచితమైన నిద్రా జాగరణములుగల యోగికి సమస్త దుఃఖములను పోగొట్టు యోగసిద్ధి గలుగును అట్లు కానివారి స్థితిని ఈ అధ్యాయములోనే శ్రీకృష్ణ భగవానుడు నిరూపించెను

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥**

అభ్యాస వైరాగ్యములచేత నిగ్రహింపబడని మనస్సు గలవాడు యోగమును బొందజాలడు మాటిమాటికిని ఎడతెగక ప్రయత్నించుచు అభ్యాసవైరాగ్యములతో గూడిన మనోనిగ్రహమనునట్టి యుపాయము వలన యోగమును పొందును ఇట్టి అభ్యాసము నెట్లు చేయవలయునో ఆ విషయ మున్ను శ్రీకృష్ణుడు ఈ అధ్యాయములోనే నిరూపించినాడు

**శనైశ్శనై రుపరమేద్బుద్ధ్యా ధృతి గృహీతయా ।**
**ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥**

ధైర్యము నవలంబించిన ధృఢమైన బుద్ధిచేత మనస్సును ఆత్మ యందు నిలకడగా జేసి మెల్ల మెల్లగా ఆత్మోన్నతి పొందవలయును లేక మనస్సును ఆత్మలో లయపరచవలెను తరువాత ఆత్మతత్త్వముకంటె నితరమైన దానిని కొంచెమైనను చింతన చేయకూడదు మీరు ఒక వారము లేక నెలరోజులు అభ్యాసము శీలించి "మనోనిరోధము గలుగుట లేదు ఈశ్వర సాక్షాత్కారము సిద్ధించలేదు" అని తలంచి మీ అనుష్ఠానమును విడువరాదు సంస్కృతములోగాని, ఇంగ్లీషులోగాని, హిందీలోగాని ఒక విద్యలో పూర్తి నిష్ణాతుడు కావలసియుండినచో ఎన్ని సంవత్సరములు పట్టుద లతో చదువవలయునో మీకు తెలిసిన విషయమేగాదా! అట్టి దానివల్ల గలిగెడు ఉద్యోగముచే వచ్చెడిధనము, సుఖము గూడా ఈ దేహముండు వరకేగదా! అట్లుండగా శాశ్వతమైన అనంతమైన బ్రహ్మసుఖమును పొందుటకు ఎంత ప్రయత్నము చేయవలెనో మీరే ఆలోచించుకొనిన ఈ సత్యము బోధపడ గలదు

అభ్యాసముయొక్క ప్రయోజనము యోచించుకొనుడు దుర్గమమైన అరణ్యప్రదేశమును శుద్ధపరచి ఎట్లు సుగమమొనర్చుచున్నామో అగాధము లైన నదులను వారధిచేత ఎట్లు గమ్యములనుగా చేయగలుగుదుమో, అతి దుర్లభమగు పర్వతములను సొరంగముచేసి, సుగమమొనర్చుచున్నారో, రైలు నడుపుచున్నారో ఇవన్నియు అభ్యాసముచే కలిగెడి ఫలితమని గ్రహింపుడు, రైలుచే భూమిని, నావచే సముద్రమును, విమానముచే ఆకాశమును ఎట్లు దాటుచున్నారో అభ్యాసముయొక్క ఫలితమున్ను ఈలాగున నుండునని గ్రహింపుడు కావున అనుష్ఠానపరులై యుండుడు తరించగలరు, శాంతి నొందగలరు శాశ్వతానందము ననుభవించగలరు. అభ్యాసముచే కోతి సైకిల్ త్రొక్కుట సర్కసులో చూడ లేదా! ఏనుగు శంఖమూదుట కనుగొన్నారుగదా! ఎలుగుగొడ్డు నమాజు చేయుట చూచియున్నారు కదా! త్రాచుపామును పాములవాడు బూరవూది ఆడించుట కనుగొన్నారుగదా! దీనికన్నా ప్రయా సమా తెలివిగల మానవుని మనస్సును శాంతపరచుట! కావున అభ్యాసము

చేయక పోవుటయే దేనినిన్నీ మానవుడు పొందక పోవుటకు కారణము



# సర్వత్రా రెండే ప్రశ్నలు

ఏ సమాజమునకు, ఏ సంఘమునకు, ఏ సభకు వెళ్ళినను జనులు రెండే ప్రశ్నలడుగుదురు సామాన్యముగా విరక్తులు, సాధువులు, సన్న్యాసులు, ఉండే స్థలమునకు వచ్చువారున్ను ఈ రెండు ప్రశ్నలనే వేయుదురు వీరు చాలా వరకు ధన్యాత్ములే

1 మనస్సు ధ్యానములో నిలుచుట లేదు దానికి ఉపాయమేమి?

2 మేము ఎంత ప్రయత్నించినను మనస్సు ప్రపంచ విషయముల లోనికే పోవుచున్నది దీనికి కారణమేమి?

ఈ రెండవ ప్రశ్నకన్న మొదటి ప్రశ్న వేసినవాడు ఇదివరలో కొంత అనుష్ఠానము గలవాడే రెండవవాడు ఏదైన సాధన చేయవలయునని అభిలాష గలవాడే ఈ విషయమై శ్రీకృష్ణభగవానుడు 'జనాస్సుకృతినోఽఽర్జున!' అనియు, 'ఉదారాస్సర్వ ఏవైతే,' అనియు తెలిపిరి సుకృతము గలుగునపుడే తరించవలయునని తలంపున్ను, దైవ జ్ఞానమును సంపాదింప వలయునను బుద్ధియు గలుగును తక్కిన వారికి గలుగదు వీరి జీవితము అరుణోదయమువంటిదే అరుణోదయమునకు గుఱుతు ఏమన! రాత్రి గతించినదనియు, సూర్యుడుదయించుటకు కాలమాసన్న మైనదనియు నెట్లు తెలుసుకొనుచున్నామో, ఆలాగున పైజెప్పిన వారియొక్క స్థితియున్ను గలిగియున్నది అజ్ఞానమయమై, పాపరూపమై పాపకర్మసంబంధమైన హద్దును దాటి వచ్చినవారనియు, ఆత్మజ్ఞాన సూర్యోదయమునకు దగ్గర చేరిన వారనియే గ్రహించవలయును వీరు తమ అనుష్ఠానమును కొంచెము తీవ్రముగా చేసినచో త్వరలోనే భవబంధమునుండి విముక్తి జెందగలరు.

వీరు, ఒక ఉద్యోగస్థుడు లేక ఒక వ్యాపారస్థుడు ఏలాగున తన జీవితమును గడుపుచున్నారో, ఆలాంటి ప్రవృత్తి గలిగియుండవలయును పైన చెప్పిన ఉభయులున్ను ప్రాతఃకాలమున అయిదింటికి గాని అయిదున్నరకుగాని, ఆరింటికిగాని లేచి స్నానాది కార్యముల నిర్వహించుకొని, అల్పాహారమును గ్రహించి వారి వారి ఉద్యోగములకుగాని, వర్తక కొట్టులకు గాని యెట్లు వెళ్ళుచుందురో, ఆలాగున ఈ సాధకుడున్ను ప్రాతఃకాల కాలకృత్యము లొనర్చుకొని, తనకు శక్తికొలది కొంత కాలము ధ్యానము, జపము, లేక గీతాదిపారా౹ ౹ణము చేసిన తరువాత తాను చేయవలసిన లోకవ్యవహారము నకు వెళ్ళేలాగు౹ ఒక యేర్పాటు చేసుకొనవలయును ధ్యాన జపాదులలో మనస్సు నిలకడ గలుగకపోయిన, జపమాలను పట్టుకొని, తన కెంతవరకు సాధ్యపడునో అంతవరకు దివ్యమంత్రమును జపమొనర్చవలయును మనస్సు దైవభావములో ధ్యానములో నిలువనీ, నిలువకపోనీ తాను నియ మించుకొన్న సమయము వరకు జప మొనర్చవలయును

ఈలాగున క్రమాభ్యాసము చేయుచు రాగా రాగా మనస్సు యొక్క బహిర్గమన వేగము తగ్గి క్రమముగా కొంతకాలమునకు స్వాధీనమునకు వచ్చును అయితే ఈ విషయమై కొందఱు వేదాంతులు ఈ లాగున చెప్పు దురు. మీకు సమయము చాలా తక్కువ అట్లుండ మాలను చేబట్టి జప మొనర్చిన ఆ సంఖ్యయందే మనస్సు పోవును కావున మాలను గ్రహింపక, సమయమును చూడక ఉండే స్వల్పకాలము ధ్యేయమగు, జ్ఞేయమగు, సర్వ సాక్షియగు ఆత్మలోనే నిలకడ గలిగే లాగున చూడవలయునని చెప్పుదురు ఈమాటలను ఎప్పటికిని నమ్మకుడు వారు చెప్పినది ఒక విధమైన సత్యమై నను, మనస్సు ఉపశమించక, వృత్తిలయ మొందక, జ్ఞేయస్వరూపమగు ఆత్మలో నిలుకడ యెట్లు గలుగును? అట్టివారితో దినమునకు పగలు 12, రాత్రి 12 గంటల సమయము గలదుగదా! కావున ఏదో కొంతసేపు అర్ధగంట గాని, ముప్పాతిక గంటగాని, ఒక గంట కాలముగాని జప, పారాయణాదు లొనర్చిన పిమ్మట తక్కిన కాలము నంతయు మీరు చెప్పేలాగున ధ్యేయైక

స్థితిలో ఉండేలాగున చేసెదమని సమాధానము చెప్పిన చాలును వారు చెప్పిన దెట్టిదన! మీకు ఉద్యోగము దొరికిన చాలును గదా! చదివి పరీక్షలో ఉత్తీర్ణులు కావలసిన అవసరమేమి! అని చెప్పినట్లుండును పరీక్షలో ఉత్తీర్ణుడు కానిచో ఉద్యోగమున కెట్లు అర్హత గలుగును అను తత్త్వమును వారు మరచిపోయిరి

పైన జెప్పిన విధముగా అనుష్ఠానమును చేయుచు రాగా రాగా శుక్లపక్ష చంద్రుడు దినదినాభివృద్ధి జెందుచుండగా చీకటి ప్రతిదినము తొలగి పోవునట్లు, మీ యొక్క సాధనలో ఇట్టి అనుభవము గలుగును పదహైదు రోజులు శుక్లపక్షమున గడువగా పూర్ణిమ రోజున పూర్ణచంద్రుడు, అస్తమయమునుండి మరురోజు ఉదయము వరకు ఏలాగున చీకటిలేకనే ప్రకాశించుచుండునో, ఆలాగున మీ హృదయాకాశమున పూర్ణప్రబోధ జ్ఞానము కలిగి సంపూర్ణాజ్ఞాన రహితమైన అవస్థగలుగును అయితే ప్రతి రోజున్ను మీ యనుష్ఠానమును పూర్తిచేయక జలపానమును చేయకూడదని ఒక దృఢమైన వ్రతమును అవలంబించు కొనవలయును కారణాంతరముచే ఒకానొక రోజు సాధ్యము గాకపోయినను, ఆరోజు రాత్రి నిద్రించుటకు ముందుగా, తన యనుష్ఠానమును పూర్తిచేయులాగున యత్నింపవలయును, అట్లున్ను, సాధ్యముకానిచో పూర్ణిమలోపల ఒక రోజుగాని, రెండు రోజులుగాని దీనికొరకు సమయము నుపయోగ పఱచ వలయును,, అట్లు చేయకపోయిన సేతుస్నానమునకు వెళ్ళి సముద్రపు అలలను చూచి భయపడి యాకల్లోలము అణగిన తరువాత స్నానము చేయవచ్చునని తలంచిన వాని గతియే గలుగును సముద్రమున్నంత వఱకు తరంగము లుండియే యుండును అయితే సేతుస్నానమునకు పోయిన వారెవరున్ను స్నానము చేయక తిరిగి వచ్చుట లేదు ఈ సత్యమును గూడ మీరు మనస్సులో ఉంచవలయును కావుననే శాస్త్ర మీలాగున చెప్పినది

**శాన్తే సముద్రకల్లోలే స్నాన మిచ్ఛతి మూఢధీః ।**
**తథైవ శా న్తే సంసారే జ్ఞానమిచ్ఛతి దుర్మతిః ॥**

సముద్రముండువరకు తరంగములుండునట్లు సంసారముండు వరకు ఒక సంకల్పము పూర్తియైన మఱియొక సంకల్పముత్పన్న మగుచుండును సంసార ముపశమించిన తరువాత జ్ఞానమార్జించు కొందమని మూఢుడు తలంచును ఇది మొదటి వానిని గూర్చి తెలుపడమైనది

రెండవ వాడున్ను కొంచెము కొంచెము పారాయణగాని, ప్రార్ధన గాని, జపముగాని చేసుకొని రావలయును ఈ సంవత్సరము పాఠశాలలో ప్రధమ శ్రేణిలో ప్రవేశించిన వాడు, మరు సంవత్సరము ద్వితీయ శ్రేణిలోనికిని, ఆలాగున ప్రతి సంవత్సరమున్ను, తృతీయ, చతుర్ధ శ్రేణులలో ప్రవేశించి ఎట్లు తన విద్యను పూర్తిచేయుచున్నాడో, బ్రహ్మవిద్యయొక్క స్థితియు ఈలాగున నుండును విద్య పూర్తి అయిన తర్వాత ఉద్యోగమున కెట్లర్హుడగుచున్నాడో, ఆలాగున తన అనుష్ఠానము పూర్తి అయినచో జీవన్ముక్తి పదవికి అర్హుడై బ్రహ్మానందము ననుభవించి బ్రహ్మ ప్రాప్తిని పొందుచున్నాడు

**శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా ।**
**ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥**

ధ్యాన యోగి యెట్లుండవలయునో శ్రీకృష్ణభగవానుడు ఈ శ్లోకమున దెలిపెను

ధైర్యము నవలంబించి దృఢమైన బుద్ధిచేత మనస్సును ఆత్మయందు స్థిరపరచి, మెల్లమెల్లగా ఆత్మోన్నతిని పొందవలయును లేక మనస్సును ఆత్మలో లయపరచవలయును. తరువాత ఆత్మతత్త్వము కంటె నితరమైన దానిని దేనిని ఇసుమంతయు చింతింపరాదు

**పార్థ! నై వేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే ।**
**న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత! గచ్ఛతి ॥**

ఓ అర్జునా! యీ బ్రహ్మవిద్యయందాసక్తి గలిగి అణుమాత్రమేని అనుష్ఠానము గలిగిన వానికి ఈ లోకమునగాని పరలోకమునగాని, వినా

శము లేదు ఓ నాయనా! శుభప్రదమగు జ్ఞాన యోగమున ప్రవేశించిన వాని కెవనికిని దుర్గతి గలుగదు

అయితే యీ అధ్యాయములోనే భగవానుడుపదేశించిన యీ వాక్యమును గూడ జ్ఞప్తి యందుంచుకొనవలయును

**అసంశయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥**

మనోనిగ్రము లేనివాడు ఈ యోగమును బొందజాలడు కాని మనో నియమము కలవాడు అభ్యాస వైరాగ్యములనెడి ఉపాయములచే నీయోగ మును సులభముగా పొందవచ్చునని నా అభిప్రాయము

**సర్వభూత స్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥**

సమస్త భూతములయందున్న ఆత్మయు, తన ఆత్మయు ఒకటేయను ఆత్మైకత్వానుభవము కలవాడు విరక్తుడైనను, గృహస్థుడైనను, లోకహితార్థముగా కర్మమును చేయువాడైనను, ఏ కర్మయు చేయక మౌన నిష్ఠయందుండు వాడైనను అట్టి మహాత్ముడు ఎల్లప్పుడు నాయందుండు వాడే అనగా నా యొక్క స్వరూపుడే

ఈ వ్యాసము చదువునపుడు వేదాన్తులు కొందఱు "ఇదిచాల చిన్న స్థితిలో నుండువారికి ఉపయోగపడునే గాని గొప్ప అఖండ బోధ జ్ఞానము దీనియందు ఏమి గలదు!" అని తలంతురు వారట్లే తలంతురుగాక! ఓనమాలు చదివెడు బాలుడు ప్రతి సంవత్సరమున్ను ఒక్కొక్క తరగతి చదివి సర్వోన్నతమగు విద్యలో ఉత్తీర్ణుడై మహోన్నతమగు ఉద్యోగమునకు ఎట్లు అర్హుడగుచున్నాడో, ఆలాగున చిన్న జలధార నిలువక ప్రవహించి చిన్న కాలువలో, పెద్దకాలువలో, ఉపనదిలో, మహానదిలో కలిసి, చివరికి తన పుట్టుచోటగు మహాసముద్రములో ప్రవేశించి యెట్లు గమనరహితమగు పూర్ణ

సముద్రాకార మగుచుండునో, అట్లే యెడతెగక అనుష్ఠానము చేయువారి గతియు నని విజ్ఞులు గ్రహింతురుగాక!

**ప్రజహాతి యదా కామాన్సర్వాన్పార్థ! మనోగతాన్ ।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥**

ఎవడు తన యంతఃకరణము నందలి సమస్త సంకల్పములను విడిచి తన యాత్మయందే రమించువాడై ఆనందస్వరూపు డగుచున్నాడో వాడే స్థిత ప్రజ్ఞుడనియు, బ్రహ్మానుభవయు గలవాడనియు చెప్పబడును

ఈ స్థితప్రజ్ఞుని లక్షణములో ఈ ఒక్క శ్లోకమే ముఖ్యమైనది తక్కిన 15 శ్లోకములున్ను దీనికి సహాయ భూతములే సాధకుడు దీనియందు చెప్పిన ఆరవ అధ్యాయమును బాగుగా చదివిన యోగనిష్ఠుడు, బ్రహ్మనిష్ఠుడు ఎట్లుండవలయునో అన్ని సంగతులను తెలుసుకొనవచ్చును



# దైవ కంపెనీ

ఇది ఇతర కంపెనీలవలె ఒక జాతికి, ఒక మతానికి, ఒక కులానికి, ఒక దేశానికి సంబంధించినది కాదు సర్వదేశములకున్ను, సర్వజనులకున్ను సొంతమైనది అనగా సింధియా కంపెనీ, అమెరికా కంపెనీ, జర్మనీ కంపెనీ, ఇటలీ కంపెనీ ఈలాంటి భేదము లేమియు లేవు.

అంతేగాక ఇతర కంపెనీలలోవలె ఇంత మందికి మాత్రమే పని కలదను ఏర్పాటున్ను లేదు ఎంత మందికైనను పని గలదు దీనియందు నిరుద్యోగమను సమస్యయే లేదు. పండితులకున్ను, పామరులకున్ను, బ్రాహ్మణులకున్ను, అబ్రాహ్మణులకున్ను, స్త్రీలకున్ను, పురుషులకున్ను, సన్న్యాసులకున్ను, గృహస్థులకున్ను ఇందు అవకాశము కలదు. వెయ్యేల? మనుష్య మాత్రులందరికిన్ని సమానహక్కు ఉన్నది అయితే ఇతర

కంపెనీలకున్ను దీనికిన్ని భేదమేమన, ఇతర కంపెనీలలో దినమునకు ఒక్కొక్కరున్ను ఇంత పనిచేయవలయును దానికి ఇంత కూలియని నియమము కలదు దీనికి అదేమియు లేదు దినకూలి యనిగాని, నెలజీతమని గాని యేర్పాటు లేదు ఎవరెంత పని జేసిన అంతకూలి వానికి గిట్టును పని యీలాగున చేయవలయును అని నిర్బంధించరు అధికారు లెవరున్ను లేరు అయితే అధికారి యెచ్చటనో యొకమూలలో రహస్యముగా ఉండి అందఱి పనివారలను చూచుచుండును పని వారలెవ్వరున్ను అతనిని చూడ జాలరు ఆత్మజ్ఞానులున్ను, సత్యవ్రత నిష్ఠగలవారున్ను మాత్రమే ఆయనను చూడగలరు

కొన్ని సంస్థలలో కొందఱు కుయుక్తిపరులు, కుతంత్ర నిపుణులు ఉందురు వారు తామేమియు చేయకనే అంతయు చేయుచున్న వారివలె నటించుచు, తిరుగుచు మాట్లాడుచుందురు అట్టి వారి కిచ్చట చోటు లేదు కావుననే మొట్టమొదటనే మీరెంత పని చేసినారో అంతకూలి మీకు లభించుననియు, మిమ్ములను నిర్బంధించువారు లేరనియు నిరూపించుదురు ఈ పని యిట్లు చేయవలయునని కాని, ఇట్లుండవలయునని కాని, మిమ్ములను శాసించు వారెవరున్ను లేరని తెలుపుదురు

పనివారి నందరిని అధిపతియైనవాడు చూచుచున్నాడనియు, అతడెచ్చటనో యొకమూలలోనుండి మిమ్ములను చూచుచున్నాడనియు తెలుపడమైనది మీ రెవరున్ను అతనిని చూడజాలరనియు నిర్ణయించడమైనది అతడుండే స్థానమెచ్చటనగా "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" అని గీతాచార్యులు తెలిపినట్లు అందఱి హృదయములలోను సాక్షియై యుండి చూచుచున్నాడు అయితే మీరు చేసిన పని శుద్ధముగా నున్నదా? లేదా? అని కూడ చూడడని తెలుపడమైనది అయితే పనియొక్క మంచి చెడులను చూచియే మీకు కూలి మాత్ర మివ్వబడును, అది మొదటి తరగతి, రెండవ తరగతి, మూడవ తరగతులతో కూడియుండును దానికే సత్వ, రజ, స్తమోగుణము లని పేర్లు ఈ కంపెనీలో భూపాలురున్ను, గోపాలురున్ను, అగ్రజాతి

వారున్ను, అంత్యజాతివారున్ను సమానులుగానే యుందురనియు తెలుపడమైనది అధిపతి యెట్లుండుననగా పూర్వకాలపు మహారాజ హర్మ్యముల లోపల నుండు అంతఃపుర స్త్రీలవలె నుండును

రాజధాని ప్రముఖ స్థలములో నాటకములు, భజనలు, హరికథలు, ఉపన్యాసములు జరుగుచున్నప్పుడు అంతఃపుర సౌధము తెరలోపల నుండు పట్టమహిషులవలె అతడుండును అచ్చట పరదా ఉండును దానికి అనేక రంధ్రములు గలవు లోపల నుండువారు బయటనుండే నాటకకారులను అచ్చటనుండు జనులను చూడగలరు కాని బయటనుండేవారు లోపల నుండే వారిని చూడజాలనట్లు ఉంటూ ఉన్నది

"నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః" అని శ్రీకృష్ణుడు గీతలో చెప్పినట్లు యోగమాయావృతుడై యుండుటవల్ల అందరున్ను తన్ను చూడజాలరనియు, తానందరిని చూచుచున్నాడనియు చెప్పిన వాక్యమును విజ్ఞులు గ్రహించుకొనవలెను మొట్టమొదటనే మిమ్ములను శాసించువాడు ఒకడున్ను లేడనియు, మీ పనుల ననుసరించి కూలి మీకు లభించుననియు చెప్పిన దానిని మరువకుండా ఉండవలెను దీనికి మంచి చిన్నకధ ఒకటి కలదు

పూర్వము శ్రీకాళహస్తి దేవాలయము కట్టునపుడు భరద్వాజ మహర్షి సాయంకాలమున పనివారలందరిని సువర్ణముఖీనదిలోనికి పిలుచుకొనిపోయి అందరికిని తన చేతితో ఇసుకను ఇచ్చుచుండెను ఎవరున్ను ఇంటికి వెళ్ళే వరకు దానిని చూడకూడదనియు తెలుపుచుండెను. ఇంటికి వెళ్ళి చేతిలో చూచునపుడు ఎవరెవరు ఎంత పనిచేసినారో దానికి ఎంత కూలి కావలెనో అంతమాత్రము ఆ ఇసుక బంగారు రూపమున మారుచుండెనట. ఇందు వలననే ఆనదికి సువర్ణముఖియని పేరు వచ్చినట్లు పెద్దలు తెలుపుదురు.

మనయొక్క దైవ కంపెనీలో పనిచేయు వారందరున్ను దీని నొక్క దానిని జ్ఞాపకము చేసుకొన్న చాలును. మీరు కృతార్థులు కాగలరు

**బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః ।**
**సుఖం దుఃఖం భవోऽ భావో భయం చాభయమేవ చ ॥**

**అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోऽయశః ।**
**భవ న్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥**

1 బుద్ధి, 2 జ్ఞానము, 3 మోహము లేకుండుట, 4 సత్యము, 5 ఇంద్రియ నిగ్రహము, 6 అంతఃకరణ నిగ్రహము 7 సుఖము, 8 దుఃఖము, 9 ఉత్పత్తి, 10 నాశము 11 భయము 12 అభయము 13 అహింస, 14 చిత్తము సమముగ నుండుట, 15 సంతోషము, 16 తపస్సు, 17 దానము, 18 కీర్తి, 19 అపకీర్తి ఈ పందొమ్మిది గుణములున్ను ప్రాణులకు వారి వారి కర్మానుసారముగ నావల్లనే కలుగుచున్నవి బుద్ధియనగా ఆత్మజ్ఞానమును, సూక్ష్మమైన విషయములను గ్రహించునట్టి యంతఃకరణము యొక్క సామర్థ్యము జ్ఞానమనగా ఆత్మ మొదలగు పదార్థముల నెఱుంగునట్టి తెలివి మోహము లేకుండుట అనగా తత్కాలమున జేయవలసిన వాటియందును, ఎరుంగ వలసిన వాటి యందును, వివేకముతో బ్రవర్తించుట, దమమనగా బాహ్యేంద్రియ నిగ్రహము శమమనగా అంతరింద్రియ నిగ్రహము

భూదేవి యందరికిన్ని సమానముగ నున్నప్పటికిన్ని, ఎవరెవ రేవిధము లగు విత్తనములు వేయుదురో దాని కనుసరించిన ఫలమును కలుగజేయు నట్లు, సర్వేశ్వరుడు సమత్వము గలవాడై యున్నప్పటికిన్ని వారివారి పుణ్య పాప కర్మల ననుసరించి ఫలమును కలుగజేసెడు శక్తి గలిగియుండును గీత అ 17 - మూడు గుణముల లక్షణమిచట నిరూపింప బడుచున్నది

**అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।**
**యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః ॥**

ఫలాపేక్షలేక శాస్త్రములో ఏ అనుష్ఠానము నేయజ్ఞమును ఏ తపస్సు నేలాగున చేయవలయుననని విధింపబడియున్నదో ఆలాగున చేయుటయే సాత్త్విక లక్షణమగును అంతేగాక ఆలాగున చేయుట తన విధియని

మాత్రమే భావము కలిగి యుండవలయును ఇచ్చట ఈశ్వరార్పణమని తలంపు కూడ నుండరాదు అది రెండవ మెట్టు అగును లోకోపకారము కొఱకని గూడ తలంపు కలుగకూడదు అయితే ఈ తలంపు మంచిదే

ఇట్టి స్థితికి వచ్చిన జీవులు పుణ్యాత్ములు లేక పరమభక్తులు

**అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్ ।**
**ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥**

ఓ భరతకుల శ్రేష్ఠుడా! ఫలము నపేక్షించిగాని, దంభమునకైగాని ఏ యజ్ఞ మనుష్ఠింపబడునో ఆ యజ్ఞమును రాజసమని యెఱుంగుము యజ్ఞ ముగాని, తపస్సుగాని, యోగముగాని, భక్తిగాని డంభముగ చేయునది రాజస లక్షణమగును. దీనికి దైవప్రీతిగాని, ఆత్మశుద్ధిగాని గలుగదు కొంత మాత్రము పుణ్యము కలుగవచ్చును

**విధిహీనమసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్ ।**
**శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥**

**అపాణిపాదో జవనో గృహీతా పశ్యత్యచక్షు స్స శృణోత్యకర్ణః ।**
**స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా తమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్॥**

ఆమహాత్ముడగు ఈశ్వరు డెట్టివాడనగా చేతులు లేనివాడయ్యు అనంతప్రాణి కోట్లకు కర్మఫలము నిచ్చువాడు, కాళ్ళులేనివాడయ్యు అతి వేగముగా పరుగెత్తువాడు, నేత్రము లేనివాడయ్యు సమస్త ప్రాణికోట్ల కర్మ లను చూచువాడు, చెవిలేనివాడయ్యు అనంతప్రాణి కోట్ల సంకల్పమును చక్కగా వినువాడు. అతడు సమస్తము నెఱుగువాడు. ఆ మహాత్ముని సంపూర్ణముగా ఎవరున్ను ఎఱుంగ జాలరు. అతడన్నిటికన్న శ్రేష్ఠుడు. ఆది పురుషుడు అతడే మహాత్ముడు, పరమేశ్వరుడు ఈ యుపనిషత్తు తెలిపి నట్లే గీత 13-వ అధ్యాయమున శ్రీకృష్ణుడు తెలిపినది చూడుడు

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥

ఆ పరమేశ్వరుడు ఎటువంటి వాడనగా - అంతటను చేతులను, కాళ్ళను, కండ్లను, తలలను, ముఖములను, చెవులను కలవాడు లోకము నందన్నిటను వ్యాపించుకొనియున్నాడు ఉపనిషత్తునందు ఏ బ్రహ్మ లక్షణము చెప్పబడినదో ఉపనిషత్సారమగు గీతయందును ఆలాగుననే నిరూపించడమైనది ఆ పరమేశ్వరుడు చీమయొక్క సంకల్పమును గూడ స్పష్టముగ వినుచున్నవాడు జాగ్రత్స్వప్న సుషుప్తులకు సాక్షియైయుండి కనురెప్పలాడకనే అన్నిటిని చూచుచుండువాడు ఆ పరమేశ్వరుని దృష్టి నుండి ఎవడు తప్పించుకొనగలడు? ఈ సత్యమును తెలిసికొని వర్తిం చుటయే ఈశ్వరసాక్షాత్కారమనియు, బ్రహ్మసాక్షాత్కారమనియు గ్రహించు కొనవలయును మీ సంకల్పములను మీరెట్లు తెలుసు కొనచున్నారో మీకు తెలియకనే ఏ సంకల్పములను చేయజాలరో అది ఎచ్చట నుండి కలుగుచున్నదో అదే ఈశ్వరునియొక్క స్థానము, అదే ఈశ్వరుడు అది హృదయములోనే జరుగును కావుననే ఈశ్వరుడు సాక్షిగనున్నాడని మామూ లుగ జనులు చెప్పు వాక్యమున కర్థము కావుననే గీతయందు "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" అని గీత 13-వ అధ్యాయమున శ్రీభగవాను డుపదేశించెను ఒక శరీరమందు గాదు కావుననే "సర్వక్షేత్రేషు" అని ప్రయోగించుటకు కారణమైనది ఆ క్షేత్రజ్ఞుడే సర్వేశ్వరుడు



# విషయ వాంఛా విషమస్థితి

1 విషయ వాసన అనగా విషయ సంకల్పము అది కలిగిన వెంటనే దానిని నిలిపేలాగున చేసిన సులభము ప్రయాసము లేకయే అటుల చేయ వచ్చును అట్లుగాక దానినే అనుసరించినచో, మరల ఆపడము సాధ్యము

కాదు ఒక నదికి గాని, చెఱువునకుగాని చిన్నరంధ్రము కలిగి నీరు ప్రవహింప ప్రారంభించిన వెంటనే మూసి వేయుట సులభము అట్లు చేయక పోయినచో నీరు ప్రవహించి ప్రవహించి కట్టను నెట్లు ధ్వంసమొనర్చి మహా అపాయ మును కలుగజేయునో, విషయ వృత్తియున్ను అలాంటిదే మరియు మీ అందరిటికిన్నీ అనుభవములో గల ఒక చిన్నమాట చెప్పెద మీరు ధరించెడు వస్త్రములుగాని, ఇతర డ్రస్సుగాని పాతది కొంచెము చినిగిన వెంటనే కుట్టినచో చెడకయుండును అట్లు కుట్టనిచో ఆ చినుగు ఏలాగున పెద్దదై, వస్త్రమును దుస్తులను పాడుచేయునో, విషయావిర్భావమున్నూ అనగా - కామబుద్ధియున్ను ఆలాగున నుండునని మరువకుడు ఒక్కొక్కరున్ను చినిగిపోయిన ఆ వస్త్రమును జ్ఞప్తికి తెచ్చుకొనినచో మీకు ఇది అర్థమగును ఏ కారణముచేతనైన ఒక యింటికి చిన్నగా నిప్పు అంటుకొనినచో వెంటనే దానిని చల్లార్చుట ఎంత సులభమో, అట్లుకానిచో, ఆ యింటినే కాక ప్రక్క ప్రక్కన గల యిళ్ళను దహింపజేసి గ్రామమంతటను ఎట్లు భస్మమొనర్చునో, విషయానలము అనగా-కామ సంకల్పమున్ను ఇటువంటి అపాయమును కలుగజేయునదని మరువకుడు ఈ విషయమై శ్రీకృష్ణభగవానుడు గీత అ 2 శ్లో 62, 63లోను, శ్లో॥ 67 లోను తెలిపినది చూడుడు

ధ్యాయతో విషయాన్పుంస స్సంగస్తేషూపజాయతే ।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥
క్రోధాద్భవతి సమ్మోహ స్సమ్మోహాత్స్మృతి విభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధి నాశాత్ప్రణశ్యతి ॥

1 విషయములను చింతించుచున్న మనుజునకు ఆవిషయములందు ఆ ఆసక్తి గలుగుచున్నది 2 అట్టి ఆసక్తిచే కామము కలుగుచున్నది. 3 కామమునకు అడ్డు కల్పించినవారిపై కోపము జనించుచున్నది. 4. కోపము వలన అవివేకము కలుగుచున్నది 5 యుక్తాయుక్తము లేని అవివేకమువలన మతిభ్రమ కలుగుచున్నది 6 మతిభ్రమవలన బుద్ధి నశించుచున్నది 7 అట్లు

బుద్ధి నాశనమువలన తానున్ను తప్పక నశించుచున్నాడు ఇచట 7 విధము లగు మనఃపరిణామములు తెలుపడమైనది మొదటనే వివేక జ్ఞానముచే ఆ కామ సంకల్పము నణచునేని ఇట్టి విషమ పరిణామావస్థ గలుగనేరదు

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥**

విషయముల మీదికి పోవుచున్న యింద్రియములతో చేరుకొని మనస్సు గూడ విషయముల మీదికి పోయెనేని, అట్టి మనస్సు సముద్రము నందలి ఓడను తుఫానుగాలి ముంచివేయు విధముగా బ్రహ్మనిష్ఠుని యొక్క ఆత్మజ్ఞానమును నశింపజేయుచున్నది అనగా అట్టివాడు సంసార సాగరము లో మునిగిపోవును నావికులు విషమ వాతావరణమును తెలుసుకొని ఓడను లంగరు వేసి నిలుపుటయో లేక అపాయము గలుగని రేవులోనికి చేర్చుటయో ఏలాగున చేయుదురో, ఆలాగున ఏ స్థలములో ఉండిన మనస్సునకు విషయవాంఛ ఉదయించునో, ఆస్థలములో దానిని నిగ్రహించి ఉండుటకు సాధ్యమైనచో ఉండవచ్చును కాని, లేనిచో ఆస్థలమును తప్పక మార్చుకొన వలయును అట్టి విషయవాంఛ కలిగెడు స్థలము ఎంత పుణ్యప్రదేశమైనను లేక గురుస్థానమైనను విడిచి పెట్టవలయును అట్టి సంకల్పము కలుగని ప్రదేశము సామాన్యస్థలమైనను బ్రహ్మనిష్ఠుడు దానిని పుణ్యభూమిగా తలంచ వలయును ముఖ్యముగా అట్టి విషయ స్వభావముగల స్త్రీ పురుషులుండే స్థలములోనే ఆలాగున సంభవించును మరియు మూడవ అధ్యాయమున ఈ విషయమై శ్రీకృష్ణ భగవానుడు ఉపదేశించినది చూడుడు

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ॥**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥**

1 కామము అనగా విషయేచ్ఛయు, కోపమున్ను రజోగుణము ఉండుటవల్ల కలుగుచున్నది సత్త్వగుణము కలిగిన పై చెప్పిన రెండు దోషములు అంతగ ఉండవు ఈ కామము మహాశనుని వంటిది మహాశను

డనగా అగ్ని, అగ్నిహోత్రుడు ఏలాగున హవిస్సు, ఘృతము, సమిధలచే తృప్తి పొందక అంతకంతకు పెరుగునో ఈ కామమున్నూ ఆలాగున అనుభవించిన తరుగునది కాదు పెరుగుచునే యుండును అంతే కాదు ఇది మహాపాప స్వరూపమని గూడ భగవానుడు సెలవిచ్చెను అంతే కాదు ముముక్షువులకు, జిజ్ఞాసువులకు ఇది పరమ శత్రువని కూడా శ్రీభగవానుడు తెలిపెను

**ధూమేనావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ ।**
**యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్ ॥**

ఈ కామము ఆత్మను ఎట్లు మరుగుపరుచునో, దృష్టాంత పూర్వక ముగ శ్రీభగవానుడు ఇచట తెలుపుచున్నాడు, గ్లాసులో వెలుగుచుండు దీపమును చిమ్నీ పొగపట్టి యుండిన ఏలాగున కనబడకుండా చేయునో, అద్దములో మసియుండిన అది తన స్వరూపమును ఏలాగున ప్రకాశింప చేయదో, గర్భములో గల శిశువును మావి ఏలాగున కనపడచక ఆచ్ఛాదనము చేయుచుండునో, ఆలాగున తన ఆత్మసాక్షాత్కార జ్ఞానమును ఈ కామము కనబడనీయక ఆచ్ఛాదనము చేయుచుండును చిమ్నీని శుద్ధముగా తుడుచుటచేత దీపము కనిపించును అద్దమును నిర్మలముగా శుభ్రపరచుట చేత స్వరూపము ప్రకాశించును అట్లే ప్రసవకాలమున మావిని ఛేదించుటచేత శిశువు బయటకు వచ్చునపుడు స్పష్టముగ కనబడును. అట్లే కామమను దోషము తొలగినచో తనయందు మరుగు పడియుండు దైవత్వము అనగా బ్రహ్మత్వము స్పష్టముగా గోచరము కాగల్గును

**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।**
**కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేన చ ॥**

మరియు ఈ కామము ఎటువంటిదో భగవానుడు వర్ణించినది చూడుడు ఎంత నిండింప చూచినను నిండనిదియగు సముద్రము వంటిదనియు, హవిస్సు మొదలగు హోమద్రవ్యములచే తృప్తిపొందని అగ్నిహోత్రుని వంటిదనియు, ఆత్మజ్ఞానికి నిత్య శత్రువు వంటిదనియు తెలుప

డమైనది పైశ్లోకమున కామమును అగ్నిగా వర్ణించడమైనది ఇచ్చటను మరల దానినే పేర్కొనెను మరి సముద్రమును దృష్టాంతముగా తెలుపడమైనది ఎన్ని యుగములనుండి వర్షాకాలమున అనేక మహానదులు పొంగి ప్రవహించి సముద్రములో ప్రవేశించినను, ఇప్పటికిన్ని ఏలాగున అది నిండకయున్నదో, అట్లే విషయము నెంత కాల మనుభవించినను తృప్తి యుండదు అంతేకాదు అట్టి కామము ఆత్మజ్ఞానికి పరమ శత్రువుగా వర్ణింపబడినది నిత్యశత్రు వనగా జన్మశత్రువని భావము

**తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ! ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాననాశనమ్ ॥**

నీవు ఇంద్రియములను స్వాధీనములో నుంచికొని శాస్త్రముల చేతను, గురువుల చేతను శ్రవణము చేయబడిన జ్ఞానమును, ఆత్మానుభవ విజ్ఞాన మును నశింపజేయునదియును, పాపస్వరూపమునగు ఈ కామరూపమును ప్రయత్నరూపముగా విడిచిపెట్టుము విజ్ఞానమును గూడా కామము నశింప జేయునని చెప్పుటకు కారణము కామముచే గలిగెడు దోషము అంత దుష్ట మని తెలుపుట కొరకును, మరియు దానియొక్క శక్తి అంత మహిమాన్విత మైనదని తెలియుటకొరకును అని గ్రహించవలయును ఈ కామదోషము ఒక్కటే రావణాసురుడున్నూ, లంకారాజ్యమున్నూ నశించుటకు కారణమైన దని తెలిసికొనిన చాలును ముందు శ్లోకములలో ఈ కామ రూపమును, మహాపాప స్వరూపముగాను జ్ఞానమును నశింపజేయునదియు, బ్రహ్మనిష్ఠు లకు నిత్యశత్రువు అనియు నిరూపించడమైనది ఈ శ్లోకములో "జ్ఞాన విజ్ఞాన నాశనమ్" అని ప్రయోగించడమైనది జ్ఞానమునకు శాస్త్రజ్ఞాన మనియు, విజ్ఞానమునకు అనుభవ జ్ఞానమనియు పేరులు

**యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః ।**
**ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥**

ఓ అర్జునా! ఇంద్రియములను విషయముల నుండి మరలించుటకు

యత్నించుచున్న విద్వాంసుడైన పురుషుని యొక్క మనసును గూడా క్షోభ మును కలుగజేయునట్టి యింద్రియములు బలాత్కారముగా హరించు చున్నవి

"యతతో హ్యాపి" బ్రహ్మనిష్ఠయందు విజయము కలుగుటకు యత్నించెడు "విపశ్చితః" విద్యావంతుని యొక్క మనస్సును గూడా కామము బలాత్కారముగా హరించునని చెప్పునప్పుడు ప్రయత్నమున్ను, పాండిత్య మున్ను లేని వారి మనస్సును గురించి మరల చెప్పవలెనా?

**కామ బంధనమేవేదం నాన్యద స్తీహ బంధనమ్ ।**

**కామ బంధనముక్తో హి నేహ భూయోఽ భిజాయతే ।**

**కామ బంధనమే వేదం వ్యాస్థోఽఫ్యాహ పదే పదే ॥**

వేదవ్యాస మహర్షి తెలిపినది చూడుడు మానవునికి లేక ముముక్షువు నికి ఈ కామమే పరమ బంధము వేరు బంధనము ఏమియు లేదు ఈ కామబంధనములనుండి విముక్తి పొందినవాడు మరల జన్మమునకు రాడు, అనగా నిత్యముక్తుడగును కామమన్నను, అవిద్యయన్నను, మాయయన్నను, ప్రకృతియన్నను, అజ్ఞాన మన్నను ఒకటే యర్థము ఈ కామ బంధమును గూర్చియే వేదవ్యాస మహర్షి పదే పదే శిష్యులకు చెప్పుచుండేవారు కావుననే "వ్యాసోప్యాహ పదే పదే" అని తెలుపడమైనది, మరియు శ్రీ మద్భాగవతమున యయాతి చక్రవర్తి చెప్పినది చూడుడు

**న జాతు కామః కామానాముపభోగేవ శామ్యతి ।**

**హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥**

ప్రపంచ విషయ సుఖేచ్ఛ ఎంత అనుభవించినను, ఏకాలమున కైనను శమించదు అగ్నిహోత్రుడు ఘృత సమిధాదులచే అంతకంతకు వృద్ధియగునే గాని శమించడుగదా! దీనికన్న పరమప్రమాణము మరియేమి కావలయును?

**యథా నిరింధనో వహ్ని స్స్వయోనావుపశామ్యతి ।**
**తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనావుపశామ్యతి ॥**

పుల్లలు అనగా కట్టెలు లేక సమిధలు వేయుచుండిన అగ్ని హోత్రుడు అంతకంతకు ప్రజ్వలించునేగాని శమించడు సమిధలు వేయకపోయిన నిప్పు ఏలాగున చల్లారి పోవునో, ఆలాగున విషయానుభవమువల్ల వృత్తి నశించదు విషయ వాంఛా నివృత్తివల్లనే శాంతించును ప్రత్యక్షముగా చూడవలసి యుండినచో మీరు హోమము చేయునప్పుడు సమిధలు వేయుచుండిన అంతకంతకు ప్రజ్వలించుట చూడగలరు పుల్లలు వేయక ఊరక కూర్చుండిన క్రమముగా నిప్పు ఏలాగున చల్లారిపోవునో, కట్ట కడపట బొత్తిగా అగ్ని లేకపోవునో అట్లే విషయ వృత్తులు నశించినచో చిత్తమున్ను ఉపశమిం చును దీనిని గ్రహించుకొనిన చాలును వేరు ప్రమాణ మేమియు అక్కఱ లేదు



# నాష్ట

దీనికి నాస్త అని కూడ పేరు కలదు నాష్ట అనగా నిష్ఠను భంగపరచునదని అర్థము లేక నిష్ఠను నశింపజేయునదని మఱియొక అర్థము గూడ కలదు బ్రహ్మనిష్ఠులు, ధ్యానపరులు, యోగనిరతులు మొదలగువారు సామాన్యముగా ఉదయము మొదటి యామమున అనగా 9 గంటల వరకు ధ్యానము, జపము, యోగము ఇత్యాది అనుష్ఠానముల జేయుచుందురు ఈ కాలములోనే గీతోపనిషత్తులను పారాయణము కూడ చేయుదురు లేక 'పాతంజలి యోగసూత్రములు' "బ్రహ్మసూత్రములు" మొదలుగా గల సద్గ్రంధముల గూడ మననము చేయుదురు. మఱి కొందఱు మొదటి యామమున ధ్యాన, యోగసాధనలు చేసికొని ఒక గంట సేపు పైజెప్పిన శాస్త్రముల పారాయణయో లేక చింతనయో చేయుచుందురు గొప్ప నిష్ఠాపరులు ఉదయము 3 గంటల సేపు ధ్యాన నిష్ఠాపరులై యుందురు అనగా

ఉదయము బ్రహ్మముహూర్తమున లేచి స్నానాది కృత్యములు చేసికొని 11 గంటల వరకున్ను ధ్యానపరులై ఉందురు

పూర్వకాలమున ఋషులు, యోగనిష్ఠులు, జపపరులు ఈ లాగున దీర్ఘకాలము ధ్యాననిష్ఠాపరులై ఉండుటవలననే అతీంద్రియ జ్ఞానమును పొందగలిగిరి వర్తమాన కాలమున ఆలాగున చేయక పోవుటయే అట్టి ఇంద్రియాతీత జ్ఞానము, వాక్శుద్ధి, సంకల్ప సిద్ధియు ఇప్పటి వారు కలిగి యుండక పోవుటకు కారణము, నాష్ట నిష్ఠను భంగపరచుచున్నదని చెప్పుటకు కారణమేమన! వర్తమాన కాలములో ఉదయము 7 గంటల నుండి 8 గంటల లోపల నాష్ట జరుగుచున్నది నాష్ట అనగా ఉపాహారము, కాఫీ మొదలైనవి నిష్ఠాసమయములో నాష్టను ఏర్పరచుటవల్ల నిష్ఠకు భంగము కలుగుచున్నది ఈ నాష్ట బ్రహ్మనిష్ఠులలో ఎట్లు ప్రవేశించినదని దీర్ఘముగా ఆలోచించిన దానికి కారణము కనుగొనవచ్చును

పై జెప్పినట్లు దీర్ఘకాలము అనుష్ఠానము చేయకపోవుటవల్లను, ఉదయమునుండియే సంసారులవలె అనేక ఆశ్రమ సంబంధ పనులుగాని మరియే యితర కర్మలుగాని చేయుటలో వీరు ప్రవేశించుటవలన సంసారుల వలె వీరికిన్ని నాష్ట కావలసి వచ్చినది దీనివల్ల ఆశ్రమసేవ, లోకోపకార పనులు మానవలయునని అర్థము కాదు ధ్యాన నిష్ఠలయిన తరువాత ఆలాటి పనులు చేయుట ఉచితము

వేమన యోగి తాను కూర్చుండు స్థలములో నుండక పోయిన, అచ్చట కుక్కలు వచ్చి కూర్చుండునని చెప్పిరి పవిత్రమగు నిష్ఠాకాలములో వీరలు ఆస్థానము వదలుటవల్ల అచ్చట నాష్ట వచ్చి ఆక్రమించుటకు హేతువైనది. ఇదే దీనిలో గల కీలకము వీరికి సంసారులకువలె పనులు ఎక్కువగుటవలన గృహస్థులవలె ఆహారమున్ను మూడు నాల్గుసార్లు కావలసి వచ్చినది సంసారుల పనులు సన్న్యాసులు చేయ ప్రారంభించి నప్పటినుండి, సన్న్యాసులు చేయు ఆధ్యాత్మిక ధ్యాన జ్ఞాన నిష్ఠలు చేయువారు లేక పోవుటవలన అవి పడిపోయెను ఎవరున్ను తగిన మనుష్యులు లేనిచో ఆ డిపార్టుమెంటు

ఏలాగున రద్దు చేయబడునో, ఆలాగున బ్రహ్మనిష్ఠా పతనమునకు హేతువు ఇదియేయని విజ్ఞులు గ్రహింతురుగాక! అయితే ఆధ్యాత్మిక నిష్ఠయొక్క ప్రయోజనము తెలియనివారు నవీన నాగరికులు, ఈ విరక్తులు, భక్తులు, సాధువులు ముక్కుమూసుకొని అరణ్యములో లేక ప్రత్యేకగదులలోకూర్చుండి ధ్యానము చేయుచుండిన వీరిచేత లోకమున కేమి ప్రయోజనమని అడుగు దురు అది నిష్ఠాగరిష్ఠుల పరమకాష్ఠను తెలియక చెప్పె భావమేయని మనము గ్రహించుకొనవలయును

పూర్విక ఋషుల తత్త్వమున మతకర్తల, సిద్ధపురుషుల, ప్రవక్తల స్థితిని తెలియక చెప్పెడు మాటలని మనము గ్రహించుకొనిన చాలును అయితే అతిపవిత్రమగు ఈ బ్రహ్మనిష్ఠాపరులలో సోమరులు కొందరు జేరి కాలము వ్యర్థపరచుచున్నారని చెప్పుటలో కూడా సారములేదని తలంచరాదు అదిన్ని ఒక దృష్టితో చూడవలసి ఉండును బుద్ధి కుశలత గల ఒకడు డాక్టరు పరీక్షకు గాని, యింజనీరు పరీక్షకుగాని, మరియొక శాస్త్రపరనమునకు గాని యేకాంతమున కూర్చుండి పాఠమును చింతన చేయువానిని గురించి నీవు ఈ నిర్జన ప్రదేశమున సోమరివిగా ఉండి కాలము గడుపుట తగదు ఎందరో రోగములచే బాధపడుచున్నారు వారికి సహాయము చేయుము, ఔషధ మిమ్ము, ఆలాగున రోడ్లు శిధిలమైనవి వంతెనలు నిర్మింపుము, లోకములో విద్య క్షీణించుచున్నది విద్యార్థులకు పాఠము చెప్పుమని బోధించిన అభ్యాస స్థితిలో నుండు డాక్టరు ఏ రోగమును కనుగొన గలుగును? ఏ ఔషధమివ్వ గలుగును? ఇంజనీరు శాస్త్రము తెలియనివాడు ఏ సౌధమును దృఢముగా ఉండేలాగున కట్టగలుగును? శాస్త్రప్రవీణుడు కానివాడు విద్యార్థులకు పాఠము చెప్పగలుగునా? దీనినిగూడ జ్ఞాపకముంచుకొను వారు అరుదయిరి

పై జెప్పిన విద్యార్థిదశలో నుండువారు వారి వారి విద్యలలో ఉత్తీర్ణులైన తరువాత లోకమునకెంతో మేలు చేయగలరు అది మనము గమనించచక పోవుటవలననే యీ ప్రమాదమంతయు గలుగుచున్నది లోకోద్ధారకులగు మహనీయులందరు అనగా శ్రీజిన, శ్రీబుద్ధ, శ్రీశంకర, శ్రీఏసు, శ్రీగురు

నానక్, శ్రీమహమ్మదు మొదలగు ప్రవక్తలందరును ఎంతకాలము ఏకాంత మున ఉండి బ్రహ్మచింతన జేసి బ్రహ్మమును, దైవమును పొందిరో, మరల లోకమునకు ఎంత మహోన్నతమగు జ్ఞానమును ప్రసాదింప గలిగిరో ఇదిన్ని పాఠకులు జ్ఞప్తిలో నుంచుకొనవలయును

భగవద్గీత యేకాంతమున కన్నులు మూసికొని ముక్కుపట్టుకొని తపస్సు చేయమని చెప్పలేదు నిష్కామకర్మయోగమునే చేయుచుండుమని తెలుపుచున్నదని చెప్పువారు కూడ కొందరున్నారు వీరు భగవద్గీత ఎంత వరకు అవగాహనము చేసికొనిరో అదిన్ని గీతను పరిశీలించిన మనము తెలిసి కొనగలము నిష్కామకర్మ ఒకటే గీత బోధించెనని చెప్పినది సరియైనచో భక్తి యోగము, ధ్యానయోగము, జ్ఞానయోగము ఏల శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు ఉపదేశింపవలెను -

**యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః ।**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥**

ధ్యానయోగము నభ్యసించువాడు, నియమింపబడిన మనో బుద్ధీం ద్రియములు గలవాడును, నిరాశగలవాడును, అపరిగ్రహవ్రతము గలవాడును, ఏకాంత స్థలమునందు ఒంటరిగా ఉన్నవాడును నగుచు ఎల్లప్పుడు మనస్సును ఆత్మయందు ధ్యానముచేత లయ మొనర్చు కొనవలెను ఈ శ్లోకమునకు విశేషార్థముగల గ్రంధములో (గీతలో) అర్థము చూచుకొనవలెను

**యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియత మానసః ।**
**శా న్తిం నిర్వాణ పరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥**

మనోనియమము గల యోగి యెల్లప్పుడాత్మను పరమాత్మ యందైక్య పరచి, ధ్యానించెడు అలావాటు గలవాడై, బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమే అంత్య ముగా గలదియు, నాయందుండు (భగవంతుని యందు) నట్టిదియునగు ప్రకృతి శమించిన పరమ శాంతిని భగవత్ప్రాప్తిని పొందుచున్నాడు

ఇది స్వారాజ్యమును అనగా ఆత్మరాజ్యమును పొందెడు విధానము అట్టి ఆత్మ రాజ్యమును పొందక స్వరాజ్యమును అనగా భౌతిక రాజ్యమును, మాత్రము పొందిన చాలదు శాంతిని, సౌఖ్యమును పొందక పోవుటయే గాక, యీ లభించిన స్వరాజ్యమును కూడ చక్కగా నడుపశక్యము గాక తికమక పడుటకు కారణము ఈ ఆత్మరాజ్యము పొందక పోవుటయే గాంధీగారు స్వరాజ్య, స్వారాజ్యముల రెండింటిని పొందిన వారగుటచేత స్వరాజ్యము సంపాదించుటకున్ను నడుపుటకున్ను శక్తి గలవారైరి

**వివిక్త సేవీ, లఘ్వాశీ యత వాక్కాయ మానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥**

ఏకాంత స్థలమందుండువాడును, కొద్దిఆహారము కలవాడును, స్వాధీనము చేసుకొనబడిన మనోవాక్కాయములు గలవాడును, సదా ధ్యానయోగ పరుడును, ఇహపర భోగములయందు లెస్సగా వైరాగ్యము గలవాడును, స్వారాజ్యములో నుండేవాడును స్వరాజ్యమును చక్కగా నడుపగలుగును

గీత రెండవ అధ్యాయమున స్థిత ప్రజ్ఞుని గురించి భగవానుడు చెప్ప ప్రారంభించినపుడు ఈ క్రింది శ్లోకమును మొదట నుపదేశించెను దీనిని పోషించుటకే తక్కిన యీ అధ్యాయాంతము వరకు గల 17 శ్లోకములు ఏర్పడినవి

**ప్రజహాతి యదా కామా న్సర్వాన్పార్థ మనోగతాన్ ।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥**

మనోగతములగు సమస్త సంకల్పములను (అనగా కోరికలను) ఎప్పుడు ప్రయత్న పూర్వకముగా సంపూర్ణముగా విడుచుచున్నాడో, ఎప్పుడు తన ఆత్మచేత ఆనందైక రసమగు తన ఆత్మయందు ఆనందించు వాడగు చుండునో అప్పుడు సుస్థిరమైన జ్ఞానము గలవాడగుచున్నాడు

వీడు స్వారాజ్యమునకు (అనగా ఆత్మరాజ్యమునకు) చక్రవర్తి యగు చున్నాడు స్వరాజ్యమునకు మంచి చక్రవర్తి ఉండినట్లు స్వారాజ్యమునకు పై

జెప్పిన స్థితప్రజ్ఞుడు చక్రవర్తి వంటివాడు

**విహితస్యాననుష్ఠానా న్నిషిద్ధస్య చ సేవనాత్।**
**అనిగ్రహాచ్చేన్ద్రియాణాం నరః పతనమృచ్ఛతి ॥**

శాస్త్ర విహితానుష్ఠానమును చేయకపోవుట చేతను, శాస్త్ర నిషిద్ధము లగు ఆహార ప్రాణిహింసాది కార్యములను చేయుట చేతను, ఇంద్రియము లను స్వాధీనములో నుంచకపోవుటచేతను మానవుడు జ్ఞానమునుండి పతితు డగుచున్నాడు

ఇప్పుడు బ్రహ్మనిష్ఠులకు గల పతనకారణము ఇది యని గ్రహించు కొనిన చాలును ఇప్పుడు సూత్రప్రాయముగ మచ్చునకు ఇది నిరూపించడ మైనది

మరియొక వాక్యమును నిరూపించి ఈ వ్యాసమును పూర్తిచేయ తలంచడమైనది యావజ్జీవితము నిష్కామకర్మ యోగమునే గీత ఉపదేశించు చున్నదని చెప్పువారు గీతకు ఆధారమగు భారతమున మహాప్రస్థాన పర్వము చదివినచో గీతా తత్త్వమును తెలిసికొనగలరు జీవితాంతమువరకు నిష్కామ కర్మయోగమే ఆచరణీయమని శ్రీకృష్ణ పరమాత్మ ఉపదేశించి యున్నచో భగవద్వాక్యమును నేరులో వినిన, అర్జున, ధర్మరాజాదులు ఆలాగున చేయక ఆఖరున అన్నిటిని త్యాగము చేసి వనమునకేల యేగవలసి వచ్చెను? దీనిని గ్రహించుకొనిన చాలును మహాప్రస్థాన పర్వము చదువుడు. అంతఃకరణము శుద్ధమగు వరకు నిష్కామకర్మయోగము ననుష్ఠించి హృదయనైర్మల్యము సిద్ధించిన తరువాత ఏకాంతమున వాసనాక్షయ, మనోనాశ ఆత్మసాక్షాత్కార జ్ఞానము కొరకు ప్రయత్నించవలెను అంతేకాదు, శ్రీకృష్ణభగవానుడు పాండవులున్ను క్షత్రియ వంశములో జన్మించినవారు, మనుస్మృతియందు క్షత్రియ ధర్మమును గురించి చెప్పిన భాగము చదివినచో ఇది స్పష్టము కాగలదు అప్పుడు (పూర్వము) జీవితము నాల్గుభాగములుగా విభజింప బడినది ప్రథమభాగము గురుకులమున బ్రహ్మచర్యవ్రతము, అధ్యయ

నము, అగ్నిహోత్రము, గాయత్రీజపము సలుపుచు 25 సంవత్సరములు గడుపవలెననియు, తరువాత ఇష్టముండినచో గృహస్థా శ్రమమును స్వీకరించి అతిధిసేవ, యజ్ఞయాగాదులతో 50 సంవత్సరముల వరకు గడుపవచ్చున నియు, తరువాత 12 సంవత్సరముల తపోధ్యాన నిష్ఠలతో వానప్రస్థములో నుండవలెననియు, పిమ్మట సన్న్యసించి మానవుల యిహపర సౌఖ్యములకు కారణములగు ధర్మములను లోకమున నిరాటంకముగ నిస్సంగుడై ఉపదేశించవలెననియు తెలుపడమైనది అట్లైన మానవుడు ఇహపర సౌఖ్య ముల రెండింటిని పొందగలడు కాళిదాస మహాకవియు క్షత్రియధర్మమును రఘువంశ కావ్యములో చెప్పినపుడు ఈ ధర్మమునే తెలిపెను

**శై శవేఽ భ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణామ్ ।**
**వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్ ॥**

ఇట్టి బ్రహ్మచర్య,వానప్రస్థ, సన్న్యాసము లనెడు మూడు ధర్మములు లోపించి గృహస్థాశ్రమ మొక్కటి మాత్రము కలియుగములో నిలిచినందు చేతనే జనులు దఃఖములో పడిపోవుచున్నారు మరియు ఆత్మ సౌఖ్యమును, ఆత్మ శాంతిని పొందక పోవుటకును, స్వారాజ్యమును పొందుటకు యత్నము చేయక పోవుటకును, స్వరాజ్యమును మాత్రము పొంది తృప్తులైతిమని తలంచి క్లేశములతో, దుఃఖములతో కాలము గడుపుటకును, పరమ శాంతిని, ఆత్మ రాజ్యమును పొందక పోవుటకును పై త్రివిధాశ్రమములలో లోపమే కారణమైనదని విజ్ఞులు గ్రహింతురు గాక!

కావుననే గీతాంతమగు 18వ అధ్యాయమునకు "మోక్ష సన్న్యాస యోగ" మని భగవంతుడు నామకరణము చేసెను అనగా కట్టకడపట మోక్షమునకును సన్న్యాస యోగమవసరము అనగా మోక్షమును గూడ త్యాగము చేయవలయునని భావము దీనిని ఆధారము చేసికొనియే పాండవులున్ను, ద్రౌపదియు ఆఖరున సర్వసంగ పరిత్యాగులై సన్న్యసించిరి



# బ్రహ్మనిష్ఠులు - లోకసేవ

మీరు పరమ పురుషుల యొక్క చర్యను మరువక ఆచరించియే ప్రపంచోద్ధారకులై ముక్తి పదమగు పరమ ధామమును పొంద గల్గుదురుగాక! శ్రీయేసుక్రీస్తు ఏ సేవ చేసినందుచే ఇప్పుడు కోట్ల కొలది జనులు వారి పవిత్ర నామముచ్చరించి లోకసేవ జేయుచున్నారో, అది కనుగొనవలయును అట్లయిన వారు ఈశ్వర సేవయే చేయుచుండినట్లు గోచరము గాగల్గును శ్రీమహమ్మదునబి యే సేవ చేసినందుచే ఇప్పు డామహాపురుషుని పావన నామముచ్చరించి కోట్ల కొలది జనులు యిస్లాం మతము పేరట ప్రపంచ సేవ జేయుచున్నారో అది కనుగొనుటకు ప్రారంభించిన మహమ్మదుగారు పరమేశ్వర సేవయే చేసినట్లు గోచరించును అందువల్లనే వారికి ఈశ్వర శక్తి గల్గి వారు లోకమునకు ఈశ్వర జ్ఞానమును బోధింపగల్గిరి శ్రీబుద్ధదేవుని పరమ పావన దివ్యనామము నుచ్చరించి కోట్ల కొలది బౌద్ధులు బౌద్ధ మతము పేరటనే లోకసేవ చేయుచున్నారు అదిన్ని దీర్ఘముగా విచారించిన శ్రీబుద్ధదేవునికి బ్రహ్మచింతనము చేయుటచే గల్గిన ఆత్మశుద్ధి పరమగు మహాశక్తియని తెలిసికొనగలరు ఆలాగున శ్రీగురునానక్‌యొక్క నిర్మల నామము నుచ్చరించి కోట్లకొలది సిక్కులున్ను, ఉదాసీనులున్ను, నిర్మలు లున్ను లోకోపకారమెట్లు చేయుచున్నారో అదిన్ని లోతుగా దిగి విచారించిన నానక్‌గారి తపస్సువలన గల్గిన ఆత్మశక్తి ప్రభావమని జను లెరుంగగలరు కావున దైవ ధ్యానములో లయమొందనిచో, తపస్సుచే నాత్మశుద్ధి గానిచో, యోగనిష్ఠచే ఆత్మప్రబోధము గలుగనిచో, బ్రహ్మనిష్ఠచే హృదయము శుద్ధమై కరుణారసము పొంగి ప్రవహింపనిచో ఎవరును లోకమున ఏ కార్యమునూ చేయజాలరు అయితే యిది మతము యొక్క మూలసూత్రమైనను, వాడిగల కత్తిపై సాము వంటిది ఇట్టి నిష్ఠకు శక్తిలేని వారు లోకోపకార కార్యములు శక్తికొలది చేయుటే శ్రేష్ఠము. నిష్ఠగలవారుగూడ వీరికి మార్గదర్శ కులుగా అపుడపుడు లోకసేవ చేసి చూపుచుండ వలయును.

పుష్పము వికసించినప్పుడు తుమ్మెదలను పిలువనక్కరలేదు. అవియే స్వయముగా వచ్చి మధుపానము చేయుచుండును. ఆలాగున మీ

హృదయము వికసించి జ్ఞానము గల్గునపుడు కోట్లకొలది జనులు రేయింబ వళ్ళు మీపాదముల వద్ద పడియుండి ధర్మబోధను వినుచు ఆనందా మృతపానముచేసి మగ్నులై యుందురు కాయ పండినపుడే మాధుర్యము గల్గును దానినే జనులు భుజింతురుగాని, పచ్చిదానిని తినజాలరు ఆలాగున మీ హృదయమునకు, జ్ఞాననిష్ఠలో పరిపక్వత గలుగనిండు, తొందర పడనక్కరలేదు అధికారముగల వాక్యములకే విలువ గలదు. తక్కిన వారి వచనములు గాలి వంటివి, ఎంతకాలము చదివి, జడ్జి, కలెక్టరు, గవర్నరు, వైస్రాయి యెట్లగుచున్నారో, ఆలాగున మీరున్ను బ్రహ్మవిద్యలో చాల పారముల జదివి ఉత్తీర్ణులు గావలసి యుండును అధికారము వచ్చువరకు మీ వాక్యములకు విలువయుండదు అంతవరకు మీ గంభీరోపన్యాసములు మందు మాత్రమువేసి గుండులేని ఫిరంగి శబ్దమువలె నుండును దానమిచ్చు టకు ప్రయాసము లేదు సామగ్రి సమకూర్చుటకు యత్నము చేయుము ఇత్యాది ధర్మవాక్యములను, అనుభవజ్ఞుల యుపదేశ వాక్యములను చాల జాగరూకతతో గ్రహించుకొనుడు

బ్రహ్మనిష్ఠలోను, తపస్సులోను, జ్ఞానములోను మీ ఆత్మ పరిశుద్ధము గానిండు అపుడు మీకు కొద్దికాలముననే, యమోఘమగు లోకోపకారము జేయ శక్తి గల్గును

విద్యుచ్ఛక్తి యంత్రము ఒకే స్థలములోనే యుండును దాని యందు శక్తియుండిన ఎన్నియో మైళ్ళదూరమున దీపములు ప్రకాశించుచు యంత్రములు పనిచేయుచుండును. ఆలాగున దైవశక్తిగలవాడవు గమ్ము అప్పుడు తలంచుకొనిన లోకమున ననేకకోట్ల జనులు లోకోపకారము చేయ గలరు రేడియో యంత్రము ద్వారా శబ్దమును ఆకాశమందు కలుపుటచే ఒకే సమయములో ప్రపంచములో ననేకకోట్ల యంత్రములు మాట్లాడ గల్గుట జూచుట లేదా? ఆలాగున మీ మనస్సు శుద్ధమై ఆకాశము వలె వికసించి వ్యాపకము గానిండు, అప్పుడు ప్రపంచమున ననేక కోట్ల జనుల హృదయ ముల యందది వ్యాపించి మీ సంకల్పము ప్రకార మది పనిచేయ గలదు

మీ ఆత్మను సర్వేశ్వరునిలో నైక్యమొనర్చి ఏకాకార స్థితి గలిగేలాగున చేయుడు అప్పుడు ఈశ్వరుడు ఎక్కడెక్కడ వ్యాపించి యుండునో, అచ్చట మీ సంకల్పమున్ను వ్యాపించి పని చేయగల్గును

పూర్వీక ఋషులు సిద్ధ పురుషులు ఇటువంటి స్థితిగలవారై యుండిరి కనుకనే వారి సంకల్ప ప్రకారము లోకమున జరుగుచుండును అట్టి మహా కార్యమెద్దియో దాని కొఱకు యత్నింపుడు అట్టివారే మనకు ఈ కాలమున గావలసినవారలు అట్టి వారివల్లనే లోకోద్ధారణ గాగల్గును వట్టి వాక్కు చెప్పుచుండిన ప్రయోజన మేమియులేదు కాన కార్య రంగమున ప్రవేశించి చేయవలసిన కార్యమెద్దియో దానిని చేయుము అయితే నేను చేయుచున్నా నని సంకల్పము గలుగజేసికొన కుము నీవు సర్వేశ్వరుని చేతిలో పిల్లనగ్రోవి వలె, ఆ పరమ పురుషుని యాశయమును లోకమున కుపదేశించుటకు పాత్రుడవుకమ్ము అంతఃకరణము సంపూర్ణముగా శుద్ధమయ్యే లాగున చేసి కొమ్ము. అప్పుడు దానిలో గల్గెడు శక్తికంతము లేదు అది మహాశ్చర్య కరమైనది అప్పుడు మీకే ఆ శక్తి అత్యద్భుతముగా గోచరము కాగలదు



# మోక్ష ప్రతిబంధము

వేదాంత శాస్త్రము నాచార్యుం డన్తేవాసులకు చక్కగా బోధించిన తర్వాత ఈ క్రింది శ్లోకముల నుపదేశించుట సంప్రదాయ సిద్ధము. వర్తమాన కాలమున నిది బ్రహ్మనిష్ఠుల కెంతో యవసరము పూర్వకాల ఋషులవలె వర్తమాన కాలమున గూడ గురువులు ముముక్షువులకు, శిష్యులకు, బ్రహ్మతత్త్వము నుపదేశించుచున్నారు. దానియందు కొరత యేమియు లేదు అయితే పూర్వీక ఋషులవలె, యతీశ్వరులవలె బ్రహ్మణ్యులవలె నిప్పుడుండు వారు ఉన్నత స్థితికి రాకపోవుటకు కారణమేమని దీర్ఘముగ నాలోచించిన ప్రతిబంధమొకటియే హేతువని గోచరించుచున్నది. ప్రతి

బంధరాహిత్యము కొఱకు నిప్పుడుండువారలు అంతగ శ్రద్ధవహించుట లేదు అందువల్లనే వారికి హృదయపారిశుద్ధ్యము కలుగక పోవుచున్నది కనుక పవిత్రత, శాంతి, ఉపరతి, పొందకపోవుటయేగాక స్వరూప స్థితిలో నిలువక వృత్తిలోనికి, మనసులోనికి జారిపోవుట జరుగుచున్నది మఱియు నిప్పుడు శ్రవణము మాత్రము చేయుచున్నారే గాని, మనన, నిదిధ్యాసములలో నంత శ్రద్ధయుంచుట లేదు శ్రవణముచేత సంశయ నివృత్తిన్ని, మననము వేత విక్షేపనివృత్తియు, నిదిధ్యాసముచేత విపర్యయ నివృత్తియున్ను గలుగుచున్నది దీనికి సంశయ విపర్యయ, అసంభావనా వృత్తులని గూడ పేర్లు గలవు ఇవి యొక్కొక్కటిన్ని, రెండేసి అర్థములు కలిగియున్నవి ఆ విషయము విచారసాగరాది గ్రంధములలో కనందగును

**మణి మంత్రౌషధై ర్వహ్నిః సుదీప్తోఽపి యథేన్ధనమ్ ।**
**ప్రదగ్ధుం నై వ శ క్తః స్యాత్ప్రతిబద్ధ స్తథైవచ ॥**

**జ్ఞానాగ్నిరపి సంజాతః ప్రదీప్తః సుదృఢోఽపి చ ।**
**ప్రదగ్ధుం నైవ శక్తః స్యాత్ప్రతిబన్ధస్తు కిల్బిషమ్ ॥**

ప్రదీప్తమగు అగ్ని మహాజ్వాలారూపముగ మండుచున్నట్లు కనుపించి నను మణిమంత్రౌషధాదులచే నిరోధింపబడి(కట్టబడి) నందుచే కట్టెలను గాని, నవధాన్యములనుగాని, శుష్కతృణము గాని దహింపజేయ శక్తి ఎట్లు దానికి నుండదో! ఆలాగున విచారణా జనితమగు నాత్మజ్ఞానము, బ్రహ్మ జ్ఞానము, బాగుగ గలిగియున్నను లెస్సగ బోధింపగల శక్తిగలిగి యుండినను, ప్రతి బంధమనెడు పాపమున్నచో కర్మలను దహింపజేయు శక్తి యుండదు

ఓహో! యెంత గొప్పసత్యమును వేదాంతశాస్త్ర ముపదేశించెను! వర్తమాన, బ్రహ్మవిచారపరులకు కనిపించెడు దోషమిది యొక్కటియే వేదాంత విచారణలో కొరత ఏమియు లేదు ఆచరణలోగల దోషమే వారిని బ్రతిబంధించుచున్నది ఈ విషయమై యడిగినచో, అది ప్రారబ్ధకర్మ యని సమాధానము జెప్పుదురు అట్టి మలిన ప్రారబ్ధముండగా తత్త్వజ్ఞాన మెట్లు

ఉదయించును? వేదాంత విచారణమునకు సాధన చతుష్టయ సంపత్తి గలవాడే అధికారి యని శాస్త్రము నిరూపించుట లేదా! సాధన చతుష్టయ సంపత్తి సామాన్యముగ, ముముక్షువు లందరికిన్ని దెలిసిన విషయమే అది మరల నిచ్చుట వ్రాయబనిలేదు శ్రవణము మాత్రము చేయుచు మనన, నిది ధ్యాసనాదులలో కొఱత గలిగియుండుటచేతనే ఈ లోపములన్నియు గలుగుచున్నవి "ప్రారబ్ధకర్మ" యను గ్రంథమొకటి గలదు దానిని జదివినచో ప్రారబ్ధమెవరికి విధించడమైనది, అది యెట్లు ప్రవర్తించును అను ఈ సత్యమంతయు గోచరించగలదు

ఆత్మవిచారము జేయవలెనని బాహాటముగ గురువులు చెప్పుదురు ఆత్మ ఇట్టిది, అనాత్మ ఇట్టిది, అని తెలిసి కొనుటగదా! ఆత్మవిచారము యొక్క అర్థము అట్టైన అనాత్మవృత్తులు తనలో లేకుండ జేయవలెను గదా! అనాత్మవృత్తులతో గూడియుండినచో నాత్మ విచారణచే గలిగెడు ప్రయోజన మేమి! ప్రతిబంధము, వర్తమాన ప్రతిబంధమనియు, భూత ప్రతిబంధ మనియు, భావి ప్రతిబంధమనియు, త్రివిధము ఈ విషయము "వేదాంత పంచదశి" యందు బాగుగా కనుగొన వచ్చును వీనిలో భూత ప్రతిబంధము, భావిప్రతిబంధము అంతగొప్పది గాదు వీటిని సులభముగా జయించ వచ్చును వర్తమాన ప్రతిబంధము చాలా దృఢమైనది దీనిని జయించవలసి యుండిన దీర్ఘకాలమేకాంతమున ఉండి ఏకాగ్రచిత్తముతో ధ్యానము చేయ వలెను ధ్యానమునకే నిదిధ్యాసనమని గూడా పేరుగలదు ఈ ధ్యానాధ్యను ష్ఠాన లోపమువల్లనే వాసనాక్షయ మనోనాశనములు గలుగక పోవుచున్నవి శ్రవణ మొక్కదానివల్లనే మోక్షముగలుగుచో ఋషులు దీర్ఘకాలము ఏకాంతమున ఏకాగ్రత గలిగి యెందుకు ధ్యానము చేయవలెను! వర్తమాన ప్రతిబంధము క్రింద నిరూపింపబడు చున్నది.

**ప్రతిబంధో వర్తమానో విషయాసక్తిలక్షణః ।**
**ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయదురాగ్రహః ॥**

(1) విషయాసక్తి (2) ప్రజ్ఞామాంద్యము (3) కుతర్కము (4) విపర్యయము (5) దురాగ్రహము ఈ అయిదు దోషములు వర్తమాన ప్రతి బంధములనంబడును

(1) విషయాసక్తి అనగా ఇంద్రియములు శుద్ధములై నిర్విషయస్థితిని బొందకపోవుట, (2) ప్రజ్ఞామాంద్యము, బుద్ధికి ధారణాశక్తి లేకపోవుట, బుద్ధి శుద్ధము కాకుండుటే అట్లు కలుగుటకు కారణము, (3) కుతర్కము అనవసరముగా ఆత్మజ్ఞానులతో తర్కించుటకు ప్రశ్నలు వేయుటకు ప్రేరేపణము గలుగుట ఇది యందరి ఆత్మయు, తన ఆత్మయు నొక్కటే యనుజ్ఞానము కలుగకపోవుటవలన కలుగును దానికి కారణము సహనము లేక పోవుటయే, మరియు రజోగుణము కలిగియుండుటయే, (4) విపర్యయము అనగా ఆత్మయందు నిలుకడ కలుగక అనాత్మ పదార్థము లందు ఆత్మబుద్ధి గలిగియుండుటయే యగును ఆత్మయిట్టిది, అనాత్మ యిట్టిది, అని తెలిసికొని అనాత్మభావదోషమును రహిత మొనర్చ వలయును, (5) దురాగ్రహము అనవసరముగ కోపోద్రేకము గలుగుట, అనవసరముగ నెవరిపైన నయినను కోపోద్రిక్తుడగుట ఇది తమోగుణ లక్షణము, సత్త్వగుణము చాలకపోవుటయే ఈ రజోగుణ, తమోగుణములు విజృంభించుటకు కారణము దీనికి మంచి తపస్సు అవసరము అగ్నియందు కట్టెలు కాలిపోవునట్లు, తపస్సువల్ల పై రెండు దోషములు శమించవలయును కావుననే శ్రీపతంజలి మహర్షి యోగశాస్త్రము నందు ఇట్లు వచించెను

**సూ ॥ స తు దీర్ఘ కాలనైరన్తర్యసత్కారాసేవితో దృఢభూమిః ।**

ఆ తపోధ్యానాద్యభ్యాసము, బహుకాలము, ఎడతెగకుండ మిగుల ఆదరముతో బాగుగా సేవింపబడినదై (లెస్సగ నాచరింపబడినదై) దృఢ పడును కావున శ్రవణము మాత్రము చాలదు నిరంతరానుష్ఠాన మెంతేని నవసరము అందుచేతనే మనన నిదిధ్యాసము లేర్పడినవి శ్రీవ్యాసభగవాను డున్ను బ్రహ్మసూత్ర మందిట్లే వచించెను

**సూ॥ ఆవృత్తి రసకృదుపదేశాత్ ।**

పలుమారు బ్రహ్మజ్ఞాన సాధనముల నుపదేశించుటవలన శ్రవణ మననాదుల ననేక పర్యాయములు అనుష్ఠింప వలయును "ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యః మంతవ్యః నిదిధ్యాసితవ్యః" అని బృహదారణ్యక శ్రుతియు పై విషయమును స్పష్ట పరచుచున్నది శ్రవణము మాత్రము చాలినచో ఇక మనన నిదిధ్యాసము లేల చెప్పవలయును? కావున నాత్మ సాక్షాత్కారము గలుగువరకు బ్రహ్మము నుపాసింపవలయును నిరంతరము ధ్యానింపవల యును శ్రవణమననాదుల నభ్యసింపవలయును ఇదే విషయమును -

**అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్ ।**
**శమాది సహిత స్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్' ॥**

అని వేదాంత పంచదశియందు చెప్పియున్నారు శ్రీకృష్ణభగవాను డున్ను గీతలో నిట్లే యుపదేశించెను

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥ (4 - 38)**

లోకమునందు జ్ఞానముతో సమానమైనదియు, పవిత్రమైనదియు, మరియొకటి లేదు అట్టి జ్ఞానమును కాలక్రమముచేత లెస్సగా యోగసిద్ధిని బొందినవాడు తనయందు తనంతటనే పొందుచున్నాడు అనగా "కాలే నాత్మని విన్దతి" యని చెప్పుటవల్ల ధ్యానానుష్ఠానములచే అంతఃకరణము శుద్ధమగునపుడు తనలో తనంతట తానే యుదయ మగుచున్నదని భావము విత్తనము చెట్టు అయి కాలము వచ్చినపుడు పుష్పించినట్లు కాయ లేర్పడి పండగునట్లు జ్ఞానియగువాడు బ్రహ్మబీజమును, ఓంకారమును, ధ్యానించి, ధ్యానించి పరిపక్వావస్థకు వచ్చినపుడు అతనికి బ్రహ్మజ్ఞానఫలము స్వయము గానే యావిర్భవించును.

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ।**
**అనేక జన్మ సంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥ (6 - 45)**

పట్టుదలతో యత్నించుచున్న యోగనిష్ఠుడు పాపరాహిత్యము గలవాడై, అనేక జన్మములయందు అభ్యసించుటవలన పొందదగిన యోగసిద్ధిని పొందిన వాడగుచున్నాడు అటు పిమ్మట అనగా అట్టి యోగ సిద్ధిని పొందిన తరువాత సర్వోత్తమమగు మోక్షసిద్ధిని పొందుచున్నాడు దీని యందు "యోగీ సంశుద్ధ కిల్బిషః" యోగసాధకు డంతఃకరణములో గల సమస్త విషయాది దోషములు నశించిన తర్వాత సర్వోత్కృష్టమగు బ్రహ్మ మును పొందుచున్నాడు అని చెప్పిన దానిని యోచించుకొనవలయును, 'అనేక జన్మసంసిద్ధః' అని చెప్పుటవలన ఇక అనేక జన్మములు జరుగవలెనని యర్థము కాదు, అనేక జన్మముల నుండియు నిప్పుడుండు ముముక్షువులు, అనుష్ఠానము చేసికొని వచ్చిన వారనియు, అందువల్లనే వారికి వర్తమాన జన్మములో విషయాది దోషములు నశించి, వైరాగ్యము గలిగి బ్రహ్మనిష్ఠ జేయుట కర్హత గలిగినదనియు గ్రహించు కొనవలయును లేనిచో అనేక మంది జనులు విషయాసక్తులై యుండుటకున్ను, మీకు విషయములలో వైరాగ్యము కలుగుటకున్ను కారణమేమి? మీరు అనగా విరక్తులు మోక్షమునకు చాలా దగ్గరలోనికి వచ్చితిరి ముక్తులైనచో నింక చెప్పనక్కర లేదు

ఒక చెట్టులో పండ్లున్ను, కాయలున్ను, పువ్వులున్ను కనిపించినచో, ఇపుడు కనిపించెడు పండు దీనికి ముందు కాయగ నుండుననియు, కాయ కన్న పుష్పరూపముగ పూర్వముండినదనియు, కాయ తీవ్ర వైరాగ్య నిష్ఠగల మధ్యావస్థ యనియు, పండు ముక్తావస్థయనియు గ్రహించుకొనవలయును అయితే పండు అయిన తర్వాత పులుపు, వగరు, చేదువగైరా దోషములు నశించిపోయి యుండవలయునని గ్రహించుకొనవలయును కొంచెము పుల్లగనుండినను అది ఇంకా బాగుగ పండలేదని తెలసికొనేది. అయితే రెండుమూడు రోజులు పోయిన పులుపు సంపూర్ణముగ పోయి బాగుగ పండిన బంగినపల్లి మామిడి పండువలె మధురమయమై యుండగలదని గ్రహించుకొనిన చాలును

**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।**
**వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః ॥ (7 - 19)**

ఎవడనేక జన్మములలో నాచరించిన పుణ్యసంస్కారమువలన నంతః కరణము శుద్ధమై కడపట సమస్తమున్ను వాసుదేవ మయమను జ్ఞానము కల వాడగుచు నన్ను పొందుచున్నాడో, అటువంటి మహాత్ముడు దుర్లభుడు ఇది కట్టకడపటి స్థితియని గ్రహించుకొనవలయును అంతయు విష్ణుమయము, అంతయు శివమయము, అంతయు బ్రహ్మమయమను నవస్థ కలుగవలెను ఇదియే జీవేశ్వరులయొక్క ఐక్యము, ఏకత్వము అని గ్రహించేది వైష్ణవులు ఇదంతయు విష్ణుమయమనియు, శైవులు ఇదంతయు శివమయమనియు, వేదాంతులు ఇదంతయు బ్రహ్మమయమనియు చెప్పెడు దానియొక్క సారమిదియే

కాన ముముక్షువులు ఇట్టి చరమ జ్ఞానము, మోక్షము గలుగుటకు గల ప్రతిబంధమును తొలగించుకొనుటకై ప్రయత్నింపవలయును



# సహజము

దీనినే స్వభావమని గూడ చెప్పుదురు సామాన్యముగ విద్యార్థిదశలో బాల బాలికలు, యువతీయువకులు కూడ ఏదైన తప్పు చేయునపుడు వారికి సంబంధించిన పెద్దవారు ఆ యువతీ యువకులను గుఱించి యీదశలో వారుచేయునది సహజము, అనగా స్వభావము కావున క్షమించవలసినదిగ పెద్దవారిని గోరుచుందురు ఇచ్చటనే ప్రమాదము కలుగుటకు ప్రారంభమగు చున్నది వారు దేహము, మనస్సు, బుద్ధి మొదలగు వాని గుణములను స్వభావమని తలంచుచున్నారు. ఆత్మయొక్క స్వభావమును వీరు మరచి పోయినారు ఇచ్చటనే ఆత్మబుద్ధి విస్మృతి గలిగి, దేహబుద్ధి ఆత్మదని తలంపు గలుగుట యారంభమగుచున్నది. అనగా జ్ఞానము మఱుగుపడి

అజ్ఞాన మావిర్భవించుటకు కాలమాసన్నమైనది ఇది అస్వభావమును అనగా ప్రకృతి స్వభావమును వృద్ధిపరచుచున్నది ప్రకృతిలోనికి, అవిద్య లోనికి, అజ్ఞానము లోనికి పడిపోవుటకు ఇదే ప్రారంభము పై జెప్పిన పిల్ల వారలకు వారి తల్లిదండ్రులు లేక రక్షకులు విషము పోసెడు సమయమని వారు తెలిసికొనుట లేదు ఇందువల్ల ప్రాకృత గుణములనుండి వారి నుద్ధరించు టకు యత్నము చేయక పోవుటయే గాక అజ్ఞానము లోనికి తమబిడ్డలను పడద్రోయుచున్నారని వారు గ్రహించుట లేదు ఇట్లు గాక బాల్యకాలములోనే వారు చేసిన తప్పులను ఖండించి వారలను శిక్షించి యీలాగు తప్పుకార్యము చేయకుమని బోధించువారే నిజముగా రక్షకులు, ఇట్టివారే తమ బిడ్డలను అజ్ఞానమునుండి యుద్ధరించువారు ఇది బాలురకే గాక జిజ్ఞాసువులకున్ను, ముముక్షువులకున్ను, సాధువులకున్ను సంబంధించిన విషయమే కాని సామాన్యమని తలంపరాదు

ఈవిషయములో భారతీయులేగాక సర్వజనులున్ను మోసపోవు చున్నారు సహజమునకు లేక స్వభావములకు ఈ ప్రకృతి గుణమని అర్థము కాదు ఇది పొరపాటు సహజ స్వభావములకు ఆత్మయే లక్ష్యార్థమగును అది మొదటనే బాలబాలికలకు నేర్పియుండినచో మరల అజ్ఞానములో పడిపోవుటకు అవకాశముండదు ఈ గుణములన్నియు పూర్వ జన్మసంస్కా రము ననుసరించియో లేక ఈ జన్మసహవాసము ననుసరించియో కలుగుచుండును ఇవి అన్నియు దేహేంద్రియ మనోబుద్ధుల స్వభావమేగాని ఆత్మయొక్క స్వభావము గాదు దీనిని స్వభావమని శాస్త్రమం గీకరించదు ఇది ఆగంతుకము అనగా మధ్యవచ్చి చేరునది, స్వభావమైనచో దానికి మార్పు కలుగదు ఆగంతుకము సదా పరిణామమును పొందుచుం డును ఇది సత్త్వరజస్తమోగుణములతో కూడినది కావుననే గీతయందు ఇట్లు తెలుపడమైనది

**సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్ ॥**

ఓ అర్జునా! ప్రకృతి నుండి గలిగియున్న సత్త్వరజ స్తమోగుణములు దేహమునందున్న నాశము లేని ఆత్మను కట్టుచున్నవి ఇదే ఆత్మను బంధించెడు కీలకము ఇచ్చటనే జాగ్రత్త పడవలసి యుందురు నూలుయొక్క స్వభావము తెలుపుగా నుండినను రక్త కృష్ణ పీతాదిరంగులలో ముంచునపుడు స్వచ్ఛమైన తెలుపువర్ణము మఱుగై పైచెప్పిన రంగుల స్వభావము, నామధేయమే వ్యవహారమునకు వచ్చునట్లు ఆత్మయొక్క నిర్మల జ్ఞాన స్వభావము మరుగుపడి ప్రకృతిగుణమే స్వభావము, సహజము అను స్థితిలోనికి లోకము పడిపోయెను ఇచ్చటనే సూక్ష్మబుద్ధిగల జిజ్ఞాసువులు జాగ్రత్త పడవలయును నూలు స్వభావమనియు, రంగులు ఆగంతుకము లనియు గ్రహించునది ఆగంతుకమనగా మధ్య వచ్చి చేరినదని ముందుగనే మీకు తెలుపడమైనది దీనిని గ్రహించుటకు ప్రయాస యగుటవల్ల పునరుక్తి దోషమును పాటింపక మరల చెప్పవలసి వచ్చినది ఆగంతుకమగుట వల్లనే ద్రావకములో నుడుకబెట్టిన ఎట్టిరంగులైన వదలిపోవును కావున తన ప్రయత్నముచేత, చింతనచేత ప్రకృతి గుణములను రహిత మొనర్చులాగున చూడవలయును అప్పుడు సహజమైన స్వభావమైన ఆత్మయొక్క సత్యము తెలిసికొనగలము కావుననే గీతాచార్యులు

**క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ।**

క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క నిజమైన సత్యము తెలసికొనుటయే జ్ఞాన మని నామతము అని చెప్పిరి ఒక్క వైదికాచరణ నిష్ఠగల బ్రాహ్మణ బాలుడు లేక బాలిక, నీచజాతిలో గలవారితో గలసి మద్య మాంసాది భక్షణము చేయు చుండిన తల్లిగాని, తండ్రిగాని అది పిల్లవారల స్వభావమని చెప్పి విడిచి పెట్టినచో ఆ దుస్స్వభావమును మానుటకు బాలబాలికలుయత్నముచేయరు. ఆ చెడు స్వభావముతోనే వారుండి పోవచ్చును అట్లుగాక వైదిక నిష్ఠగల తల్లిదండ్రులైనచో బిడ్డలయొక్క చెడువృత్తిని చూచి యిట్లు చేయకుము నీచాహారములను తినకుము అని చెప్పి దండించి నీచవృత్తిలో గలవారి సహవాసము చేయనీయక ఎట్లు సంరక్షించు కొనుదురో, ఆలాగున శుద్ధాత్ములై

తల్లిదండ్రులు తమ బిడ్డలయొక్క దుర్వృత్తిని చూచి దానిని సహజమని స్వభావమని చెప్పక బిడ్డలను శిక్షించి దుర్వృత్తిలోనికి పోనీయక సంరక్షించు కొనవలయును లేనిచో స్వభావమని తలంచి సంతోషించినచో ఆ దుర్గు ణము మరల పెరిగి బిడ్డలు చెడిపోవుదురు ఈ పరమ సత్యమును మరువ కుందురుగాక! ఆత్మయొక్క స్వభావము లేక ఆత్మయొక్క సహజ గుణ మును గూర్చి శంకరులు ఆత్మబోధలో తెలిపినది చూడుడు

**ప్రకాశోఽర్కస్య తోయస్య శైత్య మగ్నేర్యథోష్ణతా ।**
**స్వభావ స్సచ్చిదానంద నిత్యనిర్మలతాఽఽత్మనః ॥**

సూర్యునికి ప్రకాశము, నీళ్ళకు చల్లదనము, అగ్నికి ఉష్ణత్వమున్ను, స్వతస్సిద్ధమైన స్వభావమైనట్లు ఆత్మకును సచ్చిదానంద నిత్యనిర్మలత్వాదులే స్వరూపమని ముముక్షువు తెలిసి కొనవలయును

ఈ సత్యము తెలిసికొనిన ఇది నా స్వభావము, అది వాని స్వభావము అని చెప్పువారు యధార్థమును తెలిసి కొనగలరు

**నానోపాధివశాదేవ జాతి నామాశ్రమాదయః ।**
**ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాది భేదవత్ ॥**

స్వభావము చేతనే స్వచ్ఛమైన జలమునందు చేదు, పుల్లన, తీయన, ఎఱుపు, పచ్చన మొదలైన గుణములు గల పదార్థముల యొక్క సంబంధ ముల చేత నాయాపదార్థములయొక్క రుచియు, రూపమున్ను ఏలాగున ఆరోపింపబడుచున్నదో ఆలాగే ముందుచెప్పబడిన నానావిధములైన శరీరములవలన పరిశుద్ధమైన ఆత్మయందు సత్త్వరజస్తమోగుణములు, రాగద్వేషాది స్వభావములు కల్పితములే గాని సత్యములు గావు

**వపుస్తుషాదిభిః కోశై ర్యుక్తం యుక్త్యవఘాతతః ।**
**ఆత్మాన మాన్తరం శుద్ధం వివిచ్యాత్తండులం యథా ॥**

లోకములో జనులు వడ్లను దంచి పొట్టు, తవుడు మొదలైన వానిని

వేఋపరచి, బియ్యమును గ్రహించు ప్రకారముగానే పంచకోశముల నుండి ఆత్మను శ్రవణమనన నిదిధ్యాసనములచేత శోధించి యీ సమస్త సత్త్వరజ స్తమో గుణాదులను తొలగించి వీనికంటె విలక్షణమై సత్యజ్ఞానానంద స్వరూపమైయుండు ఆత్మయే స్వరూపముగ తెలిసికొనవలయును

**శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః ।**
**జీవస్సర్వ మలాన్ముక్త స్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్ ॥**

అపరంజిబంగారము ఇతరములైన రాగి మొదలగు లోహములు చేరి మలినమై పోయినప్పటికిని దానికి జేయవలసిన పుటాది సంస్కారముల చేత దానియందుండు మాలిన్యము నివర్తింపబడి బంగారు తనకు తానే ప్రకాశించుచున్నట్లు జీవుడును శ్రవణాద్యభ్యాసములవల్ల వాడుకపడి సంసారహేతు భూతమైన మూలాజ్ఞానమువల్ల నివర్తింప బడినవాడై తనకు తానే ప్రకాశించుచున్నాడు అపరంజిబంగారు ఎంత విలువగలదై యున్నను రజత తామ్రాదులగు చెడు లోహములు కలియుట వల్ల ఎంత హీన స్థితికి వచ్చి తక్కువవెల గల తెల్లబంగారగుచున్నదో ఆలాగున సత్యజ్ఞానానంద స్వరూపమగు శుద్ధాత్మయు ప్రాకృతములైన చెడుగుణములతో గూడి నీచ స్థితిని బొందుచున్నది అయినను భయపడనక్కరలేదు స్ఫుటముచేసి సువర్ణములోగల దోషమును తొలగించినప్పుడు అదివెట్లు అపరంజిబంగార మగుచున్నదో ఆలాగుననే పరిశ్రమశీలురు తపోధ్యానశ్రవణాదులచే ఆత్మలో గల మాలిన్యమును తొలగించిన శుద్ధాత్ములు కాగలరు ఈ విషయమై యోగవాసిష్ఠమున తెలిపినది చూడుడు.

**తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా ।**
**నశ్యతి క్రియయా పుత్ర! పురుషస్య తథా మలః ॥**

**జీవస్య తండులస్యేవ మలం సహజ మప్యలమ్ ।**
**నశ్యత్యేవ న సందేహః తస్మాదుద్యమవాన్భవ ॥**

ఒకవేళ ప్రకృతి స్వభావము జీవునకు పుట్టుకలోనే పూర్వజన్మ కర్మ

ననుసరించి వచ్చుచుండినను దానిని నివృత్తించెడు ఉపాయమిచ్చుట నిరూపిం చడమైనది

బియ్యము పుట్టుకతోనే తౌడుతోను, పొట్టుతోను కూడి యుండును అట్లే రాగి పుట్టుకతోనే చిలుముతో కూడియే ఉండును అయినప్పటికి దంచుటవలన బియ్యము యొక్క పొట్టుతవుడు ఏలాగున వదలి పోవు చున్నదో యట్లే యోగము చేతను, జ్ఞానము చేతను పురుషుని యొక్క అజ్ఞాన రూపమగు మలము పోవుచున్నది బిడ్డలను ఎట్లు చిన్నకాలము నుండి సంరక్షించ వలయునో మదాలస చరిత్రము చదివిన అర్థమగుచుండును మదాలస ఋతధ్వజ మహారాజుగారి ధర్మపత్ని

**శుద్ధోఽసి బుద్ధోఽసి నిరంజన్డోఽసి**
**సంసార మాయాపరివర్జితోఽసి ।**
**సంసార స్వప్నం త్యజ మోహ నిద్రాం**
**మదాలసా వాక్యమువాచ పుత్రమ్ ॥**

చిన్నకాలమునుండి మదాలస తన బిడ్డలకు ఈలాగున బోధించి బ్రహ్మజ్ఞాన సంపన్నులుగ జేసెను ఉయ్యలలోనే యో కుమారుడా! నీవు శుద్ధాత్మ స్వరూపుడవు ప్రభుస్వరూపుడవు, నిష్కల్మముడవు,సంసార మాయచే వదలి పెట్టబడినవాడవు అనగా సంసార మాయ నీయందు లేదు ఈ సంసారము స్వప్నములో కనిన పదార్థము వంటిది కావున దీనివలన కలిగిన మోహమును వదలిపెట్టుము మదాలస తన పుత్రుని కీలాగున బోధించుచుండును ఇప్పుడుండు తల్లులు ఉగ్గుపాలతో ఉయ్యాలలో బిడ్డల కేమి బోధించుచున్నారో కనుగొనుడీ! అందువల్లనే పిల్లలు ప్రాకృత గుణము లతో గూడి చెడిపోవుచున్నారు జిజియా బాయి తన కుమారుడగు శివాజికిన్ని వివేకానందుని తల్లి భువనేశ్వరియమ్మ వివేకానందస్వామికిన్ని, పుతలీ బాయిగారు తన పుత్రుడగు గాంధిగారికిన్ని బాల్యము నుండి యేమి బోధించిరో, ఆచరిత్ర చదివిన మన తల్లులు బిడ్డలను ఎట్లు సంరక్షింప గలరో

తెలిసికొనెదరు

ఈ వ్యాసములో మొదటనే ప్రకృతి రహితమైన శుద్ధాత్మను ప్రకృతి గుణమెట్లు బంధించునో శ్రీకృష్ణభగవానుడు చెప్పినది మీకు జ్ఞాపకము చేయడమైనది ఇపుడు ఆ బంధనమునుండి యెట్లు విమోచనము గాగల్గు దురో దానిని ఆ భగవంతుడే ఈ పదునాల్గవ అధ్యాయమున నిరూపించినది చూడుడు

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**

**జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

దేహమును బడసిన ఆత్మ, దేహమును గలుగజేసిన ఈ గుణ త్రయమును అతిక్రమించి జననము, మరణము, వార్ధక్యము అను ఈ దుఃఖములచే విడువబడినవాడై బ్రహ్మానందమును బొందుచున్నాడు



# మోక్షము

# ముముక్షువును స్వయముగావచ్చి చేరుచున్నది

మోక్షమనియు ముక్తి యనియు, కైవల్యమనియు, బ్రహ్మ ప్రాప్తి యనియు, బ్రహ్మానందమనియు చెప్పునది యొకటియే, తక్కినవన్నియు పర్యాయపదములు. మోక్షము కొఱకు మీరు వెదకి ప్రయాణము చేయ నక్కర లేదు యాచింపనక్కఱ లేదు ఆ మోక్షము మిమ్ముల నే వచ్చి యాశ్రయించుట కుపాయము శ్రీ కృష్ణభగవానులు గీత ఆరవ అధ్యాయ మునచెప్పెను అయితే ముముక్షువయినవాడు ఎట్లుండవలెనో యట్టియోగ్య తను మాత్రము మీరు సంపాదించుకొనిన చాలును అపుడు మోక్షము వచ్చి మిమ్ములనే బొందును ముముక్షువునకు గావలసిన యోగ్యత మీకు లేనిచో మీరు దేవుని ప్రార్థించినను, బ్రహ్మలోకమునకు, వైకుంఠమునకు, కైలాసము

నకు వెళ్ళినను మీ కది దొరకదు "ముచ్ల్ = మోక్షణే" అను ధాతువునుండి మోక్షశబ్దము వచ్చి యున్నది దీనికే ముక్తియని కూడ పేరు గలదు బంధనము నుండి వదలిపోవుట యని దీని యర్థము

ఒకడు బీదవాడైనను గొప్పజ్ఞానమును, గొప్ప బుద్ధియున్ను, గొప్ప విద్యయున్ను గలిగి సకల యోగ్యములైన లక్షణములు గలిగిన రాజవంశమున బుట్టిన వాడైనచో కన్యను గురించి అనగా వివాహమును గురించి తానెవరిని అడుగక పోయినను, ఎచ్చటను విచారించక యుండినను గొప్ప రాజవంశ ములో గలవారు అతని వద్దకు వచ్చి తమ కుమార్తెను వివాహము చేసుకొను లాగున గొప్ప ధనమిచ్చు లాగునను ఏలాగున ప్రాధేయపడుదురో, అట్లే ముముక్షుత్వ లక్షణము ఏమియు కొఱత లేక కలిగియుండినచో ముక్తి కాంతయు నతని వద్దకువచ్చి ప్రాధేయపడుచుండును అట్లుగాక నీచగుణములతో గూడి హీన వంశములో జన్మించి విద్యయున్ను, ధనమున్ను లేనివాడై రోగగ్రస్తుడై, కురూపియై యుండువాడు రాచకన్యకను పెండ్లిచేసు కొనుటకు ఎంత యత్నించినను అది సాధ్యమగునా? ఈ సత్యము దెలిసికొని నచో ముముక్షువున కుండవలసిన లక్షణము లెట్టివో, యోగ్యత లెట్టివో గ్రహించుకొనవచ్చును

ఉన్నతమైన ఒక యుద్యోగము కావలిసియున్నచో దానికి తగిన డిగ్రీలో నుత్తీర్ణుడై యుండ వలెను అట్లుగాక విద్యావిహీనుడై యుండువాడు అత్యున్నత పదవిలో నుండుటకు ప్రార్థించినను అది లభించునా? అత్యున్నత విద్యలో నుత్తీర్ణుడైన వారు మనదేశములోనే కాదు, మనజాతివారే కాదు, ఏ దేశములో నేజాతిలో నుండువారైనను అట్టి వారిని ఆహ్వానించి యెటుల మహోన్నతమైన నుద్యోగము నిచ్చుచున్నారో మోక్షముయొక్క స్థితియు నటువంటిదే, అమెరికా, జర్మనీ, రష్యామొదలగు దేశములనుండి గొప్ప గొప్ప యింజనీర్లను రప్పించి యుద్యోగమిచ్చుట చూచుట లేదా?

కావున ముక్తిని గోరువారు ముముక్షుత్వమును సంపూర్ణముగ నభ్య

సించిన చాలును ముముక్షుత్వ లక్షణము వేదంతశాస్త్రము లన్నిటిలోను వివరింపబడినదే ముఖ్యముగ భగవద్గీత 13వ అధ్యాయమున 8వ శ్లోకము నుండి 12వరకు ఐదు శ్లోకములచే వర్ణించడమైనది మీరు దానిని చదువు కొనవచ్చును అది యంతయు వ్రాసిన వ్యాసము పెరిగిపోవును ఇక మోక్షము మిమ్ములను వచ్చి ఆశ్రయించు విషయమై కృష్ణభగవానుడు 6వ అధ్యాయ మున చెప్పినది చూడుడు ఎక్కడెక్కడో తిరిగి యేయే దేవతలను ప్రార్థించినను దొరకని మోక్షము మీరుండు స్థలమునకే వచ్చి మిమ్ములనే బొందగలదని చెప్పెడు విషయము సామాన్యమా?

**ప్రశాంత మనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాంతిరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥**

మిక్కిలి శాంతి నొందిన మనస్సుగలవాడై నట్టియు, శమించిన రజో గుణ తమోగుణములు గలిగినట్టియు, కల్మషరహితుడైనట్టియు, బ్రహ్మ స్వరూపుడైనట్టియునగు ఈ ధ్యాననిష్ఠుని, యుత్కృష్టమైన బ్రహ్మానందము స్వయముగా నిచ్చటనే పొందుచున్నది ఇచ్చట 'హి' అని ప్రయోగించుటచే ఈ దేహముతో నున్నప్పుడు ఈ లోకమునందే కలుగుచున్నదని భావము

"యోగినం" అని ప్రయోగించుటవల్ల యోగశబ్దమున కర్థము సర్వేం ద్రియనిగ్రహమని గ్రహించుకొనవలయును మరల "బ్రహ్మభూతం" అని కూడ ప్రయోగించడమైనది "ఇంద్రియములన్నిటిని ప్రాణాపానములను" గూడ నిరోధించి కొన్ని ఘంటలు కొన్ని రోజులు కొన్ని నెలలు కూడ యోగ సమాధిలో నుండువారు గలరు అంతమాత్రము చాలదనియు "బ్రహ్మ భూతం"అని నిరూపించుట వల్ల బ్రహ్మాకారవృత్తి, బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము కలిగియుండవలయునని ప్రయోగించడమైనది అట్టి బ్రహ్మానంద సుఖము తన యాత్మలోనే యిచ్చటనే పొందవలసినదేగాని మఱియొక లోకములో గాదని గ్రహించుకొనవలయును అది ఆత్మయే పరమాత్మయని జ్ఞానము కలుగుట యగును ఈ విషయమై నాల్గవ అధ్యాయమున భగవాను

డుపదేశించినది చూడుడు

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥**

లోకమునందు జ్ఞానముతో సమానమైనదియు, పవిత్రమైనదియు మరియొకటి లేదు అట్టి జ్ఞానమును కాలక్రమముచేత లెస్సగా యోగసిద్ధిని బొందిన వాడు తనయందు తనంతటనే పొందుచున్నాడు

ఇచ్చటను "కాలేనాత్మని విందతి" అని ప్రయోగించడమైనది తన యనుష్ఠానము, ధ్యానము పూర్తియగునపుడు తనలోనే యట్టి బ్రహ్మానంద సుఖమును పొందుచున్నాడు అరటిచెట్టు మొదలగు వృక్షములుగాని, మనుష్యులు మొదలగు స్త్రీ జీవులుగాని కాలము పరిపక్వమై వచ్చినపుడు పుష్పించుటయు, ఫలించుటయు కన్పడుట లేదా? ఆలాగున గర్భము పూర్తియగునపుడు ప్రసవించుటయు చూచుట లేదా? అయితే ఇచ్చట పురుష ప్రయత్నము ఏమిగలదు? కాలము పరిపక్వమగునపుడు స్వయముగానే యావిర్భవించునని తలంచి మోసపోకూడదు తగిన ప్రయత్నములు చేయు చున్నప్పటికిన్ని కాలపరిపక్వము కలుగువరకు ఓర్చుకొని దానికి తగిన కార్య మును చేయుచుండవలయును అదే దీనియొక్క భావము కదలీ వృక్షము మొదలగు వృక్షములను బోషింపకపోయిన నెంతకాలము గడచినను ఫలిం చునా? ఆలాగుననే గర్భమును సంరక్షింపక పోయిన పూర్ణమైన శిశువులు బుట్టుదురా? ఇది జ్ఞాపకములో నుంచవలెను

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మ యోగ యుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥**

బాహ్య విషయములం దాసక్తిలేని మనస్సుగల యే పురుషుడు తన యాత్మయందే సుఖమును పొందుచున్నాడో,అట్టి పురుషుడు బ్రహ్మనిష్ఠ యను సమాధితో కూడుకొనిన మనస్సు గలవాడై నాశరహితమగు బ్రహ్మానందము ననుభవించుచున్నాడు

ఇచ్చటను "విన్దత్యాత్మని యత్సుఖం" అని నిరూపించడమైనది ఇందువలనను తనఆత్మలోనే ఈదేహముతో నున్నప్పుడే యట్టి బ్రహ్మస్థితిని పొందవలయునని యుపదేశించడమైనది అట్లుగాక జీవితమంతయు ప్రపంచ విషయములతోనే గడపి విషయసుఖముల ననుభవించుకొని యంత్యకాలమున భగవంతుడు మోక్షమును గలుగజేయునని తలంచి మోసపోకూడదని భగవానునిచే తెలుపడమైనది

**శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్ ॥**
**కామక్రోధోద్భవం వేగం స యుక్త స్స సుఖీ నరః ॥**

ఏ పురుషుడు బ్రతికియున్నపుడే కామక్రోధములయొక్క వేగమును సహింపశక్తి గలిగియున్నాడో, అట్టి పురుషుడు ఇంద్రియనిగ్రహము గల వాడును, శాశ్వతానందము గలవాడు నగుచున్నాడు

ఇచ్చటను "ప్రాక్ఛరీర విమోక్షణాత్" అని ప్రయోగించుటవల్ల ఈశరీర విమోచనమునకు ముందుగానే యట్టి జ్ఞానస్థితిని పొందవలెనని తెలుపడ మైనది ఇక మనస్సును ఎచ్చట నిలుపవలయునో ఆ విషయమై గీత ఆరవ అధ్యాయములో తెలిపినది చూడుడు అనగా మనస్సును భ్రూమధ్యములో, హృదయములో, నాసాగ్రములో, ప్రకాశములో, సాకార స్వరూపములో, ఈశ్వ రునిలో, నిరాకార స్వరూపమగు పరమేశ్వరునిలో నిలుపవలయునా? అని యనేకు లడుగుచుందురు.

**యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చల మస్థిరమ్ ।**
**తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥**

అధికముగా చపలమైనది గనుకనే స్థిరముగానుండని మనస్సు ఏయే విషయములమీదికి బోవుచుండునో, ఆయా విషయములనుండి దానిని మరల్చి తన యాత్మస్వరూపమునందు నిలిచియుండు దానినిగా జేయ వలెను ఇచ్చోటను "ఆత్మన్యేవ వశం నయేత్" అని తన మనస్సును ఆత్మ యందు నిలిపేలాగున భగవానుడుపదేశించెను

**ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ! మనోగతాన్ ।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థిత ప్రజ్ఞస్తదోచ్యతే ॥**

అంతఃకరణములోగల సమస్తములైన కోరికలను ఎప్పుడు యత్న పూర్వకముగ విడుచుచున్నాడో అపుడు శుద్ధమైన ఆత్మయగుచుండును ఎపుడట్టి యాత్మయందే ఆనందించువా డగుచుండునో అపుడు స్థిరమైన జ్ఞానము గలవాడని చెప్పబడుచున్నాడు ఇతడే స్థితప్రజ్ఞ లక్షణము గలవాడగును స్థిత ప్రజ్ఞుని లక్షణములలో ఇది మొదటి శ్లోకము ఇది ముఖ్యము తక్కినవన్ని ఈ శ్లోకమును పోషించునవే ఇక ఆత్మయే పర మాత్మయను విషయమును గురించి మచ్చునకు రెండు వాక్యములు తెలి పెద

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత!**

**అహమాత్మా గుడాకేశః సర్వభూతాశయస్థితః**

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి**

ఇత్యాది ప్రమాణముల సంఖ్యాకములు గలవు

**స్వానుష్ఠాన పరో నిత్యమనిచ్ఛన్నపి ముచ్యతే ।**
**స్వానుష్ఠానేన రహితః ఇచ్ఛన్నపి న ముచ్యతే ॥**

తన యనుష్ఠానమునందు దృఢమైన నిష్ఠగలవాడు మోక్షమును కోరక పోయినను ముక్తుడగును తన యనుష్ఠానమందు శ్రద్ధలేని వాడు, సరిగ అనుష్ఠానము చేయనివాడు మోక్షమును గోరినను లభించదు



# ఓంకారము

ఓంకారమును అనగా ప్రణవమును అందరున్ను జపము చేయరాదని కొందరు వచింతురు బ్రాహ్మణులైనను గృహస్థాశ్రమములలో నుండువారు ప్రణవోపాసనకు అర్హులుకారని పలుకుదురు అట్లుండగా స్త్రీ, శూద్రులను గురించి మరల చెప్పవలయునా? పై చెప్పిన వారందరున్ను ఓంకారముతో సహ ఇతర ఇష్ట దేవతలను అనగా శ్రీకృష్ణ, శ్రీరామ, శ్రీనారాయణ, శ్రీ శివాది మంత్రములను కలిపియే జపము చేయవలయును అసలు ప్రణవము ఒకటి మాత్రము పరమహంస పరివ్రాజక, యతీశ్వరులు మాత్రమే జపించుటకు అర్హులని చెప్పుచుందురు ప్రణవములేని మంత్రము ప్రాణము లేనిదనియు, అది వేదబాహ్యులకు విధింపబడినదనియు, శాస్త్రము తెలుపు చుండగా, ప్రణవజపార్హత లేనివారందరిని వేదబాహ్యులనుగా చేయుటయే యగును శ్రీశుక బ్రహ్మర్షి పరీక్షన్మహారాజునకు గంగాతీరమున నిరశనవ్రత నిష్ఠ గలిగి ఉండునప్పుడు ఏమి యుపదేశించెనో దానిని గ్రహించిన యీ సత్యము బోధపడగలదు పరీక్షిన్మహారాజు క్షత్రియుడు మరియు గృహ స్థుడు అట్టివానికి అంత్యకాలమున పరబ్రహ్మోపాసన చేయుట కొరకు ఈ ఓంకారమునే ఉపదేశించెను శ్రీకృష్ణభగవానుడు గీత అష్టమాధ్యాయమున అర్జునునకున్ను ఈ ప్రణవమునే ఉపదేశించెను అర్జునుడున్ను, క్షత్రియుడు, గృహస్థాశ్రమముననున్నవాడు పరీక్షిన్మహారాజు ఒకవేళ సర్వసంగపరి త్యాగియై నిరశన వ్రతమును బూని పవిత్రమగు గంగాతటమున నుండే సమయముగాన ప్రణవోపాసనకు అర్హుడుగా చెప్పినను అర్జునుడు రణరంగ ములో నున్నప్పుడే శ్రీకృష్ణభగవానుడు ప్రణవ స్వరూపమగు పరబ్రహ్మో పదేశమును చేసెను

"ప్రణవ స్సర్వవేదేషు" ప్రణవము సర్వవేదముల యొక్క సారమ నియు, వేదములకు ప్రాణమనియు, "గిరామస్మ్యేక మక్షరం" వేదములలో ఏకాక్షర స్వరూపమగు ప్రణవము బ్రహ్మమనియు శ్రీకృష్ణ భగవానుడు గీతలో తెలిపెను పతంజలి మహర్షి యోగ శాస్త్రమునందు "తస్య వాచకః ప్రణవః" సాక్షాత్సర్వేశ్వరుని, పరబ్రహ్మమును దెలుపునది ప్రణవ మనియే

తెలిపెను ఇంకా విస్తారముగా చూడ తలంచువారు "ఓంకార"మను గ్రంధ మును చదువవచ్చును మచ్చునకు మాత్రము సంక్షిప్తముగా పైవిషయము నిచట నిరూపించడమైనది శ్రీమద్భాగవతమున శుకమహర్షి వచ్చుట, పరీక్షి న్మహారాజునకు ప్రణవము నుపదేశించుట అను ఈ విషయము మాత్రము నిచ్చుట సంక్షిప్తముగా తెలుపబడును

**ప్రతి నిమేషము పరబ్రహ్మంబు నీక్షించి**
**మదిజొక్కి ఫెలుఫల మరచువాడు**
**కమలంబు మీది భృంగముల కైవడి మోము**
**పై నెరసిన కేశపటలివాడు**
**గెరవ్రాసి మాయ నంగీకరించిన భంగి**
**వసనంబు గట్టక వచ్చువాడు**
**సంగి గాడని వెంట జాటు భూతములు నా**
**ఖాలుర హాస శబ్దములవాడు**

**మహిత పదజాను జంఘోరు మధ్యహస్త**
**బాహువక్షో గళానన షాలకర్ణ**
**నాసికా గండ మ స్తక నయన యుగళు**
**డైన యవధూత మూర్తి వాడరుగుదెంచె.**

**ఊరని లోకులంగినిసి యొగ్గులు ఫల్కనివాడు గోరికల్**
**గోరనివాడు కూటుఫల గూడనివాడు వృథా ప్రపంచమున్**
**జేరనివాడు దైవగతి జేరిన లాభము జూచి తుష్టుడై**
**నేరనివాని చందమున నేర్పులు చూపనివాడు వెండియున్.**

ఇది శ్రీశుకమహర్షియొక్క ఆగమనమును గురించినది ఇక పరీక్షిన్మ హారాజు కొరకు ఉపదేశించినది చూడుడు

"వినుము నీకు నేడు దినంబులకుగాని జీవితాంతంబు గాదు తావ త్కాలంబునకుం బార లౌకిక సాధన భూతంబగు పరమకల్యాణంబు

సంపాదింపవచ్చు నంత్యకాలంబు డగ్గరినంబెగ్గడిలక దేహి దేహపుత్రకళత్రాది సందోహంబు వలని మోహపాలంబు నిష్కామ కరవాలంబున నిర్మూలనంబు సేసి, గేహంబువెడలి పుణ్యతీర్థ జలావగాహంబు సేయుచు, ఏకాంత శుచి ప్రదేశంబున విధివత్ప్రకారంబునం గుశాజిన చేలంబుల తోడం గల్పితా సనుండై మానసంబున నిఖిల జగత్పవిత్రీకరణ సమర్థంబై, యకారాది త్రివర్గ కలితంబై, బ్రహ్మ బీజంబైన ప్రణవంబు సంస్మరించుచు, వాయువు జయించి విషయంబుల వెంటనంటి పారెడి యింద్రియంబుల బుద్ధి సారథియై, మనోనామకంబులైన పగ్గంబులం బిగ్గబట్టి, మ్రొగ్గం దిగిచి, దట్టంబులైన కర్మ ఘట్టంబుల నిట్టట్టు మెట్టెడి మనంబును శేముషీబలంబున నిరోధించి, భగవదాకారంబు తోడ బంధించి, నిర్విషయంబైన మనంబున భగవత్పాదా ద్యవయవంబులం గ్రమంబున ధ్యానంబు సేయుచు, రజ, స్తమో గుణం బుల చేత నాక్షిప్తంబు, విమూఢంబునగు చిత్తంబు ధారణావశంబునం దద్గుణంబులవలన నయ్యెడి మనంబుల బోనడచి, నిర్మల చిత్తంబునం బరమంబైన విష్ణుపదంబునకుంజను ధారణానియమంబు గలుగ సుఖాత్మ కంబు విషయంబు నవలోకించు యోగికి భక్తి లక్షణంబైన యోగాశ్రయంబున వేగంబ మోక్షంబు సిద్ధించు ''

ఈ విషయమై సంస్కృత శ్రీమద్భాగవతమున తెలిపినది చూడుడు మూలగ్రంథమగు సంస్కృతమును గూడ నిరూపించినచో మరల సంశయము గలుగుటకు అవకాశముండదు లేనిచో కొందరు మూల గ్రంథమగు సంస్కృమున లేదని వాదింపవచ్చును సంస్కృతమున నిరూపించిన ఆంధ్రభాగవతమున లేదని గూడ వచించవచ్చును అందువల్లనే సంస్కృతాంధ్రములు రెండున్ను నిరూపింప బడుచున్నవి

**గృహాత్ప్రవ్రజితో ధీరః పుణ్యతీర్థ జలాప్లుతః ।**
**శుచౌ వివి క్త ఆసీనో విధివత్కల్పితాసనే ॥**
**అభ్యసేన్మనసా శుద్ధం త్రివృద్బ్రహ్మాక్షరం పరమ్ ।**
**మనో యచ్ఛేజ్జితశ్వాసో బ్రహ్మబీజ మవిస్మరన్ ॥**

దీనియర్థము పైన చెప్పినదే

శ్రీభగవద్గీతలో అర్జునునకు ఓంకార బ్రహ్మోపదేశము చేయుటకు ముందుగా దానియొక్క ప్రభావమును గురించి తెలిపినది చూడుడు -

**"యదక్షరం వేదవిదో వదన్తి విశంతి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥**

వేదార్థమును సంపూర్ణముగా నెరింగిన పరమ ఋషులచేత ఏది నాశనరహితమైనదని చెప్పబడుచున్నదో, రాగద్వేషములు సంపూర్ణముగ నశించిన యతులచేత ప్రవేశింపబడు చున్నదియును, బ్రహ్మచర్యవ్రతము నవలంబించిన వారిచే తెలియ గోరబడుచున్నదియును అయిన బ్రహ్మ పదమును నీకు సంగ్రహముగా వివరించి చెప్పెదను.

శ్రీకృష్ణభగవానుడు ముగ్గురిని సాక్ష్యము చూపి యీ ప్రణవోపాసనను అర్జునున కుపదేశించెను (1) వేదములు కడవరకు చదివి వేదార్థమును సంపూర్ణముగా నెరిగిన బ్రాహ్మణులను, అనగా ఋషులను, (2) రాగద్వేషాది సమస్త ప్రకృతి దోషములు నశించిన యతులను, అనగా సన్న్యాసులను, (3) తీవ్రమగు బ్రహ్మచర్యవ్రతమును అనుష్ఠించెడు బ్రహ్మచారులను నిరూపించి యీ ప్రణవమును ఉపదేశించుటవల్ల దీనియొక్క ప్రభావము ఎటువంటిదో విజ్ఞులు గ్రహించుకొనవచ్చును ఇదే అర్థమును కఠోపనిషత్తు నందు యమధర్మరాజు, నచికేతువు అను ఋషికుమారునకున్ను తెలిపెను శ్రుతిస్మృతు లన్నియు ఈలాగున ఉపదేశించుటవల్ల ప్రణవము యొక్క ప్రభావము మెటువంటిదో ఆస్తికులు గ్రహింతురుగాక!-

**సర్వే వేదా యత్పదమామన న్తి**
**తపాంసి సర్వాణి చ యద్వదన్తి ।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చర న్తి**
**త త్తేపదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్ ॥**

వేదములన్నియు ఏవస్తువును పొందదగిన దానినిగా చెప్పుచున్నవో, తపస్సులన్నియు నే వస్తువును ప్రయోజనముగా జేసికొని ఆచరింపబడు చున్నవో, దేనిని గోరుచున్నవారై గురుకులవాసరూపమగు బ్రహ్మచర్య వ్రతము నాచరించుచున్నారో, ఆ వస్తువును గూర్చి నీకు సంగ్రహముగా బోధించుచున్నాడను అది "ఓం" అని చెప్పబడు ఓంకారము దానిని గ్రహింపుము

**ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।**
**ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥**

ఈ అక్షరమే ఆ పరబ్రహ్మము ఇదియే పరమమైనది ఈ ప్రణవ మునే ఎవ్వడు అక్షర బ్రహ్మమని యెరింగి ఉపాసించునో వానికి ఆ బ్రహ్మ ప్రాప్తి కలుగును అంతేగాక మరిదేనిని పొందుటకు ఇచ్ఛగలవాడై ప్రణవో పాసన చేయునో వానికి అదిన్ని సిద్ధించును అయితే కోరిక గలవానికి కోరినది దొరుకునుగాని మోక్షము మాత్రము కలుగదు ఇదిన్ని జ్ఞాపకములో నుంచుకొనవలయును

**ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృది సంస్థితమ్ ।**
**సర్వవ్యాపినమోంకారం మత్వా ధీరో న శోచతి ॥**

జనుడు స్మరణ జ్ఞానమునకు స్థానమైన హృదయమందున్న ఈశ్వరుని ఓంకారముగా తెలిసికొనవలయును ఇట్లు సర్వవ్యాపకమైన ఓంకా రమును తెలిసికొనిన జ్ఞాని, శోక నిమిత్తమయిన అజ్ఞానాదులకు నాశనము కలుగుటవలన దుఃఖింపడు. అట్టివానికి ఇచ్చట గాని మరి యెచ్చట గాని భయము కలుగదు కట్టకడపట మరణమను భయము గూడ ఉండదు ఆత్మ మంగళకరమగు పరమాత్మ స్వరూపమను జ్ఞానము అతనికి కల్గును

**ఓంకారాదిజపోఽప్యేవం భావగర్భో హ్యుదాహృతః ।**
**ధ్యేయవస్తు స్వరూపస్య దార్ఢ్యాయ హి జపో మతః ॥**

ఓంకారాది జపము ఆ యాద్వైవ భావము కలిగియుండ వలయును ఏలననగా ధ్యేయ వస్తువుయొక్క స్వరూపమునందు మనస్సు దృఢముగా నిలుచుట కొరకు ఈ జపమేర్పడినది ఇది ఋషుల యొక్క మతము ఓం కారాది అని ప్రయోగించుటవలన ఓంకారము మొదలుగా గల పర బ్రహ్మాది ఏ దేవతలగురించిన మంత్రమైనను, ధ్యేయస్వరూపమందు మనస్సు నిశ్చలముగా నిలుచుటకున్ను,పాపములు నశించుటకున్ను, ప్రతిబంధములు తొలగుటకును తత్తద్దేవతా మంత్రములను గురించిన జపములను జేయవల యును జపము యొక్క ప్రయోజనముఇట్టిదని నిరూపించడమైనది బ్రహ్మోపాసకులకు ఓంకార మొకటియే చాలును తదితర బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదుల ఉపాసన చేయువారలకు త త్తన్మంత్రములు ఉపకరించును

మీరు ఏదేని దేవాలయములోనికి వెళ్ళి అష్టోత్తర శతనామావళ్యాది పూజార్చనలు చేయదలంచిన ఈ ప్రణవము ప్రభావము తెలుసుకొనగలరు శివాలయమునకు వెళ్ళి అర్చనలు చేయించ దలంచినచో అర్చకుడు ఏ మంత్రము చెప్పుచున్నాడో చూడుడు- శివాలయమైనచో - ఓం శివాయ నమః - ఓం శంకరాయ నమః, విష్ణ్వాలయమైనచో - ఓం విష్ణవే నమః, ఓం నారాయణాయ నమః, శ్రీరామాలయమైనచో, ఓం శ్రీరామాయ నమః, ఓం రామచంద్రాయ నమః, ఆలాగున శ్రీకృష్ణాలయమైన ఓం శ్రీ కృష్ణాయ నమః ఓం వాసుదేవాయ నమః, అట్లే - దేవీ దేవాలయమైనచో- ఓం భవాన్యై నమః ఓం పార్వత్యై నమః, అదే విధమున, సరస్వత్యాలయమైనచో - ఓం శారదాయై నమః, ఓం భారత్యై నమః అట్లనే లక్ష్మ్యాలయమైన ఓం శ్రియై నమః, ఓం లక్ష్మ్యై నమః, అను ఈలాటి మంత్రములు వినవచ్చును అందువలన ఈ దేవతలందరు ప్రణవమునుండి యేర్పడిన వారలని అర్థమగుట లేదా! కావుననే వేదములన్నియు దేవతలందరు, వెయ్యేల యీ బ్రహ్మాండ మంతయు పరబ్రహ్మ స్వరూపమగు ఓంకారము నుండియే యేర్పడిన దనియు, ఓంకారములోనే లయమొందుచున్నవనియు గోచరము కాగలదు ఉపనిషత్తులన్నియు ఆ ఓంకారమే పరబ్రహ్మస్వరూపమని అక్షర స్వరూపమని

తెలుపుచున్నవి, కనుకనే గీతయందు 8వ అధ్యాయమున అర్జునుడు కృష్ణ భగవానుని ఇట్లు ప్రశ్నించెను

"కింతద్బ్రహ్మ" బ్రహ్మమనగా నెట్టిది? అని

శ్రీకృష్ణభగవానుని సమాధానము - "అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే"।

నాశరహితమైన అక్షర స్వరూపమే బ్రహ్మము స్వభావముగా అదే అందరి యొక్క ఆత్మస్వరూపముగా నుంటున్నదని ఈవిధముగా తెలుపుట వల్ల ఆత్మయే పరబ్రహ్మముగా నుంటున్నదని గ్రహించుకొనవలయును



# శ్రీభగవద్గీతావిర్భావము

1 భగవద్గీతకు సమానమైన అనంతశక్తి గల మరియే గ్రంధమును లోకములో చూడలేదు ఏలన ఇది కర్మ,భక్తి, యోగ, జ్ఞానములను సమన్వయ పరచి మొదటి నుండి కొనవరకు వెళ్ళుచున్నది తక్కిన గ్రంధములు కర్మ యోగమును గురించియో, భక్తియోగమును గురించియో, ధ్యానయోగమును గురించియో, జ్ఞానయోగమును గురించియో చెప్పి పోవుచుండును అంతేగాక సర్వ సంగములను త్యజించి ఏకాంత ప్రదేశమున కాహ్వానము చేయు చుండును భగవద్గీత ఏకాంతములో నుండి తప మొనర్చువాడు ఏ గతిని అనగా ఏ మోక్షమును పొందుచున్నాడో, దానిని గృహస్థాశ్రమములో నుండి కూడా పొందవచ్చునని ఉపదేశించుచున్నది అయినను ఆత్మ సంస్కారముచే ఏకాంతమునకు వెళ్ళవలెనని తలంపు గలవానిని అది అడ్డగించుటయు లేదు ఇదియే ఈ శాస్త్రము యొక్క విశేష ప్రభావము.

సర్వకర్మత్యాగము జేసి యెవ్వడును క్షణమైనను జీవింపజాలడనియు, కర్మఫల త్యాగమే త్యాగముయొక్క లక్ష్యము అనియు శ్రీ కృష్ణభగవానుడు

నొక్కిచెప్పుచున్నాడు,ఇదే దీనియందుగల మహిమా విశేషము మరియు ఒక్కొక్క అధ్యాయములోను గీత కర్మ, భక్తి,యోగ, జ్ఞానములను గురించి చెప్పుచునే పోవుచున్నది దీనివల్ల ఏ ఏ సంస్కారము గలవాడు ఆయా దానిని ఆశ్రయించుకొని ముక్తిని పొందవచ్చుననియు, లేక పై జెప్పిన నాల్గింటిలో ఒక దానిని ముఖ్యముగ జేసికొని తక్కిన వాటిని గౌణముగానైనను అవలంబించ వలయుననియు శ్రీ కృష్ణాశయమని తోచుచున్నది నాల్గున్ను సమాన ములుగా జూచువాడు భగవదంశ సంభూతుడనిగాని లేక సాక్షాత్ భగ వంతుడనిగాని తప్పక తెలిసికొనవలయును అయితే యీ నాల్గున్ను ముక్తిని పొందతలంచువారి కవసరము లేదనియు ఏదైన ఒకటి మాత్రముండిన చాలుననియు బోధింపక పోలేదు అయితే అతనిని సర్వజ్ఞుడని గాని, భగవ దవతారపురుషుడని గాని గీతా శాస్త్రము అంగీకరించదు

ఒకడు సుఖముగా జీవించుటకు సార్వభౌముడు కావలసిన అవసర వము లేదు శ్రీ మంతుడై యుండిన చాలును అయితే సర్వజనులను పాలించుటకు చక్రవర్తికి కావలసిన చతురంగబలము గలిగియుండ వలయును ఇదే గీతా శాస్త్రముయొక్క గమనమని (లక్ష్యమని) మనము తెలుసుకొనిన చాలును

ఈ విషయమై "భగవద్గీతా ప్రభావము" అని వ్రాయబడిన చిన్న పొత్తములో ప్రతి అధ్యాయములోను హెచ్చుగానో, తక్కువగానో ప్రతిపాదిం చిన ప్రమాణ శ్లోకములను చూపడమైనది ద్వితీయాధ్యాయమున సాంఖ్య మును, అనగా జ్ఞానమును గురించియు, తృతీయాధ్యాయమున నిష్కామ కర్మయోగము గురించియు, షష్ఠాధ్యాయమున యోగమును గురించియు, ద్వాదశాధ్యాయమున భక్తిని గురించియు ముఖ్యముగా ప్రతిపాదించుచు పోయినను, మరల ప్రతి అధ్యాయమునను నాలుగు యోగము లున్నందుచే ఈ చతుర్విధ యోగములను గురించి ప్రతిపాదించని అధ్యాయమే లేదు దీనివలన ఏ యోగ మవలంబించినను, తక్కిన మూడు యోగములు గూడ కలిగి యుండవలయునని అర్థమగుచుండును

దీపము నిరావరణముగా, నిశ్చలముగా వెలుగు చుండవలసినచో, ప్రమిద, తైలము, వత్తి, గాలిలేని ప్రదేశము తప్పనిసరిగా ఎవరికైనను ఎచ్చోటైనను ఎట్లుండవలసి యుండునో, ఆలాగున జ్ఞాన జ్యోతియే ముఖ్యమైనను అది సుస్థిరముగా వెలుగవలసి యుండిన పై జెప్పిన నాలుగు సాధనము లవసరములు ఆలాగున పై జెప్పిన నాల్గింటిలో నేదైన ఒకటి కొరత గలిగిన దీపము సుస్థిరముగ వెలుగ జాలదు జ్ఞానమే ప్రధానమని చెప్పెడు వేదాంతులు ఈ తత్త్వమును మరువక యుండిన లోకమున కెంతో మేలు చేసిన వారగుదురు

కావుననే వేదాంత శాస్త్రమున మరియొక విధముగ దీనినిగురించి బోధించడమైనది అది సాధన చతుష్టయ సంపత్తి యగును సాధన చతుష్ట యసంపత్తి లేనివాడు వేదాంతశ్రవణమునకే అర్హుడు కాడని వేదాంతుల కందరికిన్ని అనుభవములో గల విషయమే అయితే వారికి సాధనచతుష్టయ సంపత్తి సంపూర్ణముగా నున్నదా? లేదా? యని ఎవరికి వారే విచారించు కొనవలెనని వారికే (పాఠకులకే) వదలివేయడమైనది

దీపమునకు సాధనములగు ప్రమిద మున్నగు నాల్గింటిలో, ఏ దైన ఒకటి లోపించినను, లేక కొరత కలిగినను ఆ దీపము ఎట్లు స్థిరముగా నిలువజాలదో, దానిని తెలుసుకొనుట విజ్ఞులకు వదలి వేయడమైనది

ఇపుడు మనము ప్రారంభించిన శ్రీ భగవద్గీతావిర్భావమును గురించి తెలిసికొనే లాగున ప్రవర్తించెదను భగవద్గీత గుణత్రయము, గుణత్రయాతీ తము అను విషయములను గురించి చెప్పెడు "చతుర్దశాధ్యాయము' చాలా గొప్పది మిక్కిలి కఠినమైనది ఇందు మూడు గుణములను గురించి మఱల మఱల పునరుక్తి దోషములను పాటింపకయే శ్రీ కృష్ణభగవానుడు త్రిప్పి త్రిప్పి చెప్పడమైనది ఏలన ఈ మూడు గుణముల పరిణామము తెలిసికొనుట దుష్కరము ఇది తెలియకపోయినచో గుణములనుండి విముక్తులు కాజాలరని తెలియుట కొరకే అట్లు చెప్పడమైనది అయితే ఈ మూడు గుణ

ముల నుండి విమోచనము కలుగవలసి యుండిన సాక్షాత్ పరమేశ్వరుని అనుగ్రహము గలుగక వేరు మార్గము లేదని కట్టకడపట నిరూపించడమైనది

**మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।**
**స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ (14 - 26)**

ఎవడు అచంచలమైన భక్తియను యోగముచేత నన్నే సేవించుచున్నాడో, వాడీ త్రిగుణములను ప్రయాసము లేకనే అతిక్రమించి బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానమును పొందుట కర్హుడగుచున్నాడు

దీనివల్ల దైవానుగ్రహము యొక్క ప్రభావము తెలిసికొనవచ్చును కావుననే" స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే" అని విస్పష్టముగా తెలుపడమైనది ఉపాసనవల్ల భగవల్లోక ప్రాప్తియేగాని "బ్రహ్మసాక్షాత్కార జ్ఞానముకాదని కొందరు వాదింతురు వారు తెలిసికొనుటకొరకే" బ్రహ్మ భూయాయ కల్పతే" అని ప్రయోగించడమైనది

2 అరవ అధ్యాయము ఆత్మ సంయమయోగము దీనియందు పాతంజలాది యోగశాస్త్రముల అన్నిటియొక్క సారము బోధించడమైనది కట్టకడపట తెలిపినది చూడుడు

**తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।**
**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥**

**యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।**
**శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥ (6 - 46, 47)**

ధ్యాన యోగాభ్యాసము చేయుచున్నవాడు కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులను చేయువారికంటెను, జ్ఞాన విచారము చేయువారికంటెను, అగ్నిహోత్రాది యజ్ఞాది క్రతువులు చేయువారికంటెను శ్రేష్ఠుడని నా అభిప్రాయము కాబట్టి అర్జునా! నీవు ధ్యానయోగాభ్యాసుడ వగుము

అట్టి యోగులందరిలోను ఎవడు నా యందు ఆసక్తమైన అంతరం

గము తోడ భక్తిగలవాడై నన్ను భజించుచున్నాడో, అట్టివాడు యోగు లలో నుత్తముడని నా అభిప్రాయము

ఇచ్చట భక్తికి ఆధిక్యము చూడుడు ఏలన జీవులు ప్రకృతికి వశులు అట్టి ప్రకృతి అనగా మాయ ఈశ్వరునికి అధీనము కావున ఈశ్వ రానుగ్రహము వల్లనే ప్రకృతినుండి విముక్తులు కాగలుగుదురని తెలిపిరి దీనిలో ప్రయోగించిన జ్ఞాన శబ్దమును నిత్యానిత్య వివేక జ్ఞానమని కొందరున్ను, శాస్త్రజ్ఞానము మాత్రమని కొందరున్ను వాదింతురు

ఈ విషయమై మతకర్తలలో అనేక అభిప్రాయములు కలవు జీవేశ్వ రుల బేధమును తెలుసుకొని ఈశ్వరుని ఉపాసించుటయే జ్ఞానమని కొందరు న్ను, జీవేశ్వరులు భిన్నులు కారు, అభిన్నులని కొందరును వాదిం తురు అదెట్లైనపోనీ, మనకక్కరలేదు ఏ జ్ఞానమైనను ఈశ్వరానుగ్రహము లేనిచో కలుగదని మాత్రము తెలిసికొనిన చాలును

**న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥ (11 - 8)**

నీ యొక్క ప్రాకృతమైన యీ నేత్రములచేత విశ్వరూపధరుడగు నన్ను చూచుటకు శక్తుడవు గావు కావున అప్రాకృతమైన నేత్రము నిచ్చు చున్నాను ఈ దివ్యనేత్రముచేత నా యొక్క యోగమహిమను "ఈశ్వర శక్తిని" చూడుము

ఈశ్వరుడుండిన ఏల కనుపడలేదు? అని వేసెడి ప్రశ్నకు ఇచ్చట సమాధానము తెలుపడమైనది మానవుని నేత్రము పంచభూతాత్మకము ఇది జడము, పంచభూతముల కతీతమగు దివ్యత్వమును ఇది చూడజాలదు దానికి దివ్యదృష్టి కావలయును అది ఈశ్వరుని కరుణవల్లగాని, లేక గురు దేవుని అనుగ్రహమువల్లగాని గలుగవలయును ఈవిషయము శ్రీకృష్ణ భగవానుడు ఇచ్చట స్పష్టముగా తెలిపినాడు

**నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।**
**శక్యం ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ (11 - 53)**

ఓ అర్జునా! ఇపుడు నీవు నా యొక్క విశ్వరూపమును ఏలాగున ప్రత్యక్షముగా చూచితివో, అట్టి దర్శనముగలనేను వేదాధ్యయనముల చేతను, తపస్సుచేతను, దానముచేతను, యాగముచేతను గూడ చూచుటకు శక్యుడనుగాను అయితే దేనివల్ల దర్శింప శక్యుడగునో ఈ విషయము క్రింది శ్లోకములో తెలుపడమైనది

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ త త్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ (11 - 54)**

ఓ అర్జునా! ఈ విశ్వరూపమును ధరించిన నేను అనన్యమైన భక్తి చేతనే యథార్థముగ ఎరుంగుటకు, చూచుటకు, నాలో నైక్యమగుటకున్ను శక్యుడనగుచున్నాను

దీనివల్ల భక్తియొక్క ప్రభావము తెలిసికొనవచ్చును "జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం" అను మూడవస్థలు తెలుపడమైనది

**దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తర న్తి తే ॥ (7 - 14)**

ఈ శ్లోకమున ఈ సంసార సాగరము దుస్తరముగా నున్నది ఎట్లు దాటగలనో యని అడిగేవారికి సమాధానము చెప్పడమైనది

ఈ త్రిగుణాత్మకమైన నా యొక్క ప్రకృతి దైవ సంబంధమైనది అనగా నావలన కలిగినది కనుక సామాన్యులు దాట శక్యముగానిదిగా నుంటున్నది అయితే ఎవరు నన్ను శరణు బొందుచున్నారో వారు ఈ మాయను దాటుచున్నారు

ఇది మాయను దాటే ఉపాయమని భగవంతుడు ఆనతిచ్చినాడు

**న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ॥**
**మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥ (7 - 15)**

పాపకృత్యములు చేయువారును, మూఢాత్ములై అధర్మమార్గ పరులగు మానవులు మాయచేత అపహరింపబడిన ఆత్మజ్ఞానము గలవారును, ఆసుర ధర్మములైన హింస, అసత్యాదుల నాశ్రయించిన వారును నన్ను పొందజాలరు

ఎందువల్ల ఆత్మ జ్ఞానము గలుగలేదో దానికి కారణమిచట నిరూపించడమైనది అసుర ప్రవృత్తి గలవారగుటచే, వారు జ్ఞానమును పొందక పోవుచున్నారు

**అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ (9 - 22)**

ఓ అర్జునా! పరమభక్తులెవరైతే గలరో వారు ఇతర చింతలులేని వారై, పరమదైవమగు నన్ను ఎల్లప్పుడును ధ్యానించువారై యుంటున్నారో, అట్టివారి యోగక్షేమములను (అప్రాప్తమైన దానిని ప్రాప్తింపజేయుట యోగ మనబడును ప్రాప్తమైన దానిని సంరక్షించుట క్షేమమనబడును ఇతర చింత లులేక భగవచ్చింతన మాత్రమే కలిగియుండెడు భక్తులకు భగవంతుడు కలుగజేయు ప్రయోజనమిట్టిదని నమ్మకము కలిగి ఉందురుగాక!) నేను వహించుచున్నాను

**అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ॥**
**సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః ॥ (9 - 30)**

మిగుల నిందితములగు దురాచారములు గలవాడైనను పాపసంకల్పములు గల వాడైననుగాని, ఆత్మస్వరూపుడనగు నన్ను సేవించిన యెడల అట్టివాడు చక్కని నమ్మకము గలవాడు గనుక శ్రేష్ఠుడనియే తలంచవలెను

పాపము గలవారు పవిత్రమైన గీతాపారాయణము, దైవకార్యము

చేయనిచో ఎట్లు పవిత్రులగుదురను తత్త్వమును మనవారిలో చాలా మందిన్ని మరచిపోయిరి లోకము పావనముగాక పోవుటకు కారణమిదే రోగి అయినవాడట్లే ఉండవలయునని విధింపబడినందున అయ్యో! పాపము వారు ఎట్లు రోగవిముక్తు లగుదురను దయ మనవారిలో లేకపోయెను

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।**
**కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ (9 - 31)**

పై చెప్పిన స్వభావముగలవాడు అతిత్వరగా ధర్మాత్ముడగు చున్నాడు శాశ్వతమైన పరమశాంతిని పొందుచున్నాడు ఓ అర్జునా! నా యందు భక్తిగల వాడు చెడడు అని సభలో భేరి మ్రోగించి రెండు చేతులు పైకెత్తుకొని ప్రతిజ్ఞ చేసి చెప్పుము

ఓహో! ఎంత విశ్వాసమును భగవానుడు ప్రకటించెను

**మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యే ఽ పి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥ (9 - 32)**

ఓ అర్జునా! పాపము చేయుజాతిలో జన్మించిన వారెవరు గలరో అట్టివారున్ను, పాపవంశీయులు కాని, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మొదలగు వారందరున్ను, నన్ను శరణుపొంది ధ్యానాదుల జేసినయెడల వారు సర్వోత్తమమగు మోక్షమును పొందుదురు

ఈ భగవద్వాక్యములవలన స్త్రీలకు, శూద్రులకు, భగవద్గీత పారాయణ కర్తృత కలదా! లేదా! అను విషయమై తెలిసికొనవచ్చును

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే ॥ (10 - 10)**

ఎల్లప్పుడును భగవంతుడనగు నాయందేకాగ్రచిత్తులును, ప్రీతి పూర్వకముగా నన్ను భజించువారునునైన, నిరంతర ధ్యానపరులకు పరమేశ్వ రుడనగు నన్ను పొందుటకు సాధనమగు ఏ జ్ఞానము గలుగవలెనో అట్టి

దానిని గలిగించుచున్నాను

ఇంత మాత్రము భగవద్వాక్యములో విశ్వాసము లేకుండిన అది ఎట్లు భక్తి అనంబడును!

**తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః ।**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ (10 - 11)**

ఎల్లప్పుడు ధ్యానము చేయు భక్తుల ననుగ్రహించుట కొరకు, వారి అంతఃకరణమందున్న వాడనై వారియొక్క అజ్ఞాన జన్యమైన మోహాంధ కారమును వెలుగుచున్న జ్ఞానమనెడు దీపముచేత పోగొట్టుచున్నాను

దీనికన్న భగవానుడుగాని, మఱియెవరుగాని ఏమి చెప్పగలరు!

**యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥**

**తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**
**భవామి న చిరాత్పార్థ! మయ్యావేశితచేతసామ్ ॥ (12 - 6, 7)**

పరమ భక్తులు (సగుణోపాసకులు) సమస్తములగు వైదిక లౌకిక కర్మఫలములను, కర్మలను, నాయందు సమర్పించి, నేనే పరమ గతిగ గల వారై, నా కంటె ఇతరముగా నాలంబనము లేని అనన్యమైన యుపాసన చేతనే నన్ను ధ్యానము చేయుచున్నవారై నన్ను సేవించుచున్నారు నాయం దుంచబడిన చిత్తముగల యా పరమ భక్తులను నేను మృత్యురూపమైన సంసార మనెడి సముద్రమునుండి శ్రీఘ్రముగా లేవ దీసి మోక్షమనెడు దరిని చేర్చుచున్నాను

ఇటువంటి విశ్వాసపూర్వకముగా వచింపబడిన భగవద్వాక్యములో నమ్మకము పోయిన ఇక వారెట్లు తరించగలరు!

**అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః ॥ (12 - 16)**

ఏ భక్తుడు దేనియందపేక్షలేని వాడును, బాహ్యాభ్యంతర శుద్ధి గలవాడును, కార్యసమర్థుడును, దేని యందును తగులు కొనని మనస్సుగల వాడును, మనోవ్యాకులత్వము లేనివాడును, లోకాడంబరములగు సమస్త కర్మములను వదలిన వాడును నగుచున్నాడో వాడు నాకు ప్రియుడు

ఈ అధ్యాయమందంతయు పరమ భక్తుల లక్షణములు నిరూపించ బడినవి మరియు ఈ అధ్యాయములో 13 వ శ్లోకమునుండి 19వ శ్లోకము వరకు 7 శ్లోకములలో పరమభక్తుల గుణములన్నియు వర్ణించబడినవి, పరమభక్తులందరున్ను ఈ ఏడు శ్లోకములను పారాయణముచేసి వాటిలో చెప్పినట్లు లనుష్ఠించుచుండిన చాలును ఈ శ్లోకములుగూడ చాల సులభ మైన సంస్కృతభాషలో వ్రాయబడినవి ఆలోచించుకొని సంస్కృత జ్ఞానము తెలియని భక్తులుకూడ తెలిసికొని ఆచరించుట కొరకని బోధపడు చుండును

**న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః ।**
**యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥ (15 - 6)**

ఏ మోక్ష స్థానమును పొంది తిరిగి జన్మకు రారో దానిని సూర్యుడు ప్రకాశింపజేయజాలడు, చంద్రుడు ప్రకాశింపజేయజాలడు, అగ్ని ప్రకా శింపజేయ జాలదు, అదియే నా యొక్క పరమ పదము

ఏ పదమును పొందుటవలన పునరావృత్తి కలుగదని ప్రయోగించినారో అదే నిజమైన విష్ణుపదము, బ్రహ్మపదమని మరువకుడు

**భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥ (18 - 55)**

జీవుడనన్యమైనట్టి భక్తిచేత నన్నెవడైనదియు, నెట్టివాడైనదియు

యధార్థముగ నెరుంగచున్నాడు, అట్లెరుంగుటవలన నన్ను నిజముగా తెలిసి కొనినవాడై పిమ్మట నాలో ప్రవేశించుచున్నాడు (ఐక్యమగుచున్నాడు లేక నా స్వరూపమగు చున్నాడు)

గీతా శాస్త్రమంత్యమగు మోక్ష సన్న్యాసయోగమను ఈ అధ్యాయ ములో కూడ భగవద్భక్తి ప్రభావమును తెలుపుటవలన ఇది జాగ్రత్తతో చూడ వలసియుండును "తత్త్వతః" అని ప్రయోగించుటవలన ఆ పరమ సత్య మును భగవదనుగ్రహము వల్లనే తెలియవలసి ఉండునని తెలుపడమైనది

**మచ్చిత్తస్సర్వ దుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి ।**
**అథచే త్త్వ మహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి ॥ (18 - 58)**

నన్ను ధ్యానించుచున్న నీవు, నాయనుగ్రహము వలన సకలములైన సంసార సంబంధమైన ఆటంకములను (ప్రకృత్యవరోధ ములను) దాటెదవు అట్లుగాక, అహంకారము గలిగి వినకపోతివేని చెడిపోదువు, అనగా, మోక్ష భ్రష్టుడవగుదువు

"సర్వదుర్గాణి" అని ప్రయోగించుట గమనార్హము, విఘ్నము లన్నియు భగవత్కరుణ వల్లనే తొలగవలెనని గ్రహించేది

**ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే௨ర్జున! తిష్ఠతి ।**
**భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥**

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**
**తత్ప్రసాదా త్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ (18 - 61, 62)**

ఓ అర్జునా! సర్వాంతర్యామి యగు నారాయణుండు సకల ప్రాణుల యొక్క హృదయములందుండి మాయచేత కీలుబొమ్మలవలె సకల భూత ములను, వారివారి జన్మాంతర కర్మ సంస్కారము ననుసరించి త్రిప్పుచు, ఆయా కర్మలయందు ప్రవర్తింపజేయుచున్నాడు

ఓ అర్జునా! అన్ని విధములచేత నా సర్వేశ్వరునే రక్షకునిగ వేడు

కొనుము ఆ సర్వేశ్వరుని యనుగ్రహమువలన సర్వోత్కృష్టమైన పరమ శాంతిని, శాశ్వతమగు మోక్షపదవిని పొందగలవు

"తమేవ శరణం గచ్ఛ" అని ప్రయోగించుటవలన అంతరామియై సర్వులలోను సాక్షియై వెలుగుచుండు ఆ పరమాత్మనే ఈశ్వర స్వరూపముగా ఇచ్చట వర్ణించడమైనది

ప్రశ్న - గీత పూర్తిగా ఉపదేశించిన పిమ్మట శ్రీభగవానుడు అర్జునుని ఈ విధముగ ప్రశ్నించెను

**కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా ।**
**కచ్చిదజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ! ॥ (18 - 72)**

ఓ అర్జునా! నాచే చెప్పబడిన ఈ గీతాశాస్త్రము, నీచేత నిశ్చల చిత్తముతో వినబడినదా? హేధనంజయ! అజ్ఞానముచే గలిగిన నీ యొక్క మోహము సంపూర్ణముగా నశించినదిగదా?

అర్జునుని సమాధానము

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత! ।**
**స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ (18 - 73)**

ఓ కృష్ణమూర్తీ! నీ యనుగ్రహమువలన నాచేత జ్ఞానము పొంద బడినది అజ్ఞానము వీడిపోయినది సంశయ రహితుడనై సుస్థిరుడనై యుంటున్నాను నీ యొక్క యాజ్ఞను పాలించెదను

"త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత!" అని తెలుపుటవలన భగవదను గ్రహము వలన అర్జుననకు విజయమున్ను, జ్ఞానమున్ను కలిగినదని గ్రహించదగినది

సూతుడు చెప్పినది వినుడి

**వ్యాస ప్రసాదాచ్ఛ్రుతవానేతద్గుహ్యతమం పరమ్ ।**
**యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్॥ (18 - 75)**

అతి గోప్యమైనదియు, శ్రేష్ఠమైనదియునగు ఈ యోగశాస్త్రమును, యోగీశ్వరుడగు శ్రీకృష్ణభగవానుడు స్వయముగా తానే అర్జునునకు చెప్పుచుండగా వ్యాసమహర్షియొక్క యనుగ్రహము వలన నేను ప్రత్యక్షముగా వింటిని

"వ్యాస ప్రసాదాత్" అని చెప్పుటవల్ల శ్రీకృష్ణభగవానుని కృపవలన అర్జునునికిన్ని, వ్యాసులవారి ఆశీర్వాదము వలన సూతునికిన్ని ఇట్టి మహాజ్ఞానము గలిగినదని స్పష్టమగుటలేదా! కావున ఈశ్వరుని యొక్క లేక మహాత్ములగు గురుదేవులయొక్క అనుగ్రహమువలననే జీవులకు జ్ఞానము కలుగవలసి యుండునని గ్రహించేది స్వయముగ (స్వబుద్ధిచే) లభించునది గాదు

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।**
**తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ॥ (18 - 78)**

ఓ ధృతరాష్ట్రమహారాజా! యోగసిద్ధులకు ప్రభువగునీశ్వరుడును, విల్లును ధరించిన యర్జునుడు నున్నటువంటి పక్షమేదో యచ్చటనే రాజ్యలక్ష్మియు, జయలక్ష్మి యు, ధనలక్ష్మియు, న్యాయమును తొలగక నిలుచునని నా అభిప్రాయము

ఇది గీత యొక్క కట్ట కడపటి వాక్యము ఏ పక్షమున భగవంతుడు నిలిచియుండునో వారికి జయము గలుగునని దీనియొక్క సారము.

10 ఇంకను ఈశ్వర భక్తియొక్క ప్రభావమును గురించి పరమ ఋషులు చెప్పిన రెండు మాటలను మచ్చునకు క్రింద తెలిపెద

శ్రీ దత్తాత్రేయులు

**ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా ।**
**మహాభయపరిత్రాణా ద్విప్రాణాముపజాయతే ॥**

జనన మరణ రూపమగు మహాభయము నుండి రక్షించెడు వేదాంత ప్రతిపాదితమగు అద్వైత వాసన (జ్ఞానము) ఈశ్వరానుగ్రహము వల్లనే రక్షణములేని జీవులకు నే కొద్ది మందికో ఉదయించును

శ్రీ పతంజలి మహర్షి

**సూ॥ ఈశ్వర ప్రణిధానాద్వా॥ 23**

ఇతర అష్టాంగ యోగసాధనలకన్న సమాధి సిద్ధి శీఘ్రముగా ఈశ్వర ప్రణిధానము వలన కలుగును ప్రణిధానమనగా ఈశ్వరునియందు నిశ్చలముగ సమర్పింపబడిన మనో విశేషము భాష్యకర్తలు "ఈశ్వర ప్రణిధానాత్ సమాధి సిద్ధిః" అని కూడ వ్రాసినారు.

**శ్రుత్వాతత్త్వమసీత్యేవం బోధ్యమానోఽప్యనేకశః ।**
**నాయం త త్త్వం విజానాతి ఈశానుగ్రహవర్జితః ॥**

తత్త్వమసి మహావాక్యము అనేకసార్లు శ్రవణము చేసినను, మహాత్ము లగు గురువులు బహువిధములుగా ఉపదేశించినను, ఈశ్వరానుగ్రహము లేనివాడు ఈ సత్యమును (జ్ఞానము) తెలిసికొన జాలడు



# నిజానిజములను తెలుసుకొనుటలో గల ప్రయాస

దీనిని గురించి అనేక సభలలో సుమారు అయిదడుగుల యెత్తు గల ఒక స్తంభముపైన గాని, గోడపైనగాని ఒక అద్దమును పెట్టి జనులకు చూపడమైనది కుడి చెవిపైనగాని, ఎడమచెవిపైగాని మంచి పుష్పమును లేక మరేదేని సుందర వస్తువును పెట్టి చూపడమైనది అద్దములో చూచునపుడు ఎడమ చెవిపై పెట్టబడిన వస్తువు కుడిచెవిపై ఉన్నటులను, లేక కుడిచెవిపై

పెట్టబడినది యెడమ చెవియందున్నటులను కనబడును దీనిని ఎవరైనా యిపుడుకూడ చూడవచ్చును ఎట్టి మేధాశక్తి గలవారికైనను, ప్రజ్ఞాశాలికైనను, వేదములను సొంతముగా చదువుకొన్న పండితవర్యునికైనను, ఏమియు చదువని పామరునికైనను, పరమయోగికైనను, సన్న్యాసికైనను, సంసారికై నను, స్త్రీకైనను, పురుషునికైనను, భూపాలురకైనను గోపాలురకైనను ఈలాగుననే గోచరించును ప్రత్యక్షముగా ఎవరైనా పరీక్షించుకొనవచ్చును ఇదియే మాయ, అవిద్య, అజ్ఞానము, ప్రకృతియొక్క వికృతి, లేక శక్తియని గ్రహించుకొనవచ్చును అద్దములో చూచుకొని దీనిని ఎవరున్ను నివృత్తిజేసు కొనజాలరు ఓహో! మాయయొక్క మహిమ ఇట్టిదికదా!

అయితే దీని యొక్క సత్యము తెలుసుకొనుటకు ఒక్క ఉపాయము గలదు అద్దములో చూడక, దానినుంచి ముఖమును తప్పించి తన చేతితో తాను పెట్టిన పుష్పాదులు కుడి చెవిపై ఉన్నవా? లేక ఎడమచెవిపై నున్నవా? అని చేతితో ఎత్తిచూచిన, నిది యేమి ఆశ్చర్యము! కుడిచెవిపై పెట్టిన పుష్పము నాకు ఎడమచెవిపై నున్నటులను, ఎడమ చెవిపై పెట్టిన పుష్పము కుడిచెవిపై నున్నటులను, అద్దములో కనబడినదే, ఎంత ప్రజ్ఞతో అపుడాలోచించినను నిజము తెలియక పోయినదే, అద్దమువైపు చూడక యిపుడు చేతితో నెత్తి చూచినపుడు సత్యము గోచరమైనది కదా" అని పరమాశ్చర్యము గలుగును ఇదియే సృష్టియొక్క వైచిత్ర్యము కావున దృశ్యముపై, దేహముపై ఇంద్రియములపై, మనస్సుపై, బుద్ధి పర్యంతముగల దేనిపైన అయినను దృష్టిగల వానికి ఇది అంతయు విపరీతముగానే కనిపించును సాక్షియగు ఆత్మయందు లేక ఈశ్వరునియందు, లేక బ్రహ్మమునందు నిలకడ గలుగునపుడే సత్యము బయలుపడగలదు నిజము అపుడు గోచరించును తక్కిన వారికందరికిని ఉన్నది లేనట్లున్ను, లేనిది ఉన్నట్లున్ను భాసించును కాన ఆత్మజ్ఞానము గలిగి దాని యందు నిలకడ సిద్ధించువరకు సత్యము తెలియదు కావుననే గీతయందు కృష్ణభగవానుడు ఈ దిగువ రీతి తెలుపు టకు కారణమైనది

**ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే।**
**బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ॥ (18 - 30)**

ఓ అర్జునా! ఇది ప్రవృత్తిమార్గము, ఇది నివృత్తి మార్గము ఇది చేయదగనిది, ఇది చేయతగినది, ఇది భయమును గలుగజేయునది, ఇది అభయము నొసగునది, ఇది సంసార బంధమును గలుగజేయునది, ఇది సంసార బంధ నివృత్తిరూప మోక్షమును ఒసంగునది అనునిట్టి సత్యము ఏ బుద్ధిచేత తెలియబడుచున్నదో, అది సాత్త్వికబుద్ధి యని గ్రహించు కొనుము

ఇచట త్రిగుణ స్వభావముగల బుద్ధిని గూర్చి చెప్పుటవల్ల సాత్త్వక బుద్ధి యని చెప్పబడినదేగాని, నిజముగా అది సత్యబుద్ధి యనియే గ్రహించు కొనవలయును ఏలన సత్త్వ, రజ స్తమస్సులు మూడున్ను ప్రకృతిలో చేరినవే

**అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా।**
**సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ॥ (18 - 32)**

ఓ అర్జునా! ఏ బుద్ధి అజ్ఞానముచేత ఆవరింపబడినదై అధర్మమును ధర్మమనియు, ధర్మమును అధర్మమనియు, సమస్త పదార్థములను విపరీతములుగా తెలుసుకొనుచున్నదో, అట్టి బుద్ధి తమోగుణ ప్రధానమైనది

సమస్తశాస్త్రముల సారమంతయు ఈ రెండు శ్లోకములలో శ్రీకృష్ణ భగవాను డుపదేశించెను మరియు పదహారవ అధ్యాయమున

**ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః।**

అని అసుర స్వభావముగలవారి లక్షణము నిరూపింపబడినది పై శ్లోకమున 'ప్రవృత్తిం చ నివృత్తిం చ" అని సత్త్వగుణము గల బుద్ధియే నిజముగా తెలుసుకొన గలదనియు, తమోగుణ బుద్ధి తెలుసుకొన జాల దనియు తెలిపినదానినే యిచట ఆసుర స్వభావముగల జీవులు తెలియజాలరని చెప్పడమైనది ఇచట అసుర గుణమని చెప్పుటచే దైవగుణము గల జీవులే తెలుసుకొనగలరని మనము గ్రహించుకొనవల

యును ఇచట దైవగుణ మనగా - దైవభావములో నిలకడ కలిగియుండుట యని అర్థము అట్టి వారికే సాధ్యపడునని నిశ్చయించుకొనవలయును మరియు ఈ శ్లోకముయొక్క ద్వితీయ పాదమునుగూడా కలిపి చదువు నపుడు

**ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।**
**న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ (16 - 7)**

అసుర స్వభావముగలవారికి బాహ్యాభ్యంతర శుద్ధిగాని, సదాచార ప్రవృత్తిగాని, సత్యవాక్యముగాని కలిగియుండదని గ్రహించుకొనవవలయును ఈ సత్యమును దీర్ఘముగా ఆలోచించిన నిపుడు సత్యప్రవర్తకులని, సదాచార నిష్ఠులని, అనుష్ఠాన పరులని తలంచు కొందరిలో గూడ ఎన్నియో లోపములు కనబడుచున్నవి దానిని ప్రజ్ఞతో ఆలోచించి సవరణ చేసుకొనే లాగున ముముక్షువులు, జిజ్ఞాసువులు, విరక్తులు యత్నించుకొనవలయును లేనిచో జన్మము పాడైపోవును

ఈ విషయమునే శ్రీ పతంజలి మహర్షి తనయోగశాస్త్రములో ఒక సూత్రములో నిర్ణయించినారు

**సూ॥ అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచి సుఖాత్మఖ్యాతి రవిద్యా ।**

(అవిద్య, అజ్ఞానము, తమస్సు, మాయ-వీటియొక్క స్వభావము, ఇందునిరూపింపబడినది) అనిత్య వస్తువునందు సత్యబుద్ధియు, సత్యవస్తువునందు అనిత్యబుద్ధియు, అశుద్ధ వస్తువునందు శుచిత్వబుద్ధియు, శుద్ధమైన దాని యందు అశుద్ధ బుద్ధియు, దుఃఖమయమగు సంసారమందు సుఖత్వబుద్ధియు, శాశ్వత సుఖ స్వరూపమైన ఆత్మయందు దుఃఖత్వ బుద్ధియు, అనాత్మస్వరూపములగు దేహేన్ద్రియాదులందు ఆత్మబుద్ధియు, సత్యజ్ఞానానందమగు ఆత్మయందు, ఈశ్వరునియందు, బ్రహ్మమందు అనాత్మబుద్ధియు గలిగి యుండుటయే అవిద్యయొక్క స్వరూపము దీనిలో గల ఒక్కొక్క పదమును, దీర్ఘముగా విచారించిన మాయయొక్క స్వరూప

మును తెలుసుకొనగలరు కావుననే స్వబుద్ధిచేత శాస్త్ర విచారము చేసి సత్యమును తెలుసుకొనుటకు సాధ్యముకాదని శాస్త్రము నిర్ణయించడమైనది ఏలన! బుద్ధి త్రిగుణాత్మకమైనది దాని ననుసరించియే అది నిర్ణయించునుగాని, త్రిగుణాతీతమగు సత్యమును, దైవమును అదియెట్లు నిర్ణయించగలదు? ఒక రంగులో ఒక వస్తువు గలదని తలంచుడు మీరు నీలము, ఎరుపు, పసుపు రంగులు గల అద్దము ద్వారా చూచిన, మీరు పెట్టుకొన్న కంటి అద్దము ననుసరించియే అది గోచరించును తెల్ల అద్దము ద్వారా జూచిన అది నలుపో, యెరుపో, పసుపో, తెలుపో మీకు కనిపించును లేక ఒక దీపమునకు మూడు రంగులు గల అద్దము లమర్చినచో దీపము స్వప్రకాశమైనదిగా నుండినను, అద్దముల యొక్క రంగుల ననుసరించి నీలమో, యెరుపో, పసుపో రంగులతో కూడినదిగానే అది కనబడును కావున త్రిగుణములతో గూడిన హృదయము త్రిగుణాతీతమగు ఆత్మను దైవ మును తెలుసుకొన జాలదు అయితే యీ త్రిగుణాత్మకమగు మాయనుండి త్రిగుణాతీతుడగు ఈశ్వరుని, ఆత్మను దర్శించుటకు పొందుటకు ఉపా యము శ్రీకృష్ణభగవానుడు గీతలో నుపదేశించెను

**దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।**
**మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే ॥ (7 - 14)**

ఓ అర్జునా! యీ త్రిగుణాత్మకమైన నాయొక్క ప్రకృతి (మాయ) దేవ సంబంధమైనది అనగా నావలన కలిగినది, కనుక సామాన్యులు దాటశక్యము గానిదిగా నుంటున్నది అయితే ఎవరు నన్ను శరణు పొందు చున్నారో, వారు ఈ మాయను దాటుచున్నారు

పడవ నాశ్రయించిన వారు నదిని, ఓడను ఆశ్రయించిన వారు సముద్రమును దాటుటలేదా! శ్రీదత్తాత్రేయులును అవధూత గీతయందు మొట్టమొదటనే దీనిని తెలిపిరి

**ఈశ్వరానుగ్రహాదేవ పుంషామద్వైత వాసనా ।**
**మహాభయ పరిత్రాణా ద్విత్రాణాముపజాయతే ॥**

ఈశ్వరానుగ్రహము వలననే మహాభయంకరమగు ఈ సంసార సాగరము నుండి జీవులు తరించగలరు రక్షణ లేని వారిని ఆ ఈశ్వరానుగ్రహమొక్కటియే రక్షించును అనేక శాస్త్రములు ఈ సత్యమునే బోధించుచున్నవి కాన ఆ పరమేశ్వరుని యందు, భగవంతుని యందు భక్తి గలిగి యుండుడు అపుడు జ్ఞానమున్ను, మోక్షమున్ను, సర్వమున్ను సిద్ధించును



# ఆస్తికత్వము - నాస్తికత్వము

ఆస్తికత్వము, నా స్తికత్వము అని రెండు వేరే లేవు నా స్తికత్వము అని చెప్పునప్పుడు అస్తిత్వము నుండి చెప్పబడినదా? లేదా? అస్తిత్వము లేనిచో నాస్తికత్వము దేనివల్ల తెలుసుకొని చెప్పబడినది? అనగా "నీవు ఒక్కడవు ఉండి లేని దానిని తెలుసుకొంటివా? లేక నీవు లేకనే లేని దానిని తెలుసుకొంటివా?" అను ఒక ప్రశ్నలోనే శ్రీ శంకరాచార్యులవారు నా స్తికత్వమును తుదముట్టించిరి అనగా నీవు ఒకడవు లేనిచో లేని దానిని దేనివల్ల తెలుసుకొంటివి? లేని దానిని తెలుసు కొన్నప్పుడు నీవు ఒకడివి ఉండే తీరవలయును అయితే యిది గొప్పవాదము, మనము దానిలోకి దిగిపోనక్కరలేదు ఒక చిన్నదృష్టాంతముతో ఊహించిన దీనిని గ్రహించుకొనవచ్చును

నీవు ఒక నాటకశాలలో నాట్యము అనగా సినిమా జరుగుచున్నప్పుడు వెళ్ళి చూచినట్లు ఊహించుము అపుడు నాటకశాల నిండుగా జనులున్నట్లును, దీపములు వెలుగుచున్నటులను భావన చేయుము తరువాత నాటకము పూర్తి అయి హాలు అంతయు మూయబడినది శబ్దములుగాని, దీపములు గాని యేమియు లేవు అంధకారమయముగా ఉన్నది ఆ సమయ

మున ఆ నాటకశాలయందు ప్రవేశించి, పరీక్షించినపుడు ఏమియు లేదు అంతా చీకటి మయముగా ఉన్నది దీనినిన్ని నీవు పరీక్ష చేయునటుల ఊహిం పుము అపుడు ఉన్న దానిని, లేని దానిని చూచిన నీవు ఒకడవు ఉండియే ఉన్నావుగదా! ఇదియే ఆస్తికత్వ నాస్తికత్వములలోగల సూక్ష్మతత్త్వమని గ్రహింపవలయును అయితే ఈశ్వరుడుండిన నెందుకు కనిపించుట లేదనియే శాస్త్రవిచారముగాని, అనుష్ఠానముగాని లేని సామాన్య మనుష్యులు గూడ అడుగుచుందురు ఒకవేళ తనకు తెలియక పోయినను, తెలిసిన వారిని అడిగి తెలుసుకొనక, స్వబుద్ధి చేత తోచునట్లు చెప్పుట యెట్లు న్యాయమగును? ఈవిషయమై గీతలో శ్రీకృష్ణ భగవానుడిట్లు తెలిపెను

**నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః ।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥**

ఓ అర్జునా! నేను యోగమాయావృతుడనై అందరికిని గోచరించు వాడను కాను వివేకములేని యీ జనులు జన్మరహితుడ నైనట్టియు, నాశరహితుడ నైనట్టియు నన్ను ఎరుగ జాలరు

"మూఢోఽయం నాభిజానాతి" అని భగవంతుడు స్వయముగానే చెప్పెను ఒక్క విషయమును గూర్చి చెప్పునపుడు దానిని తెలియనివాడు చెప్పినది ప్రమాణమెట్లగును? కాన ఇచట 'మూఢ'శబ్దము ప్రయోగింపబడి నది ప్రకాశవంతమైన ఒక దీపమున్నటుల తలంచుడు దానిని దట్టమైన ఒక పాత్రచే మూసివేసిన అయ్యది యెట్లు కనిపించును? మూత తీసివేసిన అది కనిపించును కావున యోగమాయ, విష్ణుమాయ, శివమాయచే ఆత్మ ఆచ్ఛా దితమై ఉండుటవల్ల అజ్ఞులకు గోచరించుట లేదు కావుననే గీతలో 'అజ్ఞానే నావృతం జ్ఞానం' అని తెలుపబడినది మామూలుగా ఫోటోగ్రాఫరులు ఎవరిదైనా ఫోటో తీయుదురు అయితే వారి శరీరమందు ఏవేవి ఉన్నవో అవి అన్నియు ఫోటోలో కనిపించును కాని శరీరము లోపల, కడుపులో ప్రేగులలో ఎముకలలో, శిరస్సు లోపల ఉండు ఏదేని రోగముగాని, మరేదేని

పదార్థముగాని కనపడజాలదు అంతర్నిహితమైన దానిని చూడవలసియుండిన 'ఎక్సరే' తీయవలసియుండును అపుడు తెలియగలదు ఈ సత్యమునే శ్రీకృష్ణ పరమాత్ముడు 11వ అధ్యాయమున అర్జుననకు ఉపదేశించినది చూడుడు అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మ యొక్క అప్రాకృతమగు, విశ్వరూపమును దర్శించవలయునని భగవానుని కోరెను అపుడు వాసుదేవుడు ఏమి చెప్పెనో దానిని గ్రహించిన చాలును ఏకాదశాధ్యాయమున ఈ తత్త్వమే వర్ణింపబడినది

**న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥**

ఓ అర్జునా! నీయొక్క ప్రాకృతములైన యీ చర్మ చక్షువులచే విశ్వరూప ధరుడనగు నన్ను చూడజాలవు, కాన నీకు అప్రాకృతమైన దివ్యనేత్రము నిచ్చుచున్నాను ఈ దివ్యనేత్రముచేత నా యొక్క యోగమహిమను (ఈశ్వర శక్తిని) చూడుము

దీని కన్న పరమ ప్రమాణము మరియేమి కావలయును? పంచభూతాత్మకమైన, జడమైన యీ దృష్టిచేత, పంచభూతములను సైతము ప్రకాశింప జేసెడు చైతన్యాత్మను ఎటుల చూడగలము? ఈ సత్యమును బాగుగా చింతన జేసినచో భగవంతుడు ఉపదేశించిన ఈ సూక్ష్మతత్త్వము గోచరము కాగలదు దీని కన్న గొప్పశాస్త్రమేమి కావలయును? అయితే బాగుగా చింతనజేయువానికి చిత్తైకాగ్రతయు, చిత్తనిర్మలత్వముగూడ ఉండవలయునని మరువకూడదు ఇచ్చటనే పొరబాటు గలుగుచున్నది ఆత్మబోధయందు శ్రీ శంకర భగవత్పాదులు చెప్పినది చూడుడు

**ఆత్మాஉవభాసయత్యేకో బుద్ధ్యాదీనీన్ద్రియాణ్యపి ।**
**దీపో ఘటాదివత్స్వాత్మా జడై స్తైర్నావభాస్యతే ॥**

అంధకారమునందుండెడి కుండ మొదలగునవి దీపము చేత ప్రకాశింపజేయబడినప్పటికిని, దీపము ఆ కుండ మొదలైన వాటి చేత ప్రకాశింప

జేయ బడనట్లు, ఆత్మ అహంకారము మొదలైన వాటి నన్నిటిని భాసింప జేసినప్పటికిని, ఈ అహంకారము మొదలైనవి ఆత్మను తెలియ జేయనేరవని ముముక్షువులు తెలుసుకొనవలయును

అనగా గృహాంతరాళమున రాత్రిపూట చీకటిలో ఒక దీపము వెలిగించి చూడుడు దానిచుట్టున్ను అనేక శ్రేష్ఠములైన రత్నసువర్ణ సుగంధ పుష్పాదుల నుంచుడు, నికృష్టములైన దుర్గంధ పూరిత నీచపదార్థములను గూడ నుంచుడు, అవి రెండును దీపమును ఏలాగున ప్రకాశింపజేయజాలవో, దీపము వాటినన్నిటిని ఏలాగున ప్రకాశింపజేయుచున్నదో, ఆత్మయొక్క స్థితియు ఈలాగుననే యున్నదని గ్రహించదగినది ప్రపంచ విషయములో మంచి తెలివి జ్ఞానము, విద్యగలవారికిని, ఆత్మ ప్రకాశించునది కాదు

అట్టి జ్ఞానము, విద్య లేని వారినిగూర్చి మరల చెప్పవలయునా! ఇదియే బ్రహ్మవిద్యలోగల రహస్యము మీలో చాలామంది కన్ను ఆసుపత్రికి వెళ్ళి చూచియుందురు, కంటిలో శుక్లములుగాని, పొరలుగాని ఉండిన, ఉండిన వారికి నేమియు కనబడదు వాటిని డాక్టరు తీసివేసినచో అన్నియు బాగుగా కనిపించుట లేదా? దీనికన్న శాస్త్రప్రమాణమింకేమి కావలయును? కావుననే గురుధ్యానములో -

**అజ్ఞానతిమిరాన్ధస్య జ్ఞానాంజనశలాకయా ।**
**చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥**

ఎవనిచే అజ్ఞానమను తిమిరవ్యాధిచే అంధుడైన వానియొక్క నేత్రము జ్ఞానమను శలాకచే తెరువబడినదో అట్టి గురుదేవునికి నమస్కారము

"రేడియో" వెలువడిన ఆరంభకాలములో, కాలేజీ విద్యార్థులు ఎంతో దూరమున చెప్పెడు వార్తలను ఇచ్చటనే కూర్చొని వినవచ్చునని చెప్పగా కొందరు ముసలివారలు అమెరికా యెక్కడ! యూరప్‌యెక్కడ! బొంబాయి యెక్కడ, కలకత్తా యెక్కడ! అంత దూరమున చెప్పెడి వాక్యములు ఇక్కడ ఎటుల వినవచ్చునని సంశయించుచుండిరి ఇపుడు ఆ సందేహము లేదు

గదా! ఇదియే బ్రహ్మ విద్యలో గల కీలకము

ప్రశ్న॥ దూరదేశములలో గల శబ్దములు ఇచ్చటనే జ్ఞానులు అజ్ఞానులు అందరున్ను వినుచున్నారు, ఆలాగున ఈశ్వరుడుండిన అందరికి ఎందుకు కనిపించడు?

ఉ॥ జ్ఞానులకున్ను, అజ్ఞానులకున్ను సమానముగా వినిపించుట లేదు జ్ఞానులకు మాత్రమే వినబడుచుండును ఎట్లన! ఆ రేడియో యంత్రము ఎవనివద్ద ఉండునో వారికి మాత్రమే వినబడునేగాని తక్కిన వారికి వినబడదు అంతేగాదు ఎన్నియో వేలమైళ్ళదూరమునుండి రేడియోవంటి యంత్రములో (టెలివిజన్‌లో) మాట్లాడు వానియొక్క శరీరమును గూడ ఇచ్చట గల యంత్రములో చూడవచ్చును కావున నీహృదయమును రేడియోవంటి మిషన్‌గా చేయుము ఊరకే చెప్పిన చాలదు ఈ యంత్రములో ఎన్నెన్ని కొరముట్లు గలవో, ఆలాగున నీహృదయమును వైరాగ్యము, ఉపరతి, యింద్రియ నిగ్రహము, శమనము, ఊర్ధ్వదృష్టి, ప్రపంచ విలక్షణత్వము వీటికి నిలయముగా జేసుకొనుము అపుడు నీకు ఈశ్వర తత్త్వము గోచరము కాగలదు పూర్వపు యుగమునకున్ను, వర్తమాన కాలమునకున్ను చాల తారతమ్య మేర్పడినది పూర్వకాలము మనోజయము కొరకు ఋషులు సాధకులు ప్రయత్నించుచుండిరి అందువల్ల వారు ప్రకృతికి పరమగు ఆత్మశాంతిని జ్ఞానమును పొందిరి ఇపుడో-యే దుర దృష్టమో పంచభూతాత్మకమగు ప్రపంచమును జయించుటకు యావచ్ఛక్తిని వినియోగపరచుచున్నారు ప్రపంచము అనృతము, దుఃఖాత్మకము అందు వల్లనే దీనియందు ప్రవర్తించు వారు శాంతిని, ఆత్మసుఖమును పొందక పోవుచున్నారు

అంతేగాదు, ఇది అపూర్ణము, ఆత్మ లేక దైవత్వము పూర్ణము కనుకనే దీనియందెంత ప్రయత్నించినను శాంతిగలుగదు ఆత్మ పూర్ణమగుట చేతనే "పురుషుడ" ని పేరు వచ్చినది అయితే స్త్రీ యొక్క

ఆత్మపూర్ణముకాదా! అని తలంచవలదు అష్టపురీకములలో ఉండునదగుట వలననే 'పురుష' శబ్దము ఏర్పడినది ప్రమాణములలో అనుమాన ప్రమాణము గూడ ఒకటి అంగీకరింపబడినది అట్టైన చిత్ర విచిత్రమైన యెట్టివారి బుద్ధికి గూడ అందని యీ సృష్టి రచించిన పరమేశ్వరుడొకడు ఉన్నాడని తప్పక అంగీకరించవలసియున్నది ఒక అద్భుతమైన యంత్రమును చూచిన దానిని నిర్మించినవాడు కనిపించక పోయినను, నిర్మాణకర్తయగు ఒక పురుషుడు ఉండియే తీరవలెనని యెట్లు నిశ్చయించుకొనుచున్నామో, సృష్టికర్త యొక్కయు, సృష్టియొక్కయు తత్త్వమీలాగున నుండును ఆ యంత్రము ఏ దేశములో, ఏ కంపెనీలో నిర్మింపబడెనో, దానిపేరు ఆ యంత్రముపై గలదు అంతవరకు వెళ్ళి పరిశీలించి, లేనిచో అది లేనిదని చెప్పవచ్చును అట్లు పరిశ్రమ చేయక యిచ్చటనే కూర్చోని యీ యంత్ర నిర్మాణకర్త లేడని చెప్పుచుండుట యేమి సమంజస మగును! ఆలాగున బ్రహ్మవిద్యాధికారిని గురించి అన్ని శాస్త్రములలోను ప్రారంభముననే నిరూపింపబడియున్నది బ్రహ్మసూత్రములందు మొదటనే 'అధాతో బ్రహ్మజిజ్ఞాసా' అని తెలుపడమైనది ఈ సూత్రమునకు శ్రీ శంకరభాష్యము చూచిన అర్థము స్పష్టమగును ఇక 'వివేకచూడామణి' మొదలగు గ్రంథములలోగూడ విస్తారముగా కనుగొనవచ్చును భగవద్గీతలో కూడ భగవానుడిటుల ఉపదేశించెను

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥**

వినయముతో నమస్కరించుటచేతను, సమయమును కనిపెట్టి అడుగుట చేతను, గుర్వాజ్ఞను పాలించుటచేతను, తత్త్వవేత్తలైన ఆత్మజ్ఞానులు నీకు జ్ఞానమును ఉపదేశింపగలరు

పూర్వము ముఖ్యముగా భారతీయులు యోగమునే ప్రధానముగా తెలుసుకొనిరేగాని, భోగమునకు బానిసలు కాలేదు అందువల్లనే భారత దేశమును అనేకులు పాలించినను వారందరు పోయి భారతదేశము సుస్థిరముగా నిలిచినది కావున పతంజలి మహర్షి తన యోగశాస్త్రమునందు

మొదటనే 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' అని తెలిపెను ఈ విషయమై శ్రీ శంకరభగవత్పాదులు ఆత్మబోధలో తెలిపినది చూడుడు

**సదా సర్వగతో౽ప్యాత్మా న సర్వత్రావభాసతే ।**
**బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషు ప్రతిబిమ్బవత్ ॥**

సూర్యుడు సర్వత్ర సమానముగా భూమియందు ప్రకాశించుచుండి నను స్వచ్ఛముకాని గోడ, మట్టి, రాయి మొదలగు వాటిలో ప్రతిబింబించుట లేదు నిర్మలమైన అద్దము మొదలగు వాటియందు మాత్రమే ప్రతిఫలిం చును ఆలాగున ఆత్మయు, ఈశ్వరుడు సమానముగా అందరిలో వెలుగు చున్నప్పటికిని రాగద్వేష విషయాది దోషరహితమైన శుద్ధబుద్ధియందు మాత్రమే ప్రతిబింబించును ఇక దీనికన్న దృష్టాంతమేమి కావలయును? కావున బుద్ధిని శుద్ధపరచుటకు ప్రయత్నించుడు

**మలినో హి యథా౽౽ ధర్శో రూపాలోకస్య న క్షమః ।**
**తథా౽ విపక్వకరణ ఆత్మజ్ఞానస్య న క్షమః ॥**

అద్దములో అన్ని వస్తువులున్ను పక్షపాతములేక ప్రతిబింబించెడు శక్తి యున్నప్పటికిన్ని, మలినమైన దర్పణము నందు ఏదియు నెటుల ప్రతిబిం బించ జాలదో, అటులే పరిపక్వముగాని అంతఃకరణములో ఆత్మజ్ఞానము ప్రకాశింప జాలదు కావున హృదయశుద్ధిని, మనోనిర్మలత్వమును సంపాదిం చుటకై ప్రయత్నించుడు ధీరులైనవారు చేయవలసిన పనినిజేసి, అది సాధింప యత్నింతురేగాని, ప్రయత్నహీనులై వట్టిమాటలు చెప్పి వృధాకాలము గడిపే స్వభావము గలిగియుండరు గీతయందు శ్రీకృష్ణభగవానుడు ఉపదేశించినది చూడుడు

**శ్రద్ధావాన్, లభతే జ్ఞానం తత్పరస్సంయతేన్ద్రియః ।**
**జ్ఞానం, లబ్ధ్వా పరాం శా న్తి మచిరేణాధిగచ్ఛతి ॥**

గురూపదిష్ట వేదాంత వాక్యార్థములయందు నమ్మకము గలవాడును,

తదుపదిష్టార్థమును తెలుసుకొని యనుష్ఠించుట యందాసక్తి గలవాడును, ఇంద్రియ సంయమనము గలవాడైన పురుషుడు అచిరకాలముననే బ్రహ్మ జ్ఞానమును పొంది, సర్వోత్తమమైన పరమశాంతిని పొందుచున్నాడు

శ్రీకృష్ణభగవానుడు ' శ్రద్ధ' ఒకటి గలిగియుండిన చాలునని చెప్పెనే గాని జాతియో, స్త్రీయో, పురుషుడో అని యేమియు ప్రసక్తి తేలేదు ఇప్పటికే చాలామందికి కాలము గతించినది అయినను కాల మతిక్రమించిపోలేదు ఉండే కాలములోనే అట్టి స్థితిని పొందేలాగున చూడవలయును అంత్యకాల మందైనను భగత్స్మరణ ఆత్మభావన గలిగియుండిన తరింపవచ్చునని శాస్త్ర ముద్ఘోషించుచున్నది

**అ న్తకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥**

ఎవడు అంత్యకాలమందైనను నన్నే స్మరించుచు లేక ధ్యానించుచు, దేహము విడిచిపోవుచున్నాడో, వాడు నా యొక్క విష్ణు స్వరూపమును లేక మోక్షమును పొందుచున్నాడు ఈ విషయమున కొంచెమేని సందేహములేదు



# పశుత్వ - శివత్వములు

మీరు గోడగడియారమును చూచియే యుందురు అది మొట్ట మొదట నిర్మాణ కాలములో సమయమును చూపుముల్లుతోనే నిర్మింప బడినది తరువాత మఱియొక భాగము సమయానికి గంట కొట్టునది యేర్పాటు చేయడమైనది ఇపుడు గూడా రెండింటికిని వేరువేరుగా "కీ" యిచ్చెదరు పిమ్మట రెండింటిని ఒకే ముల్లుపై నడిపేలాగున నిర్మాణము చేయబడెను ఆలాగుననే మానవ హృదయమున రెండు భాగములు గలవు, ఒక భాగము ప్రాపంచిక కార్యమును నడుపునది ఇది పశ్వాది జీవులం

దరికిని గలదు

రెండవ భాగము ఆధ్యాత్మిక దైవజ్ఞాన సంబంధమైనది ఇది మానవ సృష్టిలో మాత్రమే గలదు ఇవి రెండును పశుత్వ శివత్వములతో గూడినవి సామాన్యజనులకు మొదటచెప్పిన శారీర ధర్మనిర్వహణ పశుత్వమే యుం డును ప్రజ్ఞయు, జ్ఞానము గలుగునపుడు శివత్వమేర్పడును ఇదే మానవ జన్మములో జ్ఞానాజ్ఞానములకు గల భేదము బుద్ధి శుద్ధమై ఆత్మజ్ఞాన ముదయమగునపుడు శివత్వమావిర్భవించును అత్తరి మానవులు దేహసం బంధ ప్రాపంచిక కార్యములను, ఆధ్యాత్మిక జ్ఞానసంబంధ కార్యములను గూడ నిర్వహింపగల్గుదురు అపుడు వారికి రెండింటిలోను ప్రయాసము లేకనే నిర్వహించుశక్తి గలుగుచుండును ఇదియే బుద్ధి వికసింప వలయున నియు, హృదయము శుద్ధము కావలయుననియు చెప్పెడు రహస్యము మొదటిఅవస్థలో తమోగుణమైన అశుద్ధబుద్ధి గలిగియుండును మరికొంత కాలమునకు రజోగుణ మావిర్భవించి సామాన్య మానవత్వముతో గూడ ప్రవర్తించును పిమ్మట సత్త్వగుణము ఉదయమై దైవకార్యములో ఆత్మజ్ఞాన కార్యములో ప్రవర్తించు అవస్థ గలుగును, తరువాత అనుష్ఠానపరుడై యేర్పడునపుడు గుణత్రయాతీతమగు జ్ఞేయమైన దైవస్థితిలో నిలుకడ గలుగును గీత 14-వ అధ్యాయము ఈ సత్యమును ఈ రహస్యమును ఉపదేశించుచున్నది, దానిని బాగుగ చదువుడు

**సత్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥**

ఓ అర్జునా? ప్రకృతి సంబంధములైన సత్త్వము, రజస్సు, తమస్సు అనునట్టి మూడు గుణములు, ఈ గుణముల కంటె వేరైన నాశరహితమైన ఆత్మను దేహమునందు బంధించుచున్నవి

**తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్ ।**
**సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞాన సఙ్గేన చానఘ! ॥**

ఓ అర్జునా! ఆ సత్త్వరజస్తమస్సులనెడు మూడు గుణములలో మొదటిది యగు సత్త్వగుణము జీవుని ఎటుల బంధించుచున్నదో చూడుము అయ్యది నిర్మలమైన దగుటవలన ప్రకాశింపజేయునదియును, ఆరోగ్యకరమైనదియునై దృశ్య సుఖముతో కూర్చుట చేతను, ప్రపంచ విషయక జ్ఞానముతో చేర్చుట చేతను, లేక అమానిత్వాది జ్ఞానసంపదచే తృప్తి పొందుటచేతను, లేక శాస్త్రజ్ఞానముచేత తృప్తి పొందుట చేతను జీవుని బంధించుచున్నది

**రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సఙ్గ సముద్భవమ్ ।**
**తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్ ॥**

ఓ అర్జునా! రజోగుణము ఆశాపాశముచే గలుగునది యనియు, దృశ్య విషయములం దనురాగమును గలుగచేయునది యనియు నెరుంగుము, కావున ఆ రజోగుణము దేహమునందుండు ఆత్మను ఐహికాముష్మిక సుఖముల యందాసక్తి యనెడి కామ్య కర్మ సంగముచేత లెస్సగా బంధించు చున్నది

**తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।**
**ప్రమాదాలస్యనిద్రాభిస్తన్నిబధ్నాతి భారత! ॥**

ఓ అర్జునా! 'ఇది మంచి, ఇదిచెడు' అని తెలుసుకొనజాలని అజ్ఞానము వలన గలిగినదియును, సకల ప్రాణులకును మోహమును గలుగజేయు నదియు నగు తమోగుణము భ్రమ, సోమరితనము, అతినిద్ర అనువానిచే జీవుని బంధించుచున్నది

**గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మ మృత్యు జరాదుఃఖైర్విముక్తోఽ మృతమశ్నుతే ॥**

జీవుడు దేహోత్పత్తికి కారణ భూతములైన పైన జెప్పబడిన సత్త్వ రజ స్తమోగుణముల నతిక్రమించి (అనగా దేహము విడనాడుటకు మునుపే, బ్రహ్మజ్ఞానముచేత త్రిగుణముల నణచి) పుట్టుక, చావు ముసలితనము,

ఇతర దుఃఖములు మొదలగువానిని పొందక అనగా జీవన్ముక్తుడై అమృత త్వమును, శివత్వమును, దైవత్వమును పొందుచున్నాడు

చిత్తైకాగ్రత గలిగి శుద్ధమైన బుద్ధిగలిగి యుండి ఈ యధ్యాయ మును ఏకాన్తమున బాగుగ చింతన జేసినచో ఈ ఆత్మ యిపుడు పశుత్వ ములో లేక ఉత్తమ మానవత్వములో లేక దేవత్వములో ఉంటున్నదా! లేక దైవసాక్షాత్కార జ్ఞానము గలిగినదా! అని తెలుసుకొనవచ్చును, అంతేగాక జన్మరాహిత్యము సిద్ధించినదా! లేక యీ దేహానన్తరము స్వర్గప్రాప్తిలేక నరకప్రాప్తి గలుగునా! యని మరి యెవరిని ప్రశ్నింపకనే, జ్యోతిశ్శాస్త్రమును విచారింపకనే, జ్యోతిష్కుల నడుగకనే స్వయముగా తెలుసుకొనవచ్చును ఒకవేళ పునర్జన్మ వచ్చినను అది శ్రేష్ఠజన్మయా! నికృష్టజన్మయా అని గూడ గ్రహించుకొనవచ్చును అయితే ఎంత యేకాగ్రత బుద్ధికి గలిగినను స్వయ ముగా అప్రాకృతమగు ఈ దైవవిషయమును తెలిసికొనుట దుస్తరము కావున ఆత్మజ్ఞానము గలిగిన మహనీయుల సహవాసము మనకెంతో అవస రము అయితే యిచట మూడు గుణములను మూడు గుణముల కతీతమగు ఆత్మను గురించి తెలుపబడినదేగాని ఈ మూడు గుణముల నుండి యెటుల విముక్తి పొందవలయునో నిరూపించలేదు దానిని ఈ అధ్యాయమున చివర శ్రీభగవానుడు ఉపదేశించెను, ఇదియే శాస్త్రములో గల కీలకము అదే స్వబుద్ధితో శాస్త్రకీలకము తెలిసికొనుటకు సాధ్యపడదని చెప్పుటకు కారణము

**మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।**
**స గుణా న్సమతీత్యై తాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥**

ఎవడు అచంచలమైన భక్తియను యోగముచేత నన్నే సేవించు చున్నాడో! వా డీత్రిగుణములను ప్రయాస లేకనే అతిక్రమించి, బ్రహ్మసాక్షా త్కార జ్ఞానమును పొందుట కర్హుడగుచున్నాడు.

ఇట్టి అనన్య నిష్ఠారూపమగు భక్తియోగముచే గలిగెడు ఫలితము

బ్రహ్మసాక్షాత్కారమనియే భగవానుడు తెలిపెను కావుననే కట్టకడపట "బ్రహ్మభూయాయ కల్పతే' అని ప్రయోగించుటకు కారణమైనది ఈపరమ రహస్యమును తెలిసికొనక పోవుటచేతనే సామాన్యమైన భక్తులను చూచి వేదాన్త విచారణ చేయు కొందరు భక్తి గొప్పది కాదు జ్ఞానవిచారమే గొప్పదని కొంత హేళనగా పలుకుచుందురు భక్తియోగముచేత నారద, ఉద్ధవ, వాల్మీక్యాది ఋషులు ఎట్టిస్థితిని పొందిరో, ఆస్థితి మనకు గలిగిన పిమ్మట మఱల భక్తి ధ్యానములకు ఆవల ఉండు స్థితి యుండుచో అపుడు చూడ వచ్చును అని సమాధానము నెమ్మదిగా వారికి చెప్పిన చాలును దీనియందు 'భక్తియోగేన సేవతే' అని ప్రయోగించుటవల్ల 'భక్తియోగము' ఒక దానివల్ల అని అర్థము గలదు మరియొక విధముగా చూచిన 'భక్తియున్ను యోగమున్ను' అని ఒక అర్థము గూడా గలదు ఇచట యోగశబ్దమునకు ధ్యానమని అర్థము గ్రహించేది



# ధ్యానపద్ధతి

కైవల్యోపనిషత్తున ధ్యానపద్ధతిని గురించి వివరముగా తెలుపబడినది ఉపనిషత్తులు, యోగశాస్త్రములన్నియు పునాదిని గట్టిచేసి మోక్షసౌధమును నిర్మించినవి ధ్యానమును ప్రారంభించెడు సమయమున ఆసనమును గూర్చి యే దీర్ఘముగా ఆలోచించినవి

**వివిక్తదేశే చ సుఖాసనస్థశ్శుచి స్సమగ్రీవశిరశ్శరీరః ।**
**అత్యాశ్రమస్థస్సకలేన్ద్రియాణి నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య ॥**

ఏకాన్త ప్రదేశమున సుఖాసనస్థుడై శుచియై, కంఠము, శిరస్సు శరీరము, సమముగా నుంచుకొనినవాడై, తురీయాశ్రమస్థుడై యింద్రియము లన్నిటిని నిరోధించి భక్తితో తన గురువును నమస్కరించి -

ఉన్నతమైన హర్మ్యమును నిర్మింపదలంచెడు ఇంజనీర్లు పునాదిని ఎట్లు గట్టిగా చేయుదురో, ఋషులయొక్క ఆశయమున్ను ఆలాంటిది వర్తమానకాల యోగులు, మనస్సే ప్రధానమని చెప్పుటకు ప్రారంభించినప్పటి నుండియే సాధువులు పూర్వీక ఋషులయొక్క, యోగుల యొక్క స్థాన మును అందుకొన జాలకపోయిరి 'వివి క్తదేశే' అని చెప్పుటచే కేవలము నిర్జన ప్రదేశమని తలంచవలదు వివిక్తమనగా సక్తము కానిది, అనగా ప్రతిబంధము లేనిదని భావము, శబ్దము చేతగాని, వాతావరణముచేతగాని ప్రతిబంధ మును గలుగజేసెడు స్థలము పనికిరాదు ఆలాగున ఆహారమునకు గూడ అనుకూలత ఉండవలయును తరువాత 'సుఖాసనస్థః' అని ప్రయోగించుట వల్ల ఎక్కువ కాలము సుఖముగా కూర్చొనుటకు అనుకూలపడెడు ఆసనముండిన చాలును కాయక్లేశమును గలుగజేసెడు కఠినములైన ఆసన ములు పనికిరావు, ధ్యానాంతరము శరీరవ్యాయామము కొఱకు వాటిని వేసుకొనవచ్చును పతంజలి మహర్షి యోగశాస్త్రములో "స్థిరసుఖమాసనమ్" అని తెలిపిరి సుఖముగాను, స్థిరముగా ఉండు ఆసనము చాలునని తెలిపిరి "శుచిస్సమగ్రీవ శిరశ్శరీరః" అని ప్రయోగించుటవల్ల శుచిగా ఉండి మెడ, శిరస్సు, శరీరము సమముగా ఉండవలయునని తెలుపబడినది అపుడే తన భావము చక్కగా నిలువగలదు దీనికి సాధ్యము గానిచో భావమునకు మార్పు గలుగని స్థితిలో ఉండవచ్చును అయితే అదియు పై జెప్పిన ప్రకారము కూర్చుండుటకు శక్తి లేనివారు మాత్రమే అవలంబించవలయును

"సకలేన్ద్రియాణి నిరుధ్య స్వగురుం ప్రణమ్య" అన్ని యింద్రియము లను శబ్దస్పర్శరూపరసగంధాది విషయములనుండి మరలించి తన గురుదేవుని మనస్సుచేత నమస్కరింపవలయును లేక యిష్టదైవమునకైనా మనసా నమస్కారము చేయవలయును, దీనివల్ల విఘ్నములు నశించును లేక ధ్యేయాకారమగు ఆత్మను దైవమును, బ్రహ్మమును గూడ భావనము చేయవచ్చును అయితే యీ ఉపనిషత్తున "స్వగురుం ప్రణమ్య" అని ఉండుటవల్ల గురుదేవుని ప్రణమిల్లుటయే మంచిది ఏలన! ఆత్మనుగాని,

దైవమునుగాని, బ్రహ్మమునుగాని ఉపదేశించినది గురుదేవుడు గదా! ఇది ఋషిసంప్రదాయము, పూర్వాచారపద్ధతి యని గ్రహించేది

ఈలాగున ధ్యానము చేయుచు రాగా రాగా నది ప్రవహించి ప్రవహించి భూమి సరిహద్దును-గట్టునుదాటి యేలాగున మహా సముద్రములో ప్రవేశించునపుడు నది యొక్క నామరూపములు లేనిదై మహా సముద్రాకార స్థితిని పొందుచుండునో, ఆలాగున ఆవరణము తొలగునపుడు అఖండ బ్రహ్మాకారస్థితిని పొందుచుండును నది ప్రవహించక తాను ఉండు స్థలములోనే యుండినచో సముద్రాకారస్దితిని ఎట్లు పొందజాలదో, ఆలాగున జీవుడు ధ్యానముజేసి ఆవరణములను అడ్డులను దాటకపోయినచో బ్రహ్మాకారస్దితిని ఎప్పటికిని పొందజాలడు మొదటి నుండియు జీవేశ్వరులకు సంబంధము ఉన్నది నదీజలము సముద్రములోనికి ప్రవహించుట సముద్రజలము నదిలోనికి ప్రవేశించుటయు అనాదిసిద్ధముగానే ఉంటున్నది నదియొక్క ఆటుపోటులను చూచిన ఈ సత్యమును తెలిసికొనగలరు

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపఞ్చం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్త్యాదులందు ఏ ప్రపంచము గోచరించుచున్నదో అది బ్రహ్మస్వరూపమే ఆబ్రహ్మమే నేనని (ఆత్మయని) యెరింగినచో సమస్త బంధములనుండి విముక్తుడగుచున్నాడు

**త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్ ।**
**తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః ॥**

త్రివిధదేహములు అను మూడు స్థానములందును "అనుభవింపబడునది, అనుభవించువాడు, అనుభవము' అనునవి యేవి కలవో వాటికంటె నేను (ఆత్మ) విలక్షణుడను, సాక్షిస్వరూపుడను, చిన్మాత్రుడను, సదాశివుడనునై యున్నాను

కొంచెము దళమైనది మెత్తనిది యుండవలయును లేనిచో అడుగున ఉండు పాదమునకు నొప్పి గలుగును అట్లైన ఎక్కువసేపు ఒకే ఆసనములో ఉండుట కనుకూలముండదు కృష్ణాజినము, వ్యాఘ్రాసనము అంత అవసరము లేదు అడుగున దర్భాసనముండిన చాలును అది మిక్కిలి పవిత్రమైనది కృష్ణాజినాద్యాసనములు అహింసావ్రత పాలనమునకు భంగకర ములు అయినను శాస్త్రములో జింకచర్మము మొదలైనవి విధింపబడినవి

**తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః ।**
**ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగ మాత్మవిశుద్ధయే ।**

ఆ యాసనమునందు కూర్చుండి మనస్సును శబ్దాది విషయముల నుండి మరల్చి, నిశ్చలమైన దానినిగాజేసి, చిత్తము యొక్కయు, ఇంద్రియ ముల యొక్కయు వ్యాపారమును మాని ఆత్మశుద్ధికొఱకు ధ్యానయోగ మును చేయవలయును

"యోగమాత్మవిశుద్ధయే" అని చెప్పుటవల్ల ఆత్మశుద్ధి కొఱకే యీ యోగసాధన చేయుచున్నామని తలంచవలయును అంతేగాని మఱియొక సిద్ధిని, మహిమను సంపాదింపవలయునని తలంపు ఉండరాదు అంతః కరణములోగల రాగద్వేషములు, విషయవృత్తి, రజస్తమోగుణముల శాంతి గలుగవలయును అట్లు ఆత్మశుద్ధి గలుగనిచో ఎన్ని మహిమలు గలిగి యుండినను, సాధకునికి శాంతియు, ప్రసన్నతయు, శాశ్వత సుఖమగు మోక్షమున్ను గలుగదు

**సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।**
**సమ్ప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥**

శరీరమును, శిరస్సును, కంఠమును సమముగా నిశ్చలముగా ధరించుచున్నవాడై, సుస్థిరుడై, భ్రూమధ్యమును చూచుచు ఇతర దిక్కుల దృశ్యములను వేటిని చూడనివాడై యుండవలయును

ఇయ్యది పైజెప్పిన యుపనిషత్తుల ననుసరించి యున్నది 'నాసికా

గ్రము" అనగా ముక్కు యొక్క అడుగు (క్రింద) భాగమనియు, భ్రూమధ్య మనియు అర్థము గలదు ముక్కు యొక్క క్రిందిభాగమును, చూచుచుండిన అది "భూచరీముద్ర" యగును పైభాగమున భ్రూమధ్యమున దృష్టి నిలిపిన అది "శాంభవీముద్ర"యగును ముందు జెప్పిన దానికన్న ఇదియే శ్రేష్ఠము ఈ రెండింటికన్న విలక్షణమైనది మఱి యొకటి గలదు అది వీటినన్నిటిని ఏది ప్రకాశింపజేయుచున్నదో అట్టి ఆత్మభావమందు నిలుకడ గలిగి యుండుటయే యగును అయితే అది మొట్టమొదట గలుగదు పుష్పము లోపల ఉండుకాయ పుష్పదళములచే ఆవృతమై యుండును, పుష్పము వికసించి పుష్పము యొక్క రేకులు వదలి పోవునపుడు కాయ గోచరించును తామర పుష్పము మొదలగు వానిని చూడుడు కావున ఇదివరలో చెప్పిన స్థానములలో మనస్సు నుంచి ధ్యానము చేయుచు రాగా రాగా హృదయము వికసించి సంకల్పములను ఆవరణములు తొలగునపుడే జ్ఞేయబ్రహ్మమగు ఆత్మసాక్షాత్కారజ్ఞాన ముదయ మగును

**యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః ।**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥**

యోగము నభ్యసించువాడు నియమింపబడిన మనోబుద్ధీంద్రియ ములు గలవాడును, ఆశ లేనివాడును, అనగా దేనినీ కోరని వాడును, దేనినీ సంపాదించుటయందిచ్ఛ లేనివాడును, ఏకాంత స్థలమునం దొంటరిగా నున్న వాడునునై యెల్లపుడు మనస్సును ఆత్మయందు లయపరుపవలయును

దీనియందు "ఏకాకీ" అని ప్రయోగించుటవల్ల ఒకగదియందు గాని, గుహయందుగాని ఒంటరిగా ఉండవలయును లేనిచో "వాడు ఏమి చేయుచున్నాడని, వీడుఏమి చేయుచున్నాడని"యు పరస్పరము చూచే సంకల్పము గలుగును అంతియేగాదు ఒకరు, విడిచిన శ్వాసమును, అనగా ప్రాణవాయువును మఱియొకరు పీల్చవలసి యుండును, అది ఆరోగ్యమ నకు భంగకరము మఱియు ఆహారలోపముచే కొందరికి అపానవాయువు

ASWATA

గూడ వెడలెడు స్వభావము ఉండును అదియు నిశ్చలత్వమునకు, ఏకాగ్రతకు భంగకరము ఇకను దీనియందు “నిరాశీర పరిగ్రహః’ అని ప్రయోగింపబడినది ఆశయు, పరవస్తు పరిగ్రహ బుద్ధియు కూడదని తెలుపబడినది ఇదియోగికి నుండవలసిన లక్షణము పరవస్తు పరిగ్రహముచే తన పుణ్యము క్షయించుటయే గాక, యెవరి నుండి గ్రహించి తిమో వారి పాపము గూడా వచ్చి చేరును ఇట్టి వాడు త్వరలో అభివృద్ధి జెందుట ప్రయాస అయితే తగిన ధనము లేనిచో తన అనుష్ఠానమునకు భంగము గలుగని పరవస్తువును పరిగ్రహించవచ్చును అపుడు గూడ జాగ్రత్త గలిగి భోగపరుడుగాక యోగపరుడై యుండులాగున చూడవలయును ఈ సత్యమును ఇపుడు చాలా మంది మరచిపోయిరి అట్లు కానిచో సర్వసంగ పరిత్యాగులై నిష్ఠ జేయు విరక్తులకున్ను, నిర్ధనులై అధ్యయనముజేయు బ్రహ్మ చారులకున్ను జరుగదు

**ప్రశాన్తాత్మా విగత భీర్బ్రహ్మచారిర్వతే స్థితః ।**
**మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥**

ప్రశాంతమైన యంతఃకరణము గలవాడును, భయము లేనివాడును, బ్రహ్మచర్యవ్రతమం దుండువాడును, మనస్సును విషయముల మీదికి పోనీ యక నాయందే లగ్నమొనర్చిన చిత్తము గలవాడును, నేనే పరమగతి యని నమ్మకముగల వాడునునై యుండవలయును

‘బ్రహ్మచారివ్రతే స్థితః’ అనుటవల్ల సాధకులకు బ్రహ్మచర్య వ్రతమున్ను ఒక లక్షణముగా చెప్పబడినది తైలము నశించిన దీపము ఆరి పోవునట్లు, బ్రహ్మచర్యవ్రతము చెడిన ప్రజ్ఞ నశించును పైరు పండువరకు జలము అనుకూలముగా లేనిచో సరిగా నెటుల పండదో అట్లు బ్రహ్మ చర్యము లేనిచో జ్ఞాన ఫల ప్రాప్తియు లోపించును ‘క్రూడాయిల్’ క్షీణించిన యంత్రము ఏలాగున నడవజాలక నిలిచిపోవునో అట్లు బ్రహ్మచర్య లోపము గలవాని కాయిక మానసిక శక్తియు క్షీణించును

**యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః ।**
**శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥**

మనోనియమముగల యోగి పై జెప్పబడిన ప్రకారము ఎల్లపుడు ఆత్మను పరమాత్మయందైక్యపరచి ధ్యానించెడు అలవాటు గలవాడై, బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానమే అంత్యముగా గలదియు, నాయందున్నట్టిదియునగు ప్రకృతి శమించిన, పరమశాంతిని పొందుచున్నాడు

ఇదివరలో తెలిపిన అనుష్ఠానము యొక్క ప్రయోజనము "బ్రహ్మ నిర్వాణ ప్రాప్తి'' యని గ్రహించునది, వేదాంతులు చెప్పెడు బ్రహ్మప్రాప్తియు, శ్రీ బుద్ధదేవుడు చెప్పిన నిర్వాణమున్ను ఒకటియేయని గ్రహించవలయును ఆవరణ రహితమగు బ్రహ్మప్రాప్తియే నిర్వాణమనబడును

పై ఉపనిషత్తు ఏలాగున ఖండధ్యానము ప్రారంభించి అఖండములోనికి వెళ్ళిపోయినదో ఇచ్చటను ఆలాగున ఖండ ధ్యానముచే అఖండము గలుగునని నిరూపింపబడినది భ్రమరముచే గూటిలో పెట్టబడిన క్రిమి భ్రమరమును భావించి భావించి యేలాగున కీటకత్వమును వీడి, భ్రమర రూపముతో బయటికి వచ్చునో, ఆలాగున ఖండధ్యానమును నిరంతరము చేయగా చేయగా అఖండాకార స్థితి గల్గును

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥**

ఏ పురుషుడు సకల భూతములందును నన్ను జూచుచున్నాడో సకల భూత సముదాయమును నాయందు జూచుచున్నాడో, అట్టి వానికిని, నాకును భేదము లేదు కనుక వానికి నేను కనపడకపోను, నాకు వాడుకనబడక పోడు

ఇదియే అఖండాకారస్థితి యగును అన్నిటిలోగల ఆత్మయు తన యాత్మయు ఒకే ఈశ్వరస్వరూపమని బోధ గలుగుటయే బ్రహ్మాకారవృత్తి యగును

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వ ర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥**

సర్వభూతాంతరాత్ముడనగు నన్ను ఎవడు ఏకాత్మజ్ఞానము గలవాడై సేవించుచున్నాడో (ధ్యానించుచున్నాడో) అట్టి ధ్యానయోగి యెల్లపుడున్ను పనులు చేయుచుండినను నాయందుండువాడే యగుచున్నాడు

అట్టి ఆత్మవేత్త గృహము నందున్నను, వనమందున్నను, సన్న్యాసియైనను, గృహస్థుడైనను, మౌని యైనను, జనులకు ధర్మబోధ జేయువాడైనను, సమానుడే భేదము లేదు అని శ్రీకృష్ణభగవానుడు తెలిపెను



# భగవద్గీతా సిద్ధాంతమేమి?

ఇది అంత తేలికగా ఒకే మాటలో చెప్పు విషయము కాదు అయినను వారి వారి ఆత్మవిశ్వాసము ననుసరించి ఒక్కొక అభిప్రాయము చెప్పుదురు జ్ఞాన యోగమే గీతా సిద్ధాంతమని శ్రీశంకరులును, భక్తియోగమే శ్రీకృష్ణమతమని శ్రీరామానుజులున్ను, వర్ణాశ్రమముల ననుసరించి ప్రవర్తించుటయే శ్రీకృష్ణావతారము యొక్క ముఖ్యాశయమని శ్రీమధ్వాచార్యులున్ను చెప్పుదురు దీని ననుసరించి ఆ యా మతానుయాయులు తమ తమ బుద్ధిని, విద్యను, యుక్తిని ఉపయోగించి చెప్పుచూవచ్చిరి వచ్చుచున్నారు అట్లే కర్మయోగ సిద్ధాంతమే శ్రీకృష్ణాశయమని తిలక్ మహాశయుడున్ను, అనాసక్తి యోగమే శ్రీకృష్ణాభిమతమని గాంధీగారున్ను వచించిరి పైజెప్పిన వాటికన్నిటికిని కావలసిన ప్రమాణములను వారు నిరూపించిరి, గీతలోనే పై ఉదాహరించిన వాటికన్నింటికి కావలసిన వాటికన్న ఎక్కువ ప్రమాణములు గలవు

ద్వితీయాధ్యాయమున సాంఖ్యయోగము, తృతీయాధ్యాయమున కర్మయోగము, చతుర్థాధ్యాయమున జ్ఞానయోగము, షష్ఠాధ్యాయమున ధ్యాన

యోగము, అష్టమాధ్యాయమున అక్షర పరబ్రహ్మయోగము, ద్వాదశాధ్యాయమున భక్తియోగము, చతర్దశాధ్యాయమున గుణత్రయ విభాగయోగము, అష్టాదశాధ్యాయమున మోక్షసన్న్యాస యోగము మొదలగు పదునెనిమిది యోగములను శ్రీకృష్ణభగవానుడు తెలిపెను ఏదో ఒకటి రెండు యోగములను, ధర్మములను చెప్పినచో గీతకు నింత గొప్పదనము గలుగదు శ్రీకృష్ణభగవానుడు సర్వజ్ఞుడని, ప్రజ్ఞావంతులకు నమ్మకమున్ను ఉండదు ఈ పదునెనిమిది మార్గములు గంగానది మొదలగు పుణ్యానదులని మనము గ్రహింపవలయును నగులన్నిటికిని సముద్ర మేలాగున గమ్య స్థానమైయుండునో ఆలాగున పై జెప్పిన మార్గములన్నియు ఒక్క జ్ఞానమందే పరిసమాప్తిని జెందుచున్నవి కావుననే సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరి సమాప్యతే! అనిచెప్పబడినది దీనికన్న పరమవాక్యమింకేమి గలదు? ఇందు వలననే ప్రతి అధ్యాయాంతమున -

"ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు" బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అముకయోగః అని నిర్ధారణ చేసి చెప్పబడెను

ఈ భగవద్గీత ఉపనిషత్సారమనియు, బ్రహ్మవిద్య యనియు యోగ శాస్త్రమనియు విశేషణములు తెలుపబడినవి, అన్నిటికిన్ని యోగమని ఉండుట వల్ల 'యోగ' శబ్దమునకు జీవేశ్వరుల ఐక్యమనియే అనేక మహనీయుల అభిప్రాయము అయితే గీతను గుఱించి మీ అభిప్రాయమేమని అనేకులు అడుగుచుందురు

'సర్వసంగపరిత్యాగియై' అరణ్యమున తపమొనర్చెడు ముని లేక యోగి లేక సన్న్యాసి యే స్థానమును లేక స్థితిని పొందునో అట్టి స్థితిని గృహస్థాశ్రమములోఉండిగాని, లేకగాని విధిప్రకారము తమ ధర్మమును నిర్వహించిన వాడు తప్పక పొందగలుగును వాడు బ్రాహ్మణుడైనను, అబ్రాహ్మణుడైనను, సన్న్యాసియైనను, గృహస్థుడైనను, స్త్రీయైనను, పురుషుడైనను భేదము లేదు అయితే పైన తెలుపబడిన అరణ్యమున తప మొనర్చెడు వారుగూడ అచ్చట తమధర్మమును చక్కగా అనుష్ఠింపవలయును లేనిచో ఏ ప్రయోజన

మున్ను పొందజాలరు ఇదే నా ఆశయము

ప్రతిరోజున్ను రాత్రి పరుండువేళ ఉదయమునుండి ఆ సమయము వఱకు తన ధర్మమును ఏ లోపములేక నిర్వహించితినా లేదా?అని మనసులో ఆలోచించుచుండవలయును ఏదేని లోపము గలిగియుండినచో మరురోజు ఆలాగున లోపము గలుగనీయక యత్నించుటయు, కలిగినచో పశ్చాత్తాప ప్రాయశ్చిత్తములచే నివృత్తి జేసికొనుచుండుటయు చేసిన చాలును వాడు ధన్యాత్ముడే మోక్షమునకు అర్హుడే సంశయము లేదు

**స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం, లభతే నరః ।**
**స్వకర్మనిరతస్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥**

మనుజుడు తన తన కేర్పడిన కర్మములందు తత్పరుడై అనుష్ఠించు నేని సిద్ధిని పొందుచున్నాడు తనకేర్పడిన కర్మయందు ప్రవర్తించువాడు ఏ ప్రకారముగా సిద్ధిని (అంతఃకరణ శుద్ధిద్వారా జ్ఞానమును) పొందుచున్నాడో ఆకర్ణింపుము

**యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥**

ఎవని వలన సమస్త భూతముల పుట్టుక, లేక సంసారానుగుణ ప్రవృత్తి గలుగుచున్నదో, ఎవనిచేత నీ సమస్త ప్రపంచము వ్యాపింపబడియున్నదో, అట్టి ఈశ్వరుని (పరమాత్మను) మనుజుడు తన కేర్పడిన కర్మముచేత ఆరాధించి సిద్ధిని అనగా మోక్షమును పొందుచున్నాడు

ఈ విధానము ఈశ్వరసృష్టిలో లేనిచో ప్రపంచ వ్యవహారమెట్లు జరుగును? వేదములను కడవరకు చదివిన బ్రాహ్మణుడైనను, లేక సర్వసంగ పరిత్యాగి యైన సన్న్యాసియైనను, తన కేర్పడిన విధిని అనగా అనుష్ఠానమును సరిగా నిర్వహింపక పోయినచో వారు శ్రేష్ఠులు కాజాలరు వీధిని ఊడ్చెడు పాకీ పనిచేయువాడు తన విధిని చక్కగా నిర్వహించినచో వీడే అధికుడు కానీ పై చెప్పినవారు శ్రేష్ఠులు గారు దేహములోగల యింద్రియములలో

నేత్రము శ్రేష్ఠమైనదైనను, నేత్రము మాత్రము తనపనిని చక్కగా నిర్వహించి కర్ణము, నాసిక, జిహ్వా, హస్తము, పాదము తమతమ పనులను నిర్వహింపక పోయి నచో, అతను ఏ సౌఖ్యమును, ఏ శాంతిని పొందగలుగును? కట్టకడపట గుహ్యేంద్రియముగాని, పాయ్వింద్రియముగాని తమతమ పనులు నీచములైన వని తలంచి సరిగా నిర్వహించక పోయినచో, అతనికి ఏ శాంతిగాని, సౌఖ్యముగాని గలుగునా! అన్ని యింద్రియములు తమతమ పనులను చక్కగా నిర్వహించినచో ఆ జీవి యెంత శాంతిని, ఆనందమును పొందు చుండును సృష్టియొక్క స్థితి యీలాగున నుండును అయితే యిది ఒక జాతికి ఏర్పడినదని తలంచక దేనికి ఎవరు అర్హుడో ఆ స్థానములో వానిని ఉంచినచో సరిగా ఉండును అట్లుగాక యోగ్యతను విచారింపక ఎవరు ఏ కులములో బుట్టిన వారు ఆ పనినే చేయవలయునని తలంచుటచేతనే లోకము దుఃఖమునకు లోబడి వచ్చినది ఇదే వర్ణాశ్రమములలో గల కీలకము శ్రేష్ఠకులములో ఒకడు జన్మించి శ్రేష్ఠగుణములు లేనిచో వాడు శ్రేష్ఠజాతిలో పుట్టినంతమాత్రముచే శ్రేష్ఠుడనియు, తక్కువ జాతిలో జన్మించి ఉత్కృష్ట గుణములు గలిగి యుండినను వాడు శ్రేష్ఠపదవికి అర్హుడు కాడని తలంచుట చేతనే లోకము సరిగా శాంతిని సౌఖ్యమును పొందక పోవుచున్నది పై జెప్పిన గుణాగుణలక్షణము ప్రపంచములో అన్ని దేశములలోను మతములలోను కనపడుచున్నది ఇపుడు భారతదేశమున ఈ సత్యమును కొనుగొని ప్రవర్తించుట ముదావహము

ఒక గృహమున అన్ని కార్యములు చక్కగా జరుగవలసియున్నచో ఒక్కొక్క శాఖలో ఒక్కొక్కరు ప్రవర్తించవలయును ఒకరు వ్యవసాయమును, ఒకరు పశుసంరక్షణను, ఒకరు కోర్టు వ్యవహారమును, మఱియొకరు గృహ కృత్యమును నిర్వహించుచుండిన ఆ కుటుంబము ఎంత సౌఖ్యముగా, ఆనందమయముగా నుండునో, అట్లుగాక అందరున్ను ఒకేపని చేయు చుండిన ఆగృహకృత్యములు ఎట్లు చక్కగా జరుగవో అట్లే వర్ణముయొక్క వివక్షతయు నుండును ఇంటిపనిగాని, ఆశ్రమకార్యముగాని ఒక్కమారు

వేరువేరుగా చేయుచున్నప్పటికిని భోజనాదులు, ఇంటి భాగములు అందరికి ఏలాగున సమానముగా నుండునో అట్లే యీ ధర్మరహస్యమున్ను ఉండును

**అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।**
**నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥**

సమస్త కర్మలందు ఆసక్తి లేనివాడును, మనోనిగ్రహము గలవాడును, దేనియందు ఆశలేనివాడునై, సర్వకర్మఫలత్యాగము చేయుటచేత, సర్వోత్కృష్టమైన నైష్కర్మ్యసిద్ధిని అనగా మోక్షమును పొందుచున్నాడు

'నైష్కర్మ్యసిద్ధి' అను గ్రంథమును కాలక్షేపము చేయువారు కొందరు గలరు వారు సర్వకర్మత్యాగమునే యెక్కువ బోధించుచుందురు అయితే సురేశ్వరాచార్యులవారు మొట్టమొదట గ్రంథారంభముననే కర్మ, భక్తి యోగములను ఎట్లు ఉపదేశించిరో, ఆ భాగమును చదివి యుండిన ఈ సంశయము గలుగదు శ్రీసురేశ్వరాచార్యులు "నైష్కర్మ్యసిద్ధి" యను గ్రంథమున, కర్మను చాలా దూరీకరించిన మాట సత్యము దానికి కారణము గలదు అది ఆదిశంకరాచార్యులవారి కాలములో సురేశ్వరాచార్యులకున్ను హస్తామలక పద్మపాదాది శిష్యులకున్ను గలిగిన అభిప్రాయభేదమే అది పెద్దగాథ. సంగ్రహముగా తెలిపెద

శ్రీ శంకరులవారు సూత్రభాష్యమునకు వార్తికము వ్రాసిన బాగుండుననియు, దానికి సురేశ్వరాచార్యులే సమర్థులనియు అంతగొప్ప పాండిత్యము గలవారు మరియెవరులేరని చెప్పినట్లున్ను, దానిని విని పద్మపాద హస్తామలక తోటకాచార్యులు శంకర భగవత్పాదులతో సురేశ్వరాచార్యులు నిజముగా వైరాగ్యము గలిగి కర్మయందు సారములేదని సన్న్యసించిన వారు కాదనియు, వాదములో ఓడిపోవుటవల్ల విధిలేక సన్న్యసించిన వారనియు, కావున వారు 'వార్తికము' వ్రాసినచో కర్మను నిస్సారముగా ప్రవచింపజాలరనియు తెలిపిరి. సురేశ్వరాచార్యులు దానిని విని కర్మను ఇంతగ దూరీకరించుటకు కారణమైనది ఈ కథను శ్రీశంకర పరంపర వారు చెప్పుదురు

**సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవద న్తి న పండితాః ।**
**ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ॥**

అవివేకులు అనగా పిల్లవారి స్వభావముగలవారు కర్మసన్న్యాసమును, నిష్కామకర్మయోగమును రెంటిని వేరువేరుగా చెప్పుచున్నారు జ్ఞానులు అట్లు చెప్పరు కర్మసన్న్యాసము, నిష్కామకర్మయోగము ఈ రెండింటిలో ఏ ఒక్కదానినైనను సరియే చక్కగా ఆచరించువాడు జ్ఞానఫలమును పొందు చున్నాడు

**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।**
**ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥**

జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులచేత పునరావృత్తి రహితమై యే మోక్షము పొందబడుచున్నదో, అట్టి మోక్షము నిష్కామకర్మయోగుల చేతగూడ చిత్త శుద్ధిద్వారా పొందబడుచున్నది కావున ఏ పురుషుడు సాంఖ్యయోగము, నిష్కామకర్మయోగము రెండును ఒక్క ఫలమునకు కారణము లగుచున్నవని తెలుసుకొనుచున్నాడో, అట్టి వాడే పరమార్థ తత్త్వమును చక్కగా తెలిసిన వాడగును



# గీతాసారము

వేదముయొక్క సారము భగవద్గీత యని విజ్ఞులమతము అట్టి భగవద్గీతలో 18-వ అధ్యాయము అన్ని అధ్యాయములయొక్క సారమని గీతార్థ మెఱింగిన తత్త్వవేత్తలు చెప్పుదురు అయితే భగవంతుడు మాత్రము పలానిది గీతయొక్క సారమని యెక్కడను నిరూపించి యుండలేదు కొందఱు తత్త్వవేత్తలు భక్తియోగమే గీతాసారమనియు, ఇక కొందఱు యోగపరాయణులు యోగమే గీతయొక్క పరమార్ధ తత్త్వమనియు, వేరు కొందఱు ఆత్మవేత్తలు జ్ఞానమే గీతయొక్క లక్ష్యమనియు చెప్పుచుందురు ఒక్కొక్క

దానికి సంబంధించిన వారలు ఒక్కొక్క అధ్యాయములోనుంచి వారు నిర్ణయించిన కర్మ, భక్తి,యోగ, జ్ఞానముల గురించి ఒక్కొక్క శ్లోకమును నిరూపించుచున్నారు అయితే అది వారివారియొక్క దృష్టికి గీతాసారమని తోచుటచే తెలిపిరేగాని భగవంతుడు మాత్రము ఇదియే గీతాసారమని నిర్ణ యించినటుల ఆ శ్లోకములలో కాన్పించదు ఇపుడు చెప్పబోయెడు వాక్యము గీతయొక్క సారమని శ్రీకృష్ణభగవానుడే తెలిపెను కావున నిది సారాతి సారమని మనము గ్రహించుకొన వలసియుండును

గీతాసారము 18-వ అధ్యాయమనియు దానిలో నిది సారాతిసార మనియు తెలుపుటలో సందేహము లేదు అయితే యిది నివృత్తి మార్గస్థు లకు, సర్వసంగపరిత్యాగులకు, బ్రహ్మనిష్ఠులకు సంబంధించినదని కొందఱు తలంచవచ్చును అయితే ప్రతి మానవునికిన్ని బంధవిముక్తి, మోక్షము, కైవల్యప్రాప్తిగదా ముఖ్యము! అది కాదని యెవరును చెప్ప సాహసించరుగదా! కావుననే శ్రీ కృష్ణభగవానుడు జ్ఞానసారము, శాస్త్రసారము, ధర్మసారము అన్నియు 17-వ అధ్యాయము వరకు చెప్పి 18-వ అధ్యాయమున మోక్షసన్న్యాసయోగమును చెప్పెను కట్టకడపట మోక్షప్రాప్తికి సన్న్యాసము కావలయుననియే శ్రీకృష్ణ మతము అయితే కేవలము దేహసంబంధ సన్న్యాసమనియే యెవరును భ్రమపడకూడదు 'సన్న్యాసము' అను పదము నకు మూడర్థములు గలవు 1 దేహసన్న్యాసము, 2 సంకల్పసన్న్యాసము, 3 ఆత్మసన్న్యాసము సత్యబుద్ధితో బంధవిముక్తి గలుగవలయునని తలంపుతో చేసెడు దేహసన్న్యాసము, సంకల్పసన్న్యాసమునకు చాలా సహాయపడును సంకల్పసన్న్యాసము ఆత్మసన్న్యాసమునకు ఎంతో ఉపకరించును శ్రీకృష్ణ భగవానుడు దేహసన్న్యాసమున కంత ఆధిక్య మీయలేదు సంకల్పసన్న్యా సమునకే ఆధిక్యము, గౌరవము నొసంగెను 'సర్వసఙ్కల్ప సన్న్యాసీ యోగా రూఢస్త దోచ్యతే' అని ఆరవ అధ్యాయములో తెలుపుటకు కారణమిదే సర్వసంకల్పములు నశించిన వాడే యోగారూఢస్థితిని అధిష్ఠింపగలడని శ్రీకృష్ణమతము అట్లుగానిచో శరీరసన్న్యాసము వేషముమాత్రమే యగును.

అందువలన మోక్షము గలుగునని తలంచినచో, రాజువేషము వేసిన వాడు రాజు కావలసియుండును అనగా భూపతి కావలసియుండును అని జనకుడు సుల భాయోగినికి తెలిపెను మనుస్మృతిలో ఈలాగున తెలుపబడినది

**యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః ।**
**యశ్చ విప్రోఽనధీయానః త్రయస్తే నామ బిభ్రతి ॥**

కొయ్యతో చేయబడిన యేనుగు, చర్మముతో (రబ్బరుతో) చేయ బడిన మృగము, అధ్యయనములేని విప్రుడు (సన్న్యాసి) - ఈ ముగ్గురున్ను కేవలము నామధారులు మాత్రమే

ఈ మనుమహర్షి వాక్యము సదా స్మరణీయము గీతాంత్యమగు అష్టాదశాధ్యాయమున మోక్షసన్న్యాసయోగమును చెప్పినట్లే పాండవులు నిర్వహించిరి శ్రీ కృష్ణవాక్యమున ప్రతిఅక్షరమును తు చ తప్పక పాలించిరి అందువల్లనే కట్టకడపట సర్వమును త్యజించి మహాప్రస్థాన పర్వమున చెప్పినటుల సర్వసంగపరిత్యాగులై వనమునకేగిరి భారతమహాప్రస్థాన పర్వ మును చదివిన ఈ సత్యము అవగాహనము కాగలదు 18వ అ 50వ శ్లోకము నుండి నాలుగు శ్లోకములచే నిది నిరూపింపబడినది

**సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే ।**
**సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ (18 - 50)**

నైష్కర్మ్యసిద్ధి పొందినవాడు బ్రహ్మజ్ఞానమే పర్యవసానమైనదియు, శ్రేష్ఠమైనదియు నగు పర బ్రహ్మమును ఏ జ్ఞాననిష్ఠచేత పొందుచున్నాడో, అట్టి పరమాత్మను పొందదగిన జ్ఞాననిష్ఠను సంక్షేపముగా నావలన వినుము

నైష్కర్మ్య సిద్ధియనగా జ్ఞాననిష్ఠయని తాత్పర్యము నిష్కామ కర్మయోగమును లెస్సగా ఆచరించి, అంతఃకరణములోగల సమస్త ప్రకృతిదోషములు, విషయవాసనలు నశించిన తరువాత శ్రీ కృష్ణభగవానుడు చెప్పిన యీ మార్గము నవలంబించవలయును 'సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా' జ్ఞానముయొక్క పరమకాష్ఠయగు స్థితిని 'సమాసేనైవ'

సంక్షిప్తముగా సంగ్రహముగా తెలిపెదనని భగవానుడు ఉపదేశించుటవలన ఇదియే గీతాసారమని తెలుపుటకు కారణమైనది అంతియేగాక యీ శ్లోకమున రెండవ పాదాన్తమున 'ఏవ' కారము ప్రయోగించుటవల్ల నిశ్చితార్థము నిశ్చయింపబడుచున్నది దీనిని గురించియే యిదివరలో తెలుపడమైనది అంతేగాక 'నిష్ఠా జ్ఞానస్య యా పరా'' జ్ఞానముయొక్క పరమకాష్ఠ అనగా అంతిమస్థితి ఏదిగలదో అదియే క్రింది మూడు శ్లోకములచేత వర్ణింపబడినది తీవ్రవిరక్తులు, బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమును పొందవలయునని తలంపు గలవారు క్రింద నిరూపింపబడు మూడు శ్లోకములను నిత్యము పఠింపవలయును

**బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాஉஉత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ (18 - 51)**

నిర్మలమైన బుద్ధిగలవాడును, ధైర్యముచే దృఢమైన మనోనిగ్రహము గలవాడును, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడు ఇంద్రియ విషయముల యందలి అభిలాషను విడిచినవాడును, రాగము, ద్వేషము, ఇష్టము, అనిష్టము, రుచి, అరుచి, స్తుతి, నింద, లాభ, నష్టములు అను ద్వంద్వములు లేనివాడై!

ఇచ్చట 'బుద్ధ్యా విశుద్ధయా' బుద్ధిశుద్ధమని చెప్పక విశుద్ధమని ప్రయోగింపబడినది. అందువల్ల యే మాత్రమేని మాలిన్యము లేకుండ నుండవలయునని యభిప్రాయము

**వివిక్తసేవీ, లఘ్వాశీ యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ (18 - 52)**

ఏకాంతవాసియు(ప్రతిబంధ రహిత ప్రదేశమందుండువాడును), కొద్ది ఆహారము గలవాడును (మితాహారము), స్వాధీనము చేసుకొనబడిన వాక్కు, కాయము, మనస్సు గలవాడును, సదా ధ్యానయోగమందాసక్తి గలవాడును, ఇహపర భోగములయందు లెస్సగా వైరాగ్యము గలవాడునునై, 'వివిక్తసేవీ'

అని చెప్పుటవల్ల కేవలము నిర్జన ప్రదేశము అరణ్యము మొదలగునది అవసరము లేదనియు, నిష్ఠకు ప్రతిబంధములేని పవిత్ర ప్రదేశము ఉండిన చాలుననియు నిరూపింపబడినది అట్లైన స్త్రీలకు, పురుషులకు, సామాన్యులకు గూడ సాధ్యపడును

'లఘ్వాశీ' అని విధించుటవల్ల ఎక్కువ ఉపవాసముగాని, దండిగా తినుటగాని పనికిరాదని గ్రహించవలయును మఱియు 'వైరాగ్యం సముపాశ్రితః' అని చెప్పుటవల్ల లెస్సగా వైరాగ్యము గలిగియుండవలయునని యభిప్రాయము, లేనిచో 'వైరాగ్యముపాశ్రితః అని చెప్పిన చాలును అట్లుగాక 'సముపాశ్రితః' అని చెప్పిరి చెరువు ఆనకట్ట మొదలగు వాటిలో ఎచటనేని స్వల్పమైన రంధ్రముండిన క్రమముగా జలము ప్రవహించి కట్టలు త్రెంచి వేయునటుల వైరాగ్యము లెస్సగా లేకపోయిన పతనము గలుగునని నిరూపింపబడినది అంతేగాక కట్టకడపటి పాదములో ఆఖరున ఈ 'వైరాగ్య' శబ్దమును ప్రయోగించుటవల్ల ఈ వైరాగ్యము పునాదివంటిదని గ్రహించవలయును ఇపుడు చెప్పినదంతయు ధ్యానయోగికి, బ్రహ్మనిష్ఠునికి కావలసిన లక్షణములు అట్టి నిష్ఠగలవానికి కూడని దుర్గుణములను గురించి క్రింద వివరించుచున్నారు రోగియైనవాడు ఔషధసేవ చేయునపుడు పథ్యము, ఇది అపథ్యమని యేలాగున వైద్యుడు అతనికి తెలుపునో, ఒకవేళ వైద్యుడు తెలుపకపోయినను రోగియైనవాడు ఏలాగున అడిగి తెలిసికొనునో, యిదియు అటువంటిదే భవరోగమునకు ఔషధసేవ జేయువాడు విరక్తుడు, బ్రహ్మనిష్ఠుడు అని గ్రహింపవలయును

**అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।**
**విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే ॥ (18 - 53)**

అహంకారమును, నేను బలవంతుడనను దురభిమానమును, గర్వమును, కామమును (దేనిని చూచినను అయ్యది కావలయునను కోరికను), కోపమును, పరవస్తువును గ్రహించుటను (దాన స్వీకారమును) విడిచి, మమ

కారము లేనివాడును, శాంతచిత్తుడైనవాడును (విషయముల నుండి యుపరతి పొందినవాడును), బ్రహ్మాత్మైక్యమును పొందుట కర్హుడగు చున్నాడు లేక బ్రహ్మలోకమందు పూజ్యుడగుచున్నాడు

దీనియందు (ముక్త్వా) అనగా త్యజించి అని చెప్పక 'విముచ్య' అని ప్రయోగించుటవల్ల నిశ్శేషముగా, ఈ శ్లోకములో జెప్పిన దుర్గుణములను విడువవలయునని భావము మఱల 'పరిగ్రహం' అని ప్రయోగించుటవల్ల పరవస్తు పరిగ్రహమునున్ను త్యజింపవలయును లేనిచో తన యనుష్ఠాన ముచే గలిగెడు పుణ్యము దాతకి చెందును దానిని తెలిసికొని సొంత ధనము లేనిచో అత్యవసరమగు దానికై మాత్రము పరవస్తువును పరిగ్రహింపవచ్చును లేనిచో సొంత ధనము లేక అధ్యయనముచేయు బ్రహ్మచారికిన్ని, సర్వసంగ పరిత్యాగియై బ్రహ్మనిష్ఠ జేయు విరక్తునికిన్ని జరుగదు

అట్లైనను తన పుణ్యములో కొంతభాగము దాతలకు చెందుచుం డును అయినను విరోధము లేదు అధ్యయన బ్రహ్మనిష్ఠలచే గలిగెడు ఫలము మహాగొప్పది అందులో తన దేహసంరక్షణ కొఱకు ఎవరినుండి పరిగ్రహించిరో, వారికి కొంచెము పుణ్యము పోయినప్పటికి కొఱత గలుగదు అయితే సరియైన పఠనము, సరియైన తపస్సు లేనిచో తమ పూర్వపుణ్యము గూడ నశించునని మఱువకూడదు కావుననే విరక్తులై బ్రహ్మనిష్ఠచేయు సాధ కుల హృదయములో మన యొక్క పిడికెడు అన్నముపడిన జన్మము తరించ గలదని తలంపుగలిగి పుణ్యాత్ములున్ను, భక్తులున్ను అట్టి మహనీయుల నాదరించుచున్నారు ఇదివరలో నిరూపించిన బ్రహ్మనిష్ఠ యొక్క ప్రయోజనమేదియో యిచ్చట తెలుపబడినది అదేమనిన! 'బ్రహ్మభూయాయ కల్పతే' అది "బ్రహ్మసాక్షాత్కారము" - 'బ్రహ్మప్రాప్తి" యని తెలిసికొనవల యును

లోకములో రాజులైనను మహారాజులైనను, సార్వభౌములైనను, మహారాణులైనను, సాధువులైనను, సన్న్యాసులైనను, విరక్తులైనను, రోగము

వచ్చినపుడు వైద్యులు చెప్పినటుల తప్పనిసరిగా పథ్యమును స్వీకరించియే తీరవలయును కొన్ని రోగములకు కఠిన పథ్యములు గూడ విధించుదురు ఏల అట్టి నిర్బంధపథ్యమును అంగీకరించవలసి వచ్చినదన రోగబాధ శమించుటకున్ను, రోగము నశించిన గలిగెడు ఆనందమును పొందుటకున్ను ఆలాగున భవరోగశాంతి కొఱకున్ను, ఆనందప్రాప్తికొఱకున్ను కొన్ని నియమములను తప్పనిసరిగా బ్రహ్మనిష్ఠులు అనుష్ఠింపవలసియుందురు పథ్యము చేయని వారు రోగము విజృంభించి దుఃఖముతో ప్రాణమును విడిచి యెటుల ఏ సద్గతియు పొందజాలక పోవుదురో నియమమును పాలింపక జిహ్వోపస్థలను అరికట్టక విహరించువానియొక్క గతియు ఈలాగుననే యుండునని విజ్ఞులు గ్రహించేది అయితే గొప్ప రోగికిగల కఠిన పథ్యములు, ఈ బ్రహ్మనిష్ఠునికి లేవు జిహ్వేంద్రియ గుహ్యేంద్రియ చపలత్వము నణచిన చాలును, ఇది ప్రయాసమైనది కాదు కావుననే శ్రీ శంకరాచార్యులు వివేకచూడామణి యందు ఇటుల చెప్పిరి

**పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా ।**
**ఆరోగ్యసిద్ధి ర్దృష్టాఽస్య నాన్యానుష్ఠితకర్మణా ॥**

వ్యాధిగ్రస్తుడు తాను స్వయముగా ఔషధమును సేవించి పథ్యముండిన యెడల ఆరోగ్యము గలుగును అట్లుగాక రోగికొఱకు నితరులు ఔషధమును సేవించి పథ్యమున్నచో రోగియొక్క రోగము కుదురునా?



# శ్రీభగవద్గీతావతరణము

గీత ద్వాపరాంతమున శ్రీ కృష్ణభగవానుడు కురుక్షేత్రమందు అర్జునునకుపదేశించినట్లే చాలమందిన్ని గ్రహించుకొనియున్నారు ఇదిన్ని ఒక విధమగు సత్యమే అయితే సృష్ట్యారంభమందు శ్రీ విష్ణుమూర్తి ఈ గీతను సూర్యభగవానున కుపదేశించినట్లున్ను, భాస్కరుండు సూర్యపుత్రుడగు

మనుమహర్షికిన్ని, మనుమహర్షి తన పుత్రుడగు ఇక్ష్వాకు మహారాజునకు బోధించినట్లున్ను, ఆలాగున ఇక్ష్వాకు వంశీయులు తమ పుత్రపౌత్రులకు పరంపరగా ఉపదేశించినట్లు శ్రీకృష్ణపరమాత్మ్మడే గీత నాలుగవ అధ్యాయమున చెప్పెను శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు ఉపదేశింపక ముందుగానే, శ్రీ భూదేవి శ్రీవిష్ణుమూర్తిని సంసారములో ఉండి జనులు గృహకృత్యములు నిర్వ హించుకొని ఎట్లు సర్వేశ్వరునియందు అనన్య భక్తి కలవారై జ్ఞానమును పొంది జీవన్ముక్తులు కాగలరని అడిగినట్లున్ను, గృహస్థాశ్రమములో నుండువారు గృహకృత్యములు నిర్వహించుకొని, గీతాపారాయణ పరులై ఉండిన దానివల్లనే ముక్తులు కాగలరనియు శ్రీవిష్ణుమూర్తి ఉపదేశించినట్లు గీతామాహాత్మ్యమున కనబడుచున్నది కావున శ్రీకృష్ణుడు కురుక్షేత్రమున ఉపదేశించుటకు ముందుగా భూదేవి తపస్సు చేసికొని ప్రపంచములోగల జనులు గీతాపారాయణముచే తరించేలాగున వరము పొందినట్లుండగా, భగవద్గీతను స్త్రీలు, బ్రాహ్మ ణేతరులు పారాయణము చేయుటకు అర్హత లేదని చెప్పువారు ఎంతవరకు గీతయొక్క మూలతత్త్వమును గ్రహించి యున్నారో తెలిసికొనవచ్చును

అయితే యిప్పుడు స్త్రీలకు, బ్రాహ్మణేతరులకు గీత చదువుటకు అర్హతలేదని చెప్పువారెవరున్ను లేరు పాతికముప్పది సంవత్సరములకు పూర్వము ఆలాగున వాగుచుండెడివారు కొందరుండిరి గాంధీమహాత్ముని దివ్యావతారమను భాస్కరోదయముచే అట్టి అంధకారమంతయు పటాపంచలైపోయినది అగ్రజాతినుండి అంత్యజాతివరకు గల స్త్రీ, పురుషులందరికిన్ని, శ్రీగాంధీగారు గీతనుపదేశించి జనులను పవిత్రులుగా నొనర్చిరి మహిళా సంఘమునకు అధ్యక్షురాలగు శ్రీభూదేవి తపస్సు చేసికొని స్త్రీ పురుషులందరికొరకు తెచ్చుకొనిన ఈ గీతాశాస్త్రమునకు స్త్రీలు అర్హులు కారని చెప్పుట ఎటువంటిదన - వివాహకాలమందు కన్యలకు తమ తల్లిదండ్రులు పసుపు కుంకుమకు ఇచ్చిన ధనముగాని, భూమిగాని భార్యలకు కాదనియు, వారికి అర్హత లేదనియు తామే అధికారులమనియు,

అర్హులమనియు చెప్పెడి కొందరు పురుషులవలె వీరున్ను ఉన్నట్లు మనము గ్రహించుకొనిన చాలును

## గీతా మాహాత్మ్యమున చూడుడు.

"ధరోవాచ"భూదేవి విష్ణుమూర్తిని అడగెనని దీనియొక్క తాత్పర్యము భగవద్గీత అన్ని గ్రంధములలోను ఈ వచనము చూడగలరు

**భగవన్! పరమేశాన! భక్తిరవ్యభిచారిణీ ।**
**ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో! ॥**

ఓ భగవంతుడా! పరమేశ్వరా! ప్రభువా! ప్రారబ్ధకర్మ ననుభవించు వానికి పరమేశ్వరునియందు అచంచలమైన భక్తి యెట్లు కలుగును?

ఈ ప్రశ్న చాల అగాధమైన అర్థముతోను, విశాలమైన భావముతోను గూడినది, భూదేవి స్త్రీ సమాజమునకు అధ్యక్షురాలైనను స్త్రీలను గురించి మాత్రమడుగలేదు ప్రత్యేకమొక జాతిని గురించిన్ని ప్రశ్నించలేదు అదే దీనిలో గల గొప్పతనము కావుననే "ప్రారబ్ధం భుజ్యమానస్య" అని మొట్ట మొదట అడుగడమైనది ప్రపంచములో జన్మమెత్తిన వారందరున్ను ప్రారబ్ధ కర్మ శేషము చేతనే పుట్టియున్నారు ప్రారబ్ధకర్మశేషము లేనిచో జన్మమే కలు గదు ఎట్టి మహాత్ముడైనను జన్మించినచో ప్రారబ్ధకర్మశేషమే అగును ఆలాగున ఎట్టి హీనావస్థలో జన్మమెత్తినను అతని ప్రారబ్ధకర్మము చేతనే ఈ విషయము విజ్ఞులకున్ను, అజ్ఞులకున్ను అనుభవములో గలదే ఓహో! భూదేవియగు తల్లికి తన బిడ్డలయందుగల ప్రేమ యేమని చెప్పవచ్చును! తల్లియొక్క ధనమునకు పుత్ర, పుత్రికలందరున్ను ఎటుల సమాన భాగస్వాములై ఉందురో, అట్లే మన అందరి మాతృ స్వరూపిణి అగు భూదేవి సంపాదించిన అక్షయజ్ఞానమగు గీతాశాస్త్రమునకును అందరున్ను సమానపాత్రులే ప్రశ్నయొక్క గొప్పతనమును తెలిసికొనియే శ్రీనారాయణ మూర్తియు సమాధానము చెప్పెను

అది గొప్పవారియొక్క లక్షణము ప్రశ్నభావమొకటి, సమాధానము దానికి సరిగాక మరియొకట్లైనచో, పప్పు అడిగిన వారికి ఉప్పుపెట్టి నట్లుండును ప్రతిభాశాలు రందరున్ను ఈ సత్యము నెరుంగుదురుగాక!

ఆదివిష్ణుమూర్తియగు భగవంతుడు చెప్పిన సమాధానము చూడుడు 'విష్ణురువాచ'' శ్రీ విష్ణుమూర్తి చెప్పెను

**ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।**
**స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥**

ఎవడు గీతా పారాయణమునందు నిరతుడై యుండునో అతడు ప్రారబ్ధకర్మ ననుభవించుచుండినను, అట్టికర్మచేత లిప్తుడు కానేరడు అంతే కాదు లోకమునందు అతడే ముక్తుడున్ను సుఖియున్ను అగుచున్నాడు, దీనికన్న పరమ ప్రమాణమేమి కావలెను? అనగా పుట్టినవారందరున్ను తరించుటకొరకే యీ గీతాశాస్త్రమును భూదేవమ్మగారు తపమొనర్చి, భగవదాజ్ఞను పొంది భూలోకమునకు తెచ్చిరి,భూదేవి ప్రశ్నయందు మగవారికనిగాని, స్త్రీలకనిగాని ప్రత్యేకించి అడుగక ప్రారబ్ధము ననుభవించువారి కందరికిని అడిగిరి స్త్రీలకనిగాని, పురుషులకనిగాని అడిగియుండినయెడల పక్షపాతము కలిగియుండును అది కలుగనీయక బిడ్డలందరిని సమానముగ చూడడమైనది ప్రశ్నయందు "ప్రారబ్ధం భుజ్యమానస్య'' అని ప్రమోగించుట వలన అదే పదమును అనగా "ప్రారబ్ధం భుజ్యమానోఽపి'' అని తీసికొని భగవానుడు సమాధానమిచ్చెను ఇదే ప్రశ్నోత్తరములయొక్క గొప్పతనము కావుననే శ్రీకృష్ణభగవానుడు తొమ్మిదవ అధ్యాయమున -

**మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥**

ఓ యర్జునా! పాప జన్మము గలవారెవరు గలరో వారున్ను, పాపులు కాని వంశములో జన్మించిన స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మొదలగు వారున్ను, గీతా పారాయణముచేసి నన్ను శరణుపొందిన సర్వోత్తమమగు మోక్షమును

పొందెదరు

స్త్రీలకు, బ్రాహ్మణేతరులకు గీతయందధికారము లేదని చెప్పినచో, మొదట తాను చెప్పినదానికి విరుద్ధము వచ్చునని తలంచియే యిచ్చట ఈలాగున స్పష్టీకరించుటకు కారణమైనది అట్లు గానిచో ఆదినారాయణ స్వరూపుడగు విష్ణువు ఈ కృష్ణుడు కాదనియు, ఇతడు యాదవకులమున పుట్టిన గొల్లకృష్ణుడనియు స్పష్టముగా నారీమణులున్ను, బ్రాహ్మణేతరులున్ను చెప్పగలరని భగవంతునకు జ్ఞాపకముండెను ఏలన మొదట కృష్ణావతార మునకు పూర్వము విష్ణుమూర్తియై ఉన్నప్పుడు భూదేవికిచ్చిన వరములకు భిన్నమగును అప్పుడు ఆ శ్రీ విష్ణుమూర్తి శ్రీ కృష్ణుడై అవతరించినవాడు కాడని పై చెప్పిన ఉభయులున్ను వాదింతురు ఒకవేళ విష్ణుమూర్తియే అవతరించినచో పూర్వము చెప్పిన దానికన్న భిన్నముగా చెప్పినచో పూర్వము చెప్పినది మరచిపోయినట్లు లోకము తలంచును

భ్రమప్రమాదాదులు జీవులకు కలుగునవేగాని, ఈశ్వరునకు భ్రమ ప్రమాదములు కలుగవు భ్రమ ప్రమాదములు బుద్ధి దోషములు, బుద్ధికి సాక్షిగనుండు పరమాత్ముడు ఎల్లప్పుడున్ను ఒకే రూపముగా నుండేవాడు అదిన్నిగాక హైకోర్టులో విధించిన దానికి భిన్నముగా క్రింది కోర్టులలో విధించిన హైకోర్టువిధి తెలియని వాడ గును అతడు న్యాయవాదుల నియ మము తెలియని వాడని లోకము తీర్మా నించును అనగా మొట్టమొదట విష్ణుమూర్తిగా నున్నప్పుడు చెప్పినదానికన్న భిన్నముగ కృష్ణావతారములో చెప్పియుండిన అదిన్ని పొరపాటుగా నుండును ఇదంతయు ఆలోచించు కొనియే శ్రీకృష్ణభగవానుడు "మాం హి పార్థ! వ్యపా శ్రిత్య" అను పై జెప్పిన శ్లోకము వచించెను మరియు

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।**
**యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥**

నేను సకల ప్రాణులయందును సమానుడను నాకు శత్రువుగాని,

మిత్రుడుగాని లేడు ఎవరైతే నన్ను భక్తిచేత సేవించుచున్నారో, అట్టివారు నాయందున్న వారగుదురు నేను వారియందుండు వాడనగుచున్నాను

ఇదిన్ని భగవానునియొక్క సమత్వమును తెలుపుచున్నది అయితే దీనియందు సామాన్యబుద్ధి గలవారొక ప్రశ్న వేయుదురు అదేమన భగవంతుడు అందరిలోను సమముగా నుండిన అందరున్ను సమానులుగా నుండవలసినదిగదా! ఈ ప్రశ్న శాస్త్రజ్ఞానము లేనివారిదని విజ్ఞులు తలంతురు గంగానది పావనమగు జలముతో గూడి సర్వజనుల పాపశాంతిని, దాహశమనమును కలుగజేయునదైనను, ఎచ్చటనో ఒకడు కూర్చుండి నా దాహశాంతిని కలుగచేయలేదు, పాపశమనమును చేయలేదని చెప్పినచో దానికేమి అర్థము! గంగానది లోనికివెళ్ళి స్నానమాచరించి, గంగాతీర్థమును పానముచేసిన ఫలము గలుగును ఆలాగుననే కల్పవృక్షము కోరినవారి ఫలములను అప్పుడే గలుగజేయునదైనను, కల్పవృక్షము దగ్గరకు వెళ్ళక యెక్కడో కూర్చుండి కల్పవృక్షమునకు కోరినవారి సంకల్పములు అప్పుడే కలుగజేయుశక్తి ఉండినచో, నాసంకల్పములు ఏల నెరవేర్పలేదని చెప్పిన వాక్యమువలె నుండును కల్పవృక్షమూలమునకు దగ్గఱకు వెళ్ళి ప్రార్థించిన ఫలించును ఆలాగుననే భగవంతునిపై భక్తిగలిగి అనుష్ఠానము గలిగి యుండిన వారికోరికలు ఫలించును కనుకనే పై శ్లోకమున 'యే భజంతి తు' అని ప్రయోగించుటకు కారణమైనది

మఱియు సిద్ధౌషధముచే ఏ రోగమునైన పోగొట్టెడు సిద్ధపురుషుడగు వైద్యుడొక డుండెనని విని యెచ్చోటనో మహారోగ పీడితుడొకడుండి, నారోగమును ఏల పోగొట్టలేదని చెప్పినచో ఆ వాక్యమునకే మైన అర్థము గలదా? అట్టిసిద్ధపురుషుని దగ్గరకు వెళ్ళి వారిచ్చిన ఔషధము సేవించి పథ్యముతో నుండిన రోగము శమించును ఆలాగుననే భగవంతుడు అందరిలోను సమముగానుండిన అందరున్ను సమానులుగా నుండవలసినది గదా అనువాక్యమునకును అంతే అర్థము భగవంతుడందరిలో సమానముగా నున్నాడు భగవంతునియందు అందఱు సమానముగా లేరు. భగవంతుని

విధి ప్రకారము ఆరాధించి ధ్యానించి భగవ దాజ్ఞప్రకారము ప్రవర్తించువానికి భవరోగము శమించును కోరికలన్నియు ఫలించును

ఇక సృష్ట్యారంభమునందే శ్రీ విష్ణుభగవానుడు గీతాశాస్త్రము నుపదేశించిన దానికి ప్రమాణము నాలుగవ అధ్యాయమున శ్రీభగవానుడుపదేశించినది చూడుడు

**ఇమం వివస్వతే యోగం ప్రో క్తవానహమవ్యయమ్ ।**
**వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥**
**ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః ।**
**స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప! ॥**

సృష్టికాలమున నేను నాశరహితమైన ఈ గీతాశాస్త్రమును సూర్యునికి చెప్పితిని, సూర్యుడు వైవస్వత మనువునకుపదేశించెను వైవస్వత మనువు ఇక్ష్వాకు మహారాజుకు బోధించెను ఓ అర్జునా! ఇట్లు సూర్యునినుండి వంశ పారంపర్యముగా ప్రాప్తమైనదియగు ఈ యోగమును ఇక్ష్వాకువు మొదలైన వారివలన రాజశ్రేష్ఠులు తెలిసికొని అనుష్ఠించుచుండిరి ఇట్లు పరంపరా ప్రాప్తమగుచు, అనుష్ఠించుచు వచ్చిన యోగము చిరకాలమునుండి చెప్పువారందరును నశించుట వలన నిప్పుడు నశించెను

**స ఏ వాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।**

పురాతనమైనట్టి యీ యోగము ఇప్పుడు నీకొరకు నాచేత చెప్పబడినది దీనిపై ఒక సందేహము కలుగవచ్చును సూర్యునినుండి పరంపరగా వచ్చుచున్న ఈ యోగశాస్త్రము నశించుటకు కారణమేమి? సమాధానము త్రేతాయుగమున క్షత్రియులనందరిని పరశురాముడు ఇరువదొక్కసార్లు వెదకి వెదకి నశింపజేసినందుచే చెప్పువారు లేకపోవుట వలన ఆ పరంపర నశించిపోయెను త్రేతాయుగమున కొంతభాగమును, ద్వాపర అంత్యము వరకు ఉపదేశించువారు లేకపోవుటచే బహుకాలమిది నశించినదని

కృష్ణభగవానుడు చెప్పెను అట్టి పురాతనమగు రాజయోగ విద్యయే ఇప్పుడు నేను నీకు ఉపదేశించు చున్నానని శ్రీకృష్ణభగవానుడు తెలుపడమైనది కావున ఆ విష్ణుమూర్తియే ఇప్పుడు శ్రీకృష్ణుడై అవతరించెనని గ్రహించుకొనవలెను అప్పుడే శ్రీభూదేవి స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారము, గీతా శాస్త్రపఠనమున కధికారము తెచ్చుకొనియున్నారు అందువలననే తొమ్మిదవ అధ్యాయ మున "స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః" అని ప్రయోగించిరి మరియు గీతామాహాత్మ్య మున చూడుడి

**మహా పాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।**
**క్వచిత్ స్పర్శం న కుర్వంతి నళినీదళమంభసా ॥**

ఎవరైతే గీతాధ్యానమును (పారాయణము) చేయుదురో వారికి కమల పత్రమునకు నీరు అంటని విధమున మహాపాపాది పాపములు కొంచెమైన అంటవు

మహాపాపములు = పంచమహాపాపములు, ఉపపాపములు = సామాన్యమైన పాపములు ఈ రెండువిధములున్ను గీతాపారాయణము చేయువారి కంటవు అనగా ఇదివరలో పైజెప్పిన పాపములు గలిగియుండిన అవి నశించి పవిత్రులగుదురని అర్థము ఇంక భక్తులకు భయమేల? పాపశమనము కొఱకేగదా! పుణ్యకర్మలు గీతాపారాయణాదులు అవి చేయ నిచో పాపమెట్లునశించునను భావము మనవారికి, సంకుచిత బుద్ధిగల పండితులకు లేకపోవుటయే గీతాశాస్త్ర మందరిలోను వ్యాపింపక పోవుటకు కారణమైనది

రోగియైనవాడు ఔషధపథ్య సేవలు చేయక రోగమెట్లు నశించునను ప్రజ్ఞ అయినను లేకపోయెను అందువలననే మనవారు మహమ్మదీయులకు, ఇంగ్లీషువారికిన్ని, పరాధీనులై, బానిసలై, స్వాతంత్ర్య రహితులైపోయిరి గాంధీగారవతరించి ఈతప్పులను కనుగొని సర్వజనులకు గీతాశాస్త్రము నుపదేశించి భారతీయులను పరాధీనమునుండి విముక్తులుగా జేసి,

స్వతంత్రులుగాజేసి స్వరాజ్యమును అనుగ్రహించెను గీతాశాస్త్ర పారాయణముచే గలిగెడు ఫలితమిట్టిదని విజ్ఞులు గ్రహింతురు గాక!

హైకోర్టునుండి అధికారము తెచ్చుకొనినవానికి క్రింది కోర్టువారు న్యాయాధిపతులు ఏమి చెప్పినను, ఎట్లు చెల్లనేరదో, ఆలాగున భూదేవమ్మ గారు సర్వజనులకు బ్రహ్మవిద్యకు, గీతాపారాయణమునకు, ఆదిపురుషు డగు విష్ణుమూర్తినుండి అధికారము తెచ్చుకొని కూర్చుండగా దానికి విరుద్ధ ముగా ఈవలనేర్పడిన శాస్త్రములుగాని, శాస్త్రులుగాని ఏమి చేయగలరు? వారేమైన పొరపాటుతో చెప్పినను ఏ లాగున వ్యర్థమై సార్థకము కాజాలదో, ఆలాగున ఏదైన శాస్త్రములలో స్త్రీ, శూద్రులకు అధికారములేదని సంకుచితు లైన పండితులు చెప్పిన వారిని గురించి లక్ష్యము చేయకూడదు కావున సృష్ట్యారంభమునందే శ్రీవిష్ణుమూర్తినుండి అధికారము భూదేవమ్మగారు తెచ్చుకొని యున్నారు మీరందరున్ను మీతల్లియొక్క బిడ్డలే, తల్లి సొత్తుకు బిడ్డలు అధికారులు కారా! భగవద్వాక్యమునందు విశ్వాసముంచుడు



# బ్రహ్మనిర్వాణము

**ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి ।**
**స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ॥**

ఓ అర్జునా! ఇది బ్రహ్మ సంబంధమైన నిష్ఠ. ఈ నిష్ఠను పొందిన మరల మోహము నొందడు ఈ నిష్ఠయందు అంత్యకాలమందైన నుండిన యెడల మోక్షమును పొందుచున్నాడు

గీత ద్వితీయాధ్యాయము సాంఖ్యయోగమును, అనగా సన్న్యాస యోగ మును ఉపదేశించినది, సామాన్యముగ సాంఖ్యయోగము కపిలమహర్షి సిద్ధాంతము ఇరువది నాలుగు తత్త్వములను శోధించి దానికి విలక్షణమై

యుండు ఆత్మస్వరూపమును నిర్ణయించుచున్నది ప్రకృతి గుణముల త్యజించి సాక్షిచైతన్యమగు ఆత్మలో నిలకడ పొందుటయే సాంఖ్య సిద్ధాంతము, అదే మోక్షము ఈ సాంఖ్యమును ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతులందరున్ను, ఇతర ఆస్తికమతస్థులందరున్ను అంగీకరించి యున్నారు ఈ అధ్యాయమున 54-వ శ్లోకమున స్థితప్రజ్ఞుని, యోగారూఢుని, ఆత్మజ్ఞాని యొక్క లక్షణములను అర్జునుడడిగెను 55-వ శ్లోకమునుండి అధ్యాయాంతము వఱకు 17 శ్లోకములచేత శ్రీ కృష్ణభగవానుడు ఆ తత్త్వమునే ఉపదేశించెను బ్రహ్మనిష్ఠులు ఈ స్థితప్రజ్ఞుని యొక్క లక్షణములను ముఖ్యముగ గ్రహించుకొనవలసియుండును విరక్తులకు, ఆత్మనిష్ఠులకు దీనికి మించినది భగవద్గీత యందు మఱియొకటి లేదు బ్రహ్మనిష్ఠులందరున్ను ఈ భాగమును నిత్యము ఒక విధిగా పారాయణము చేయుచుందురు శ్రీ గాంధీ గారు కూడ ఈ శ్లోకములను ఒక చిన్నపుస్తకముగా ఏర్పాటుచేసి నిత్యము పారాయణ చేయుచుండిరి సాంఖ్యయోగమే మిక్కిలి సారమనియు, దానిలో స్థితప్రజ్ఞుని లక్షణము సారాతిసారమనియు తెలియవలెను విజ్ఞులు ముఖ్యముగ వైరాగ్యపురుషులు దీనిని గ్రహించుకొనవలయును ఈ అధ్యాయాంతమున దీనిని భగవానుడు తెలుపుటలో ఏదో ఒక నిగూఢతత్త్వము ఇమిడి యుండునని భక్తులు, సాధువులు గ్రహించుకొన వలయును

శ్రీ మద్భాగవతమున శుకబ్రహ్మర్షి పరీక్షిన్మహారాజున కేడురోజులుపదేశించి జీవన్ముక్తునిగా జేసి బ్రహ్మలోకప్రాప్తిని కలుగజేసెను మఱియు ఈ భాగవతముననే రెండు ఘడియల లోపల ఖట్వాంగ మహారాజు నారాయణస్మరణముచే భగవత్ప్రాప్తిపొందినట్లు కథ గలదు ఈ గీతా శాస్త్రమున అంతమాత్రము కాలము అవసరము లేదనియు, 'స్థిత్వాఽస్యామంత కాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి' అని ఉపదేశించెను అంత్య కాలమనగా ప్రాణప్రయాణ కాలమాసన్న మగునప్పుడైనను, లేక, వార్ధక్య కాలమందైనను, బ్రహ్మనిష్ఠులు బ్రహ్మభావనలో, భగవద్భక్తిలో, భగవచ్చింతనలో ప్రవేశించినను మోక్షము కలుగునని భావము ఇది వృద్ధులపై, ముఖ్యముగ

ముసలమ్మలపై కరుణకలిగి శ్రీ భగవానుడు ఉపదేశించడ మైనది అట్లయిన పొందెడు స్థితి సామాన్యమైనది కాదు బ్రహ్మనిర్వాణమని భగవానుడు దాని మహిమను గుఱించి ఉపదేశించెను బుద్ధుడు చెప్పిన నిర్వాణము, శంకరుడుపదేశించిన బ్రహ్మాకారము, ఇతర మతస్థులు చెప్పిన భగవత్ప్రాప్తియు, మోక్షమిదియే యని విశ్వాసపరులు నిశ్చయించుకొనవలెను

చిరకాలము బ్రహ్మనిష్ఠలో, బ్రహ్మచింతనలో, భగవత్ స్మరణలో కాలము గడుపు వారికే మోక్షము ప్రయాసకరమని శాస్త్రము తెలుపుచుండగా శ్రీకృష్ణుడు ఈ మోక్షము ఇంత సులభముగ చెప్పుటకు కారణమేమని కొందరడుగుదురు దానికి సమాధాన మేమనగా-అది భగవంతునియొక్క కరుణా విశేషమనియే చెప్పవలయును ఒక సార్వభౌముడు తలంచినచో ఒక నిరుపేద వానిని గూడ అప్పుడే శ్రీమంతునిగా గాని, ఒక రాజునుగా గాని చేయవచ్చును ఆ లాగున సర్వజ్ఞుడగు సర్వేశ్వరుని కృప గలిగిన అట్టి వానిని ఒక క్షణములోనే ఆత్మజ్ఞానినిగా చేయుటలో ప్రయాసమేమియును లేదు

ఒక పర్వత బిలమందు చిరకాలముగ దట్టమైయుండు చీకటి దీపము వెలిగించినంతటనే యెటుల నశించి ప్రకాశవంత మగుచుండునో, బహు కాలమునుండి దండకారణ్యమున కట్టెలు పడి పడి కొండంతయున్నను, నిప్పురవ్వ పడినంతనే యెట్లు భస్మమై పోవుచుండునో, మరియు ఒకగదిలో బహుకాలము నుండి ఎలక్ట్రిక్ వైరున్ను, బల్బున్ను ఉండినను వెలుగక చీకటి మయముగా నుండి స్విచ్ నొక్కినంతనే ఏలాగున ప్రకాశమయ మగుచుం డునో, ఆలాగున మానవుల హృదయాంతరాళమున, పరమాత్మ వెలుగుచున్న ప్పటికిన్ని, మనస్సు దానియందైక్యము కానంతవరకు అజ్ఞాన మయమగు చీకటి యుండును దీపము వెలిగిన వెంటనే తమస్సు నశించి జ్యోతిర్మయ మగునట్లు, ధ్యానముచే మనస్సునకు పరమాత్మ యందైక్యము కలుగజేసిన వెంటనే ఆత్మజ్ఞానోదయము కలుగును ఇదే ధ్యానయోగముచే కలిగెడు ప్రయోజనము

యుండు ఆత్మస్వరూపమును నిర్ణయించుచున్నది ప్రకృతి గుణముల త్యజించి సాక్షిచైతన్యమగు ఆత్మలో నిలకడ పొందుటయే సాంఖ్య సిద్ధాంతము, అదే మోక్షము ఈ సాంఖ్యమును ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతులందరున్ను, ఇతర ఆస్తికమతస్థు లందరున్ను అంగీకరించి యున్నారు ఈ అధ్యాయమున 54-వ శ్లోకమున స్థితప్రజ్ఞుని, యోగారూఢుని, ఆత్మజ్ఞాని యొక్క లక్షణములను అర్జునుడడిగెను 55-వ శ్లోకమునుండి అధ్యాయాంతము వఱకు 17 శ్లోకములచేత శ్రీ కృష్ణభగవానుడు ఆ తత్త్వమునే ఉపదేశించెను బ్రహ్మనిష్ఠులు ఈ స్థితప్రజ్ఞుని యొక్క లక్షణములను ముఖ్యముగ గ్రహించుకొనవలసియుండును విరక్తులకు, ఆత్మనిష్ఠులకు దీనికి మించినది భగవద్గీత యందు మఱియొకటి లేదు బ్రహ్మనిష్ఠులందరున్ను ఈ భాగమును నిత్యము ఒక విధిగా పారాయణము చేయుచుందురు శ్రీ గాంధీ గారు కూడ ఈ శ్లోకములను ఒక చిన్నపుస్తకముగా ఏర్పాటుచేసి నిత్యము పారాయణ చేయుచుండిరి సాంఖ్యయోగమే మిక్కిలి సారమనియు, దానిలో స్థితప్రజ్ఞుని లక్షణము సారాతిసారమనియు తెలియవలెను విజ్ఞులు ముఖ్యముగ వైరాగ్యపురుషులు దీనిని గ్రహించుకొనవలయును ఈ అధ్యాయాంతమున దీనిని భగవానుడు తెలుపుటలో ఏదో ఒక నిగూఢతత్త్వము ఇమిడి యుండునని భక్తులు, సాధువులు గ్రహించుకొన వలయును

శ్రీ మద్భాగవతమున శుకబ్రహ్మర్షి పరీక్షిన్మహారాజున కేడురోజులుపదేశించి జీవన్ముక్తునిగా జేసి బ్రహ్మలోకప్రాప్తిని కలుగజేసెను మఱియు ఈ భాగవతముననే రెండు ఘడియల లోపల ఖట్వాంగ మహారాజు నారాయణస్మరణముచే భగవత్ప్రాప్తిపొందినట్లు కథ గలదు ఈ గీతా శాస్త్రమున అంతమాత్రము కాలము అవసరము లేదనియు, 'స్థిత్వాఽస్యామంత కాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి' అని ఉపదేశించెను అంత్య కాలమనగా ప్రాణప్రయాణ కాలమాసన్న మగునప్పుడైనను, లేక, వార్ధక్య కాలమందైనను, బ్రహ్మనిష్ఠులు బ్రహ్మభావనలో, భగవద్భక్తిలో, భగవచ్చింతనలో ప్రవేశించినను మోక్షము కలుగునని భావము ఇది వృద్ధులపై, ముఖ్యముగ

చుండెను అదే బండిలో మఱియొకడు వెళ్ళవలసి ఉండుట వలన టిక్కెట్టు ఇచ్చే సమయమున బండి దొరకునో లేదోయని, మనోబాధచే పరుగెత్తుకొని వచ్చెను ఉభయులకు ఏక సమయముననే టిక్కెట్టు లభిం చెను ఇరువురు ఏక సమయముననే ప్రయాణము చేసిరి ఇంకొక విషయము, అది పెద్ద తిరుపతి దేవాలయము వంటిది ఎల్లప్పుడు దర్శనము దొరకదు మధ్యాహ్నము 12 గంటలకు తలుపుతెరచి దర్శనము కలిగింతురు ఒకడు ఉదయము నుండి వచ్చి ఎప్పుడు స్వామి దర్శనమని దేవాలయ మేనేజరు గారిని అడిగెను మధ్యాహ్నము 12 గంటలకని చెప్పెను ఆభక్తుడు గీతాపారా యణాది, అనుష్ఠానములు చేసికొని నిర్మల మనస్సుగలవాడై, ఆ దేవాలయ శిల్పకళా వైచిత్ర్యములను చూచి ఆనందించుచు, వచ్చిన భక్తుల భజనలు చూచుకొనుచు వారితో మాట్లాడి పరమానంద భరితుడై కూర్చుండెను ఇంకొ కడు దేవదర్శన సమయమునకు దూరమునుండి పరుగెత్తుచు పరుగెత్తుచు వచ్చెను భగవద్దర్శనము ఒకే సమయమున ఉభయులకు లభించెను

ఇంకొకకథ ఒక తీర్థయాత్రికుడు ఉదయమున ఒక అన్నసత్రమునకు వెళ్ళి భోజనమెప్పుడని సత్రము మేనేజరుని అడుగగా 12 గంటలకని అతడు చెప్పెను మేనేజరు ఇచ్చిన చీటి తీసుకొని, గీతాపారాయణ, విష్ణు సహస్రనామ పారాయణ, జపము చేసికొని భోజనము దొరకునని నిశ్చల మనస్సు గలవాడై ఆ యాత్రికుడు కూర్చుండెను వేరొకడు భోజనగంట వాయించు సమయ మునకు భోజనము దొరకునాయని వ్యాకులముతో గూడి పరుగెత్తి వచ్చెను ఇద్దరికిన్ని ఒకే సమయమున తృప్తిగా భోజనము లభించెను ఇద్దరున్ను సంతృప్తులైరి శ్రీకృష్ణభగవాను డుపదేశించిన రహస్యమిది అయితే ఉభయులలోను కొంత తారతమ్యము కలదు మొదటనుండి వచ్చి కూర్చుండువానికి రైలు చిక్కును, దర్శనము లభించును, భోజనములు సిద్ధించునని విశ్వాసము గలిగి యేలాటి సందేహమును లేక వచ్చిన భక్తులతో మాట్లాడుచు దేవాలయ శిల్పకళలను చూచి ఆనందించుచుండును రెండవ వాడు బండి దొరకునా, దైవదర్శనమగునా? అన్నము లభించునా? అని

యుండు ఆత్మస్వరూపమును నిర్ణయించుచున్నది ప్రకృతి గుణముల త్యజించి సాక్షిచైతన్యమగు ఆత్మలో నిలకడ పొందుటయే సాంఖ్య సిద్ధాంతము, అదే మోక్షము ఈ సాంఖ్యమును ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతులందరున్ను, ఇతర ఆస్తికమతస్థు లందరున్ను అంగీకరించి యున్నారు ఈ అధ్యాయమున 54-వ శ్లోకమున స్థితప్రజ్ఞుని, యోగారూఢుని, ఆత్మజ్ఞాని యొక్క లక్షణములను అర్జునుడడిగెను 55-వ శ్లోకమునుండి అధ్యాయాంతము వఱకు 17 శ్లోకములచేత శ్రీ కృష్ణభగవానుడు ఆ తత్త్వమునే ఉపదేశించెను బ్రహ్మనిష్ఠులు ఈ స్థితప్రజ్ఞుని యొక్క లక్షణములను ముఖ్యముగ గ్రహించుకొనవలసియుండును విరక్తులకు, ఆత్మనిష్ఠులకు దీనికి మించినది భగవద్గీత యందు మఱియొకటి లేదు బ్రహ్మనిష్ఠులందరున్ను ఈ భాగమును నిత్యము ఒక విధిగా పారాయణము చేయుచుందురు శ్రీ గాంధీ గారు కూడ ఈ శ్లోకములను ఒక చిన్నపుస్తకముగా ఏర్పాటుచేసి నిత్యము పారాయణ చేయుచుండిరి సాంఖ్యయోగమే మిక్కిలి సారమనియు, దానిలో స్థితప్రజ్ఞుని లక్షణము సారాతిసారమనియు తెలియవలెను విజ్ఞులు ముఖ్యముగ వైరాగ్యపురుషులు దీనిని గ్రహించుకొనవలయును ఈ అధ్యాయాంతమున దీనిని భగవానుడు తెలుపుటలో ఏదో ఒక నిగూఢతత్త్వము ఇమిడి యుండునని భక్తులు, సాధువులు గ్రహించుకొన వలయును

శ్రీ మద్భాగవతమున శుకబ్రహ్మర్షి పరీక్షిన్మహారాజున కేడురోజులుపదేశించి జీవన్ముక్తునిగా జేసి బ్రహ్మలోకప్రాప్తిని కలుగజేసెను మఱియు ఈ భాగవతముననే రెండు ఘడియల లోపల ఖట్వాంగ మహారాజు నారాయణస్మరణముచే భగవత్ప్రాప్తిపొందినట్లు కధ గలదు ఈ గీతా శాస్త్రమున అంతమాత్రము కాలము అవసరము లేదనియు, 'స్థిత్వాఽస్యామంత కాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి' అని ఉపదేశించెను అంత్య కాలమనగా ప్రాణప్రయాణ కాలమాసన్న మగునప్పుడైనను, లేక, వార్ధక్య కాలమందైనను, బ్రహ్మనిష్ఠులు బ్రహ్మభావనలో, భగవద్భక్తిలో, భగవచ్చింతనలో ప్రవేశించినను మోక్షము కలుగునని భావము ఇది వృద్ధులకై, ముఖ్యముగ

అనేక ఖర్చులు చేయుచున్నది అట్లైన ఈ సంసారమెట్లు నిలచునని మీకు సందేహము కలుగవచ్చును దానికి సమాధానమేమన, నీవు ఎంతకాలము వఱకు జీవింపగలవు! ఇప్పుడో రేపో మఱియొక రోజునన్నైన ఈ దేహమును వదలి పోవలసినదే గదా! తరువాత ఈకోడలు గదా చూడవలసినదని మనస్సులో భావన చేసికొనిన యెడల మీకప్పుడు శాంతియు, సుఖము కలుగును అప్పుడు సంసారములో సుఖదుఃఖములు తెలిసికొని వారే నిర్వహింపగలరు ఈ ఉపాయము తప్ప మీకు మనశ్శాంతికి వేరే మార్గము లేదు

**వ్యాధస్యాచరణం ధ్రువస్య చ వయో విద్యా గజేంద్రస్య కా**
**కుబ్జాయాః కిము కామరూప మధికం కిం వా సుదామ్నో ధనమ్ ।**
**వంశః కో విదురస్య యాదవపతేరుగ్రస్య కిం పౌరుషం**
**భక్త్యా తుష్యతి కేవలం న చ గుణైర్భ క్తిప్రియో మాధవః ॥**

ధర్మవ్యాధునికి ఏమి ఆచరణము కలదు? ధ్రువునికి వయస్సెంత? గజేంద్రునికి విద్య ఏది? కుబ్జకు ఏమి సౌందర్యము కలదు? సుదామునకు (అనగా కుచేలునకు) ధనమెంత? విదురుని వంశమేది? యాదవపతి అగు ఉగ్రసేనునకు పౌరుషమెంత? భగవంతుడు భక్తి ఒక్కదానికే ప్రసన్నుడగునే కాని ఇతరములగు విద్య, ధనము, కులము ఈలాటి గుణములచేత సంతోషింపజేయబడెడివాడు కాడు భక్తి ఒకదాని చేతనే భగవంతుడే ప్రసన్నుడగును

గీతలో శ్రీ కృష్ణభగవానుడు తెలిపినది చూడుడు

**అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥**

ఎవడైన అంత్యకాలమందు నన్నే స్మరించుచు లేక ధ్యానించుచు, దేహమును విడిచిపోవుచున్నాడో, వాడు నా యొక్క విష్ణు స్వరూపమును లేక మోక్షమును పొందుచున్నాడు ఈవిషయమునందు కొంచెమైనను అనుమానము లేదు.

**అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః ॥**

ఇదివరలో మిగుల నిందితములగు దురాచారములు గలవాడైనను అట్టి పాప సంకల్పములు మాని, ఆత్మస్వరూపుడగు నన్ను సేవించిన యెడల, అట్టివాడు చక్కని నమ్మకము గలవాడు గనుక శ్రేష్ఠుడనియే తలంచవలెను అంతేకాదు అతడు గొప్ప సాధువనియే గ్రహించవలెను

దారుణమగు వ్యాధి గలవాడైనను దివ్యౌషధసేవచే రోగరహితుడై నపుడు అతనిని రోగిగ తలంచక మంచివాడు అయ్యెనని తలంచుకొని సమానముగ చూచెదరు ఇదే దానికి దృష్టాంతము

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।**
**కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥**

పై జెప్పిన విధముగ పాపవృత్తిని మాని భక్తిమార్గమవలంబించిన అతిత్వరగా ధర్మాత్ముడగుచున్నాడు శాశ్వతమైన పరమశాంతిని పొందు చున్నాడు (ప్రకృతి శమించిన పరమ పురుషుని అనగా పరమాత్మను పొందు చున్నాడు) ఓ అర్జునా! నాయందు భక్తిగలవాడు చెడడు- అని సభలో భేరి వాయించి రెండు చేతులు పైకెత్తుకొని ప్రతిజ్ఞ చేసి చెప్పుము ఇది విశ్వాసము యొక్క స్వభావము

**మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥**

ఓ అర్జునా! పాపజన్మము గలవారెవరెవరు గలరో వారున్ను, అట్టి వారుకాని స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులు మొదలగు వారందరును గీతా పారాయణచేసి నన్ను శరణుపొంది ధ్యానాదులు జేసిన యెడల వారు సర్వో త్తమమగు మోక్షమును పొందుదురు

ఇదే భగవద్భక్తిలో ఆత్మనిష్ఠలోగల ప్రభావము దివ్యమగు సిద్ధౌషధ

మైనచో ఎట్టి పురాతనమగు మొండి జాడ్యమునుగూడ ధ్వంసమొనర్చు నుగదా!

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే ॥**

ఎల్లప్పుడును భగవంతుడగు నాయందేకాగ్రచిత్తులును, ప్రీతి పూర్వక ముగా నన్ను భజించువారునునైన, నిరంతర ధ్యానపరులకు పరమేశ్వ రుడగు నన్ను పొందుటకు సాధనమగు నే జ్ఞానము గలుగవలెనో అట్టి దానిని గలిగించుచున్నాను

ఇదే భగవద్ధ్యానము యొక్క ప్రభావము, ఏకాగ్రబుద్ధితో ధ్యానము చేయుచు రాగా రాగా ఆత్మలోగల అనాత్మ దోషములు ఆత్మయొక్క ఆవరణములు తొలగి పోయినపుడు ఏ భగవత్ జ్ఞానము, ఏ బ్రహ్మజ్ఞానము, ఏ యోగజ్ఞానము గలిగిన మోక్షము గలుగునో, అట్టి జ్ఞానోదయమగును, వాల్మీక్యాది మహర్షులే దీనికి తార్కాణము

**తేషామేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః ।**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥**

ఎల్లప్పుడును ధ్యానముచేయు భక్తుల ననుగ్రహించుట కొఱకు, వారి అంతఃకరణమందున్నవాడనై, వారియొక్క అజ్ఞాన జన్యమైన మోహాంధ కారమును, వెలుగుచున్న జ్ఞానమనెడు దీపముచేత పోగొట్టుచున్నాను

ఇట్టి భగవద్వాక్యములో విశ్వాసము లేనివారికి శాస్త్రజ్ఞానముగాని, వేదాంతముగాని, ఏమి ఉపయోగపడును? చిరకాలమునుండి అంధకార మయమగు గహ్వరమున దీపము వెలిగించిన వెంటనే చీకటి నశించునుగదా! ఇదే దైవములో, ఆత్మలోగల విశ్వాసము యొక్క ప్రభావము



# గురువుయొక్క ఆవశ్యకత *

**అనేక జన్మ సంప్రాప్త కర్మబంధ విదాహినే ।**
**జ్ఞానానలప్రభావేన తస్మై శ్రీ గురవే నమః ॥**

ఏ గురువుయొక్క జ్ఞానమనెడు అగ్నియొక్క ప్రభావముచే శిష్యుని యొక్క అనేక జన్మములనుండి పరంపరగా వచ్చుచుండు కర్మబంధము దహింపబడునో అట్టి జ్ఞానశ్రీ శోభితుడగు గురువునకు నమస్కారము

దీనిచే జీవునియొక్క బుద్ధి గుహయందుగల యవిద్య యనగా యజ్ఞానము గురుకృపచేతనే తొలగి బంధవిముక్తి, పరమశాంతి, నిత్యసౌఖ్యము, ద్వైవానుభవము మొదలగునవి గలుగవలసి యుండునని తెలియుచున్నది పై గుణములు గలుగని కారణము చేతనే కొందఱికి 'గురువు అవసరమా? లేదా, అను ప్రశ్న ఉదయించుచున్నది - ఒక బీదవాడు వీధులలో బిక్షమెత్తు కొని దుఃఖభూయిష్ఠమగు జీవనమును గడుపుచున్నాడని తలంపుడు, అట్టివానిని చక్రవర్తిగా సింహాసనారూఢునిగా గావించి పట్టాభిషిక్తుని చేసిన ఆ సార్వభౌమపదవి గలుగజేసిన వానిపై అతనికి ఎంత కృతజ్ఞత యుండునో, ఆలాగున సంసారమను దురిత రాశిలో కించిజ్జ్ఞుడై, బద్ధుడై, దుఃఖియై యుండు జీవుని మహాకృపాళువగు గురుదేవుడు సర్వదుఃఖములను శమింప జేసి, సర్వజ్ఞునిగాను, నిత్య సుఖినిగాను స్వయం శివస్వరూపునిగాను చేసిన, నతనికి యావజ్జీవితము, కృతజ్ఞత గలిగి యుండవలయును గదా! అట్టి మహాత్ముడగు కృపామయుని ఎంత కొనియాడినను చాలునా!

చక్రవర్తి పదవి ఉపమానముగా చెప్పబడినదేగాని, సార్వభౌమ పదవి గూడ కాలాంతరమున నశించునదే శ్రీ గురువు గలుగజేసినదైన పదమన్ననో నశించునది కాదు శాశ్వతమైనది, కావున అట్టిదానిని చక్రవర్తి స్థానముతో

---

* 'ధర్మోపన్యాసములు-పంచమ భాగము'లో 'గురువు యొక్క ఆవశ్యకత' అను శీర్షిక తరువాత 'యధార్థభారతి అవతరణ కారణము తన్నామౌచిత్యము' అను శీర్షికతో ముద్రింపబడిన విషయము 'స్వబోధ సుధాకరము' అను గ్రంధములో 'విజ్ఞాపనము' అను శీర్షిక కింద ముందే ప్రకటింపబడియున్నది కాన ఇట నుండి తొలగించడమైనది (చూడు శ్రీమలయాళ సద్గురు గ్రంధావళి-రెండవ సంపుటము-పుటలు 109 - 114) (స ల )

నెట్లుదాహరింప దగును! గురువు లేనివారి జన్మము మృగప్రాయముగదా! ఆహార నిద్రాది ప్రపంచకార్యములు మృగములు గూడా నిర్వహించుచున్నవి ఆలాగున ప్రపంచ విషయములలో మాత్రము కాలము గడిపెడు జీవితము ఏమి విశేషము గలది యగును! దైవప్రాప్తి గలుగచేయుటకు గురువుకు తప్ప ఎవరికి సాధ్యపడును? ఈ పంచ భూతాత్మకమైన దృష్టి పంచ భూతములను మాత్రమే గోచరింపజేయును కాని ప్రపంచాతీతమై, అప్రాకృతమైన సత్య పథమును, ధర్మ రహస్యమును, దివ్యజ్ఞానమును, ఈ భౌతిక దృష్టి యేలాగున ప్రకాశింపజేయగలదు? అది జ్ఞాన దృష్టిచేతనే గనుగొనవలసి యుండును - మంచి వంతెన యుండిన సముద్రమును దాటుట కెంత సులభమో, ఆలాగున గురుకృప గలవారికి జనన మరణ రూప భవ సాగరమును దాటుట సుఖకరముగ నుండును గురువు లేనివారికి దాట తరము కాదు

లౌకికములగు వ్యాకరణాది శాస్త్రములను తెలిసికొనుటకు, నేర్చుటకు నిర్విషయత్వము, ఆత్మనిర్మలత్వము, ఇంద్రియనిగ్రహము, చిత్తనిరోధము గలుగవలసిన పనిలేదు బ్రహ్మవిద్యయో అటువంటిది కాదు సంపూర్ణ విషయ విరక్తియు, ఆత్మ నిర్మలత్వము, చిత్తైకాగ్రతయు, ప్రశాంతత, ప్రసన్నత, కరుణ, ఆత్మసంయమ శక్తి, దైవభక్తియున్ను గలుగవలసియుండును ఇదియే యితర విద్యలకంటె బ్రహ్మవిద్యలోగల విశేషము ఇతర విజ్ఞానాది శాస్త్రములన్నియు బుద్ధియొక్క యోగ్యతచే దెలియబడనగును అట్టి పరమ యోగ్యతను సంపాదించిన బుద్ధియో యీ బ్రహ్మవిద్యయందు ప్రవర్తింప జాలదు అచ్చటికి వెళ్ళినప్పుడు ఈ మహాప్రభావముగల బుద్ధి వట్టి జడమై పోవును బృహస్పతివలె వచించెడు వాక్కు అక్కడ మూకత్వము నొందును ఊహాపోహలను గలుగజేసెడు అతి సూక్ష్మమైన మనస్సుగూడ అచట చైతన్య రహితమై, నిర్జీవత్వము నొందును అదియే దీనిలోగల మహిమాతిశయమని తెలిసికొనుడు కనుకనే శ్రుతి - "నాయమాత్మా ప్రవచనేన లభ్యోన మేధయా న బహునా శ్రుతేన" (కఠోపనిషత్) అని చెప్పినది.

ఈ ఆత్మ లౌకిక శాస్త్రములను విశేషముగా చదివినందుచే లభించు

నది కాదు భౌతిక జ్ఞానమందు మహామేధాసంపత్తిగల బుద్ధిమంతునికిని లభ్యమగునది కాదు మహాత్ములగు వారిచే అనేకసార్లు బహు తెరంగుల శ్రవణము చేసినను లభించునది కాదు గురుకృపగల్గి నిరంతరము బ్రహ్మ నిష్ఠ చేయువానికే లభించును స్మృతియున్ను ఈలాగుననే చెప్పుచున్నది

**నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।**

భగవత్సాక్షాత్కారము సమస్తవేదములు చదివినను, తపస్సు చేసినను, దానము చేసినను, యజ్ఞము చేసినను లభించునది కాదు భగవత్కృపకు పాత్రుడైన వానికే అది లభించును అట్టి భగవత్కృప గలుగుటకు గురుకృప తప్ప గత్యంతరము లేదు

భవరోగమును నశింపచేసి జనన మరణ రహితమగు మోక్షమును, నిత్యసుఖమును, అనుగ్రహించువాడు గురువరేణ్యుడు దీనివల్ల మాతా పితరులలో భక్తి యుండకూడదని యర్థము కాదు వారిని దైవతములుగా భావించి పూజించిన మాత్రమే సద్గురు కృప గలుగుట కవకాశము సిద్ధించును మాతాపితృదైవములలో భక్తి విశ్వాసములు లేనివారికిన్ని, సత్యధర్మ నిష్ఠనుండి గోల్పోయిన వారికిన్ని ఉత్తముడగు సద్గురువు లభించడు పైజెప్పబడిన సుగుణములు లేనివారికిన్ని ఉత్తముడగు సద్గురువు లభించడు పైజెప్పబడిన సుగుణములచే పుణ్యాభివృద్ధి గల్గిన నిర్మల జీవులకు మాత్రమే పరతత్త్వమును బోధించు ఆచార్యుడు లభించును మఱియు దైవముండినను అట్టి దైవమును దెలియజేయువాడును, దైవమార్గము నుపదేశించువాడును, దైవపదవిని గలుగజేయువాడును గురుడుగదా! కావున మాతా పితృ దైవములకన్న గురుడధికతరుడు కావుననే 'గురు' శబ్దము అన్నిటికన్న అధికమైనదనియే అర్థము

దైవపదవిగదా మోక్షము! అప్పుడు గురువుకన్న దైవమధికమని చెప్పరాదా? అనవచ్చు, అట్లు చెప్పరాదు ఏలన! భూమి క్రిందిభాగమున అమృత కలశమొకటి దాగి యుండునని తలంచుడు. అది అచ్చట ఉండియు

మనకు దొరకనిచో తత్పానముచే మృత్యురాహిత్యము ఏలాగున సంభవించును? అట్టి అమృతకలశమును బయటకు తీసి యిచ్చినవాడు కదా గొప్పవాడ! అదే ప్రకారము దైవములో మనల నైక్యపరచు వాడు గురువే కనుక ఆచార్యుడే గొప్పవాడు లేక దివ్యౌషధసేవనముచే మహారోగము రహితమైనట్లు తలంపుడు అట్టి ఔషధమును మనకనుగ్రహిం చిన వైద్యుడు లేనిచో ఏమి లాభము? కనుక రోగరహితుడైనవాడు వైద్యుని స్తుతించునా? లేక మందును పొగడునా? మఱియు ఒకరి యింటి అడుగు భాగమున గొప్ప ధన నిక్షేపముండెను మట్టిక్రింద యా ధన నిక్షేపముండినను అతనికేమి సౌఖ్యము గలుగును? పాపమతడు దారిద్ర్యబాధచే దుఃఖజీవితము గడుపుచుండగా ఒక నిధిపరీక్షకుడు ఆ ధనమును వానిపై కరుణగల్గి తీసి యిచ్చెను అప్పుడు పాపము ఆ బీదగృహస్థుడు ధనమును స్తోత్రము చేయునా? లేక తీసియిచ్చిన వానిని స్తుతించునా?

ఆలాగున హృదయ గుహయందు జ్ఞానధనముండినను, జ్ఞానకలశ ముండినను గురుకృపలేనిచో దానిని మనమెట్లు బొందగల్గుదుము? కనుక గురుకృపయు ఇటువంటిదని గ్రహింపవలయును కల్పవృక్ష, కామధేను చింతామణులవంటి భగవంతుడుండినను ఆ భగవానునిలో చేర్చువారుగదా గురువులు! మఱియు భగవంతుడు కంటికి కనుపించువాడు కాడు గురువో ఆ భగవత్స్వరూపము సాకారముతో ఆవిర్భవించిన వాడనియే పరమభక్తులు తలంతురు మఱియు గురు వనుగ్రహించెడు ఆత్మపదవి కల్పవృక్ష కామ ధేను చింతామణుల వంటిది కాదు అవి కాలాంతరమున నశించెడివి ఆత్మ పదవియో నాశములేని మోక్షమని గ్రహించవలెను మహాపురుషులగు గురు వులు శిష్యుల ఆత్మలోనే పరమాత్మను చూపుదురు ప్రపంచములో భక్తుల హృదయము పరిపక్వావస్థ బొందినప్పుడు అట్టివారిని తరింప జేయుటకు నిరాకారుడగు ఆ సర్వేశ్వరుడే భక్తులపైగల పరమ కరుణతో సాకారుడై గురురూపముగ వచ్చి ఉపదేశించి జీవన్ముక్తులను చేయుచుండును మాయా విషయములలో మోహితుడై అజ్ఞాన పాశములలో చిక్కు కొని జీవత్వభ్రాంతి

గల్గియుండు ఆత్మకు (జీవునికి) బ్రహ్మోపదేశమొనర్చి మాయా మోహరూప అజ్ఞాన బంధనములనుండి నివృత్తి జేసి గురువు స్వస్వరూపమును బోధించును జీవించియుండగనే బ్రహ్మానందాంబుధిలో మునిగి తాండవము చేయువారే యధార్థమగు గురువులు గురుకృప కలిగినందుకిదే గుఱుతు

శ్రీ బుద్ధ, శ్రీ యేసుక్రీస్తు, శ్రీ మహ్మదునబి, శ్రీ శంకర, శ్రీ రామానుజ, శ్రీ మధ్వాచార్య, శ్రీ కృష్ణచైతన్యులు మొదలుగాగల లోకోద్ధారక మహాపురుషు లందరును గురూపదేశమును, గుర్వనుగ్రహమును పొందిన వారే ఆ పిమ్మటనే వారందరికి ప్రబోధశక్తి గలిగినది వారిలో ఎవరును గురూపదేశము పొందనివారు లేరు అట్టి లోకోద్ధారకులగు మహాపురుషులే శ్రీ సద్గురు పాదాక్రాంతులై పునీతులైనట్లు వారి చరిత్రల ద్వారా తెలియుచుండగా, మాయా మాలిన్యముచే గూడిన సామాన్యజీవులకు ఆత్మశుద్ధి గల్గుటకున్ను, సత్యమార్గము తెలిసికొనుటకున్ను, నిత్యపదవియగు మోక్షము నొందుటకున్ను సద్గురువు అవసరము లేదని చెప్పదగునా! బంగారము నిప్పులో ఎంత కరగబెట్టినను వెలిగారము వేయనిచో ఎట్లు కరుగదో, ఆలాగుననెంత తపస్సుగాని, యోగముగాని, విద్యగాని గలిగినను గుర్వనుగ్రహము లేనిచో ఆత్మశుద్ధి గాజాలదు మఱియు పాలు కాగబెట్టినను తోడు వేయక అనగా చేమిరి వేయనిచో ఏలాగున వెన్న వేరుపడదో, ఆలాగుననే యెంత ధ్యానము, యోగము చేసినను గుర్వనుగ్రహము లేనిచో ప్రకృతి నుండి ఆత్మవిముక్తిని జెందజాలదు ఇది ఆస్తికబుద్ధిగల వారందరి ఆశయము

**జప స్తపో వ్రతం తీర్థం యజ్ఞో దానం తథైవ చ ।**
**గురుతత్త్వమవిజ్ఞాయ సర్వం వ్యర్థం భవేత్ప్రియే! ॥**

ఓ పార్వతీ! గురు తత్త్వమును తెలియని, గుర్వనుగ్రహమును పొందని వానియొక్క జపము, తపము, వ్రతము, తీర్థయాత్ర, యజ్ఞ దానాది సర్వ కర్మలు వ్యర్థములైపోవును

ఎవడు అహంకారముచే, గర్వముచే, తపోబలముచే, విద్యామహిమచే సద్గురువు నాశ్రయించడో అట్టివాడు ఘటీయంత్రము (ఏతము బాన) వలె సంసారసాగరమున మఱల మఱల పుట్టుచు గిట్టుచుండునే గాని జన్మ రాహిత్యరూప మోక్షమును పొందజాలడు

**జ్ఞానం నాస్తి గురుం వినా ।**



# క్రమ శిక్షణ *

"న శ్రేయో నియమం వినా" నియమము వినా శ్రేయస్సు కలుగదు క్రమశిక్షణ ఉండవలయునని గొప్పవారగు శ్రీ నెహ్రూ, శ్రీ రాజేంద్ర ప్రసాద్, శ్రీ రాధాకృష్ణ మొదలగు వారే గాక సాధారణ కార్యనిర్వహణ గలవారంద రున్ను ఉపన్యాసములలో బోధించుచుందురు క్రమశిక్షణ యెట్లు కలుగును? దానికి తగిన పనిచేయుచున్నారా యని ఆలోచించు వారరుదైరి క్రమశిక్షణ విద్యార్థులకేగాక ప్రతి సంఘమువారికిన్ని అత్యవసరముగా ఉండవలసినది స్కూలులో వ్యాయామము (డ్రిల్లు) ఏలాగున క్రమబద్ధముగ తగిన మాష్టరు లచే నేర్పబడుచుండునో ఆలాగున క్రమశిక్షణయు డ్రిల్లు మోస్తరుగ ప్రతి స్కూలులోను నేర్పెడు పద్ధతి యేర్పడవలసియుండును

వ్యాయామముచే శరీరేంద్రియములకు ఎట్లు బలము కలుగునో క్రమశిక్షణచే మానవునికి మన స్సున నిర్మలత్వమున్ను, శుద్ధప్రవర్తనమున్ను ఏర్పడును వ్యాయామమువల్ల స్థూలదేహమునకు శక్తిగలిగినట్లు క్రమశిక్షణ వల్ల మానసిక శక్తియు, ఆత్మశుద్ధియు గలుగును ఈ విషయమై ప్రతి పాఠశాలలోను తగినవారిని ఏర్పాటు చేయునప్పుడే క్రమశిక్షణ ఏర్పడును

* ఈ శీర్షిక తరువాత 'ధర్మోపన్యాసములు - పంచమ భాగము'లో గల 'స్వాతంత్ర్య దిన సందేశము'అను అంశము 'శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళి - 11వ సంపుటము - ఉపదేశామృతము'లో 310 - 313 పుటలలో ముద్రింపబడియున్నదిగాన ఇచ్చటనుండి తొలగించడమైనది (స ల)

అట్లుచేయక క్రమశిక్షణ ఉండవలయునని చెప్పుచుండిన ఏమి ప్రయోజనము? ఇట్టి పద్ధతి పాఠశాలలలో లేని కారణముచేతనే యీమధ్య కాశీవిశ్వ విద్యాలయములోను, అహమ్మదాబాద్‌లోను, ఉస్మానియా యూనివర్‌సిటీలోను అట్టి విపరీత ప్రవర్త నము గలుగుటకున్ను లోకనిందకు పాలగుటకున్ను కారణమైనది

ప్రతి పాఠశాలలోను మతబోధన ఉండ వలయునని యిప్పుడిప్పుడు మనవారు తెలుసుకొనుచున్నారు మతబోధన యొక్క తత్త్వమున్ను క్రమశిక్షణయని మరువకూడదు దీనిని విస్మరించి మతమును మాత్రము బోధించిన గొప్ప లాభమేమియు గలుగదు తాను చదివి అవగాహనము చేయని విద్యను ఇతరులకు ఏలాగున చెప్పగలుగును? ఆలాగున తాను క్రమశిక్షణగలవాడయిన మాత్రమేగదా యితరులకు క్రమశిక్షణను నేర్ప గలుగును? ఇది పుస్తకముచూచి పాఠశాలలో మాష్టరులు పాఠము చెప్పు నటువంటిదిగాదు, మతతత్త్వమున్ను ఆలాంటిదే, చక్కగా తాననుష్ఠించి చెప్పినమాత్రమే విద్యా ర్థులు నడువగలుగుదురు ఇది డ్రిల్లుమాష్టరు నేర్పెడు వ్యాయామమువంటిది కాదు తాననుష్ఠించి చెప్పవలసి యుండును అప్పుడే చెప్పువారిపై వినేవారికి భయభక్తులు కలిగియుండును

మొట్టమొదట మానసిక పరివర్తనము గలుగవలయును దానికి మనః పరివర్తనము గలిగిన వాడుండవలయును, దీనికి సన్న్యాసులుగాని, వాన ప్రస్థులుగాని, నైష్ఠిక బ్రహ్మచారులుగాని ఉండిన మాత్రమే ప్రయోజనమేర్ప డును అట్టివారు దొరకకపోయిన గృహస్థాశ్రమమున ఉండేవారైనను మంచి సంస్కారజీవులుగా నుండవలయును విద్యార్థులకు బ్రహ్మచర్యమును ముఖ్యముగ బోధింప వలయును గృహస్థులు దీనిని ఎట్లు ఉపదేశింపగలరు క్రమశిక్షణ నేర్పెడు సన్న్యాసి మొదలయిన వారికి డ్రిల్లుమాష్టర్లకు గల జీతము లేకపోయినను వారికి తగిన దేహరక్షణకు ఏర్పాటు చేయవలయును, ఇట్టి క్రమపద్ధతి యొకటుండిన తగిన యతీశ్వరులుగాని, వానప్రస్థులుగాని, నైష్ఠిక బ్రహ్మచారులుగాని దొరకకపోరు శ్రీ రామకృష్ణమిషన్‌కు సంబంధించిన

సన్న్యాసులు వారి అధీనములోనుండు కాలేజీలలోను, కొన్ని యితర కళా శాలలలోను తమతమపేరట క్రమశిక్షణ విద్యార్థుల కిచ్చుచున్నారు ఆర్య సమాజములోను ఆలాగున కనబడుచున్నది అట్టి బోధకులు విద్యావంతు లుగానున్ను, తపస్సంపన్నులుగానున్ను ఉండవలసియుండును లేనిచో యూనివర్‌సిటీలోను, కాలేజీలలోను గల విద్యార్థులు గౌరవము చేయరు విద్యావంతులు దొరకుదురేకాని తపస్సంపన్నులు దొరకడ మరుదయ్యెను

పూర్వకాలమున ముఖ్యముగా వానప్రస్థులు గురుకుల మేర్పరచి బోధించుటవల్ల అట్టివారు మంచి క్రమశిక్షణ గలిగి దేహబలమున్ను, ఆత్మ బలమున్ను గలవారైయుండిరి వారు స్వారాజ్యమును నిర్వహింపశక్తి గలవారై యుండిరి ఇప్పుడు ఒకవిధముగ స్వరాజ్యమును నిర్వహించుచుండినను, స్వారాజ్యనిర్వహణము క్షయించిపోయినది ధర్మమార్గములో, జ్ఞాన మార్గములో తన దేహేంద్రియ మనస్సులను నియమించవలసియుండిన ఆత్మశక్తి గలిగియుండవలెను అది క్రమశిక్షణపై ఆధారపడియున్నది పాఠ శాలలో చదువుకొని వారివారి స్వగృహములకు వెళ్ళే వారికి ఇదికొంచెము ప్రయాసముగా తోచినను విశ్వవిద్యాలయము నుండి హైస్కూలువరకు హాస్టలులో భోజనము చేసియుండు విద్యార్థులందరికిన్ని ఈ క్రమశిక్షణను బోధించెడు వారొక్కరు తప్పనిసరిగ నుండవలయును లేనిచో ఏ కాలమున కున్ను దేశములోను విద్యార్థులు క్రమశిక్షణగలవారు కాజాలరు

మొట్టమొదట విద్యాశబ్దము యొక్క అర్థము నేర్పు వారుండవలెను విద్యా శబ్దము యొక్క అర్థమేమన దేనివల్ల అవిద్య నశించునో అదే విద్య యగును విద్యకు జ్ఞానమనికూడ అర్థము గలదు అప్పుడు దేనివల్ల అజ్ఞానము నశించునో అదే జ్ఞానమగును అట్లయిన అజ్ఞాన విషయములో నుండు వారెట్లు జ్ఞానులగుదురు? కావుననే మొదట సన్న్యాస వానప్రస్థ బ్రహ్మచర్యాశ్రమములలో గలవారు క్రమశిక్షణకర్తలని చెప్పబడెను

**విద్యయా చ యయాఽవిద్యా ప్రభయా చ యథా తమః ।**
**నశ్యతి బ్రహ్మవిద్యా షా తేజోరూపా చ నేతరా ॥**

ఏలాగున ప్రకాశము చేత తమస్సు నశించునో ఆలాగున ఏ జ్ఞానముచే అనగా విద్యచేత అవిద్య రహితమగునో అదే విద్యయొక్క స్వరూపము అది బ్రహ్మవిద్య యొక్క దానివల్ల గలుగునేగాని తక్కిన యే విద్యచేత నున్ను గలుగజాలదు కనుకనే శ్రీ కృష్ణభగవానుడున్ను గీతలో ఈ లాగున చెప్పెను "ఆధ్యాత్మవిద్యా విద్యానాం" విద్యలన్నిటిలోను ఆత్మవిద్యయే విద్యయనబడును ఏలన ఆత్మవిద్యవల్లనే అనాత్మ స్వభావము తొలగును శంకరభగవత్పాదులున్ను ఆత్మబోధయందు ఈ లాగుననే వచించిరి

**"విద్యాఽవిద్యాం నిహంత్యేవ తేజస్తిమిరసంఘవత్"**

విద్య అన్నచో ప్రకాశము అంధకారముయొక్క రాశినివలె అవిద్యను నశింపజేయుచున్నది

**కార్పణ్యదోషోపహత స్వభావః**
**పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢ చేతాః ।**
**యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే**
**శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥**

కృపణత్వము వలన గలిగిన దోషముచేత గొట్టబడిన నైజ గుణము గలవాడను గనుక యుక్తాయుక్త పరిజ్ఞానము లేనివాడనై నిన్ను అడుగుచున్నాను ఏది శ్రేయస్కరమగునని నీచేత నిశ్చయింపబడుచున్నదో దానిని నాకు చెప్పుము. నేను నీకు శిష్యుడను ఆ కారణమువల్ల నిన్ను శరణు నొందిన నన్ను శాసింపుము

కృపణత్వమనగ ప్రకృతి గుణముగలవాడనియు అజ్ఞాని యనియు తాత్పర్యము, అర్జునుని వంటి మేధాసంపత్తిగలవాడు సహా శ్రీ కృష్ణభగవానుని వల్ల సంస్కరింపబడవలసి వచ్చినపుడు సామాన్యమానవుల గుఱించిగాని

విద్యార్థుల గుఱించిగాని మరల చెప్పవలెనా! నిమ్మచెట్టు, చీని చెట్టు మొదలయిన వానికి లేఁప్రాయములో అడుగునుండి పుట్టుచుండు రెమ్మలను కోసివేయక పోయినను, సంరక్షణచేయక పోయినను అవి యేలాగున చక్కని వృక్షములై ఫలమును కలుగచేయజాలవో, సంస్కరింపబడని మానవుని యొక్క స్థితియు ఆలాగున నుండును ఒక్క బండరాతిని శిల్పి యెంత పనిచేసిన విగ్రహము కాగలుగునో అదిన్ని గ్రహించుకొనవలయును అప్పుడు ఆ రాయి విగ్రహారాధకులకు దేవుడయి పూజింపబడుచున్నది సౌధమునకు గాని, దేవాలయమునకుగాని ఒకే విధముగ నిలబెట్టియుండు రాతిస్తంభ ములు శిల్పియెంత పనిచేసి అంతయు సమానముగా చేసినాడో ఆలాగున ఇంటికి వేసియుండు సరములుగాని, త్రావులుగాని పనివాడు ఒకే రకముగ చేయవలసినప్పుడు ఎంత పనిచేయవలసివచ్చునో ఆలాగున మానవులును అంత సంస్కరింపబడినపుడే ఉపయోగపడుదురు లేనిచో వట్టి బండవలెను, మ్రానువలెను ఉందురు గురుగీతయందు గురునియొక్క లక్షణము ఈశ్వరుండు చెప్పినది చూడుడు

**చాతుర్యవాన్ వివేకీ చ అధ్యాత్మజ్ఞానవాన్ శుచిః ।**
**మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే ॥**

కార్యదీక్షగలవాడై, వివేకియై, అధ్యాత్మజ్ఞాన సంపన్నుడై, బాహ్యాభ్యం తర శుద్ధిగలవాడైన యెవని మనస్సు పవిత్రమైయుండునో వానికి మాత్రము గురుశబ్దము శోభించును అనగా వాడే గురువగును కావుననే మొదట క్రమ శిక్షణనునేర్పుటకు సన్న్యాసులను నిర్దేశించడమైనది మనుమహర్షి బ్రహ్మచారి ధర్మమును తెలిపినది చూడుడు

**సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్ ।**
**సంన్నియమ్యేంద్రియ గ్రామం తపోవృద్ధ్యర్థమాత్మనః ॥**

బ్రహ్మచారి గురుకులమున వసించుచు ఇంద్రియములను స్వాధీన ములో నిలిపి ఆముష్మికమునందలి తపోభివృద్ధికై యీ నియమములను

అనుష్ఠించవలయును

**అనేన క్రమయోగేన సంస్కృతాత్మా ద్విజశ్శనైః ।**
**గురౌ వసన్ సంచినుయాద్బ్రహ్మాధిగమికం తపః ॥**

ఈ చెప్పిన క్రమమున మానవుడు మనస్సును మెల్లగా సంస్కరించు కొన్నవాడై గురుకులమున వసించుచు ఇదివరకు చెప్పినవియు ఇక చెప్పబడునవియునగు నియమముల ననుసరించుచు వేదాధ్యయనము చేయవలయును

**యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగుప్తే చ సర్వదా ।**
**స వై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్ ॥**

ఎవనివాక్కు అసత్యాలాపాదులచే దుష్టము కాకయు, ఎవని మనస్సు రాగద్వేషాదులచే చెడకయు నిర్మలమై యుండునో అతడు వేదాంతమందు చెప్పబడిన సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వరూపమైన ఫలమును పొందును

**ఆచమ్య ప్రయతో నిత్యముభే సంధ్యే సమాహితః ।**
**శుచౌ దేశే జపన్ జప్యముపాసీత యథావిధి ॥**

ఆచమనముచేసి పరిశుద్ధుడై నిత్యము వేఱుచింత మానినవాడై రెండు సంధ్యాకాలములయందు పరిశుద్ధ ప్రదేశమున కూర్చుండి శాస్త్రప్రకారముగా గాయత్రీ మంత్రమును జపించవలయును ప్రణవమైనను, ఈశ్వర మంత్ర మైనను, నారాయణ మంత్రమైనను జపించవచ్చును

**ఆయుస్తేజో బలం వీర్యం ప్రజ్ఞా శ్రీశ్చ మహద్యశః ।**
**పుణ్యం చ మత్ప్రియత్వం చ, లభతే బ్రహ్మచర్యయా ॥**

బ్రహ్మచర్య మహిమచే పూర్ణాయువు, బ్రహ్మతేజస్సు, బలము, పరాక్రమము, అపారప్రజ్ఞ, మహత్తైన యశస్సు, గొప్ప పుణ్యము భగవత్ప్రీతి యిదంతయును సులభముగా చేకూరును మఱియు బ్రహ్మచర్యమును గురించి ఋషులు వచించినది వినుడు

**బ్రహ్మచర్యం దృఢం యస్య సాగరో గోష్పదాయతే ।**
**బ్రహ్మచర్య విహీనస్య గోష్పదం సాగరాయతే ॥**

బ్రహ్మచర్యవ్రతదార్ఢ్యము గలవానికి సాగరము గోష్పదజలము వలెను అట్టి బ్రహ్మచర్యవ్రతము లేనివానికి గోపాద జలము సముద్రమువలె కనుపించును అనగా మనో బల దుర్బలభేద మీలాగున నుండును

**బ్రహ్మచర్యవతో భీమస్సింహోఽపి శునకో భవేత్ ।**
**బ్రహ్మచర్యస్య హీనే తు శ్వా భీమస్సింహ వద్భవేత్ ॥**

బ్రహ్మచర్య వ్రతునికి భయంకరమైన సింహము కుక్కవలెను కనిపించును బ్రహ్మచర్య వ్రతహీనునకు శునకము సహా భయంకరమైన సింహమువలె గోచరించును ఇదిన్ని పై జెప్పిన విధముగ బుద్ధియొక్క ధైర్యాధైర్యములను నిరూపించుచున్నది పతంజలి మహర్షియు యోగశాస్త్రమున నిట్లు వచించిరి "బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః" దృఢమైన బ్రహ్మచర్యవ్రతము గలవానికి వీర్యలాభము గలుగును అనగా సామర్థ్యము, బ్రహ్మవర్చస్సు, ఓజస్సు గలుగును మఱియు "తై ల క్ష యే యథా దీపః నిర్వాణ మధిగచ్ఛతి"

తైలము నశించిన వెంటనే దీపమారిపోవునట్లు బ్రహ్మచర్య క్షయము గలిగినచో మానవునియొక్క ప్రజ్ఞయు నశించును పెట్రోలు క్రూడాయిలు నశించిన మోటారుకారు ఆయిల్‌యంత్రము ఎట్లు ఆగిపోవునో, శుక్లము నశించిన మానవయంత్రమగు ఈ శరీరము యొక్క శక్తియు, మానసిక శక్తియు క్షయించును స్థూలసూక్ష్మమనెడు దేహయంత్రములను ఈ బ్రహ్మచర్య తేజస్సే నడుపుచుండును ఇక ఈ విషయమై విస్తారముగా చూడదలంచువారు బ్రహ్మచర్యమను గ్రంథమును చూడుడు *



# సదుపదేశములు - I

1 సాధారణముగా, సామాన్యజనులు ముఖ్యులైన వారివద్దకు వచ్చి పోవునపుడు 'వెళ్ళివచ్చెదమని మర్యాదగా చెప్పుచుందురు వారు దీనిని గొప్ప మర్యాద అని తలంచినను ఇవి సంసారుల మాటలని విజ్ఞులు గ్రహించుకొనవలెను వేదాంత జ్ఞాన మార్గస్థులు, పరమభక్తులు, యోగులు ఆలాగున చెప్పరాదు వెళ్ళివచ్చేవారు మఱల పునర్జన్మమునకు వచ్చేవారలు, ఆత్మనిష్ఠులు దేహము వదలిపోయిన తరువాత మఱలరారు అనగా వారికి మరుజన్మము లేదు కావున పరమభక్తులు బ్రహ్మజ్ఞానులు పోయివచ్చెదమని చెప్పక వెళ్ళుచున్నామని మాత్రమే చెప్పవలెను ఆత్మానుభవము, అనన్యదైవభక్తి గలిగినవారు వారి అనుభవమునకు భిన్నముగా నుండు వాక్యములను చెప్పరు అదే దానికి గుఱుతు "న పునరావర్తతే" అని శ్రుతియు "యద్‌జ్ఞాత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ" అని స్మృతియు తెలుపుచున్నది

2 ఒక దేవాలయములో ఒక భక్తుడు వెళ్ళి దేవుని దర్శనముచేసికొని బయటకు వచ్చునపుడు దేవుని గుఱించి యీలాగున ప్రార్థన చేయుచుండెను అదేమన---

**పాపోఽహం పాపకర్మాఽహం పాపాత్మా పాపసంభవః ।**
**త్రాహి మాం కృపయా దేవ, శరణాగత వత్సల! ॥**

అని పఠించుచుండెను ఆ తరుణమున ఆదేవాలయమండపమున ఒక బ్రహ్మజ్ఞాన సంపన్నుడగు ఒక మహాత్ముడు కూర్చొనియుండెను పై జెప్పిన భక్తుడు వచ్చుచుండగ ఆ సాధుపురుషుడు అతనిని గూర్చి ఓ పాపాత్ముడా! ఓ పాపకర్మనిరతుడా! యిచ్చటకు రమ్మని పిలిచెను అత్తరి ఆ భక్తుడు కోపాక్రాంతపరవశుడై నేను పాపాత్ముడనా! ఓ భిక్షకుడా! నన్నీలాగున ఎందుకు పిలిచినావు అని అడుగగా- ఆ సాధుపురుషుడు పుణ్యాత్ముడవు, పవిత్రుడవునగు ఓ సోదరా! కోపము చేయకుము ఇప్పుడు నీవు దేవుని సన్నిధిలో "పాపోఽహం పాప కర్మాఽహం, పాపాత్మా పాప

సంభవః" అని చెప్పితివి గదా! ఆ వాక్యమునే గదా నేను చెప్పి నిన్ను పిలచితిని, మఱల నెందుకు కోపగించుకొనెదవని అడిగెను ఆ భక్తుడు కొంచెము వివేక జ్ఞానము గలవాడగుటచే పరమదయతో, మిక్కిలి ప్రేమతో కూడియుండు ఆ సాధువు చెప్పిన మాటలను కొంచెము ఆలోచింప దొడంగెను అప్పు డాసాధుమూర్తి నీ నైజస్వభావమునకు భిన్నమైన భావమును నీ ఆత్మ ఒప్పుకొనలేదు అందువల్లనే నీవు నాపైకోపము చూపితివనెను మఱియు నీ ఆత్మ పుణ్య స్వరూపము అందువల్లనే పాపీ అని పిలిచినపుడు ఆత్మకు ఇష్టము లేకుండ పోవుటకు కారణమైనదని చెప్పి ఆత్మయొక్క పుణ్యస్వరూపమును, జ్ఞానస్వరూపమును, సత్యస్వరూపమును ఎఱుక పఱచి అతనిని కృతార్థునిగా జేసెను

అయితే భక్తిమార్గములో ఆత్మను నీచముగా, హీనముగా, క్షుద్రముగా పాపిగా చెప్పే పద్ధతియుండినను జ్ఞానమార్గమట్లు చెప్పుట ఆత్మద్రోహ మనియు, అట్టివాడు ఆత్మహంతకుడనియు తెలుపును శుద్ధాత్ముడు, సత్యా త్ముడు అని నిన్ను నీవు తెలిసికొని యుండిన అశుద్ధ కార్యములో ప్రవృత్తి కలుగదు అసత్యకార్యములోను ప్రవృత్తి కలుగదు ఇదియే దీనిలో గల కీలకము, రహస్యము ఒక బ్రాహ్మణుడు తన్ను నిజమైన బ్రాహ్మణుడని జ్ఞానము గలిగియుండిన శూద్రకృత్యములలో, హీనజాతి కృత్యములలో ఎట్లు ప్రవర్తింపడో, హీనజాతిలో పుట్టినవాడైనచో తాను హీనకులములో పుట్టుటచే నీచకృత్యములుగ మద్యపానము, ప్రాణిహింసలు, చేయుటలో తప్పేమి లేదనియు అది తన కులధర్మమని తలంచి యేలాగున పై జెప్పిన కార్యము లలో ప్రవర్తించునో ఆలాగున పై జెప్పిన భావముల యొక్క స్థితి యుండు నని విజ్ఞులు గ్రహింతురు గాక! ఈ విషయమై అనేక విషయములు చెప్ప వలసి యున్నది వేదాంతశాస్త్ర ముపదేశించెడి పరమసత్యమిదియే యని గ్రహింతురు గాక!

3 పూర్వకాలమున సన్న్యాసులు బ్రాహ్మణులు భోజనకాలములో మంత్రము నుచ్చరించి దైవభావముతో మౌనముగా నుండి భుజించెడు

వారలు అందువలననే సన్న్యాసులకు, వైదిక బ్రాహ్మణులకు మాన్యములు, అగ్రహారములు, ప్రభువులును, శ్రీమంతులున్ను దానమిచ్చు చుండిరి అదెట్టిదన హోమకుండమందు అగ్నిలో హవిస్సు మొదలగు హోమద్రవ్య ములు వేదమంత్రములతో హవనముచేసిన ఎంతపావనముగా నుండునో, దైవప్రీతికరముగా నుండునో, అట్లుగాక హవిస్సును, హోమద్రవ్యములను, చెత్తచెదారము, మండునిప్పులో మంత్రహీనముగ వేసినచోనెట్లు నిష్ప్రయోజన మగునో, ఈ రెంటి భేదమును, ఈ సత్యమును భోక్తలైన వారు గ్రహించు కొనవలయును కాలక్రమముగా పైజెప్పిన విధముగా నాచరించని కారణము చేతనే యతులపై, విప్రులపై జనులకు భక్తి, విశ్వాసములు తరిగిపోయినవి

4 సామాన్యముగా పుణ్యతీర్థములలో స్నానమొనర్చినప్పుడు మంత్ర పూర్వకముగా మూడుసార్లు మునుగుదురు దీనిసారమేమన! మొదటి సారి మునుగుటవలన స్థూలదేహ సంబంధ మాలిన్యము నశించుననియు, రెండవ సారి మునుగునప్పుడు సూక్ష్మదేహ సంబంధమలములు నశించవలయు ననియు, మూడవసారి క్రుంకుటవలన కారణదేహమునందు గల మూలా విద్యాసంబంధ మాలిన్యము నశించవలయుననియు గ్రహించుకొనవల యును ప్రథమమున సంకల్పము చెప్పి స్నానము చేయుటకును, ద్వితీయ మున మౌనముగా దైవస్మరణతో స్నానము చేయుటకును, తృతీయమున కేవలము ధ్యేయాకారములో నుండి జ్ఞానులైనవారు స్నానము చేయుటకు కారణ మిదియే అట్లు చేయకపోవుట చేతనే స్థూలశరీర మాలిన్యము స్నాన ముచే తొలగునట్లు సూక్ష్మ దేహ కారణదేహముల దోషములు నశింపకపోవు చున్నవని మఱువకూడదు

5. సృష్టిలోనే నివృత్తి మార్గస్థులను, ప్రవృత్తిమార్గస్థులను ఈశ్వరుడు సృజించి యున్నాడు, అట్టివారలను మనము కండ్లార చూచియు తెలిసికొనక పోవుచున్నాము హరికథలు, జ్ఞానపరన ఉపన్యాసములు, భగవద్విషయ గ్రంథ పఠనములు జరుగుచుండు దేవాలయములలో అట్టివారిని కనుగొన వచ్చును వారలు సామాన్యముగ జెప్పిన స్థలములలో నుండు నప్పుడు కండ్ల

మూసుకొని పరమాత్మను ధ్యానము చేయుచుందురు అదేదానికి గుఱుతు దీనికే అంతర్దృష్టి అనియు, బాహ్య దృష్టి అనియు, అనాత్మదృష్టి అనియు, ఆత్మదృష్టి అనియు, స్వారాజ్యదృష్టి యనియు, స్వరాజ్యదృష్టి అనియు, దృశ్యదృష్టి అనియు దృగ్దృష్టి అనియు పేర్లు వీరు ఆత్మను (అనగా దైవమును) పొందువారనియు, ఇతరులు ప్రపంచమును (అనగా ప్రకృతిని) పొందువారనియు తెలిసికొనవచ్చును గొప్ప గొప్ప రాజకీయవేత్తలైనను లేక ప్రకృతి తత్త్వజ్ఞానులైనను సూక్ష్మాతిసూక్ష్మములగు యంత్రములను కను గొనువారైనను, గొప్ప శాస్త్రములను చదివిన మహాపండితులైనను వీరందఱు ప్రకృతినే పొందగలరు పరమ పురుషుడగు పరమేశ్వరుని చూడజాలరు శాంతిని, ఆనందమును అనుభవింపజాలరు

6 కొందరు లోపల కుయుక్తి, కపటములుంచి, పైకిమంచి తెలివిగల వారివలె మాట్లాడుచుందురు కార్యములు గూడ ఆలాగుననే చేయుదురు తాము ప్రతిభాశక్తిగలవారుగాను, కార్యనిర్వహణ మహిమ గలవారుగను తలంతురు ఇది వివేకమని వారు తలంతురేగాని అవివేకమని, పాపమని వారె రుంగరు వీరి యీ ప్రవృత్తి శరీరమంతయు వ్రణము గలిగి యుండేవారు పైకి మాత్రము శుభ్రమైన వస్త్రము ధరించి తమకు ఏలాటి కురుపులు అనగా వ్రణములు లేనివారి వలె నటించుచున్నట్లుందురు లోకము ఇదెంతవరకు నిజమని తెలుసుకొనక యుండును అని వారు గ్రహించుకొనుటలేదు శరీరములో పుండ్లు లేని వారై పైకి మాత్రము సామాన్యదుస్తులు ధరించువారే నిజముగా వివేకవంతు లగుదురు ఏలన వారు ఆరోగ్యముగాను, సుఖముగాను యావత్కాలము జీవింపగలరు ఇతరులు పైన మంచివస్త్రము వేసినను శరీరములో గల పుండ్లచే నిరంతరము బాధపడుచుందురు జీవించి యుండు వఱకున్ను దుఃఖముతోనే కాలము గడుపవలసియుండును ఈ సత్యమును మాయవల్ల జనులు తెలియ జాలకున్నారు



# సదుపదేశములు- II

## బ్రహ్మజ్ఞానమునకు సమానావకాశము

వేదముగాని, వేదజ్ఞానముగాని, భగవద్గీతగాని, ఒకజాతికి ఒకవర్ణము నకు ఒకదేశమునకు మాత్రమేర్పడినదని తలంచువారు సూర్యుడు నాకొఱకే యేర్పడినాడని, వాయువు మాకే యేర్పడెనని తలంచువారెట్టివారో అట్టివారు అట్టి వారి బుద్ధివైశాల్యమెట్టిదో, దీని వలన వారు తెలిసికొనవచ్చును ప్రత్యక్ష ముగా జూడవలసి యుండిన బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, స్త్రీలు, పురు షులు, గృహస్థులు, సన్న్యాసులు, ఇతర మతస్థులు గల ఒక మహాసభలో కూర్చుండి చూచిన ఈసత్యమును దెలిసికొనగలరు అచ్చట వాయుదేవుడు ఏ వర్ణమునకు ఏ యాశ్రమమునకు, ఏ కులమునకు, సేవజేయుచున్నాడో శాంతిని గలుగజేయుచున్నాడో గ్రహించుకొనవచ్చును ఆలాగున సభనుండి బయటకుగాని, యింటినుండి వెలుపలకుగాని వచ్చిచూచిన సూర్యభగ వానుడు తన ప్రకాశమును తనకిరణములను, ఎవరిపై ప్రసరింప జేయుచున్నాడో ఈ సత్యమును గనుగొనవచ్చును అట్లు సమానముగా సూర్యుడు, వాయువు సేవచేయుచుండినను, ఎవరి గృహమునకు గల కిటికీ తలుపులు మూయబడియుండునో అట్టి గృహములోపలికి సూర్యప్రకాశము గాని, వాయుప్రసరణముగాని యుండనిచో అది సూర్యవాయ్వాదుల పక్ష పాతము కాదు, కిటికీ తలుపులు తెరువని తన దోషమనియే గ్రహించ వలయును

## జ్ఞాన ధ్యాన యోగములకు భక్తి మూలము

మొదట ఎవరికైనను భగవద్భక్తి యుండవలయునని ప్రకృతియే యుపదేశించుచున్నది. మనుష్యులుగాని, పశువులుగాని, మొట్టమొదట తల్లులయొక్కపాలవలననే జీవించుచున్నవి తరువాత జీర్ణశక్తి బలపడిన పిమ్మట అన్నముగాని, రొట్టెగాని, పండ్లు వగైరాగాని భుజించుచుండును, పశువులైన గడ్డిగాని, ఆకులుగాని తినుచుండును. ఆలాగున భగవద్భక్తివలన వృద్ధినొందిన పిమ్మట యోగముగాని, తపస్సుగాని, జ్ఞానవిచారణగాని చేయు

చుండవలయునని ప్రకృతిమాత మనకు తెలుపుచున్నది, యావత్కాలమును పాలు త్రాగి గూడ జీవింపవచ్చును ఆలాగుననే జీవితాంతము వఱకు భక్తిచేతనే ప్రవర్తించుచు వచ్చిన అదియును ముక్తిని కలుగజేయును అయితే బాల్యావస్థలో పాలు త్రాగనిచో కృశించి పోవునట్లు భక్తిలేని జ్ఞానముచేతగాని, యోగముచేతగాని, తపస్సుచేతగాని పూర్ణత్వమును బొందజాలరు అది శుష్కవేదాంతమే యగును గృహస్థులు పురుషులైన భార్యను తన అర్ధాంగిని గాను, స్త్రీయైన భర్తను అర్ధాంగము గాను తలంచవలయును కావుననే భార్యకు అర్ధాంగి యనిపేరు అర్ధాంగియనగా తన యంగములో (శరీరములో) సగము భాగము కలవారని యర్ధము ఆలాగున స్త్రీయు తన భర్తను అర్ధాంగముగా దలచవలయును, దంపతులు ఏదైనా దైవకార్య ములు చేయునప్పుడు పురుషునియొక్క యెడమ భాగమున స్త్రీయును, స్త్రీయొక్క కుడిభాగమున పురుషుడును కూర్చొని చేయుచుండుటకు కారణము ఇదియే పురుషునియొక్కకుడిభాగము బాగుండి యెడమ భాగము బాగు లేనిచో నెట్లు సుఖమును బొందజాలడో, ఆలాగున స్త్రీయొక్క ఎడమభాగము బాగుండి కుడిభాగము బాగులేనిచో నెట్లు సౌఖ్యముగ జీవింప జాలదో ఆలాగున కుడికన్ను, కుడికాలు, కుడిచేయి బాగుండి, ఎడమకన్ను ఎడమచేయి ఎడమకాలు బాగులేనిచో ఎట్లు ఏ కార్యమైనను పురుషుడు చక్కగ చేయజాలడో, ఆలాగున స్త్రీయును ఎడమ భాగము బాగుగా నున్నను కుడి భాగము బాగుగా లేనిచో ఏ కార్యమును నిర్వహింపజాలక పోవునదేకాక శాంతి సౌఖ్యములను పొందజాలదు దీనిని జ్ఞాపక ముంచవలయును కావుననే శంకరాచార్యులు వేదవాదములో మండనమిశ్రుని జయించి నప్పుడు ధర్మ పత్నియగు ఉభయభారతి భర్తను పూర్తిగా జయింపలేదనియు, సగభాగము మాత్రమే జయింపబడినదనియు, అర్ధబాగమగు అర్ధాంగినియైన తన్నుకూడ జయించవలయుననియు వాదించినది కావున గృహస్థాశ్రమ మున నున్న దంపతులు దీనిని బాగుగా తెలిసికొనవలసినది అట్లైన మాత్రమే శాంతి సౌఖ్యములను పొందగలరు కట్టకడకు మోక్షమును గూడ పొంద

వచ్చును బాగుగా జూడుడు, పురుషుడు ఉద్యోగము, వ్యాపారము, వ్యవసాయముచేసి ధనధాన్యములను సంపాదించి యింటిలో చేర్చవచ్చును భార్య గృహములోనుండి వంట మొదలైన కార్యములు చక్కగ నిర్వహింపక పోయిన, గృహకృత్యములు లెస్సగా చేయకపోయిన నుభయులకు నేమి సుఖము గలుగును? ఈ సత్యమును దెలిసికొనిన చాలును

## సత్య మహిమ

ఎంతమంచి అద్దమయినను దానివెనుక ప్రక్క పాదరసమును పూయకపోయిన మీ ప్రతిబింబము కనపడజాలదు పాదరసము పూసినపుడే మీ ఛాయ దానియందు స్పష్టముగా కనబడగలదు ఆలాగున మీరు మంచి వంశములో జన్మించిన వారైనను, విద్యావంతులైనను, మీలో వెలుగుచుండు దైవమును చూడవలసియుండిన మీ హృదయములో సత్యమనెడు పాదరసమును పూసికొనవలయును లేనిచో ఆత్మను, ఈశ్వరుని జూడజాలరు

## శ్రద్ధావశ్యకత

శ్రద్ధగల వారికి, జాగ్రత్త గలవారికి దైవము చాలదగ్గరగా నుంటున్నది శ్రద్ధలేనివారికి, అజాగ్రత్తగల వారికి అట్టి దైవము చాల దూరముగ నుంటున్నది విమానములో ప్రయాణము చేయు వారికి, ప్యాసింజరు రైలులో వెళ్ళు వారికిని ఎంత వ్యత్యాసము గలదో ఆలాగున శ్రద్ధాళువులకున్ను, అశ్రద్ధులకున్ను మోక్షము అంత దగ్గరగాను దూరముగాను ఉండును లేక యెద్దుల బండిలో ప్రయాణము చేయువారికిన్ని, మోటారుకారులో ప్రయాణము చేయు వారికిన్ని ఎంతవ్యత్యాసము కలదో ముక్తియొక్క స్థితియు ఆలాగుననే ఉండును

## సాధువుల, సన్న్యాసుల, వర్తమానస్థితి-భావిపరిణామము

ప్రజ్ఞాశాలి ఒకరు శ్రీవారిని ఇట్లని ప్రశ్నించిరి, వర్తమానస్థితి యెట్లుం

డును? భావికాలము ఏలాగున జరుగును? అని ప్రశ్నించిరి శ్రీవారు ఈ లాగున సమాధానము చెప్పిరి త్రికాలజ్ఞానులైనవారికి సహా యీ విషయమై సమాధానము చెప్పడము ప్రయాసము త్రికాలవేదులైనవారు సహా కొన్ని భావికాల సంగతులను చెప్పగలరేమో కాని అనంతయుగ కల్పములవఱకు జరుగు విషయములు సర్వేశ్వరునికి ఒక్కరికే తెలుసును అయితే లోకము ఎట్లు జరుగునో అదిపోనిండు, సాధువులను సన్న్యాసులను గుఱించి మాత్రము చెప్పెద

1 ఇప్పుడుండు గురువులలో చాలామంది మోక్షవిషయమై పరుగెత్తి ప్రయాణము చేయువారు, 2 వీరల శిష్యులలో కొంతమంది నడుచుకొని పయనించెదరు, 3 వారి శిష్యులలో చాలామంది కూర్చుండి ప్రాకుచు ప్రయాణము చేయుదురు, 4 వారికి శిష్యులు ఏర్పడు కాలములో పండుకొని ప్రయాణము చేసి మోక్షమును పొందవచ్చునని తలంచువారుండగలరు ఇంతమాత్రము చెప్పెద

అకులీనుడైనను సజ్జనసాంగత్యముచే తపోధ్యానాద్యనుష్ఠానముల చేత పరిశుద్ధుడు కావచ్చును

ఆకాశమునందుండి వచ్చెడి వర్షజలము ఎంత స్వచ్ఛమై గొప్ప యతీశ్వరులకు, విప్రోత్తములకు హృద్యమై పానయోగ్యమై యుండునో అట్టి యుదకము మురికిగుంటలో మలిన ప్రదేశములోపడిన దానిని ఎవరున్ను ఎట్లుపయోగపరచరో, హీనముగా చూచెదరో, మానవునియొక్క స్థితియు ఈ లాగున నుండును అందఱియొక్క ఆత్మ శుద్ధమై అమృతమయమై యుండినను దుర్జనుల, మలినాత్ముల సహవాసముచేత నిందితుడై ఒకడు నీచాత్ముడుగా మారుచుండును బాహ్యమున హీనుల సహవాసమున్ను, అంతరమున మనోమాలిన్యమున్ను చేరునపుడు ఈలాగుననే యుండును అయితే అతనియొక్క గతి అంతేనా? కాదు కాదు ఎండకాలమున సూర్యకిరణము లచే మలిన ప్రదేశములో గల జలము సహా ఆవిరియై, మేఘమై,

శుద్ధమై మఱల వర్షించునపుడెట్లు పవిత్రమై పానార్హమగుచున్నదో, ఆలాగున ఎట్టి నీచాత్ముడైనను పరమేశ్వరధ్యానముచే, తపస్సుచే, శుద్ధాత్ముడగును అపుడు సర్వజనులకును ఆదరణీయుడు కాగల్గును వాల్మీకి శబర్యాదులే దీనికి తార్కాణము, విభీషణ, ప్రహ్లాదాదులు దృష్టాన్తము

కార్య నిర్వహణమున సమాన యోగ్యత అవసరము సూక్ష్మ బుద్ధిగలిగి చిత్తైకాగ్రతగలిగి యుండువారు మందబుద్ధి గలిగి జాగ్రత్తలేనివారి తో కలిసి యేదైన పనిచేయవలసి యుండినచో అది ఉభయులకున్ను చాలా బాధాకరముగానే ఉండును ఎట్లన గొడ్డలిచేత క్షౌరముచేసినచో చేసేవారికిన్ని చేయించుకొనువారికిన్ని ఏలాగున బాధగా ఉండునో, ఆలాగున సూక్ష్మబుద్ధిగలవారికి ఉండును వాడిమిగల మంగలి కత్తితో క్షౌరము చేయుచుండిన చేయువారికిన్ని చేయించుకొనువారికిన్ని ఎంత నిర్మలత్వ మున్ను శాంతియు గలుగునో అట్లే పైజెప్పిన ఉభయులున్ను సూక్ష్మబుద్ధి, చిత్తైకాగ్రత గలిగియున్నచో ఇరువురికిని శాంతి, సుఖము చేకూరును

## కుయుక్తులు, కుతంత్రములు పనికిరావు

ఓమానవుడా! కుయుక్తితోను, కుతంత్రముతోను జీవించే లాగున చూడకుము అది ఆకలితో ఉండేవాడు భోజనము చేసినట్లు, నటించున ట్లున్ను, రోగముతో నున్నవాడు ఆరోగ్యము గలవానివలె నటించునట్లున్ను ఉండునని మరువకుము భోజనము చేయక ఆకలి యెట్లు శమించును? ఔషధసేవ చేయక వ్యాధిబాధను నీవు ఎన్ని దినములు సహించుకొనగలవు? ఎప్పటికైన లోకము ఈ సత్యమును గుర్తించకపోవునా?

## పరమేశ్వరుని సర్వాంతర్యామిత్వము

ఈశ్వరుడు సర్వులలోను అంతర్యామియై యుండునది నిజమైనచో అందఱికిన్ని ఏల గోచరము కాలేదని సామాన్యముగా ప్రశ్నించెదరు బ్రహ్మతత్త్వము నెఱింగిన మహాత్ములను అడిగినచో వేదవేదాన్తశాస్త్రమును

ఏకాగ్రబుద్ధితో చదివినచో ఈ తత్త్వము అప్పుడే గోచరమై యుండెడిది రుద్రాక్షలు, తులసి, పగడము, ముత్యము, స్ఫటికము మొదలగు పూసలతోగూడిన ఒక జపమాల ఉన్నదని భావింపుడు వాటి అన్నిటిలోను అంతర్యామియై యుండుదారము అన్నిటిలోను కనిపించదు స్ఫటికమణిలో మాత్రము గోచరించును ఆలాగున సర్వేశ్వరుడు, పరమాత్మ, పరబ్రహ్మము, అందటిలోను అంతర్యామియై ప్రకాశించుచున్నప్పటికిన్నీ శుద్ధాంతఃకరణము గలవారిలో మాత్రమే గోచరించును కావున ఏ మతములో ఏ సంప్రదాయ ములో చేరినవారైనను ఆత్మశుద్ధి లేనిచో ఈశ్వర సాక్షాత్కారజ్ఞానమును బొందజాలరు

## దీపావళి సందేశము

ఆశ్వయుజ కృష్ణచతుర్దశి దినమున జనులు పండుగ మహానంద ముతో జరుపుదురు సాయంకాలము దీపారాధనలు సలుపుచు సంతోష ముతో నుత్సవము జేసుకొందురు టపాకాయలు మొదలగునవి కాల్చెదరు ఇంకను విశేషపూజలు అన్నదానములు గూడ సలుపుదురు ఆలాగున ఎవరి హృదయములోగల యహంకార జనితమగు యజ్ఞానము వధింపబడునో వారి జీవితము నరకచతుర్దశి పండుగవలె నుండును అదే యజ్ఞాన స్వరూప మగు యవిద్య నశించిన దానికి గుర్తు మహాత్ముల జీవితము చూచుకొనిన చాలును ఇట్టి యవస్థ యెవరికి కలుగలేదో వారి యందుగల అజ్ఞానరూప నరకాసురుడింకను నాశన మొందలేదని గ్రహించుకొనవచ్చును నరక చతుర్దశి తరువాత దీపావళిరోజున గృహ మంతయు అసంఖ్యదీపములతో దేదీప్యమానమై వెలుగొందునటుల, ఎవరి హృదయమందున్న అజ్ఞానరూప నరకాసురుడు భస్మమొనర్పబడునో, అట్టివారి హృదయములలో తదనంతర మున స్వప్రకాశరూపమై, స్వయం జ్యోతియైయున్న పరమాత్మ స్పష్టముగా ప్రకాశించును అదియే యథార్థమైన దీపావళి

# విద్యాసామర్థ్యములేని ఉత్సాహవంతులగు నవరచయితలకు హెచ్చరిక - సూచన

భక్తి జ్ఞాన వైరాగ్యాదులను బోధించెడు మాసపత్రికలలో కొందఱు తమ తమ వ్యాసములను ప్రకటించుట కుత్సాహపరులయి యుందురు అది చాల మంచిదే, అయితే పత్రికారచనకు కేవలము భక్తి జ్ఞాన వైరాగ్యములు కలిగియుండిన. మాత్రము చాలదు దానికి కొంత విద్యయందు ప్రవేశము కూడ కలిగియుండవలయును అదిలేని రచన తేజోమయముగా నుండ జాలదు ముఖ్యముగా కర్తృ, కర్మ, ప్రయోగములు భూత భవిష్యద్వర్తమాన క్రియలు, విభక్తులు, లింగములు, వాక్యరచన తప్పనిసరిగా శుద్ధముగా నుండ వలయును లేనిచో ఆ వ్యాసరచన చక్కగా దెలియనివారు కొన్ని వ్యాసములు వ్రాసి, విజ్ఞులదగ్గఱ చదివి సంస్కరించుకొనుట మంచిది అయితే అట్టి ఆధ్యా త్మిక వ్యాసము భాషాశోభితమై యుండినను చాలదు భక్తి, జ్ఞాన, వైరాగ్య ములు కూడ ఉండేలాగున చూడవలయును అప్పుడే అది ప్రాణముతో గూడినదగును లేనిచో ప్రాణరహితమైన శవము వంటిదగును ఆలాటి వ్యాసములను ప్రముఖములైన పత్రికలలో ప్రచురింపరు ఏలన పత్రిక ప్రాణమంతయు వ్యాసములపై ఆధారపడియుండును దేనియందైన నైపు ణ్యము గలుగవలసియుండిన కొంత పరిశ్రమ చేయవలయును కావున అట్టి పత్రికారచయితలు తమ సంతోషమభివృద్ధి కలుగులాగున కొన్ని చిన్న చిన్న వ్యాసములను వ్రాసి ఆత్మవేత్తలును, విద్యావంతులునునగు వారి సన్ని ధానమున చదివి సవరణ చేసుకొనులాగున చూడవలయును

## త్రివిధమానవులు

1 మానవులలో నిట్టి భేదము గలదు బ్రహ్మనిష్ఠులలోను నిట్టి భేదముండును బ్రహ్మమే (ఆత్మయే) తనస్వరూపమని -దృఢబుద్ధిగల వాడు ఉత్తముడు

2 బ్రహ్మమును భావన చేయువాడు మధ్యముడు

3 బ్రహ్మమును దైవమును అప్పుడప్పుడు భావనచేయువాడు కనిష్ఠుడు

4 ఒకప్పుడైనను దైవమును స్మరింపనివాడు లెక్కలో చేరినవాడు కాడు

మొదటివాడు దైవస్వరూప మానవుడు, రెండవవాడు దేవమానవుడు, మూడవవాడు మనుష్య మానవుడు, నాలుగవవాడు లెక్కలో చేరనివాడు

## గృహస్థాదుల స్వరూపము

1 మామూలుగా నడచుకొని కార్యము నిర్వహించువారలు గృహస్థులు

2 పరుగెత్తి గురుకార్యములు నిర్వహించే వారలు బ్రహ్మచారులు

3 కూర్చుండి జ్ఞానబోధలొనర్చువారు సన్న్యాసులు

4 పరుగెత్తి గురుకార్యములు (గురుసేవాదులు) చేయుట బ్రహ్మచారుల ధర్మమని విననప్పుడే మీకు భీతి కలుగును పరుగెత్తుట యేమి!! ఆంజనేయులు ఆకాశములో ఎగిరి గురుసేవయగు శ్రీరామ కార్యమును నిర్వహించినారు గదా!

## వాక్సిద్ధికి సంకల్పసిద్ధికి హేతువు

గవర్నరుగాని, కలెక్టరుగాని, తమ ఉద్యోగములో ఉన్నపుడు వారి వాక్యములు తప్పక అమలులోనికి వచ్చును తమ ఉద్యోగము పోయిన తర్వాత ఒక్కమాటైన ఏలాగున జనులు పాలింపరో ఆలాగున, బ్రహ్మ నిష్ఠలయం దెంతవఱకు బ్రహ్మచర్యము, భక్తి వైరాగ్యాది ధర్మములుండునో అంతవఱకే వారి సంకల్పములు, వచనములు ఫలించును పైధర్మముల

నుండి జారిపోయిన, ఒక సంకల్పముగాని, ఒక వచనముగాని ఫలించదు ఇదే దీనియందు గల రహస్యము, ఒకవేళ ఆత్మైక్యజ్ఞానముగల్గి యుండిన మోక్షము గలుగవచ్చునేమో గాని, భయము నశించుటగాని, వాక్సిద్ధి, సంకల్ప సిద్ధి మాత్రము కలుగదు ఈ సత్యము బ్రహ్మనిష్ఠులు, సాధువులు, పరమ భక్తులు సదా జ్ఞప్తిలో ఉంచుకోవలసినది

## కుయుక్తులచే కుతంత్రములచే నే కార్యమును సాధించజాలరు

సామాన్యజనులు కుయుక్తులచేతను సూత్రములచేతను, కార్యము నిర్వహించేలాగున చూచెదరు ఇట్టిది వట్టి భ్రమ మాత్రమే ఫలితము శూన్యము అది యెటువంటిదనగా ఆకాశములో మేడగట్టి వివాహము చేసుకొని సుఖించే లాగున ఉండును ఆ మేడగట్టి పూర్తియైన పిమ్మట వివాహము చేసుకొన్న చాలునని అట్టివారితో చెప్పిన చాలును ఫలితము శూన్యమేగాక అట్టివారిని అవిశ్వాసిగా లోకము తలంచునని గ్రహించుకొనుట మంచిది.

## అనుష్ఠాన ప్రభావము

ఒకరు సాహిత్యము, న్యాయము, వ్యాకరణము, వేదాంతము చదువక పోయినను ఏలాగున ఆ శాస్త్రములలో తాను చదివినవాడనని చెప్పుటకు ధైర్యము కలుగదో, చదివియుండిన నిస్సంశయముగ ధైర్య మేలాగున కలిగి యుండునో, ఆలాగున వేదాంతశాస్త్రము చక్కగా చదివినను వానికి జప, వ్రత, తపో, ధ్యానాదులు లేనిచో ఆత్మవిషయములో ధైర్యము ఉండదు కనుక బ్రహ్మ విద్యకు సంబంధించిన వ్రతములన్నియు కలిగియుండిన మాత్రమే ఆత్మజ్ఞానము దృఢమై యుండును లేనిచో మనసులో ధైర్యము లేకపోవుటయే గాక సంశయము కూడ గలుగును అనుష్ఠానము లోగల ప్రభావము ఇట్టిదని బ్రహ్మనిష్ఠుడు గ్రహించుకొనవలయును

## మనశ్శాంతి లేకుండుటకు కారణము - శాంతికి ఉపాయము

ఎవరికైన మనశ్శాంతి, ఆత్మశాంతి, ఆత్మప్రసన్నత లేకయుండినచో దానికి కారణము దెలిపెద ఒక యింటిలో ముగ్గురు కార్యనిర్వాహకులుండి నట్లూహించుడు ముగ్గురున్ను ఒక్కొక్కరి కొక్కొక్కరు పరమ శత్రువులై యుండిన, వారిలో నెవరికైనను శాంతియు, ప్రసన్నతయు గలుగునా? వారు కార్యములు గూడ చక్కగా, నిర్వహింపగలరా? ముగ్గురున్ను పరమ మిత్రులై యుండినచో కార్యమును చక్కగా, నిర్వహింపగలరు ఆనందముతో నుండగలరు ఆలాగున ఈ శరీరమనెడు గృహములో మనస్సు, వాక్కు, క్రియ అనెడు ముగ్గురు కార్యనిర్వాహకులున్నారు వారు మువ్వురు మిత్రత్వము లేకపోగా శత్రుత్వము గలిగియుండుటచే, దుఃఖములన్నియు గలుగు చున్నవి కావున మనస్సులో తలంచినట్లు వాక్కు చెప్పక పోవుటచేతను, వాక్కుతో చెప్పినట్లు ఇంద్రియ సంఘాత రూపమగు దేహము చేయక పోవుటచేతను ఈ దుఃఖములన్నియు గలుగుచున్నవి కావున మనస్సులో తలంచినట్లు వాక్కుతో చెప్పుటయు, వాక్కుతో చెప్పినట్లు కాయముతో చేయుటయు జరుగుచుండిన, ముగ్గురికిని మిత్రత్వము గలుగును అప్పుడు పరమ శాంతియు ఆనందమున్ను ఆవిర్భవించును కావున వీరి శత్రుత్వము పోయి మిత్రత్వము గలుగులాగున ప్రయత్నింపుడు

## తీవ్రముముక్షుత్వము గలవారి కర్తవ్యము

తీవ్ర ముముక్షుత్వము గలవారు నిర్విషయ స్థితి గలిగి ఆత్మ శాన్తిని గోరువారు ఒక విషయములో మిక్కిలి జాగ్రత్త గలిగియుండ వలయును లేనిచో అశాన్తి లోనికి, అప్రసన్నత్వము లోనికి జారి పోవుట తటస్థించును ఒకడు విరక్తుడై వృద్ధిని పొందినవాడై బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గలవాడై, యుండగా కొందఱు మిత్రులు కొందఱు శిష్యులు వివాహము చేసుకొనే లాగున ప్రేరణచేసి అన్ని కార్యములు మేమే చూచుకొనెదము మీరు సాక్షి

మాత్రులుగా ఊరకుండిన చాలునని చెప్పి మంచి కుటుంబములో గల కన్యకను మాట్లాడి వివాహమునకు సంబంధించిన సమస్త ఖర్చులు వారే పెట్టుకొని కళ్యాణము చేసిరి కొద్ది రోజులు అన్ని కార్యములు పై చెప్పినవారే చూచుకొనుచుండిరి అప్పుడు తీవ్రముముక్షుత్వము గలవారికి ఏ బాధ యున్ను కనిపించలేదు మొదట ఉండిన భక్తులు, శిష్యులు ఎక్కువ మంది ఉద్యోగస్థులై ఉండిరి వారు ఇతర స్థలములకు ఉద్యోగ నిమిత్తమై మార్చబడి వెళ్ళవలసి వచ్చెను కొందఱు పెద్దవారై చనిపోయిరి తర్వాత తీవ్రనిష్ఠలో ఉండిన ఆ పుణ్యాత్మునకు కార్యనిర్వాహకులు సరియైనవారు లేనందుచే మనస్సులో అశాన్తి గలిగెను కావున భక్తులు మఠము కట్టుటకు, పాఠశాల పెట్టుటకు, దేవాలయము నిర్మించుటకు, ధర్మసత్రములు నెలకొల్పుటకు పురికొల్పునప్పుడు నిర్వహించుటకు సరియైన వారుండిన మాత్రమే బ్రహ్మనిష్ఠుడు దానిలో ప్రవేశించవలయును లేనిచో ఉన్న మనశ్శాంతిని గూడ కోల్పోదురు పై చెప్పిన తీవ్రబ్రహ్మనిష్ఠునికి గలిగిన అశా న్తివలెనే వీరికి కూడా గలుగును

## వస్తువాహన ధనాదులు ఇహలోక సుఖమునే చేకూర్చగలవు

జనులు తమ సౌఖ్యము కొఱకు ధనము, గృహము, ఆరామాదులు సంపాదింతురు అయితే అవి తన శరీరము ఇచట ఉండువఱకు మాత్రమే సహాయము జేయగలవు పరలోకమునకుగాని లేక మఱియొక జన్మము వచ్చి నప్పటికిగాని, అవి యెవ్వియు ఏలాటి శాంతిని సుఖమును కలుగజేయ జాలవు తాను చేసిన ధర్మమునకు, దానమునకు అనుకూలమైన పరలోక ప్రాప్తియున్ను మరుజన్మమున గలుగునని మఱచిపోవుచున్నారు ఒకవేళ ఇచ్చట ధనము మొదలగునవి సంపాదించినను, సంపాదించక పోయినను, దైవ భక్తి, ఆత్మజ్ఞానము సంపాదించుటలో ప్రయత్నపడిన చాలును ఇహలోక ధనమును సంపాదింపకపోయినను, దానము చేయకపోయినను, జ్ఞానము మాత్రము సంపాదించినచో దాని కనుగుణమగు పుణ్యలోకప్రాప్తి గలుగు

ననియు, మఱల శుద్ధాత్ములున్ను, శ్రీమంతులున్ను జ్ఞానులు నగువారి వంశములో పుట్టుననియు, శ్రీకృష్ణభగవానుడు గీత ఆరవ అధ్యాయమున ఉపదేశించెను కావున శ్రమపడి యీ ప్రపంచ ధనమును సంపాదించుటలో జీవితమంతయు వ్యయ పఱచక జ్ఞానధనమును సంపాదించుటకు యత్నించినచో, ఉత్తమ పుణ్యలోకప్రాప్తియు, మఱల జన్మము వచ్చిన శ్రీమంతుల గృహములో పుట్టుటయు గలుగును ఈ సత్యమునెఱింగి జ్ఞానము నార్జించుటకు సదా యత్నింపుడు

## భావి జన్మసంకేతము

జనులారా! రాబోవు జన్మము ఇప్పుడే మీకు సృష్టియగుచున్నది ఇది జన్మము గలుగువారిని గుఱించి చెప్పినదే గాని జన్మరహిత స్థితిగలవారిని గుఱించి కాదు అయితే జన్మరాహిత్యము సామాన్యము గాదు అది సమస్త సంస్కారములు, వాసనలు, వృత్తులు నశించి బ్రహ్మాకారజ్ఞానము లేక దైవసాక్షాత్కారస్థితి గలవారికే సిద్ధించును ఒకవేళ జన్మము వచ్చునో లేదో నిర్ణయించుటకు సామాన్యులకు తరము కాదు ఒకవేళ జన్మము వచ్చునేమో అప్పటికి కావలసిన సృష్టి యంతయు నిప్పుడే తయారగుచున్నది అది కన్ను మూతపడుటకు లోపలనే తయారు కావలెను తరువాత ఏమియు మనము చేయజాలము ఇప్పుడు మీలో గల సంస్కారములు, సంకల్ప ములు, గుణములు, వాసనలు ఏ విధముగా నుండునో అదే మీకు గలుగ బోవు జన్మయని నిర్ణయించుకొనుడు అది పుష్పములో గల పరిమళమును గాలి తీసికొనివెళ్ళునట్లు ప్రాణప్రయాణ సమయములో మీతో కూడ వచ్చును గీత 15వ అధ్యాయములో శ్రీ కృష్ణభగవానుడు దీనిని గూర్చి చెప్పెను

## ఆత్మయొక్క నిస్సంకల్ప స్వరూపము

భూమిలో నుండి వృక్షలతాదులు పుట్టుచుండునని సామాన్యముగా చెప్పుదురు నిజముగ ఆలోచించిన భూమిలోగల విత్తనములే ఆవిర్భవించు

చుండును ఎడారియందు వృక్షలతాదులు పుట్టుట లేదు కారణమేమన అచ్చట వృక్షలతాదుల విత్తనములు లేవు ఆలాగున ఆత్మనుండి వృత్తులు, గుణములు, సంకల్పములు గలుగునట్లు పలుకుదురు నిజముగ విచారించిన ఆత్మలో సంకల్పములు గుణములు లేవు అవి అంతఃకరణ ధర్మములు హృదయములో సంస్కారములు, వాసనలు, వృత్తులు ఉండువఱకే ఆయా గుణములు గలుగుచుండును ఆయా సంస్కారములు, వాసనలు నశించిన మఱల ఏ గుణములు గాని సంకల్పములుగాని పుట్టవు అప్పుడు ఎడారి భూమివలె హృదయము సంకల్పరహితమై యుండును

## బ్రహ్మనిష్ఠుని నైమిత్తిక శాంతి క్షణికము, అస్వాభావికము

ఎంత సహనము, ఎంత శాంతము గలవారైనను ఒకానొకపుడు తనకు మించిన పని వచ్చినపుడు నిర్వహింపజాలక అశాంతి కనపఱచవచ్చును ఎంత దృఢముగా కట్టిన ఆనకట్టయైనను, నది కట్టయైనను విపరీతముగా జలము వచ్చినపుడు కట్టను భేదించుకొనిపోవుట చూచుట లేదా! అయితే ప్రతిసంవత్సర మాలాగున జరుగదు ఎపుడో ఒకానొకపుడు మాత్రమే అట్లుండునని విజ్ఞులెఱుంగుదురు అట్లే అనివార్యపరిస్థితిలో గొప్ప మహనీయు లకు కూడా ఆలాగున అశాంతి కనబడుచుండును కాని అది వారికి సహజమనిగాని, వారిది సదా అశాంత స్వభావమనిగాని తలంచవలదు

## మనశ్శాంతికి ఉపాయము

మనస్సుయొక్క నిలకడ అనగా మనశ్శాంతి గలుగుటకు ఉపాయ మేమి? యని చాలామంది అడుగుదురు మనస్సును విడిచి పెట్టినప్పుడే మనశ్శాంతి గలుగును అనగా మనోబుద్ధులకు సాక్షియగు ఆత్మలో నిలకడ గలుగవలయును అంతవఱకు ఆసనములచేతగాని, ప్రాణాయామముచేత గాని, మనో నియమముచేతగాని నిశ్చలత్వము గలుగదు అదంతయు ప్రవా హములో కొట్టుకొనిపోయెడు పడవయొక్క అడ్డకట్టలను పట్టిలాగి పడవను

నిలుపుటకు చేసెడు బాలుర యత్నము వంటిదే యగును పడవలో ఉండి పడవకు ఉండు అడ్డకొయ్యను ఎంత బలముగా పట్టి నిలుప చూచిన అది నిలుచును? ఆలాగున మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, ప్రాణములు దేహమువఱకు గలవన్నియు సంసారరూప ప్రవాహములో కొట్టుకొని పోవు చుండును వీటికి సాక్షియగు ఆత్మయందు దైవబుద్ధిగలిగి నిలకడ గల్గి నప్పుడే మనశ్శాంతి గలుగును ఇది (ఈ సాధన - ఉపాయము) వేదా న్తములో మాత్రమే కనపడును తక్కిన ఏ మతములోగాని, శాస్త్రములోగాని ఎంత వెదకినను గోచరము గాదు

## శాస్త్రపరనాభిలాషులగు బ్రహ్మనిష్ఠులకు హెచ్చరిక

విరక్తులై బ్రహ్మనిష్ఠ చేయువారు చిన్నతనములో సంస్కృతము చదివి యుండిన మంచిది, అప్పుడది తగినకాలము అట్లుకాక విషయ విరక్తి కలిగి, ధ్యానానుష్ఠానములలో ప్రవేశించిన పిమ్మట సంస్కృతము చదివిన బాగుండు నని తలంపు కలుగవచ్చును అధ్యాత్మ సంబంధ శాస్త్రములన్నియు సంస్కృత భాషలో నుండుటయే ఆలాగున సంకల్పము కలుగుటకు కార ణము అయితే అట్టి సంస్కృత పఠనము మంచిదైనను, తన నిష్ఠనుండి జార కుండ చూచుచుండవలయును జారక యుండవలసియుండిన ప్రతిదిన మును తన యనుష్ఠానమును జేయుచుండవలయును, చదువులో ప్రవేశిం చిన అంత నిష్ఠచేయుటకు సమయము చాలక పోవచ్చును ఈ విషయ ములో మిక్కిలి జాగ్రత్త కలిగియుండనిచో కృష్ణపక్ష చంద్రునివలే తనయాత్మ నిష్ఠకు, నిర్మలత్వమునకు, ప్రశాంతతకు హాని వాటిల్లవచ్చును చాలమంది విరక్తులు సహ విషయములోనికి జారిపోయినవారు కలరు ఆత్మజ్ఞానము నకు హాని కలిగిన, చదివిన విద్యలన్నియు అవిద్యారూపములై పరిణమిం చును కావున ఆలాగున చదువతలంచువారు మిక్కిలి జాగ్రత్త గలిగియుండ వలయును.

## బ్రహ్మనిష్ఠులకు పరీక్ష

పూర్వము వెండినాణెములున్నపుడు బ్యాంకులోను, ట్రెజరీలోను రూపాయలు కట్టునపుడు దానిని పరిశోధించుటకు షరాబువారు ఇరువదేసి రూపాయలు మొత్తముగా తీసికొని కుడి చేతిలో కొంచెమెత్తులో పట్టుకొని యెడమ చేతిలోనికి సన్నగ జారవిడిచెడివారు అది పడునపుడే నాదమును కనుగొని యిది మంచి రూపాయా లేక సీసము కలిపిన దొంగ నాణెమా అని కనుగొనెడివారు సందేహము గలిగిన ఆ రూపాయలను చిటికవేసి చూచెడి వారు మఱల సంశయమైన వెంటనే దానిని కత్తిరించి వేరుగ పెట్టెదరు ఆ లాగున బ్రహ్మనిష్ఠులను గుణముచేతను, తపస్సుచేతను, జ్ఞానముచేతను త్రివిధములుగ పరిశోధించు కొనవలెను అట్లయిన వీరు ప్రకృతి గుణము గలవారా! ప్రకృతి గుణరహితులా! అని తెలిసికొన వీలగును దొంగ నాణె మైన వెంటనే దానిని నరికి వేరుచేయునటుల పై జెప్పిన, మూడు లక్షణములు లేక ప్రకృతి గుణము గలవారైనచో వారిని సంస్కరింప చూచుటయో లేక పరిత్యజించుటయో చేయవలయును

## బ్రహ్మవేత్తయగు మహాత్మునిచే శిక్షితుడు గానివాని సకల విద్యలు అసంపూర్ణములే

మానవులు ఎన్ని ప్రపంచ విద్యలు నేర్చుకొనినను అది అసంపూర్ణమే యగును ఒక్క విగ్రహమును శిల్పి పోతపోసినను తరువాత ఆకురాయి మొదలగు సూక్ష్మ ఆయుధములచే శుద్ధపఱచిన మాత్రమే అయ్యది కళ గలిగి ప్రతిష్ఠింపబడుటకు యోగ్యమగును అప్పుడది దేవుడు గాగలదు ఆలాగున మానవుడు ఎన్ని విద్యలు నేర్చినను ఆత్మవేత్తయగు మహాత్ము నిచే సంస్కరింపబడనిచో, ప్రకృతి గుణరహితమైన దైవత్వమగు దివ్యప్రకాశ మును బొందజాలడు.

## సంస్కారము లేక పరిశ్రమయొక్క మహిమ

సంస్కారముచే ఒక వస్తువు ఎంత పవిత్రమగుచుండునో విలువ గలదగుచున్నదో ఈ క్రింది దృష్టాంతముచే తెలిసికొన వచ్చును సాధారణ మైన ఒక చిన్న గడియారమునకు లేక చేతిగడియారమునకు ఉక్కుగాని, ఇత్తడిగాని, కంచుగాని కొనునపుడు 2 రూపాయలు గాని, 4 రూపాయలు గాని, 5 రూపాయలుగాని మాత్రము విలువపట్టును ఆ లోహమును కరుగబెట్టి గడియారమునకు కావలసిన చిన్న చిన్న చక్రములు వగైరా చేసి మంచి గడియారముగా అమర్చునప్పుడు అది 500 రూపాయలు, 5000 రూపాయలు విలువ గలదిగా ఏర్పడుచుండును మఱియు ఆలాగుననే ఒక యింజన్ చేయవలసియుండిన దానికి కావలసిన ఉక్కు మొదలైన లోహ ములు కొనుటకు 5 నూర్లు విలువ గల సామాన్లు చాలును దానిని శుద్ధపరచి చక్రములుగా బాయిలర్లుగా మార్చి యింజనుగా తయారుచేసి అమ్మినచో గొప్పవిలువ గలదగుచున్నది ఇట్లే సామాన్యజీవి అయినప్పటికిని సంస్కరింప బడినపుడు ఇంతగొప్పతనము కలుగుచుండును అంత సంస్కారము చేయ నిచో స్వల్పలోహముగానే యుండును చూడుడు లోకములో సామాన్యముగా 3 వేలు, 5 వేలు, 10 వేలు జీతము గలవారగుచుండుట కాంచుటలేదా? ఎందువలన? సంస్కరింపబడుట వలన ఇంత యెక్కువ స్థానములోనికి వచ్చుటకు కారణమైనది, ఇది యొకటి గ్రహించుకొనిన చాలును అపుడు సంస్కార ప్రభావమును మీరు గ్రహించు కొనవచ్చును సంస్కారమనగా పరిశ్రమయొక్క ప్రభావమిట్లుండునని గ్రహింపుడు

## ధర్మసంస్థా సంచాలనమునకు లేక ఆశ్రమనిర్వహణకు కావలసిన యోగ్యత

ప్రపంచములో ఏదయిన ఒక ధర్మ సంస్థను స్థాపించి నిర్వహించ వలసిన బ్రహ్మనిష్ఠుడు దైవశక్తిని, ఆత్మశక్తిని తపోధ్యానాదుల మూలముగ

సంపాదించుకొనవలయును ఆత్మశాంతి పొందిన వాడుగా నుండవలయును లేనిచో ఆ సంస్థను చక్కగ నిర్వహించే శక్తియు దానివలన గలిగెడు ద్వంద్వ మును సహించెడు క్షమతయు గలిగియుండడు ఉన్నతోద్యోగులై ప్రపంచ పరిపాలనము చేయవలసియుండినచో దానికి సంబంధించిన అధికారము గలవారు మాత్రమే నిర్వహించుటకు ఎట్లర్హులగుదురో అట్లే ధర్మ సంస్థను నడుపుటకున్ను తగిన అర్హత గలవారు మాత్రమే దానిని నిర్వహించి శాంతిని పొందగలరు అయితే దీనివల్ల మోక్షము గలుగునని తలంచవలదు మోక్షము నకు జ్ఞానమే కారణము అట్టిజ్ఞానము గలిగియుండియు సంస్థను నిర్వహించ వలసియుండిన పై చెప్పిన దైవశక్తియు, ఆత్మశక్తియు, సంకల్పసిద్ధియు గలిగి యుండవలయును లేనిచో లెస్సగా నిర్వహించెడు సామర్థ్యము లేక పోవుటయేగాక మనశ్శాంతియు కోల్పోవును



ఓం

శ్రీ వ్యాసాశ్రమ రజతోత్సవ సంచికలోని

శ్రీవారి వ్యాసావళి ఇచ్చట నుండి ప్రారంభము

# దృష్టిభేదము

సాధారణముగా జనులు ఈలాగున నడుగుదురు నానావిధ వికార ములతో జడరూపమగు ఈజగత్తు ఎట్లు చైతన్యమగు బ్రహ్మమగును, లేక దైవమయమగును? దీనికి సమాధానము-- మీరు ఏ దృష్టితో చూచు చున్నారని యడిగినచో నేత్రములతో చూచుచున్నామనియే సమాధానము జెప్పుదురు అప్పుడు నేత్రము జడముగదా, జడముతో జూచుటవలననే జడ రూపముగా కనుపించుచున్నదని చెప్పినచాలును

మరికొంత విచారణ గలవారైనచో మనస్సుతో తెలుసుకొను చున్నా మని చెప్పుదురు అప్పుడు మనస్సు గూడ జడముగదా, అందువలననే మీకు జడముగా గోచరించుచున్నదని తెలిపిన జాలును మఱింత జాగ్రత్తయు చిత్తై కాగ్రతయు గలవారు బుద్ధితో తెలుసుకొనుచున్నామని చెప్పవచ్చును అప్పుడు బుద్ధియు జడముగదా, అందువలననే జడముగా తెలుసుకొను చున్నారని వచించిన జాలును

అంతేగాక దేహము, నేత్రము, మనస్సు, బుద్ధి ఇవి వికారములతో గూడినవి వికారము లేని నిర్వికారము నివి ఎట్లు చూడగల్గును? ఏ రంగులు గల సులోచనముతో చూచువారికి దృశ్యమంతయు ఆ అద్దపురంగువలెనే గనుపించును నిర్మలదర్పణముద్వారా జూచువారికి వస్తువులయొక్క యధార్థ స్వరూప జ్ఞానము ఉన్నది యున్నటుల గోచరించును

మరియు దేహేంద్రియాది బుద్ధిపర్యన్తము అసత్యములు, అప్పుడు అసత్యములో గోచరించునవన్నియు అసత్యములేగాని సత్యములుగావు స్వప్నావస్థలో స్థూలప్రపంచము లేదు సూక్ష్మప్రపంచము గలదు సుషుప్తి యందు సూక్ష్మప్రపంచముగూడ లేదు కావుననే లేనివస్తువువల్ల ఉన్నది

యెట్లు కనుగొనగలము? సుషుప్తి గూడ ఏదిచూచు చున్నదో అదే యాత్మ, దానివలన లేనివన్నియు లేనట్లున్ను, ఉన్నది ఉన్నట్లును కనుగొనవచ్చును అదే తురీయము, సాక్షి, చైతన్యము, సత్యము ఇది సమాధి యందుమాత్రమే పొందగలము అంతవఱకు సత్యము నెఱుంగజాలము అప్పుడు మనమిది వఱలో తెలిసికొనిన దంతయు లేనిదానిని మాత్రమేయనియు, ఉన్నదాని నిప్పటివఱకు తెలిసికొనలేదనియు జ్ఞానముగలుగును కలలో గనిన వస్తువులన్నియు నిజమని తలంచి మోసపడిపోయితిమి గదాయని మనో వ్యాకులత్వముగూడ గలుగును అట్టిదృష్టికే దివ్యదృష్టియనియు, యోగదృష్టి యనియు, జ్ఞానదృష్టియనియు, సువిమల దృష్టియనియు పేర్లు ఈ దేహేం ద్రియాది బుద్ధివరకు గలవన్నియు పంచభూతాత్మక స్థూలసూక్ష్మ పదార్థము లను భావము గోచరము గాగల్గును ఇదే శ్రీకపిలమహర్షి ఉపదేశించిన సాంఖ్య శాస్త్రముయొక్క సారము క్రింద జూడుడు

1 నాలుగువిధములుగా భాగింపబడిన ఆకాశ భాగములలో ఒక భాగముతో నాలుగువిధములుగా భాగింపబడిన పృధివీభాగములో ఒక భాగము చేరుటవల్ల అహంకారము పుట్టెను 2 ఈమీద చెప్పిన ప్రకార ముగా ఆకాశముతో జలభాగము చేరుటవల్ల చిత్తము పుట్టెను 3 ఆకాశ భాగముతో తేజోభాగము చేరుటవలన బుద్ధి పుట్టెను 4 ఆకాశముతో వాయుభాగము చేరుటవల్ల మనస్సు పుట్టెను నాలుగువిధములుగా భాగింపబడని ఆకాశాంశము అంతఃకరణ మాయెను ఆత్మ వీనికి విలక్షణమై స్వప్రకాశ జ్ఞానస్వ రూపమై వెలుగుచుండును

తృణాదులును తనవంశమును నిలపెట్టుట కొఱకు విత్తనములను ఉత్పత్తి జేసియే తమ దేహమును వీడుచున్నవి ఇది క్రిమినుండి మనుష్య జన్మమువఱకున్ను, తృణమునుండి గొప్పవృక్షమువఱకు సృష్టిలో గనబడు చునే యున్నది ఈలాగున జేయుటయే ఈశ్వర నియతి యగును కావున బ్రహ్మనిష్ఠులున్ను కొందఱికి తమయనుష్ఠానముల నుపదేశించి బ్రహ్మ సన్తతిని నిలబెట్టియే దేహముల వీడిపోవలయును ఇదియే ఈశ్వరాజ్ఞ

యగును

అయితే యీ విషయమై ఒక ప్రశ్న బయలుదేరవచ్చును బ్రహ్మచారులున్ను, సన్న్యాసులున్ను సంతానము కలుగ జేసిన పిమ్మట మాత్రము మోక్షముబొందవలసియుందురా? అని సందేహింప నక్కఱ లేదు గృహస్థులు సాధారణముగా సంతానముగలవారై యున్నారు గృహమున నుండియే ఎవరు వానప్రస్థమును పొందుచుందురో, గృహస్థాశ్రమమున నుండియే సన్న్యసింతురో వారి కీప్రశ్నతో సంబంధములేదు అట్లుకాని బ్రహ్మచారులకు, వానప్రస్థులకు, సన్న్యాసులకు మాత్రమే ఈ ప్రశ్న సంబంధించి యున్నది ఇచ్చట గ్రహించవలసినది దేహసంబంధ సంతానములను గలుగ జేయవలయునను అర్థముగాదు తానాచరించిన బ్రహ్మవిద్యను, యోగసాధనను, తపస్సును, బ్రహ్మజ్ఞానమును అనిగ్రహించుకొనవలయును అనగా బ్రహ్మచారులు బ్రహ్మచారులను, వానప్రస్థులు వనవాసులను, సన్న్యాసులు యతులను కొందఱిని ఏర్పాటు చేయవలయుననియే గ్రహించవలసినది మతకర్తలగు గౌతమబుద్ధుడు, శ్రీయేసుక్రీస్తు, శ్రీమహమ్మదు, శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్యాదులను జూడుడు వీరందఱును తమ మతములను స్థాపనచేయుట కొఱకు శిష్యపరంపరలను, మఠములను ఆశ్రమములను ఏర్పాటుజేసుకొని, యీదేహములను వీడి పోయిరి ఈ విషయమై భాగవతము జూడుడు

**పైలుండు ఋగ్వేద పఠనంబు దొరకొనె।**
**సామంబు జైమిని చదువుచుండె**
**యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనె**
**దుది నధర్వము సుమంతుడు పఠించె**
**నఖిలపురాణేతిహాసముల్ మాతండ్రిలోమ**
**హర్షణుడు నిరూఢిబాల్చె**
**తమ తమ వేదమా తపసులు బాలించి**
**శిష్యసంఘములకు జెప్పిరంత**

**శిష్యులెల్లరు నాత్మీయ శిష్యజనుల**
**కంత బహుమార్గముల ద్రుంచి యనుమతింప**
**బెక్కు శాఖలు గలిగి యీ పృథివిలోన**
**నిగమ మొప్పారె భూసురనివహమందు.**



# అలంకారము

దీనినే సౌందర్యమనియు, సుందరమనియు, శోభాయమానమనియు తలంతురు

అయితే దీని నిజార్థమును తెలిసికొనుట చాలా దుస్తరము ధర్మశాస్త్రముల రహస్య మెరింగినమాత్రమే యీ తత్త్వము గోచరించును ధర్మశాస్త్రములలో (1) బ్రహ్మచర్యము, (2) గార్హస్త్యము, (3) వానప్రస్థము, (4) సన్న్యాసము అనుపేర్లుగలవు ఆశ్రమధర్మముల నుపదేశించునప్పుడును శాస్త్రము వితంతువు ధర్మములను, ముత్తైదువ ధర్మములను తెలుపుచుండును అంతేగాక విరక్తుల యాచరణయు, వైరాగ్యము లేనివారి స్వభావమునున్ను ధర్మశాస్త్ర ముపదేశించుచున్నది ఇవన్నియు తెలిసినమాత్రమే యేయే యాశ్రమములలో నుండు వారెట్టి యాచరణగలిగి యుండవలయునో యది గోచరించును లేనిచో తాను ధర్మమని తలంచినది యధర్మమే యగును ఎటులననగా బ్రహ్మచర్యాశ్రమమున బ్రహ్మచర్యము, అధ్యయనము, అగ్నిహోత్రము, గాయత్రి ఉపాసన, గురుసేవ, వ్రతములుసల్పుట, ఇంద్రియముల కుద్రేకముగలుగజేయు ఆహారముల మానుట, నిరాడంబరముగా నుండుట మొదలగునవి ధర్మములగును గృహస్థాశ్రమమున ప్రవేశించునప్పు డీబ్రహ్మచర్యముండదు అత్యవసరమగు అలంకారముండవచ్చును ధాతుపుష్టిగలుగజేయు ఆహారములను కొంతవరకు భుజింపవచ్చును వానప్రస్థమున కందపక్వఫలమూలాదులను భుజించుచు ఏకాంత

మున నుండి తపస్సు, యోగసాధనల గలిగియుండవలయును సన్న్యసించునప్పుడు కర్మకాండక్రియలన్నియు త్యజించి శమదమాది గుణములుగల్గి వేదాంతార్థమును విచారణజేసి బ్రహ్మాత్మైక్యపరుడై జనులకు బోధకుడై యనగా ధర్మోపదేష్టయై యుండవలయును ఇది ధర్మములయొక్క సంక్షేపమగును

అట్లుగాక, బ్రహ్మచారి గృహస్థ ధర్మమవలంబించినను, గృహస్థుడు తన ధర్మములను విడచి తక్కిన ఆశ్రమస్థుల ధర్మమాచరించినను, అది విధర్మమేయగును నిందితము గూడను అది లోకము హర్షించజాలదు వారివారి ధర్మము లాచరించిన మాత్రమే లోకవందితు లగుదురు ఆలాగున నుత్తమురాలగు వితన్తువు ఎంత విరక్తి ధర్మములను, నిరాడంబర జీవితమును గడుపునో, యదియెంత లోకపూజితమో, అట్లుగాక వితన్తువు ముత్తైదువ ధర్మములైన యలంకారములు, ఆభరణములు, పసుపు, కుంకుమ, పుష్పాదులతో గూడియుండిన అదియేలాగున లోకనిందిత మగునో అదియు గ్రహించుకొనవలయును వితన్తు ధర్మము బ్రహ్మచర్యాశ్రమధర్మముతో గూడినది తనధర్మమునకు, తనవ్రతమునకు భంగము గలుగకూడదనియే ఆ నారీమణికి అభిలాష గల్గియుండును అంతేగాక ఇంద్రియములన్నియు స్వాధీనములయి యుండవలయు ననియే ఆ వనితారత్నమునకు భావనయుండును అందువలననే వ్రతములు సల్పుటకును, నిరాడంబరముగ జీవితమును గడుపుటకున్ను ఇష్టపడుదురు ఈ విషయమై శ్రీ శంకరాచార్యులు తెలిపినది జూడుడు "కిం భూషణాత్ భూషణ మస్తి శీలం" అనగా భూషణము లన్నిటిలోను మిక్కిలి శ్రేష్ఠమైన భూషణ మేదని ప్రశ్న వచ్చినప్పుడు నిర్మలమైన శీలము, అనగా స్వభావమునకన్న మించిన భూషణము మరియొకటి లేదని తెలిపెను

**మితనిద్రా మితాహారో మితవస్త్రపరిగ్రహః ।**
**మితభాషణమేకైకం భూషణం బ్రహ్మచారిణామ్ ॥**

బ్రహ్మచారులకును, బ్రహ్మచారిణులకున్ను మితమైన నిద్రయు, మితమైన యాహారమున్ను, మితమైన వస్త్రధారణయు, మితభాషణమున్ను సర్వోత్కృష్టమగు భూషణమని తెలియందగినది "దూషణం జ్ఞానహీనానాం భూషణం జ్ఞానచక్షుషాం" అనియు ఉపనిషత్తు తెలుపుచున్నది బ్రహ్మచర్యాశ్రమములోగల యింద్రియనిగ్రహము, నిరాడంబరత్వము, శుద్ధాహారము, మితముగ భుజించుట మొదలగు పై చెప్పిన గుణములు విజ్ఞానదృష్టి లేని వారికి నిందితముగ తోచినను, ధర్మదృష్టిగలవారికి పై జెప్పిన బ్రహ్మచారి యొక్కయు, వానప్రస్థుని యొక్కయు, సన్న్యాసియొక్కయు సంయమవ్రత నిష్ఠాది నియమములన్నియు మహాభూషణములుగానే తోచును

ఇందువల్ల పునర్వివాహము చేయగూడదని తలంచవలదు అది వారివారి యిష్టము పవిత్ర జీవితమును గడుపజాలక చెడిపోవుటకన్న ద్వితీయ వివాహముచేసి కొనుటయే మంచిది అయితే వివాహము చేసికొనిన సంసారబన్ధమే గల్గును. ఆత్మస్వాతన్త్ర్య ముండదు లోకసేవ జేయుటకును, ఆత్మశుద్ధికరమగు కార్యము లాచరించుటకును అత్తఱినను కూలము దొరకక కష్టములు పడవలసియుండును అధ్యాత్మ చింతనజేయుటకును, జీవన్ముక్తి గలుగజేసి కొనుటకున్ను, ఆ తరుణమున అవకాశముజాలక ప్రయాస పడవలసి యుండునని మాత్రము మరువకూడదు ఈ దురవస్థ వితన్తువులకు మాత్రము కాదు, బ్రహ్మచర్యాశ్రమమునుండి గృహస్థాశ్రమములో ప్రవేశించెడు స్త్రీపురుషులందఱికిని సమానముగానే యుండును కావున ఆత్మస్వాతన్త్ర్యముగోరు ప్రతి స్త్రీ పురుషుడును బంధనములలో తగులుకొనక యుండడమే యుక్తము

కట్టకడపటి ఉపదేశమేమన ఏయాశ్రమములోనుండు వారైనను, వారికి నిరాడంబరజీవితము సుఖప్రదము అట్టి వారియాత్మకు మాలిన్యము గలుగదు. ఇదిసత్యము. అట్లుగాక ఆశ్రమ ధర్మము భిన్నమైనచో మస్తకములో ధరింపవలసిన శిరోభూషణము పాదములకును, పాదములలో ధరించవలసిన పాదుకలు శిరస్సులో ధరించిన నెంత యలంకారముగా నుండునో,

ఆలాగున నుండునని మరువకుడు ఇదియే యాశ్రమములన్నియు వికృత ములై, వికారములైపోవుటకు కారణము ఇదియే ధర్మముయొక్క స్వరూ పము మఱియు గుఱ్ఱముపై ఊరేగించవలసినవానిని గాడిదపై నుంచి యుత్సవముజేసిన నెంత శోభించునో, వికృతాకారాశ్రమ వర్తనమును నాలాగుననుండును ఇదంతయు బ్రహ్మచారులును, బ్రహ్మచారిణులును, సన్న్యాసులును, సన్న్యాసినులును గ్రహించవలయును బ్రహ్మచారులును, బ్రహ్మచారిణులును తమ వ్రతమునకు ఏవిధముగను మాలిన్యము గలుగ కుండటకొఱకే నిరాడంబరజీవితమును, వ్రతములును ఏర్పడినవి బ్రహ్మ చారిణులకు వివేకజ్ఞానోదయము వలన శరీరేంద్రియములు మలమూత్ర క్రిమిసంకులములనియు, తుచ్ఛములనియు, నీచములనియు తలంపు గలుగుటచేతను, ఈ దేహమును భూషణాలంకారాదులచే శోభాయుక్తముగా జేసినచో ఎవరైన దుష్టపురుషులు చూచి చెడుసంకల్పములు గలవారగుదురని భావించుటచేతను నిరాడంబర జీవితమును గడుపుట యుక్తము

ఆలాగున బ్రహ్మచారియు వస్త్రాలంకార భూషణయుక్తుడైన తనపై దుష్టస్వభావముగల స్త్రీలకెవరికైన ఏదైన చెడు సంకల్పము కలుగునేమోయని తలంచియే నిరాడంబరజీవితము, ఇంద్రియ నిగ్రహమునకు తగిన యాహారము గలిగి జీవితము గడుపుట ఒకవేళ బ్రహ్మచారిణిని జూచి పురుషులకుగాని, బ్రహ్మచారినిజూచి స్త్రీలకుగాని ఏదేని చెడు సంకల్పము గలిగిన ఆపాపము వారిదేకాని మనమలంకార భూషణముల నేల మానవలయునని తలంచకూడదు ఏలననగా మనలను జూచిన కారణము చేత గదా యితరులకు నట్టి దుష్టసంకల్పములు గలుగుట, మనస్సు మాలిన్యమునొందుట జరుగుచున్నదని తలంచియైనా యలంకారరహితులై పావనజీవితము గడుపవలయును



# సందేశములు

(శ్రీ సీతారామ ఆశ్రమము, గుళ్ళదూర్తి, కర్నూలుజిల్లా 4-11-46 లో జరిగినసభకు పంపబడినది)

**ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో వంశఋషిభ్యో మహద్భ్యోనమో గురుభ్యః ॥**

పరిశుద్ధమగు జ్ఞానము, శాంతియు, కరుణయుగల ప్రియమైన ఆత్మ సోదరీ, సోదరులారా! కరుణామూర్తియగు సర్వేశ్వరునికృపచే లోకములో శాంతియు, కరుణయు, సద్భక్తియు, విజ్ఞానబోధమును వర్ధిల్లునుగాత!

శ్రీ సీతారామాశ్రమము అను నీ పవిత్రమందిరమునకు చేరిన మీరందఱును నిర్మలపుణ్యాజీవులేగాక, దైవజ్ఞానము పొందినవారలని మరువ కుడు రమారమి 150 సంవత్సరములనుండి మనచేతుల నుండి జారిపోయి పరాధీనమైయుండు మనమాతృభూమి కిప్పుడు పరబన్ధ విముక్తి గలిగి స్వరాజ్యార్హత గలిగిన మనము ఎంతో పుణ్యాజీవులమని తలంచవలయును ఆలాగున బహుకాలమునుండి పతనమొందిన స్వారాజ్యమును అనగా యాత్మరాజ్యమును, మనహస్తమునుండి జారిపోయినదానిని గూడ ఇప్పుడు స్వరాజ్యసంపాదనమువలె నుద్ధరించుటలోను మనము ప్రయత్నపరులమై యుండవలయును ఆత్మరాజ్య పట్టాభిషిక్తులయిన ఋషివర్యులకాలమున ప్రపంచ మంతటను జ్ఞానబీజముల వెదజల్లిన యార్షకాల ఋషిసంతానములే మనమని మరువక యుందురుగాక! ప్రపంచ విముక్తికొఱకేలాగున అనేక ధీమంతులు ధైర్యము నవలంబించి త్యాగశీలురై స్వరాజ్యమును సంపాదిం చిరో, అట్టిత్యాగములో సర్వజనులును ముఖ్యముగా నారీమణులును ఎట్లు త్యాగముద్వారా సహనముద్వారా మాతృదేశమును సంపాదించిరో, ఆలాగున మనయాత్మలోకమును సంపాదించుటలో పురుషులేగాక స్త్రీలుగూడ నుదార భావము నవలంబించి త్యాగమొనర్చి మోక్షరాజ్యమును సంపాదించుకొన వలయును

ముఖ్యముగ ముముక్షువులగు ప్రతి స్త్రీ పురుషుడును నీవాక్యమును మరువకుందురుగాత! "త్యాగేనైకే అమృతత్వ మానశుః" అని వేదమాతయగు

శ్రుతి మనకు ఆదినుండియు నుపదేశించుచు వచ్చుచున్నది అనగా నమృతత్వము (కైవల్యము) త్యాగముచేతనే గలుగునని భావము స్వరాజ్య సంపాదకులకు శిబిరములు, స్థానములు ఎట్లున్నవో, ఆలాగున స్వారాజ్య సంపాదకులకు గూడ ఆశ్రమములు, మఠములు, ఏకాన్త కుటీరములు, పర్ణ శాలలు అవసరములు కాంగ్రెస్సున చేరదలంచువారల కేలాగున కొన్ని పవిత్ర నియమములు ఏర్పడియున్నవో, ఆలాగున ముక్తిలోకమును జెందుట కభిలాషగలవారలును కొన్ని నియమముల కవశ్యముగయలవడియే తీర వలయును అవి యమనియమములనియు, శమదమములనియు మన వారందఱెఱింగిన విషయమే కాని వానిలో నెంతవఱకు మనము ఉత్తీర్ణుల మయితిమి? ఆచరణపరులమై యున్నారము? అను విషయము నాలోచించు వారు కొఱత గలిగియున్నారు

పై జెప్పిన యాధ్యాత్మికజ్ఞానమునకు సాధనచతుష్టయ సంపత్తిగలవారే యర్హులని వేదాంతశాస్త్రములలో మనము పలుసారులు వినుచున్నారము ఏదో యొకవిధమున గొప్పదిగానో, కొద్దిగానో బ్రహ్మవిచారమును జేయు ముముక్షువులు, సాధనాపరులు వర్తమానమున గూడ నుండియేయున్నారు ఏదైన కొఱతగల్గి యుండినమాత్రమే యాత్మోన్నతిని జెందక యుందురు గాని మరియే విధమగు నాటంకములును ఈ మోక్షద్వారమునకు లేవు మఱియు బ్రహ్మవిషయమై శ్రవణముజేయు వారు గూడ చాలామంది మనలో నుంటున్నారు మననము నిదిధ్యాసనమును జేయువారు తగ్గిపోవు చున్నారు కావుననే ముక్తిధామమును త్వరలో బొందకపోవుచున్నారు పై జెప్పిన యమ, నియమ, శమ, దమ, శ్రవణాదులలో ఏదైన కొఱతగలిగి యుండునాయని యొక విచారణమాత్రము గలిగిన మన మందఱము ఋషిబిడ్డలమే యగుదుము ఋషి సంతానములని చెప్పనేల? అదియు దేహముతో కొంతయున్నత స్థితిలోనికి తీసికొనివెళ్ళును కాని దేహేంద్రియాదు లకు సాక్షియగు ఈశ్వరాంశ స్వరూపియయి ఈశ్వరగుణమగు సత్య జ్ఞానములతో కూడిన సనాతన స్వరూపుడే తానని యాధ్యాత్మికజ్ఞాన

శ్రవణము ద్వారా తెలిసికొనినవాడు ఋషిత్వమునకన్న ఉన్నతస్థానము నలంకరించిన వాడగును

అద్వైతమత మొక్కటి తప్ప తక్కినమతము లన్నియు నింతవరకే వెళ్ళును ఈ చెప్పిన అంశ అంశి విభాగమును లేక భేదమునుకూడ త్రోసివేసిన అనగా జీవేశ్వరుల అవిద్య, మాయ, ఉపాధులను ఉత్కృష్ట శాస్త్రము ద్వారా గ్రహించిన ఈశ్వరాంశుడు కాడు, సాక్షాదీశ్వరుడే యాత్మ యనుబోధ గలుగును దీనితో మనము స్వారాజ్యమును పొందినవారల మగుదుము ఈశ్వరాంశ స్వరూపుడే తానను జ్ఞానము గలుగునప్పుడు ఒక్కయువరాజు స్థానము నధిష్ఠించినవార మగుదుము సాక్షాదీశ్వరస్వరూపుడు తానను బోధగలుగునప్పుడు సాధకుడు సార్వభౌమస్థితిని పొందిన వాడగును అదే శాన్తము, శివము, అమృతము, అద్వైతము, అనన్తానందము ఓమ్

ఈస్థానమును చేరుట కొఱకు నిష్కామకర్మ, అనన్యభక్తి, ధ్యాన యోగ, ఆత్మజ్ఞాన యోగములని నాల్గుమార్గములు పరమఋషులు జీవుల సంస్కారముల ననుసరించి లేక పరిపక్వము ననుసరించి యేర్పరచి యున్నారు

ఈ నాల్గుమార్గములును మనము తప్పక యాదరించతగినవే కావు ననే శ్రీకృష్ణభగవానులు మూడవ అధ్యాయమున కర్మయోగమును, 12వ అధ్యాయమున భక్తియోగమును, 6వ అధ్యాయమున ధ్యానయోగమును, 14వ అధ్యాయమున జ్ఞానయోగమును నుపదేశించెను ఈ పై జెప్పిన నాల్గు యోగములలో ఒక్కొక్కటియే ముఖ్యమనియు తక్కిన మూడును గౌణములనియు తలంచువారు కొందఱుగలరు యథార్థముగా విచారించిన నది వారిభావన మాత్రమనియు, లేక సంస్కారరూపమనియు సర్వజ్ఞులు తలంచగలరు లోకోద్ధారకులగు మహనీయులందఱును నీ నాల్గు మార్గములను సమానముగా నాదరించినవారలు వారిజీవిత చరిత్రమును జదివిన

వారందఱికిది విదితము ఈవిషయమై వేలకొలది ప్రమాణవాక్యములను మీరు వినియే యుందురు కావున ఆ వాక్యములను విస్తరించిచెప్పి ఈ చిన్న సందేశమును విస్తరింపజేయదలంచలేదు 'విద్యాతపోభ్యాం పూతాత్మా' ఒక ఉపనిషద్వాక్యమును జదివి ఈ సందేశమును విరమింపతలంచుచున్నాను పై శ్రుతివాక్యమునకు అర్థమేమన, విద్యచేతను, తపస్సుచేతను ఆత్మ శుద్ధ మగును, జ్ఞానసాధనమార్గములలో అనేకులు ప్రీతిగలవారై యుండినను సం స్కృత విద్యయందు చాలమందికి జనించిన ప్రీతి యింకను చాలక యున్నది విద్యాశబ్దమునకు జ్ఞానమని యర్థముండినను సంస్కృత విద్యను కొంత వరకైన చదివినమాత్రమే బ్రహ్మజ్ఞానము, దానిలక్షణము, సాధకుని యొక్క గుణములు మనకు చక్కగా బోధపడును బాహ్యప్రపంచమును జయించు టకు శస్త్రము, ఆత్మలోకమును జయించుటకు శాస్త్రము అవసరములు ఇందుకు మన ఋషుల జీవితము మనకు ద్యోతకమగుచున్నది

కావున ఆత్మసోదరులారా! ఆత్మసోదరీమణులారా! మీరు ఈ ధ్యానములో, భజనలో, సంకీర్తనలో చూపే శ్రద్ధవలె సంస్కృతపఠనములోను చూపవలెనని నేను మిమ్ములను కోరుచున్నాను అట్లయినమాత్రమే శ్రీభగవ ద్గీత, ఉపనిషదాదులను చక్కగా పఠించుటకును, పఠింపజేయుటకును మనము సమర్థులము గాగలము, పవిత్రగుణముగలవారికి మీమందిర ముల, ఆశ్రమముల, మఠముల ద్వారములు ఎల్లప్పుడును తెరచివేసేలాగున చూడవలయును పరమ ఋషులున్ను, పరమఋషులకు జ్ఞానముగలుగ జేసిన సర్వేశ్వరుడున్ను ఎల్లప్పుడు మనఅందరిని ప్రేమతో అనుగ్రహింతురు గాత.

**హరివరం శ్రీ సీతారామ ఆశ్రమమందిరమువారికి పంపిన సందేశము**

పరిశుద్ధమగు జ్ఞానము, శాంతియుగల దైవాత్మ స్వరూపులగు ప్రియమైన ఆత్మసోదరీ సోదరులారా! కరుణామూర్తియగు సర్వేశ్వరుని కృపచే లోకములో శాంతియు, కరుణయు వర్ధిల్లునుగాత!

స్వరాజ్యమును భారతలోకము పొందిన కాలమున, స్వారాజ్యమును అనగా ఆత్మరాజ్యమును భారతావని పొందవలసియున్నదికదా! అట్లుకానిచో, ఒంటికన్ను, ఒంటిచెవి, ఒంటిచెయ్యి, ఒంటిపాదము గలవానిస్థితియే భారత లోకమునకు వచ్చును అది వికారముగాను, కార్యనిర్వహణ రహితముగాను ఉంటున్నదికదా! నేత్ర, కర్ణ, కర, పాదములు రెండున్ను సమానస్థితిలో బలిష్ఠములై యుండిన, ఆ మానవుడెంత సుందర రూపుడుగను, కార్య నిర్వహణ దక్షుడుగనుండునో, ఈలాగున భారతదేశముయొక్క పురాతనా వస్థ యుండెనని చరిత్రము సాక్ష్యమిచ్చుచున్నది కావుననే యట్టికాలమున భారతదేశము ప్రపంచమంతటకు జ్ఞాన విజ్ఞానములను వెదజల్లుటకు యోగ్యత గల్గియుండెను ఇతర దేశములు స్వరాజ్య సంపాదనయందు నైపుణ్యమును గల్గియుండినను, ఆత్మరాజ్యములో కొఱంతగల్గి యుండి నందుచేతనే ఆత్మశాన్తిని, హృదయానందమును పొందక రెండు చక్రములచే నడువవలసిన బండికి ఒకచక్రము విరిగిపోయిన స్థితియే వారికిగల్గెను కావుననే, వారిగమనము కుంటుపడుటకు కారణమైనది అనగా ఆత్మ సుఖమును, సర్వమానవ సమత్వమును లేనందుచే దైవకరుణకు దూరులైరి

కొంతకాలముండి మఱల నశించిపోయెడు ఈ స్వరాజ్య సంపాదనలో స్త్రీ పురుషులనేకులు సర్వత్యాగ మొనర్చి యనేక కష్టనష్టముల సహించి విరా మము జెందక ప్రయత్నించినందుచేతనే రాజ్యలక్ష్మిని బడయగల్గిరి ఇట్లుం డగా శాశ్వతమై, నిరతిశయానందము గలుగజేసెడు ఆత్మ రాజ్యమును సంపాదించుటలో నికనెందఱో స్త్రీలు, పురుషులు త్యాగమొనరించి, సహ నము గల్గి, నిరంతరము ప్రయత్నమును సల్పిన మాత్రమే మోక్షలక్ష్మిని బడయగలరు దేహముమాత్రము బలిష్ఠమై, దుర్బలమైన మనస్సు గలవానికి ఏలాగున నాత్మసుఖము గలుగదో ఆలాగున ఈ స్వరాజ్యప్రాప్తి చే తృప్తిని పొందక, స్వారాజ్య ప్రాప్తిని గలిగించుకొన్నప్పుడే మనజన్మము ధన్యమగును లేనిచో స్వరాజ్యముమాత్రము సంపాదించిన బలిష్ఠులగు దేశీయులు సంగ్రామాగ్నియందు ఆహుతులయినారు మనకున్ను అట్టిస్థితియే సంభ

వించునని స్వరాజ్యమును సంపాదించిన త్యాగమూర్తులగు నరనారీ మణులున్ను మరువక యుందురుగాత! అట్టి స్వరాజ్య స్వారాజ్యములను సమముగా పొందకపోవుటయే తూర్పుబంగాళా పశ్చిమ పంజాబు దేశములలో జరుగుచుండు ఘోరమగు క్రూరకృత్యములకు కారణమగు చున్నదని మరువకుడు తిలక్ మహాశయుడు 'స్వరాజ్యము మనజన్మహక్కు' అని యుద్ఘాటించినట్లు ప్రతి స్త్రీ పురుషుడున్ను స్వారాజ్యము మనజన్మ హక్కు అని యుద్బోధించుచు ప్రచారమును సల్పవలయును

ప్రచారమునకు ముందుగా ఆచరణలో సిద్ధులు కావలయును అప్పుడే ప్రచారమునకు చైతన్యము గల్గును అట్లు కానిచో ధనుర్విద్యా రహితుడు శత్రువులమధ్య రణ రంగమున దుమికిన ఎట్టి ఫలితముగల్గునో, తొందర తొందరగా ప్రచారమును పురికొల్పువారియొక్కయు, ప్రచారమును చేయు వారియొక్కయు స్థితి గల్గియుండునని మరువకుడు కలరా, ప్లేగు మొదలగు అంటు జాడ్యములతో దుఃఖపడువారికి ఔషధ, ఆహార, సేవలుచేసి సంరక్షించుట దయాళుత్వముగలవారి యందఱియొక్క ముఖ్యధర్మము అయితే ఆయుర్వేద విద్యయందు నైపుణ్యము లేనివాడును, సరియగు ఔషధము చేతిలో లేనివాడును అట్టి రోగులమధ్య సేవకొఱకు ప్రవేశించిన, తనకే చావు నిక్కువ మని మరువక యుందురుగాత! రోగులను బాధలనుండి సంరక్షింప తలంచువాడు ఆరోగ్య శాస్త్రమును తెలిసికొని ధాతుధర్మముల ననుసరించి ఔషధ రహస్యము నెఱింగినపిదప అట్టి పనిలో ప్రవేశించుట మంచిది

తాను తరించిన పిమ్మట నితరులను తరింప జేయుటకు యత్నింపవలయును. తన బంధములద్రుంచిన తర్వాత ఇతర బద్ధులయొక్క బంధచ్ఛేదములకు యత్నించవలయును సుషుప్తిలో నుండువాడు ఎట్టివాడైనను తాను స్వయముగా నిద్రనుండి లేచుటకు ముందు ఇతరులను నిద్రనుండి లేపుటకు శక్తుడు కాజాలడు కావున ప్రథమమున మీరు తరించుడు, మీ బంధములను ధ్వంసమొనర్పుడు, మీ అజ్ఞానసుషుప్తులనుండి మేలు

కొనుడు అప్పుడు మీరు తలంచిన కార్యములన్నిటిని శీఘ్రములో చేయగలరు

సింహము నిద్రలో నున్నప్పుడు దాని సమీప ప్రదేశములో నుండు జంతు సంచయము గంతులు వైచి తిరుగుచుండును అట్టి మృగరాజము నిద్రనుండిలేచి గంభీరమగు నొక గర్జనము చేసిన మృగసమూహములన్నియు పరుగెత్తి పారిపోవుటగాని, లేక అచ్చటచ్చట పొదలలోగాని, గహ్వరములలో గాని అణగిపోవునట్లు మీలో నిద్రించియుండు ఆత్మసింహమును ఓంకార రవముతో అర్థసమేతముగా మేలుకొల్పుడు అప్పుడు అరణ్యములో మృగ రాజమ్మునకు ఏ జంతువులున్ను అడ్డుతగలక విహరించు శక్తి గల్గినట్లు మీరున్ను సంసారారణ్యములో నిరంకుశముగ బ్రహ్మతత్త్వము ప్రచారమును చేయ శక్తిగలవారగుదురు

సింహము నెదుట మృగములు నిలువక పారిపోవునటుల మీ హృద యారణ్యమున, అపుడు వృత్తులుగాని, గుణములుగాని, సంకల్పములుగాని నిలిచియుండవు అట్టి స్థితి గలుగకనే వృత్తులకు, గుణములకు, సంకల్పము లకు ఆత్మ సాక్షిగా నుండుటవల్ల మోక్షమునకు హానికరము లేదని చెప్పెడు శుష్కవేదాంతమునకు చోటు ఉండదు సాక్షిత్వము ఉపనిషత్ప్రతిపాద్య వేదాంతముయొక్క పూర్ణావస్థ గాదు అచ్చట దృగ్దృశ్యదర్శన త్రిపుటి గలదు సాక్షిత్వ రాహిత్యమే 'ఏకమేవాద్వితీయ బ్రహ్మత్వ' బోధకమగును అది సాక్షాత్కరించువరకు మీరు ముందుపెట్టిన యడుగునుండి వెనుకకు మరలకూడదు అట్టి దృఢసంకల్పము, తీవ్ర ప్రయత్నముగల వానికి మోక్షము చాలా దగ్గఱలోనే యున్నది ఈ గమ్యస్థానమును చేరుటలోనే కర్మయోగ, భక్తియోగ, ధ్యానయోగ, జ్ఞానయోగములు సముద్రమునకు ప్రవేశించుటకు నదులు పరుగెత్తునట్లు పరుగిడుచున్నవి ఈ నాల్గింటిలో మీరు ఆరితేరినప్పుడే చతురంగబలముతో గూడిన సార్వభౌమునిరాజ్య పరిపాల నమువలె ఆత్మరాజ్యమును పరిపాలింపగలరు. ఈ నాల్గింటిలో కొన్ని సంప్ర దాయములవారు భజనకీర్తన పూజాదులచే తృప్తిని పొందుచున్నారు. మఱి

కొందఱు దేశసేవా పరోపకారపారీణతలచే తృప్తులగుచున్నారు ఇకకొందఱు ఆసనప్రాణాయామ జపధ్యాన ధారణాదులచే కృతార్థుల మయితిమని తలంచు చున్నారు వేరు కొందఱు వేదాంత విచారణ జ్ఞానబోధలచే ధన్యుల మయితిమని తలంచుచున్నారు వారందరున్ను ఒక్కొక్క నదిని అవలం బించి సముద్రమున చేరువారివలెనే యుంటున్నారు మనము అట్లుండిన చాలదు సర్వనదులను, సముద్రము తన గర్భములోనికి ప్రవేశింపచేసి కొనునట్లు మన మీనాల్గింటిని చక్కగా ఆచరించి నాల్గింటిలో ఎవరెవరికి వారి వారి సంస్కారానుగుణముగ ప్రీతియుండునో, ఆ మార్గమున వారిని గమ్య స్థానమును చేర్చేలాగున చూడవలయును

**యావదాత్మాన లబ్ధోఽయం శుద్ధం జ్ఞానం చ నోదితమ్ ।**
**మలీన విషయే రాగః తావదజ్ఞానినో భవేత్ ॥**

ఎంతవరకు ఈ ఆత్మ లభింపబడలేదో, శుద్ధమగు ఆత్మజ్ఞానము యొక్క యుదయము కాలేదో మలినమగు విషయములలో రాగము నశించ లేదో, అంతవరకు పూర్ణమగు జ్ఞానమును పొందలేమని తలంచి అనుష్ఠాన పరుడై యుండవలయును

**శ్రద్ధావినయ సంయుక్తః శాన్తిదాన్త్యాది సంయుతః ।**
**యావద్జ్ఞానోదయస్తావత్ వేదాన్తార్థం నిరూపయేత్ ॥**

భక్తి, శ్రద్ధ, వినయములతో కూడిన వాడును, శమదమాదికమును గలవాడును అయి ఎంతవరకు ఆత్మజ్ఞానోదయము కాలేదో, అంతవరకు వేదాంతార్థమును జ్ఞాన, ధ్యానములతో గూడి విచారణ చేయవలయును.

**రవిర్వాయుర్యథా వృష్టిః లోకానాం హితకారణమ్ ।**
**తథా భవన్తి వేదాశ్చ సర్వేషాం మోక్షసిద్ధయే ॥**

ఎట్లు సూర్యుడు, చంద్రుడు, వాయువు, వృష్టి, భూమి, ఆకాశము వీనిని జనులందఱికిని సమానముగా సౌఖ్యముకొఱకు పరమేశ్వరుడు

సృష్టించియున్నాడో, అట్లే సర్వులకును మోక్షసిద్ధికొఱకు భగవంతుడు వేదములను గూడ నిర్మించినాడు ఇహసుఖముకొఱకు పంచభూతములను, పరసుఖమగు ఆత్మసుఖముకొఱకు వేదములను సర్వులకును సర్వేశ్వరుడు ఒసంగియున్నాడు కావున వేదముగాని, వేదాంతముగాని, జ్ఞానముగాని మీ జన్మహక్కని దృఢముగా సంకల్పించుకొని, దానిని పఠించుటకు అనుష్ఠించుటకు మీరందఱును కృతనిశ్చయులై యుండవలయును

**బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రశ్చండాల ఏవ చ।**
**దృఢాభ్యాసపరో నిత్యం పునర్జన్మ న విన్దతి ॥**

బ్రాహ్మణుడైనను, క్షత్రియుడైనను, వైశ్యుడైనను, శూద్రుడైనను, అంత్యజుడైనను, స్త్రీయైనను, బ్రహ్మాభ్యాసమునందు దృఢత్వము గల్గి యుండిన వాడు తప్పక ముక్తిని పొందును

**తపో విద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరమ్ ।**
**తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే ॥**

తపస్సును, బ్రహ్మవిద్యయును ఉత్తమ మనుజునికి మిక్కిలి శ్రేయస్సును గలుగజేయును తపస్సుచే సర్వకల్మషమున్ను నశించును బ్రహ్మవిద్యచే అమృతత్వమగు మోక్షమున్ను లభించునని మనువు వచించెను మనుసన్తతి వారగుటచేతనే మనుజులనియు, మానవులనియు, మనుష్యులనియు పేర్లుగల్గెను తండ్రియొక్క ధనమునకు పుత్రపుత్రికలందఱు హక్కుగలవారివలె మీరున్ను తపసులోను, బ్రహ్మవిద్యలోను అధికారము గలవారగుదురుగాక! అగ్నిచేతను, గాలిచేతను స్వర్ణము కరిగి చిలుము నశించునట్లు విద్యాతపస్సులచే మీకర్మములు నశించి మీరు బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గలవారగుదురు



# విజ్ఞానశకలము

ధనుర్మాసమున శుద్ధ ఏకాదశి రోజున విజయనగరమున జరిగిన విజ్ఞాన వర్ధని పరిషత్తువారికి
శ్రీ సద్గురు స్వాములవారు పంపిన సందేశము

పరిశుద్ధమగు జ్ఞానము, కరుణయు, శాంతియు గల దైవాత్మస్వరూపు లగు సోదరీ సోదరులారా! కరుణామూర్తియగు సర్వేశ్వరుని కృపచే లోకములో శాంతియు, కరుణయు వర్ధిల్లునుగాక!

వేద విజ్ఞానవర్ధని పరిషత్తుయొక్క ప్రెసిడెంటుగారగు పవిత్రాత్ము లును, ఆత్మసోదరులును ఈ యుపాధినుండి ఒక సందేశము కావలయు నని తెలుపుటచే, ఈస్వల్పమగు ఆశయము పంపడమైనది పరమకారుణికు డగు సర్వేశ్వరుడును, దయామూర్తులగు ఋషిసత్తములున్ను ఈ పవిత్రమగు పరిషత్తును దయతో అనుగ్రహింతురుగాక!

భారతీయులు రమారమి వేయి సంవత్సరములనుండి అనుభ వించుచు వచ్చిన బాధనుండి విముక్తిని బొందిన ఈ కాలము హిందువులకు మహా పుణ్యకాలమనియే తలంచవలయును అయితే ప్రస్తుత కాలస్థితినిబట్టి చూచిన స్వరాజ్యములో చాలా యశాంతియు లోపమున్ను గనబడును దేనికిని ఒకమార్పు గల్గునప్పుడు కొంత ప్రకృతిలో వ్యత్యాసములు గనుపిం చుట సహజము ఇదియటుండుగాక! భారతీయులు స్వరాజ్యముతో తృప్తిని పొందువారలు గారు స్వారాజ్యముతోనే వారికి తృప్తియు, ఆనందమున్ను పూర్తియగుచున్నది అంతవరకు వారు పని పూర్తియైనదని తలంచరు మన దేశమునకున్ను, విదేశములకున్ను ఇంతతేడా గలదు కావుననే మన జీవితము నాల్గు భాగములుగా జేయడమైనది పూర్వభాగము బ్రహ్మచర్యము తోను, గార్హస్థ్యముతోను పూర్తియగును ఉత్తర భాగము వానప్రస్థముతోను, సన్న్యాసముతోను మాత్రమే సంపూర్ణతనొందును అప్పుడే మానవుని పని పూర్తియగునని భారతీయ ఋషిసత్తములందరు నిరంతరము తలంచుచుం దురు ఇతర దేశములవారు గృహస్థాశ్రమముతోనే జీవితదశ పూర్తియగునని తలంచి కృతార్థులైనట్లు తృప్తులగుదురు ఇది చతురాశ్రమముల గురించిన

సంగ్రహ వాక్యమగును

కావున స్వారాజ్యపు కొరత యొకటి మనలో నేర్పడి యున్నది దాని పూర్తి కొరకు కొందరు ధీరులున్ను, ఉదారులున్ను, త్యాగు లున్ను, విద్యావంతులున్ను, తపస్సంపన్నులగు నారీమణులున్ను, ఉత్తమ నరులున్ను ఇప్పుడు పని ప్రారంభించవలయును అట్టిదానియొక్క చిహ్నమే ఇలాటి పరిషత్తులని మనము గ్రహించుకొనవలయును ఒకడు శరీరముచే బల వంతుడైనను మానసికముగ దుర్బలుడున్ను, దుర్గుణభరితుడున్ను, విజ్ఞాన రహితుడునైనచో నేమిప్రయోజనమో, స్వారాజ్యసిద్ధితో మాత్రము తృప్తిని పొందువారి స్థితియు నటువంటిదే యంత్రముయొక్క బహిరంగ చక్రాదులు మాత్రము బలమైయుండినను అంతరంగములో గల భాగములు సుదృఢ ముగా లేనిచో ఎటుల ప్రయోజనముండదో బాహ్య కార్యము లన్నిటిలోను సంతృప్తిగానుండినను మనోనైర్మల్యము గలుగని స్థితియు ఆలాగుననే యుండును

మఱియు బన్ధనములో నుండువాడు మఱియొక బన్ధనములో నుండువానియొక్క బన్ధనములను ఎటుల విముక్తి చేయజాలడో, యతడు సార్వభౌముడుగాని, పండితవర్యుడుగాని, బ్రాహ్మణోత్తముడుగాని, యతీశ్వ రుడుగాని యేమి చేయగల్గును? కావున తన బంధమును ముందుగా సధైర్య ముగా ద్రుంచవలయును తీక్ష్ణమైన విజ్ఞాన ఖడ్గముతో ముందుగా దానిని ఛేదించవలయును అట్టివాడు సామాన్యుడైనను బంధనములో తగులుకొని యుండు సర్వజనులను బంధించియుండు పాశములను విప్పి పారవేయ గల్గును లేక నరికివేయగల్గును అదేరీతిగా నిద్రలోనుండువాడు ఎట్టి యోగిగాని భోగిగానియైనను నిద్రించియుండు ఇతరులను సుషుప్తినుండి లేపగల్గునా? కట్టకడకు తానుగూడా నియమిత కాలమునకు లేవగల్గునా? కట్టకడకు తానును ఎచ్చటనున్నాడు, దేనికొఱకిచ్చటకు రావడమైనది తానెవడని కూడా నెఱుంగగలడా? నిద్రనుండి లేచినవాడు గాఢసుషుప్తిలో నుండు చక్రవర్తులను, విద్వాంసులను, విప్రోత్తములను ఉన్నతోద్యోగులను

గూడ లేపగల్గును వేయేల? సర్వులను సుషుప్తి నుండి లేపగల శక్తిమంతుడ గును కావుననే యుపనిషత్తు ఇటుల ఉద్ఘోషించుటకు కారణమైనది "ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత"- ఓ మాయలో వివశులైపడియుండు జనులారా! లెండు! అజ్ఞానసుషుప్తిలో నుండు మానవులారా! మేలుకొనుడు ప్రకృతికి పరమగు బ్రహ్మతత్త్వము నెఱింగిన వారిని విధివదాశ్రయించి తెలుసుకొనవలసిన విషయమును త్వరలో తెలుసుకొనుడు! నిద్రావస్థలో నుండువారిస్థితిని రైల్వేజంక్షన్‌లో ప్రయాణముకొఱకు వచ్చి రాత్రులలో నిద్రించియుండు నున్నతోద్యోగులను ప్రభువులను లేపుటకు ఏర్పరచిన తమ జవాన్ల చూచిన మీరు గ్రహించుకొన గలరు స్వారాజ్యస్థితి యెవరికి లభించునో ఆ విషయమై మనుమహర్షి చెప్పినది చూడుడు

> సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।
> సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి ॥

సమస్త భూతములలో నుండు ఆత్మ తాననియు, సమస్త భూతముల యాత్మ తనలోనే యుంటున్నదనియు భేదము లేక సమానముగా జూచు వాడెవడో వాడే యాత్మయజ్ఞమును చేసినవాడగును వాడే స్వారాజ్యమును పొందగల్గును అట్టిస్థితి మనలో నెందరికి నున్నదో ఒక క్షణకాలము కన్నులు మూసుకొని అంతరాత్మలో చూడుడు

మఱియు వినుడు ఒక పడవ యంత్రముచేగాని, తెరచాపతోగాని, తెడ్డుతోగాని నడపబడియుండినను చుక్కాని లేనిచో, ఏలాగున గమ్యస్థాన మును సరిగా పొందజాలదో, వాయువేగమునగాని, ప్రవాహ వేగమునగాని ఎచ్చటికి నీడ్వబడునో యచ్చోటికి పోవుటగాని, కట్టకడకు సముద్రములో ప్రవేశించి మునిగిపోవుటగాని యెటుల సంభవించునో యాలాగున ద్వంద్వ మయమగు, సంకల్ప వికల్పాత్మకమగు ఈ మానసిక సంసారసాగరమును దాటుటకు ఈ శరీరమొక నావవంటిదని కవులు వర్ణించియున్నారు దానికి సంబంధించిన ప్రమాణము లనేకములు కలవు

వాటినన్నిటిని వ్రాయుటకిప్పుడు సమయము చాలదు ఈ దేహ మనెడు ఓడకు చుక్కానివాడెవడో యతనినే శ్రీకృష్ణభగవానుడు గీతయందు 13-వ అధ్యాయమున నుపదేశించెను "ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః" ఈ స్థూలసూక్ష్మ కారణ శరీరములను, వాటి ధర్మములను, క్రియలను ఎవండుసాక్షిగా నుండి యెఱుంగుచున్నాడో వాడే చుక్కానివాడు అది యెంతవరకు స్వాధీనము గాలేదో, దానిని దర్శించలేదో, అదియే తానై యుండలేదో, దానిని పొందలేదో అంతవరకు ఈ జీవుని ప్రయాణము చుక్కానిలేని పడవచందమున నుండునని మఱువకుడు గీతయొక్క యాశయములన్నియు దీనితో సంఘటితములైయున్నవి

మఱియు ఒకడు చాలభక్తితో సుందరమగు, మనోహరమగు ఒక దేవాలయమును మంచి శిల్పశాస్త్రము రీతిగాను, విచిత్రపు పనులతోను కట్టించెను కాని ప్రతిష్ఠాకార్యమును జరుపుటకు ముందుగా పాపము అతడు చనిపోయెను అందువల్ల నతడు క్షేత్ర ప్రతిష్ఠఫలము నేలాగున పొందక పోయెనో, ఆలాగున మంచి వంశములో జన్మించి విద్యావంతుడై, శ్రీమంతుడై, రూపవంతుడైనను, లేక పావనమగు తులసీ రుద్రాక్ష భస్మ తిలకాదులచే విభూషితుడైనను, శ్రీదక్షిణామూర్తివలె జటామండల మండితుడైనను, లేక యత్యాశ్రమమునకు సంబంధించిన పరిశుద్ధ కాషాయాంబరధారియై శ్రీ శంకర భగవత్పాదులవలె దివ్య ప్రకాశముతో కూడిన వాడైనను, జ్ఞేయ బ్రహ్మైక స్థితి యను ప్రతిష్ఠ లేనిచో దేవతా ప్రతిష్ఠలేని దేవళమువంటిదని మరువకుడు కావుననే శ్రీభగవానుడు "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" అని యుపదేశించడమైనది అయితే దీనియందు 'సర్వక్షేత్రేషు' అని ప్రయోగించిన దానిని మరచి పోవుచున్నారము దీనిని మాత్రము జ్ఞప్తిలో నుంచుడు

శ్రీభగవద్గీత నిష్కామకర్మనే బోధించుచున్నదని కొందరును, దైవ భక్తినే యుపదేశించుచున్నదని మఱికొందఱును, ధ్యానయోగమునే తెల్పు చున్నదని మఱికొందఱును, జ్ఞానయోగమునే తెల్పుచున్నదని వేరుకొంద

రును, ఆత్మజ్ఞానమునే బోధించుచున్నదని యికకొందరును వివరించు చున్నారు నూతనముగా నవీనులు కొందఱు యావత్కాలమున్ను గృహస్థా శ్రమములోనే యుండి నిష్కామకర్మ యోగమును చేయుచుండవలయున నియే గీతాశయమనియు, ఇతరులు కొద్దిమంది మాత్రము సన్న్యాసము లేనిచో త్యాగములేనిచో మోక్షము సున్నయని అచ్చటచ్చట ఉపన్యాసములను ఇచ్చుచున్నారు

ఈ వాద ప్రతివాద కోలాహలములో ఏది సరియైనదని యీ యుపాధి నడిగినచో నవన్నియు సత్యములనియు, భగవదాశయములనియు, గీతలో నున్నవనియు, శ్రీకృష్ణభగవాను డుపదేశించినవనియు నమ్మకముగా చెప్పగలను అయితే పై చెప్పినదంతయు ఒక్కొక్క అంగము మాత్రమేగాని అవన్నియు చేరినచో సర్వాంగసుందరమగు గీతయని మాత్రము ఈ యుపాధి తెలిసికొనడమైనది ఒక్కొక్కరున్ను గీతయను కల్పవృక్షముయొక్క ఒక్కొక్క శాఖను మాత్రమే నిరూపించిరి కట్టకడకు మోక్షసన్న్యాస యోగమును ఉపదేశించుటవలన సర్వులున్ను సన్న్యాసమును, త్యాగమును అవలంబించువఱకు మోక్షము లేదు ఆత్మశాంతిలేదు, దైవప్రాప్తిగూడ లేదు, అమృతత్వమును లేదు అయితే సన్న్యాసమనగా కర్మసన్న్యాసమా? లేక కర్మ ఫలసన్న్యాసమా? యని మఱల మఱల నాలోచించువారు గలరు ఈలాటి శంకలన్నిటికిన్ని శ్రీమహాభారతమున పాండవుల మహాప్రస్థాన పర్వమున చూచిన నిస్సంశయము గలుగును పాండవులైదుగురును, పాంచాలియు సర్వసంగపరిత్యాగులై అంత్యకాలమున గృహస్థాశ్రమమును విడిచి యేల వనములకు పోవలయునో, పుణ్యతీర్థముల కేగవలయునో అది గ్రహించిన చాలును అంతమాత్రమిచట నిరూపింప తలచడమైనది ఇక మీరును పండితులగుటచే విస్తరించి, చెప్పంబని లేదని తలంచెద

మఱియు ఇంకొక వాక్యము గూడ మీ యందరి సన్నిధిలో తెల్పే లాగున అంతరాత్మ ప్రేరణ చేయుచున్నది ఇదియే గీతయొక్క ప్రాణము గీతయొక్క హృదయము అదేమనగా 13వ అధ్యాయమున 8వ శ్లోకము

మొదలు 12వ శ్లోకమువరకు జ్ఞానమును గురించి యుపదేశించడమైనది అనగా అనుష్ఠానము గురించి తెలుపడమయ్యెను 13వ శ్లోకము నుండి 19వ శ్లోకమువరకు జ్ఞేయమును గురించియు చెప్పిరి వానిలో మొట్ట మొదట "జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృత మశ్నుతే"- అమృతత్వ మును పొందవలసిన, మోక్షమును చెందవలసిన యాజ్ఞేయమును తెలిసి కొనవలయును ఇదియే గీతాశయమని శ్రీభగవానుడు స్వయముగా నుపదే శించెను వేదముల సారమే ఉపనిషత్తులనియు, ఉపనిషత్తుల సారమే గీత యనియు బ్రహ్మవేత్తలందఱు, పండితులందరు ఎరింగియే యున్నారు కావుననే "సర్వోపనిషదో గావః" అని గీతామాహాత్మ్యములో తెలుపబడెను

ఇంకొక విషయమును కూడ పరమ పావనులగు మీ సన్నిధిలో చెప్పులాగున సంకల్పము గల్గుచున్నది అందఱును సమానులు కావలయు ననియే మన రాజకీయ ప్రవర్తకులును, పుణ్యాత్ములందరున్ను ఆశించు చున్నారు ఉపన్యసించుచున్నారు. వార్తాపత్రికలలో వ్రాయుచున్నారు ఇదివఱలో పాశ్చాత్య విద్యలో చాలామందిన్ని, అన్యవర్గముల వారున్ను సమానావస్థలోనికి వచ్చియున్నారని చెప్పవచ్చును ఇప్పుడు మనకు స్వరాజ్యము వచ్చెను స్వరాజ్యమైన మన మాతృభాష వేదభాష ఆర్యభాష సంస్కృతమే కావున ఈ భాషలోను అందరు సమాన స్థితిలోనికి వచ్చే లాగున చూడవలయును అయ్యది ఉపన్యాస వేదికలపై ఉద్ఘోషించిన చాలదు క్రియాపదములోనికి తీసుకొనిరావలయును లేనిచో మందు మాత్రము వేసుకొని గుండువేయని ఫిరంగిగర్జనము వలెనే వీరి సింహ గర్జనముగూడ నుండునని కార్యదీక్షగలవారు గ్రహించుకొనవలయును

స్త్రీలుగూడ పురుషులతో సమానమగు హక్కుగావలయునని కోరు చున్నారు అదియు సంతోషదాయకమే కావున వారును సంస్కృత భాషను బాగుగ నభ్యసించుకొనవలయును మన భారతీయ ఋషి సత్తముల విజ్ఞాన మంతయు ఈ సంస్కృత భాషాభాండారములో నుంటున్నది కావున వారీమణులకు గూడ నవకాశము గలుగజేయవలయును. బృహదారణ్యకో

పనిషత్తులో గల మైత్రేయి, గార్గి, భారతములో గల సులభాయోగిని, యోగ వాసిష్ఠములో గల చూడాల, మార్కండేయ పురాణములోగల మదాలస, ఇంకను విశ్వవర, కాత్యాయని, శార్ఙ్గి, శాండిలి, తపస్విని మొదలైన వేదకాలపు విదుషీమణుల చారిత్రములను గూడ చదువవలయును చదివిన మాత్రము చాలదు ఆచరణలో నుంచవలయును త్యాగులుగూడ కావల యును నడుమును బాగుగా బిగియగట్టి కార్యరంగములోనికి అడుగునిడ వలెను డబ్బు మూటను విప్పవలయును ఇనుపపెట్టెల తెరవవలయును బ్యాంకీలలో గల చెక్కులను మార్చుకొనవలయును నగలను కొన్నిటినమ్మ వలయును స్వభావమును మార్పుచేసికొన వలయును భోగముల కొన్నిటిని విడనాడవలయును త్యాగఖడ్గమును చేతిలో ధరించవలయును అపుడు మాత్రమే స్త్రీలకైనను పురుషులకైనను విజయము చేకూరును భీరువులను ముక్తికాంత వరించజాలదు ధీరులను మాత్రమే వరించును అట్టివారి దగ్గఅనే రాజ్యలక్ష్మి, స్వారాజ్యలక్ష్మి, విద్యాలక్ష్మి, జ్ఞానలక్ష్మి ఎల్లప్పుడును మెలగుచుండును

చెప్పవలసిన భాగములో కొన్నింటిని కొద్దిగా ఈ విజ్ఞాన వర్ధనీ పరి షత్తులో చేరిన పుణ్యాత్ముల, జ్ఞానాత్ముల సన్నిధిలో తెలుపడమైనది శ్రీభగవద్గీత పుణ్యమును గూర్చియు, మాహాత్మ్యమును గురించియు అనేక మహాత్ములు ఉపన్యసింతురు ఉపన్యసించిగూడనున్నారు అద్దాని ప్రభావమును గుఱించి నేనేమి చెప్పగలను? అయితే వరాహ పురాణమున చాతుర్మాస్య మాహాత్మ్యమును చెప్పునప్పుడు ఈ శ్లోకము వరాహ భగవాను నిచే నుపదేశించడమైనది ఇంతటితో పూర్తి చేసెద

భారతే భగవద్గీతా యథానామ సహస్రకమ్ ।
గాయత్ర్యాస్సమ్మితం ప్రోక్తం పుణ్యే పాపక్షయే తథా ॥

పాఠేన యత్ఫలం ప్రోక్తం అర్థజ్ఞానాచ్చతుర్గుణమ్ ।
మద్భక్తేభ్యశ్శ్రావణాచ్చ పుణ్యాం దశగుణం స్మృతమ్ ॥

మహాభారతములో గల భగవద్గీత గాయత్రీ మహామన్త్రమునకు సమానమయినదనియు, పుణ్యమును గలుగజేయునదనియు, పాపక్షయ మును గలుగజేయునదనియు చెప్పడమైనది పారాయణముచే ఏ ఫలము చెప్పబడినదో, దాని అర్థమును తెలిసికొనిన అంతకు నాల్గురెట్లు ఫలమనియు, భగవద్భక్తులకు వినిపించిన, వారికి చెప్పిన, వారిచే చెప్పించిన ఆ పుణ్యము పది రెట్లు అధికమనియు శ్రీవరాహభగవానుడు బోధించెను

ఓ ఆర్యసంతానములారా! మీరందరును పరమ ఋషిసన్తతి వారని మరువక యుందురుగాక! అట్టైన పుష్కరము మొదలగు పుణ్యతీర్థ ఫలమును పొంద గలరు దీనితో తృప్తిని పొందక ఇకకొంతలోనికి దిగిచూచిన మీరు ఈశ్వరాంశులని గోచరించును అది ఒక గంగాతీర్థమువంటి పుణ్యమును గలుగజేయును అచ్చోటను ఆగక ఇంకను కొంత అగాధము లోనికి దిగి చూచిన మీరు ఈశ్వరాంశులు కారు, సాక్షాదీశ్వర స్వరూపులే అని తత్త్వము ఉదయమగును అది మహాసముద్రసేతువువంటి పుణ్యమును గలుగ జేయును పుష్కరాది తీర్థములన్నియు, గంగాది నదులన్నియు మహాసము ద్రము వఱకు వెళ్లి తమ నామరూపములను, కించిద్జ్ఞత్వాదులను విడిచి మహాసముద్రమై తమ చిరకాలప్రయాణ అలసటను తీర్చి విశ్రాంతిని పొందు నటులచ్చటనే ఈజీవకోట్లనేక జన్మముల ప్రయాణ క్లేశములన్నియు నశించి పరమ విశ్రాంతిని పరమశాంతిని పొందగల్గును మొదట ఋషిసంతతి భావనచేత పుష్కరతీర్థమంత విశాలత్వము గల్గును రెండవదియగు ఈశ్వరాంశభావనచే గంగానదియంత వైశాల్యము సిద్ధించును మూడవది యగు ఈశ్వరభావనచే సముద్రమంత విపులత్వము లభించును

యధా సద్యస్స్యన్దమానాః సముద్రే అస్తంగచ్ఛన్తి నామరూపే విహాయ।
తథా విద్వాన్నామ రూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ॥

అని ముండకోపనిషత్తు



# గురుసమర్పణమ్

శ్రీవ్యాసాశ్రమమునకు సంబంధించిన వేలకొలది భక్తులు గలరు వీరిలో చాలమంది మేము గురుసేవకొఱకే వచ్చితిమని చెప్పుదురు ఇట్టి వారలిక కొందఱు మేమన్నియు త్యజించితిమి, మీ సేవయే పరమగతి యని గూడ వచింతురు అట్టివారితో నేను చెప్పునదేమన, అదిచాల మంచి కార్యము, సంతోషము అయితే నా సేవ మీ రెవరున్ను చేయనక్కర లేదు నేను చెప్పునట్లు మీరు చేయుట యేదిగలదో అదియే నా సేవయగును నేను మిమ్ములను నా సేవకొఱకు నియమించదలంచ లేదు నా యాశయమును నెరవేర్చులాగున చేసిన చాలును అదేమన, మీ జీవితమంతయు ఉత్తమ మగు సంస్కృతము చదువుటలోను, ఆత్మశుద్ధి కొఱకు తపస్సు చేయుటలోను వినియోగపరచవలయును అట్లుగాక మీరు మోక్షము కొఱకు ధ్యానము చేయవలయుననే తలంపును గూడ మఱువవలయును అది కావలసిన మఱియొక జన్మమున జేయవచ్చునని కట్టిపెట్టవలెను అట్లైన మీకు ముక్తుల మను భావము అచిర కాలములోనే గల్గును ఈ విద్య యున్ను, తపస్సున్ను దేనికొఱకనగా పతితమైన బ్రహ్మవిద్యను పునరుద్ధ రించుకొఱకే!

ఈలాగున మొట్టమొదట కొందఱంగీకరించినను కొద్ది రోజులు పోవునప్పుడు సంస్కృత విద్యలోగల కాఠిన్యమును సహింపజాలకయు, నియమబద్ధజీవితము గడుప జాలకయు ఈలాగున చెప్పప్రారంభింతురు అదేమన మేము ఈలాగున విద్యాతపస్సులలో కాలము గడపిన ఎట్లు మోక్షము నొందగల్గుదుము? కావున ఎచ్చోటనైన నేకాంతముగ నుండి ధ్యానము చేయవలెనని కొందఱున్ను, మఱికొందరు మాయాత్మప్రాప్తికి ఏదైన జూచుకొనక పోయిన మాకు సద్గతియెట్లు గల్గుననియు చెప్పుకొని వెళ్ళు టయు తటస్థించుచున్నది ఇట్టి భీరువులెవ్వరున్ను నాకక్కరలేదు సరియైన ఒక పురుషుడున్ను, ఒక నారీమణియున్ను ఉండినచాలును లోకక్షేమమునకు ఒక సూర్యుడు ఒక చంద్రుడు నుండిన చాలునని మీకు తెలియును గదా! అట్లుండువారు ఎట్లుండవలయునో, యీ జన్మమంతయు శ్రీగురుదేవుని

ఆజ్ఞ ప్రకారము సంస్కృతవిద్య చదువుటలోను, తపస్సు చేయుటలోను వినియోగ పరచెదము అని వేదమంత్ర ప్రకారము సంకల్పము చేయవల యును మఱియు తాను పూనిన కార్యము సాధించవలెను లేక మరణించ వలెను అను వజ్రసదృశమగు కఠినమగు దృఢతరమగు హృదయముగల్గి యుండవలయును వీరు మరణమును గూడ మంగళకరముగ దలంచవల యును అట్టి వారుతప్ప మఱియెవ్వరున్ను పనికిరారు

సృష్ట్యారంభమునుండి నేటివఱకు ఎన్నియో జన్మములెత్తితిరి గదా? ఈయొక్క జన్మము గురుదేవున కర్పించగూడదా? గురుదేవున కర్పించిన, చిన్నదగు ఉప్పుకల్లు సముద్రములో పడిపోయి మహాసముద్ర మగునట్లున్ను, కర్పూరము అగ్నిలో ప్రవేశించిన అగ్నిమయ మగునట్లున్ను, తమ నామరూప ములు లయమై ఉప్పు మహాసముద్ర మగునట్లున్ను, కర్పూర మగ్నిమయ మగునట్లున్ను, శ్రీగురుస్వరూపు లగుదురు గదా! అంత విశ్వాసమున్ను మనో ధైర్యమున్ను వీరికి లేదే! ఈలాగున గురుదేవునికి తమ జీవితము సమర్పింప దలంచువారు ప్రప్రథమమున సోమరి దేవతకు మంత్రపూర్వకముగా తర్పణమిడవలయును స్వార్థము కొంచెమైనను తమలో గలుగనీయక చూడవలయును దృశ్యవాసనగాని, విషయవాసనగాని గురుదేవునికి సమర్పిం చిన తమ పవిత్ర హృదయమును స్పర్శించకుండ నుండేలాగున కృతప్రతిజ్ఞ గలవారుగ నుండవలయును ఇట్టివారి వల్లనే ఈ లోకముద్ధరించబడవల యును

ఈ భారతదేశములో గల 40 కోట్ల స్త్రీ పురుషులు సంసార సాగర మున పడియుండి అనుభవించెడు సంకటములను జూచిన చాలదా? వీరు ఏగతిని పొందుచున్నారు? ఆలాగున మీరున్ను ఏల పవిత్రమగు మానవ జన్మమును పాడుచేయవలయును? మరణము వారికిన్ని మనకున్ను సమానమే అట్లుండగ మనము ముక్తులమై దివ్యపదవిని పొందకూడదా? తండ్రి సంపాదించిన ధనమంతయు కుమారులకు చెందునట్లు గురుదేవుడు సంపాదించిన జ్ఞానవిజ్ఞాన ధనములన్నియు గురుదేవునికొఱకు అర్పించిన

జీవితము గలవారలకు తప్పకజెందును ఇది సత్యము! కావుననే శ్రుతి యీలాగున చెప్పినది "విద్యాతపోభ్యాం పూతాత్మా" - విద్యచేతను, తపస్సు చేతను ఆత్మ పునీతమగును

**తపో విద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరమ్ ।**
**తపసా కిల్బిషం హన్తి విద్యయా ఽమృతమశ్నుతే ॥**

మానవునకు తపస్సున్ను, విద్యయున్ను మిక్కిలి శ్రేయస్సు గలుగ జేయును తపస్సుచేత పాపములన్నియు భస్మములగును బ్రహ్మవిద్యచే మోక్షమున్ను గల్గును గురుగీతయందు గురుదేవునకు ఆత్మార్పణము జేయుశిష్యుని లక్షణ మీలాగున పరమ శివుండు పార్వతీదేవి కుపదేశించెను

**శరీరమింద్రియం ప్రాణమర్థస్వజనబాన్ధవాన్,**
**ఆత్మదారాదికం సర్వం సద్గురుభ్యో నివేదయేత్॥**

శరీరమును, ఇంద్రియములను ప్రాణమును, ధనమును, తన వారలను, బంధువులను, తనయాత్మను, తనదారాది యావత్తును సద్గురువు కొఱకు వినియోగపరచవలయును అనగా ఈ పైజెప్పిన వన్నియు గురుకార్య నిర్వహణమునకు అడ్డుగలిగిన తొలగించవలయును అని భావము జనకుడు యాజ్ఞవల్క్యమునికిన్ని, శివాజీ తన ఆత్మగురువగు సమర్థ రామదాసుగారి కిన్ని ఈలాగుననే చేసిరి



# స్వభావము

స్వభావముయొక్క యథార్థమును విచారణ చేయక చాలా మందిన్ని ఇది తన 1. దేహస్వభావమనియు, 2 వాక్స్వభావమనియు, 3 మానసిక స్వభావమనియు, 4 జాతి స్వభావమనియు, 5 ఆశ్రమ స్వభావమనియు, 6 మా స్త్రీ స్వభావమనియు, 7 మా పురుష స్వభావమనియు, 8 మా పండిత

స్వభావమనియు, 9 మా ఉద్యోగ స్వభావమనియు, 10 మా దేశస్వభావ మనియు, 11 మా జన్మాంతర కర్మస్వభావమనియు, 12 మా అభ్యాస స్వభావమనియు ముఖ్యముగా ద్వాదశవిధ స్వభావముల గురించి దాంభి కముగాను, గొప్పదిగాను వచింతురు వీరు ఈ స్వభావములను చాలా గౌరవ ముగా తలంచినను, యధార్థతత్త్వ విచారము గలవాడు ఈ స్వభావము లన్నియు దుస్స్వభావములనియే గ్రహించుకొనును ఇది యెటువంటిదనగా, ఒకడు తెల్లని డ్రస్సువేసి ఈ తెలుపు తనస్వభావమనియు, మరియొకడు నల్లని ఉడుపు ధరించి తాను నల్లనివాడనియు, ఇంకొకడు ఎరుపు వస్త్రధారణజేసి తాను ఎర్రనివాడనియు, వేరొకడు పసుపువస్త్రధారణ గలిగి తాను పచ్చనివాడనియు వ్యవహరించునప్పుడు, బుద్ధిమంతుడైనవాడు వీరం దరున్ను తమ మానవత్వమును మరచి తాము ధరించిన వస్త్రముల రంగులే తమరంగులని తలంచి మోహితలగుచున్నారని యెట్లు తెలుసుకొనునో, ఆలాగున మనోబుద్ధులకు సాక్షియగు ఆత్మయే తాననుజ్ఞానము మరపు గలిగి మానసేంద్రియములతో గూడిన ఈ శరీరమే తామని తలంచు చున్నా రని గ్రహించుకొనునుగదా!

పై జెప్పిన దేహేంద్రియముల స్వభావమే తన స్వభావమని చెప్పుట ధర్మమని గూడ కొందరు తలంతురు నిజముగా ఆలోచించిన అది గొప్ప అధర్మమే యగును లోకముయొక్కగతి ఈలాగున నుంటున్నది ఇదంతయు మాయచే కల్పితమగు భ్రాంతిమాత్రమే ఎట్లన, ఒకయింటిలో మతి చెడిన ఒక పిచ్చివాడుండెను అతనిని ఒక మానవుడు నీ వెవడవని అడుగగా అతడు ధరించిన వస్త్రముయొక్క రంగును గురించి ఇదే నేను, లేక యీ గోడ నేను లేక యింటియందు గల కిటికీలనో, పెట్టెలనో, తలుపులనో, అలమరలనో, లేక ఇంటికి పూసిన రంగులనో నేనని చెప్పినచో, వానిని గురించి ఆ మనుజు డేమి తలంచును? ఇతడు భ్రాంతుడనియేగదా! ఆలాగున శరీరమందు గల గుణముల గురించి అదే తానని చెప్పు వానిని విజ్ఞులు పిచ్చివాడనియే తలంతురు అతడు మతిమంతుడైనచో తన పేరు

మాత్రమే చెప్పును లేక జాతినైన వచించును అట్టివానిని మాత్రమే మతిగల మనుజుడని లోకము తలంచును గదా!

దేహేంద్రియ మనోబుద్ధులకు సాక్షియై యుండు తన ఆత్మను దైవ రూపముగా నెరింగి దానియొక్క సచ్చిదానంద స్వభావమే తన స్వభావమని తెలుసుకొనువాడును, అదే తన స్వభావమని వచించు వాడును మాత్రమే మాయాభ్రమ రహితుడగు ఆత్మ జ్ఞాని యగును ఇదే తన ఆత్మస్వభావమని యెరింగిన, మొదటజెప్పిన ద్వాదశ విధ స్వభావములనుండి ఆత్మను వేరు పరచుటకున్ను, నిజస్వభావమగు ఆత్మలో నిలుచుటకున్ను అవకాశము గలుగును ఇది వివేకవంతులకు ప్రకృతినుండి, ప్రకృతి గుణములనుండి ఆత్మను వేరుపరచి మననము చేయుటకు ఎంతో ఉపకరించును అప్పుడు పిచ్చి నివృత్తియైనవాడు తన జాతిని, నామధేయమును తెలుసుకొను నట్లున్ను, అదే యితరులతో చెప్పునట్లున్ను, శరీరేంద్రియములకు సాక్షియగు ఆత్మయే తాను ను జ్ఞానము గలుగునదేగాక,అదేతన నిజరూపమని స్థిరత గలవాడై దానినే ముముక్షువు లకుగూడ నుపదేశించును ఇట్టి స్థితిలో దేహ సంబంధమయిగాని, మానసిక సంబంధమయిగాని, వాచిక సంబంధమయి గాని, వర్ణసంబంధమయిగాని, సన్న్యాసాది ఆశ్రమ సంబంధమయిగాని ఏలాటి స్వభావము గలిగినను దానిని మార్చుకొనుటకు యత్నించును ఇదే దీనివల్ల గలిగెడు మహాప్రయోజనము ఇదే నిజమైన శ్రవణముయొక్క యుపయోగము ఈ విషయమై శ్రుతి

**అవిద్యాయామంతరే వర్తమానాః స్వయంధీరాః పండితం మన్యమానాః ।**
**జఘన్యమానాః పరియంతి మూఢాః అంధేనైవ నీయమానా యథాంధాః॥**

అజ్ఞానము మధ్య నుండువారలై తమకు తామే గొప్ప ధీమంతు లమనియు, పండితులమనియు తలంచువారు అవిద్యయను చీకటిలో చిక్కుకొని పరిభ్రమించెడు మూఢులే యగుదురు వీరున్ను, వీరినే ఆశ్ర యించువారున్ను గ్రుడ్డివారిని అవలంబించి ప్రయాణముచేయు గ్రుడ్డివారలు

దారితప్పి పోవునట్లు, ఆత్మజ్ఞానమును ఎరుంగజాలక అజ్ఞానారణ్యమునకే పోయిచేరుదురు

దేహేంద్రియములకు సాక్షియగు ఆత్మయొక్క స్వభావమును బోధింపక దేహసంబంధ జాతి వర్ణాశ్రమముల గురించి ధర్మములు బోధించు వారున్ను, దానిని వినువారున్ను అవిద్యారూపమగు సంసారారణ్యములోనే పడిపోవుదురు ఈ విషయమై ఆత్మబోధమున శ్రీశంకరు లుపదేశించినది చూడుడు

**దేహేంద్రియమనోబుద్ధి ప్రకృతిభ్యో విలక్షణమ్ ।**
**తద్వృత్తిసాక్షిణం విద్యాత్ ఆత్మానం రాజవత్సదా ॥**

శరీరేంద్రియ మనోబుద్ధి ప్రకృతులకంటే వేరైన మనోబుద్ధి చిత్తాహం కార రూపమైన అంతఃకరణవృత్తులకు సంబంధింపక చూచుచుండు ఆత్మను రాజునువలె ఎల్లప్పుడును తెలిసికొనవలసినది అనగా మంత్రి ప్రభృతులు, న్యాయవాదులు, వాది ప్రతివాదులు చెప్పుచుండు వాక్యములు, చేయు కార్యములు ఉన్నతాసనారూఢుడై ఉండు రాజు సాక్షియై యెట్లు గ్రహించుచు పై చెప్పువారి గుణాగుణములను తెలుసుకొనుచుండునో అదే విధముగా ఆత్మయు ఉండునని గ్రహించేది

**నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః ।**
**ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాది భేదవత్ ॥**

ఆత్మకు ఆవరణభూతములైన పలుతెరగులైన శరీరములవలననే ఉదకమందు రసము, రుచి, రంగు మొదలుగాగల భేదములవలె, పరమాత్మ యందు కులము, పేరు, బ్రహ్మచర్యము మొదలైన ఆశ్రమములు కల్పింపబడినవి నిజముగా చెప్పిన "స్వస్య భావం స్వభావం" ఆత్మయొక్క స్వభావమెట్టిదో అదే స్వభావమగును

**ప్రకాశోఽర్కస్య తోయస్య శైత్యమగ్నేర్యథోష్ణతా ।**
**స్వభావస్సచ్చిదానంద నిత్యనిర్మలతాఽఽత్మనః ॥**

సూర్యునికి వెలుతురును, నీళ్లకు చల్లదనమున్ను, అగ్నికి వేడిమిన్ని ఏ ప్రకారమో ఆ ప్రకారమే ఆత్మకు సత్= అవస్థాత్రయమందు నశింపని స్వరూపమును, చిత్ = జ్ఞానస్వరూపమును, ఆనంద = దుఃఖనివృత్తి పూర్వక సుఖస్వరూపమును, సదా = ఎల్లప్పుడునుండు స్వరూపమును, స్వతస్సిద్ధమైన స్వరూపము

మనసు ఊర్ధ్వాధోముఖముగా తిరుగుచుండు అత్యంత వేగముగల ఒక యంత్రము వంటిది అది ఈ జీవుని పై చెప్పిన ప్రకారము దేహేంద్రియ మనోబుద్ధులకు సాక్షియగు సత్యజ్ఞానానంద స్వరూపమని చింతన చేసిన శివత్వము నొందించును అట్లుగాక వర్ణాశ్రమములతో గూడిన ఈ దేహమే తానని చింతించిన పశుత్వమును గూడ కలుగచేయును కావున ఆత్మను ఆధారముచేసి చెప్పువారున్ను, దేహమునే యాధారముజేసి బోధించు వారున్ను మిమ్ములను ఏదారి పట్టించుచున్నారో మీరే తెలుసుకొనుడు మరియు స్వభావమును గురించి యోగవాసిష్ఠమున శ్రీ వసిష్ఠమునీంద్రుడు తెలిపినదిన్ని చూడుడు

**స్వభావ ఏవ సర్వస్మిన్ స్వదతే కిల సర్వదా ।**
**అనాస్థైవ హి నావేన కిం వాద్యైః సంవిభావ్యతామ్ ॥**

ఓ రామచంద్రా! ఆ చిత్స్వరూపమే యేకమైనప్పటికి, వివిధ రూపముల వలె భాసించుచు, సర్వజీవులకును సదా పరమ ప్రేమరూపముతోటి స్ఫురించుచున్నది ఆ సాక్షియగు చిద్రూపమునే నీ ఆత్మస్వరూపముగా భావించుము వ్యర్థమగు వాదములచే నేమి ప్రయోజనము?

**అస్వభావే మహద్దుఃఖం స్వభావే కేవలం శమః ।**
**ఇతి బుద్ధ్వా విచార్యాంతః యదిష్టం తద్విధీయతామ్ ॥**

దారితప్పి పోవునట్లు, ఆత్మజ్ఞానమును ఎరుంగజాలక అజ్ఞానారణ్యమునకే పోయిచేరుదురు

దేహేంద్రియములకు సాక్షియగు ఆత్మయొక్క స్వభావమును బోధింపక దేహసంబంధ జాతి వర్ణాశ్రమముల గురించి ధర్మములు బోధించు వారున్ను, దానిని వినువారున్ను అవిద్యారూపమగు సంసారారణ్యములోనే పడిపోవుదురు ఈ విషయమై ఆత్మబోధమున శ్రీశంకరు లుపదేశించినది చూడుడు

**దేహేంద్రియమనోబుద్ధి ప్రకృతిభ్యో విలక్షణమ్ ।**
**తద్వృత్తిసాక్షిణం విద్యాత్ ఆత్మానం రాజవత్సదా ॥**

శరీరేంద్రియ మనోబుద్ధి ప్రకృతులకంటే వేరైన మనోబుద్ధి చిత్తాహంకార రూపమైన అంతఃకరణవృత్తులకు సంబంధింపక చూచుచుండు ఆత్మను రాజునువలె ఎల్లప్పుడును తెలిసికొనవలసినది అనగా మంత్రి ప్రభృతులు, న్యాయవాదులు, వాది ప్రతివాదులు చెప్పుచుండు వాక్యములు, చేయు కార్యములు ఉన్నతాసనారూఢుడై ఉండు రాజు సాక్షియై యెట్లు గ్రహించుచు పై చెప్పువారి గుణాగుణములను తెలుసుకొనుచుండునో అదే విధముగా ఆత్మయు ఉండునని గ్రహించేది

**నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః ।**
**ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాది భేదవత్ ॥**

ఆత్మకు ఆవరణభూతములైన పలుతెరగులైన శరీరములవలననే ఉదకమందు రసము, రుచి, రంగు మొదలుగాగల భేదములవలె, పరమాత్మ యందు కులము, పేరు, బ్రహ్మచర్యము మొదలైన ఆశ్రమములు కల్పింపబడినవి నిజముగా చెప్పిన "స్వస్య భావం స్వభావం" ఆత్మయొక్క స్వభావమెట్టిదో అదే స్వభావమగును

శరీరమునకు అన్నమయ కోశమని పేరు వచ్చినది 2 ప్రాణమయ కోశము పంచ కర్మేంద్రియములున్ను, పంచప్రాణములున్ను కలిసి ప్రాణమయ కోశమగును ప్రాణవాయువుచేత నడుపబడినద గుటచే ప్రాణమయకోశమని పేరు వచ్చినది 3 పంచజ్ఞానేంద్రియములున్ను, మనస్సును కలిసి మనోమయకోశమగును మనస్సుచే నడుపబడుటచే మనోమయ కోశమని పేరు గలిగినది 4 పంచజ్ఞానేంద్రియములున్ను, బుద్ధియు కలిసి విజ్ఞాన కోశమగును బుద్ధితో నడుపబడునదగుటచే విజ్ఞానమయకోశమని నామ ధేయ మేర్పడినది 5 కారణ శరీరము ఆనందమయ కోశమనబడును ఈ ఆనందముకొఱకే తక్కిన కోశములన్నియు ప్రవర్తించుటచే ఆనందమయ కోశమని పేరు గలిగెను ఇది నిజానందాత్మ స్వరూపము గాదు అందువల్లనే కోశమని పేరు వచ్చినది అది క్రింద వివరింపబడును ఈ అయిదు కోశములు దేహత్రయములో అంతర్భూతములు

దేహత్రయమనగా, 1 స్థూలదేహము, 2 సూక్ష్మదేహము, 3 కారణ దేహము దహించిపోవునదగుట చేత స్థూలదేహమను పేరు ఏర్పడినది ఈ స్థూలదేహము స్థూలాగ్ని యందు దహించి భస్మమైపోవును కాని సూక్ష్మ, కారణదేహములు యోగాగ్నియందు, జ్ఞానాగ్నియందు మాత్రమే దహించి పోవును 1 స్థూల శరీరము, ఇది పంచప్రాణ, పంచభూత, కర్మేంద్రియ పంచక, జ్ఞానేంద్రియ పంచక, అంతఃకరణ చతుష్టయములతో 24 తత్త్వములతో గూడినది 2 సూక్ష్మదేహము ఇది పంచప్రాణ, పంచజ్ఞానేం ద్రియ, పంచకర్మేంద్రియ మనోబుద్ధులతో గూడి 17 తత్త్వములతో చేరియుండును కొన్నిటిలో అంతః కరణము రెండు తత్త్వములతోను, కొన్ని శాస్త్రములలో అంతఃకరణము మనస్సు, బుద్ధి, చిత్త అహంకారములనెడి 4 తత్త్వములతో గూడినదిగా చెప్పబడినది 3 కారణదేహము ఇది అవిద్య కము (అనగా మూలాజ్ఞానము) ఇది ప్రియ, మోద, ప్రమోదములతో కూడియుండును ఈ విషయమును విస్తారముగా గ్రహించేవారు పంచీకరణశాస్త్రములో కనుగొనవచ్చును

గ్రహావిష్టో ద్విజః కశ్చి చ్ఛూద్రోఽహమతి మన్యతే ।
గ్రహనాశాత్ పునః స్వీయం బ్రాహ్మణ్యం మన్యతే యధా ॥

మాయావిష్టస్తతో జీవో దేహోఽహమితి మన్యతే ।
మాయానాశాత్పునః స్వీయం రూపం బ్రహ్మాస్మి మన్యతే ॥

వేద వేదాంతములు బాగుగ నెరింగిన ఒక బ్రాహ్మణుని శూద్ర గ్రహము పట్టుకొనిన ఆవేశ సమయమున నెవరడిగినను శూద్రమునీశ్వరుడ నని చెప్పుచుండును అతనికిగూడ గ్రహావేశ సమయమున బ్రాహ్మణుడను బుద్ధిపోయి తాను శూద్రమునియను బుద్ధియే యుండును ఆ గ్రహము తొలగిన పిమ్మట నేలాగున నతని నిజస్థితియగు బ్రాహ్మణత్వము అను నిజబోధగల్గునో ఆలాగున మాయ అను గ్రహముచే జీవుడు పట్టుబడుటచే బ్రహ్మస్వరూపుడగు తాను దేహమనియు, బద్ధుడనియు, అల్పుడగు జీవుడ నియు తలంచి దుఃఖించుచున్నాడు ఆ మాయ తొలగినపిమ్మట నిజరూప మగు బ్రహ్మత్వము ప్రకాశించి తాను నిత్యముక్తుడనియు, బ్రహ్మమే అనియు బోధగల్గును

అయితే గ్రహనివృత్తికొఱకు మంచి భూతవైద్యుడు ఎట్లు కావలసియుండునో, ఆలాగున మాయాగ్రహనివృత్తి కొఱకు భవరోగవైద్యుడు కావలెను అతడే బ్రహ్మవేత్తయగు గురుదేవుడు

అయితే దీనియందొక రహస్యము గలదు భూతముపట్టినవాడు మరియొక భూతగ్రస్తుని నివృత్తిచేయజాలనట్లు సంసార సంబంధ గ్రహా విష్టుడు ఆచార్యుడు కాజాలడు అట్టి దోషమేమియు లేనివాడే గురువర్యు డుగా నుండవలెనని ముముక్షువులు తెలుసుకొనవలెను కావుననే గురులక్షణ మీలాగున తెలుపడమైనది

ఆశ్రమో ధ్యాననిరతః సంశయచ్ఛిత్సుబుద్ధిమాన్ ।
నిత్యానుష్ఠాన సంయుక్త స్త్వాచార్యః పరికీర్తితః ॥

తన ఆశ్రమమునకు తగిన ధ్యానముగల వాడును, సంశయములను

ఛేదించువాడును, నిర్మలమైన బుద్ధి గలవాడును, నిత్యానుష్ఠానమందు మంచి నిష్ఠ గలవాడును ఆచార్యుడనంబడును గీతలోను ఈ ఆత్మయే దైవస్వ రూపముగా వర్ణించడమైనది

**ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥**

ఓ యర్జునా! ఈ దేహమును క్షేత్రమనియు, ఈ క్షేత్రధర్మమును ఎవడెరుంగుచున్నాడో వానిని క్షేత్రజ్ఞుడనియు క్షేత్రక్షేత్రజ్ఞుల నెరింగిన వారు చెప్పుచున్నారు

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్రక్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ॥**

బ్రహ్మాది స్తంబపర్యంతము గల సకలోపాధులయందును ఉపాధి భేదముచే వేరుగా నున్నను, పరమార్థ జ్ఞానముచేత ఒకటేయగు ఆత్మయే నేను అని తెలుసుకొనుము ఇట్టి క్షేత్రక్షేత్రజ్ఞులను తెలిసికొనెడి జ్ఞానమేది కలదో అదే నిజమైన జ్ఞానమని నా మతము గీతాచార్యుని మతమెట్టిదో దీనివల్ల తెలుసుకొనవచ్చును ఇది మహావాక్యములోగల "ప్రజ్ఞానంబ్రహ్మ" అను పరమ తత్త్వమును తెలుపుచున్నది. కైవల్యోపనిషత్తున్ను దీనినే తెలుపు చున్నది.

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపఞ్చం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాఽహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్త్యాదులందు ఏ ప్రపంచము గోచరించుచున్నదో, అది బ్రహ్మస్వరూపమే ఆ బ్రహ్మమే నేనని యెరింగినచో సమస్త బంధముల నుండి విడువడుచున్నాడు.

**స ఆత్మా స చ విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః ।**
**తుర్యాత్మజ్ఞానహీనానాం న ముక్తిస్స్యాత్కదాచన ॥**

ముముక్షువు లందరిచేతను ఆ తురీయాత్మ తెలుసుకొనందగినది అట్టి తురీయాత్మజ్ఞానము గలుగనివారికి ఎప్పటికిని మోక్షమనునది కలుగదు కావున శ్రీకృష్ణభగవానుడు ఏ క్షేత్రజ్ఞుడు తన యొక్క స్వరూపమని చెప్పెనో, పై జెప్పిన శ్రుతియున్ను దానినే సమర్థించుచున్నది అట్టి జ్ఞానమే తనయొక్క మతమని యుద్ఘాటించెను కావుననే 'మతం మమ' అని వెల్లడి చేసెను ఇప్పుడు శ్రీశంకరుల జ్ఞానియొక్క ఆత్మబోధ మహిమను గురించిన ఒక్క శ్లోకమును తెలిపి యిది పూర్తిచేయబడుచున్నది

**యల్లాభాన్నాపరోలాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।**
**యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

ఏ ఆత్మలాభముకంటె అధికమైన మరియొక లాభము లేదో, ఏ ఆత్మ సుఖముకంటే మరియొక అధిక సుఖము లేదో, దేనిని తెలుసుకొనుటకన్న మరియొకటి అధికముగా తెలుసుకొనుటకు లేదో అది సర్వపరిపూర్ణ బ్రహ్మ మని గ్రహించు కొనందగినది

**యస్యాంతం నాదిమధ్యం నహి కరచరణం నామగోత్రం న సూత్రం,**
**నో జాతిర్నైవ వర్ణో న భవతి పురుషో నో న పుంసో న చ స్త్రీ ।**
**నాకారం నో వికారం న హి జని మరణం నాస్తి పుణ్యం న పాపం,**
**నో తత్త్వం తత్త్వమేకం సహజ సమరసం సద్గురుం తన్నమామి ॥**

ఎవనికి ఆది, మధ్యలు అంతము లేవో, కర చరణములు లేవో, నామ గోత్ర సూత్రములు లేవో, జాతిగాని, వర్ణముగాని లేదో, స్త్రీ పురుష నపుంసక రూపములేదో, ఆకార వికారము లేదో, జనన మరణములు లేవో, పాపపుణ్య ములు లేవో, అతత్త్వము కానిదో, ఏకతత్త్వ స్వరూపమైనదో, సహజ సమరస మైనదో అటువంటి సద్గురువు కొఱకు నమస్కారము

**జాతినీతి కులగోత్ర దూరగం నామరూపగుణ దోషవర్జితమ్ ।**
**దేశ కాల విషయాతివర్తి యత్ బ్రహ్మతత్త్వమసి భావయాత్మని ॥**

మనుష్యాది జాతి విధి నిషేధములకు, బ్రాహ్మణాది కులమునకు,

వసిష్ఠాది గోత్రమునకు దూరమును పొందియున్నదియు యజ్ఞదత్తాది నామములు, నీలశ్వేతాది రూపములు, సత్త్వాదిగుణములు అను దోషములు లేనిదియు, కోసలాది దేశములును, కృతాదివత్సర కాలమును, స్రక్చందనాది విషయములును అతిక్రమించి వర్తించునదియు నైన యా బ్రహ్మము నీవైతివి నీ యాత్మలో గ్రహించుకొనుము



# ఏకాగ్రత

## విద్యాతపోభ్యాం పుతాత్మా

ఈ ఏకాగ్రతకే చిత్తైకాగ్రతయనియు, మనస్సుయొక్క ఏకాగ్రత యనియు, మనోనిగ్రహమనియు, మనోనిరోధమనియు పేర్లు గలవు ఏకాగ్రతగల్గి రాగారాగా చిత్తముయొక్క స్వరూపము నశించి చిత్స్వరూపము మాత్రమే, అనగా జ్ఞేయవస్తువు మాత్రమే మిగిలియుండును అదియే దాని యొక్క గుర్తు నిజముగా నాలోచించిన మానవునియొక్క సర్వశక్తియు దీనిపై నాధారపడి యున్నది ఈ యేకాగ్రత సిద్ధించిన మాత్రమే ఏకమగు, అద్వైతమగు బ్రహ్మముయొక్క యనుభవము గల్గును ధారణాస్థితిని దాటి ధ్యానములో ప్రవేశించునప్పుడే మనస్సున నేకాగ్రత సిద్ధించును అప్పుడు ధ్యేయాకారమగు దైవమైనను సరి, లేక తురీయమగు యాత్మయయినను సరి, లేక 'ఏకమేవాద్వైత'మను శ్రుతియొక్క సారమైనను సరి గోచరమగును కావుననే యోగశాస్త్రమిటుల ధ్యానమును గురించి చెప్పుచున్నది

**తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్ ॥**

ప్రత్యయైకతానతా - ప్రత్యయ = ధ్యేయాలంబనరూపగు చిత్తవృత్తికి ఏకతానతా = ఏకాగ్రతయే, ధ్యానం = ధ్యానమను యోగాంగము

ధారణాలక్షణ ప్రతిపాదక సూత్రమున దెలుపబడిన

దేశమునందు లేక వస్తువునందు ధ్యేయవస్తువు నవలంబించియుండు చిత్త వృత్తికి తైలధారవలె అవిచ్ఛిన్న సదృశప్రవాహము విషయా నంతర సంబంధ రహిత మయ్యెనేని ధ్యానమనబడును

**తద్రూప ప్రత్యయైకాగ్ర్య సన్తతిశ్చాన్య నిస్పృహా ।**
**తద్ధ్యానం షడ్భిరంగైః ప్రథమైర్నిష్పాద్యతే నృప ॥**

అను శాస్త్రవచనము సయితము ధ్యేయాకారమునొందిన చిత్తవృత్తికి విజాతీయవృత్తి సంబంధ శూన్యమైన సజాతీయైకాగ్రతా ప్రవాహమే ధ్యాన మనియు, అదితొలుతటి ఆరు అంగములచే నేర్పడుననియు దెలుపుచున్నది

దీని కావలమెట్టే సమాధి యనంబడును సమాధిని గురించి పతంజలి మహర్షి చెప్పినదానిని జూడుడు

**సదేవార్థ మాత్రానిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః ॥**

ధ్యానము నిరన్తరాభ్యాసవశమున ధ్యేయాకారమున బరిణమించి, తన ధ్యాన రూపమును దోపనీయక నీటిలోబడిన లవణము నీరుగా బరిణమించి లవణాకారమును గనుపఱుపని చందమున నుండునేని యట్టిధ్యానమే సమాధి యనబడును లేక బీజము వృక్షమై పరిణమించునటుల ధ్యాతయే ధ్యేయాకారమై మారుచుండును అనగా జీవత్వమే శివత్వమును బొందుచుం డును కాన ధ్యానమునందు ధ్యాతృ ధ్యాన ధ్యేయములు గలసిన త్రిపుటి భాసించును సమాధియందన్నచో ధ్యేయము మాత్రము భాసించును ఇంత మాత్రమే ధ్యానసమాధులకు భేదము పై జెప్పిన యేకాగ్రత వరకు సాధన చేయకపోవుటవలననే వేదాంత విచారము చేయువారికి వృత్తి రాహిత్యము గాక పోవుటకున్ను, జ్ఞేయమగు బ్రహ్మస్థితిలో నిలుకడ గలుగక పోవుటకున్ను కారణమగుచున్నది ఈ విషయమే గీతలో శ్రీకృష్ణభగవాను డుపదేశించినది

**యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।**
**యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః ॥**

నియమింపబడిన చిత్తము గలవాడును, ధ్యానయోగము నభ్యసించు వాడునునగు నాత్మ ధ్యానయోగియొక్క మనస్సునకు గాలిలేనిచోట నుండెడి దీపము ఏ ప్రకారము చలింపకయుండునో అట్టి నిశ్చలస్థితి ఉపమానముగా చెప్పబడినది ఈలాటి యేకాగ్రత పూర్తిగ గల్గినమాత్రమే ఏకమగు దైవమందు సుస్థిరత సిద్ధించును ఇట్టి యేకాగ్రత రూఢిపడిన మాత్రమే తన ఆత్మ మాత్రము మిగిలి యుండును ఈ యేకాగ్రతా విషయమై ఒక గాధను తెలిపెద

ధనుర్విద్యాపారంగతుడగు శ్రీ ద్రోణాచార్యులు తన శిష్యులగు అర్జునాదుల నొక సమయమున నొక స్థలమున సమావేశపరచి, వీరిలో ఎవరధికుడని పరీక్షించుటకు ఒక ప్రదర్శనమును సమకూర్చెను అనేక ధనుర్విద్యానిపుణులున్ను, ప్రేక్షకులున్ను హాజరై యుండిరి అట్టి తరుణమున అర్జునాది ముఖ్య రాజకుమారులను ప్రదర్శన మధ్య స్థలములోనికి పిలిచి, అచట స్థాపించియుండు మత్స్యయంత్రాగ్ర భాగమున మీనరూపముగా చేయబడి యుండుదాని శిరస్సును ఖండించవలయుననియు, అయితే మీరందఱును బాణములను అనుసంధించి యుండవలసినదే యనియు, నేనడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పిన పిమ్మట మాత్రమే శరములను ప్రయోగించవలయుననియు ద్రోణాచార్యులు నియమము చేసియుండిరి. ఆ మత్స్యయంత్రము నెమ్మదిగా తిరుగుచుండెను ఒక్కొక్కరిని పిలిచి మీకు ఇప్పుడు ఏమి కనిపించుచున్నదని యడుగగా, నాకు ఈ మహాసభయంతయు కానుపించుచున్నదని ఒకడును, మరియొకడు నాకు ఈ మత్స్యయంత్రము మొదటినుండి కొనవరకు కనబడుచున్నదనియు, వేరొకడు నాకు యంత్రాగ్రభాగముననుండు మత్స్యముమాత్రమే గోచరించుచున్నదనియు, మరి కొందరు వారి వారికి గోచరించిన భాగములను గురించి చెప్పగా వారందఱితోను మీరెవరును బాణమును ప్రయోగించవలదని చెప్పుచూ, అర్జునునితో నీకిప్పుడు ఏమి గోచరించుచున్నదని ప్రశ్నించగా, అర్జునుడు, నాకు ఆ మీనముయొక్క శిరస్సు మాత్రమే కానుపించుచున్నదని చెప్పెను

అట్లగుచో ఆ యన్త్రము తిరిగివచ్చు వేగమును జ్ఞాపకము చేసికొని ఆ మత్స్యముయొక్క శిరస్సును ఛేదింపుమాయని దోణుడాజ్ఞాపించెను వెంటనే ఆ యన్త్రగమన వేగమును శరవేగమును భావించి ఆ మీనశిరస్సును అర్జునుడు ఖండించెను తక్కిన వారందఱితోను ధనస్సులో ననుసంధించి యుండు శరముల నుపసంహరించుకొనేలాగున ద్రోణాచార్యు లాజ్ఞా పించిరి ఈ కధాసారము నెఱింగిన చిత్తైకాగ్రతయొక్క సత్యము దెలిసికొనగలరు కావుననే ముండకోపనిషత్తున ఈలాగున నుపదేశించడమైనది

**ప్రణవో ధనుశ్శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే ।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥**

ప్రణవమును ధనుస్సుగాను, జీవాత్మను లేక మనస్సును బాణము గాను, బ్రహ్మమును లక్ష్యముగాను జేసికొని అప్రమత్తుడై ఛేదించవలయును అట్టైన బాణమేలాగున లక్ష్యములోనికి జొరబడిపోవునో, ఆలాగున ఈ జీవాత్మ లేక మనస్సు బ్రహ్మమందు ప్రవేశించును అనగా బ్రహ్మములో నైక్యమగును అనగా బ్రహ్మమయమై నిలుచును అందుచేతనే అక్షరసముదా యములో ఏకాక్షరమగు ఓంకారమువలననే బ్రహ్మము నెరుంగగలరని చెప్పు దురు అదియునుగాక కట్టకడకు ఓంకారములోగల అకార, ఉకార, మకారములను గూడ త్యజించి అర్ధమాత్రయగు బ్రహ్మము నుపాసించ వలయునని ఉపనిషత్తులు తెలుపుచున్నవి "అవాచ్యం ప్రణవ స్యార్థం యస్తం వేద స వేదవిత్" ప్రవణస్యాగ్రమనియు, ప్రణవస్యాన్త మనియు పాఠాన్తరములు గలవు

వాగిన్ద్రియమున కతీతమగు ప్రణవార్థము నెవడెఱుంగునో, వాడే వేదార్థమును నెఱింగినవాడు

**శబ్దాక్షరం పరం బ్రహ్మ తస్మిన్ క్షీణే యదక్షరమ్ ।**
**తద్విద్వానక్షరం ధ్యాయేద్య దిచ్ఛేచ్ఛాన్తి మాత్మనః ॥**

పరబ్రహ్మము ప్రణవమగు శబ్దాక్షరముగానున్నది ఆ శబ్దము సమాప్తి

నొందిన పిదప ఏది శేషించుచున్నదో, ఆ అక్షరమును (నాశములేని బ్రహ్మ మును) ఆత్మశాన్తి గోరు విద్వాంసుడు ధ్యానించవలెను

ఇది సూదిరన్ధ్రమున దారమెక్కించునప్పుడు కుడిచేయియు, ఎడమ చేయియు నెటుల నిశ్చలముగా నుండవలయునో, దారముయొక్క అగ్ర భాగమున్ను ఎటుల ఏకాగ్రత గల్గి యుండవలయునో, అట్లైన మాత్రమే సూది బెజ్జములో నూలు నెక్కింపగలమో, ఆరీతిగా బాహ్యాభ్యన్తరేన్ద్రియములకు ఏకాగ్రతగల్గిన మాత్రమే బ్రహ్మరన్ధ్రములో, మోక్షద్వారములో ప్రవేశింప గలము అదియే సంకల్ప వికల్పములు లేని జ్ఞేయైకస్థితి యగును అష్టాంగ యోగములు ఈ స్థానములోనికే మనలను తీసుకొనివెళ్లుచుండును అట్టి కట్టకడపటి స్థితియే నిర్వాణము, నిర్వికల్పసమాధి

ఇకను ఏకాగ్రతను గురించి వచించెద మీలో చాలా మందిన్ని సూర్య కాంత అద్దమును చూచి యుందురు అది సూర్యునకు సమ్ముఖముగా నుంచిన అద్దము ద్వారా అడుగున వెంటనే నిప్పు ఏర్పడును ఆ దర్పణము కొంచెమైనా కదలుచుండిన అగ్ని పడజాలదు ఇది మీరెవరైనా పరీక్ష చేసి కొనవచ్చును ఆలాగున మీ మనస్సు ఏకాగ్రత గల్గియుండిన మాత్రమే మనస్సుపై వెలుగుచుండు బ్రహ్మజ్ఞానాగ్ని ప్రజ్వలించి మీ యవిద్యను కర్మ కట్టెలతో సహా నిర్మూలించును

మరియొక రహస్యముగూడ దానియందు గలదు అదేమన, దర్పణమున ఏలాటి మసియున్ను నుండకూడదు పై చెప్పిన విధముగా ఏకాగ్రత మాత్రము చాలదు చిత్తనిర్మలతయు నుండవలయును యోగ సాధనవలన ఏకాగ్రతయు, ఆత్మవిచారణవలన శుద్ధియు గల్గును కావుననే యోగమొకటి చాలదు అదేవిధముగా వేదాంత విచారణము సరిగా పని చేయచాలదనియు ముముక్షువులు గ్రహించుకొనవలయును జ్ఞానము జ్యోతివంటిదనియు, యోగము చిమ్నివంటిదనియు విజ్ఞులు వర్ణింతురు ఋషులలో, పరమ గురువులలో ఇవి రెండున్ను కనుపించుచున్నవి చిమ్ని

లేనిచో గాలిచే దీపము బాధింపబడును దీపము లేనిచో చీకటి నశించదు కావుననే శాస్త్రమిటుల నిరూపించుచున్నది

**యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్ ।**
**తస్మాద్జ్ఞానం చ యోగం చ ముముక్షుర్దృఢమభ్యసేత్ ॥**

యోగము లేనిచో ఏలాగున మోక్షమును గలుగజేసెడు జ్ఞానము సిద్ధించదో, ఆలాగున ఆత్మజ్ఞానము లేకపోయిన ఎటుల శాశ్వతమయిన మోక్షము సిద్ధించును? అందువల్ల ముముక్షువైనవాడు తప్పక జ్ఞానమును, యోగమును అభ్యసించుకొనవలయును

చిత్తైకాగ్రతను గురించి యింకను కొన్ని రహస్యముల తెలిపెద

సూక్ష్మమగు నొక రంధ్రములో ఒక మేకును ఎక్కించవలసి యుండిన దానికొనను ఎంత ఏకాగ్రముగా చెక్కవలసి యున్నదో, ఆలాగున మిక్కిలి సూక్ష్మమైన బ్రహ్మములో మనస్సు ప్రవేశించవలసియుండిన అంత ఏకాగ్రత గల్గియుండవలయును కావుననే గీతాచార్యుండు ఏకాగ్రతలేని బుద్ధి "సమాధౌ న విధీయతే" అనియు "అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః", సంయమన శక్తి లేని మనస్సు గలవారికి యోగసిద్ధి గలుగదనియు చెప్పెను సంయమముచే గల్గెడు మహిమాతిశయమును దెలిపెద

సన్నని ఒక దారమున చిన్న జంతువును కట్టివేసిన అది దారమును ద్రుంచి వెళ్ళిపోవును ఆలాటి కొన్ని దారములచే త్రాడుచేసి కొన్ని త్రాళ్ళచే ఒక మోకు చేయునప్పుడు ఏనుగును సహా కట్టివేయవచ్చునుగదా! ఆలాగున ఇంద్రియముల సంయమముచే ఎటువంటి మనస్సునైనా యాత్మలో బంధించుకొనవచ్చును మఱియు, అతివేగముతో అనేక జనులను గమ్యస్థానమును జేర్చెడు ఒక రైలు ఇంజను నిప్పు నీళ్లచే బాయిలర్లో ఏర్పడు స్టీమును సంయమము చేసినందుచేతనే అతివేగముగా తిరుగుటకై శక్తిగలదగుచున్నది ఆలాగున మానసేంద్రియ నిరోధముగల యోగియు తాను తరించు

నదే గాక అనేకులను మోక్ష స్థానములోనికి తీసికొని వెళ్లెడుశక్తి గలవాడగును

**వివిక్త దేశే చ సుఖాసనస్థః శుచిస్సమగ్రీవ శిరశ్శరీరః ।**
**అత్యాశ్రమస్థస్సకలేన్ద్రియాణి నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య ॥**

ఏకాంత ప్రదేశమున సుఖాసనస్థుడై కంఠము, శిరస్సు, దేహము అను నీ మూటిని సమముగా నుంచుకొన్నవాడై, తురీయాశ్రమమున నుంటున్న వాడై, సకలేన్ద్రియముల నిగ్రహించిన వాడై భక్తితో గురువునకు నమస్కరించి ఆత్మధ్యానమందు ప్రవేశించవలయును

**వివిక్త దేశ ఆసీనో విరాగో విజితేన్ద్రియః ।**
**భావయే దేకమాత్మానం తమనంతమనన్యధీః ॥**

జన సంకలనములేని ప్రదేశమున కూర్చున్నవాడై, సమస్త ఆశలను వర్జించి, ఇంద్రియములను వ్యాపారమందు ప్రవేశింపకుండ అణచి, మనస్సును చలింపకుండ ఆత్మయందుంచి, ఆయాత్మ నిత్యశుద్ధ స్వప్రకాశ జ్ఞానస్వరూపముగా భావించి, ఆ యాత్మయే తానని దృఢముగా ధ్యానించ వలయును

**ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే ।**
**దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥**

ఈ యాత్మ సర్వభూతములయందు నిగూఢమై యున్నందున కానుపింపక యున్నది కాని సూక్ష్మదర్శులగు జ్ఞానుల సూక్ష్మ ఏకాగ్రబుద్ధికి నయ్యది కానుపించుచున్నది

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమంధవత్ ॥**

ఆత్మజ్ఞానమను నేత్రము గలవాడు సమస్తమందు వ్యాపించి యుండు సచ్చిదానంద స్వరూపాత్మను తన్నుగా జూచుచున్నాడు అట్టి జ్ఞానదృష్టి లేని యజ్ఞాని ప్రకాశించుచున్న సూర్యుని గ్రుడ్డివాడు జూడజాల నటుల ఆత్మను

(దైవమును) చూడజాలకయున్నాడు

ఇక సీతారామాంజనేయములో చెప్పిన ఒక పద్యమును నిరూపించి యీ వ్యాసమును పూర్తిగావించెద ఈ పద్యముయొక్క భావము అంత మంచిది కాకపోయినను, అనేక స్త్రీ పురుషులు అట్టి అవిద్యావృత్తిలో నుండు వారగుట చేతను, సంసార సంబంధకర్మలలో మునిగియుండు వారగుట చేతను ఆత్మచింతనము, దైవభక్తిని చేయుటకు సమయమెటుల దొరుకునని సంశయముగల వారికి ఈ భావము తెలిసికొనిన సంసారములో నుండియే దైవప్రాప్తిని పొందవచ్చునని తలంచి మహనీయాత్ములు సామాన్య జనులకు గూడ గోచరమయ్యే లాగున దృష్టాంతమును వచించుచుందురు అంతేగాని మరియొక విధముగా తలంచవలదు

**పరపురుషానురక్తి గల భామిని యెల్ల పనుల్ గృహంబునం**
**బొరి బొరి జేయుచుం బ్రియుని పొందు సుఖంబుగ జూచురీతి భా**
**స్వర పరతత్త్వవేది నిజ వర్ణ నిజాశ్రమయోగ్య ధర్మముల్**
**నిరతము సల్పుచుం బరమ నిర్మల సౌఖ్యము గాంచు నెమ్మదిన్.**



# శ్రీకృష్ణమతమ్

శ్రీకృష్ణమతమనియు, శ్రీకృష్ణాశయమనియు, శ్రీకృష్ణ సిద్ధాన్తమనియు వేరువేరు నామధేయములతో వ్యవహరించు పదములన్నియు ఒకే యర్థమునే వ్యక్త పరచుచున్నవి ఇదే శ్రీ భగవద్గీతా తాత్పర్యమనియు వచింతురు నిష్కామ కర్మయోగమే శ్రీకృష్ణమతమని కొందఱును, ఉపాసనయే (భక్తియే) గీతాశయమని మఱికొందఱును, యోగమే శ్రీకృష్ణసమ్మతమని ఇక కొంద ఱును, జ్ఞానమే శ్రీకృష్ణతాత్పర్యమని వేరుకొందఱును వచించుచున్నారు ఈ నాల్గు మార్గములతోను అనుసన్ధించియే తక్కిన యధ్యాయములన్నియు ఆధారపడియున్నవని ఆలాగున చెప్పు వారి యభిప్రాయము. ఈలాగున

వచించువారున్ను, వ్యాఖ్యానించువారున్ను సామాన్యులు కారు మహామహనీయాత్ములే, మతకర్తలే,అవతార పురుషుల వంటివారలే నిష్కామకర్మపరమై చెప్పువారు అధ్యాయము మూడులో గల -

**న కర్మణామనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।**
**న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥**

పురుషుడు కర్మలను ఆరంభింపక పోవుటవలన, నిష్కామ కర్మముచే పొందదగిన నైష్కర్మ్య సిద్ధిని (ముక్తిని) పొందడు కర్మలను విడుచుట వలన జ్ఞానసిద్ధిని సరిగా పొందడు

**తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।**
**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥**

ఆ కారణముచే ఫలాపేక్ష లేనివాడవై భక్తి శ్రద్ధలతో, ఈశ్వరార్పణ బుద్ధితో, నీవాచరించవలసిన కర్మను చేయుము ఏలయనగా పురుషుడు ఫలాపేక్షలేనివాడై ఈశ్వరార్పణబుద్ధితో సత్కర్మల నాచరించుచున్నవాడై మోక్షమును పొందుచున్నాడు అను శ్లోకముల నుదాహరింతురు ఇక భక్తి యోగమును ముఖ్యముగా బోధించువారలు

**అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారంభ పరిత్యాగీ యో మద్భ క్తస్స మే ప్రియః । (12 - 16)**

ఏ నాభక్తుడు దేనియందు అపేక్షలేని వాడును, బాహ్యాభ్యంతర శుద్ధిగలవాడును, కార్యదీక్షగలవాడును, ఎందును తగులుకొనని వాడును, మనోవ్యాకులత్వము లేనివాడును, సమస్త ఆడంబరకర్మలను వదలిన వాడును అగుచున్నాడో, వాడు నాకు ప్రియుడు, మఱియు

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప ॥ (11 - 54)**

ఓ యర్జునా! యిట్టి విశ్వరూపమును ధరించిన నేను, అనన్య భక్తి

యోగముచేతనే యథార్థముగా నెఱుంగుటకును, చూచుటకును, ప్రవేశించుటకును శక్యుడ నగుచున్నాను

'జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం'అని చెప్పుటచే తెలియుటకును, దర్శించుటకును, పరమాత్మయందైక్యము గలుగుటకున్ను భక్తి యోగమే అవసరమని అర్థము

**భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥ (18 - 55)**

అట్టి భక్తిచేత నన్ను ఎవడనైనదియు, ఎట్టివాడనైనదియు, యథార్థముగా ఎవడెరుగుచున్నాడో, వాడు అట్లెరుంగుట వలన నన్ను నిజముగా తెలిసికొనినవాడై, పిమ్మట నాలో నైక్యమగుచున్నాడు నా స్వరూపమగుచున్నాడు' అను శ్లోకములను నిరూపింతురు

ఇక యోగాభ్యాసమే ప్రధానమని నిర్ణయించు వారు

**యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః ।**
**శాన్తిం నిర్వాణ పరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ (6 - 15)**

మనోనిగ్రహముగల యోగధ్యానపరుడు ఇట్లు ఎల్లప్పుడు మనస్సును అలవరచినవాడై, మోక్షమే పర్యవసానముగా గలదియు, నాయందుండునట్టిదియునగు చిత్తోపరతిని (నిర్వాణమును) మోక్షమును పొందుచున్నాడు అను శ్లోకమును ప్రమాణముగా పేరుకొందురు అదియునుగాక, ప్రతి అధ్యాయాంతమున సమాప్తి చేయునప్పుడు "యోగశాస్త్రే" అని వచించుటకును, మరల అనేక స్థలములో 'యోగేశ్వరః కృష్ణః' అని ప్రయోగించుటకును యోగప్రాముఖ్యమే హేతువని వాదింతురు

ఇక జ్ఞానమే గీతామతమని నిర్ధారణ చేయువారు

**యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ (4 -37)**

ఓ యర్జునా! ఏ ప్రకారము చక్కగా ప్రజ్వలించెడు అగ్నిహోత్రుడు సమిధలను భస్మము చేయుచున్నాడో, ఆ ప్రకారముగానే జ్ఞానమనెడు అగ్ని సమస్త కర్మలను భస్మము చేయుచున్నది

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే (4 - 38)**

ఈ లోకమున జ్ఞానముతో సమానమైనదియు, పావనమైనదియు మఱియొకటి లేనేలేదు గదా అనియు

**అపిచేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ (4 - 36)**

సకల పాపాత్ములకంటే నీవు విశేష పాపముల చేసిన వాడవైనను, సమస్త పాపసముద్రమును ఈ జ్ఞానమనెడు తెప్పచేతనే లెస్సగా దాటగలవు అను శ్లోకములను తమతమ వాదములకు సాక్షులుగా నిశ్చయించు కొనెదరు

అయితే శ్రీ భగవద్గీతను ఆమూలాగ్రముగ పరిశీలించినచో, వారు వారు చెప్పిన మార్గములన్నియు గీతలో గలవు అవియన్నియు జీవ కోట్ల సంస్కార మనుసరించియు, పరిపక్వమునుబట్టియు నుండవలయునని మనకు గోచరమగును ఒక్కొక్కరును ఒక్కొక్క భాగమును ఉద్ధరించుట కొఱకు నవతరించిన వారే అద్దానిని ఉపదేశించునప్పుడు ఆలాగున చెప్పక పోయిన వారి వారి మతమునకు దార్ఢ్యము గలుగజాలదు వేదమేలాగున కాండత్రయాత్మకమో, గీతయును ఆలాగుననే యుంటున్నది కావుననే షట్కత్రయముతో గీతను నిర్మించిరి ఉపాసనయందు యోగమన్తర్భూతము కావున యోగమును ప్రత్యేకించ నక్కఱ లేదు ఈ కారణమువలననే "సర్వోపనిషదో గావః" అని గీతను వర్ణించిరి కర్మ, ఉపాసనా, జ్ఞాన మనునవే కాండత్రయాత్మకమని గ్రహించేది అగుచో ఈ నాల్గు మార్గములున్ను గీతలో గలవని చెప్పంబూనిన ఏదిముఖ్యము లేక యేదిమోక్షము నొసగునది? అని సన్దేహ ముదయించగలదు అట్లు సంశయింప నవసరము

లేదు ఏలననగా నదులన్నియు నానా దిక్కులలో ప్రవహించుచున్నను అన్నిటియొక్క గమ్యస్థానము అన్తిమస్థితి యేలాగున సముద్రమైయున్నదో, ఆలాగుననే దీని గతియు నుండునని గ్రహించవలయును కావుననే

**ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ ।**
**సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి ॥** ఆలాగున

**ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ ।**
**సర్వదేవ నమస్కారః శంకరం ప్రతిగచ్ఛతి ॥**

ఆకాశమునుండి కురియుచున్న వాన జలము అష్టదిక్కులలోనికి ప్రవహించినను అన్నియు సముద్రములోనే ఎట్లు చేరుచున్నవో ఆలాగున పై జెప్పిన కర్మ, భక్తి, యోగ జ్ఞానములలో దేనిని అవలంబించినను శ్రీమన్నా రాయణుని పొందుచుండునని వైష్ణవులును, శివునే పొందుచున్నవని శైవు లును వచింతురు మఱియు

**యథా తోయ ప్రవాహానాం సముద్రః పరమావధిః ।**
**తథైవ సర్వమార్గాణాం సాక్షాన్నిష్ఠా మహేశ్వరః ॥**

ఇదియు పై శ్లోకము ననుసరించి యున్నది

గీత యెట్టిదనగా ఒక జనరల్ ఆస్పత్రి యని గ్రహించదగును అచ్చట అనేక ఔషధము లుండును తక్కిన మార్గములన్నియు ఒక్కొక్క రోగము నకుగల, కన్నాస్పత్రి, క్షయాస్పత్రి వంటివని తెలిసికొనవలయును నిజముగా నాలోచించిన ప్రారంభదశలో పై జెప్పిన కర్మ, భక్తి యోగ జ్ఞానములలో ఒక్కొక్క దానియందు ప్రవేశించి సాధన చేసినను కట్టకడపటికి అందరికిని పై జెప్పిన నాలుగు యోగములును సమకూడును అయితే ఒక్కొక్కటి ముఖ్యము తక్కినవి గౌణము అను భేదము గల్గును ఎట్లన పుణ్యకర్మలను చేయనిచో పాపక్షయమున్ను, అంతఃకరణ శుద్ధియు గలుగదు దైవభక్తి లేనిచో ప్రకృతి ప్రకోపము శమించదు యోగము కొంతవరకు లేనియెడల

చిత్తైకాగ్రత సిద్ధించదు జ్ఞానవిచారణ చేయక పోయిన ఆవరణము దొలగదు, బ్రహ్మవస్తుస్వరూపము గోచరించదు ఏ యొక్క జీవన్ముక్తుని చూచినను అన్తఃకరణముయొక్క శుద్ధి లేనివారును, దైవభక్తి లేనివారును, ఇంద్రియ నిగ్రహము లేనివారును, ఆత్మజ్ఞానబోధ గలుగనివారును ప్రపంచములో కానుపించరు కావుననే పై జెప్పిన నాలుగు మార్గములను వారు ఎప్పుడో ఒకప్పుడు అనుష్ఠించియేయుందురు అది పూర్వజన్మములోనైనా ఉండ వచ్చును దీపము నిరావరణముగా వెలుగవలసియుండిన ప్రమిద, తైలము, వత్తి, గాలిలేని స్థలము, తప్పక యెచ్చటనైనను ఎవరికైనను ఎట్లు ఉండవలసి యున్నవో ఆలాగున జ్ఞానజ్యోతి వెలుగవలసియుండిన పై జెప్పిన ప్రకారము నాల్గు యోగములున్ను తప్పక సమకూడవలసియుండును ఇది నాల్గుయోగముల గురించిన సంగ్రహ విషయము

ఇక సర్వశాస్త్ర సమన్వయకర్తలు తెలిపినది చూడుడు వీరు సార్వభౌ ముల వంటివారు తక్కిన వారు ఒక్కొక్క దేశమునకు లేక ఒక్కొక్క జాతికి సంబంధించిన రాజుల వంటివారే యగుదురు శ్రీ శివమహిమ్నః స్తోత్రము నందు పుష్పదంతాఖ్యుడగు గంధర్వరాజు చెప్పినది గాననగును

**త్రయీసాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి**
**ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ ।**
**రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిలనానాపథజుషాం**
**నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ ॥**

మానవుల సంస్కారములు అనేకములగుటచే ఒక్కొక్కరికిని వారి వారి పూర్వజన్మ సంస్కారముల ననుసరించి కొందరికి వేదసమ్మత వేదాంత మందును, కొందఱికి శైవమందును, మఱికొందఱికి వైష్ణవమందును అభి రుచి గలుగుచుండును ఈలాటి మతములన్నియు అనేకముఖములై ప్రవహించెడు నదులవలె నుండి కట్టకడకు సముద్రములో చేరునటుల, అందఱును ప్రకృతి ఆవరణమును దాటిన ఒకే పరబ్రహ్మమును పొందుచుం

దురు మఱియు,

**యం శైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో**
**బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః ।**
**అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః**
**సోఽయం నో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో విభుః ॥**

ఏ అఖండ స్వరూపుని, పరమాత్మను శివోపాసకులు శివుడనియు, వైష్ణవులు విష్ణువనియు, వేదాన్తులు బ్రహ్మమనియు, బౌద్ధులు బుద్ధదేవుం డనియు, తర్కశాస్త్ర నిపుణులు కర్తయనియు, జైనులు అర్హన్ అనియు, మీమాంసకులు కర్మయనియు ఉపాసించుచున్నారో, అట్టి సర్వస్వరూపుడగు, అద్వితీయుండగు పరమాత్మ మనయందఱియొక్క వాంఛితఫలము నొసంగుగాక! ఒక్కొక్కరు వర్ణించెడు భగవత్స్వరూప మహిమ ఎటువంటిదో ఈ క్రింది శ్లోకముచేత తెలిసికొనిన మన కాత్మశాంతి గల్గును

**అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రే**
**సురతరువరశాఖా లేఖినీ పత్రముర్వీ ।**
**లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం**
**తదపి తవ గుణానామీశ! పారం న యాతి॥**

కాటుకకొండ మసి, సముద్రమే సిరాపాత్ర, కల్పవృక్షశాఖలే వ్రాసెడి కలములు, భూమియే వ్రాసెడు పత్రము, ఈ పరికరములతో శ్రీ సరస్వతీ దేవి సర్వకాల సర్వావస్థలయందు వ్రాసినను ఓ సర్వేశ్వరా! మీయొక్క మహిమాతిశయమును వర్ణించజాలదు అట్లుండగా సామాన్య మనుజుడు నీ మహిమాతిశయమును గురించి యేమి తెలియ గలుగును?

ఇక మనమిప్పుడు ప్రారంభించిన శ్రీకృష్ణమతమును గురించి తెలిసికొనుటలో ప్రవేశింతము ఇదియే నామతమని శ్రీకృష్ణభగవానుడు దీనిని గురించి యెచ్చట తెలిపెనో దానిని వినుడు

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత!**
**క్షేత్రక్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ॥ (13 - 3)**

ఓ యర్జునా! సమస్త దేహములందుండెడు క్షేత్రజ్ఞుని (జీవుని) నన్నుగా ఎఱుంగుము ఇట్టి క్షేత్రక్షేత్రజ్ఞుని నిజమైన స్వరూపమును ఎఱుంగుట యేది కలదో అదియే నిజమైన జ్ఞానమని నా మతము ఈ శ్లోకాన్తమున "యత్తత్ జ్ఞానం మతం మమ = ఇదియే నాయొక్క మతము అనగా సిద్ధాన్తము" అని స్పష్టముగా నెలుగెత్తి చాటినారు ఇచ్చోట క్షేత్ర = దేహము యొక్కయు, క్షేత్రజ్ఞ = ఆత్మయొక్కయు జ్ఞానమే తనమతమని సిద్ధాన్తీకరించినారు

24తత్త్వములతో గూడినది శరీరమనియు, దీనికి సాక్షియై యుండువాడే జీవుడనియు నిరూపించినారు అయితే ఇది గొప్ప విషయము కాదు అందఱును జెప్పునదే ఆస్తికమతస్థు లందఱును తెలుపునదే కావున ఇది కాదు దీనిలో గల మహిమాతిశయము ఆ మహిమాతిశయమేమన ఈ మూడవ శ్లోకమున 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత'- ఓ యర్జునా! ఆ క్షేత్రజ్ఞుని నన్నుగా అనగా శ్రీకృష్ణపరమాత్మగా నెఱుంగుము ఇచ్చుటనే మతముల కీలకము గలదు ఇచ్చుటనే జీవేశ్వరులు భిన్నులా? లేక అభిన్నులా? అని సంశయముదయించును ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతముల భేదము అనగా సూత్రము ఇచ్చుటనే యున్నది వేదాంత శాస్త్రము లన్నియు దీనిని గుఱించియే విమర్శించుచున్నవి మతకర్తల ప్రజ్ఞయంత యును ఇచ్చుటనే ధారపోసిరి ఆ భావములన్నిటిని ప్రకరణ గ్రంధములలో చూచుకొనవచ్చును

ఇది సంగ్రహవ్యాస మగుటచే శ్రీ కృష్ణభగవానుడు స్వయముగా తన మతమిట్టిదని చెప్పిన వాక్యము మాత్రమే వ్రాయబడును తత్త్వమస్యాది మహావాక్యములన్నియు ఈ 'ప్రజ్ఞానం బ్రహ్మ'అను దానినే బోధించుచున్నవి దానిని పొందకపోయిన ఒకడు సుందరమైన ఒక దేవాలయమును నిర్మించెను కాని ప్రతిష్ఠ చేయకముందు తానే గతించెను అతడేలాగున క్షేత్ర

నిర్మితఫలమును పొందకపోయెనో, ఆలాగున ఎన్ని సాధనలు చేసినను, ఉత్తమకులమున జన్మించినను, తురీయాశ్రమమును స్వీకరించినను, తపోధ్యానాదియోగముల ననుష్ఠించినను శ్రీకృష్ణభగవంతుడు ఉపదేశించిన క్షేత్రజ్ఞాత్మను పరమాత్మనుగా ఎఱుంగక పోయిన మోక్షమును పొందజాలక పోవునని మరువకుడు కావుననే ఈ యధ్యాయమున 8వ శ్లోకము నుండి 12వ శ్లోకమువరకు జ్ఞానమును అనగా జ్ఞాని కుండవలసిన గుణములను జెప్పి, 13వ శ్లోకములో పై జెప్పినవన్నియు జ్ఞానిలక్షణమ్ము లనియు, దానివలన తృప్తిని జెందక జ్ఞేయమును తెలిసికొనవలయుననియ్ము, లేనిచో అమృతత్వ మును (ముక్తిని) పొందజాలరనియు నుపదేశించిరి కావుననే

**జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృతమశ్నుతే ।**

'ఏది యెఱుంగదగినదో, దేనినెఱింగిన జీవుడు అమృతత్వమును పొందునో' అని భగవానుడు తెలిపెను అందువలననే "అమృతమశ్నుతే" అని వర్ణించిరని మరువకూడదు ఈ జ్ఞేయమునే 13వ శ్లోకమునుండి 19వ శ్లోకమువరకు శ్రీభగవాను డుపదేశించెను ఇదియే యథార్థముగ శ్రీకృష్ణమత మగును మొదటనే ఈ యధ్యాయమున ఆరు ప్రశ్నలను అర్జును డడిగియు న్నాడు

**ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ ।**
**ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥**

1 ప్రకృతి యనగా నెట్టిది? 2 పురుషుడనగా నెవ్వడు?, 3 క్షేత్ర మనగా నెట్టిది? 4 క్షేత్రజ్ఞుడనగా నెవ్వడు?, 5 జ్ఞానమనగా నేమి?, 6 జ్ఞేయ మనగా నెట్టిది? వీటిని తెలిసికొనుటకు కోరుచున్నాను కట్టకడపటి రెండు ప్రశ్నలే మనకు ముఖ్యములు అవి యేవనగా "జ్ఞానం జ్ఞేయం చ కేశవ" అనగా జ్ఞానమనగా నేమి? జ్ఞేయమనగా నెట్టిది? జ్ఞానమును గుఱించి 5 శ్లోకములను, జ్ఞేయము నుద్దేశించి 7 శ్లోకములను ఉపదేశించిరి అవి పై నిరూపింపబడినవే ముముక్షువులు వానిని బాగుగా ఉత్తమ బ్రహ్మనిష్ఠుల కడ

జేరి విచారణ చేసికొనవలయును అట్లు కానిచో ఆత్మహన్తకుడే యగును అని శ్రీభగవానుడే యీ యధ్యాయమున 29వ శ్లోకమున తెలిపెను

**సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।**
**న హి నస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥**

సకల ప్రాణులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని సర్వ సమునిగా తెలిసికొననివాడు తనయాత్మను చంపుకొనిన వాడగుచున్నాడు అందుచే ఆత్మసాక్షాత్కారము గలుగజేసికొనని వాడు ఆత్మహన్తకుడనియు, ఆత్మయందు పరమాత్మను చూచినవాడు మాత్రమే యాత్మను హింసించని వాడనియు, ఆకారణమువలన ఉత్కృష్టమగు బ్రహ్మపదమును ఆతడు మాత్రమే పొందగల్గుననియు శ్రీకృష్ణభగవాను డుద్బోధించెను మఱియు 28వ శ్లోకమున

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥**

బ్రహ్మాది స్తంబపర్యన్తములగు సమస్త వస్తువులయందును, సమముగా నుండునట్టి పరమేశ్వరుని ఎవడు సర్వము నశించినను, నశించని వానినిగా చూచుచున్నాడో, వాడే చూచువాడు అట్టి జ్ఞానములేనివాడు నేత్రములుండియు అంధుడే యగునని శ్రీభగవానుడే యుపదేశించెను ఏలన, కనుకొనందగిన దానిని కనుగొనక, యుపయోగము లేనిదానిని కనుగొనువాడు గ్రుడ్డి వాడుకాడా? ఈ ప్రపంచములో గల మహాప్రజ్ఞావంతులని అనిపించుకొనే వారలలో శ్రీకృష్ణభగవాను డుపదేశించిన శాశ్వతవస్తువును కనుగొనిన వారలెందఱు గలరు? ఆలోచించుకొనిన నీ సత్యము తెలియబడును

పై జెప్పిన యీ అమానిత్వాది జ్ఞానము గలుగకపోయిన అమృతత్వము నొసంగెడు జ్ఞేయమును పొందుటకు సాధ్యము కాదని తెలుపుటకొఱకే 18వ శ్లోకమున 'జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్' అని నిర్ణయించడమైనది ఈ జ్ఞేయమునకే ఆత్మజ్ఞానమనిగూడ పేరు

గలదు ఇచ్చట జ్ఞానజ్ఞేయములను విభజించి చెప్పుటచేతను, నిరూపించుట చేతను, ఈ జ్ఞానమును, జ్ఞానికుండవలసిన అమానిత్వాది జ్ఞానమనియే గ్రహించవలయును ఈ 20 జ్ఞానలక్షణములు పూర్తిగా గలవాడు మాత్రమే జ్ఞేయమును పొందగల్గును అందువల్లనే 'జ్ఞానగమ్యం' అని రూఢిగా నిరూపించడమైనది ఈ ధర్మసూక్ష్మమును తెలిసికొనినచో ఆత్మను మాత్రము తెలిసికొనిన చాలునని చెప్పెడు శుష్కవేదాంతములోనికి చిన్నగా జారిపోవునని గ్రహించియే, జ్ఞానమును చెప్పిన పిమ్మట జ్ఞేయమునుపదేశించెనని తెలియనగును

ఈ నియమము ఎట్టిదనగా పరీక్షలో నుత్తీర్ణుడయిన పిమ్మట ఉద్యోగమును పొందవలయునను న్యాయము ననుసరించి యుంటున్నది అట్లు కానిచో, ఉద్యోగము దొఱకిన చాలును పరీక్షలో ఏల ఉత్తీర్ణుడు కావలయునను ప్రశ్నవలెనే యుండును అయితే పరీక్షలో ఉత్తీర్ణుడయినను ఉద్యోగము లేనిచో ఫలముండదు ఆలాగున జ్ఞానములో చెప్పబడిన యనుష్ఠానము గల్గినను జ్ఞేయమును పొందకపోయిన మోక్షమను ఉద్యోగము గలుగదని గూడ జ్ఞాపకములో నుంచవలయును ఈ జ్ఞేయమగు ఆత్మస్థితిలో నిలుకడ గల్గిన మాత్రమే సముద్రమున ప్రయాణము చేయుచుండు నావకు చుక్కాని ఉండునటులుండును చుక్కాని లేనిచో పడవ గమ్యస్థానము చేరనటుల జ్ఞేయము లేనిచో తరింపజాలడు ఈ సంసారసాగరమును దాటుటకు ఏర్పడిన దేహమను నావకు జ్ఞేయము చుక్కానివంటిదని గ్రహింపనగును ఈ జ్ఞేయము స్వాధీనములోనికి వచ్చినవాడే, మహాపరాక్రమ ముతోగూడ పరుగెత్తెడు ప్రకృతియను రైలుబండిని తలంచినప్పుడు నిలుపగల్గును అనగా ప్రకృతి యనెడు చక్రమును అణచగల్గును అట్టి స్థితి గలుగనిచో తక్కిన ప్రాణాయామయోగ ఆసన తపస్సులన్నియు రైలుబండి పరుగెత్తు నప్పుడు చక్రములను, పెట్టెలను, కమ్ములనుపట్టి నిలుప జూచులాగున నుండును అది సాధ్యమా? కావున కాలచక్రముయొక్క కీలకమగు జ్ఞేయమును త్వరలో దెలిసికొనుటకు ప్రయత్నింపుడు ఈ జ్ఞేయమునే మహా

వాక్యములలో చెప్పినట్లు ఈ యధ్యాయమున రెండవ శ్లోకమున తెలుపడ మైనది

**ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥**

ఓ యర్జునా! ఈ దేహము క్షేత్రమనియు చెప్పబడుచున్నది దీనిని (అనగా క్షేత్ర ధర్మమును) ఎవడెఱుంగుచున్నాడో, వానిని క్షేత్రజ్ఞుడని క్షేత్ర క్షేత్రజ్ఞుల నెఱింగినవారు చెప్పుదురు ఇది 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను మహా వాక్యార్థమునే యుపదేశించుచున్నది

'ఋగ్వేదము' ఐతరేయోపనిషత్ (లక్షణ వాక్యము)

**యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ।**
**స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞానముదీరితమ్ ॥**

చక్షువు ద్వారా వ్యాపించిన అన్తఃకరణ వృత్తితో గూడినట్టి యేచైతన్యముచేత చూచుటకు యోగ్యమయిన యీరూపాదికమును పురుషుడు చూచుచున్నాడో, శబ్దములను వినుచున్నాడో, గంధము నాఘ్రాణించు చున్నాడో, శబ్దసమూహము నుచ్చరించుచూ వ్యవహరించుచున్నాడో, స్వాదు అస్వాదువుల (రసముల) నెఱుంగుచున్నాడో, ఆ చైతన్యమే ప్రజ్ఞానమని చెప్పబడుచున్నది ఇది ప్రజ్ఞానముయొక్క యర్థము ఇక బ్రహ్మయను వాక్యమునకు అర్థము దెలిపెద

**చతుర్ముఖేన్ద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు ।**
**చైతన్య మేకం బ్రహ్మాఽతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి ॥**

బ్రహ్మదేవునియందును, దేవేన్ద్రాది దేవతలందును, మనుష్యులందును, అశ్వము, గోవు మొదలగు వానియందును గల ఒక్కటియగు చైతన్యమే బ్రహ్మమగును ఆ కారణమువలన నా దేహమందుగల ప్రజ్ఞానమున్ను బ్రహ్మమే యగును. దీనినే యమృతబిందూపనిషత్తు చెప్పుచున్నది

**ఏక ఏవాత్మా మన్తవ్యో జాగ్రత్స్వప్న సుషుప్తిషు ।**
**స్థానత్రయవ్యతీతస్య పునర్జన్మ న విద్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు విలక్షణమై సాక్షియై యుండు ఏకమగు ఆత్మయే మననము చేయదగినది అవస్థాత్రయ సాక్షియగు ఆత్మను పొందినవారికి మరల జన్మము లేదు ఇప్పుడు శ్రీయోగవాసిష్ఠమున శ్రీరామ చంద్రుల కొఱకు శ్రీవసిష్ఠ మునీంద్రు డుపదేశించిన రహస్య మొకటి దెలిపి యీ వ్యాసమును పూర్తి చేసెద

**అవిద్యోపశమస్త్వేష జాతోఽపి భవతామిహ ।**
**అభ్యాసేన వినా సాధో న సిద్ధి ముపగచ్ఛతి ॥**

సాధువగు రామచంద్రా! నీకిచట ఉపదేశ వాక్యములచే అవిద్య యుపశమించినటుల తోచినను, జీవన్ముక్తి ప్రతిష్ఠాసిద్ధి దృఢమైన యభ్యాసము (అనుష్ఠానము) లేక సిద్ధింపజాలదు ఇప్పుడు వేదాంతులలో గల ప్రమాదకీలకము శ్రీ వసిష్ఠమునీంద్రు డుపదేశించినదే యగును



# నియమము

మీలో ఎవరైనను ఒక్క నియమము ననుసరించి జీవితమును నడి పేలాగున నుండిన మాత్రమే జన్మసాఫల్యమును, కృతార్థతను పొందగలరు అది మీమనస్సులో మీరే యోచించి తీర్మానించవలసినదేగాని మరియొకరు చెప్పేలాగున నుండకూడదు మీలో మీరే మరలమరల ఆలోచించుకొని ప్రప్రథమమున ఏదైన ఒక చిన్న పనిని లేక ఒక ఆహార నియమమును నిర్వ హించేలాగున నిశ్చయించుకొనవలయును ఆ భోజన నియమమును, ఆ పనిని కాలనియమము తప్పక శుద్ధముగా జేసేలాగున అభ్యసించుకొనవల యును.

ఎట్టి ప్రతిబంధములు తటస్థించినను దానిని ఎదుర్కొని ఆ కార్యము తప్పక చేసేలాగున నిశ్చయించుకొనవలయును అనివార్యకార్యమేదైన తటస్థించినను తాను స్వయముగా ఆ కార్యమును నిలుపుదల చేయక గురు దేవునిగాని, లేక అట్టివారెవరినయినగాని సలహా పొంది నిలుపుకొనవచ్చును అట్టి నియమము లేనిచో తన వ్రతము సరిగా జరుగదు తా నారంభించిన కార్యము దైవసంబంధమైనను సరే, లేక ప్రపంచసంబంధమైనను సరే విరోధము లేదు ఆ దినమున పలానిసమయమున లేచుట, జపము చేయుట, గీతలోని కొన్ని శ్లోకములను చదువుట, లేక ఉపనిషత్తులను పఠించుట, లేక యోగసాధనలో ఏదైన చేయుట, ధ్యానముగాని, పూజగాని, పూజాసంబంధ ఇతర కార్యములుగాని, యేదైనను సరి ఆహారమున్ను, నియమిత సమయమున నియమ ప్రకారము భుజించుటయు, లేక ఖద్దరు వడకుట, లెక్కలు వ్రాయుట, పాలు పితుకుట, గోవులను సంరక్షించుట, వంటలు చేయుట, లేక వండించుట, లేక శారీరక పరిశ్రమకొరకు కూర గాయలు పండించుటకు తగిన పనిని చేయుట, రోగుల కౌషధమిచ్చుట, వ్రతములు సలుపుట, బ్రహ్మచర్య, సత్య, అహింసాది వ్రతములను బూనుట మొదలగు ఏదైన ఒక పనిని తనకనుకూలముగా నుండుదానిని చిన్నదిగా ఒక్కదానిని ప్రారంభమున అభ్యసించుచుండిన చాలును అది టయము తప్పక శుద్ధముగా ఆరుమాసములుగాని, సంవత్సరముగాని అభ్యసించి వచ్చిన మీరు ఈ మానవ జన్మములో ఒక మెట్టు పైకివచ్చిన వారగుదురు ముక్తియను సౌధమునకు ఒక్క సోపానమును నిర్మించిన వారే యగుదురు లేక ఒకనదికి వంతెన కట్టినవారే యగుదురు ఇట్టివారే మొదటి సౌధమున మానవోన్నతస్థానమును పొందినవారున్ను, సంసారసాగరమునకు వారధి నిర్మించిన వారునగుదురు

తరువాత ఏడవ నెలలోగాని, రెండవ సంవత్సరములో గాని దీనికన్న పెద్దదైన మరియొక కార్యములో ప్రవేశించుశక్తి మీకు స్వయముగానే గల్గును లేక యిదివరలో అనుష్ఠించునది పూర్తికానిచో దానితోకూడ మరియొక పనిని

కూడ అనుష్ఠించుటగాని, అట్లుగానిచో, ఆ పనిని మరింత పెంచుటగాని చేసేలాగున మీ అంతరాత్మ యెట్లు ప్రేరణ చేయునో ఆలాగున చేసుకొన్న చాలును ఈలాగున అనుష్ఠించుచూ వచ్చిన మరల గొప్ప గొప్ప కార్యములు చేయుటకు మీకు స్వయముగా శక్తి గల్గును

అయితే యిది శుభముహూర్తమున, పుణ్యప్రదేశమున గురుదేవుని వద్దగాని, లేక ఆలాగున మరియొకరివద్దగాని దీక్షాపూర్వకముగా ప్రారంభించుకొనవలయును అట్లయిన మాత్రమే దానికి విలువ గలుగును విఘ్నములు కూడా గలుగవు మనము చిన్నకాలమున చిన్న చిన్న పాఠములు నియమానుసారముగ చదువుకొని వచ్చినందుచేతనే యిప్పుడు గొప్పగొప్ప విద్యలభ్యసింపగలిగితిమి సూక్ష్మమయిన వటబీజము రెండు ఆకులతో గూడి ఆరంభించి క్రమముగా గొప్ప వృక్షముగా ఎట్లు పరిణమించునో, గంగా గోదావరి నదుల యొక్క ఆవిర్భావ స్థలము చాలా చిన్నదైయున్నట్లు మనకు గోచరించినను ఆ నదులు ప్రయాణముచేసి రాగారాగా గొప్పనదులుగా ఎట్లు పరిణమించినవో, మరియు ఆ నదులు ముందుకు సాగునప్పుడు కాల్వలు, ఉపనదులు తమలో ప్రవేశించి యేలాగున గొప్ప ప్రవాహములై మారుచున్నవో, ఆలాగున మనమున్ను ముందుకు ముందుకు క్రమముగా పోవుచుండిన మన ఉద్యమమున అనేకులు చేరి సహాయము చేయగలరు లేక అనేకులు దానిని ఆమోదించుదురు

ఆ గంగా గోదావరినదులు ముందుకు పోజాలక అచ్చటనే ఆగిపోయినచో, ఇంత మహిమాతిశయమును, పుణ్యమును, జనోపయోగమును, కట్టకడకు సముద్రమును చేరుట గూడ పొందజాలవు ఆలాగున మనము ఏదైన ఒక నియమమును ప్రారంభించినప్పుడు విఘ్నముచేతగాని, అధైర్యము చేతగాని, అశ్రద్ధచేతగాని, సోమరితనము చేతగాని, ఆచరింపకపోయినచో ఉన్నత స్థితిని పొందజాలక పోవుటయేగాక కట్టకడకు మోక్షమును గూడ, దైవమునుగూడ పొందజాలము ఆ నదులు కొన్ని పర్వతములను భేదించుకొనియే ఈ విశాలావస్థలోనికి వచ్చినవని మనము సదా జ్ఞాపకములో

నుంచవలయును ఆలాగున లోకోద్ధారకులైన మహాపురుషులందరును ఎన్నియో విఘ్నముల ప్రతిఘటించియే గమ్యస్థాన మును పొందిరి చిన్ననది సముద్రమువరకు వెళ్లి తరువాత నేమైనది? నది సముద్రములో ఐక్యమై మహాసాగరముగా పరిణమించెను ఆలాగున జీవుడు పరిశ్రమచే ప్రతి బంధములను ధ్వంసమొనర్చి పైకివెళ్ళగా వెళ్ళగా అపారప్రజ్ఞా వంతుడును, జ్ఞానవంతుడును మాత్రమేగాక, కట్టకడకు సర్వేశ్వరునిలో ఐక్యమై పరబ్రహ్మ స్థితిని గూడ పొందుచున్నాడు

మహాయోధులగు శివాజీ, నెపోలియన్ మొదలగు వారందరున్ను మొట్టమొదట చిన్నచిన్న యుద్ధములు చేసుకొనియే మహాయోధులైరి ఆలాగున నిప్పుడు కానిపించెడు లక్షలాది, కోట్ల కొలది విలువగల గొప్ప గొప్ప కంట్రాక్టర్లు కూడా చిన్నచిన్న కంట్రాక్టు పనులు చేసుకొనియే గొప్పవారైరి ఆలాగున గొప్పశాండోలు చిన్నచిన్న గొలుసులను భేదించియే ఇప్పుడు ఏనుగులను బంధించు శృంఖలములను సులభముగా ధ్వంసమొనర్చ కలుగుచున్నారు సూక్ష్మమగు అగ్నికణమును క్రమముగా దూదియందు గాని, గుడ్డపేలికయందుగాని యుంచి ఊదుచు ఎండిన గడ్డిపోచ పెట్టి వెలిగించి పిమ్మట చిన్న చిన్న కట్టెలతోను, తర్వాత పెద్దపెద్ద మ్రానులు కోసి గొప్పయగ్నిగా ఎట్లు చేయుచున్నారో, మానవ పరిశ్రమయు ఆలాగున నుండునని మనస్సులోనుంచి ఆరంభించవలయును కావుననే శ్రీకృష్ణభగవా నుడు గీత ఆరవ అధ్యాయమున ఇట్లు చెప్పిరి "శనైశ్శనైరుపరమేత్" అనగా చిన్న చిన్నగా ప్రారంభించి మరల గొప్పగా చేయవలయునని ఉపదేశించిరి దీనియొక్క అభివృద్ధి యంతయు మీయొక్క శ్రద్ధయందును, ధైర్యమం దును, నమ్రతయందును, ఈశ్వరునియందు గల విశ్వాసమునందును, సజ్జ నుల యాశీస్సునందును ఆధారపడియుంటున్నదని మాత్రము మరువకుడు

అయితే నిప్పుపుల్లను గీసిన వెంటనే పెద్దపెద్ద కట్టెలు వేసినచో ఎట్లు ఆరిపోవునో, ఆలాగున మీసాధనలోకూడ మొదట అమితముగా ప్రారంభిం చిన రోగాది ప్రతిబంధములచే చెడిపోవునని కూడా మరువకుడు మీ

ప్రేమగల చిన్న పిల్లలు త్వరలో వృద్ధిని పొందవలయునని తలంచి బల మైన ఆహారము పెట్టిన ఎట్లు రోగులగుదురో, జీర్ణశక్తి అనుసరించి క్రమ పద్ధతిగ ఆహారము పెట్టిన ఎట్లు అభివృద్ధి పొందగలరో, యిట్టి ఆధ్యాత్మ సాధనయు ఆలాగుననే యుండునని మరువకుడు అయితే జీర్ణశక్తి ననుస రించి తగిన ఆహారము పెట్టక పోయిన శిశువులు అభివృద్ధిని ఎట్లు పొంద జాలరో యిదిన్ని ఆలాగున నుండునని జ్ఞాపకములో నుంచుకొని ప్రవర్తించ వలయును మరియు రోగగ్రస్తుడై జీర్ణశక్తి బొత్తిగా నశించిన వానికి త్వరలో మంచి బలా ఢ్యుడు కావలయునని తలంచి ఘనమైన ఆహారము కాలనియమము లక్ష్యములో నుంచక పెట్టుచుండిన జీర్ణశక్తి లేనందుచే అజీర్ణవ్యాధి కలిగి యెట్లు విగత జీవుడగునో, అయితే జీర్ణశక్తి ననుసరించి తగిన ఫలరస, క్షీరాదులు పెట్టుచుండిన నెట్లు ఆరోగ్యవంతుడై తాను నిర్వహించెడు కార్య ములో ప్రవేశించి కృతకృత్యుడగునో, యీ ఆధ్యాత్మిక సాధనయు ఆలాగున నుండును "యధాసింహో గజో వ్యాఘ్రో భవేద్వశ్యః శనైశ్శనైః" సింగము, ఏనుగు, పెద్దపులి మొదలగునవి యెట్లు మెల్ల మెల్లగా వశ్యము లగుచున్నవో, ఆలాగున అభ్యాసముకూడా క్రమముగా జాగ్రత్త కలిగి అభ్యసించుకొన వలయును లేనిచో ఆపాయము కలుగును అని హఠయోగము

**ప్రాణాయామాది యుక్తేన సర్వరోగక్షయో భవేత్।**
**అయుక్తాభ్యాసయోగేన సర్వరోగ సముద్భవః ॥**

యుక్తమైన యోగాది సాధనములచే సకల రోగములును నశించును అయుక్తమైన యోగాద్యనుష్ఠానముచే సకలరోగములును కలుగును మఱియు భర్తృహరి చెప్పినది చూడుడు

**ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః**
**ప్రారభ్య విఘ్ననిహతా విరమంతి మధ్యాః ।**
**విఘ్నై ర్ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః**
**ప్రారబ్ధముత్తమగుణా న పరిత్యజన్తి ॥**

నీచగుణము కలవారు విఘ్నభయములచే ఏ కార్యమున్ను ప్రారంభించరు మధ్యములు మధ్య మధ్య కలిగెడు విఘ్నములచే ప్రారంభించిన పనిని మానివేయుదురు శ్రేష్ఠులు మధ్య మధ్య ఎన్ని విఘ్నములు వచ్చినను వానిని సహించి ఆరంభించిన పుణ్యమగు పనిని శ్రమపడియైనను పూర్తి చేయుదురు కావున మనము ఎట్టి గుణములు కలిగియుండవలెనో గ్రహించుకొనేది



# నాగరికము

ఈ నాగరిక పదమునకే సంస్కారమనియు, పరిష్కారమనియు, శుద్ధమనియు, శుచియనియు మొదలుగాగల పర్యాయ పదములను ప్రయోగింతురు అయితే సామాన్యముగా జనులందఱు ఈ పదమునకు బాహ్యా పరిష్కార మనియే అర్థము చెప్పుచు, దేహాలంకారములగు కేశరంజనాదుల జేయుట, వస్త్రాభరణముల ధరించుట, గృహమును శుభ్రపరచుట, నవీన ఉపకరణము లమర్చుట, గృహావరణములయందు పుష్పవాటికలను నిర్మించుట, క్రొత్త క్రొత్త ఆహారములను తయారుచేయుట మొదలగు కార్యముల లోనే మగ్నులై యుందురు అయితే వీనిలో కొన్ని యవసరములేకాని వానివల్ల తృప్తి నొందకూడదు మానవుల పరిష్కారము, సంస్కారము అన్తఃకరణ సంస్కారమని మరచిపోవుచున్నారు మనోనిర్మలత్వమే నిజమైన సంస్కారమగును మనస్సునందుగల ద్వేషభావమును, పాపబుద్ధిని వదలించి శాంతియు, కరుణయు, విరక్తియు, దైవభావమున్ను గలిగియుండేలాగున జేయుటయే నిజమైన నాగరికత యనబడును కావుననే శౌచమును గురించి శాస్త్రమిా లాగున నిర్ణయించినది

**శౌచం తు ద్వివిధం ప్రోక్తం బాహ్యమాభ్యన్తరం తథా ।**
**మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం భావశుద్ధి స్తదన్తరమ్ ॥**

శుచియనునది బాహ్యాభ్యంతరములచే ద్వివిధము శుద్ధమృత్తికచేతను, జలముచేతను శరీరమును శుద్ధపరచుటయు, శుభ్రవస్త్రధారణయు బాహ్య శుద్ధి యనంబడును ఆలాగున వైరాగ్యమను మృత్తిక చేతను, కరుణయను జలముచేతను, హృదయమును శుద్ధపరచి దైవభావము గలిగి యుండుటయే ఆంతర శౌచమనబడును ఈ స్థితి గలుగునప్పుడే బాహ్యాభ్యంతర శుచి గలవాడగును అట్లు కానిచో పప్పుపులుసు చేయుపాత్రయొక్క బాహ్య ప్రదేశ మును మాత్రము తెల్లగా శుద్ధపరచి అంతరమున కళాయివేయకయు, శుభ్రపరచకయు నుండులాగన నని గ్రహించుడు అట్టి పాత్రములో వండిన పులుసు ఎటుల చిలుమెక్కి చెడి యుపయోగపడదో, ఆత్మశుద్ధిలేనివారి బాహ్యశుద్ధియు అట్టిదని గ్రహించనగును పరమపావనులును సర్వజనులచే కొనియాడ బడుచుండు దైవాంశసంభూతులగు మన మత కర్తలను, పరమ గురువులగు వారిని జూచిన ఈ తత్త్వము గోచరము గాగలదు

పండితోత్తములు సార్వభౌములుగూడ అట్టి పరమపావనుల పాద ధూళిచే పవిత్రులయ్యేలాగున జూచుట మనము గనుగొనుచున్నారము మన ఋషివర్యులు, శ్రీ యేసుక్రీస్తు, శ్రీ మహమ్మదు నబి, శ్రీబుద్ధదేవుడు మొదలగు వారే ఇందులకు తార్కాణము వర్తమానయుగమునందుండిన శ్రీ గాంధీగారు, ఆలాగున శ్రీరామకృష్ణపరమ హంసలు, శ్రీనారాయణ గురు దేవులు ఎట్లు జీవించిరో దానినిన్ని జూచుకొనవలయును అట్టి మహాపురుషు లను దర్శించిన వారనేకులు ఇప్పటికి జీవించియున్నారు ఆలాగున స్త్రీలలో శ్రీశారదాదేవిగారిని, శ్రీ కస్తూరీబాయిగారిని కండ్లార చూచినవా రనేకులు గలరు

ఒక్క సీసాయందుంచిన పదార్థముయొక్క విలువ దానికి అంటించిన రకరకముల రంగుల కాగితము గురించి కాదు దానిలోపల గల పదార్థ సారమును గురించి యని గ్రహించిన ఈ బాహ్య పరిష్కార భ్రమ చాల వరకు శాంతించును. ఆలాగున తాను విత్తిన విత్తనము ననుసరించియే చెట్టు ఏర్పడునుగాని మఱియొకటి గలుగదని గూడ నిశ్చయించుకొనవలయును

అప్పుడే తనకర్మయొక్క ప్రభావము గోచరించును అత్తఱి ఎవరేమిచెప్పినను మనస్సున మార్పు గల్గుట కవకాశము లేదు పై జెప్పిన మహనీయాత్ములకన్న పవిత్రాత్ములెవరు కలరు వీరికేదైన బాహ్యవస్త్రాభరణాలంకారము లుం డెనా? మనము ఆత్మతత్త్వములోనికి ఎంత కెంతకు దగ్గఱకు చేరుచుం దుమో, అంతకంతకు బాహ్యాడంబరములను తగ్గించి తగ్గించి కొనుచుం దుము అదియే దానికి గురుతు అయితే పైన నిరూపింపబడిన జగద్గురు వులు శౌచాచార రహితులై యుండలేదు అది అప్రధానముగాను ఆత్మశుద్ధి ప్రధానముగాను నుండెను శుద్ధమై, శివమై, సత్యమై, అమృతమయమగు దైవములో ఎవని మనస్సు లగ్నమై యుండునో ఆ మహాపురుషుడు బాహ్యా ములోని శుభ్రత సరిగా లేకపోయినను, ఆ దివ్యపురుషుని స్పర్శచే ఎట్టి పాపులుగూడ పవిత్రులగుదురు అట్టి దివ్యాత్మలో మనస్సు లగ్నము కానివాడు ఎంత బాహ్యాచార శుభ్రత గలిగియుండినను అతనిచే ఒక్కడైన పవిత్రుడగుటగాని లేక కట్టకడకు తానుగూడ అపవిత్రుడే యగును దేహమును ఎంతగ శుభ్రపరచినను శుద్ధాత్ముడు కాజాలడు తపోయోగాదు లచే శరీరమందు గల రజస్తమోగుణములను రహిత మొనర్చునప్పుడే నిజ ముగా దేహము గూడ శుద్ధమగును ఈ విషయమై శ్రీపతంజలి మహర్షి చెప్పినది చూడుడు

**కాయేన్ద్రియ సిద్ధిరశుద్ధిక్షయాత్తపసః**

దృఢమగు తపోఽనుష్ఠానమువలన అశుద్ధిసంజ్ఞకమై యావరణ రూప మగు, రాజస, తామస మాలిన్యము నశించుట మూలమున కాయసిద్ధియు, ఇంద్రియ సిద్ధియు గలుగును

"వీతరాగ విషయం వా చిత్తం" రాగద్వేషాది విషయరహితమైన చిత్తమే ఈశ్వసాక్షాత్కార జ్ఞానమునకు సమర్థత గలదగును

**ఈశ్వర ప్రణిధానాద్వా**

దేనివలన ఈశ్వరసాక్షాత్కారము గలుగునో, అది ఈశ్వరునియందు

అపరిమితమగు భక్తివిశేషమువలననే సిద్ధించును ఇప్పుడు స్థూలసూక్ష్మ దేహములయొక్క శుద్ధి గ్రహించడమైనది మీ దేహమును దర్శించుటకు అద్దముయొక్క నిర్మలత్వమే ముఖ్యముగాని అద్దమునకు అమర్చబడి యుండు చట్టములు కావు అని గ్రహించుడు మీ ఆత్మను దర్శించుటకున్ను మీ హృదయశుద్ధియే ముఖ్యముగాని మీ దేహముయొక్క అలంకారాదులు కావని మరువకుడు మీరు చంద్రబింబమునుగాని, సూర్యబింబమును గాని, మీ ముఖమును గాని నీటిలో జూడవలసియుండిన మీరు పెట్టిన పాత్రము స్వర్ణమయమైనను, చిత్రవిచిత్రమైన పనులతో గూడినదైనను, ఏమీ ప్రయోజనము లేదు పాత్రయందు గల జలము మాత్రము నిర్మలముగాను, నిశ్చలముగాను ఉండిన జాలును అప్పుడు పాత్ర యేలోహముతో, ఏరంగులతో, ఏ ఆకృతితో గూడియుండినను విరోధము లేదు ఆలాగున హృదయము కరుణతోను, సత్యముతోను, దైవభావముతోను కూడియుండిన, మీ యంతరాత్మను మీరెచ్చట నుండినను దర్శించగలరు అట్టి యాత్మశుద్ధి యెటుల గలుగునో క్రింద తెలుపబడుచున్నది

**అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలమ్ ।**
**కృత్వా జ్ఞానం స్వయం నశ్యేత్ జలం కతకరేణువత్ ॥**

ఎంత పంకిలమైన జలమైనను చిల్లగింజ అరుగదీయుటచే ఎట్లు శుద్ధమగుచుండునో ఆలాగున ఎంత పాపపంకముతో గూడిన జీవుడైనను బ్రహ్మజ్ఞానానుష్ఠానమువలన శుద్ధుడగును మరియు

**యథైకం చ సువర్ణాది మిళితం రజతాదినా ।**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽ ప్యహంయుతః ॥**
**యథైవ హి సువర్ణాది క్షారాదేశ్శోధితం శుభమ్ ।**
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః ॥**

ఏలాగున సువర్ణము వెండి, రాగి, యిత్తళి మొదలగు హీనలోహములతో కలిసిన స్వల్ప మూల్యము గలదగునో, చిలుముతో గూడినదగునో,

ఆలాగున జీవుడు ఈశ్వరస్వరూపుడైనను, అహంభావముతో గూడిన ఈశ్వరత్వము లేనివాడై నీచత్వమునే పొందును అయితే తెల్లబంగారము స్ఫుటమొనర్చిన దానియందుగల దోషము నశించి యెట్లు మంచి బంగారమగుచుండునో, అప్పుడెట్లు శుద్ధసువర్ణముయొక్క విలువను పొందునో, ఆలాగున మలిన జీవుడుగూడ ఉత్తమ సంస్కారము గలవాడాయెనేని జీవత్వ దోషము నశించి యుత్తమమగు శివత్వమును పొందును ఇదియే నాగరిక లక్షణమగును

**అనిర్జితేన్ద్రియగ్రామో యస్తు ధ్యానపరో భవేత్।**
**మూఢాత్మానం చ తం విద్యాత్ ధ్యానం చాస్య న సిద్ధ్యతి ॥**

ఎవడు ఇన్ద్రియసమూహమును స్వాధీనమునందుంచ శక్తిలేనివాడై యుండునో, ధ్యానపరవశుడై యుండినను అట్టి యిన్ద్రియలోలుని మూఢాత్ముడనియే గ్రహించవలయును అతనికి ధ్యానముచే గలిగెడు ప్రయోజనము సిద్ధించదు

**యథా చ మలినే వస్త్రే రంగశ్శుభ్రతరో న హి।**
**క్షాళనేన కృతే శుద్ధే సర్వో రంగః ప్రసజ్జతే ॥**

ఏలాగున మలినవస్త్రమందు ఎంత శుద్ధమగు రంగైనను అంటుకొనక శోభించదో, అట్టి యశుద్ధ వస్త్రమును ఉడకపెట్టి శుద్ధముగా ఉతికినచో ఎటువంటి రంగైనను బాగుగా నంటుకొని ప్రకాశించునో, ఆలాగున మలినమనస్సు గలవాడు ఎంత వేదాంత విచారణగాని, ధ్యానము గాని చేసినను ప్రయోజనము లేదు మనస్సును శుద్ధపరచిన మాత్రమే పై జెప్పబడిన వేదాంతవిచారణ, ధ్యానములు ప్రకాశించును

**భావహీనో నరస్సర్వం కృత్వాఽపి న విముచ్యతే।**
**భావయుక్తః పునస్సర్వమకృత్వాఽపి విముచ్యతే ॥**

ఆత్మభావనాశుద్ధిలేనివాడు, ఎన్ని పుణ్యకర్మలను వేదాంత విచారణ

లను చేసినను ముక్తిని పొందజాలడు ఆత్మయందు శుద్ధమైన స్థితిగల్గి బ్రహ్మభావన చేసినచో పై జెప్పిన క్రియల నేమియు జేయకుండినను జీవన్ముక్తుడగును

**అనాత్మన్యరుచిశ్చిత్తే రుచిశ్చాత్మని చేద్భవేత్।**
**పుణ్యపుంజేన శుద్ధం తత్ చిత్తమైకాగ్ర్యమర్హతి ॥**

ఆత్మకాని దృశ్యవిషయములయందు మనస్సున రుచి లేకపోవుటయు, ఆత్మధ్యానమందు రుచికలుగుటయు ఏదిగలదో, యది మహా పుణ్యముచేతనే గలుగును ఆ శుద్ధమైన చిత్తము ఐకాగ్ర్యమును గలిగించి ఈశ్వరసాక్షాత్కారము నొనగూర్చును

**విషయాసంగరూపో యః పాప్మాపావాసురత్వతః ।**
**విద్యేచ్ఛాం ప్రతిబధ్నాతి సోఽయమాదౌ నివర్త్యతామ్ ॥**

విషయముల యందాసక్తి యనెడు నే పాపము గలదో, అది అసురము కనుక యాత్మజ్ఞాన బ్రహ్మవిద్య యందిచ్ఛను ఆటంక పెట్టును కావున దానిని మొదట నివారింపవలయును ఇచ్చట విషయేచ్ఛ ఆసురస్వభావమనియు, అది బ్రహ్మవిద్యను నాటంకపరచుననియు, కావున దానినే ముందుగా రహిత మొనర్పవలయుననియు అనుభూతి ప్రకాశము దెలుపుచున్నది శ్రీకృష్ణభగవానులున్ను గీతయందు ఈలాగుననే వచించెను

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యంతవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥**

ఓ యర్జునా! యేవి విషయ సంయోగమువలన గలిగిన సుఖములో అవి దుఃఖమును గలుగజేయునవి అంతేగాదు స్వల్ప కాలముండి నశించునవి కాబట్టి బుద్ధిమంతుడు అట్టి విషయ సుఖములయందు రమించడు

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మ యోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥**

బాహ్య విషయములయందు ఆసక్తి లేని మనస్సు గల పురుషుడు తన యాత్మయందు ఏదైన సుఖమును పొందుచున్నాడో, అట్టివాడు బ్రహ్మ నిష్ఠయను సమాధితో గూడుకొనినవాడై తరుగని బ్రహ్మసుఖమును పొందు చున్నాడు



# ధర్మోపన్యాసము

**స్మరణాత్కీర్తనాద్వాఽపి శ్రవణాచ్చ జపాదపి ।**
**బ్రహ్మ తత్రాప్యతే నిత్యమోమిత్యేతత్పరాయణమ్ ॥**

బ్రహ్మప్రతిపాదకమైనట్టియు, వేదములకు మూలమైనట్టియు ఓం కారమును స్మరించుటవలనను, కీర్తనము చేయుటవలనను, వినుటవలనను, జపించుటవలనను, సచ్చిదానంద స్వరూపమగు ఆ పరబ్రహ్మము పొందబడు చున్నది సర్వమంత్రములకు మూలమగుటచే ఈ ప్రణవోపాసనయే ఆత్మసాక్షాత్కారమునకు ముఖ్యమార్గము గీతలో 8వ అధ్యాయమున ప్రాణ ప్రయాణ సమయమున ఇంద్రియ నిగ్రహము గలవారై అంతఃకరణము నందలి సమస్త వృత్తులను, సంకల్పములను, మనస్సును స్వాధీనమందుంచు కొన్న వారలు నిన్నెట్లు తెలుసుకొనగలరని అర్జునుడు ప్రశ్నించగా, పార్థుని ప్రశ్న కనుగుణముగా శ్రీకృష్ణపరమాత్మయు ఆ ప్రణవమునే బోధించి యున్నారు "ప్రయాణ కాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః" శ్రీపతంజలి మహర్షియు తన యోగసూత్రమున "తస్య వాచకః ప్రణవః" - శాస్త్రములయందు వాచ్యవాచకభావ సంబంధమొకటి గలదు వాచక మనగా శబ్దము ఆ శబ్దమువలన గ్రహించదగినది వాచ్యము కనుక 'తస్య వాచకః' అనుటచే ఆ పరమేశ్వరుని తెలియజేయునది ప్రణవమేయని తెలియు చున్నది మఱియు భరత ఖండమున ప్రసిద్ధమైనట్టియు, భాగీరథీ నదిచే నలరారుచున్నట్టియు, దర్శనస్పర్శనములచే ప్రజల పాపపంకిలమును

పటాపంచలు చేయునట్టి కాశీ క్షేత్రమునందు మృతి నొందిన వారి శిరమును అతిదయానిధియగు పరమశివుడు తన రెండుహస్తములతో గ్రహించి దక్షిణ కర్ణమున జనన మరణ రూప భవపాశమును తొలగించుటకై ఓంకారమునే యుపదేశించుచున్నారు

**కాశీపతిః కారుణికః కరాభ్యామాదాయ మూర్ధానమతీవ తాపామ్ ।**
**ఆగమ్య వేగాద్యుగపచ్చ తాపామోంకార మోంకారయతిస్మ కర్ణే ॥**

ప్రపంచములో గల ప్రతిసంఘమువారును కొన్ని నియమముల నేర్ప రచుకొని ఆ నియమముల నంగీకరించినవారినే తమ సమాజములో చేర్చు కొని వారొనరించదగిన కార్యకలాపమును ఎట్లు నడిపించుచుందురో అదే విధముగా పరమేశ్వరుడొక నియమావళి నేర్పరచి తదనుగుణముగా ప్రవర్తించువారిని మాత్రము తన సేవాసమాజమునందు చేర్చుకొని నిత్య శుద్ధ బుద్ధ ముక్త పరబ్రహ్మ స్వరూపమును ప్రజలకు ప్రబోధించుటకై నిశ్చయించు కొనెను ఈశ్వరాజ్ఞను నతిక్రమించిన యధార్థమును వెల్లడిచేయ బయలు దేరిన భగవంతునికి నిజమైన భక్తులు ఐదుగురు మాత్రమే గన్పట్టుచున్నారు

వారిలో 1 ఆకాశము, 2 వాయువు, 3 అగ్ని వీరు ముగ్గురు పురుషులు, 4 జలము (వృష్టి), 5 భూమి వీరిద్దరు స్త్రీలు ఆకాశముయొక్క గుణము శబ్దము ఆ శబ్దమును సర్వజనుల శ్రోత్రముల కందజేయుట యందు బ్రాహ్మణ, అబ్రాహ్మణ, పండిత, పామర, స్త్రీ పురుష, గృహస్థ, సన్న్యాస ఇత్యాది భేదములు లేక సమానముగా వినుటకు అవకాశమును ఆకాశము అందటికి గలుగజేయుచున్నది రెండు చూపుడు వ్రేళ్లను రెండు చెవులలో నుంచుకొని ఏకాంత ప్రదేశమున సూక్ష్మముగా గమనించిన ఆప్రణవమే నింతరము అందఱి హృదయమున ధ్వనించుచున్నది ఏ ప్రయత్నము లేక సర్వమానవులయందు ఘోషపెట్టుచున్న ఆ ఓంకారమును కొందరుచ్చరించ వచ్చును, కొందఱు జపించ కూడదు అను వచనములు ఎంత ఆశ్చర్యమో విజ్ఞులెఱుంగుదురుగాక!

రెండవ భక్తుడగు వాయువు వీచునపుడును 'ఓం' అను ప్రణవమే గోచరమగుచున్నది మఱియు మలయ మారుతము వీచునపుడు ఏవిధమగు పక్షపాతములేక యెల్లరకు తనచల్ల దనము నొసంగుచున్నది అట్లే మూడవ భక్తుడగు అగ్ని అథవా సూర్యుడు తన ప్రకాశమును అంతట సమముగా ప్రసరింపజేయుచున్నాడు అగ్నియు కట్టెల ననుసరించి పాకాది కార్యము లన్నియు నిర్వహించుచున్నది అగ్ని బాగుగా ప్రజ్వలించునపుడు ఓం అని ఆ ప్రణవమునే ప్రబోధించుచున్నది నాల్గవ భక్తురాలగు వృష్టియు ఏక దేశమున వర్షించునపుడు ఇది బ్రాహ్మణ స్థలమనియు, ఇది చండాలవేశ్మ మనియు ఈలాటి వ్యష్టిభావ మేమాత్రము లేక సమష్టి భావముతో అంతట నొకేవిధ ముగా వర్షించుచున్నది కుంభవృష్టి కురియునపుడు ఓం అనుశబ్దమే గోచరించుచున్నది జలము నిమ్నోన్నతములుగ ప్రవహించునప్పుడు ఈ ఓంకారధ్వనియే వినవచ్చుచున్నది ఐదవ భక్తురాలగు భూమియు ఎవరెవరు ఏ యే విత్తనములను పెట్టి యెంతశ్రద్ధతో పోషించెదరో వారి వారి పరిశ్రమ ననుసరించి ఫలము నొసంగుచున్నదేగాని బ్రాహ్మణులు పెట్టిన ముష్టి విత్తనమున మామిడి ఫలములు కాయుటయు, హరిజనులు పెట్టిన పనసచెట్టున వేపఫలములు కాయుటయు లేదు శంఖము, ఘంట, భేరి మొదలగునవి మ్రోగించునప్పుడు పృథ్విసంబంధమగు ఆ శంఖాదులయం దును ఆ ప్రణవధ్వనియే యుత్పన్న మగుచున్నది కనుక ఈశ్వరుని ముఖ్య భక్తులగు పంచభూతములున్ను ఆ ప్రణవమునే ప్రతిపాదించుచున్నవి కాన అన్ని ఉపాసనలకంటె ఈ ప్రణవోపాసనయే ముఖ్యమని తోచుచున్నది!

పై పంచభూతములవలన గమనించదగిన ముఖ్యవిషయము మఱి యొకటి గలదు ఆకాశము ప్రాణులయొక్క చెవులయందు శబ్దము విని పించు అవకాశమును గలుగజేయు చెవితో సంబంధించియున్నను చెవి యందున్న గజ్జి చీము మొదలగు మలిన పదార్థములచేత ఆకాశము ఏ మాత్రము మాలిన్యము నొందుట లేదు వాయువు తన చల్లదనముచేత సర్వ జీవుల తాపమును తగ్గించుచు శరీరములను స్పృశించుచున్నను శరీర

మాలిన్యములచేత వాయువు మలిన భూయిష్ఠుడగుట లేదు సూర్యుడు సమస్త పదార్థములయందును తన కిరణముల ప్రసరింపజేసి అన్నిటిని శుష్కింపజేయుచున్నాడేగాని తానేవిధమగు మాలిన్యమునకు లోగుటలేదు అగ్నియు తనయందు వేయబడిన వస్తువులన్నిటిని భస్మమొనరించునేగాని దానికి ఆ వస్తువుల మాలిన్యమేమియు అంటుకొనుట లేదు జలము తన యందు మునిగి స్నానము చేయు వారియొక్క సమస్తమైన మురికిని పోగొట్టి శుచిర్భూతులుగా నొనరించునేగాని వారి మురికిని తాను తగిలించుకొనుట లేదు భూమియు తనయందుంచబడిన ప్రతి పదార్థమును కొద్ది రోజులలో పరిణామమొనరించి తనలో నైక్యపరచుకొనుచున్నదే గాని తానెట్టి మలిన పదార్థములోను కలియుట లేదు కావున బోధకులనువారు ఇతరుల దుర్గణములను బోద్రోలి సుగుణముల నెలకొల్పవలయునేగాని తన సుగుణ ములను గోల్పోయి పరుల దుర్గుణములకు పాల్పడకూడదు ప్రణవో పాసననుగురించి శాస్త్రములయందిట్లు చెప్పబడి యున్నది -

**త్రిరున్నతం స్థాప్యమథ శరీరం హృదింద్రియాణి మనసా సన్నివేశ్య।**
**బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్ స్రోతాంసి సర్వాణి భయావహాని ॥**

హృదయము, కంఠము, శిరస్సు ఈ మూడును ఎత్తుగా నుండి ఇంద్రియములను, మనస్సును విషయాది వృత్తులనుండి మరల్చి హృదయ మందు ప్రవేశపెట్టి బ్రహ్మప్రతిపాదకమైన ప్రణవోపాసనయనెడు తెప్పచేత జనన మరణ ప్రవాహములన్నిటినీ విద్వాంసుడు తరించుచున్నాడు భయంకరమగు నదులనెట్లు మానవుడు పడవచేత తరణము చేయుచు న్నాడో అట్లే విద్వాంసుడు ప్రణవముతో తరించుచున్నాడు భగవద్గీతలో అష్టమాధ్యాయమున ప్రాణప్రయాణ సమయమున మనోనిగ్రహము గలవారెట్లుండిన నిన్ను చేరగలరని అర్జునుడు ప్రశ్నించగా కృష్ణభగవాను డీవిధముగా సమాధాన మిచ్చుచున్నాడు

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

పరబ్రహ్మ వాచకమైనట్టియు ఏకాక్షరమైనట్టియు ఓంకారము నుచ్చరించుచు సచ్చిదానంద స్వరూపుడనగు నన్ను స్మరించుచున్నవాడై యెవ డీ దేహమును విడుచుచున్నాడో, వాడు ఉత్కృష్టమగు స్థితిని (మోక్షమును) పొందుచున్నాడు ఏ మంత్రమును జపించుచున్నామో ఆ మంత్రార్థమును భావన చేయుచు జపించిన మాత్రమే పూర్తి ప్రయోజన ముండును

**మంత్రార్థం మంత్రచైతన్యం యో న జానాతి సాధకః ।**
**శతకోటి ప్రజప్తాపి తస్య సిద్ధిర్న సిధ్యతి ॥**

సాధకుడు తాను జపించు మంత్రముయొక్క అర్థమును, ఆ మంత్రాధిష్ఠాన స్వరూపమును తెలియక నూరుకోట్ల జపమొనరించినను తన కేవిధమైన సిద్ధియు లభించనేరదు మందు మాత్రము కూర్చి గుండు వేయక కాల్చిన ఫిరంగి కేవల ధ్వనితోనే సమాప్తి నొంది లక్ష్యము నెట్లు భేదించజాలదో, గుండుకూడ చేర్చి ప్రేల్చిన కోటల నెట్లు ధ్వంసము జేయునో, అట్లే మంత్రార్థమును భావనజేయుచు జపించిన యెడల అజ్ఞానావరణములను పటాపంచలు జేసి మోక్షప్రాప్తి నొసంగును

పంచభూతము లేలాగున అన్నిమాలిన్యములలోను ప్రవేశించి, ఆ మలినమును తమలో చేరనీయక తామెల్లప్పుడు ఏలాగున నిర్మలములుగ నుంటున్నవో, ఆలాగున లోకోద్ధర ణము లోకసేవ చేయతలంచువారలు పై జెప్పిన ధర్మములను జ్ఞాపకములో నుంచవలయును నిమ్న జాత్యుద్ధరణమునకు యత్నించు ఉన్నత జాతి వారు తమ యున్నత గుణములను పోగొట్టి, నిమ్నగుణములను తమలో జేరనీయక చూచుకొనిన శ్రేయస్కరము ఆలాగున సన్న్యాసులైన వారు గృహస్థుల యింటిలో ప్రవేశించి, స్త్రీలు మొదలగువారికి ధర్మోపన్యాసముల నొనర్చి నిర్మలలుగా జేయుట పవిత్రకార్యమే కాని తన పావన సన్న్యాస ధర్మమును విడనాడి, గృహస్థుల ధర్మము

నవలంబించుటకన్న అట్టి పనిని మాని గృహద్వారములో నుండి, "భవతి భిక్షాందేహి" అని యుచ్చరించి మాధుకరమును తీసికొని యేకాంతమున మౌనవ్రతనిష్ఠ గల్గియుండడమే లోకమునకు నిశ్శ్రేయసకరమని మఱువక యుందురుగాక!

ఆ ఓంకారము ప్రారంభించునప్పుడు అకారముతో కూడి కంఠము నుండి యారంభమగును కావుననే వ్యాకరణ సూత్రము "అకుహ విసర్జనీయానాం కంఠః" మధ్య పెదవులు మూయు సందర్భమున "ఉ" అను శబ్దము ఏర్పడుచున్నది అందువలననే "ఉపూపధ్మానీయానామోష్ఠౌ" "అ"స్వరముతో శబ్దాంతము "మ్"తో (మకారముతో) పూర్తియగుచున్నది అందువలననే వ్యాకరణ సూత్రము "ఞమఙణనానాం నాసికా చ" ఇప్పుడు అ, ఉ, మ అను మూడు అక్షరములు చేరిన ఓంకార మేర్పడుచున్నది ఇది బ్రహ్మవిష్ణుశివాత్మక స్వరూపము అక్షరసమామ్నాయ మంతయు దీనియం దంతర్భూతమై యున్నది వేదము అక్షర సమామ్నాయముతో కూడినది కావుననే మూడు వేదములకున్ను ఈ ఓంకారమే మూలమనియు, ఆదియనియు, ఆధారమనియు చెప్పుదురు పై జెప్పిన వ్యాకరణ సూత్రములో కంఠము నుండి అకారము ప్రారంభమై, మధ్య ఓష్ఠము నుండి ఉకారధ్వని యేర్పడి, ఓష్ఠాంతమున "మ్" (మకారము)తో అంత్యమగు చున్నది ఇప్పుడు అకార ఉకార మకారములను మూడక్షరములతో ఓంకార మేర్పడుచున్నది ఇదియే శ్రుతియందు వర్ణత్రయాత్మకము వేదమనియు, త్రిమూర్త్యాత్మకమే ప్రణవమనియు చెప్పుటకు కారణము అందువలననే ఓంకారమొకటి జపించిన మూడు వేదము లధ్యయనము చేసిన ఫలము గలుగుననియు, త్రిమూర్తులను బూజించిన పుణ్యము సిద్ధించుననియు చెప్పుదురు ఇక నీ విషయమై విస్తారముగా జూడగోరువారు 'ప్రణవోపాసన' యను ఓంకార గ్రంథమున గనుగొనవచ్చును



# మానవుని జీవితము - నాలుగవస్థలు

మానవుడు నాలుగంతస్తులలో నుంటున్నాడు ఈ నాలుగవస్థలు 1 బ్రహ్మచర్యము, 2 గార్హస్థ్యము, 3 వానప్రస్థము, 4 సన్న్యాసము అను భేదములు కావు మరియు 1 బ్రాహ్మణత్వము, 2 క్షత్రియత్వము, 3 వైశ్యత్వము, 4 శూద్రత్వము అను నట్టి భేదములున్ను కాదు అది యుండినను లేకపోయినను దీనికి సంబంధించినది కాదు ఈ నాలుగవస్థలను పొందుటకు బ్రాహ్మణాది జాతులుగాని, బ్రహ్మచర్యాది ఆశ్రమములుగాని, స్త్రీ పురుషాది మార్పులుగాని కారణములు కాజాలవు ప్రతివారున్ను ఇప్పుడేలాటి స్థితిలో నుంటున్నారో ఆలాగున నుండియే యీ నాలుగవస్థలను పొందవలయును పై జెప్పిన విధముగా బ్రాహ్మణత్వాది చతుర్వర్ణములు గాని, బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమములుగాని దేహముతో సంబంధించినవే ఇవి కల్పితములు దీనిచే మనస్సున కేలాటి మార్పున్ను గలుగదు ఇప్పుడు చెప్పబోవు చతుర్విధములైన మార్పులు ఆత్మకు సంబంధించినవే ఇవి పై నుదాహరించిన నాల్గు ఆశ్రమస్థులకున్ను చతుర్వర్ణస్థులకున్ను, గలుగవచ్చును ఇది ఆత్మలో గలిగెడు అవస్థలని మరువకూడదు ఇట్టి పరిణామము గలుగునప్పుడు స్వయముగానది వారి వారికే యనుభవమునకు వచ్చును ఇట్టి మార్పుగలిగిన మాత్రమే మోక్షము గలుగును సముద్రములో గల జలమంతయు ఏకరూపముగానే యుంటున్నది కాని మేఘమై పరిణమించి వర్షరూపముగా నేర్పడి స్థలోపాధులవల్ల ఆ యేకజలమే గంగాద్యనేక తీర్థములుగాను, పుష్కరాద్యనేక జలాశయములుగాను, తటాకాద్యనేకవిధ తోయములుగాను, కూపాద్యనేకోదకములుగాను మారుచుండును వానివాని యుపాధులను ఆవరణములను దాటి మరల సముద్రమున జేరునప్పుడు అవన్నియు ఒకే జలమయమై పోవుచుండును ముండకోపనిష త్తున గల యీ వాక్యమును చూడుడు

**యథా నద్యః స్యన్దమానాస్సముద్రే అస్తంగచ్ఛన్తి నామరూపే విహాయ ।**
**తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ॥**

ఎట్లు గంగాది మహానదులు ప్రవహించుచున్నవై సముద్రమునందు తమ తమ నామ రూపములను విడిచి ఏకరూపమును పొందుచున్నవో ఆ ప్రకారముగానే ఆత్మవేత్త నామ రూపములను వదలినవాడై అక్షరుడగు పరాత్పర పరమపురుషుని పొందుచున్నాడు ఆ చతుర్విధ భేదములలో మొదటిది ప్రస్తుతము కనుపించెడు నానావిధజాతులే ఈయనేక జాతులుగూడ మను మహర్షియొక్క సన్తతి వారని గ్రహించుకొనవలయును అప్పుడే యీ అనేకత్వములో గూడ ఏకత్వమును బడయగలము 1 మానవులనియు, 2 మనుజులనియు, 3 మనుష్యులనియు చెప్పునదంతయు మనువుయొక్క సన్తతి వారగుటవలననే యేర్పడినది దీనియొక్క యర్థము క్రింద వ్రాయ బడు చున్నది 1 మనోరిమే మానవాః (మనువుకు సంబంధించిన వారు), 2 మనోర్జాతాః మనుజాః (మనువువలన బుట్టిన వారు), 3 మనోః అపత్యాని పుమాంసః మనుష్యాః, మానుషాశ్చ (మనువు కొడుకులు) అని యమర కోశ నిఘంటువున్ను భారతమున్ను ఈ విషయమునే తెలుపుచున్నవి

స విశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మమిదం జగత్ ।
బ్రహ్మణా పూర్వ సృష్టం హి కర్మభిర్వర్ణతాం గతమ్ ॥

ఈ చతుర్వర్ణములకు ఏలాటి భేదమున్ను లేదు మొట్టమొదట బ్రహ్మ సంబంధమగు ఆర్యులు అను ఒక్కజాతి మాత్రమే యుండెను బ్రహ్మదేవుడు మొదట సృష్టిని గూడ ఈ లాగుననే చేసెను మరల సాత్త్విక, రాజస, మిశ్రతామస గుణములచే చతుర్వర్ణములు ఏర్పడెను

ఏకవర్ణ మిదం పూర్వం విశ్వమాసీద్యుధిష్ఠిర ।
కర్మక్రియా విశేషేణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితమ్ ॥

ఈ వాక్యము భీష్ముడు ధర్మరాజునకు బోధించినది ఓ ధర్మరాజా! ఈ విశ్వమంతయు పూర్వము ఒకే వర్ణముచే పూర్ణమయి యుండెను తర్వాత వారివారి గుణకర్మవిశేషములచే చాతుర్వర్ణ్యమేర్పడెను మన హిందూ దేశ చరిత్రలలో గూడ మధ్య ఏషియామైనరు ప్రాంతాన ఆర్య వంశ

మని యొక జాతి మాత్రమే యుండెననియు, వారలలో కొందరు హిమాలయము దాటి విన్ధ్యపర్వత మధ్య ప్రదేశమునందు ఉండినందుచే ఆర్యావర్తమని పేరు వచ్చినదనియు, సింధునదీ ప్రాన్తములో మొట్టమొదట నివసించిన వారగుటచే హిందువులని నామధేయము గలిగినటులనున్ను చరిత్ర కారులు వ్రాసియున్నారు మొట్టమొదట గ్రీక్ దేశీయులు మనదేశమున ప్రవేశించునప్పుడు సింధు అని యుచ్చరింపలేక పోయినందుచే హిందు అను శబ్దము ఏర్పడినటుల చరిత్ర కారులు తెలుపుచున్నారు ఈజాతియొక్క యుత్పత్తి విషయమై లోకోద్ధారకమను గ్రంధమున విస్తారముగా జూడవచ్చును

శ్రీకృష్ణభగవానుడు గీతయందుగూడ ఈ లాగుననే వచించెను

**బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరన్తప ।**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః ॥**

ఓ యర్జునా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకున్ను వారి వారి జన్మాన్తర సంస్కారము ననుసరించిన స్వభావమువలన గలిగిన గుణముల చేత వారు వారు ఆచరింపవలసిన కర్మలు విభజింపబడినవి ఈ భావన దృఢముగా గలుగునప్పుడు నానాగుణములుగల మానవులందఱున్ను ఏక గుణము గల వారగుదురు ఇట్టి స్థితిలో రూఢమైన కూపాదులవలె నుండు చిన్న చిన్న స్వభావములగు నుపాధులను దాటి పుష్కరము వంటి, పుణ్య జలాశయములవంటి వారు కాగలము అంతేగాక అత్తఱి మానవులందఱున్ను పరమ మహాఋషుల సన్తతి వారని గొప్ప పవిత్రతను జెందగలము అప్పుడు మనయాచారములు, ఆహారములు మొదలయినవన్నియు ఋషుల యాచార ఆహారాదులుగా మారగలవు గీత యందును శ్రీకృష్ణభగవానుడిట్లే యుపదేశించెను

**మహర్షయస్సప్తపూర్వే చత్వారో మనవస్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥**

లోకమునందు ఈ ప్రజలు ఎవరివలన జన్మించిరో అట్టి పూర్వీకు

లయిన సప్తమహర్షులున్ను, ఆలాగున నలుగురు మనువులున్ను మద్గతభావ నులై నా మనస్సువలన పుట్టిన వారగుచున్నారు

సప్తఋషులవలన కొన్ని సృష్టులు ఏర్పడినటులున్ను, మనువుల వలన మానవులు ఏర్పడినట్లును శాస్త్రములో గలదు మనువు సన్తతియగుట చేతనే మానవులని పేరుగలిగిన విషయము ఇదివరలో నిఘంటువున నిరూపింప బడెను దీనికన్న పరమ ప్రమాణము ఏమి కావలయును? భారత ప్రమాణమురీతిగా ఆదిలో ఒక్క ఆర్యజాతిమాత్రమే యుండెను కర్మ క్రియల భేదముచే కాలాన్తరమున అనేక దేశములకు వలసపోయినందు చేతను, గుణకర్మల స్వభావముచేతను క్రమముగా అనేక జాతులు ఏర్పడి నవి జినమునికి పూర్వము జైనులుండలేదు శ్రీబుద్ధదేవునకు ముందు బౌద్ధు లుండలేదు శ్రీ ఏసు క్రీస్తుకు పూర్వము క్రైస్తవులున్ను, శ్రీ మహమ్మదు ప్రవక్తకు మునుపు మహమ్మదీయులున్ను నుండలేదు వీరందరున్ను ఆ యా మతస్థులయిరి ఆలాగున ఆర్యమతస్థులున్ను, బ్రాహ్మమతస్థులున్ను శ్రీదయానంద, శ్రీరామమోహన్ రాయ్ గారల వల్ల పైజెప్పిన రెండు జాతీయు లేర్పడినారు కాలాన్తరమున కొన్ని జాతులే లేకపోవచ్చును ఇప్పుడు కానుపిం చెడు అనేక భేదములు గూడ లేకుండజేయుటకు తగిన ప్రబోధకు లేర్పడి బోధించిన ఈ భిన్నభిన్న భావములన్నియు నశించగలవు ఇకను ఎన్నియో జాతులు కాలాంతరమున ఏర్పడగలవు సాంఖ్యులు మొదలగు కొన్ని మత ముల వారలు ఇప్పుడు లేరు వారు మఱియొక సంఘములో చేరి యుండ వచ్చును ఒకవేళ అట్టి మార్పుచేయు ప్రవక్తలు లేనప్పటికిన్ని మన యొక్క ప్రజ్ఞవల్లను, పవిత్ర విచారణవల్లను నుత్తమగ్రంధ పరిశోధనవల్లను మనమనః పరిణామము జేసికొనవచ్చును అయితే యిట్టి స్థితి గలుగజేసి కొనుటకు మనము మతమును మార్పుజేసికొన నవసరము లేదని యిది వరలోనే తెలుపడమైనది

ఇప్పుడు మనము ఋషుల సన్తతి వారమని మాత్రము గ్రహించు కొనడమైనది ఇదియు దేహేన్ద్రియాదులతో సంబంధించినదే అయితే పవిత్ర

జన్మము గలవారని గ్రహించుకొనుచున్నారము ఇప్పటికే రెండు మార్పులు గలిగినవి ఇదివరలో చెప్పినదంతయు జడమైన దేహమును గుఱించి మాత్రమే అది యాత్మ గాదు మూడవ మార్పు గలుగునప్పుడే ఆత్మలోనికి ప్రవేశించగలము

అది చైతన్యము, సత్యము, శాశ్వతము, ఆనందము, అమృతము అదియే మనయొక్క యునికి అదియే మనము మనమతముగూడ అదియే ఈ స్థితికి వచ్చిన మనము జలాశయములను, తటాకములను, పుష్కరములను దాటి గంగ, యమున, గోదావరి, సింధు, నర్మద మొదలగు మహా పుణ్యనదులంత పరిణామమును పొందినవారలుగా నుండగలము కూపాదులకున్ను, సరోవరములకున్ను ఎంత వ్యత్యాసము గలదో, తటాకములకున్ను, నదులకున్ను ఎంత మార్పు ఏర్పడినదో, ఈశ్వరాంశులగు ఆత్మలే మనమని భావించునప్పుడు అంత పరిణామము పొందగలము ముండకోపనిషత్తు ఏమి చెప్పినదో యాలోకించుకొనుడు

**యథా సుదీప్తా త్పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవన్తే సరూపాః ।**
**తథాఽక్షరాద్వివిధాస్సోమ్య భావాః ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి ॥**

ఏలాగున బాగుగా మండుచుండు అగ్నిహోత్రమునుండి వేలకొలది అగ్ని స్వరూపములయిన అణువులు ఏర్పడుచున్నవో, ఆలాగున అక్షర స్వరూపుడగు పరమేశ్వరునుండి సమానములైన అనేక జీవకోట్లు గూడ పుట్టుచున్నవి అవి యన్నియు ఆ ఈశ్వరస్వరూపములే అపరోక్షానుభూతియు ఈలాగుననే చెప్పుచున్నది

**సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వం చ శాశ్వతమ్ ।**
**బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథా భవేత్ ॥**

సువర్ణమునుండి గలిగిన అణువులన్నిటికిన్ని సువర్ణత్వము ఏలాగున శాశ్వతమయి యుంటున్నదో, ఆలాగున అక్షరస్వరూపుడగు పరమేశ్వరునుండి యేర్పడిన జీవులన్నియు పరమేశ్వర స్వరూపములై యుంటున్నవి

అమృతబిందూపనిషత్తు ఉపదేశించినది చూడుడు

**ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః ।**
**ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్ ॥**

ఒక్కొక్క భూతమునందున్న పరమాత్మ యొక్కడేసుమా! జలమున చంద్రుని విధముగ ఒక్కడుగాను, అనేకముగాను కనబడుచున్నాడు

పాత్రములు అనేక లోహములతో, అనేకాకృతులతో నుండినను, వానిలో గల జలము అనేక రంగులతో, అనేకవిధ రుచులతో గూడినను, వానిలో ప్రతిబింబించెడు చంద్రబింబ మేలాగున ఒకటిగా నుంటున్నదో, ఆలాగున అనేక నామరూపములతో గూడిన దేహేంద్రియములకు సాక్షి యగు యాత్మ ఒక్కటిగానే యుంటున్నది

**గవామనేక వర్ణానాం క్షీరస్యాప్యేకవర్ణతా ।**
**క్షీరవత్పశ్యతే జ్ఞానం లిఙ్గినస్తు గవాం యథా ॥**

**ఆవులనేక రంగులవైనను పాల రంగన్నిట నొకటె సుమా**
**ఆవులవలె నీ దేహములున్నవి జ్ఞానము పాలకు సమము సుమా.**

గోవులు ఎరుపు, తెలుపు, నలుపు వర్ణములతోను, పొట్టి పొడుగు రూపములతోను ఉండినప్పటికిని అన్నిటిలోగల పాలు ఒకే తెలుపు వర్ణముగా నున్నట్లు మానవుల నామ రూపములు, వర్ణములు, అనేకములుగా నున్నను అన్నిటిలోగల జ్ఞానమొకటియే యని గ్రహించుకొనవలయును

**ఘృతమివ పయసి నిగూఢం భూతే భూతే చ వసతి విజ్ఞానమ్ ।**
**సతతం మనసి మథయితవ్యం మనోమన్థానభూతేన ॥**

**పాలలోన నెయ్యి మరుగైనట్టుల**
**భూతములలో విజ్ఞానము వెలుగున్,**
**చాలగ మనసును మథించి బ్రహ్మము**
**నేనని థలచి వెలిబుచ్చవలెన్**

పాలలో వెన్న కనపడక పోయినను తరచునప్పుడు ఏలాగున ప్రత్యక్ష ముగా కనబడునో ఆలాగున మనస్సులో ధ్యానజ్ఞానములు చేయునప్పుడు పరమాత్మగూడ గోచరించును

గీతయందు శ్రీకృష్ణభగవానుడు జీవకోట్లన్నియు తన అంశము లనియు, కొన్నికోట్ల జీవులుగా నుంటున్నవన్నియు తన స్వరూపములే యనియు నిరూపించినది చూడుడు ఇట్టి భావమును జనులకు బోధించు వారు లేక పోవుటచేతనే అజ్ఞులై దేహేంద్రియములే తామని తలంచి భవపాశ బద్ధులై దుఃఖితులగుచున్నారు

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ॥**

ఓ యర్జునా! సమస్త భూతములకు నన్ను బీజ రూపముగా నుండు వానినిగా తెలిసికొనుము

వృక్షమున కన్యముగా బీజమెట్లు లేదో, ఆ బీజమే పోషణచే వృక్షమగు చుండునో, ఆలాగున సర్వేశ్వరుడను వృక్షమునుండి జీవులను బీజము లేర్పడి యున్నవి ఆధ్యాత్మ జ్ఞానానుష్ఠానములచే ఆ జీవుడే ఈశ్వరమయుడగుచు న్నాడు బీజాంకుర న్యాయమును బట్టి వాదించువారు ఇట్టి పరమ తత్త్వమును తెలిసికొనక పోవుచున్నారే!

**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।**
**అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ ॥**

ఓ యర్జునా! సకల భూతములయొక్క హృదయ కమలమందుండు ప్రత్యగాత్మను నేనే సమస్త భూతములయొక్క ఆది, మధ్య, అన్తములును నేనే

భూతకాలములో అనగా సృష్టికిపూర్వము మాత్రము ఈ ఆత్మ ఈశ్వ రమయమై యుండి వర్తమాన కాలమున ఈశ్వరత్వము లేక పోవుటగాని, లేక భావికాలమున నశించుటగాని లేదనియు, త్రికాలములలోను ఈజీవాత్మ

ఈశ్వరమయముగానే యున్నదనియు తెలుపడమైనది

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ॥**

సమస్త ప్రాణికోట్ల యందుగల యుపాధి భేదముచే వేరుగానున్నను పరమార్థజ్ఞానముచేత ఒకటే యగు నాత్మయే నేను అని తెలిసికొనుము ఇట్టి క్షేత్ర క్షేత్రజ్ఞులను తెలిసికొనెడి జ్ఞానమేది గలదో అదియే నిజమగు జ్ఞానమని నా మతము

ఉపాధి భేదముచే ఆత్మయందు భేదము జూపుట నిజమగు జ్ఞానము కాదనియు, అది భగవత్సమ్మతము కాదనియు భగవంతుడే స్వయముగా తెలిపెను

**సర్వయోనిషు కౌన్తేయ మూర్తయస్సమ్భవన్తి యాః ।**
**తాషాం బ్రహ్మమహద్యోనిః అహం బీజప్రదః పితా ॥**

ఓ యర్జునా! సకల ప్రాణి కోట్లలో నే యే శరీరములు పుట్టుచున్నవో ఆ మూర్తులకు మూలప్రకృతి తల్లియనియు, నేను గర్భాధానము జేయు తండ్రిగా నుంటున్నాననియు తెలిసికొనుము

తండ్రి యేజాతివాడో యే గోత్రమువాడో కుమారుడున్ను అట్టి జాతియు గోత్రము గలవాడగుట యెంత సత్యమో, ఆలాగున ఈశ్వరాంశు లగు జీవులుగూడ ఈశ్వరతుల్యులగుటలో నేలాటి సందేహము లేదు అయితే రాకుమారుడు మహారాజు అను భేదమెటుల ఉన్నదో, యౌవన కాలము వచ్చునప్పుడు యువరాజు ఏలాగున మహారాజగుచుండునో, ఆలాగున అజ్ఞానదశలో జీవుడుగాను, జ్ఞానదశలో ఈశ్వరరూపుడుగాను అగు చుండును

**మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః ।**

అనాదియైన జీవాత్మ నారాయణుడగు నాయంశమే

ఇచ్చట భగవంతుడు ఎంత సత్యముగా తెలిపెనో దీనికన్న పరమ ప్రమాణము మనకేమి కావలయును?

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనం చ।**
**వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్॥**

నేను సకల ప్రాణుల హృదయమందున్న వాడను స్మృతి, జ్ఞానము మొదలైనవి నావలననే గలుగుచున్నవి సమస్త వేదములచే ఎరుంగదగిన వాడను నేనే వేదాంతమును చేసినవాడను నేనే వేదములను సంపూర్ణముగా తెలిసిన వాడను నేనే

పై జెప్పిన జీవేశ్వరుల యేకత్వమును గురించి భగవంతుడు తన యాశయమును తెలిపెను వేదములున్ను, వేదాంతములున్ను, వేదములచే తెలిసికొనతగినవాడు భగవంతుడే యని చెప్పుటచే అందరి హృదయముల లోను వెలుగుచున్నది భగవంతుడే అని శ్రీ భగవానునియొక్కయు, వేదము యొక్కయు, వేదాంతము యొక్కయు ఆశయమని గ్రహించదగినది

**ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।**
**భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥**

ఓ యర్జునా! ఈశ్వరుడు సర్వభూతముల హృదయ ప్రదేశమందున్న వాడై మాయచేత సకల భూతములను, యన్త్రి యన్త్రములను త్రిప్పునటుల త్రిప్పుచున్నాడు

ఈశ్వరుడే యందఱి హృదయములలో నుండు విషయమును మాయచేత జీవకోట్లు తెలసికొనక యున్నారను విషయము తెలుపబడినది కావున మాయలో నుండువరకు మనకు సత్యము తెలియదనియు, మాయను దాటిన వారికే నిజము తెలియుననియు భగవంతు డుపదేశించినాడు కావున దైవకృపకు పాత్రులైన మాత్రమే మాయ నశించునని గోచర మగుచున్నది

శ్రీభగవద్గీతలో ఈశ్వరుడే లేక, ఈశ్వరాంశమే జీవరూపముగా

న్నుట్లు వందలాది ప్రమాణములు గలవు అవియన్నియు వ్రాయంబూనిన వ్యాసము పెరిగిపోవునని తలంచి విడిచిపెట్టడమైనది విజ్ఞులకు దీనికన్న ఎక్కువ అవసరము లేదని తలంచడమైనది

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్త లనెడు మూడుదేహములనున్ను వాని ధర్మములనున్ను ఏయాత్మ ప్రకాశింపజేయుచున్నదో అట్టి ఆత్మయే తాననియు, అదియే ఈశ్వర స్వరూపమనియు తెలిసికొనిన వాడు సకల విధములయిన సంసారబన్ధముల నుండి విముక్తుడై జీవన్ముక్తి పదవిని పొందుచున్నాడు అని కైవల్యశ్రుతి యుపదేశించుచున్నది సహస్రముఖము లతో ఉపనిషత్తులన్నియు ఈలాగుననే యుద్ఘోషించుచున్నవి జనసామా న్యమునకు తెలుపు తగిన బోధకులు లేకపోవుటచేతనే అజ్ఞానమోహములో బడి జీవులు క్లేశమును పొందుచున్నవి యోగవాసిష్ఠమున తెలిపినదిన్ని చూడుడు

**కృశోఽతిదుఃఖీ బద్ధోఽహం హస్తపాదాదిమానహమ్ ।**
**ఇతి భావన రూపేణ వ్యవహారేణ బధ్యతే ॥**

నే నతికృశుడను బహుదుఃఖములచే బద్ధుడను ఈ కరచరణము లతో గూడిన వాడనై అశక్తుడనై యేమియు చేయుటకు చేతగానివాడను ఇట్టి దేహభావనతో గూడిన వాడై ఆత్మభావనా రహితుడై అనేక వ్యవహారములలో చిక్కుకొనిన వాడై బద్ధుడగుచున్నాడు

**నాహం దుఃఖీ న మే దేహో బన్ధః కోఽస్యాత్మనస్థితః ।**
**ఇతి భావన రూపేణ వ్యవహారేణ ముచ్యతే ॥**

దేహేన్ద్రియములకు సాక్షియైయుండు దైవాంశ స్వరూపుడనగు నేను దుఃఖినికాను జనన మరణములు లేనివాడనగు నాకు ఈ దేహముతో

సంబన్ధము లేదు సచ్చిదానంద లక్షణముగల యాత్మనైన నాకు బన్ధమెక్క డిది? ఈలాటి ఆత్మానాత్మ విచారణ భావరూప వ్యవహారములచే ముక్తు డగుచున్నాడు

పుణ్యాత్ములారా! ఇప్పుడు మనము కూపాదులనుండి సరోవరము లోనికిన్ని, తటాకాదులనుండి పుణ్యవంతములగు మహానదులలోనికిన్ని వచ్చి తిమి అయితే దీనివల్ల మనపని పూర్తియయినదనిగాని, గమ్యస్థానమును చేరితిమి అనిగాని తలంచి యూరకుండరాదు మహానదులు గూడ అంత గొప్ప వైశాల్యావస్థను పొందినను నిలువక వర్షాకాలమున ఎంతవేగముగా పరుగెత్తుకొని తమ మూలస్థానమగు సముద్రములోనికి చేరుచున్నవో ఆలాగున మనమున్ను నిలకడలేకనే గమ్యస్థానమగు అత్మస్థానములోనికి అనగా బ్రహ్మలోనికి పరుగెత్తిపోయి చేరవలయును నదులు ఎండా కాలములో ఆ యా స్థానములలో నిలిచిపోయి చిక్కిపోవుటయు, కొన్ని స్థలములలో పాచిపట్టి కుళ్ళిపోవుటయు, వర్షాకాలములో కట్టదాటి ప్రవహించి పోవుటయు గలుగునని తలంచియే తమ పుట్టుస్థానమగు, అచలమగు, పరిపూర్ణమగు, ననంతమగు సాగరములోనికి చేరువరకు ఎడతెగని ప్రయత్నము గలిగియున్నవని మనము గ్రహించుకొనవలయును ఆలాగున మనముగూడ కొంతజ్ఞానముచేగాని, యోగముచేగాని, తపస్సుచేగాని, ప్రభావముచేగాని, సిద్ధులచేగాని, మహిమలచేగాని, పూజ్యతచేగాని, శిష్యసంఘములచేగాని, అనేక మఠములచేగాని గొప్పవారమైతిమి, గమ్య స్థానమును చేరితిమి, ఇక పొందవలసినది లేదు, సర్వజ్ఞులమయితిమి, ఇక విధి నిషేధములతో పనియేమి? నియమానుష్ఠానములు అవసరము లేదు అని తలంచవలదని మహానదులు మనకుపదేశించుచున్నవి

మహాజీవ నదులు ఈలాగున నుపదేశించుచుండగా తటాకావస్థ లోను, కూపావస్థలోను ఉండు వారి స్థితిని గురించి మరల చెప్పవలయునా? ఇవన్నియు ముముక్షువులు తమ యాత్మానుభవములచే యోచించుకొనవల యును ఇప్పుడు మనము మహానదులు కట్టలనుదాటి సాగరములోనికి

ప్రవేశించి ప్రశాంతస్థితిని పొందునటుల నాల్గవదియగు అనంతానందము లోనికి ప్రకృతి కట్టను ధ్వంసమొనర్చి దాటవలయును అప్పుడే మనపని పూర్తియైనదని తలంచవలయును అదే శివము, ఆనందము, అమృతము, అద్వైతము, ఓమ్ దీనినే మనకు ఉపనిషత్ప్రార్థనలో మొదట గల వాక్యము తెలుపుచున్నది

**అసతోమా సద్గమయ తమసో జ్యోతిర్గమయ**
**మృత్యోర్మా అమృతం గమయ!**

1 అసత్తునుండి నన్ను సత్తులోనికి చేర్చుము, 2 తమస్సునుండి నన్ను ప్రకాశములోనికి చేర్చుము, 3 మృత్యువునుండి నన్ను అమృతము లోనికి చేర్చుము అని ఈ వాక్యముల కర్థము

**ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తైరేవతు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః ॥**

ఆత్మయనియు, క్షేత్రజ్ఞుడనియు, జీవుడనియు చెప్పబడెడు పేర్లన్నియు ప్రకృతి సంబంధగుణములతో కూడియుండువరకు మాత్రమే అట్టి ప్రాకృత గుణములనుండి యెప్పు డీజీవుడు ముక్తుడగునో అప్పు డీయాత్మయే పరమాత్మయని చెప్పబడును

**స ఆత్మా స హి విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః ।**
**తుర్యాత్మజ్ఞాన హీనానాం న ముక్తిస్స్యాత్కదాచన ॥**

మోక్షేచ్ఛ గలవారందరిచేతను అట్టి ఆత్మస్వరూపమే తెలిసికొనదగినది అట్టి తురీయ స్వరూపుడగు ఆత్మసాక్షాత్కారజ్ఞానము గలుగని వారికి మోక్షమనునది యేకాలమందైనను కలుగునది కాదు

**భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా ।**
**పుమాంస్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ ॥**

నిశ్చయాత్మబుద్ధి గలవానిచే ఏ ఆత్మ తీవ్రవేగముచే భావింపబడు

చున్నదో, అతడు ఆ జ్ఞేయవస్తువుగా భ్రమరకీటకమువలె అగుచున్నాడు అనగా కీటకము భ్రమరమును తదేక ధ్యానముతో భావించుటవలన క్రిమిత్వము పోయి భ్రమరత్వము పొందునటుల తీవ్రధ్యానము జేయువాడు దైవత్వమును పొందును

**భావవృత్త్యా హి భావత్వం శూన్యవృత్త్యా హి శూన్యతా ।**
**బ్రహ్మవృత్త్యా హి పూర్ణత్వం తఫ్మాత్పూర్ణత్వ మభ్యసేత్ ॥**

మానవుడు దేనిని నిరన్తర భావన చేయుచుండునో యట్టి స్థితినే పొందుచున్నాడు శూన్యమును భావించుటచే శూన్యత్వమును, బ్రహ్మవృత్తి గలిగిన పూర్ణమగు బ్రహ్మమును పొందును అందుచే పరిపూర్ణ పరబ్రహ్మ భావనయే నిరన్తర ముండవలయును

**జీవన్ముక్తిస్తు తద్విద్యాత్ పూర్వోపాధిగుణాం స్త్యజేత్ ।**
**స సచ్చిదాది ధర్మత్వాత్ భేజే భ్రమరకీటవత్ ॥**

లోకమందు పురుగును తుమ్మెద తీసికొనివచ్చి చేయవలసిన ప్రకారముగా చేసిన మాత్రముచేతనే, యా పురుగు తన తలంపును చలించకుండా దానియందుంచిన మాత్రముచేతనే తనయందు పూర్వమున్న పురుగు ధర్మమును వదలి భ్రమరస్వరూపమును పొందినటుల ఈ జీవుడు నిరన్తర బ్రహ్మభావనచే బ్రహ్మత్వమును పొందుచున్నాడు

**నాహం బ్రహ్మేతి సంకల్పాత్ సుదృఢాద్బధ్యతే మనః ।**
**సర్వం బ్రహ్మేతి సంకల్పాత్ సుదృఢాన్ముచ్యతే మనః ॥**

నేను బ్రహ్మము కానని సంకల్ప దృఢవాసనవలన సంసారమందు బద్ధుడగుచున్నాడు తానున్ను ఈ సమస్తమున్ను బ్రహ్మమయమను దృఢమగు సంకల్పమువల్ల సంసారమునుండి ముక్తుడగుచున్నాడు

**మర్త్యోఽహమితి సన్ధాయ మ్రియయే జాయతే చ సః ।**
**బ్రహ్మాహమితి సన్ధాయ ముచ్యతే న చ జాయతే ॥**

మర్త్యుడను భావము ఎంతవరకు ముముక్షువయిన వానికుండునో, అంతవరకు మరణించుటయు, మరణించువాడు జన్మించుటయు జరుగు చుండును బ్రహ్మమే తన స్వరూపమని యనుసన్ధానము గలవాడు ముక్తు డగుచున్నాడు మరల జన్మించడు

ఇదియే వేదాంతముయొక్క పరమ కాష్ఠయని గ్రహించుకొన వలయును ఈ స్థితిలో తమయనుభవ మెంత గలిగియుండునో వారికి వారే ఆలోచించుకొనవలయును

**అగ్నిసంగాద్యథా లోహ మగ్నిత్వమధిగచ్ఛతి ।**
**ఆత్మ సంగాత్తథా గచ్ఛత్యాత్మతామిన్ద్రియాదికమ్ ॥**

ఇనుము మొదలగు లోహఖండములు కొలిమిలో పెట్టి యూదుటచే ఏలాగున అగ్నిమయము లగుచున్నవో ఆలాగున ఆత్మానుసంధాన పరుడగు వానియొక్క మనస్సు మొదలగు ఇన్ద్రియాదులన్నియు ధ్యానబలముచే ఆత్మమయము లగుచున్నవి

ధ్యానబలముచే ఇట్టి యవస్థ తనకు గల్గినదా యని బ్రహ్మనిష్ఠులు సదా తమలో తాము పరిశోధన సల్పుచుండవలయును

**యావద్విజ్ఞానసామీప్యం తావచ్ఛ్రైష్ఠ్యం వివర్ధతే ।**
**బ్రహ్మజ్ఞానాయతే సాక్షాత్ నిర్గుణోపాసనం శనైః ।**

జీవుడెంతవరకు బ్రహ్మమును సమీపించునో అంతకంతకు శ్రేష్ఠత్వ మును పొందగలుగును బ్రహ్మజ్ఞాన సాక్షాత్కారముకొఱకు క్రమముగా మెల్ల మెల్లగా సగుణోపాసన చేయుచు నిర్గుణోపాసనలోనికి ప్రవేశించవలయును ఆలాగున క్రమముగా మెల్లమెల్లగా బ్రహ్మవిచారముచే జీవ భావనను వదలించి బ్రహ్మభావనలోనికి రావలయును

**నిషిధ్య నిఖిలోపాధీన్ నేతినేతీతి వాక్యతః ।**
**విద్యాదైక్యం మహావాక్యైః జీవాత్మ పరమాత్మనోః ॥**

సమస్తమైన కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వాది రూపోపాధులను 'నేతినేతి'అనే వేదవాక్యమువలన త్రోసివేసి జీవాత్మ పరమాత్మలయొక్క ఐక్యమును మహావాక్యములచే తెలిసికొనదగినది

**ముక్తాభిమానీ ముక్తో హి బద్ధో బద్ధాభిమాన్యపి ।**
**కిం వదన్తీతి సత్యేయం యా మతిస్సా గతిర్భవేత్॥**

తాను జీవన్ముక్తుడను దృఢభావనగల వాడు తప్పక ముక్తుడగును అట్లుగాక తాను బద్ధుడని తలంచువాడు తప్పక బద్ధుడగును ఇక ఈ విషయమై అనేకముగా చెప్పవలసిన పని లేదు పై జెప్పిన వాక్యము సత్యము మతియెంతో గతియు అంతే

**సర్పత్వేన యథా రజ్జూ రజతత్వేన శుక్తికా ।**
**వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా ॥**

రజ్జువు సర్పముగను, శుక్తి రజతముగను నిర్ణయింపబడునటుల ఆత్మ దేహముగా మూఢునిచే నిశ్చయింపబడుచున్నది

**ఘటత్వేన యథా పృథ్వీ పటత్వేనైవ తన్తవః ।**
**వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా ॥**

పృధ్వి ఘటముగను, తంతువులు పటముగను నిశ్చయింపబడు నటుల ఆత్మ దేహముగా మూఢునిచే నిశ్చయింపబడుచున్నది

**కనకం కుండలత్వేన తరంగత్వేన వై జలమ్ ।**
**వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా ॥**

కనకము కుండలముగను, జలము అలల వలెను నిశ్చయింపబడు నట్లు, ఆత్మ దేహముగా మూఢునిచే నిశ్చయింపబడుచున్నది

**గృహత్వేనైవ కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా ।**
**వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా ॥**

త్రాకులు గృహములుగను, ఇనుము కత్తిగను నిశ్చయింపబడునటుల ఆత్మ దేహముగా విమూఢునిచే నిశ్చయింపబడుచున్నది

ఇప్పుడు నాల్గవస్థలున్ను సంగ్రహముగా నిరూపించడమైనది కోట్ల కొలది వేదాంత శాస్త్రములన్నియు దీనినే సంక్షిప్తముగా వర్ణించుచున్నవి ఇట్టి అనంతానందమగు అఖండమగు ఆత్మలోనికి ప్రవేశించినప్పుడే మనము చేయవలసిన కార్యములన్నియు చేసిన వారమగుదుము అట్టి కృతకృత్యుడే కృతార్థుడు కాగల్గును అతని జన్మమే జన్మము అతడే ధన్యుడు అతని మాతయు ధన్యురాలు, అతని తండ్రియు ధన్యుడు, అతని నివాస భూమియు ధన్యత్వము నొందును అతడు అడుగిడిన స్థలమంతయు పావన మగును అది కొంత కాలమునకు పుణ్యభూమి యగును

**ధన్యా మాతా పితా ధన్యో ధన్యం గోత్రం కులోద్భవః ।**
**ధన్యా చ వసుధా దేవీ యత్ర స్యాద్గురుభక్తతా ॥**

దీని యర్థము పైన నిరూపింపబడినదే

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమంధవత్ ॥**

ఆత్మజ్ఞానమను నేత్రము గలవాడు సమస్తములోను వెలుగుచుండు ఆత్మస్వరూపమును చూచుచున్నాడు అట్టి జ్ఞానదృష్టిలేనివాడు ప్రకాశించు సూర్యుని అంధుడు చూడజాలనటుల పరమాత్మను దర్శింపజాలడు

**బహుజన్మకృతైః పుణ్యైః వైరాగ్యం ఖలు జాయతే ।**
**వైరాగ్యేణ వినా జ్ఞానం న కదాఽప్యుపజాయతే ॥**

బహుజన్మములలో చేయబడిన నిష్కామ కర్మతో కూడిన పుణ్య కర్మలచేతనే మానవులకు విషయ వైరాగ్యము గలుగుచుండును అట్టి విషయ విరక్తి వినా ఆత్మజ్ఞానము ఒకానొకప్పుడును గలుగునది కాదు ఇప్పుడు అభ్యాసముయొక్క ప్రయోజనమునుగురించి వాసిష్ఠమున తెలిపినది

చూడుడు

**అజ్ఞోఽపి తజ్జ్ఞతామేతి శనైశ్శైలోఽపి చూర్ణ్యతే ।**
**బాణోఽప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాసవిజృంభితమ్ ॥**

అభ్యాసముచే అజ్ఞుడు జ్ఞానవంతు డగుచున్నాడు పరిశ్రమచేత మహా పర్వతముగూడ నింపాదిగా చూర్ణము జేయబడుచున్నది అభ్యాసమువలన దూరములోగల అతి సూక్ష్మమగు లక్ష్యము బాణముచే భేదింపబడుచున్నది ఇదంతయు పురుష ప్రయత్నముయొక్క ఫలితము అభ్యాస ఫలితమును చూడుడు

నావచే మహాసముద్రమును గూడ దాటుచున్నాడు గొప్ప నదులను వంతెన కట్టి దాటుచున్నాడు పర్వతములను కొట్టియు రంధ్రము జేసియు దారుల ఏర్పరచుచున్నాడు టార్పేడుచే జలాన్తర్భాగమున ప్రయాణము చేయుచున్నాడు వైర్‌లెస్సుచే ఏకకాలమున అనంతకోటి వాక్యములను ప్రపంచములో ప్రతిధ్వనింపజేయు శక్తినిగూడ కనుగొనుచున్నాడు ఇదంతయు పరిశ్రమయొక్క ఫలితమని జ్ఞాపక ముంచుకొనవలయును

**నానుష్ఠానాత్పరం కార్యం త్రిషు లోకేషు విద్యతే ।**
**సత్యం సత్యం పునస్సత్యం ఇతి మామకభాషితమ్ ॥**

అనుష్ఠానమునకు మించిన కార్యము మూడు లోకములలోను మఱియొకటి లేదు ఇది సత్యము. ఇది సత్యము పునస్సత్యము అను నా వాక్యమును నమ్ముడు

ఇకను మీకు ధైర్యము గలుగుటకొఱకు, భవబంధమునుండి విముక్తి గలుగట కొఱకు కొన్ని వాక్యములను తెలిపెద

**యథైకం చ సువర్ణాది మిళితం రజితాదినా ।**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽప్యహంయుతః ॥**

**యథైవ హి సువర్ణాది క్షారాదేశ్శోధితం శుభమ్ ।**
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః ॥**

ఏలాగున సువర్ణము వెండి, రాగి, యిత్తళులతో మిళితమైనచో అల్ప మైన వెలగలది యగుచున్నదో, ఆలాగున శుద్ధ శివస్వరూపుడగు జీవుడు గూడ అవిద్యతో కూడిన వాడగుటచే దీనావస్థను పొందుచున్నాడు ఏలాగున తెల్ల బంగారము బాగుగా స్ఫుటము జేయునప్పుడు మలిన లోహములు పోయి శుద్ధమగు బంగార మగుచున్నదో, అత్తఱి పూర్వముగల స్వర్ణము యొక్క విలువను పొందుచున్నదో, ఆలాగున బ్రహ్మవిచార తపస్సులనెడు సంస్కారములచే జీవుని అవిద్యాదోషము నశించునప్పుడు శివత్వమును పొందుచున్నాడు

ఇకను అనుష్ఠానమందు ధైర్యము గలుగుటకు వసిష్ఠ వచనమును చూడుడు సామాన్యముగా జనులు పూర్వజన్మ కర్మము జీవునితోకూడ వచ్చినదనియు, అది అనుభవించియే తీరవలెననియు, వేరుగా అది నశించు మార్గములేదనియు చెప్పెడు వాక్యములను నమ్మి అనేకులు ప్రయత్న రహితులై దుఃఖితులు అగుచున్నారు శ్రీయోగవాసిష్ఠమున తెలిపినది వినుడు

**తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా ।**
**నశ్యతి క్రియయా పుత్ర! పురుషస్య తథా మలః ॥**

**జీవస్య తండులస్యేవ మలం సహజమప్యలమ్ ।**
**నశ్యత్యేవ న సన్దేహః తస్మాదుద్యమవాన్భవ ॥**

వడ్లు, బియ్యము పుట్టునప్పుడు పొట్టుతోను, ఆవరణమగు తౌడు తోను ఆవిర్భవించుచున్నది ఆలాగున రాగి యుత్పత్తిలోనే చిలుముతో కూడియే యుంటున్నది దంచుటచే పొట్టు తౌడు పోవునటులున్ను, స్ఫుటముచే తామ్రముయొక్క చిలుము తొలగి బంగార మగునటులున్ను అనుష్ఠానముచే జీవుడును శుద్ధుడగును. దీనియందు సన్దేహము లేదు

అందువలన నీ వెల్లప్పుడును ప్రయత్నపరుడవుకమ్ము అని శ్రీ వసిష్ఠ మునీంద్రుడు శ్రీ రామచంద్రుని కుపదేశించెను

**శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః ।**
**జీవస్సర్వమలాన్ముక్తః స్వర్ణవద్ద్యోతతే స్వయమ్ ॥**

శ్రవణమనన నిదిధ్యాసనాదులచే మిక్కిలి ప్రకాశింపజేయబడిన జ్ఞానాగ్నిచే చక్కగా దహింపబడిన ప్రత్యగాత్మ సమస్త సంసార హేతుభూత అజ్ఞానమాలిన్య రహితుడై స్ఫుటము చేయబడిన బంగారువలె ప్రకాశించుచున్నాడు

**వివిక్త దేశ ఆసీనో విరాగో విజితేన్ద్రియః ।**
**భావయేదేక మాత్మానం తమనన్తమనన్యధీః ॥**

ఏకాంత ప్రదేశమున ఆసీనుడై, నిరాశగలవాడై, సర్వేన్ద్రియములను నిగ్రహించినవాడై, ఆత్మవ్యతిరిక్త వస్తువునందు బుద్ధిని పోనీయనివాడై ఏకమైన అనన్తమైన సత్యజ్ఞానానంద స్వరూపుడైన ఆత్మయే తానని భావన చేయవలెను

**నిత్యశుద్ధ విముక్తైక మఖండానందమద్వయమ్ ।**
**సత్యం జ్ఞానమనంతం యత్ పరం బ్రహ్మాహమేవ తత్ ॥**

నిత్యమై, శుద్ధమై, ముక్తమై, ఏకమై, అఖండమై, ఆనందమై, అద్వయమై, సత్యమై, జ్ఞానమై, అనంతమై యేస్వరూపముకలదో అట్టి పరబ్రహ్మమే తన ఆత్మగా భావించవలెను

**ఏవం నిరన్తరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా ।**
**హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥**

పై జెప్పిన ప్రకారము నిరంతరకృత బ్రహ్మైవాస్మీతి అభ్యాసము వలన దివ్యౌషధమువలన రోగములు నశించునటుల అవిద్యా విక్షేపావరణములు నశించును

**అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢం భవేత్ ।**
**సమాధి సహితస్తావ దభ్యసేచ్ఛ్రవణాదికమ్ ॥**

అహంబ్రహ్మేతి మహావాక్యార్థబోధ యెంతకాలమువరకు దృఢ పడునో, అందాక శమదమాదులతో కూడినవాడై శ్రవణమనన నిదిధ్యాస ములను తప్పక చేయవలెను

**యావజ్జీవం జపేన్మన్త్రం ప్రణవం బ్రహ్మణో వపుః ।**
**హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః ॥**

బ్రహ్మనిష్ఠుడు ఎంతకాలము వరకు జీవించి యుండునో అంతవరకు పరబ్రహ్మ స్వరూపమగు ప్రణవమును అర్థసహితముగా జపము చేయ వలయును ఆ జపము హ్రస్వమయినచో పాపములన్నిటిని నశింపజేయును దీర్ఘమయినచో మోక్షము గలుగజేయును

**జపేచ్చ ప్రణవం నిత్యం జితాత్మా విజితేన్ద్రియః ।**
**పఠేదుపనిషద్వాక్యం వేదాన్తార్థాంశ్చ చిన్తయేత్ ॥**

వేదాంతముయొక్క పరమ కాష్ఠలో చెప్పబడిన విషయము ఈ క్రింద తెలుపబడినది ఇంద్రియములను మనస్సును స్వాధీనములో నుంచినవాడై నిత్యము ఓంకారమును అర్థముతో గూడ జపమొనరించవలయును ఉపనిష ద్వాక్యములను పఠించవలయును వేదాంతార్థములను లెస్సగా చింతన చేయవలయును దీనికి మించిన కార్యము బ్రహ్మనిష్ఠునకు మఱియొకటి లేదు

**బ్రాహ్మణః క్షత్రియో వైశ్యో శూద్ర శ్చండాల ఏవ చ ।**
**దృఢాభ్యాసకరో నిత్యం పునర్జన్మ వ విన్దతి ॥**

బ్రాహ్మణుడైనను, క్షత్రియుడైనను, వైశ్యుడైనను, శూద్రుడైనను, అన్త్యజుడైనను నిత్యము దృఢమైన బ్రహ్మాభ్యాసము చేయుచు వచ్చిన అతడు పునర్జన్మ రహితమగు మోక్షమును పొందుచున్నాడు

**త్రిషు ధామసు యత్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః ।**
**స పూజ్యస్సర్వభూతానాం వన్ద్యశ్చైష మహామునిః ॥**

ఎవడు మూడవస్థలలోను ఒకే ప్రకారముగా వెలుగుచుండు ఆత్మను నిశ్చయముగా బ్రహ్మభావనచే తెలిసికొనుచున్నాడో అతడు బ్రహ్మాది సర్వ భూతముల చేతను పూజ్యుడు, వన్దనీయుడు అతడు మహాముని అనియు చెప్పబడుచున్నాడు

**యావజ్జీవం త్రయో వన్ద్యాః వేదాంతోగురురీశ్వరః ।**
**ఆదౌ విద్యా ప్రసిద్ధ్యర్థ మన్తే విఘ్న నివృత్తయే ॥**

జీవించియుండువరకు ఈ క్రింద చెప్పబడు ముగ్గురున్ను పూజనీ యులే వారెవరనగ (1) వేదాంత శాస్త్రము, (2) గురుదేవుడు, (3) ఈశ్వ రుడు మొదట ఈ ముగ్గురివలననే జ్ఞానము గలిగినది దీనివలన జ్ఞాన ప్రసిద్ధియు, విఘ్న నివృత్తియు గలుగుచున్నవి

ఈ క్రిందజెప్పెడు రెండు శ్లోకములతో వ్యాసము పూర్తియగుచున్నది దీనియొక్క విశ్వాసమువల్లనే యెట్టివారైన తరించవలసియున్నారు

**నాస్తి శ్రద్ధాసమం పుణ్యం నాస్తి శ్రద్ధా సమం సుఖమ్ ।**
**నాస్తి శ్రద్ధాసమం తీర్థం సంసారే ప్రాణినాం నృప ॥**

ఈ సంసారమందు ప్రాణికోట్లకు శ్రద్ధకు సమమగు గొప్పపుణ్యము మఱియొకటి లేదు శ్రద్ధకు సమమైన సుఖమున్ను మఱియొకటి లేదు శ్రద్ధకు సమమైన తీర్థయాత్ర మఱియొకటి లేదు శ్రద్ధ యొకటి గలవాడు తక్కిన యే సాధనలు లేప్పటికిని ముక్తుడగును

**యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।**
**యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

ఏ సచ్చిదానందాత్మ లాభమునకంటె మరియొక లాభము లేదో, ఏ బ్రహ్మసుఖమగు ఆనందముకంటె అధికమైన మరియొక సుఖము లేదో, ఏ

బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముకంటె అధికమైన మరియొక జ్ఞానము లేదో, అదే బ్రహ్మమని నిశ్చయించుకొనవలయును అని శ్రీశంకరభగవత్పాదులు ఆత్మ బోధమందు సెలవిచ్చిరి



# ఆత్మవిద్య *

శ్రీకృష్ణభగవానుడు, "అధ్యాత్మ విద్యా విద్యానాం" అని ఉపదేశించిరి అనగా చతుష్షష్టి కళా విద్యలలో అధ్యాత్మవిద్యయే ముఖ్యమని తెలిపిరి విద్యలన్నిటిలోను ఆత్మవిద్యయే ప్రధానమైనదని తెలుపుచుండగా ఈ విద్య యందు అధిక జనులకు ప్రవేశము తక్కువ యగుటకు ఏమి కారణమని మన మాలోచించుకొనవలయును దానికి కారణ మీలాగున నుండును ప్రపంచములో గల విద్యలన్నియు జదువుటకు అంతఃకరణశుద్ధి, విషయ విరక్తి, ఈశ్వరభక్తి, శమము, దమము, సత్యావాక్ పాలనము, ధర్మాను ష్ఠానము, బ్రహ్మచర్యవ్రతము, జీవకారుణ్యము మొదలగు దైవగుణములు గలిగి యుండవలయునని నియమము లేదు ఉండిన మంచిదని మాత్రమే శాస్త్రము దెలుపుచున్నది ఈ బ్రహ్మవిద్యయందు తప్పక పై చెప్పిన బ్రహ్మ నిష్ఠునికి విధింపబడిన గుణములన్నియు నుండవలయునని శాస్త్రము నియమించుచున్నది అదియునుగాక బ్రహ్మనిష్ఠునికి తగని ప్రాపంచిక సుఖములన్నిటిని విడువవలయునని గూడా విధించడమైనది కావుననే వివేక చూడామణియందును, ఆత్మబోధమందును ఈలాగున అధికారి గురించి నిరూపించడమైనది

**మేధావీ పురుషో విద్వాన్ ఊహాపోహవిచక్షణః ।**
**అధికార్యాత్మవిద్యాయా ముక్తలక్షణలక్షితః ॥**

* రజతోత్స సంచికలో ఈ పైన నుండిన బ్రహ్మచర్యము, గాయత్రీ మన్త్రము - లను రెండు శీర్షికలలోని విషయము ఆ యా పేర్లతో గల ప్రత్యేక గ్రంధాల పీఠికలుగా ముద్రింపబడి యుండుటచేత ఇచ్చటినుండి తొలగించడమైనది (సంపా)

ఊహాపోహలయందు సమర్థుడును, మేధావంతుడును, విద్వాంసుడును, వైరాగ్యాది లక్షణములతో కూడిన వాడును అగువాడు బ్రహ్మవిద్యయం దధికారి యగును

**తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణామ్ ।**

**ముముక్షూణామపేక్ష్యోఽయం ఆత్మబోధో విధీయతే ॥**

శాస్త్రోక్తములైన పుణ్య కర్మానుష్ఠాన తపస్సులచేత దురితములు నశించుటవలన శుద్ధమైన అంతఃకరణము గలవారును, మోక్షాపేక్ష గలవారునైన జనులకు ఆత్మస్వరూపబోధ గలుగుటకొరకు ఈ గ్రంధము వ్రాయబడినది

మరియు ఆరంభములో దీనియందు ఏలాటి సౌఖ్యమున్ను గాన్పించదు పూర్వజన్మ సుకృతజీవియైనచో ఆరంభమునుండియే కొంత మనఃశాంతియు, హృదయ ప్రసన్నతయు, కొంత ఆత్మసుఖమున్ను కొంచెము కొంచెముగా గలుగుచుండును అభ్యాసము అభివృద్ధిలోనికి రాగా రాగా అది శుక్ల పక్షచంద్రునివలె వృద్ధినొందుచుండును ప్రాపంచిక విద్యలలో పై జెప్పిన ఇంద్రియ సౌఖ్యములను విడువవలయునని నిర్బంధించుట లేదు విద్య యొక్క ఆధిక్యము ననుసరించి ఉద్యోగములున్ను లభించుచున్నవి దానివల్ల ధనప్రాప్తియు, దీనివల్ల భౌతికసౌఖ్యములున్ను, లోకములో విఖ్యాతియు ప్రత్యక్షముగా గలుగుట కానుపించుచున్నవి ఇదియున్ను ఒక్క హేతువగును కాని దీనివల్ల హృదయశుద్ధిగాని, మనఃశాంతిగాని కొంచెమైనను గలుగకపోవుటయేగాక సంసార దుఃఖములు పెరుగుచుండును ఇది అతనికి ఆ అవస్థలో గోచరము గాదు వార్ధక్యదశ వచ్చినప్పుడే దానిని కనుగొనుచుండును అత్తరి వలలో జిక్కుకొనిన చేప దానినుండి తప్పించు కొనజాలక కష్టపడుటవలె సంసార జలమునుండి తప్పించుకొనజాలక దుఃఖముతో కాలము గడుపవలసివచ్చును కావుననే సంసారజాలమని జెప్పుట జాలమనగా చేపలపట్టువానియొక్క వలకు పేరు సుఖమును గురించి గీతలో

ఈలాగున దెలుపడమైనది

**యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజమ్ ॥**

ఏ యాత్మ సుఖము ఆరంభమునందు విషమువలెనుండునో, పర్యవసానమునందు అమృతమువలె పరిణమమును బొందుచుండునో అట్టి పరమాత్మ విషయమైన బుద్ధియొక్క నైర్మల్యమువలన గలిగిన సుఖము సాత్త్విక సుఖమని యోగులచే చెప్పబడుచున్నది ఇక విషయసుఖ మెటువం టిదో అదియున్ను ఈ క్రింద నిరూపించడమైనది

**విషయేంద్రియసంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమమ్ ।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥**

స్రక్చందన వనితాది సంగాదులచేత ప్రసిద్ధమైనదియును, విషయములయందు ఇంద్రియములు జేరుటవలన మొదట అమృత తుల్యమైనదియును, పిమ్మట బలము, వీర్యము, రూపము, ప్రజ్ఞ, జ్ఞాపకశక్తి, ఉత్సాహము వీనియొక్క హానికి కారణమగుట వలన పరిణామమున విషమువంటిదియును అగు సుఖమేది గలదో అదియే రాజస సుఖము

ఈవిషయమై శ్రీఏసుక్రీస్తును ఒకడిట్లడిగెను స్వర్గమునకు (మోక్షమునకు) వెళ్లెడు మార్గమెట్లుండును? అపుడు ఆ దివ్యపురుషుడు మహానుభావుడు ఆదారి మొట్టమొదట చాలా యిరుకైనదియును, అంతేగాక గాఢాంధకారముతో కూడినదియును, అదియునుగాక బురదతోను ముండ్లతోను కూడినదనియు జెప్పుచూ, అయితే ఒక ఫర్లాంగు వరకు అంతకష్టమనియు, తరువాత కొంత నడచుటకు మార్గమేర్పడగలదనియు, మరి కొంతముందుకు సాగుచుండిన మంచి ప్రకాశముతో కూడినదియు, సుఖకరమైనదియును అగు త్రోవ గలుగుననియు, ఒక్క మైలు దూరముగా వెళ్ళినచో మంచినీడతో అనేక ఫలపల్లవ పుష్పములయొక్క సుగంధపు గాలితో కూడిన మనోహరమైన మార్గమేర్పడగలదనియు, ఇంక కొంత

దూరము వెళ్లేనేని మధురములగు నానారకములగు పండ్లతోను, పానీయ ములతోను కూడియుండు దారి గలుగుననియు జెప్పెను దీనిని పృచ్ఛకుడువిని నరకము నకు వెళ్ళు మార్గమేలాగున నుండునని యడుగగ, దైవపుత్రుడగు ఏసునాధుడు అచ్చోట నుండి యిచ్చోటకు వచ్చేలాగున నుండునని ప్రత్యుత్తర మిచ్చెను అనగా మొదటిది ముందుకు వెళ్లునట్లున్ను, రెండవది వెనుకకు మరలివచ్చునట్లున్ను ఉండునని తాత్పర్యము ఈ వాక్యమున్ను గీతలో జెప్పిన వచనమున్ను సమానార్థమును గలుగజేయు చున్నది

2 ఆధ్యాత్మ విద్యయందు ఎక్కువ జనులకు ప్రవేశములేని కారణ ముచే దానియందు అతిశయములేదని కొందరు దలంచుచున్నారు అట్టి తలంపు సరియైనదికాదు ఈ విషయమై శ్రీకృష్ణభగవానుడే తెలుపడమైనది

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥**

మనుష్యులలో వేలకొలది సంఖ్యలయందు ఒకానొకడు మాత్రమే పూర్వపుణ్య విశేషముచే ఆత్మజ్ఞానశుద్ధికొరకు ప్రయత్నము చేయుచుం డును అట్లు ప్రయత్నము జేయువారలలో నిత్యానిత్య జ్ఞానశుద్ధిని పొందిన వారలలో సహితము ఒకానొకడుమాత్రమే నన్ను అనగా నిజార్థమును తెలుసుకొనుచున్నాడు

ఇదే యర్థమును కఠోపనిషత్తునందు కూడా తెలుపడమైనది

**శ్రవణాయాపి బహుభిర్యో న, లభ్యః**
**శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః ।**
**ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా**
**ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥**

ఏయాత్మ అనేకులచేత శ్రవణమునకునైన పొందబడుటలేదో, ఏ

యాత్మను అనేకులు వినుచున్నను దెలిసికొనజాలరో అట్టి యీ ఆత్మను గూర్చి జెప్పునట్టివారు అరుదు ఈ ఆత్మను నిపుణముగా గ్రహించిన వారును అరుదు నిపుణుడైన ఆచార్యునిచేత శిక్షితుడైన జ్ఞాతయు అరుదు

ఇప్పుడు ప్రపంచములో గల విద్యలలో ఎలిమెంటరీ తరగతిలో లక్షలాది జనులుండవచ్చును కాని మెట్రిక్యులేషనులో పై జెప్పిన సంఖ్యకన్న తక్కువ మానవులే చదువుచుందురు కాలేజిలో జదువుచుండెడి విద్యార్థులను జూచిన వేలకొలది మంది యుందురు విశ్వవిద్యాలయములో లెక్కించిన పై జెప్పిన వారికంటే చాలా తక్కువమంది కనబడుదురు ఇందువల్ల యూనివర్శిటీలో జదువు వారు నిస్సారులని అర్థమగునా? అదే ప్రకారము రాగి నాణెములకంటె వెండి నాణెములు తక్కువగానే యుండును వెండి నాణెములకన్న బంగారు నాణెములు చాలా కొరతగానే గాన్పించును ఈ సువర్ణ నాణెములకన్న రత్నములు చాలా తక్కువగానే యుండును రత్నములలో గూడ మాణిక్యాది రత్నములు చాలా దుర్లభములు ఇందువల్ల మాణిక్యాది రత్నములు తక్కువయగుటచేత సారములేనివని దలంచు వారు గలరా? ఆత్మవిద్యయొక్క స్థితియు ఈలాగుననే యుండును

3 ఇక సుఖమును గురించి చూచిన జ్ఞానముయొక్క సుఖమునకు సరియగు సుఖము మూడు లోకములలోను మరియొకటి లేదనియే శాస్త్రము దెలుపుచున్నది అయితే సుఖమునకు కారణము బాహ్య సౌఖ్యములనియు, ధనమనియు కొందరు దలంతురు అది మాయాభ్రాంతి మాత్రమే యగును. హృదయము ఎంత కెంత శుద్ధమగునో అంతకంత సౌఖ్యమున్ను అధిగమించును సంపూర్ణముగా హృదయము నిర్మలమగునప్పుడు నిశ్శేష శోకశాంతియు, నిరతిశయ ఆనందమున్ను గలుగును ఈ విషయమై చక్రవర్తి పుత్రుడు శ్రీరామచంద్రుడు యోగవాసిష్ఠమున వైరాగ్య ప్రకరణము నందు చెప్పినది చూడదగును

**అహం తావదయం జాతో నిజేఽస్మిన్ పితృసద్మని ।**
**క్రమేణ వృద్ధిం సంప్రాప్తః ప్రాప్తవిద్యశ్చ సంస్థితః ॥**

నేను పితృ గృహమున బుట్టి పెరిగి విద్య నార్జించి యుంటిని

**తతః సదాచారపరో భూత్వాఽహం మునినాయక ।**
**విహృతస్తీర్థయాత్రార్థముర్వీమంబుధిమేఖలామ్ ॥**

మునీశ్వరా! పిదప సదాచార పరాయణుండనై తీర్థయాత్ర కొరకు సముద్రవలయితమగు భూమండలము నందంతటను విహరించితిని

**ఏతావతాఽథకాలేన సంసా ర్థామిమాం హరన్ ।**
**సముద్భూతో మనసి మే విచారః సోఽయమీదృశః ॥**
**వివేకేన పరీతాత్మా తేనాహం తదను స్వయమ్ ।**
**భోగనీరసయా బుద్ధ్యా ప్రవిచారితవానిదమ్ ॥**

ఇప్పుడు నాకు సంసారమనిన యాసక్తి నశించినది వివేకయుక్తుడనై భోగేచ్ఛను బరిత్యజించి యిట్లు విచారించితిని

**కిం నామేదం బతసుఖం యేయం సంసార సంతతిః ।**
**జాయతే మృతయే లోకో మ్రియతే జననాయ చ ॥**

ఈ సంసార చక్రమున సుఖమేమున్నది? చచ్చుటకై పుట్టుచున్నారు, మరల జన్మించుటకై జచ్చుచున్నారు

**అసత్యైవ వయం కష్టం వికృష్టా మూఢబుద్ధయః ।**
**మృగతృష్ణాంభసా దూరే వనే ముగ్ధమృగా ఇవ ॥**

ఎండమావుల నీళ్ళు ద్రావ బరుగిడు లేళ్లవలె, మూఢులమగు మేము సుఖము నొసగలేని యళీకవస్తువుల వెంటబడుచున్నాము

**కిమేతేషు ప్రపంచేషు భోగా నామ సుదుర్భగాః ।**
**ముధైవ హి వయం మోహాత్ సంస్థితా బద్ధభావనాః ॥**

ఈ ప్రపంచమున విషయము లననేమి? (దుష్టములును, నష్టస్వభావ ములును, దుఃఖ బీజములును అగుట వలన దౌర్భాగ్య స్వరూపములు) మోహ వశమున వాంఛలవలన గట్టబడితిమి

**అజ్ఞాతం బహుకాలేన వ్యర్థమేవ వయం వనే ।**
**మోహేన పతితా ముగ్ధా శ్వభ్రే ముగ్ధా మృగా ఇవ ॥**

మృగములు వనమధ్యమున గోతిలో గూలునట్లు మేమును మోహ మున బడియున్నామని యిప్పటికి దెలిసికొంటిమి

**కిం మే రాజ్యేన కిం భోగైః కోఽహం కిమిద మాగతమ్ ।**
**యన్మిథ్యైవాస్తు తన్మిథ్యా కస్య నామ కిమాగతమ్ ॥**

నేనెవ్వడను? ఎందుల కిచటికరుదెంచితిని? నాకీ రాజ్యముల తోడను, భోగములతోడను బనియేమున్నది? మిధ్య మిధ్యయే యగుగాక అయిననేమి?

**శామ్యతీదం కథం దుఃఖం ఇతి తప్తోఽస్మి చింతయా ।**
**జరద్ద్రుమ ఇవాగ్రేణ కోటరస్థేన వహ్నినా ॥**

ఈ దుఃఖమెట్లుపశమించునాయని కోటరమందున్న అగ్నివలన తప్తమగు జీర్ణవృక్షమువలె తపించుచున్నాను

శ్రీకృష్ణభగవానుడు గీతలో ఉపదేశించినది చూడుడు

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ॥**

విషయేంద్రియ సంయోగమువలన బుట్టిన సుఖానుభవములు దుః ఖమునకు కారణమైనవి. ఆద్యంతములు గలవియును అని తలచి నిర్మల బుద్ధిగలవాడు విషయసుఖములయందు ఆసక్తి నుంచడు

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్**
**స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥**

బాహ్యమునందలి విషయములందు ఆసక్తిలేని మనస్సు గల యే పురుషుడు తన ఆత్మయందు సుఖమును పొందుచున్నాడో, అట్టి పురుషుడు బ్రహ్మనిష్ఠయైన సమాధితో కూడుకొనిన మనస్సు గలవాడై నాశరహితమగు బ్రహ్మానందమును ననుభవించుచున్నాడు

4 మరియు రారాజుయొక్క ఏకైక కుమారుడగు శ్రీ గౌతమ బుద్ధుని చరిత్రమును జదివిన నీ సంగతి విశదము కాగలదు సిద్ధార్థుని భోగమును గురించి పూర్వ కవులు వర్ణించినప్పుడు దేవేంద్రునికి సహా అట్టి సౌఖ్యము లేదనియే తెలిపిరి తన ధర్మపత్నియగు యశోధరను వర్ణించినప్పుడు ఇంద్రపత్నియగు శచీదేవికన్న సౌందర్యవతిగా వ్రాసియున్నారు తన ఏకపుత్రుడగు రాహులుని ఇంద్రపుత్రుడగు జయంతునికన్న రూపవంతునిగా నిరూపించిరి అట్టి సౌభాగ్యము లన్నిటిని రాజ్యమును తుచ్ఛమని తలంచి విరాగియై పరమనిర్వాణమును బొందుటకు యత్నించెను నిర్వాణము యొక్క మహిమాతిశయము 'నిర్వాణనిలయ'మను గ్రంథమున చూడందగును దాని నుండి యీ క్రింది విషయముద్ధరింపబడినది

**యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్ ।**
**తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్ ॥**

ప్రపంచములో సర్వసంకల్ప ప్రాప్తమగు సుఖమేది గలదో, స్వర్గలోకమందు ఏదైతే మహత్తైన దివ్యసుఖము గలదో అవియన్నియు అంతఃకరణములోగల తృష్ణ నశించిన సంయమియొక్క నిర్వాణ సుఖములో పదునారవ భాగముయొక్క సుఖమునైనా గలుగజేయజాలవు

**నిర్వేదాదేవ నిర్వాణం న చ కించిద్విచింతయేత్।**
**సుఖం వై బ్రాహ్మణో బ్రహ్మ నిర్వేదేనాధిగచ్ఛతి ॥**

నిర్వేదమువల్లనే నిర్వాణము సిద్ధించుచున్నది దీనియందు మరల చింతింపనక్కర లేదు నిర్వేదముచేతనే బ్రహ్మనిష్ఠుడు శాశ్వత సుఖమగు బ్రహ్మమును బొందుచున్నాడు నిర్వేదమనగా హృదయములో గల సర్వ ఆవరణములు నశించు స్థితియే యగును అట్టిదే నిర్వాణము

**యథా స్వనుష్ఠితం ధ్యానం తథా కుర్వంతి యోగినః ।**
**మహర్షయో జ్ఞానతృప్తా నిర్వాణగతమానసాః ॥**

ఏలాగున మహాఋషులు ధ్యానమందు మంచి నిష్ఠగలవారై యున్నారో యోగులుగూడ ఆలాటి నిష్ఠగలవారై యున్నారు వారందరును జ్ఞానముచే సంతృప్తు లగుచున్నారు వారి మనస్సులో గల వృత్తులన్నియు విలీనములైనవి అట్టి స్థితియే నిర్వాణము

**సమ్యక్తత్త్వావబోధేన దుర్బోధే క్షయమాగతే ।**
**గళితే వాసనావేశే విశోకం ప్రాప్యతే పదమ్ ॥**

తత్త్వావబోధము చక్కగా గలిగిన దుర్బోధములగు సంసారవాసనలు అన్నియు వదలిపోవును అప్పుడు శోకరహితమగు బ్రహ్మపదము లభింప గలుగును

ఇదియునుగాక ఈశ్వరావతారమని అందరిచేతను స్తుతింపబడు శ్రీశంకరాచార్యులు, శ్రీరామానుజాచార్యులు, శ్రీమధ్వాచార్యులు ఏమి ప్రపంచసుఖము దొరకకనే వాటిని దూరీకరించి త్యాగమూర్తులై బ్రహ్మకైవల్య మును బొందుటకు ప్రయత్నించి శాశ్వతసుఖమగు ఈశ్వర సాక్షాత్కార మును బొందిరి ఇతరులను బొందింపజేసిరి అదేరీతిగా ఈశ్వరపుత్రుడగు శ్రీ ఏసుక్రీస్తుకూడా ప్రాపంచిక సుఖములు దుఃఖకారణమనియు, మాయామోహముచే సుఖముగా తోచుచుండునని దెలుపుచూ, బ్రహ్మచర్య వ్రతమును యావజ్జీవము సలిపి దైవమును బొందెను పై నుదాహరించిన వారందరును తాము తరించుటయేగాక లోకమునుగూడ తరింపజేసిరి అదే రీతిగా వర్తమానయుగములో నుండిన ప్రజ్ఞానిధులగు శ్రీ వివేకానంద,

రామతీర్థ, దయానంద సరస్వతి మొదలగు వారు ఏల సర్వసంగ పరిత్యాగులై బ్రహ్మప్రాప్తి పొందేలాగున జేసుకొనిరి? ప్రపంచసౌఖ్యమే గొప్పదైనచో పై నిరూపించిన వారందరును దానిని విషమిశ్రిత క్షీరాన్నమువంటిదని ఏల దెలుపవలయును? ఆత్మశుద్ధి గలుగువఱకు దీనియొక్క రహస్యము జీవులు దెలుసుకొనజాలరు కావుననే పతంజలి మహర్షి తన యోగదర్శనమునందు ఈలాగున సూత్రించెను

**అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచి సుఖాత్మఖ్యాతిరవిద్యా ॥**

అనిత్య వస్తువులో నిత్యబుద్ధియు, అశుద్ధ వస్తువులో శుద్ధబుద్ధియు, దుఃఖవస్తువులో సుఖబుద్ధియు, ఆనాత్మ వస్తువులో ఆత్మబుద్ధియు అవిద్య వలననే గలుగుచున్నది

ఈ అవిద్య నశించినప్పుడు అనిత్య వస్తువులు అనిత్యములుగాను, అశుచి వస్తువులు అశుద్ధములుగాను, దుఃఖవస్తువులు దుఃఖములుగాను, అనాత్మ వస్తువులు అనాత్మలుగాను జీవులకు గోచరమగుచుండును కావుననే దైవవిచారణముచే ఆత్మశుద్ధి గలుగునప్పుడు ప్రతివారున్ను విరక్తులై శాశ్వతమగు ఆత్మచింతన జేయుచున్నారు ఇది ఆత్మశుద్ధి గలుగువరకు ఎవరు జెప్పినను అర్థము గాదు

మరియొక రహస్యము కూడా చూడవచ్చును ధర్మరాజాదులు రాజ్యమును బొంది నిరంకుశులై యుండి సర్వసౌభాగ్యములతో తులతూగుచుండిరి భారతదేశమునకు చక్రవర్తులుగా నేర్పడియు, ఆఖరున సమస్తమును ద్యజించి, ఎందుకు వానప్రస్థమునకు వెళ్లవలయును? ఆత్మసుఖముయొక్క మహిమ అంతలేనిచో వారు రాజ్యమును ద్యజింతురా? వారంత తెలివిలేనివారా? భోజనాదులకు లేకనే సర్వసంగ పరిత్యాగులై మహాప్రస్థానమును ఆశ్రయించిరి భారత మహాప్రస్థాన పర్వమున ఇది చూడందగును

"శేషించిన కాంచన రత్నాదు లాక్షితిపతి పరీక్షితునకు పరమాద

రంబున సమర్పించి యతనిం గృపాచార్యునకు శిష్యుంగా నప్పగించి పౌర జానపద ప్రవరజనంబుల రావించి" -

**ఆపార్థ పౌత్రుని జూపి మాయేవుర**
**మ్మాఱుగా మీరిక్కు మారవరుని**
**గైకొని తగవెల్ల కార్యజాతంబును**
**నడుపుచు ననురక్తి నాడునాటి**
**కెక్కుడగుచు నుండ నీతని యుల్లంబు**
**రంజిల్ల సమ్యగారాధ నంబు**
**నందు సంప్రవణుల రగుడయ్యు యని పల్కి**
**తమ నిశ్చయంబునుదాత్త భంగి**

**జెప్పుటయు వారు మొగములు చిన్నబోవ**
**మము నుపేక్షించి యిటు సేత సముచితంబె**
**నీదు చిత్తంబు కారుణ్యనిలయ! మేము**
**దరతరంబ యాశ్రితులము ధర్మశీల!... ... ... ... ...**

సర్వాభరణంబులునూడ్చి వల్కలాజినంబులు ధరియించినం దమ్ములు, ద్రౌపదియు నట్లసేసిరందఱు దత్కాలోచితంబులగు నిష్కావిధా నంబులాచరించి యజ్ఞాల నంబుగతంబులు చేసి, మొగంబులందెలి వగ్గలింప గృహంబు వెలువడిరప్పుడు ద్రౌపది పష్టత్వనిష్ఠంబోవ సప్తమంబై యొక్క సారమేయంబు వారల వెనుక జనియె నప్పుడు

ఇదేరీతిగా యయాతిచక్రవర్తి దేవయానుల చరిత్రమున్ను భాగవత మున జూడందగును యయాతి సార్వభౌముడయ్యు, ఆత్మశుద్ధి గలిగిన ప్పుడు ఈ భోగములన్నియు రోగ హేతువులనియు, ఇది అగ్నివలె నెంత యనుభవించినను తృప్తిబొందజాలదనియు, దీనికి త్యాగమే పరమౌషధమని తెలిపిన భాగమును జూడుడు

అబలా నీ నిబిడాతిదుర్జయ ఫలజ్వాఫాంగ భల్లంబులం
బ్రబలంబైన మనంబు భగ్నముగ నా ప్రావీణ్యముం గోలుపో
యి బలిష్ఠుండగు కాముబారిబడి నే నెట్లోర్తు నేబందిక
త్తైబడిం బాపవు దృష్ణ యిప్పుడకటా దీర్ఘాకృతిన్ రొప్పెదన్.

అథలదు ప్రాణములొదవిన
గథలదు సర్వాంగకములు గథలుచు నుండన్
వథలదు బిగువులు వదలిన
దుదిలే దీతృష్ణ దీని ద్రుంపగ వలయున్.

వెయ్యేండ్లయ్యెను నీతో
గ్రయ్యంబడి యున్నవాడ గామసుఖములం
గ్రుయ్య దొకయించుకై న
వ్వయ్యదు కొనలిడియె దృష్ణ నవపద్మముఖీ!

ముదిసెను దంతావళియును
ముదిసెను గేశములు దనువు ముదిసెన్ దనకున్
ముదియనిని రెండు సిక్కెను
బ్రదికెడు టీపియును విషయ పక్షస్పృహయున్.

కడలే దాశాలతకుం
గడజూడగ గానరాదు కడగనిరేనిన్
గడు ముదమున సంహారము
గడగందురు తత్త్వనిధులు గమలదళాక్షీ !

మండనహాటక పశువే
దండాశ్వ వధూదుక్షూల ధాన్యాదులు
పెక్కుండియు నాశాపాశము
ఖండింపగ లేవు మఱియు గడమయ చుమ్మీ !

**కామోపభోగ సుఖములు**
**వేమాఱును బురుషు డనుభవించుచు నున్నం**
**గామంబు శాంతి బొందదు**
**ధూమధ్వజు డాజ్యవృష్టి ద్రుంగుడువడునే?**

వేదాంతడిండిమమందు శ్రీశంకరభగవత్పాదులు జెప్పినది జూడుడు

**సుఖమల్పం బహుక్లేశో విషయగ్రాహిణాం నృణామ్ ।**
**అనంతం బ్రహ్మనిష్ఠానా మితి వేదాంత డిండిమః ॥**

ఇంద్రియ విషయ సుఖము లనుభవించు వారికి మొదట స్వల్ప సుఖము గాన్పించినను క్రమముగా అనేక క్లేశములకు కారణమగును బ్రహ్మ నిష్ఠులకో ప్రథమమున గొంతక్లేశము గనుపించినను క్రమముగా అనంతమైన సుఖప్రాప్తి గలుగును అని వేదాంతడిండిమము

**క్షురధారాసు సంలగ్నం యథాస్వాదయతే మధు ।**
**సుఖం స్వల్పం మహద్దుఃఖం సంసారేఽస్మిన్ తథా సుఖమ్ ॥**

ఈ శ్లోకములో సంసారములో గల సుఖమెట్టిదో దానిని వర్ణించడమైనది వాడిమిగల మంగలకత్తి పదునునందుగల తేనెను నాలుకతో నాకినప్పుడు తెగియెట్లు దుఃఖపడవలసి యుండునో ఆలాగున నీ సంసారములో స్వల్పసుఖము గనుపించినను గొప్పదగు దుఃఖమును పొందవలసి యుండును

5 ఇప్పుడు సాంసారిక సుఖమునకున్ను, ఆత్మజ్ఞాన సౌఖ్యమునకు గల భేదమెట్టిదో అది యీ క్రింది శ్లోకములో నిరూపించబడుచున్నది

**సూర్యఖద్యోతయోర్యద్వత్ మేరుసర్షపయోరివ ।**
**అన్తరం హి మహద్దృష్టం తథా భిక్షుగృహస్థయోః ॥**

సూర్యప్రకాశమునకున్ను, మిణుగురు పురుగుకున్న ఎంత భేదము గలదో - మేరు పర్వతమునకున్ను ఆవగింజకున్ను ఎంత వ్యత్యాసము గలదో,

అట్టి గొప్పదైన భేదము భిక్షువులకున్ను, గృహస్థులకున్ను గాన్పించుచున్నదని తాత్పర్యము

మరియు శ్రీరామకృష్ణపరమహంస శారదామణుల జీవితము ఒక విచిత్రమైనది ఏలన చిన్న కాలములో వారు వివాహితులయ్యు, నొకేప్రదేశ మున నివసించియుండియు అఖండ బ్రహ్మచర్య వ్రతమును సలిపి జీవన్ముక్తి పదవిని బొందిరి ఈ చరిత్రమును చూచిన స్త్రీలుకూడ ఆత్మశుద్ధి గలుగు నప్పుడు విషయ సుఖములన్నిటిని విషమువలె దలంచుటకు ఇదే కారణము అట్టి మహనీయాత్ములను భూపాలురనుండి గోపాలుర వరకున్ను, పండితుల నుండి పామరులవరకున్ను, అగ్రజాతుల నుండి అంతిమజాతి వఱకు గల స్త్రీ పురుషు లందరున్ను పై జెప్పిన విరక్తులందరిని ఎంత గౌరవ భావముతో పూజించియున్నారో లోకమే నిరూపణ జేయుచున్నది దిలీపుడు, ఇక్ష్వాకువు, జనకుడు, దశరధుడు మొదలగు చక్రవర్తులె పరమ ఋషులపై బ్రహ్మవేత్తలపై ఎంత విశ్వాస భక్తి గలిగియుండిరో శాస్త్రమే సాక్షి వహించు చున్నది

**విషం దృష్ట్వాఽమృతం దృష్ట్వా విషం త్యజతి బుద్ధిమాన్।**
**ఆత్మానమపి దృష్ట్వాఽహం అనాత్మానం త్యజామ్యహమ్ ॥**

బుద్ధిమంతుడైనవాడు విషమును అమృతమును జూచి వాటియొక్క మంచి చెడుగులెరింగి విషము నెటుల త్యజించి అమృతమును గ్రహించునో ఆలాగున ఆత్మసుఖమును నెరింగి అనాత్మ సుఖమునుద్యజింతును ఇదియే ఆత్మానాత్మ సత్యమెరిగిన వానియొక్క స్వభావమని గ్రహించేది

**దారిద్ర్యాశా యథా నాస్తి సంపన్నస్య తథా మమ ।**
**బ్రహ్మానందే నిమగ్నస్య విషయాశా న తద్భవేత్ ॥**

సంపన్నుడైనవాడు దరిద్రత్వమును ఎట్లాశింపడో ఆలాగున బ్రహ్మానందామృతమునందు నిమగ్నుడైన వానికి విషయాశ గలుగదు

పై జెప్పిన శ్రీరామకృష్ణ శారదామణిగారల చారిత్రము ఈ కలి యుగమున కొలదిరోజుల క్రిందట జరిగిన విషయమే ఆలాగున భారతము నందు సులభాయోగినియు బ్రహ్మచర్యమునుండి సన్న్యసించినట్లు కనబడు చున్నది అదేరీతిగా ఛాందోగ్యమునందు వచక్నుని పుత్రికయగు గార్గియు బ్రహ్మచర్యవ్రతము సలిపియే వేదవేదాంగములు, వేదాంతములు చదివినట్లు గానుపించుచున్నది ఆలాగున యాజ్ఞవల్క్యుని మొదటి భార్యయగు మైత్రేయియు వైరాగ్యము గలిగి సన్న్యసించినట్లు గానగును చూడాల, మదాలస మొదలగు రాణులు గృహస్థాశ్రమమునుండి బ్రహ్మసాక్షాత్కారము బొందినట్లు శాస్త్రములో గనందగును ఇందువల్ల అనాది నుండియు స్త్రీలుకూడా బ్రహ్మచర్యవ్రతమును సలుపుటయు సన్న్యాసాశ్రమములో ప్రవేశించుటయు గలదని అర్థమగుచున్నది ఇదియును గాక శాస్త్రములలో శార్ఙ్గీ, శాండిల్లి, తపస్విని, విశ్వవర, కాత్యాయని మొదలగు నారీమణులు బ్రహ్మవిద్యలో వేదాధ్యయనములో ఉన్నత పదవి అలంకరించినట్లు గోచర మగుచునే యున్నది ఈ విషయమై విస్తారముగా జూడదలంచు వారు 'సన్న్యాస యోగ'మను గ్రంథమున గనందగును

6 మరియొక విషయము గమనింపదగినది గౌరవమును గురించి ఆలోచించిన పూర్వమునుండి యిప్పటివరకు బ్రహ్మవేత్తలకుగల పూజ్యత లోకములో మరియెవరికిన్ని గాన్పించుట లేదు ఈ విషయమై శ్రీవసిష్ఠ, యాజ్ఞవల్క్య, అగస్త్య, విశ్వామిత్ర, వ్యాస, శుక, సనకాదులున్ను, గౌతమ, పాణిని, కణాద, కపిల, వాల్మీక్యాదులున్ను సాక్షిభూతులు అట్టి మహనీ యాత్ములను భూపతులు ఎంతగౌరవముతో పూజించిరో శాస్త్రముజూచిన వారందరికిన్ని విదితము ఆలాగుననే కలియుగమున శ్రీబుద్ధ, శ్రీఏసు, శ్రీ మహమ్మదు, శ్రీ గురునానక్, శ్రీకృష్ణచైతన్య, శ్రీరామకృష్ణపరమహంస, శ్రీగాంధీ మొదలగు వారి చరిత్రము జూచిన అందరికిన్ని గోచరించును

7 ఇక సుఖ విషయమై బృహదారణ్యమున నిర్ణయించినది చూడుడు (1) సర్వావయవపుష్టి గలిగి తలంచిన సర్వసౌఖ్యము అనుభవించుటకు

యౌవనస్థితిలో గల సార్వభౌముని సౌఖ్యమే మానవ సుఖముయొక్క హద్దు అని నిర్ణయించి ఈలాగున వర్ణనజేయుటకై ప్రారంభించబడెను ఇట్టి ఆనందముయొక్క మీమాంస యొనర్పబడుచున్నది యౌవనము, సాధుత్వము, వేదాధ్యయనము, పరిజనము, శరీరదార్ఢ్యము, ధైర్యము, బలము, భూమినంతటిని నేలుశక్తి, సంపూర్ణధనము అను నీ మొదలగు గుణములు గల యొక మనుష్యుని ఆనందము మనుష్యానందమని జెప్ప బడును (2) ఇట్టి యానందమునకు నూరింతలు గలది మనుష్య గంధర్వా నందము, (3) దానికి నూరింతలు గొప్పది దేవగంధర్వానందము, (4) చాలా కాలము పితృలోకము నందుండు పితృదేవతల యానందము అంత కంటె నూరింత లధికము, (5) ఆజాన దేవతల ఆనందము అంతకంటె నూరింత లధికము (6) కర్మ దేవతల యానందము దానికంటె నూరుపాళ్లధికము, (7) దేవతల కధిపతియైన దేవేంద్రుని యానందము దానికంటె నూరురెట్ల ధికము, (8) ఆ యానందముకంటె బృహస్పతి యానందము నూరు రెట్లు అధికము (9) నూరుబృహస్పతి యానందములు ఒక ప్రజాపతి యానం దమునకు సమానము అట్టి ప్రజాపతి యానందము బ్రహ్మానంద సాగర ములో నొకలవలేశమే యగును అనగా ప్రజాపతి సుఖముగూడా బ్రహ్మసుఖ సాగరములో మగ్నుడై యుండు ఆత్మజ్ఞానియొక్క సుఖసాగరములో నొక బిందు మాత్రమని తాత్పర్యము

**న సుఖం హి సురేంద్రస్య న సుఖం చక్రవర్తినామ్ ।**
**యత్సుఖం వీతరాగస్య మునేరేకాంతవాసిన : ॥**

ఏకాంత వాసియై, విషయ విరక్తుడై, బ్రహ్మచింతన జేయువాడు ఏ బ్రహ్మానందసుఖమును బొందుచుండునో, అట్టిదానిలో సహస్రాంశమైన దేవేంద్రునికిగాని, చక్రవర్తులకుగాని కలుగజాలదు

**రసం బ్రహ్మ పిబేద్యశ్చ తృప్తో యః పరమాత్మని ।**
**ఇంద్రం చ మన్యతే రంకం నృపాణాం తత్ర కా కథా ॥**

ఎవడు బ్రహ్మానందామృతభరితుడై పరమాత్మ ధ్యానమందు తృప్తుడై యుండునో, అట్టి మహానుభావుడు దేవేంద్రునిగూడా అతిదీనునిగా తలంచును అట్లుండగా చక్రవర్తులను గూర్చి మఱల చెప్పవలెనా? అని గురుగీతయందు శ్రీఈశ్వరుడుపదేశించెను

**న సుఖం సార్వభౌమస్య విద్యతే న బిడౌజసః ।**
**బ్రహ్మణో న సుఖం యత్స్యాత్ పుంసః కామవివర్జనాత్ ॥**

చక్రవర్తికిని, దేవేంద్రునకును, బ్రహ్మదేవునకు గూడ గలుగని సుఖము సర్వకామనా రహితుడగు నిష్కామునకు కలుగును

**యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।**
**యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

ఏ ఆత్మ లాభముకంటె వేఱులాభము లేదో, యే ఆత్మజ్ఞానముకంటె మరియొకటి తెలియదగినది లేదో అదియే బ్రహ్మమని నిశ్చయించి తెలుసుకొనవలయును

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞాన చక్షుర్నేక్షేత భాస్వం తం భానుమంధవత్ ॥**

ఆత్మజ్ఞానమను నేత్రములు గలవాడు సమస్తమందు వ్యాపించి యుండు సచ్చిదానంద స్వరూపాత్మను తన ఆత్మగా జూచుచున్నాడు దేహాదులే ఆత్మయను అజ్ఞాననేత్రము గలవాడు ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డివానివలెనే జూడలేదు

**అఖండానందరూపస్య తస్యానంధలవాశ్రితాః ।**
**బ్రహ్మాద్యాస్తారతమ్యేన భవంత్యానందినో, లవాః ॥**

నదీ సముద్రముల యందు నీళ్ళు ఒకటిగా నున్నప్పటికిని నది సముద్రముకంటె స్వల్పముగా నున్నందున సముద్రముతో సమము గానట్లు, బ్రహ్మాది సమస్త భూతకోట్లును పరిచ్ఛిన్నానందమును గలవారలుగాను

పరిమిత రూపులుగాను ఉండుటవల్ల వారియానందములు ఆత్మ స్వరూపమై యఖండానందముతో సమముగావని తెలుసుకొనదగినది

**యద్భాసా భాస్యతేఽర్కాది భాస్యైర్యత్తు న భాస్యతే ।**
**యేన సర్వమిదం భాతి తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

ఏ బ్రహ్మ ప్రకాశముచేత సూర్యుడు మొదలగు ప్రకాశవస్తువులు ప్రకాశించునో, తనచే వెలిగింపదగిన సూర్యాది ప్రకాశ వస్తువులచేత నెద్ది ప్రకాశింపజేయబడదో, ఏ యాత్మప్రకాశముచేత నీ సర్వప్రపంచ మెఱుం గునో అట్టిది ఆత్మయని తెలియవలయును గీత యందు శ్రీకృష్ణ భగవానులు చెప్పినది చూడుడు

**యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।**
**యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే ॥**

ఏ ఆత్మలాభమును బొంది ఆ యాత్మలాభముకంటె అధికమైన లాభము మరియొకటి ఇతరమైనదేదియు లేదని తలంచునో, ఆయాత్మ తత్త్వమందున్న వాడు అత్యధికమైన దుఃఖముతో గూడ చలనము పొందడో, అట్టిదే ఆత్మసుఖమని దెలియందగినది సూతసంహితయందు మహేశ్వ రుండు సనకాది మునులకు దెలిపినది చూడుడు -

**నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శనమ్ ।**
**అనుప్రజామ్యహం నిత్యం పూయయేత్యంఘ్రిరేణుభిః ॥**

నిరపేక్షుడై మననశీలుడై శాంతుడై వైరబుద్ధి లేనివాడై సమదర్శనము గలవాడైన జ్ఞానిని నేను (ఈశ్వరుండు) అనుగమించుచున్నాను అట్టి మహా త్ముని పాదరేణువులచేత పునీతు డగుచుండును

**నారాయణేతి యస్యాస్తే వదనే నామ మంగళమ్ ।**
**నారయణ స్తమన్వేతి వత్సం గౌరివ వత్సలా ॥**

దూడను వెంబడించు ఆవువలెనే సదా నారాయణస్మరణ జేయు

భక్తుని భగవంతుడు వెంబడించు చున్నాడని పరమ శివుండు కుమార స్వామి కుపదేశించెను

**నాతః సుఖతరం కిఞ్చిత్ త్రిషు లోకేషు విద్యతే ।**
**వీతతృష్ణస్య కామేభ్యో ముక్తసంగస్య యత్సుఖమ్ ॥**

సమస్తమైన కామాది విషయములను వదలినవాడై, నిస్సంగుడైన వారికి ఏ యొక్క బ్రహ్మానంద సుఖము కలదో, దానికి సమమైన మరియొక సుఖము మూడు లోకములలోను లేనేలేదు

8 కఠోపనిషత్తున తెలిపినది నిరూపించి యీ వ్యాసము పూర్తి చేయ బడుచున్నది

**మూ॥ నావిరతో దుశ్చరితా న్నాశాంతో నాసమాహితః ।**
**నాశా న్తమానసో వాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్ ॥**

దుర్వృత్తి నుండి విరమింపని వాడు ఈ యాత్మను పొంద జాలడు ఇంద్రియ చాపల్యముగలవాడు ఈ ఆత్మను బొందజాలడు ఏకాగ్రచిత్తము లేనివాడు ఈ ఆత్మను బొందజాలడు బహువిషయములందు వ్యాప్తమైన మనస్సుగలవాడున్ను ఈ ఆత్మను బొందజాలడు బ్రహ్మ విజ్ఞానమునకు దగిన శమదమాది గుణములు గలవాడు మాత్రమే ఈ ఆత్మను పొందగలడు

**మూ॥ ఏకో వశీ సర్వభూతాంతరాత్మా**
**ఏకం రూపం బహుధా యః కరోతి ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః**
**తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

తనకంటే అధికుడును, తనతో సమానుడును అగువాడు మరొక్కడు లేనివాడును, సర్వజగత్తు స్వాధీనముగా గలవాడును, సర్వభూతముల కంత రాత్మస్వరూపుడును అగు ఏ ఆత్మ శుద్ధ విజ్ఞాన ఘనరూపుని అనేక విధ

ములు గల వానినిగా జేయుచున్నాడో, ఏ విద్వాంసులు (బ్రహ్మవేత్తలు) స్వ శరీర హృదయాకాశాంతర్గతమగు బుద్ధిగుహయందున్న ఆ యాత్మను జూచు చున్నారో వారికే శాశ్వతమైన సుఖము గలదు ఇతరులకట్టి నిత్య సుఖము లేదు

**మూ॥ నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానాం**
**ఏకో బహూనాం యో విదధాతి కామాన్।**

**తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః**
**తేషాం శాంతిశ్శాశ్వతీ నేతరేషామ్ ॥**

ఒక్కడగు ఏ పరమేశ్వరుడు అనేకులకు వారి వారి కర్మములకు తగిన ఫలములను ఇచ్చుచున్నాడో, ఆ పరమేశ్వరుడు అవినాశుడైన వాని లోపల నిత్యమైన వాడు చైతన్యము గల బ్రహ్మాదిస్తంబపర్యంతము గల ప్రాణులలో చేతనస్వరూపుడు అట్టి యాత్మను ఏ బ్రహ్మవేత్తలు తన హృదయాంత రాళములో తన యాత్మస్వరూపముగా జూచుచున్నారో అట్టి వారికే నిత్యమైన పరమశాంతి సుఖము గలుగును గాని తదితరులకు అట్టి శాశ్వతమైన సుఖము లేదు నిర్వాణ నిలయము

**బోధాత్మైషోఽన్తరాత్మైవ పరమః పరమేశ్వరః ।**
**అస్యైవ వాచకో నామ ప్రణవో వేదసమ్మతః ॥**

బోధరూపుడగు ఈ అన్తరాత్మయే యుత్తముడగు పరమేశ్వరుడై యున్నాడు వేదసమ్మతమగు ప్రణవమను నామమే ఈతని వాచకమై యొప్పుచున్నది అన్తరాత్మయే నిజమైన ఈశ్వరుడనియు, ఆ పరమాత్మ యొక్క నామము ప్రణవమనియు తెలియందగినది

**శ్రుతపారజపాస్తేషు సమాధి నిరతో భవేత్ ।**
**సమాధివిరతః శ్రాన్తః శ్రుత పారజపా(ఽభ్య)యేత్ ॥**

సాధకుండగువాడు వేదాంతశ్రవణము, ఉపనిషదాదుల పఠనము,

ప్రణవాదుల జపము మున్నగునవి గావించిన పిదప సమాధియందు తత్పరుండై యుండవలయును సమాధినుండి లేచిన పిదప మరల యథా విధముగా శ్రవణ ఉపనిషత్పరన ప్రణవాది జపాదుల గావింపవలయును ఓహో వేదాంతము ఎంత పరమ సత్యముపదేశించెను! అట్లు చేయని కారణముచేత గదా కొందరు పతితులగుట జరుగుచున్నది



# భిక్షు లక్షణము

## (నారద పరివ్రాజకోపనిషత్తు నుండి)

**అజిహ్వాషండకః పంగు రంధో బధిర ఏవ చ ।**
**ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుః షడ్భిరేతైర్న సంశయః ॥**

1 నాలుక లేని వాడుగను, 2 నపుంసకుడుగను, 3 కుంటివాడుగను, 4 గ్రుడ్డివాడుగను, 5 చెవిటివాడుగను, 6 జడుడుగను ఉండుటయను నీ యారు లక్షణములతో కూడుకొన్న భిక్షువు ముక్తుడగుచున్నాడు అనగా నీ యారు ఇంద్రియములకు లోబడనివాడు ముక్తుడే యని భావము

1 అజిహ్వః = అజిహ్వుడనగా -

**ఇదమిష్టమిదం నేతి యోఽశ్నన్నపి న సజ్జతి ।**
**హితం సత్యం మితం వక్తి తమజిహ్వం ప్రచక్షతే ॥**

ఎవడు భుజించుచుండినను ఇది యిష్టమయినది, ఇది ఇష్టమైనది కాదను భావముకల్గియుండడో మఱియు భూతకోట్లకు హితముగను, సత్యముగను, మితముగను వచించునో వాడే అజిహ్వు డనంబడును అనగా నాలుక యుండియు లేనివాడని యర్థము

2 షండకః = షండుడనగా -

**అద్య జాతాం యథా నారీం తథా షోడశవార్షికీమ్ ।**
**శతవర్షాం చ యో దృష్ట్వా నిర్వికారస్స షండకః ॥**

ఎవడు పదునారు సంవత్సరముల యువతియందును, ఇప్పుడే పుట్టిన ఆడుబిడ్డయందును, నూరు వత్సరములు గల కడుముదుసలి దాని యందును సమానబుద్ధి గలవాడై నిర్వికారుడై యుండునో వాడే షండుడనం బడును అనగా పురుషత్వముండియు నపుంసకుడని భావము

3 పంగుః = కుంటివాడనగా -

**భిక్షార్థమటనం యస్య విణ్మూత్రకరణాయ చ ।**
**యోజనాన్న పరం యాతి సర్వథా పంగురేవ సః ॥**

ఎవడు భిక్షకొఱకు సంచరించుచున్నాడో, మలమూత్ర విసర్జనము నకు తిరుగుచున్నాడో, ఎక్కువ యవసరముండిన యోజన దూరమునకన్న (8 మైళ్ళు) అధిక దూరము పోడో వాడే పంగువు అనగా ఎప్పుడు తన నియమనిష్ఠలతోను, పరమాత్మ స్వరూపధ్యానముతోను కాలము గడుపు వాడగుటచే తానెచ్చటికి పోడని తాత్పర్యము

4 అన్ధః = గ్రుడ్డి వాడనగా -

**తిష్ఠతో వ్రజతో వాఽపి యస్య చక్షుర్న దూరగమ్ ।**
**చతుర్యుగాం భువం ముక్త్వా పరివ్రాట్సోఽన్ధ ఉచ్యతే ॥**

నిలుచున్న వాడైనను, పోవుచున్న వాడైనను, ఎవనియొక్క దృష్టి నాలుగు కాడిమానుల దూరముకన్న ఎక్కువగా ప్రసరించదో, వాడే అన్ధుడనంబడును అనగా నేత్రములుండియు లేని వాడనియు, ఏకాగ్ర దృష్టి గలవాడనియు ఈ ప్రక్క ఆ ప్రక్క చూడక ఋజుదృష్టి గలవాడనియు అర్థము

బధిరః = చెవిటి వాడనగా -

**హితాహితం మనోరామం వచశ్శోకావహంతు యత్।**
**శ్రుత్వాఽపి న శృణోతీవ బధిరస్స ప్రకీర్తితః॥**

ఇష్టమైనట్టియు, ఇష్టము కానట్టియు, మనోహర మైనట్టియు, దుఃఖ కరమైనట్టియు, వాక్యమును వినినను ఎవడు వినని వానివలె నుండునో వాడే బధిరుడనంబడును అనగా చెవులుండియు చెవులు లేనివాడనియు, స్తుతినిందలయందును, సుఖ దుఃఖముల యందును సమానుడనియు భావము

6 ముగ్ధః = జడుడనగా

**సాన్నిధ్యే విషయాణాం యః సమర్థో వికలేన్ద్రియః।**
**సుప్తవద్వర్తతే నిత్యం స భిక్షుర్ముగ్ధ ఉచ్యతే॥**

విషయములయొక్క సమీపమున నున్నను వాటిని గ్రహించని ఇంద్రియములు గలవాడై సమర్థుడై నిద్రించువానివలె ఎవడు నిత్యము ఉండునో వాడే ముగ్ధుడు అనగా ఇంద్రియ వికారములు లేనివాడై జడుని వలె నుండువాడని భావము



# మార్గము

సోదరా! నీవు ఏ మార్గమున నడువ దలంతువో, ఆ మార్గము నీకు బాగుగా తెలియనిచో తెలిసిన వారిని కనుగొని నడువుము అట్లు దారిని కను గొనక నీకు ఇష్టము వచ్చిన త్రోవను పోయినచో దారి తప్పి ముండ్లకంపలు గల అడవి మార్గమున పోయిన వారిగతియే నీకు గూడ గలుగునని మరువ కుము కంపలు ముళ్ళలో నీవు ఎంతదూరము పోగలవు? అదిన్ని గాక ఎంత శ్రమ దుఃఖమును గూడ పొందగలవో బాగుగా యోచించుకొనుము ఒక వేళ ముళ్ళు కంపలు గల అరణ్యామార్గమున వెళ్ళకపోయినను దారి తెలియక కనుపడిన పంథా ననుసరించి నడచినను అదిన్నీ అపాయమే ఏలన నీ

మార్గముగాక అది మరియొకదారిగా నిన్ను తీసుకొనిపోయి ఎక్కడో చేర్చ వచ్చును అదిన్నిగాక దిగ్భ్రమగలవానికి ఉత్తరము దక్షిణముగాను, దక్షిణము ఉత్తరముగాను ఆలాగున పశ్చిమము పూర్వభాగముగాను, పూర్వదిక్కు పశ్చిమముగాను ఉన్నట్లు తోచును అట్టైన నీవు తలంచు దారికి విపరీత ఫలమే నీకు గలుగును ఈ విషయమై ముందుగానే బాగుగా యోచించుకొ నందగినది కావుననే గీతలో పదునారవ అధ్యాయమున అసుర స్వభావము గలవానిని గుఱించి అనగా ప్రవృత్తిమార్గములో ఉన్నవానిని గురించి ఈలాగున చెప్పబడినది "ప్రవృత్తించ నివృత్తించ జనా న విదురా సురాః"

ఆసుర స్వభావములో అనగా ప్రకృతిలో గల మానవులకు 'ఇది చేయందగనిది, ఇది చేయదగినది' అను యధార్థజ్ఞానము గలిగియుండదు అనగా ప్రవృత్తి నివృత్తిమార్గములలో ఎట్లు ప్రవర్తించవలయునో అట్టి సూక్ష్మతత్త్వము గోచరము కాదని భావము నిర్మలజ్ఞానము గలవాని స్వభావ మీలాగున నుండునని గీతలో తెలుపడమైనది

**ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।**
**బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ ॥**

ఓ యర్జునా! ఏబుద్ధి బంధహేతువగు కర్మమార్గమును, మోక్ష హేతువగు ధర్మమార్గమును, కర్తవ్యాకర్తవ్యములను, భయాభయములను, సంసార బంధమును, సంసార నివృత్తిని ఉన్నదున్నట్లెఱుంగుచున్నదో ఆ బుద్ధి సాత్త్వికగుణమువలన గలిగినది సాత్త్వికగుణము గలవారిని దేవతా స్వరూపులుగా శాస్త్రములలో వర్ణించడమైనది ఇక రజోగుణము గల బుద్ధి యొక్క స్వభావము నిరూపింపబడుచున్నది

**యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।**
**అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ ॥**

ఓ యర్జునా! ఏ బుద్ధిచేత ధర్మమును, అధర్మమును, చేయతగిన దానిని, చేయతగనిదానిని ఉన్నదున్నట్లుగాక పొరపాటుగా నెఱుంగు

చున్నాడో, ఆ బుద్ధి రజోగుణమువలన కలగినదని గ్రహించుకొనుము సామాన్య మానవులకు ఇట్టి స్వభావమే యుండును ఇక తమోగుణ స్వభావము గలవారిని గురించి తెలుపునది చూడుడు

**అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా।**
**సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ ॥**

ఓ యర్జునా! ఏ బుద్ధి అజ్ఞానముచేత ఆవరింపబడినదై అధర్మమును ధర్మమనియు, ధర్మమును అధర్మమనియు, తెలియదగిన వాటినన్నిటిని విరుద్ధములుగాను తెలిసికొనుచున్నదో, అట్టి బుద్ధి తమోగుణ ప్రధానమైనది ఇట్టి స్వభావము రాక్షసాసురగుణము గలవారి కుండును ఇట్టివారినే శాస్త్రములలో రాక్షసాసురులుగా నిరూపించడమైనది

దీపమునకు ప్రకాశమే స్వరూపమై యుండినను తెల్లని చిమ్నీలో మాత్రము ఉన్నదున్నట్లుగా కనిపించును ఎఱ్ఱని చిమ్నీలో అట్టి దీపము ఎఱుపువర్ణముగా కనబడును నీలపు చిమ్నీలో నీలవర్ణముగానే గోచరించుచుండును ఆ యా చిమ్నీల ద్వారా వచ్చెడు కాంతి ఎచ్చటెచ్చట ప్రసరించుచుండునో ఆ యా రంగుల ననుసరించియే యుండును ఆ వస్తువులు ఏ రంగులు గలిగియుండినను చిమ్నీరంగు ననుసరించియే గోచరించుచుండును

తెలుపు చిమ్నీద్వారా వచ్చెడు కాంతి నిర్మలమైనందుచే ఏ యే వస్తువులు ఏ యే రంగులు గలిగియున్నవో అవన్నియు నున్నవి ఉన్నట్లు గోచరించును ఆలాగున అందరిలోను వెలుగుచుండెడు ఆత్మస్వరూపము శుద్ధమైనను మనస్సు ద్వారానే అది బాహ్యముగా ప్రసరించును మనస్సు సత్త్వ, రజ, స్తమస్సులను మూడు గుణములతో గూడినది అందువల్లనే పై శ్లోకములలో సత్త్వగుణము గలవారు మాత్రమే ఉన్నదున్నట్లు తెలిసికొన శక్తి గలిగియుందురని చెప్పుదురు లేక, మీలో ఎవరైనను శుక్లరక్త కృష్ణరంగులు గల సులోచనముల ధరించి చూచినచో, తెలుపు సులోచనములద్వారా

చూచువారికే ఉన్న దున్నట్లు కనుపించును ఎరుపు నలుపు గల సులోచన ముల ద్వారా చూచువారికి ఏ వస్తువులు ఏ రంగులతో గూడియుండినను, వానియొక్క విచక్షణ స్వరూపము గోచరించక అద్ద మేరంగు గలిగియుం డునో అదే వర్ణముగానే గోచరమగును ఇదే గుణముయొక్క ప్రభావమని యెరుంగవలయును

మరియు వినుడి - మీలో చాలా మందిన్ని ఉత్సవములో గొప్ప వివా హములో లేక దీపావళి పండుగలో పెద్దవారును పిల్లవారును కాల్చు మతాబులు చూచియేయుందురు అగ్నియొక్క స్వభావము శుద్ధ ప్రకాశమై యున్నప్పటికిన్ని ధాతువుల సంయోగముచే కొన్ని ఎఱ్ఱగాను, కొన్ని తెల్లగాను, కొన్ని పచ్చగాను, కొన్ని నీలముగాను కాలుచున్నవి మీరు చూచియే యుందురు ఇదే గుణత్రయము యొక్కయు, మిశ్రమగుణము యొక్కయు స్వభావమని గ్రహించుకొనతగినది ఉపనిషత్తులలో ఇట్లు చెప్పుటకు కారణ మిదే!

**అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ।**
**ఏకస్తథా సర్వ భూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥**

అగ్ని యేలాగున ధాతువులతో గలియునపుడు శుక్ల రక్త కృష్ణమిశ్ర రూపములుగా వెలుగుచుండునో, ఆలాగున సర్వభూతాంతరాత్మయగు సర్వేశ్వరుడున్ను (ఆత్మయున్ను) స్వప్రకాశజ్ఞాన స్వరూపమై యుండినను, సత్త్వరజస్తమో గుణములతో గూడిన మనస్సుయొక్క స్వరూపము ననుస రించియే ప్రకాశించుచుండును అదేవిధముగ మేఘజలము అంతటను ఒకే విధముగా భూభాగములో పడినను భూమియొక్క ధాతుభేదముచే కొన్ని ఉప్పునీరుగాను, కొన్ని సున్నపునీరుగాను, కొన్ని గంధపునీరుగాను మారు చుండును యధార్థము విచారించిన అది నీటియొక్క భేదము గాదనియు, ధాతువుల సంసర్గముచే గలిగిన భేదమనియు మన మేలాగున తెలుసుకొను చున్నామో, ఆలాగున ఆత్మ శుద్ధజ్ఞాన స్వరూపమైనను, అంతఃకరణ భేదము

ననుసరించియే మనము గ్రహించుకొనుచున్నాము కావుననే కొందరు 'ఇది నా అనుభవము, ఇది నా ధర్మము, ఇది నా స్వభావము' ఈలాగున వాదము లోనికి దిగుచుందురు

మరియు సూర్యరశ్మి వర్షజలము భూ ప్రదేశమునందంతటయు ఒకే విధముగ నున్నప్పటికిన్ని, ఒక్కొక్క ఓషధులోను (వృక్షములోను) గల ఫల రసములు భిన్న భిన్న రసములు గలిగియుండుటకున్ను ఇవే కారణము బీజములు వివిధములగుటచే మామిడి, అరటి చెట్ల ఫలరసము మధురము గాను, చింత, నిమ్మ చెట్ల ఫల రసములు పులుపుగాను, వేప, ముష్టిచెట్ల ఫల రసములు చేదుగాను ఈ గుణత్రయ సమ్మేళనచేతనే గలుగు చుండును

కావున ఒక్కొక్కరి స్వభావము ననుసరించి, లేక అనుభవము ననుసరించి తాము చెప్పునదే సత్యమని తలంచవలదు కావుననే శాస్త్రము 'ఆచార్యవాన్ పురుషో వేద' అనగా బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గల ఆత్మవేత్తల సహాయము చేతనే జ్ఞానము గలుగునని తెలుపుచున్నది ఇంత దూరమేల పోవలయును? సులభముగా తెలిసేలాగున చెప్పెద మీలో ఎవరికైన జ్వరాది రోగముచే జిహ్వ అరుచిగలిగి యుండిన, ఎంత మంచి వస్తువైనను, ఎంత రుచికర పదార్థమైనను మీకు చేదుగాను, అరుచిగాను ఏర్పడుటలేదా! ఇది వస్తుదోషమా లేక జిహ్వాదోషమాయని తెలిసికొనవచ్చును యధార్థముగా మీ యనుభవములో ఏలాటి తప్పున్ను లేదు మీరుచెప్పినది సత్యమే అయితే ఇది వస్తుదోషమా లేక జిహ్వాదోషమా అని విచారణ చేసి తెలిసికొనక పోవుటయను లోపమే దీనియందు గలదు కావుననే జ్ఞానమును గూర్చి చెప్పునపుడు ప్రమాద సహితజ్ఞానమా, ప్రమాదరహిత జ్ఞానమా యని తెలిసి కొనవలయునని శాస్త్రము శాసించినది అర్జునునివంటి మహాప్రజ్ఞా వంతునికి గూడ మార్గనిర్ణయమున సందేహము కలిగి శ్రీకృష్ణభగవానుని ప్రార్థించెను. అట్లుండగా సామాన్య మానవులెంతవరకు ఇదమిత్థమని నిర్ణయింపగలరు మానువులు అర్జునుని పన్థాను నవలంబించవలయు ననెడి తలంపుతోనే శ్రీకృష్ణు డిట్టి మార్గము నవలంబించెను

**కార్పణ్య దోషోపహతస్వభావః**
**పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢచేతాః ।**
**యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే**
**శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥**

కృపణత్వమువలన గలిగిన దోషముచేత గొట్టబడిన స్వభావము గల వాడను గనుక యుక్తాయుక్త పరిజ్ఞానము లేనివాడనై నిన్ను అడుగు చున్నాను ఏది శ్రేయస్కరమగునని నీచే నిశ్చయింపబడుచున్నదో దానిని నాకు చెప్పుము నేను నీకు శిష్యుడను నిన్ను శరణము నొందిన నన్ను శాసింపుము

ధర్మరహస్య మీలాగున నుండును కావుననే అనాది నుండి గురుశిష్య సంప్రదాయము పరంపరగా వచ్చుచున్నది హృదయ పరిపక్వభేదము ననుసరించి గురూపదేశములో గూడ ఈలాటి మార్పు గలుగును స్వాతికార్తియందు వర్షజలబిందువులు ముత్యపు చిప్పలోపడిన ముత్యముగాను, మంచి భూమియందు పడిన పానయోగ్యముగాను, చవిటి భూమిలోపడిన ఉపయోగములేనిదిగాను, తప్తాయఃపిండమున పడిన శూన్యముగాను, ఎట్లగుచున్నదో, ఆలాగుననే గురుదేవుడు శిష్యులందరికిన్ని జ్ఞానోపదేశము ఒకే విధముగా జేసినను ఉత్తమ హృదయములో అది జ్ఞాన ముత్యముగాను, మధ్యమ హృదయమున పడిన తనకున్నూ ఇతరులకున్నూ అజ్ఞానతాపశాంతిని గలుగ జేయునదగు పుణ్యరూపముగాను, అధముని యందుపడిన చవిటి భూమిలోవలె నిరర్థకముగను, నీచ హృదయమున బడిన తప్తాయఃపిండము (కాలిన ఇనుము ముద్ద)పై బడినట్లు శూన్యము గాను అయిపోవును చూచితిరా! మేఘజల బిందువు ఒకటైనను స్థలభేదమునుబట్టి అనేక విధములుగా మారిపోయెను ముత్యపు చిప్ప నీటి బొట్టును హృదయములో గ్రహించిన వెంటనే సముద్రాన్తరాళమునకు పోయి నిరంతరము జల బిందువును గురించి స్మరణచేయుచుండును అందువల్లనే ఆ జల బిందువు తెల్లని బంకగామారి గట్టిదగు ముత్యమగుచున్నది ఆలాగు

వనే ఉత్తమాధికారి యొక్క హృదయము విషయ దోష రహితమై నిర్మలమై యుండుటచేత గురుదేవుని ముఖారవిందమునుండి శ్రవణముచేసిన తత్త్వమసి మహావాక్యమును ఏకాంత ప్రదేశమున నుండి 'బ్రహ్మాఽస్మి'యని మననము చేయుటచే నిదిధ్యాసనపూర్వమగు ఆరూఢజ్ఞానమైన ముత్యముగా మారుచుండును ఈ విషయమై భర్తృహరి -

**సన్తప్తాయసి సంస్థితస్య పయసో నామాపి న శ్రూయతే**
**ముక్తాకారతయా తదేవ నలినీ పత్రస్థితం దృశ్యతే ।**
**అన్తస్సాగరశుక్తి మధ్య పతితం తన్మౌక్తికం జాయతే**
**ప్రాయేణధమమధ్యమోత్తమజుషా మేవంవిధా వృత్తయః ॥**

దీనియందు మూడు విధములుగ హృదయమును గుఱించి వర్ణించడమైనది పైజెప్పిన దానికన్న మరియొక విధముగ దీనియందు వర్ణిం చడమైనది కాలిన ఇనుముపై నీటిచుక్క (వర్ష బిందువు) నామ రూపములు లేక నశించిపోవును ఆ బిందువే తామరపాకుమీదపడునేని ముత్యమువలె కనంబడును ఆ బిందువే సముద్రాంతర్గతమగు ముత్యపుచిప్పయందు పడునేని ముత్యమగును కావున ఆశ్రయము ననుసరించిన వారి కాయా శ్రయానుసారము నీచులు, మధ్యములు, ఉత్తములు అను పేరులు వచ్చును



# సన్న్యాసికి ప్రతిబంధములు

మేధాతిథి -

**ఆసనం పాత్రలోపశ్చ సంచయశ్శిష్య సంగ్రహః ।**
**దివాస్వాపో వృథాలాపో యతేర్బంధకరాణి షట్ ॥**

1 ఆసనము, 2 పాత్రలోపము, 3 సంచయము, 4 శిష్యసంగ్ర హము, 5 దివాస్వాపము, 6. వృధాలాపము అను నీ యాఱును సన్న్యాసికి

ప్రతిబంధకములు

ఈ చెప్పిన యాఱు దోషములయొక్క స్వభావము ఆ ఋషి చేతనే వివరింపబడినది -

**ఏకాహాత్పరతో గ్రామే పంచాహాత్పరతః పురే ।**
**వర్షాభ్యోఽన్యత్ర యత్ స్థానమాసనం తత్ప్రకీర్తితమ్ ॥**

గ్రామములో నొకదినము కంటె, పట్టణములో నైదు దినముల కంటె నధికకాలము నిలవడమును, వర్షాకాలము నాలుగు మాసములలో తప్ప నితర కాలములయందొకచోట విశేషకాలము నిలుచుటయును ఆసస మనబడును

**ఉక్తాలాబ్వాది పాత్రాణాం ఏకస్యాపి న సంగ్రహః ।**
**భిక్షోర్భైక్ష్య భుజశ్చాపి పాత్రలోపస్స ఉచ్యతే ॥**

సన్న్యాసి యగువాడు భిక్షాన్నము భుజించుచున్నప్పటికి శాస్త్రమందు విధించిన సొరకాయబుఱ్ఱ మొదలైన పాత్రలలో నొకదానినైనా గ్రహించక పోవుట పాత్రలోపమని చెప్పబడును

**గృహీతస్య తు దండాదే ర్ద్వితీయస్య పరిగ్రహః ।**
**కాలాంతరోపభోగార్థం సంచయః పరికీర్తితః ॥**

దండకాషాయాదులను పరిగ్రహించి, అవి ఖిలమైన తరువాత తిరిగి ధరించుటకుగాను రెండు మూడు దండములను, కాషాయములను సంపాదించి పెట్టుకొనుట సంచయమనబడును

**శుశ్రూషాలాభపూజార్థం యశోఽర్థం వా పరిగ్రహః ।**
**శిష్యాణాం న తు కారుణ్యాత్ స జ్ఞేయ శ్శిష్యసంగ్రహః ॥**

శుశ్రూష, లాభము, పూజ, కీర్తి వీటిని అపేక్షించి శిష్యులను చేర్చు కొనుట శిష్యసంగ్రహ మనబడును కేవలము దయచేత శిష్యులను కృతార్థు

లను జేయవలయుననెడి యిచ్ఛచేత చేర్చుకొనుట శిష్యసంగ్రహమని చెప్పబడదు

**విద్యా దినం ప్రకాశత్వాత్ అవిద్యా రాత్రి రుచ్యతే।**
**విద్యాఽభ్యాసే ప్రమాదో యః స దివాస్వాప ఉచ్యతే ॥**

బ్రహ్మవిద్య ప్రకాశస్వరూప మైనందున దివా (పగలు) అని చెప్పబడును అజ్ఞానము అప్రకాశమైనందున రాత్రియనబడును ఉపనిషద్విద్య యనెడి పగటియందు ప్రమాదము గలిగియుండుటయే దివాస్వాప (పగలు నిద్రించుట) మనబడును

**ఆధ్యాత్మికీం కథాం ముక్త్వా భైక్షచర్యాం గురుస్తుతిమ్।**
**అనుగ్రహాత్పృథి ప్రశ్నో వృథాలాపస్స ఉచ్యతే ॥**

అధ్యాత్మ విషయమైన కథలను, దేహధారణార్థమైన భిక్షాచరణమందు, 'భిక్షాం దేహి'యను శబ్దోచ్చారణమును, పరమేశ్వరస్తవమును, మాత్రము సన్న్యాసి చేయవలయును వీటికంటె నితరములయిన లోక సమాచారములను అనుగ్రహముచేత నడిగిన నది వృధాలాపమని చెప్పబడును

యతిపాత్రల విషయమై రెండవ శ్లోకములో నిరూపించిన దానిని గూర్చి మనువు చెప్పినది చూడుడు -

**అలాబుం దారుపాత్రం చ మృణ్మయం వైదళం తథా।**
**ఏతాని యతిపాత్రాణి మనుస్స్వాయంభువోఽబ్రవీత్ ॥**

1 సొరకాయబుఱ్ఱ, 2 కఱ్ఱతో చేయబడిన కమండలము, 3 మట్టితో చేయబడిన కమండలము, 4 వెదురుగొట్టము, ఇవి యతికి పాత్రములని స్వాయంభువమనువు చెప్పెను. లోహపాత్రములుండిన దొంగలభయము కలుగును. అందువల్లనే సన్న్యాసికి (త్యాగికి) లోహపాత్రములు నిషేధింపబడినవి టెంకాయబుఱ్ఱయు, కమండలముగూడ పైజెప్పినవాటితో సంబంధించినవే

**తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః ।**
**నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్ ॥**

బ్రహ్మతత్త్వ జ్ఞానమునపేక్షించు పురుషుడు శమదమాది గుణసంపన్నుడై శ్రవణ మననములచేత బ్రహ్మస్వరూపమును తెలిసికొని తత్సాక్షాత్కారార్థముగా నిదిధ్యాసనమును (నిరంతర భావనను) చేయవలయును వ్యర్థములగు తదితర లోకవ్యవహారములను శబ్దములను విశేషముగా నుడువగూడదు ఆ ప్రకారమితర శబ్దముల నుచ్చరించుట, వాగింద్రియమున కాయాసమేగాక ఇతర ప్రయోజనము ఏమియు లేదు అని వ్యవహారాంతర శబ్దములను తత్త్వజ్ఞాని యుచ్చరించ గూడదని నిషేధించడమైనది తత్త్వ జిజ్ఞాస గల శిష్యులకు బ్రహ్మతత్త్వోపదేశమును చేయుట యితర శబ్దమని చెప్పగూడదు అటువంటి శబ్దము తత్త్వజ్ఞానికి విరోధము కాదు

తత్త్వజ్ఞ డితరులతో చేరక యొంటరిగా నుండెనేని బ్రహ్మధ్యానము నిర్విఘ్నముగా సిద్ధించును కనుకనే స్మృత్యన్తరమునందు -

**ఏకో భిక్షుర్యథోక్తస్స్యాత్ ద్వావేవ మిథునం స్మృతమ్ ।**
**త్రయో గ్రామస్సమాఖ్యాతః ఊర్ధ్వంతు నగరాయతే ॥**

**నగరం న హి కర్తవ్యం గ్రామో వా మిథునం తథా ।**
**గ్రామవార్తా హి తేషాం స్యాత్ భిక్షావార్తా పరస్పరమ్ ॥**
**స్నేహపైశున్యమాత్సర్యం సన్నికర్షాత్ప్రజాయతే ॥**

బ్రహ్మతత్త్వజ్ఞానము గలిగి పరమహంసాశ్రమము నంగీకరించిన మహానుభావు డొంటరిగా నుండెనా నిరంతర బ్రహ్మస్వరూపానుసంధానము గలవాడై యుండును లేక ఇద్దఱుచేరితే సంసారమని, ముగ్గుఱు చేరితే గ్రామమని, అంతకుపైగా నెంతమంది చేరినా నగరమని చెప్పబడును ఇటువంటిస్థితిలో నన్యోన్యసన్నికర్షముచేత గ్రామవృత్తాన్తములను పరస్పరము చెప్పుకొనుటయు, నొకరి యందొకరికి స్నేహమును, ఇతరుల యందుండు గుణదోషముల నొకరితో చెప్పుటయును, పరులయొక్క శ్రేయస్సును గూర్చి

సహింపలేకపోవుటయును ఈలాటిదోషములు సంభవించును

**పరమాత్మని యో రక్తో విరక్తోఽపరమాత్మని ।**
**సర్వైషణా వినిర్ముక్తః స భైక్షం భోక్తుమర్హతి ॥**

ఎవడైతే పరమాత్మ ధ్యానమందు ఆసక్తి గల చిత్తము గలవాడో, పరమాత్మ కాని ప్రపంచ విషయములలో ఆసక్తి లేనివాడో, ఈషణత్రయముచే వినిర్ముక్తుడో, అట్టి ఆత్మధ్యాన నిరతుడే భిక్షాన్నమున కర్హుడు



# ప్రజ్ఞానం బ్రహ్మ

ఈ ప్రజ్ఞానమే బ్రహ్మమనునది మహావాక్యములలో మొదటిది యగును 1 ప్రజ్ఞానం బ్రహ్మ, 2 అహంబ్రహ్మాస్మి, 3 తత్త్వమసి, 4 అయమాత్మాబ్రహ్మ అనునవి నాలుగు మహావాక్యములని వేదాంతములో పేర్కొని యున్నారు వానిలో నిది మొదటిది యగుటచే ముముక్షువులు దీనినే బాగుగా విచారణ చేయవలయును అనగా ఈ వాక్యమునే ధ్యానింపవలయును దీనినే శ్రవణ, మనన, నిదిధ్యాసనల నొనర్చవలయును 1 ప్రజ్ఞానం బ్రహ్మ, ఋగ్వేదము, ఐతరేయోపనిషత్తు, లక్షణ వాక్యము అనగా ఈ ప్రజ్ఞానము బ్రహ్మమని దేనియందు గలదని నిరూపించుచున్నది ఇది ఋగ్వేదమునందు గలదు ఋగ్వేదశాఖయగు ఐతరేయోపనిషత్తున ఈ వాక్యార్థము వర్ణింపబడియున్నది

ఐతరేయోపనిషత్తు, తృతీయాధ్యాయము ప్రథమ ఖండము .-

**మూ॥ ఓం, కోఽయమాత్మేతి వయముపాస్మహే,**
**కతరః స ఆత్మా, యేన వా (రూపం) పశ్యతి,**
**యేన వా (శబ్దం) శృణోతి, యేనవా గన్ధా నాజిఘ్రతి**

**యేన వా వాచం వ్యాకరోతి**
**యేన వాస్వాదు చాస్వాదు చ విజానాతి ।**

వామదేవాది మహర్షుల పరంపరగల వేదముచే బోధింపబడిన దియును, బ్రహ్మవిద్యా సాధనకృత సర్వాత్మ భావరూపఫలమును బొదుట కిచ్చగలవారును నగు ముముక్షువులు అనిత్యమైన సంసారమునుండి తరింపగోరినవారై 'ఈ ఆత్మయేది' అని యొకరినొకరు ప్రశ్నించిరి ఎట్లనగా, ఏ ఆత్మను ఆత్మయని యుపాసించెదరో ఆ యాత్మ యేది? మనము దానినే యుపాసించెదము ప్రాణ, ఆత్మలలో ఆత్మయనునది యేది? దేనిచేత రూపమును చూచుచున్నాడో, దేనిచేత శబ్దమును వినుచున్నాడో, దేనిచేత వాసనను మూర్కొనుచున్నాడో, దేనిచేత వాక్యమును మాట్లాడుచున్నాడో, దేనిచేత రుచి అరుచులను తెలసికొను చున్నాడో అదియే ఆత్మ అని నిశ్చ యించుకొనిరి

**మూ॥ తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం, ప్రజ్ఞా**
**నేత్రో లోకః, ప్రజ్ఞా ప్రతిష్ఠా, ప్రజ్ఞానం బ్రహ్మ**

ఆ ప్రపంచమంతయు జ్ఞానమే నేత్రముగా గలది ప్రజ్ఞానమునందు ప్రతిష్ఠించబడియున్నది జ్ఞానమే నేత్రముగా గలది ప్రజ్ఞానమే ప్రతిష్ఠగాను ప్రజ్ఞానమే బ్రహ్మస్వరూపము

**మూ॥ స ఏతేన ప్రజ్ఞేనాఽఽత్మనాఽస్మాల్లోకాదు**
**త్క్రమ్యాముష్మిన్ స్వర్గే లోకే సర్వాన్**
**కామానాప్త్వాఽమృతస్సమభవత్ సమభవత్**
**ఇతి ఓమ్.**

పూర్వులు ఏ ప్రజ్ఞానమును తెలిసికొని ముక్తులయిరో, ఆ ప్రజ్ఞానాత్మ చేతనే వామదేవ మహర్షి మొదలగువారు ఈ లోకమునుండి యుత్క్రమించి పరమానందస్వరూపమైన ఆత్మలోకమును జేరి అన్ని కోరికలను పొంది ముక్తులయిరి

ఇచ్చట సంక్షిప్తముగా వ్రాయబడినది విస్తారముగా చూడదలంచు వారు ఐతరేయోపనిషత్తున గనందగును

దీనిలో రెండు పదములు గలవు 1 ప్రజ్ఞాన మనియు, 2 బ్రహ్మ మనియు, ఈ విషయము శుకరహస్యోపనిషత్తున ఈశ్వరుడు శ్రీవేదవ్యాస మహర్షి ప్రేరణచే శుకమహర్షికి ఉపదేశించునటుల ఉంటున్నది

శుకరహస్యోపనిషత్తు -

**మూ॥ అథాతో రహస్యోపనిషదం వ్యాఖ్యాస్యామో**
**దేవర్షయో బ్రహ్మాణం సంపూజ్య ప్రణిపత్య**
**పప్రచ్ఛుర్భగవన్నస్మాకం రహస్యో**
**పనిషదం బ్రూహీతి ॥**

శుకరహస్యోపనిషత్తును వ్యాఖ్యానము చేయుచున్నాము దేవర్షులు బ్రహ్మదేవుని పూజించి నమస్కరించి ఓ భగవంతుడా! మాకు శుకరహస్యో పనిషత్తును చెప్పుడు అని ప్రార్థించిరి

సోఽబ్రవీత్ -

**మూ॥ పురా వ్యాసో మహాతేజాః సర్వవేదతపోనిధిః ।**
**ప్రణిపత్య శివం సామ్బం కృతాఞ్జలిరువాచ హ ॥**

తర్వాత బ్రహ్మదేవుడు చెప్పెను- ముందు మహాతేజస్సమ్పన్నుడును, సర్వ వేదములకు తపస్సులకు నిధియైనవాడును నగు వ్యాసమహర్షి సామ్బశివునికి నమస్కరించి చేతులు జోడించిన వాడై ఇట్లు పలికెను

శ్రీవేదవ్యాస ఉవాచ -

**మూ॥ దేవ దేవ మహాప్రాజ్ఞ పాశచ్ఛేదదృఢ వ్రత।**
**శుకస్య మమ పుత్రస్య వేదసంస్కార కర్మణి ॥**

**బ్రహ్మోపదేశ కాలోఽయం ఇదానీం సమవస్థితః ।**
**బ్రహ్మోపదేశః కర్తవ్యో భవతాఽద్య జగద్గురో ॥**

శ్రీ వేదవ్యాస మహాముని వచించెను- ఓ దేవదేవా! మహాప్రాజ్ఞా! జీవుల సంసార పాశమును ఛేదించుటయందు దృఢమైన వ్రతము గలవాడా! నా కుమారుడగు శుకునికి వేదసంస్కార సంబంధమగు బ్రహ్మోపదేశ కాలము సమీపించినది కనుక ఓ జగద్గురో! తమచే బ్రహ్మోపదేశము చేయందగినది

ఈశ్వర ఉవాచ -

**మూ॥ మయోపదిష్టే కైవల్యే సాక్షాద్బ్రహ్మణి శాశ్వతే।**
**విహాయ పుత్రో నిర్వేదాత్ప్రకాశం యాస్యతి స్వయమ్ ॥**

ఈశ్వరుడు చెప్పెను శాశ్వతమగు సాక్షాత్ బ్రహ్మస్వరూపమగు ఉపదేశము నాచే చేయబడగా నీ కుమారుడు అన్నిటిని వదలి వైరాగ్యము గలవాడై స్వప్రకాశుడై విహరింపగలడు

శ్రీ వేదవ్యాస ఉవాచ -

**మూ॥ యథా తథా వా భవతు హ్యుపనాయన కర్మణి ।**
**ఉపదిష్టే మమ సుతే బ్రహ్మణి త్వత్ప్రసాదతః ॥**

**సర్వజ్ఞో భవతు క్షిప్రం మమ పుత్రో మహేశ్వర ।**
**తవ ప్రసాద సమ్పన్నో లభేన్ముక్తిం చతుర్విధామ్ ॥**

**తచ్ఛ్రుత్వా వ్యాసవచనం సర్వ దేవర్షి సంసది ।**
**ఉపదేష్టుం స్థితశ్శమ్భుస్సామ్బో దివ్యాసనే ముదా ॥**

**కృతకృత్యశ్శుక స్తత్ర సమాగత్య సుభక్తిమాన్ ।**
**తస్మాత్స ప్రణవం లబ్ధ్వా పునరిత్యబ్రవీచ్ఛివమ్ ॥**

శ్రీ వేదవాస్య మహాముని వచించెను- ఏ విధముగానైనను గానిండు ఉపనయన కర్మయందు నా కుమారునికి మీ యనుగ్రహమువలన

బ్రహ్మోపదేశము చేయబడగా ఓ మహేశ్వరా! శీఘ్రము సర్వజ్ఞుడగుగాక! తరువాత మీ యనుగ్రహమును వడసి నాలుగు విధములగు ముక్తిని పొందు గాక!

ఆ వేదవ్యాసముని వాక్యమును విని సామ్బశివుడు దేవఋషుల సభ యందు శుకమహర్షికి బ్రహ్మోపదేశము చేయుటకై సంతోషముతో దివ్యాసనమున ఆసీనుడాయెను తదనంతరము శ్రీశుకులవారు కృతార్థుడై మిగుల భక్తితో శివుని సమీపించి ఉపదేశమును పొంది ప్రణవార్థమును ఎఱింగి ఈ ప్రకారము నుడివెను

శ్రీ శుక ఉవాచ -

**మూ॥ దేవాదిదేవ సర్వజ్ఞ సచ్చిదానంధలక్షణ ।**
**ఉమారమణ భూతేశ ప్రసీద కరుణానిధే ॥**
**ఉపదిష్టం పరబ్రహ్మ ప్రణవాన్తర్గతం పరమ్ ।**
**తత్త్వమస్యాది వాక్యానాం ప్రజ్ఞాదీనాం విశేషతః ॥**
**శ్రోతుమిచ్ఛామి తత్త్వేన షడంగాని యథాక్రమమ్ ।**
**వక్తవ్యాని రహస్యాని కృపయాఽద్య సదాశివ ॥**

శ్రీశుకులు వచించిరి- ఓ దేవాధిదేవా! సర్వజ్ఞా! సచ్చిదానంద లక్షణములు గలవాడా! ఉమారమణా! భూతేశా! కరుణానిధే! యనుగ్రహింపుమా ప్రణవాన్తర్గతమైన పరబ్రహ్మ ముపదేశింపబడినది ఇక తత్త్వమస్యాది మహావాక్యముల యొక్క తత్త్వమును విశేషముగా సాంగముగా వినగోరుచున్నాను వాటియొక్క రహస్యమును దయతో నుపదేశింపుడు

శ్రీ సదాశివ ఉవాచ -

**మూ॥ సాధు సాధు మహాప్రాజ్ఞ శుక జ్ఞాననిధే మునే ।**
**ప్రష్టవ్యంతు త్వయా పృష్టం రహస్యం వేదగర్భితమ్ ॥**

**రహస్యోపనిషన్నామ్నా స షడంగమిహోచ్యతే ।**
**యస్య విజ్ఞానమాత్రేణ మోక్షస్సాక్షాన్న సంశయః ॥**

**అంగహీనాని వాక్యాని గురుర్నోపదిశేత్పునః ।**
**షడంగాన్యుపదిశేన్మహావాక్యాని కృత్స్నశః ॥**

**చతుర్ణామపి వేదానాం యథోపనిషదశ్శిరః ।**
**ఇయం రహస్యోపనిషత్తథోపనిషదాం శిరః ॥**

**రహస్యోపనిషద్బ్రహ్మ ధ్యాతం యేన విపశ్చితా ।**
**తీర్థైర్మన్త్రైశ్శృతైర్జప్యై స్తస్య కిం పుణ్య హేతుభిః ॥**

**వాక్యార్థస్య విచారేణ యదాప్నోతి శరచ్ఛతమ్ ।**
**ఏకవారజపేనైవ ఋష్యాది ధ్యానతశ్చ యత్ ॥**

సాంబశివుడు వచించెను- ఓమహాప్రాజ్ఞా జ్ఞాననిధివగు ఓ శుకమునే! మంచిది మంచిది అడుగ తగినదానిని నీవడిగితివి అది వేద రహస్యము షడంగములతో గూడిన రహస్యోపనిషత్తును చెప్పుచున్నాను దానిని తెలిసి కొనిన సాక్షాన్మోక్షము గలుగును సందేహము లేదు గురువు అంగములతో గూడిన వాక్యములనే యుపదేశించవలయును అంగరహితములగు వాక్యముల నుపదేశించకూడదు నాలుగు వేదములకును ఉపనిషత్తు లెటుల శిరస్సై యున్నవో, ఆ ప్రకార మీరహస్యోపనిషత్తు సకలోపనిషత్తులకు శిరస్సై యున్నది ఏ పండితుడు బ్రహ్మస్వరూపమగు ఈ శుకరహస్యోపనిషత్తును ధ్యానించునో, పఠించునో వానికి పుణ్యమును గలుగజేయునట్టి తీర్థముల చేతను, మన్త్రములచేతను, శాస్త్రముల చేతను, జపముల చేతను గలిగెడు ఫలము ఈ ఉపనిషత్పఠనముచే లభించుచున్నది వాక్యార్థ విచారముచేతనే దీర్ఘాయుష్మంతు డగుచున్నాడు ఒకసారి జపించుటచేతను ఋష్యాది ధ్యానముచేతను అట్టి ఫలమునే పొందుచున్నాడు

**విశేషార్థము :-**

1 "సప్రణవం లబ్ధ్వా" అని చెప్పుటచే శ్రీపరమ శివుండు శుకబ్రహ్మర్షికి ప్రణవమును మొదట నుపదేశించెను

**2 అంగహీనాని వాక్యాని గురుర్నోపదిదేత్పునః**

ఇట్లు చెప్పుటచే ఏ మన్త్రమయినను షడంగములతో గూడినదిగా నుండవలయునని భావము (షడంగమనగా) 1 ఋషి, 2 ఛందస్సు, 3 దేవత, 4 బీజం, 5 శక్తి, 6 కీలకము

3 **చతుర్ణామపి వేదానాం యథోపనిషదశ్శిరః । ఇయం రహస్యోపనిషత్తథోపనిషదాంశిరః -**

నాలుగు వేదములకు ఉపనిషత్తులు శిరస్సు అనియు, అట్టి 108 ఉపనిషత్తుల కీ శుకరహస్యోపనిషత్తు శిరస్సనియు చెప్పుటలో దీని మహిమ యెట్టిదో దెలియందగును అదియునుగాక సాక్షాచ్ఛివుండే యీలాగున తెలిపిరి ఈ మహావాక్యమునకు గూడ ఋష్యాది షడంగములు గలవు ఇది గురుముఖమున తెలసికొనిన మంచిది ఈ శుకరహస్యోపనిషత్తునందుగల మహావాక్యములకు శ్రీవిద్యారణ్యస్వాములవారు వేదాంతపంచదశి ఐదవ ప్రకరణమున వ్యాఖ్యానము చేసియున్నారు

"ప్రజ్ఞానం బ్రహ్మ" అను మొదటి వాక్యములో గల ప్రజ్ఞానశబ్దమును గురించి జీవబ్రహ్మల ఏకత్వము గలుగుట కొరకు తెలుపబడుచున్నది

**యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ ।**
**స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞానముదీరితమ్ ॥**

యేన = చక్షుర్ద్వారావ్యాపించిన ఏ చైతన్యము చేత, ఇదం = ఈ చూచుటకు యోగ్యమగు రూపాదికమును, ఈక్షతే = చూచుచున్నాడో, శృణోతి = శ్రోత్రేన్ద్రియము ద్వారా శబ్దములను వినుచున్నాడో, జిఘ్రతి = ఘ్రాణేన్ద్రియము ద్వారా గంధములను ఆఘ్రాణించుచున్నాడో, వ్యాకరోతి = వాగిన్ద్రియము ద్వారా శబ్దసమూహమును వ్యవహరించుచున్నాడో, స్వాద్వ

స్వాదూ = రుచి యరుచులను, విజానాతి = జిహ్వేంద్రియము ద్వారా ఎరుగుచున్నాడో, తత్ = ఆ చైతన్యము, ప్రజ్ఞానం = ప్రజ్ఞానమని, ఉదీరితం = చెప్పబడు చున్నది

నేత్రేంద్రియము ద్వారా బాహ్యమునకు వ్యాపించిన అన్తఃకరణ వృత్తితో గూడినట్టి ఏ చైతన్యముచేత జీవుడు చూచుటకు యోగ్యమైన రూపాదికమును చూచుచున్నాడో, మరియు శ్రోత్రేంద్రియము ద్వారా బాహ్య ప్రదేశమునకు వ్యాపించినట్టి అన్తఃకరణ వృత్తితో గూడిన యేచైన్యముచేత జీవుడు శబ్దసమూహమును వినుచున్నాడో, మరియు ఘ్రాణేంద్రియము ద్వారా బాహ్య ప్రదేశమునకు వ్యాపించినట్టి అన్తఃకరణవృత్త్యుపాధితో గూడిన యేచైతన్యముచేత గంధసమూహమును జీవుడాఘ్రాణించుచున్నాడో, మరియు వాగింద్రియము ద్వారా బాహ్యమునకు వ్యాపించినట్టి అన్తఃకరణ వృత్త్యుపాధితో గూడిన యేచైతన్యముచేత జీవుడు సకల శబ్దములను ఉచ్చరించుచూ వ్యవహరించుచున్నాడో, మరియు జిహ్వేంద్రియము ద్వారా బాహ్య ప్రదేశమునకు వ్యాపించిన అన్తఃకరణవృత్తితో గూడినట్టి యేచైతన్యముచేత జీవుడు తీపి, చేదు మొదలగు రసముల నెరుగుచున్నాడో, ఈ ప్రకారము స్పర్శేంద్రియము ద్వారా శీతోష్ణములను తెలుసుకొనుచున్నాడో, ఆలాగున సకలేంద్రియములతోటియు అన్తఃకరణవృత్తి చేరుచుండగా అట్టి వృత్తి భేదములతో గూడిన యేచైతన్యముచేత జీవుడు సకలేంద్రియ విషయముల నెరుంగుచున్నాడో అట్టి చైతన్యమే "ప్రజ్ఞానం బ్రహ్మ" యను మహావాక్యమందు గల ప్రజ్ఞాన శబ్దముచేత చెప్పబడుచున్నది

ఇట్లు ప్రజ్ఞాన శబ్దార్థమును దెలిపి ఇప్పుడు బ్రహ్మశబ్దార్థమును చెప్పుచున్నాడు

**చతుర్ముఖేన్ద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు।**
**చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి ॥**

చతుర్ముఖేన్ద్రదేవేషు - చతుర్ముఖ = బ్రహ్మదేవునియందును,

ఇన్ద్రదేవేషు = దేవేంద్రాది దేవతల యందును, మనుష్యాశ్వగవాదిషు = మనుష్య = మనుష్యుల యందును, అశ్వ = గుఱ్ఱముల యందును, గవాదిషు = గోవు మొదలగు వానియందు గల, ఏకం చైతన్యం = ఒకే చైతన్యము, బ్రహ్మ = బ్రహ్మమగును, అతః = ఆ కారణమువలన, మయ్యపి = నా దేహమందును గల, ప్రజ్ఞానం = ప్రజ్ఞానము, బ్రహ్మ = బ్రహ్మమగును

ఉత్తమములగు చతుర్ముఖ దేవాది శరీరములను ధరించిన వారి యందును, మధ్యమములగు మనుష్య దేహములను ధరించినవారియందును, అధమములగు గోవు, గుఱ్ఱము మొదలగు ప్రాణుల యందును ఏ యద్వితీయ చైతన్యము గలదో, ఆ చైతన్యము బ్రహ్మమగును ఆ కారణము వలన అంతట నుండెడి ప్రజ్ఞానంబును బ్రహ్మమే యగునని ముముక్షువులు నిశ్చయించుకొనందగినది

ఈ సత్యమును రూఢిగా తెలిసికొనిన యెవరైనను మీకు బ్రహ్మ విచారమునకు అర్హత గలదా యని యడిగినచో సమాధానము చెప్పుటకు అవకాశము గలుగును లేనిచో సంశయము గలుగవచ్చును ధైర్యముండి గూడ కోల్పోవచ్చును ఎటులననగా ఒక యున్నతోద్యోగము కాళీపడి ఫలాని డిగ్రీ పొందినవారు దీనికర్హులని ప్రకటించినచో ఆ డిగ్రీ పరీక్ష పొందిన వారు అడుగుటకు అర్హులగుదురు పరీక్ష యందుత్తీర్ణులు కానివారు ఎటుల అర్హులు కారో, ఎందుకర్హత లేదని ప్రశ్నించుటకు గూడ వారికి యోగ్యతలేదో ఈ మహావాక్యముయొక్క రహస్యము గూడా ఆలాటిదే కావుననే "చైతన్యమేకం బ్రహ్మతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి" అని నిరూపించడమైనది అయితే కించిద్జ్ఞుడగు జీవునికిన్ని, సర్వజ్ఞుడగు ఈశ్వరునికిన్ని ఎటుల నేకత్వము పొసగునని ప్రశ్నవచ్చినచో భాగత్యాగ లక్షణావృత్తి వలన దానిని నిరూపించుకొనవలయును

లక్షణావృత్తి 3 విధములు 1 జహల్లక్షణ, 2 అజహల్లక్షణ, 3 జహదజహల్లక్షణ అని యగును ఇది యీ వ్యాసమునకు సంబంధించినది కానందుచే ప్రత్యేకముగా తెలియనగును ఈ ప్రజ్ఞానం బ్రహ్మయనునది

యెటువంటిదనగా సాలెపురుగు గొప్పదగువలను నిర్మించి దానిమధ్య నివాస మేర్పరచుకొని ఆవలలో ఏ ప్రక్కనైనను మశకాది క్రిములు పడిన ఏలాగున తెలిసికొనుచున్నదో, ఆలాగున ఈ శరీర హృదయమధ్యయందుండి యీ ప్రత్యగాత్మయు సర్వేన్ద్రియముల ద్వారా దేహమంతటగల విషయములను ఇన్ద్రియముల ద్వారా తెలిసికొనుచున్నది అది ప్రజ్ఞానమనంబడును మరియు మహాపట్టణములోగల తంతి వార్తయొక్క ఆఫీసులో నుండు మనుజుడు నానా దిక్కుల నుండి వచ్చెడు వార్తలన్నిటిని ఎటుల గ్రహించు చున్నాడో, ఆలాగున శరీరమను మహాపట్టణ మధ్యస్థానమగు హృదయమం దుండి యీ ఆత్మ సర్వేన్ద్రియముల ద్వారా సమస్త విషయములను తెలిసి కొనుచున్నాడు సాలెపురుగు పెట్టిన వలకు భిన్నమై సాక్షియై యుండునటు లున్ను, తంతివార్త ఆఫీసులోనుండు మనుజుడు తంతుల ద్వారా విషయమును గ్రహించుకొనునటులున్ను, హృదయమందుండి యాత్మయు సర్వేన్ద్రియముల ద్వారా సమస్త విషయములను తెలిసికొని విలక్షణుడై సాక్షియై యుంటున్నాడు దీనినొక దానిని తెలిసికొనిన ఈ దేహములో ఆత్మయెచట నున్నది? దాని స్థానమెచట? అను మొదలగు ప్రశ్నలన్నిటికి మనకు సమాధానము లభించును ఈ విషయమై గీతలో శ్రీకృష్ణభగవాను డుపదేశించినది చూడుడు అ 13లో 1వ శ్లోకములోనే అర్జునుండు ఆరు ప్రశ్నలు వేసినాడు దానిలో "క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ" అనగా క్షేత్రమనగా నెట్టిది? క్షేత్రజ్ఞుడనగా ఎవడు? 2వ శ్లోకమున దానికి సమాధానము

**ఇదం శరీం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥**

ఓ యర్జునా! యీ దేహము క్షేత్రమనియు, క్షేత్రధర్మములన్నిటిని ఎఱుంగువాడు క్షేత్రజ్ఞుడనియు, క్షేత్ర క్షేత్రజ్ఞుల నెఱింగిన వారు చెప్పుదురు ఇదియున్ను ప్రజ్ఞానం బ్రహ్మమని బోధించెడు మహావాక్యమునే తెలుపు చున్నది

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ॥**

బ్రహ్మాది స్తంబపర్యన్తము గల సకలోపాధులయందును ఉపాధి భేదముచే వేరుగానున్నను పరమార్థజ్ఞానముచేత ఒకటే యగు ఆత్మయే నేను అని తెలిసికొనుము ఇట్టి క్షేత్రక్షేత్రజ్ఞులను తెలిసికొనెడి జ్ఞానమేది గలదో అదే నిజమైన జ్ఞానమని నా మతము "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు" అని చెప్పుటచే చతుర్ముఖ బ్రహ్మ మొదలు గల సర్వోపాధులయందును వెలుగు చున్నది ఆ పరమాత్మస్వరూపమేయని నిర్ణయించడమైనది ప్రజ్ఞానం బ్రహ్మ యని యుపదేశించెడు శ్రుతియు, 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' అని తెలిపెడు స్మృతియు ఒకే పద్ధతిని ఉపదేశించుచున్నవి ఇట్లు శ్రుతిస్మృతులు ఏక రూపముగా సహస్రముఖములతో ఉద్ఘోషించుచుండగా మరల యేల ఆత్మయే పరమాత్మయని చెప్పెడు వాక్యములో మీకు సంశయము గలుగ వలయును? శాస్త్రజ్ఞానమందు బలము చాలక పోవుటచేతనే సందేహముద యించును కావున ముముక్షువులు శాస్త్రజ్ఞానమును గూడ నలవరచుకొనవల యును కావుననే "విద్యాతపోభ్యాం పూతాత్మా" అని శ్రుతి తెలుపు చున్నది విద్యయు, తపస్సు, రెండింటి వలననే ఆత్మ పునీతమై ముక్తిని పొందును లోహములు కరుగజేసి శుద్ధపరచుటకు నిప్పొకటి చాలదు గాలిగూడ నుండవలయును ఆలాగున అవిద్యా మలమును శుద్ధపరచుటకు జ్ఞాననిష్ఠ యొకటి చాలదు విద్యానిష్ఠయు ఆవశ్యకమే., కావుననే "తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే" తపస్సు వలన ప్రకృతి దోషములన్నియు నశించు ననియు, ఆధ్యాత్మిక విద్యచేత అమృతత్వము అనగా మోక్షము సిద్ధించు ననియు శాస్త్రము నుడువుచున్నది యధార్థముగా విచారించిన ఈ రెండు విద్యలలో ఉత్తీర్ణుడగునప్పుడే మీరలు స్వతన్త్రులు గాగలరు అంతవరకు అస్వతన్త్రులే, సంశయము లేదు

క్షేత్రక్షేత్రజ్ఞుల విషయమై శ్రీకృష్ణభగవాను డుపదేశించిన దానికొక దృష్టాన్తము చెప్పెద ఒకడు బహుధనమును వ్యయపరచి శిల్పశాస్త్ర ప్రకా

రము అతి సుందరమగు నొక దేవాలయమును నిర్మించెను కాని ప్రతిష్ఠ చేయక మునుపే పాపమాతడు మరణించెను ప్రతిష్ఠ చేయని కారణముచే దేవాలయము నిర్మించిన పుణ్య ఫలమును అతడేలాగున పొందకపోయెనో, ఆలాగున ఉత్తమ కులములో పుట్టి శాస్త్రములన్నియు జదివి సుగుణ సంపన్నుడై సర్వేన్ద్రియముల సౌష్ఠవము గల్గి యుండినను క్షేత్రజ్ఞుడగు ఆత్మను ఈ దేహములో ప్రతిష్ఠింపక పోయిన ఆతని స్థితి ఇతర సుఖములన్నియు గలిగియుండినను, తిలక తులసీమాలా భస్మ రుద్రాక్ష కాషాయ జటాదండ కమండలాదు లుండినను ప్రతిష్ఠలేని దేవాలయము వంటిదేయగును కావున ప్రజ్ఞానం బ్రహ్మయను వాక్యము ననుసరించి తన యందు క్షేత్రజ్ఞుని ప్రతిష్ఠించుకొనవలయును అప్పుడే బ్రహ్మప్రాప్తి కొఱకు తానారంభించిన పని పూర్తియయినటుల తెలియవలెను కావుననే గీతాచార్యుండు "ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మిత్యభిధీయతే। ఏతద్యో వేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విద" అని యుపదేశించెను కావున ఈ విషయములలో ముముక్షువులు క్షేత్రజ్ఞ ప్రతిష్ఠ గలుగువరకు మిక్కిలి జాగరూకులై నిరంతర ముండవలయును

మఱియు జీవబ్రహ్మల యేకత్వమును ప్రతిపాదించెడు అద్వైత వేదాంత శాస్త్రమునకు భిన్నులగు ద్వైతులుగాని, విశిష్టా ద్వైతులుగాని, జీవబ్రహ్మలకు భేదము జెప్పువారుండిన నట్టి వారికిగూడ సమాధానమును సరిగా వచింపవచ్చును ఉపనిషత్ప్రతిపాదితమగు అద్వైతము మాత్రము అమానుష ప్రజ్ఞవలన గ్రహించుకొనవలసి యున్నది తక్కిన ద్వైతవిశిష్టాద్వైతములు సామాన్య మానవ బుద్ధితో గూడ అవగాహనము చేసికొనవచ్చును ఏలననగా అవియన్నియు మనోబుద్ధులచే అవగాహనము చేసికొనుటలో నంత ప్రయాసము లేదు అద్వైత బ్రహ్మబోధనయో మనోబుద్ధుల కతీతము ఎటు లనగా మీతో నెవరైన నొకవృక్షమును జూపి దానియందు గల ఫలములు, పుష్పములు, పల్లవములు, పత్రములు, పండ్లు వా[illegible] గుజ్జు, బీజములు, పండ్లయొక్క బెరడు, పుష్పమందు[illegible] మధువు, పుష్పములో గల వివిధవర్ణములు, చెట్టులోగల బంక, వృక్షముయొక్క చర్మము

SARASWATI

మొదలగునవి ప్రత్యక్షముగా వేరు వేరుగా కనపడుచుండగా అవి యన్నియు ఒకటేయని ఎట్లు చెప్పవచ్చునని యడుగునప్పుడు వాస్తవముగా నివి యన్నియు వేరువేరుగా నుంటుండగా ఏకత్వము సిద్ధించు విషయమై తప్పక మీ మనస్సులో సంశయము గలుగవచ్చును దీనిని స్థిరపరచుటకు విశేష ప్రజ్ఞయేమియు అక్కర లేదు ఇదియే ద్వైత విశిష్టాద్వైతమతములు అద్వైత వాదమెట్టిదనగా పైన జెప్పబడిన వృక్షమున అనేక భేదములు కనిపించినను అవి యొక విత్తనమునుండి ఏర్పడిన భిన్న భిన్న భేదములేగాని యధార్థముగా విచారించిన అనేకత్వ మేకత్వమే యగునని సత్యము బోధపడగలదు ఈ విషయమై అపరోక్షానుభూతియందు తెలిపిన దానిని గనుడు

**యథా తరఙ్గకల్లోలైః జలమేవ స్ఫురత్యలమ్।**
**పాత్రరూపేణ తామ్రం హి బ్రహ్మాణ్డౌఘైస్తథాఽఽత్మనా ॥**

ఏలాగున ఒకే జలము తరంగబుద్బుదాదులుగను, ఆలాగున ఒకే తామ్రము అనేక పాత్రలుగను, ఒకే పంచలోహము అనేక విధములగు శివ, విష్ణు, బ్రహ్మ, నందికేశ్వర, ఆది శేష, గరుత్మంత, స్త్రీ పురుషాది నానావిధ విగ్రహములుగాను కనబడునో ఆలాగున ఏకమగు ఆ సద్వస్తువే అనేక రూపములుగా కానుపించును శిల్పియొక్క వైచిత్ర్యమును పొందినట్లున్ను, ప్రకృతి యొక్క వైచిత్ర్యముచే ఒకే సద్వస్తువున్ను అనేక రూపములుగా గోచరించును ప్రజ్ఞగలవాడు విచారణ శక్తిచే ఒకే లోహముగాను, ఒకే జలమునుగాను తెలిసి కొనును అట్లు సూక్ష్మవిచారణ శక్తిలేనివానికి భిన్న భిన్నములుగానే గోచరించును.

**ఘటనామ్నా యథా పృథ్వీ పటనామ్నా హి తన్తవః।**
**జగన్నామ్నా చిదాభాతి జ్ఞేయం తత్తదభావతః ॥**

మరియు ఒకే మృత్పిండమును కుమ్మరివాడు తన బుద్ధి కౌశలముచే అనేక పాత్రలుగాను, గజ, అశ్వ, అజ, గవాద్యనేకరూపములుగాను ఎటుల చేయుచున్నాడో, తన్తువాయుడు (సాలెవాడు) ఒకే నూలుచేత అనేక

వస్త్రములు అనేక రంగులతో ఏలాగున నేయుచున్నాడో ఆలాగున మాయ తన శక్తిచేత ఆ యేకత్వమగు సద్వస్తువును అనేకములుగా చేయుచుండును

**కనకం కుణ్డలత్వేన తరజ్గత్వేన వై జలమ్ ।**

**వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మఽఽతా ॥**

పై జెప్పిన ప్రకారము ఒకే సువర్ణము కిరీట, కుండల, కంకణ, కేయూ రాద్యనేకాభరణములుగా కానుపించునటుల అవిద్యాశక్తిచే ఒకే సద్వస్తువగు బ్రహ్మముగూడ అనేకములుగా గోచరించును వివేకబుద్ధితో విచారించిన ఒకే స్వర్ణముగానే యుండును అట్లు విచారింపలేని సామాన్యశక్తిగల వారికి అనేక నామ రూపములతో గోచరించుట సహజమే ఇక ఈ విషయమై చెప్పవలసి నది అనేక ముండినను సూక్ష్మబుద్ధిగలవారికి స్థాలీపులాకన్యాయముగా ఇంతే చాలునని తలంచడమైనది ఇక సీతారామాంజనేయమున తెలిపినది చూడుడు

**ఆరోపిత భుజంగమమర గన్పట్టునే**
**స్ఫురదధిష్ఠాన రజ్జువును గనిన**
**నారోపితమనుష్య డలర జూపట్టునే**
**భువినధిష్ఠాన దారువును గనిన**
**నారోపితోదకం బరయంగ దోచునే**
**కన దధిష్ఠానార్కకరము గనిన**
**నారోపితాచ్ఛరౌప్యము లక్ష్యమగునె య**
**ధిష్ఠానమైన శుక్తికను గనిన**

**దలప నారోపితాసితత్త్వంబు మరల**
**గాననగునె యధిష్ఠానఖంబు గనిన**
**దెలియ నారోపిత మనంబు దృశ్యమగునె**
**తగనధిష్ఠాన పూర్ణతత్త్వమును గనిన.**

**ఘట శరావాది మృత్కార్యజాతంబుల**

నెంచి మృత్తిక యని కాంచు పగిది
నమల కుండల కిరీటాది భూషణముల
స్వర్ణంబని యెఱుంగు చందమునను
నసి కుంత శూల చక్రాదికంబుల నెల్ల
నినుమని యరసి కన్గొనిన భంగి
బొలుపారు ఫేన బుద్బుద తరంగంబుల
మంచి నీరని విలోకించు రీతి

దనరు బహువిధ పటముల దంతు వనుచు
దెలియు కైవడి మొదలి సందియము విడచి
భ్రాన్తిని దొలంగి సర్వంబు బ్రహ్మమనుచు
సుఖముగా సంతతంబును జూడుమనఘ.

తరుణి వేషంబు గై కొన్న పురుషు డరయ
బురుషుడగు గాక పరికింప దరుణి యగునె
జీవ భావంబు జేకొన్న కేవలాత్మ
డాత్ముడగు గాక మఱి జీవుడగునె తెలియ.

దంతి రూపంబుచే నొప్పు దారు వరయ
దారువగు గాక పరికింప దంతి యగునె
విశ్వరూపంబుచే దోచు విష్ణుమూర్తి
విష్ణుడగు గాక పరికింత విశ్వమగునె !

ఇవి తెనుంగు పద్యములగుటచే అర్థము సులభమని తలంచి వ్రాయ లేదు

గవామనేకవర్ణానాం క్షీరస్యాప్యేకవర్ణతా ।
క్షీరవత్పశ్యతే జ్ఞానం లిఙ్గినస్తు గవాం యథా ॥

గోవులు శుక్ల, రక్త, కృష్ణ, పీతాది వర్ణములతోను, పొట్టి పొడుగుల

తోను ఉన్నను అన్నిటిలో గల క్షీరమేలాగున ఒకే తెలుపు వర్ణము గలిగి యుండునో, ఆలాగున మానవులందఱున్ను అనేక నామరూపములతో స్థూల సూక్ష్మాకారములు గలిగియున్నను, అందఱిలోను గల ఆత్మ వస్తువు ప్రజ్ఞానమను బ్రహ్మ యొకే విధముగా నుంటున్నది బాహ్యదృష్టి గలవారి కనేకత్వము కనిపించినను అంతర్దృష్టి గలవారికి అన్నిటిలోను ఒకేయాత్మయే గోచరించును

**ఏక ఏవాత్మా మన్తవ్యో జాగ్రత్స్వప్న సుషుప్తిషు ।**
**స్థానత్రయవ్యతీతస్య పునర్జన్మ న విద్యతే ॥**

జాగ్రత్స్వప్నసుషుప్తులకు కారణమగు స్థూల సూక్ష్మకారణ దేహములకు విశ్వ, తైజస, ప్రాజ్ఞ జీవులకు సాక్షియగు ప్రత్యగాత్మను పొందిన వానికి అనగా ప్రజ్ఞానం బ్రహ్మయను దృఢబోధ గలవానికి పునర్జన్మ యుండదు నిజముగా మన యందఱి స్వరూపమదియే

**ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః ।**
**ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచన్ద్రవత్॥**

అనేక నామరూపములతో గూడిన ప్రాణికోట్ల హృదయములో వెలుగుచుండు దైవవస్తు వొకటియే ఎటులనగా అనేక లోహములతో అనేకాకృతులతో గూడిన పాత్రలో గల జలమున ప్రతిబింబించెడు చంద్ర బింబము ఏలాగున ఒకటిగా నుంటున్నదో, ఆలాగున ఈ ఆత్మస్థితియు నున్నది బాహ్య దృష్టితో చూచినప్పుడు జలముయొక్క స్వభావము ననుసరించి చంద్రబింబము చిన్నదిగాను, పెద్దదిగాను, చలన నిశ్చలత్వములతో గూడినదిగాను కనిపించినను ఈ ప్రతిబింబములకు ఆధార భూతమనునది యదియే యని ఆకాశము వైపు మనస్సును నిశ్చలము జేసెనేని ఒకే చంద్రుడని గోచరించును అంతర్దృష్టి బాహ్యదృష్టులకు గల భేదమిట్టిదని తెలిసికొనందగినది పాత్రలు స్వర్ణరజత తామ్ర మృత్తికాదులతో శుక్ల, రక్త, కృష్ణ, పీతాది రంగులతో నున్నవియైనను చతురస్ర, వర్తుల, ముక్కోణాదు

లతో నుండినను, అన్నిటిలోను చంద్రబింబమొకే విధముగా నున్నట్లు బ్రాహ్మణాది వర్ణములుగాని, సన్న్యాసాది ఆశ్రమములుగాని, స్త్రీలింగ, పుల్లింగ నపుంసకాదులున్నను ఆత్మమాత్ర మొకటియే అయితే పాత్రములు ఏలోహములతో ఏరంగులతో ఏ ఆకారములతోనున్నవి యైనను వాటిలో గల జలము మాత్రము నిర్మలముగాను నిశ్చలముగాను ఉండిన మాత్రమే చంద్రబింబ మును స్పష్టముగా కనుగొనగలము ఆలాగున మీరు ఏవర్ణముతో నే ఆశ్రమముతో ఏలింగముతో కూడినవారైనను, హృదయము మాత్రము నిశ్చలముగాను నిర్మలముగాను నుండినచాలును అప్పుడు మీలో ప్రకాశించెడు దైవమును చూడగలరు అదియే ప్రజ్ఞానం బ్రహ్మయను మహావాక్యముచే ఉపదేశింపబడు యర్థము

**ఘృతమివ పయసి నిగూఢం భూతే భూతే చ వసతి విజ్ఞానమ్ ।**
**సతతం మనసి మథయితవ్యం మనోమంథానుభూతేన ॥**

ఇప్పుడు ఈ ఆత్మ తనలో వెలుగుచున్నను ఏల కనిపించుట లేదని చెప్పువారికి సరియగు సమాధానము దొరకెను క్షీరములో నవనీతమంతట వ్యాపించియున్నను ఎట్లు గోచరించుట లేదో, చక్కగా మథించునప్పుడు ప్రత్యక్షముగా వెన్న యేలాగున కనపడుచున్నదో ఆలాగున మనస్సును చక్కగా తపోధ్యానములచే తరచిన వారికి ఆత్మ లాభము గలుగును

ఒకవేళ ఇకను మనస్సులో కొంత మాలిన్యముండినచో దాని నివృత్తి కొఱకు యోగవాసిష్ఠమున నుపదేశించినది చూడుడు ఈలాటి యుత్తమో పదేశముల వినిన మనోధైర్యము గలుగును అప్పుడు ఎట్టివారికైనా ఆత్మశుద్ధి గలుగజేసికొనవచ్చునని యుత్సాహ మేర్పడును

**యద్వైకం చ సువర్ణాది మిళితం రజతాదినా ।**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽప్యహంయుతః ॥**

**యథైవ హి సువర్ణాది క్షారాదేశ్శోధితం శుభమ్ ।**
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః ॥**

ఏలాగున అపరంజి బంగారైనను, వెండి రాగి ఇత్తడి మొదలగు మలిన లోహములతో గలిసిన స్వల్పమగు వెలగలదగుచున్నదో, యాలాగున జీవాత్మ శుద్ధశివస్వరూపుడైనను అహంకారాది మాయా మాలిన్యముతో గూడిన పై జెప్పిన బంగారు గతియే గలుగుచున్నది అగుచో పురుష ప్రయత్నము వలన ఆ మలిన బంగారమును స్ఫుటమొనర్చిన ఎట్లు అపరంజి బంగారమగు చున్నదో అట్టి యపరంజి బంగారువలె అంత విలువ గలదగుచున్నదో, ఆలాగున ఆధ్యాత్మజ్ఞాన సంస్కారముచే జీవునియొక్క మాలిన్యము దొలగు నప్పుడు ఈశ్వరావస్థ గలుగుచుండును ఈ సంస్కారమధ్యాత్మ జ్ఞానము చేతను, ఉత్తమ తపస్సుచేతను జీవులకు సిద్ధించవలయును ఈ లాగున మఱియొక యుపదేశము గూడ వాసిష్ఠమందు గలదు అది పైజెప్పబడిన దానికన్న చాలాసారమయినది ఈ సత్యమును తెలిసికొనక సామాన్య జనులీ లాగున వచింతురు అదేమనగా పుట్టుకతో వచ్చిన కర్మ శరీరము గిట్టు నప్పుడే నశించునని వారి యభిప్రాయము వసిష్ఠమహర్షియొక్క యాశ యము పైజెప్పిన వారికన్న విలక్షణమైనది ఇది ముముక్షువులకు, సాధకులకు ఎంతో యూర్జితమును గలుగజేయును అదేమనగా,

**తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా।**
**నశ్యతి క్రియయా పుత్ర పురుషస్య తథా మలః ॥**

**జీవస్య తండులస్యేవ మలం సహజమప్యలమ్ ।**
**నశ్యత్యేష న సన్దేహః తస్మాదుద్యమవాన్భవ ॥**

బియ్యము పుట్టుకతోనే తౌడుతోను, పొట్టుతోను గూడియుండును ఆలాగున రాగి పుట్టుకతోనే చిలుముతో గూడియే యుండును అయినను దంచుటచే బియ్యము యొక్క పొట్టు, తవుడు ఏలాగున వదలిపోవుచున్నవో, ఆలాగున ఆత్మసంస్కారమువల్ల జీవునియొక్క మాలిన్యము గూడ

నశించును పై విధమున ఒకవేళ జీవుడు పూర్వజన్మ కర్మతోనే గూడి పుట్టి యుండినను తగిన యాత్మసంస్కారము వలన తప్పక కర్మనిర్మూలనము గల్గును దీనియందు సందేహము లేదు అందుచే జీవుడెల్లప్పుడున్ను ప్రయత్నవంతుడు గావలయును

**అయమాత్మా స్వయంజ్యోతి : మహానందమయశ్శివః ।**
**అయోగినః పరోక్షస్స్యా దపరోక్షశ్చ యోగినః ॥**

ఈ ఆత్మవస్తువు స్వప్రకాశమైనది మహానంద మయినది శివ స్వరూపమయినది అట్లుండియు అయోగులయినవారికి అప్రత్యక్షముగాను, నిజమైన యోగులకు ప్రత్యక్షముగాను ఉంటున్నది అనగా కుయోగులకు అప్రత్యక్షముగాను, సుయోగులకు ప్రత్యక్షముగాను ఉండునని భావము

**ఆత్మా క్షేత్రజ్ఞ సంజ్ఞోఽయం సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తైరేవ విగతశ్శుద్ధః పరమాత్మేత్యుదాహృతః ॥**

ఈ ఆత్మయే క్షేత్రజ్ఞుడను సంజ్ఞ గలిగి యున్నది ఎంతవరకనగా ప్రకృతి సంబంధము గల త్రిగుణములతో కూడియుండువరకే, అట్టి మూడు గుణములనుండి యెప్పుడు విముక్తుడగునో అప్పుడే శుద్ధాత్ముడగుచు న్నాడు అత్తటి ఈ ఆత్మయే పరమాత్మ యని వ్యవహరింపబడుచున్నది

**అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశ పంచకమ్ ।**
**ఆద్యం త్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్ ॥**

ఈ దేహము అయిదు లక్షణములతో గూడినది అవి 1 అస్తి = ఉండుట, 2 భాతి = ప్రకాశించుట, 3 ప్రియం = ఆనంద రూపముగా నుండుట, 4 రూపం = ఆకారము గలిగియుండుట, 5 నామ = పేరు ఈలాగున అయిదు అంగములతో గూడినది వీనిలో మొదటివి మూడున్ను బ్రహ్మ సంబంధముగాను, తరువాత రెండున్ను జగత్సంబంధము గలవనిన్ని గ్రహించుకొనవలయును సత్తు, చిత్తు, ఆనందములు మూడున్ను ఆత్మ

లక్షణములుగాను, నామ రూపములు రెండున్ను మాయా రూపములుగను గ్రహింప నగును కావున కల్పితములగు నామ రూపములను త్యజించి ఆ కల్పితములగు సచ్చిదానందములే తన స్వరూపమునుగా నిశ్చయించు కొనవలయును

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాఽహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్తులకు హేతువులయిన స్థూల సూక్ష్మకారణ శరీరములను, ఆశరీర ధర్మములను, ఆ శరీరేంద్రియములను, ఇన్ద్రియముల ధర్మములను ఏ ఆత్మ స్వప్రకాశమై పై జెప్పినవాటిని ప్రకాశింపజేయుచు న్నదో అదియే ప్రజ్ఞానం బ్రహ్మయను మహావాక్యముచే నుపదేశింపబడిన యాత్మ యగును దానిని బ్రహ్మరూపముగా నెవడు తెలిసికొనుచున్నాడో, అతడు సమస్త బంధములనుండి విముక్తుడై జనన మరణ రహితమగు మోక్షమును పొందుచున్నాడు

**త్రిషు ధామసు యత్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః ।**
**స పూజ్యస్సర్వ భూతానాం వన్ద్య శ్చైష మహామునిః ॥**

జాగ్రత్స్వప్న సుషుప్తులనెడు మూడవస్థలకు సాక్షియగు నాత్మను ఎవడు తెలిసి కొనుచున్నాడో అట్టి మహాత్ముడు బ్రహ్మాది సర్వభూతముల కున్ను పూజ్యుడు అట్టి మహాత్ముడందఱిచేతను వందనార్హుడు అట్టి ముక్తుడే మహామునియు నగుచున్నాడు ఇప్పుడు శ్రీ భగవద్గీతలో తురీయాత్మ స్వరూపమే భగవత్స్వరూపమని యుపదేశించెడు కొన్ని శ్లోకములను నిరూపించెద ఏలన ఉపనిషదాది వేదాంత గ్రంథములను పఠించు వారు కొంత యరుదైనను భగవద్గీతను పారాయణము జేయని ముముక్షువులు లేరనియే చెప్పవచ్చును. అందువలన వారందఱున్ను జీవ బ్రహ్మల యేకత్వమునుగనుగొని తరించవలయునను తలంపుతో ఇది యిచ్చోట వ్రాయబడుచున్నది

**ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ మనోగతాన్**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥ (2 - 55)**

అన్తఃకరణములో గల సమస్తములయిన కోరికలను సంకల్పములను ఎప్పుడు యత్నపూర్వకముగా విడుచుచున్నాడో అప్పుడు వానిశుద్ధమైన ఆత్మ యగుచుండును అత్తరి అట్టి యాత్మయందే వాడు ఆనందించుచున్నాడు అప్పుడు స్థిరమైన జ్ఞానము గలవాడని చెప్పబడుచున్నాడు

'యదా కామాన్' అని ప్రయోగించుటచే అట్టి యాత్మవిముక్తి కొఱకు కాలపరిమితి లేదనియు, ఎప్పుడైతే అంతఃకరణవృత్తులనుండి విముక్తి గలుగునో అప్పుడే యనియు భావము ఎందుకనగా పూర్వ జన్మమనః పక్వాపక్వముల ననుసరించిగాని లేక వర్తమాన మందతీవ్ర వైరాగ్యముల ననుసరించిగాని కాలము సమీపదూరము లగుచుండును

**ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।**
**స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ (2 - 72)**

ఓ యర్జునా ఇది బ్రహ్మసంబంధమైన స్థితి (నిష్ఠ) ఈ నిష్ఠను పొందిన మోహమును జెందడు ఈ నిష్ఠయందు మరణ కాలమందైనను ఉండిన యెడల మోక్షమును పొందుచున్నాడు

"అన్తకాలేఽపి" అని ప్రయోగించుటచే దేహావసాన కాలమందైనను అట్టి యాత్మయందు పరమాత్మ భావన గలిగియున్నను చాలును అని కరుణతో శ్రీకృష్ణభగవానులుపదేశించిరి కావున ముముక్షువులారా! అంత్య కాలమెప్పుడు వచ్చునో ఎవరికిని తెలియడము కష్టము కాన ఇప్పటినుండియే అట్టి యాత్మయందు నిలకడ కలిగేలాగున అనుష్ఠానము చేయవలెను

**యస్త్వాత్మరతి రేవస్యా దాత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్యకార్యం న విద్యతే ॥ (3 - 17)**

ఏమానవుడైతే తన యాత్మయందే రమించువాడును, తనయాత్మ

లక్షణములుగాను, నామ రూపములు రెండున్ను మాయా రూపములుగను గ్రహింప నగును కావున కల్పితములగు నామ రూపములను త్యజించి ఆ కల్పితములగు సచ్చిదానందములే తన స్వరూపమునుగా నిశ్చయించు కొనవలయును

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాఽహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్తులకు హేతువులయిన స్థూల సూక్ష్మకారణ శరీరములను, ఆశరీర ధర్మములను, ఆ శరీరేంద్రియములను, ఇన్ద్రియముల ధర్మములను ఏ ఆత్మ స్వప్రకాశమై పై జెప్పినవాటిని ప్రకాశింపజేయుచు న్నదో అదియే ప్రజ్ఞానం బ్రహ్మయను మహావాక్యముచే నుపదేశింపబడిన యాత్మ యగును దానిని బ్రహ్మరూపముగా నెవడు తెలిసికొనుచున్నాడో, అతడు సమస్త బంధములనుండి విముక్తుడై జనన మరణ రహితమగు మోక్షమును పొందుచున్నాడు

**త్రిషు ధామసు యత్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః ।**
**స పూజ్యస్సర్వ భూతానాం వన్ద్య శ్చైష మహామునిః ॥**

జాగ్రత్స్వప్న సుషుప్తులనెడు మూడవస్థలకు సాక్షియగు నాత్మను ఎవడు తెలిసి కొనుచున్నాడో అట్టి మహాత్ముడు బ్రహ్మాది సర్వభూతముల కున్ను పూజ్యుడు అట్టి మహాత్ముడందఱిచేతను వందనార్హుడు అట్టి ముక్తుడే మహామునియు నగుచున్నాడు ఇప్పుడు శ్రీ భగవద్గీతలో తురీయాత్మ స్వరూపమే భగవత్స్వరూపమని యుపదేశించెడు కొన్ని శ్లోకములను నిరూపించెద ఏలన ఉపనిషదాది వేదాంత గ్రంధములను పఠించు వారు కొంత యరుదైనను భగవద్గీతను పారాయణము జేయని ముముక్షువులు లేరనియే చెప్పవచ్చును. అందువలన వారందఱున్ను జీవ బ్రహ్మల యేకత్వమునుగనుగొని తరించవలయునను తలంపుతో ఇది యిచ్చోట వ్రాయబడుచున్నది

దీని యర్థము గీతలో చెప్పినదియే యని గ్రహింపనగును కావుననే యుపనిషత్తుల యొక్క సారము గీతయని తెలుపడమైనది గీతలో ఆధ్యాత్మిక విషయ ముఖ్యశ్లోకములన్నియు ఫలాని యుపనిషత్తులలో ఫలాని శాస్త్రములలో గలవనునవి మహాభగవద్గీతలో చూడవచ్చును

ఈ మూడవ అధ్యాయమున కర్మయోగము నుపదేశించి, అదిచక్కగా నిష్కామముతో నాచరించుచుండిన అదే నైష్కర్మ్య సిద్ధిని గలుగజేయునని అధ్యాయాన్తమున గల యీ రెండు శ్లోకములచే నిరూపించడమైనది ఇందు వలన సత్య ధర్మముల నుండి జారక, నిష్కామ కర్మయోగమును చేయుచు రాగా రాగా అన్తఃకరణశుద్ధి గలిగి ఆత్మజ్ఞాన ప్రాప్తి గలుగునని తెలిసికొనం దగినది జనక మహారాజే దీనికి తార్కాణమని గ్రహించుకొనవలయును

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి ॥** **(4 - 36)**

పాపాత్ము లందఱికంటెను నీవు ఎక్కువ పాపముల నొనరించిన వాడ వైనను జ్ఞానమనెడి పడవచే పాపమనెడు సముద్రమును లెస్సగా దాట గలవు

జనులలో పాపముజేసిన వారు కొందఱుండవచ్చును అట్టివారలలో కొందఱు మేము ఫలాని పాపము జేసినవారమగుటచే దైవజ్ఞానమునకు ఎటుల అర్హులము గాగలమని భయపడియుండవచ్చును. అట్టి వారి భీతి నివృత్తికొఱకిటుల ఉపదేశించిరి ఇట్టి ప్రజ్ఞానమే బ్రహ్మమను జ్ఞానానుభ వము గలిగిన అనేక భయంకరములగు జలజంతువుల చేతను, కల్లోలముల చేతను గూడిన సాగరమును నావచే ఎట్లు దాటవచ్చునో ఆలాగున సముద్ర మంత పాపముజేసిన వారు గూడ ఇట్టి యాత్మ నిష్ఠలో నిలకడగలిగినచో తప్పక మోక్షమును పొందవచ్చును కావుననే "సన్తరిష్యసి" అని ప్రయోగింప బడెను అనగా లెస్సగా దాటవచ్చును సంశయము లేదు రోగులకొఱకు గదా ఔషధ మేర్పడినది? అయితే ఏకారణముచే రోగము గలిగెనో అట్టి కార్యమును మరల చేయకుండవలయును అదియే దీనిలోగల రహస్యము

లక్షణములుగాను, నామ రూపములు రెండున్ను మాయా రూపములుగను గ్రహింప నగును కావున కల్పితములగు నామ రూపములను త్యజించి ఆ కల్పితములగు సచ్చిదానందములే తన స్వరూపమునుగా నిశ్చయించు కొనవలయును

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాఽహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్తులకు హేతువులయిన స్థూల సూక్ష్మకారణ శరీరములను, ఆశరీర ధర్మములను, ఆ శరీరేంద్రియములను, ఇన్ద్రియముల ధర్మములను ఏ ఆత్మ స్వప్రకాశమై పై జెప్పినవాటిని ప్రకాశింపజేయుచు న్నదో అదియే ప్రజ్ఞానం బ్రహ్మయను మహావాక్యముచే నుపదేశింపబడిన యాత్మ యగును దానిని బ్రహ్మరూపముగా నెవడు తెలిసికొనుచున్నాడో, అతడు సమస్త బంధములనుండి విముక్తుడై జనన మరణ రహితమగు మోక్షమును పొందుచున్నాడు

**త్రిషు ధామసు యత్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః ।**
**స పూజ్యస్సర్వ భూతానాం వన్ద్య శ్చైష మహామునిః ॥**

జాగ్రత్స్వప్న సుషుప్తులనెడు మూడవస్థలకు సాక్షియగు నాత్మను ఎవడు తెలిసి కొనుచున్నాడో అట్టి మహాత్ముడు బ్రహ్మాది సర్వభూతముల కున్ను పూజ్యుడు అట్టి మహాత్ముడందఱిచేతను వందనార్హుడు అట్టి ముక్తుడే మహామునియు నగుచున్నాడు ఇప్పుడు శ్రీ భగవద్గీతలో తురీయాత్మ స్వరూపమే భగవత్స్వరూపమని యుపదేశించెడు కొన్ని శ్లోకములను నిరూపించెద ఏలన ఉపనిషదాది వేదాంత గ్రంధములను పఠించు వారు కొంత యరుదైనను భగవద్గీతను పారాయణము జేయని ముముక్షువులు లేరనియే చెప్పవచ్చును. అందువలన వారందఱున్ను జీవ బ్రహ్మల యేకత్వమునుగనుగొని తరించవలయునను తలంపుతో ఇది యిచ్చోట వ్రాయబడుచున్నది

ఈ విషయము క్రింది శ్లోకమున నిరూపించబోవుచున్నారు కావుననే ఈ శ్లోకారంభమున "శ్రద్ధావాన్" అని ప్రయోగించిరి

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేన్ద్రియః ।**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి ॥ (4 - 39)**

గురూపదిష్ట వేదాంత వాక్యార్థములయందు నమ్మకము గలవాడును, ఆ వాక్యార్థమును తెలిసికొని అనుష్ఠించుటయం దాసక్తి గలవాడు, జయింప బడిన యింద్రియములు గలవాడును అయిన పురుషుడు బ్రహ్మజ్ఞానమును పొందుచున్నాడు అట్టి జ్ఞానము పొందిన పిమ్మట సర్వోత్తమమయిన శాంతిని పొందుచున్నాడు

**యోఽన్తస్సుఖోఽన్తరారామః తథాఽన్తర్జ్యోతి రేవ యః ।**
**స యోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ (5 - 24)**

ఎవడాత్మయందానందించువాడో, ఆత్మయందు రమించువాడో, ఆలాగున ఎవడు అన్తరాత్మయందే ప్రకాశము గలవాడై యున్నాడో, అట్టి ధ్యానయోగపరుడు బ్రహ్మస్వరూపుడై బ్రహ్మనిర్వాణమును పొందుచున్నాడు

పరమాత్మయం దాత్మభావము గలుగునప్పుడు గలిగెడు ఆనంద మును గుఱించి యిచ్చట వర్ణించినారు ఇందుచే ఆత్మజ్ఞానము గలవాడా, లేనివాడా అని యొకరిని చూచి తెలిసికొనవచ్చును ఇంద్రియాది విషయ ములయందు రమించు వాని కాత్మానందము గలుగలేదనియు, ఆత్మా నందము గలిగిన బాహ్యసౌఖ్యముల యందు రమించడనియు తెలిసికొన వచ్చును

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ (13 - 28)**

బ్రహ్మాది స్తంబపర్యన్తములగు సమస్త వస్తువులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరు నెవడు సర్వము నశించినను నశింపని వానినిగా

చూచుచున్నాడో, వాడే చూచువాడు

తనయాత్మలో పరమాత్మను చూచువాడున్ను, దేహము నశించినను ఆత్మకు నాశము లేదని తెలిసికొనినవాడు మాత్రమే నేత్రము గలవాడగును తక్కిన వారు బాహ్యనేత్రము గలవారై యుండినను అంధులతో సమానులే ఏలన వారు చూచి కనుగొను వస్తువులన్నియు నశించునవే కాని నాశము లేని ఆత్మను, దైవమును కానని వారగుటచే కన్నులేని వారితో సములు కావుననే "యః పశ్యతి స పశ్యతి"అని ప్రయోగించిరి

**సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।**

**న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥ (13 - 29)**

సకల ప్రాణులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని సర్వసమునిగా తెలిసికొని తనచేత తనను చంపుకొనని వాడగుచున్నాడు అట్లు పరమాత్మను సమముగా సర్వములో తెలిసికొననివాడు తన యాత్మను తాను చంపుకొన్నవానితో సమానుడు అట్టి దైవమును సాక్షాత్కరించిన వాడు ముక్తుడగుచున్నాడు ఆత్మసాక్షాత్కారమును తెలిసికొనక మరణించు వాడు ఆత్మహత్యను చేసికొనిన వానితో సమానుడని భగవానుడు నుడివెను కావున అట్టి ఆత్మను తెలిసికొని దానియందు మరుపు గలుగక ముముక్షువు చూచుకొనవలయును అట్టివాడు మాత్రమే ఆత్మను చంపనివాడగును కావు ననే 'న హినస్త్యాత్మనాత్మానం'అని ప్రయోగించడమైనది

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**

**జన్మ మృత్యు జరాదుఃఖైర్విముక్తో ఽమృతమశ్నుతే ॥ (4 - 20)**

జీవుడు దేహోత్పత్తికి కారణ భూతములైన సత్త్వరజస్తమో గుణముల నతిక్రమించి జననము, మరణము, వార్ధక్యము, దుఃఖములు అనువాని చేత విడువబడినవాడై అమృతత్వమును పొందుచున్నాడు

సత్త్వరజస్తమములను మూడు గుణములు రహితములై విశుద్ధ

తత్త్వము గలుగునప్పుడే ముక్తి గలుగునని ముముక్షువులు నిశ్చయించుకొనవలయును కావుననే "గుణానేతానతీత్య త్రీన్" అని స్పష్టముగా తెలిపిరి ఈ మూడు గుణములయొక్క సంపుటమే మాయయనియు, మూల ప్రకృతియనియు విజ్ఞులు గ్రహించవలయును అందువల్లనే "దైవీ హ్యేషా గుణమయీ" అని తెలుపబడినది

**వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ (18 - 52)**

ఏకాంత ప్రదేశమున నుండువాడును, మితాహారుడును (కొద్ది ఆహారము గలవాడును) స్వాధీనము చేసికొనబడిన వాక్కు, కాయము, మనస్సు గలవాడును, ఇహపర భోగములయందు లెస్సగా వైరాగ్యము గలవాడును అయియుండువాడే ప్రకృతికి పరమగు ఈ తురీయాత్మను పొందగలుగును

ఎట్టి లక్షణములు గల వాడీయాత్మను సాక్షాత్కరింపగలుగునో, వాని లక్షణ మిశ్లోకమున భగవానులు తెలిపిరి ఇదే రీతిగా వేదాంత శాస్త్రములో గూడ తెలిపియున్నారు

**అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢం భవేత్।**
**శమాది సహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్ ॥**

ప్రజ్ఞానం బ్రహ్మ యను వాక్యము దృఢమగు వరకు శమదమాదులతో గూడిన వాడై శ్రవణ, మనన, నిదిధ్యాసములను అభ్యసించవలయును

**కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।**
**కచ్చిదజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ! ॥ (18 - 72)**

ఓ యర్జునా! నాచే చెప్పబడిన యీ గీతాశాస్త్రము నీచేత నిశ్చల చిత్తముతో వినబడినదా? ఓ ధనంజయా! అజ్ఞానముచే గలిగిన నీయొక్క మోహము సంపూర్ణముగా నశించినది గదా?

గీతోపదేశముయొక్క అన్త్య సమయమున భగవాను డుపదేశించిన ఈ వాక్యమును గురువు లందఱున్ను తమ శిష్యులను అడుగవలయును రోగిని చూచి రోగము నశించినదా, ఆరోగ్యము గలిగినదా అని అడుగవలసిన ధర్మము వైద్యులపై ఏలాగున ఆధారపడియున్నదో, భవరోగముతో నుండి బ్రహ్మవిచారమను ఔషధమును సేవించెడు ముముక్షువులను ఆలాగున ప్రశ్నించవలసిన ధర్మము ఆచార్యులపై నున్నది అయితే శిష్యుని లక్షణ మెటుల నుండవలయునో, అది యిచ్చోట నిరూపితమాయెను "త్వయైకా గ్రేణ చేతసా" ఏకాగ్ర చిత్తముతో పరాఙ్ముఖుడవుగాక వింటివా? అదియే దీనిలో గల సారము

నష్టో మోహస్స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత।
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ ॥ (18 - 73)

ఓ కృష్ణమూర్తీ! నీ యనుగ్రహమువలన నాచేత జ్ఞానము పొందబడి నది అజ్ఞానము నశించినది సంశయరహితుడనై సుస్థిరుడనై యుంటు న్నాను నీయొక్క యాజ్ఞను పాలించెదను

ఇప్పుడు ఆత్మజ్ఞాన విషయమై గీతలో చెప్పిన ముఖ్యభావములలో కొన్ని ఇచ్చట నిరూపించబడినవి "స్మృతిర్లబ్ధా"అని అర్జునుడు చెప్పిన వాక్యమే గీతాప్రబోధముచే గలిగిన ప్రయోజనము స్మృతిశబ్దమునకు మరచిన దానిని మరల జ్ఞాపకమునకు తెచ్చుకొనుటయని భావము ఎవరైన స్మృతి తప్పి పడిపోయిన పిమ్మట జ్ఞాపకము వచ్చునప్పుడు మరల స్మృతి గలిగినది అని చెప్పుట ఎటుల వాడుకలోనున్నదో, ఆలాగున అర్జునునకు ఏ స్మృతి గలిగనది అని యిచ్చోట నిరూపించవలసియున్నది స్మృతి తప్పియున్నప్పుడు గాని, స్మృతితప్పి గాఢముగా నిద్రలో నున్నప్పుడుగాని ఎవరికిని తానెవడు, ఎచ్చట నుంటున్నాడు, దేని కొఱకు ఇచ్చటికి వచ్చుట సంభవించినది తెలియదు. స్మృతి గలిగిన పిమ్మటను, సుషుప్తి నుండి జాగ్రత్తకు వచ్చిన తర్వాతను తాను ఫలానివాడు, ఫలాని స్థలమున నుంటున్నాను, ఫలాని

కార్యముకొఱకు నిచ్చటికి వచ్చితిని అని యెటుల తెలిసికొనుచున్నాడో ఆలాగున అజ్ఞానావస్థలో మాయామోహమువలన తన యాత్మస్వరూపము మరువు గలవానికి సద్గురూపదేశముచే "ప్రజ్ఞానం బ్రహ్మ"యను నిజబోధ గలుగవలెను రెండవ అధ్యాయములో కృష్ణభగవానుడు ఈ సత్యమునే యర్జుననిగురించి యుపదేశించినది అట్టిదిప్పుడు ఫలమునకు వచ్చెను

నైనం ఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥ (2 - 23)

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్యస్సర్వ గతస్థాణు రచలోఽయం సనాతనః ॥ (2 - 24)

ఈ యాత్మను శస్త్రములు ఛేదింపలేవు అగ్నిహోత్రుడు ఈ యాత్మను కాల్పజాలడు ఉదకములు ఈ ఆత్మను తడుపజాలవు వాయువు ఈ ఆత్మను నెండింపజాలదు ఈ ఆత్మ ఛేదింపదగినవాడు కాదు ఈ ఆత్మ దహింపదగినవాడు కాడు ఈ యాత్మ త్రికాలముల యందు నేకరీతిగా నుండువాడు సర్వవ్యాపకుడు. నిశ్చలుడు, చలింపని వాడు, అనాదియైన వాడు, సనాతనుడు ఈ స్థితిన పొందడమే సనాతన ధర్మముయొక్క లక్ష్యము ఈ యుపదేశ వాక్యము ఫలవంతమైనటుల ముముక్షువు లుండవలయును "కరిష్యే వచనం తవ" అని అర్జునుడు చెప్పి నటుల నాత్మప్రబోధము గలిగిన పిమ్మటనే యతనికి గురుదేవునిచే ప్రేరేపింపబడిన లోకోద్ధారక విషయములోగాని, ఆశ్రమాది ధర్మస్థాపనల నిర్వహించెడు విషయములుగాని సామర్థ్యము గలుగునని సాధకులు గ్రహించుకొనవలయును అయినచో ఆత్మజ్ఞానము గలిగిన గురుదేవునితో మనకేమి సంబంధమని తలంచి తిరుగకూడదనియు, గురుదేవుని యాజ్ఞను పాలించవలయుననియు దీనిచే గ్రాహ్యమగుచున్నది అందుచేతనే అర్జు నుడు "కరిష్యే వచనం తవ" అని తన కృతజ్ఞతను వెలిబుచ్చెను ఇదియే యుత్తములగు గురుశిష్యుల ధర్మమని గ్రహింపనగును

మరియు సర్ప విషముచేగాని లేక గ్రహావేశముచేగాని స్మృతి తప్పి పోవుట గలదు విషవైద్యుని మన్త్రప్రభావముచేతను, మాంత్రికుని మంత్ర బలముచేతను విషము నశించి గ్రహము వదలునప్పుడు ఏలాగున తమ యొక్క స్వభావజ్ఞానము గలుగుచున్నదో ఆలాగున అజ్ఞాన సర్పదష్టుడున్ను మాయా గ్రహావిష్ట మనుజుడున్ను అజ్ఞానముచేతను మాయామోహాము చేతను తన్ను తెలియని వాడైనను గురుదేవుని యాత్మోపదేశమువలన నిజ స్వరూపమగు ప్రజ్ఞానంబ్రహ్మయను ఆత్మబోధలోనికి రావలయును అప్పుడే తనపని పూర్తియయినటుల నిశ్చయించుకొనవలయును

ఇప్పుడు కొన్ని శాస్త్రవాక్యములను నిరూపించెద ఇవన్నియు ప్రజ్ఞానం బ్రహ్మయను వాక్యమును దృఢీకరించుచున్నవి

**యథా వహ్నిర్మహాదీప్తః శుష్కమార్ద్రం చ నిర్దహేత్।**
**తథా శుభాశుభం కర్మ జ్ఞానాగ్ని ర్దహతి క్షణాత్॥**

ఏలాగున బాగుగా వెలుగుచుండు అగ్ని ఎండినవి, ఎండనివి యగు కట్టెల భస్మమొనరించుచుండునో, ఆలాగున జ్ఞానాగ్ని ప్రజ్వలించినచో, పుణ్యా పాపములనెడు కర్మలను గూడ భస్మమొనరించుననిచెప్పుటలో కొందఱికి సందేహము గలుగవచ్చును పుణ్యాకర్మగూడ పునర్జన్మహేతువగుటచే జ్ఞానాగ్నియందు పునర్జన్మ కారణమగునట్టి కర్మగూడ భస్మమగుచున్నది అయితే ఈశ్వరార్పణ బుద్ధితో చేయబడిన విశేష పుణ్యాకర్మలచేత మాత్రమే జ్ఞానోదయమగును కామ్యకర్మ పుణ్యామైనచో నది స్వర్గలోకప్రాప్తిని గలుగజేసి మంచి జన్మమును మాత్రము గలుగజేయును జన్మము గలిగిన జనన మరణాది దుఃఖము లుండుటచే దానిని గూడ జ్ఞానాగ్ని భస్మమొనరించును పుణ్యాకర్మచే స్వర్గలోకప్రాప్తియు, ఆత్మజ్ఞానముచే మోక్షమున్ను గలుగును అయితే పుణ్యాకర్మలు చేయనిచో అన్తఃకరణశుద్ధి గలుగదు అప్పుడాత్మ జ్ఞానముగూడ ఉదయించదు కావున ఫలాపేక్షారహితమైన పుణ్యాకర్మలను జేయవలెను

**వస్త్వైకత్వం మహావాక్యాదేవ జానన్తి యే జనాః ।**
**తే ముచ్యన్తే హి సంసారాత్ యథా స్వప్న ప్రబోధవత్॥**

ఎవరైతే మహావాక్యముచేత ఏకమగు సద్వస్తువును తెలిసికొనెదరో అట్టి జ్ఞానులు ఈ సంసారదుఃఖమునుండి ముక్తులగుదురు అత్తటి స్వప్నము నుండి జాగ్రదవస్థకు వచ్చిన వారికి కలలో గనినవన్నియు ఏలాగున మిథ్య యని బోధగలుగునో వీరికిన్ని ప్రబోధజ్ఞానము గలుగునప్పు డీసంసార కార్యములన్నియు మిథ్యా భూతములని జ్ఞానముదయించును

**జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణోవాఽన్త్యజోఽపి వా ।**
**సంసార సాగరం తీర్త్వా ముక్తిపారం హి గచ్ఛతి ॥**

ఆత్మయజ్ఞమనెడు తెప్పచే బ్రాహ్మణుడుగాని, అన్త్యజుడుగాని యెవడైనను ఈ సంసార దుఃఖమనెడు సాగరమును తరించి మోక్షమనెడు దరిని జేరగలడు

ఓడలో ప్రయాణముజేయువారు బ్రాహ్మణులుగాని, అబ్రాహ్మణులు గాని, స్త్రీలుగాని, పురుషులుగాని మరియెవరైనను ఏలాగున సముద్రమును దాటగలరో, ఆత్మజ్ఞానస్థితియు అట్టిదే

**పుష్పే గంధం తిలే తైలం కాష్ఠేఽగ్నిం పయసి ఘృతమ్ ।**
**ఇక్షౌ గుడం తథా దేహే పశ్యాత్మానం వివేకతః ॥**

పుష్పమునందు సుగంధమువలెను, తిలములలో తైలమువలెను, కట్టెలలో అగ్నివలెను, క్షీరమందు నవనీతమువలెను, చెరుకునందు చక్కెర వలెను, దేహమందు పరమాత్మ వ్యాపించియున్నది వివేక జ్ఞానముచే నాత్మలో వ్యాపించియుండు పరమాత్మను దర్శించవలెను

ఆత్మయొకటియే లేక ఈశ్వరుడొకడే తనలోనుండిన ఏల కనపడ లేదను ప్రశ్నకు సమాధానము చెప్పబడినది పుష్పమున సుగంధ వాసన యుండియు, తిలములో తైలముండియు, కట్టెలలో నిప్పుండియు, పాలలో

నెయ్యి యుండియు, చెరకున బెల్లముండియు ఏలాగున కనపడక యుండునో, చేయవలసిన క్రియలచే ఏలాగున సుగంధము, నూనె, నిప్పు, నెయ్యి, బెల్లము ప్రత్యక్షముగా గోచరమగుచున్నవో ఆలాగున జ్ఞానతపస్సులచే దేహములో నుండు దేహిని ఈశ్వరుని చూడగలము

**ఆనంద రూపమాత్మానమజ్ఞాత్వైవ పృథగ్జనః ।**
**బహిస్సుఖాయ యతతే న తు కశ్చిద్విదన్ బుధః ॥**

సచ్చిదానంద రూపమగు తనలోనున్న యాత్మను తెలిసికొనకపోవుట చేతనే సామాన్య జనులు బాహ్యసుఖమునకై యత్నము జేయుచుందురు ప్రబుద్ధుడైన ఆలాగున జేయడు అనగా ఆత్మసుఖము నెరుంగని కారణముచేతనే బాహ్యసుఖమునకై నిరంతరము ప్రయత్నించు చుందురు

**అజ్ఞాత్వైవ హి నిక్షేపం భిక్షామటతి దుర్మతిః ।**
**స్వవేశ్మని నిధిం జ్ఞాత్వా కో ను భిక్షామటేత్సుధీః ॥**

ఒకనియింటిలో గొప్పధననిక్షేప మొకటి యుండెను కాని వాడు అద్దానిని తెలియకున్నందుచే దుఃఖజీవితముతో గూడినవాడై కూలినాలి పనులకు తిరుగుచు భిక్షాటనము జేయుట మొదలగు వాటి నాచరించుచూ దీనదశలో నుండెను దైవవశముచేగాని, నిధిజ్ఞుల సహాయముచేగాని ఆ నిధిని తెలిసి కొనిన నేలాగున పూర్వము జెప్పిన దీనకృత్యములను మాని శ్రీమంతుడై సుఖముగా జీవింపగలుగునో యాలాగుననే తన హృదయాంతరాళములో గల దైవజ్ఞాననిధిని తెలిసికొనిన సుఖింతురు లేని యెడల దుర్మతులై దుఃఖమును పొందుదురు నిర్మల బుద్ధి గలవారెవరైనను ఆలాగున చేయరు

స్వగృహములో నిధి యుండియు, దానిపైన నివసించియు, అది లభించని కారణముచే దీనజీవితము గడుపవలసి వచ్చెను సిద్ధించిన పిమ్మట ఏలాగు సుఖజీవితము గడుపునో, ఆత్మజ్ఞానము గలుగుటకు పూర్వమున్ను గలిగిన పిమ్మట కూడ ఇట్టి తారతమ్యము గలుగుచుండును అదియే దానికి గురుతు

**బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రశ్చండాల ఏవ చ ।**
**దృఢాభ్యాస కరో నిత్యం పునర్జన్మ న విన్దతి ॥**

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అన్త్యజులగు వారెవరైనను చలించని బ్రహ్మనిష్ఠాభ్యాసముచేత నిత్యముండిరేని, వారికి పునర్జన్మ లేదు

భూమియందు మంచి విత్తనమును విత్తి చక్కగా పోషించినచో సర్వ జాతి స్త్రీ పురుషులందఱికిని సమానమైన ఫలమెటుల గలుగునో అట్లే హృదయ క్షేత్రమందు బ్రహ్మబీజము నుంచి చక్కగా సంరక్షించు వారెవరైనను వారు బ్రహ్మానందమగు జ్ఞానఫలమును పొందగలరు

**అసంశయవతాం ముక్తిః సంశయావిష్టచేతసామ్ ।**
**న ముక్తిర్జన్మజన్మాంతే తస్మాద్విశ్వాసమాప్నుయాత్ ॥**

ఈ బ్రహ్మనిష్ఠయందు గురుదైవ శాస్త్రములయందు దృఢమైన విశ్వాసము గలిగి యనుష్ఠించువారికి మాత్రమే మోక్షము గలుగును గురు వాక్యమందుగాని, దైవమందుగాని, వేదాంత శాస్త్రమందుగాని సంశయము గలవారికి ఎన్ని జన్మములకైన మోక్షము గలుగదు

**క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే జలం జలే ।**
**సంయుక్తమేకతాం యాతి తథాఽఽత్మన్యాత్మవిన్మునిః ॥**

పాలలో పాలున్ను, నూనెలో నూనెయు, నీటిలో నీరు ఏలాగున కలిపిన ఏకత్వము పొందుచున్నదో, ఆలాగున ఆత్మవేత్తయగు మునియు పరమాత్మ యందైక్యమును పొందుచున్నాడు

నీటిలో నీరు మాత్రమే కలియునుగాని నూనె యేలాగున కలియ జాలక వేరుగా నిలుచునో, ఆలాగున పరమాత్మవస్తువు ఎంత శుద్ధ మైనదో జీవాత్మయు ఆలాగున శుద్ధమగునప్పుడు మాత్రమే శివజీవైక్యముగాని, జీవేశ్వరైక్యముగాని, ఆత్మపరమాత్మల యైక్యముగాని గలుగునని బుద్ధి మంతులు తెలిసికొనవలయును కొందఱికి ధ్యానములో ఐక్యజ్ఞానము

గలుగకపోవుటకున్ను, ధ్యానములో దైవానుభవము గలుగక పోవుటకున్ను, కట్టకడకు మనస్సైనను సంకల్పరహితమై ధ్యానములో నిలువక పోవుటకున్ను కారణమిదియే

**స ఆత్మా స హి విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః ।**
**తుర్యాత్మజ్ఞానహీనానాం న ముక్తిస్స్యాత్కదాచన ॥**

తురీయుడగు ఏయాత్మ పరమాత్మయని శ్రుతులు తెలుపుచున్నవో అట్టియాత్మయే ముముక్షువు లందఱిచేతను తెలిసికోదగినది ఇదియే ప్రజ్ఞానం బ్రహ్మయని వేదాంత ముపదేశించుచున్నది అట్టి తురీయుడగు ఆత్మను తెలియనివారెవరికిని ఒకానొకప్పుడున్ను మోక్షము గలుగదు

**పంచకోశపరిత్యాగే సాక్షిబోధావశేషతః ।**
**స్వస్వరూపం స ఏవ స్యాత్ శూన్యత్వం తస్య దుర్ఘటమ్ ॥**

ఆత్మానాత్మ విచారణచే అనాత్మ రూపములగు పంచకోశములను త్యజింపగా సాక్షి రూపమగు బోధజ్ఞానము మాత్రము శేషించును దానినే స్వస్వరూపమని తెలియందగినది పంచకోశములను, దేహత్రయమును, దృశ్యమును, ఇంద్రియ ధర్మములను, వృత్తులను అది ప్రకాశింపజేయున దగుటచే శూన్యత్వము ఘటించదు ఈ సత్యమును తెలిసికొనక పోవుటయే 'ఎరుక మరచి పోవలయు'నని చెప్పెడివాక్యములో గల రహస్యము ఎరుక లేనిచో మృతశరీరము, సుషుప్తి గాఢ నిద్రల యవస్థయే గలుగును అయితే ఎరుకను విడువవలయునని శాస్త్రములో కొన్ని వాక్యములు గలవు దానికి మలిన చిత్తమును త్యజింపవలయుననియు, జీవభ్రాన్తి నుపేక్షించ వలయున నియు అర్థమే యగును అనగా శుద్ధమనస్సు గలిగి అజ్ఞానమును పారద్రోల వలయునని భావము అప్పుడు మిగులునది పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే యగును

**దేహాభిమానం విధ్వస్య ధ్యానాదాత్మానమవ్యయమ్ ।**
**పశ్యన్ మర్త్యోఽమృతో భూత్వా హ్యత్ర బ్రహ్మసమశ్నుతే ॥**

ఏ ఎరుకను విడువవలయునో, ఏ పరిపూర్ణమును పొందవలెనో దానిని ఈ శ్లోకము తెలుపుచున్నది ధ్యానముచే నాశరహితమగు పరిపూర్ణాత్మను పొంది దేహాభిమానమనెడు మలిన మనస్సును త్యజించవలెను అట్టిమర్త్యుడు అమృతుడగుచున్నాడు అనగా జనన మరణ రాహిత్యమును పొందుచు న్నాడు అట్టి మహాత్ముడు ఇచ్చటనే బ్రహ్మసుఖము నొందుచున్నాడు

**వహ్నేరివౌష్ణ్యం సౌగన్ధ్యం కుసుమస్యేవ సర్వదా ।**
**అవినాభావి విమలం రవేరివ చ వాసరమ్ ॥**

అగ్నికి ఉష్ణత్వమువలెను, పుష్పమునకు సుగంధమువలెను, సూర్యు నకు ప్రకాశవంతమగు నిర్మలమగు దినమువలెను, జీవన్ముక్తున కీసత్కర్మ స్వభావమైయుండి వాని నెల్లప్పుడును వీడకయుండును ఈ సత్యమును తెలిసికొనజాలక శాస్త్రవిచారణ జేయని కొందఱు, సాధువులైన తర్వాత వారికి పుణ్యకర్మ యేల? సదాచార మేల? యని పలుకుచుందురు అవినాభావ మనగా ఒకదానిని మరియొకటి విడువక యుండునదని భావము కావుననే పుణ్యజీవులగు జీవన్ముక్తులు ఎల్లప్పుడును సత్కర్మలను చేయుచుందురు ఎటులనగా శ్రీగంధవృక్షము సుగంధమును, చంద్రుడు చంద్రికను, నువ్వులు నూనెను ఎల్లప్పుడును ఎటుల గలిగియున్నవో పుణ్యా త్ములగు మహనీయాత్ములెల్లరు ఎల్లప్పుడును పరప్రాణులకు మేలు కలుగ జేయుచునే యుందురు దీనిని గుర్తించిన పుణ్యాత్ములయొక్కయు, పుణ్యా త్ములు కానివారియొక్కయు స్థితిని తెలిసికొనవచ్చును

**మర్త్యోఽహమితి సన్ధాయ మ్రియతే జాయతే చ సః ।**
**బ్రహ్మోఽహమితి సన్ధాయ ముచ్యతే న చ జాయతే ॥**

మర్త్యుడని, అనగా నీ దేహముతో కూడుకొన్న వాడనని యెంతవరకు తనను తలంచునో, అంతవరకు జన్మించుటయు మరణించుటయు తప్పక గలుగుచుండును దేహేంద్రియములకు సాక్షియై యుండు ప్రజ్ఞానం బ్రహ్మ అనుదాని యనుసన్ధానమువలన అతడు ముక్తుడగుచున్నాడు మరల

జన్మింపడు

మరణించువాడగుట చేతనే మర్త్యుడని పేరు గలిగెను ఈ మరణము దేహమునకే కాని ఆత్మకు లేదనియు, అట్టి ఆత్మయే పరబ్రహ్మమనియు బోధగలవాడు అట్టి బ్రహ్మమునే పొందుచున్నాడు

**కర్తవ్యమేతద్విజ్ఞానమితి వేదానుశాసనమ్ ।**
**అస్యాతి లంఘనే దోషః సంసారానర్థ సంగతిః ॥**

పైజెప్పిన బ్రహ్మానుసంధానమే జీవులకు కర్తవ్యమని వేదము శాసించు చున్నది దీనినుల్లంఘించిన సంసారానర్థ సంకటములను దోషమును తప్పక జీవుడు పొందవలసి యుండును

**దృక్స్వరూపే స్థిరం కుర్యాదదృశ్యం దృశ్యమేవ హి।**
**తదేవత్వం విజానీయాత్ జ్ఞానం జ్ఞేయం పరం పదమ్ ॥**

దృక్కైన యే యాత్మ ప్రజ్ఞానంబ్రహ్మయని యుపనిషత్తు లుపదేశించుచున్నవో, దానియందు సుస్థిరత గలిగేలాగున సాధకుడ భ్యాసము చేసికొనవలయును అట్లైన నీ దృశ్యమంతయు అదృశ్యమగును అదియే నీ యొక్క స్వరూపమని వేదాంత విజ్ఞానముచే తెలిసికొనందగినది దానికే జ్ఞానమనియు, జ్ఞేయమనియు, పరమ పదమనియు పేర్లు

"అదృశ్యం దృశ్యమేవ హి" అని చెప్పుటచే దృశ్యమంతర్ధానమై కనపడక పోవుటయని యర్థము కాదు దృశ్యరూపము భ్రాన్తిచే ఈ నామ రూప వికారములను గలిగియున్న బ్రహ్మయందిది కల్పితము. రజ్జువునందు సర్పము వలెను, స్థాణువునందు పురుషుని వలెను, శుక్తియందు రజతము వలెను, ఆకాశ మందు నీలిమవలెను, మరుమరీచికలందు జలమువలెను అవిచారముచే తోచుచున్నవి ఈ విషయములన్నియు ఇదివరలో వ్రాయ బడిన సీతారామాంజనేయ, అపరోక్షానుభూతి గ్రంధాశయముల వలన తెలిసి కొనవచ్చును

**ప్రజ్ఞామాత్రమిదం సర్వం నాన్యదస్తీతి నిశ్చయః ।**
**తదేవ త్వం తదేవ త్వం తదేవ త్వం మహామునే ॥**

ఓ మహామునియగు మననశీలుడా! ఇదంతయు ప్రజ్ఞానము మాత్రమే యగును దానికన్యమగునది కొంచెమైనను లేదు ఇదియే వేదాంత నిశ్చయము ప్రజ్ఞానమే యాత్మయగును అదియే నీయొక్క స్వరూపము అదియే నీయొక్క స్వరూపము అదియే నీ యొక్క స్వరూపము

దానిని మరుపు గలుగనీయక చూచుకొనుము "తదేవ త్వం" అని ముమ్మారు ప్రయోగించుటచే తత్త్వమసి మహావాక్య ముపదేశింపబడినది 'తత్-త్వం-అసి' ఈ మూడు పదములు జీవబ్రహ్మల యేకత్వమును బోధించుచున్నవి దీనిని గ్రహించుకొనిన చాలును

**కామ ఏవ మనుష్యాణాం పిధానం బ్రహ్మబోధనే ।**
**తస్మాత్కామం త్యజన్ధీరో జ్ఞానమాప్నోతి మోక్షదమ్ ॥**

మోక్షమార్గములో మనుష్యులకు విషయాసక్తియే గొప్ప ప్రతిబంధ ముగా నేర్పడియున్నది అందువలన అట్టి కామమును త్యజించునట్టి ధీరుడు జ్ఞానమును పొందును అదియే మోక్షమును గలిగించును

**లోకయాత్రాం ప్రయత్నేన వర్జయేదాత్మచిన్తకః ।**
**నాన్యోపనిషదం విద్యామభ్యసేన్ముక్తి హైతుకీమ్ ॥**

ఆత్మనిష్ఠగలవాడు ప్రయత్న పూర్వకముగా లోకవ్యవహారములను తగ్గించుకొనవలయును బ్రహ్మమును బోధించెడు ఉపనిషద్విద్యను తప్పక పఠించవలయును అది మోక్షమును గలుగజేయును

విద్యావాసన గూడ వాసనాత్రయముతో గూడినదని కొందఱు వచింతురు వాసనాత్రయమనగా 1 లోకవాసన, 2 శాస్త్రవాసన, 3 దేహ వాసనలని శాస్త్రనిర్ణయము లోకవాసనా దేహ వాసనలేలాగున విడువదగినవో ఆలాగున నీ శాస్త్రవాసన గూడ విడువందగినదని వారి మతము కావుననే

"నాన్యోపనిషదం విద్యామభ్యసేన్ముక్తిహైతుకీమ్" దీనివలన నుపనిషత్తుల యొక్క విద్యను అభ్యసించవలయుననియు, అది ముక్తికి హేతువనియు చెప్పుటవలన అదెల్లప్పుడున్ను నిర్వాసనను ఉపదేశించునదగుటచే అది శాస్త్ర వాసనకు సంబంధించినది కాదు శ్రీ భగవద్గీత మొదలయిన ఆత్మ జ్ఞాన విద్యను పఠించవలసినదే అది యుపనిషద్విద్యయే యగును

**జపాజ్జ్ఞానాత్తథా ధ్యానాత్ నాన్యద్భిక్షోస్తు శోధనమ్ ।**
**తస్మాత్తాని సదా కుర్యాత్ యతిః శుద్ధ్యర్థమాత్మనః ॥**

ముక్తిని నిచ్ఛయించువానికి ఆత్మశుద్ధి గలుగుటకొఱకు ప్రణవాది జపము, ఆత్మజ్ఞానము, ధ్యానము, వీటికన్న అధికమయినది మఱియొకటి లేదు కావున ఆత్మశుద్ధిని నిచ్ఛయించెడు యతియు పై జెప్పిన మూటిని ఎల్లప్పు డభ్యసింపవలయును

**దారిద్ర్యాశా యథా నాస్తి సంపన్నస్య తథా మమ ।**
**బ్రహ్మానన్దే నిమగ్నస్య విషయాశా న తద్భవేత్॥**

శ్రీమంతునికేలాగున బీదవాడు కావలయునని తలంపు ఉండదో ఆలాగున బ్రహ్మానన్దామృత సాగరమున మునిగినవానికి విషయాశ యుం డదు అదియే యాత్మజ్ఞానామృతమును పానము జేసి తృప్తిని పొందిన వాని యొక్క గురుతు అని గ్రహింపనగును దీనిని తెలిసికొనిన ఆత్మజ్ఞానామృత మును అనుభవించిన వాడు అగునా కాదా యని గ్రహించుకొనవచ్చును

**విషం దృష్ట్వాఽమృతం దృష్ట్వా విషం త్యజతి బుద్ధిమాన్ ।**
**ఆత్మానమపి దృష్ట్వాఽహమనాత్మానం త్యజామ్యహమ్ ॥**

ఇది యమృతము, ఇది విషము అని తెలిసిన బుద్ధిమంతుడైతే విష మును త్యజించి యమృతమును గ్రహించును ఆలాగున ఆత్మానాత్మలలో గల అమృతత్వ విషయత్వముల నెరింగిన వాడు అనాత్మను విడిచి ఆత్మనే గ్రహించును. అదియే తెలిసినదానియొక్క గురుతు దీనివల్లను ఆత్మా

నాత్మల జ్ఞానమును తెలిసిన వాడా కాడా యని వారి ప్రవృత్తివలననే గ్రహించుకొనవచ్చును

**కామక్రోధాది సంసర్గాదశుద్ధం జాయతే మనః ।**
**అశుద్ధే మనసి బ్రహ్మ జ్ఞానం తచ్చ వినశ్యతి ॥**

కామక్రోధాది సంసర్గమువలన మనస్సు మాలిన్యమ్మును పొందుచున్నది అట్టి యశుద్ధమయిన మనస్సులో బ్రహ్మజ్ఞానమును నశించుచున్నది కావున అట్టి అపవిత్రతను పవిత్ర చింతనగల వారెవ్వరును తమలో చేర నీయక చూచుచుండవలయును

**మనోవాక్కాయ శుద్ధానాం రాజంస్తీర్థం పదే పదే ।**
**తథా మలినచిత్తానాం గంగాఽపి కీకటాధికా ॥**

మనోవాక్కాయ శుద్ధి గలవాడు గొప్ప తీర్థస్వరూపుడే అంతియేగాదు అట్టి మహాత్ముడు నడిచెడు ప్రతి అడుగడుగున్ను పుణ్యతీర్థమే యగును ఆలాగున మనోవాక్కాయ కర్మలు శుద్ధముగా లేనివారు గంగాతీరములో నివసించినను అది మహాపాతక దేశమువంటిదే యగును లేక మనోవాక్కాయ శుద్ధిలేనివాడు గంగలో స్నానమాచరించినను పాతక భూమిలో గల మలిన జలమున మునిగిన వానిగతియే అతనికి లభించును

**ఇదం తీర్థమిదం తీర్థం భ్రమన్తి తామసా జనాః ।**
**ఆత్మతీర్థం న జానన్తి కథం మోక్షః శృణు ప్రియే ॥**

ఓ పార్వతీ! యీ తీర్థములో స్నానమాచరించిన పుణ్యము గలుగును, ఈ తీర్థములో స్నానమాచరించిన మోక్షము గలుగును అని ఒకొక్క తీర్థ స్నానమునకై పరుగెత్తెడు మానవులు భ్రమకు లోపడినవారు వారు ఆత్మ తీర్థముయొక్క మాహాత్మ్యమును నెఱుంగజాలరు అట్టి ఆత్మజ్ఞాన తీర్థములో స్నానమాచరించని వారికి జ్ఞానమెటుల గల్గును? అని పరమ శివుండు పార్వతీ దేవికుపదేశించెను ఇదే విధమున భీష్ముడు ధర్మరాజునకు తీర్థముల

మాహాత్మ్యములను జెప్పి కట్టకడకు ఈ క్రింది విధముగా నుపదేశించెను

**ఆత్మానదీ సంయమతోయపూర్ణా సత్యహ్రదా శీలతటా దయోర్మిః ।**
**తత్రావగాహం కురు పాండుపుత్ర న హ్యన్యథా శుద్ధ్యతి చాన్తరాత్మా ॥**

సంయమమను జలముతో నిండినదియు, సత్యమను అగాధము గలదియు, సుశీలమను దరి గలదియు, దయయను అలలు గలదియగు ఆత్మయను నదియందు ఓ పాండుపుత్రా! స్నాన మాచరించుము వేరు ఏ విధములగు తీర్థములలో స్నానమాచరించినను అంతరాత్మ శుద్ధి కాజాలదు

తీర్థయాత్రయందు భ్రమపడి తిరిగెడు వారు ఈ భీష్ముని వాక్యమును బాగుగా జ్ఞాపకములో నుంచదగినది

**కామానాం హృదయే వాసః సంసార ఇతి కీర్తితః ।**
**తేషాం సర్వాత్మనా నాశో మోక్ష ఉక్తో మనీషిభిః ॥**

కామక్రోధ విషయాది వాసనలు ఎవని హృదయములో నుండునో అదియే సంసారము అట్టి విషయాది దోషము లెవరి హృదయమందు సంపూర్ణముగా నశించునో అట్టి స్థితియే మోక్షమని మహర్షులు చెప్పిరి కావున సన్న్యాసమట్టిది, సంసారమిట్టిది, ఏకాంత వాసమిట్టిది, గృహస్థాశ్రమ నివాస మిట్టిది యను సత్యము దీనిచే తెలిసికొనవచ్చును

**శ్రద్ధావినయ సంయుక్తః శాన్తి దాన్త్యాదిసంయుతః ।**
**యావత్ జ్ఞానోదయస్తావత్ వేదాన్తార్థం నిరూపయేత్॥**

శ్రద్ధా వినయములతో గూడినవాడున్ను, శమదమాదులు గలిగిన వాడున్ను ఎంతవరకాత్మ జ్ఞానోదయము గలుగలేదో అంతవరకు వేదాంతార్థముయొక్క శ్రవణ మనన నిదిధ్యాసములను చేయుచుండవలయును

**అన్తఃకరణ సంయోగాత్ జీవ ఇత్యుచ్యతే చ యః ।**
**అవిద్యా కార్యరహితః పరమాత్మేతి గీయతే ॥**

అన్తఃకరణములో గల మాలిన్యముతో గూడియుండినప్పు డాపరమా

త్మయే జీవత్వమును పొందుచున్నది మరల అవిద్యా సంబంధములయిన కార్యములు నశించినప్పుడు అట్టి జీవాత్మయే పరమాత్మయగును

**స్వాధ్యాయాద్యోగ మాసీత యోగాత్స్వాధ్యాయమానయేత్ ।**
**స్వాధ్యాయయోగ సంపత్త్యా పరమాత్మా ప్రకాశతే ॥**

ఉపనిషత్పఠనముతో యోగము ననుష్ఠించవలయును యోగముతో ఉపనిషత్పఠనము గూడ చేయవలయును ఈ స్వాధ్యాయయోగ సంపత్తులచే పరమాత్మ ప్రకాశించును మరియొక విధముగా వేదసారమగు ఓంకారమును జపించి, యోగసాధన జేయవలెను యోగానుష్ఠానము చేయువాడు ప్రణవమునందు లయము నొందవలయును ఈ ఓంకార ధ్యానమున్ను, ఆత్మ సంయమ యోగమున్ను గలవాడే పరమాత్మను చూడగలుగును

**బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థోఽథవా యతిః ।**
**యది స్యాత్సంయతాత్మా చ స నూనం ముక్తిమాప్నుయాత్ ॥**

బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, సన్న్యాసియైనను, మరియెవడైనను మనస్సంయమము లెస్సగా గలిగెనేని అతడు తప్పక మోక్షమును పొందగలుగును ఇందువల్ల ఎవడైన ఆత్మశుద్ధి గలిగి మనోనిగ్రహము గలిగి బ్రహ్మవిచారము చేయుచుండిన మోక్షమును పొందగలుగును అని భావము

**సంసారార్ణవమగ్నానాం జన్తూనామవివేకినామ్ ।**
**అగతీనాం గతిస్సాక్షాత్ జ్ఞానమేవ హి కేవలమ్ ॥**

సంసార సాగరములో మునిగిన వారికిన్ని, ఆత్మజ్ఞానములేని మానవులందఱికిన్ని ఈ ప్రజ్ఞానం బ్రహ్మయను జ్ఞానమే గతి యగును ఈ సాక్షాత్ జ్ఞానమునే అందఱు అభ్యసింపవలయును

**సంసార దుఃఖ తప్తానామాత్మజ్ఞానామృతాంభసా ।**
**తాపశాన్తిర్న చాన్యేన సత్యమేవ న సంశయః ॥**

సంసారమనెడు తాపత్రయాగ్నిచే తపించెడు మానవులందఱికిన్ని ఈ ఆత్మజ్ఞానమనెడు జలాశయము తప్ప తాపశాన్తికి వేరు మార్గము లేదు ఇది సత్యము

జ్ఞానమేవ పరం బ్రహ్మ జ్ఞానం బంధాయ నేష్యతే ।
జ్ఞానాత్మకమిదం విశ్వం న జ్ఞానాద్విద్యతే పరమ్ ॥

ఈ ఆత్మజ్ఞానమే పరమగు పరబ్రహ్మము ఇట్టి బ్రహ్మజ్ఞానమే బంధములనుండి జీవులను విడిపించును ఈ విశ్వమంతయు జ్ఞానాత్మకము ఇట్టి జ్ఞానమునకన్న అధికమయినది మఱియొకటి లేదు

ధర్మోఽస్య మూలం ధనమస్య శాఖాః
పుష్పం చ కామః ఫలమస్య మోక్షః ।
అసౌ సదాచారతరుః సుకేశిన్
సంసేవితో యేన స పుణ్యభోక్తా ॥

ఈ బ్రహ్మవృక్షమెట్టిదో దానిని ఈ శ్లోకమున వర్ణించినారు దీని యొక్క మూలము ధర్మము ధనము దానియొక్క శాఖలు (జ్ఞాన ధనము) సంకల్పసిద్ధియే దానియొక్క పుష్పము మోక్షమే దానియొక్క ఫలము ఓ సుకేశుడా! ఇట్టి సదాచారమను వృక్షమును ఎవడు సేవించుచున్నాడో వాడే పుణ్య ఫలము ననుభవించెడు భోక్త యగును

నైవ జన్మని సర్వస్మిన్ విద్యాఽసౌ సులభాఽపి తు ।
శిష్యలక్షణ సంపూర్ణ జన్మన్యేవ హి లక్ష్యతే ॥

అన్ని జన్మలయం దీవిద్య సులభము కాదు శిష్యలక్షణములు సంపూర్ణముగా నున్న జన్మయందే గనబడుచున్నది

శిష్యునికి శమదమాది సత్య శౌచధర్మానుష్ఠానములు గల జన్మములో మాత్రమే యీ బ్రహ్మ జ్ఞానము సిద్ధించును

**ఈశ్వరానుగ్రహాచ్ఛాన్తి దాన్త్యాది గుణసంయుతమ్।**
**జన్మ చేల్లభ్యతే తస్మిన్ విద్యయా మోక్షమాప్నుయాత్॥**

ఈశ్వరానుగ్రహమువల్ల శాన్తి, దాన్తి మొదలయిన గుణములు గల జన్మ లభించిన ఆ జన్మమందు జ్ఞానముచేత మోక్షమును బొందుచున్నాడు

ఇట్లు చెప్పుటచే ఈశ్వరానుగ్రహమును ముముక్షువు ముందుగా సంపాదించుకొనవలయును

**దేశేఽస్మిన్ భారతే వర్షే ప్రాప్య మానుష్యమధ్రువమ్ ।**
**న కుర్యాదాత్మన శ్రేయః తేనాత్మా ఖలు వంచితః ।**

పుణ్యభూమియగు ఈ భారతభూమియందు నశ్వరమైన మనుష్య జన్మము పొంది ఆత్మశ్రేయస్సుకొరకు (జ్ఞానము కొరకు) ఎవడు యత్నింప లేదో వాడు ఆత్మవంచకుడే యగును

**సోఢ్వాఽపి కర్మవిక్షేపం చిత్తైకాగ్రే క్షమో యది।**
**తదా వేత్తు గృహస్థోఽపి ప్రవ్రజత్వన్యథా పుమాన్॥**

గృహస్థాశ్రమములో నుండి భార్యాది గృహకృత్యములను సహించి చిత్తమును ఏకాగ్రము చేసి బ్రహ్మచింతన చేయుట కనుకూల పడెనేని గృహ స్థాశ్రమమందుండియే ముక్తిని పొందవచ్చును ఆలాగున భార్య మొదలయిన వారిచే కర్మలచే విక్షేపము చిత్తైకాగ్రతకున్ను మనోనిర్మలతకున్ను ప్రతి కూలముగా నుండినచో సన్న్యసించుటయే సుఖము

**నివృత్తిమార్గే దాంపత్యం సానుకూలా భవేద్యది ।**
**పూర్వస్మిన్ పుణ్యపుంజేన నాస్తి చేత్ప్రవ్రజేత్పుమాన్॥**

అనుకూలదాంపత్యము గలిగిన గృహస్థాశ్రమమునుండియే ఆత్మను తెలిసికొని అమృతత్వమును పొందవచ్చును పూర్వజన్మవిశేషపుణ్యము గలిగిన మాత్రమే భార్యాభర్తలు ఏక మనస్కులై యుందురు అట్టి వారికి సంసార బంధము గలుగదు అట్లు కాని వారికి భోగేచ్ఛ యుండునేగాని

యోగేచ్ఛ గలుగదు ఇట్టి పరిస్థితిలో సన్న్యాసమే శరణ్యము

## ఋభుగీత

దీనిని చదివిన అచలమతముయొక్కయు, పరిపూర్ణమతము యొక్కయు సారము తెలిసికొనవచ్చును ఇది నాలుగధ్యాయములతో కూడి నది ఋభువను మహాముని నిదాఘుడను పరమఋషి కుపదేశించినది, మొదట రెండు అధ్యాయములలో అచ్చటచ్చట శూన్యభావమును నిరూపించి వచ్చిరి దీనిని విని నిదాఘుడు సంశయాకుల చిత్తుడై శూన్యత్వమును గురించి నాస్తికత్వమును గురించి కొన్ని ప్రశ్నలు చేసెను వాటిలో 1 ఓ గురు వరేణ్యా! శ్రుతియంతట అసత్యమునుండి సత్యములోనికిన్ని, అజ్ఞానము నుండి జ్ఞానములోనికిన్ని, తమస్సునుండి ప్రకాశములోనికిన్ని, మృత్యువు నుండి అమృతత్వములోనికిన్ని, దారిద్ర్యమునుండి ధనికత్వము లోనికిన్ని, రోగమునుండి ఆరోగ్యములోనికిన్ని తీసికొని పోవులాగున ప్రార్థనలు గలవు గురునాయకా! తమయొక్క బోధ విపరీతముగా కనబడుచున్నది ఇది సత్తు నుండి అసత్తులోనికిని, ప్రకాశమునుండి చీకటిలోనికిన్ని తీసుకొని వెళ్లు లాగున నున్నట్లు దోచుచున్నది అని నిదాఘుడు చెప్పగా ఋభుమహాముని మరల 3, 4 అధ్యాయములలో సత్తును గురించియు, అమృతత్వము గురించియు నుపదేశించిరి కావున ఎరుకను విడువవలయుననియు, అది చండాలమనియు షోడశాక్షరి, పంచదశాక్షరి, ద్వాదశాక్షరియు తెలుపుచున్నవని తెలుపు వారు ఈ గ్రంథము నామూలాగ్రము చదివి పూర్వోత్తర భావముల తెలిసికొనిన సత్యము నెఱుంగగలరు పరిపూర్ణవాదులకున్ను అచల సంప్రదాయులకున్ను ఈ ఋభుగీతయే పరమ ప్రమాణము అందువలన ఋభుగీతయొక్క ఆశయము తెలిసికొనుటకు 3, 4 అధ్యాయముల నుండి కొన్ని వాక్యము లిచ్చుట ఉద్ధరింపబడుచున్నవి

**నిదాఘ ఉవాచ :-**

**ఆత్మానాత్మ వివేకం మే కృపయా బ్రూహి సద్గురో ।**
**యేన సంసారపాథోధిం తరిష్యామి సుఖేన వై ॥**

ఓ సద్గురువగు ఋభుమహర్షీ! ఏ జ్ఞానముచేత సంసార సముద్రమును అనాయాసముగ దాటగలనో అట్టి ఆత్మానాత్మ వివేకమును నాకు గృపతోడం జెప్పుడని నిదాఘుడడిగెను

**ఋభురువాచ .-**

**ఋభురేవం తదా పృష్ట ఉవాచ సకలార్థవిత్।**
**సర్వవేదాంత సారజ్ఞ : సర్వపూజ్యో మహత్తమః ॥**

అప్పుడు సర్వజ్ఞుండైనట్టియు, సర్వవేదాంత రహస్య సారవేత్తయైనట్టియు అందరకు పూజనీయుడైనట్టియు మహాత్ముడైన ఋభుమహర్షి ఈలాగున బ్రహ్మోపదేశము జేసెను ఈ గ్రంధమంతయు "ప్రజ్ఞానం బ్రహ్మ" యను మహావాక్యమునుగురించియే యుపదేశించుచున్నది

**యేన జ్ఞాతమిదం జ్ఞానమజ్ఞాన ధ్వాన్తనాశకమ్।**
**జ్ఞానేనాజ్ఞాననాశేన స హి జ్ఞానీ సమీర్యతే ॥**

అజ్ఞానాంధకారమును నశింపజేసెడి జ్ఞానమెవనిచే నెఱుంగబడునో వాడే అజ్ఞాన నాశన రూపమగు జ్ఞానము గలవాడగుటచే జ్ఞానియని చెప్పబడును

**యధా జ్ఞానం వినా లోకే కించిదేవ న సిద్ధ్యతి ।**
**తధా జ్ఞానం వినా లోకే క్వచిన్ముక్తిర్న సిద్ధ్యతి ॥**

లోకమందెట్లు వ్యవహారజ్ఞానము లేక కొంచెమైనను ఫలము సిద్ధించదో అట్లే లోకమందు బ్రహ్మజ్ఞానములేక యెప్పటికిని ముక్తి సిద్ధించదు

**జ్ఞానం సర్వాన్తరం భాతి కూటస్థాత్మస్వరూపకమ్।**
**ప్రజ్ఞామాత్రమిదం సూక్ష్మం కోఽపి జానాతి పుణ్యకృత్॥**

కూటస్థాత్మస్వరూపకమగు జ్ఞానము సర్వాంతరముగా ప్రకాశించుచున్నది ఈ ప్రజ్ఞా మాత్రమగు సూక్ష్మమైన జ్ఞానస్వరూపమును ఎవడెఱుంగునో వాడే పుణ్యాత్ముడు

ప్రజ్ఞాయాం కల్పితాం ప్రజ్ఞాం ప్రజ్ఞయైవ విహాయ యః।
ప్రజ్ఞామాత్రేణ సంతిష్ఠేత్ స ప్రజ్ఞావానితీర్యతే ॥

కూటస్థస్వరూపకప్రజ్ఞయందు కల్పించబడిన జీవరూపక బహిః ప్రజ్ఞను ప్రజ్ఞచేతనే విడిచి కూటస్థ స్వరూపక ప్రజ్ఞామాత్రముగా ఎవ్వడుండునో వాడు ప్రజ్ఞావంతుడని చెప్పబడును

ప్రజ్ఞైవ యస్య నేత్రం స్యాత్ ప్రజ్ఞైవ శ్రోత్రమింద్రియమ్।
అన్యచ్చ సర్వం ప్రజ్ఞైవ స ప్రాజ్ఞః పురుషోత్తమః ॥

ఏ విద్వాంసునకు ప్రజ్ఞయే నేత్రమగునో, ప్రజ్ఞయే శ్రోత్రేంద్రియమగునో ఇట్లు అన్యంబంతయు ప్రజ్ఞ యగునో, ఆ విద్వాంసుడు పురుషోత్తముడనబడును

నేత్రాదీంద్రియముల ద్వారా సమస్త విషయములను ఏ ఆత్మ తెలిసికొనుచుండునో, అట్టి ఆత్మయే ప్రజ్ఞానస్వరూపమగును మనోమాలిన్యమును విడువవలయు ననుటయే ఎరుక విడువవలయునని చెప్పెడు భావము ఎరుకకు జ్ఞానమనియు, తెలివియనియు, ఆత్మయనియు, ప్రజ్ఞానమనియు, సర్వసాక్షి యనియు పేర్లు గలవు అట్టి జ్ఞానమనెడు ఎరుక లేనిచో ఎవడు ఆత్మానాత్మలను, జ్ఞానాజ్ఞానములను, బంధమోక్షములను తెలుపగలుగును? శిష్యునియొక్క సందేహములను గురువెటుల తీర్చగలుగును? అట్టి జ్ఞానమను ఎరుక లేనిచో సుషుప్తిలో నుండువానికిన్ని, స్మృతిలేని వానికిన్ని, ఆత్మసాక్షాత్కార జ్ఞానము గలవానితో ఏమి భేదము? వాని ఆధ్యాత్మ జ్ఞాన వాదములన్నియు, బధిరాంధ న్యాయము వంటివే యగును బధిరాంధ న్యాయమనగా, గురువైనవాడు గ్రుడ్డివాడు కాని మాట్లాడుటకు వినుటకు శక్తుడు శిష్యుడు మూగివాడున్ను, చెవిటి వాడున్ను అయినను వానికి

నేత్రము గలదు గురుదేవుడు బోధించు దానిని పెదవుల చలనముచే శిష్యుడు తెలిసికొనుచున్నాడు వాడు చెవిటివాడు మూగియగుటచే వినుటకు చెప్పుటకు వీలు లేదు కాని నేత్రము గలవాడగుటచే హస్తముచే ఏమేమియో సంజ్ఞల చూపుచున్నాడు పాపము గురువంధుడుగుటచే శిష్యుని సంజ్ఞను తెలిసికొనుట లేదు ఆలాగున ఎరుక నశించిన జ్ఞానమే బ్రహ్మజ్ఞానమని, మోక్ష జ్ఞానమని చెప్పు వారిస్థితియు నుండునని మనము గ్రహించవలయును కావున ఏయెరుక విడువవలయునో, ఏ పరిపూర్ణ స్థితిలో నుండవలయునో, ఇదంతయు సూక్ష్మబుద్ధి గల జిజ్ఞాసువులు తెలిసికొందురుగాత

ప్రజ్ఞయా జాయతే సర్వం ప్రజ్ఞయా పాల్యతేఽఖిలమ్ ।
ప్రజ్ఞయా క్షీయతే సర్వం తస్మాత్ప్రజ్ఞాం సమాశ్రయ ॥

ప్రజ్ఞచే సర్వము పుట్టుచున్నది ప్రజ్ఞచే సర్వము పాలింపబడుచున్నది ప్రజ్ఞచే సర్వము నశించుచున్నది కనుక ప్రజ్ఞనాశ్రయింపుము

ప్రజ్ఞాహీనమసత్సర్వం ప్రజ్ఞాహీనం జడం ఖలు ।
ప్రజ్ఞాహీనం సదా దుఃఖం తస్మాత్ప్రజ్ఞాం సమాశ్రయ ॥

ప్రజ్ఞాహీన పదార్ధము లేనిదే యగును ప్రజ్ఞాహీన పదార్ధము జడ రూపము గదా? ప్రజ్ఞాహీనము దుఃఖము కనుక ప్రజ్ఞ నాశ్రయింపుము

ప్రజ్ఞానం బ్రహ్మ యని బోధించెడు శ్రుతి వాక్యము ననుసరింపు మని భావము

న వినా ప్రజ్ఞయా పుణ్యాం న లోకః ప్రజ్ఞయా వినా ।
వినా న ప్రజ్ఞయాఽభీష్టం తస్మాత్ప్రజ్ఞాం సమాశ్రయ ॥

ప్రజ్ఞచే దప్ప పుణ్యము లేదు ప్రజ్ఞచే తప్ప అభీష్టము లేదు కనుక ప్రజ్ఞ నాశ్రయింపుము

అభీష్టమనగా ముముక్షువులు కోరెడు మోక్షము

సుసూక్ష్మయా ధియా ప్రజ్ఞామిమాం తాం జ్ఞప్తి సంజ్ఞితామ్ ।
జ్ఞాత్వా భవ భవాన్ముక్తో నిర్గుణ బ్రహ్మ రూపిణీమ్ ॥

మిక్కిలి సూక్ష్మమగు బుద్ధిచే ఈ ప్రజ్ఞ యనెడి ఆ జ్ఞప్తి సంజ్ఞిక యగు నిర్గుణ బ్రహ్మస్వరూపిణిని నీవెఱింగి సంసార బంధమునుండి ముక్తుడవు కమ్ము

ఇచ్చట మలిన ప్రజ్ఞ యొక్కయు, శుద్ధప్రజ్ఞ యొక్కయు స్వరూపము నిరూపితమాయెను భవ బంధమునుండి దాటుటకు ఇది యొకటియే యుపాయము

జ్ఞప్తిస్సా సాక్షిణీ నిత్యా తుర్యా సర్వశ్రుతీరితా ।
విషయజ్ఞప్తి సంత్యాగాత్ జ్ఞాయతే విబుధైస్స్వతః ॥

ఆ జ్ఞప్తి నిత్యంబును, సాక్షిణియు, తుర్యరూపిణియు, సర్వశ్రుతిప్రోక్త మయినదియు నగును విషయజ్ఞప్తిని విడచుటవలన అది విద్వాంసులచే స్వతః తెలియబడుచున్నది

ఇచ్చట "విషయజ్ఞప్తి సంత్యాగాత్" అని స్పష్టముగా విషయబుద్ధిని విడువ వలయుననియే, విషయ చింతనను విడనాడవలయుననియే తెలిపిరి దీనిని తెలిసికొనజాలక విషయములతో గూడియుండి ఎరుకను విడువ వల యునని చెప్పెడు వాక్యములలో గల సారమును సూక్ష్మబుద్ధి గలవారెరుంగు దురుగాక! ఇది నాలుక లేనివాడై నేను మాట్లాడుచున్నాను అని చెప్పెడు వాక్యము వలెయున్నది

జ్ఞప్తిరేవ పరం బ్రహ్మ జ్ఞప్తి రేవ పరం పదమ్ ।
జ్ఞప్తిరేవ పరో మోక్షో జ్ఞప్తిరేవ పరం సుఖమ్ ॥

ఆ జ్ఞప్తియే పరబ్రహ్మము జ్ఞప్తియే పరమ పదము జ్ఞప్తియే నిరతిశయ మోక్షము జ్ఞప్తియే పరమానందము

**జ్ఞప్తిరేవ పరాచార్యో జ్ఞప్తిరేవ పరామృతమ్ ।**
**జ్ఞప్తిరేవ పరా తృప్తిః జ్ఞప్తిరేవ పరా గతిః ॥**

జ్ఞప్తియే పరమ గురుస్వరూపము, జ్ఞప్తియే పరమ అమృతము, జ్ఞప్తియే పరమ తృప్తి, జ్ఞప్తియే పరమగతి

**తస్మాద్జ్ఞప్తిం సమాశ్రిత్య విజ్ఞప్తిధిషణాం త్యజ ।**
**అజ్ఞప్తేర్దుఃఖహేతుత్వాత్ సుఖార్థీ జ్ఞప్తిమాశ్రయ ॥**

అందువలన నీవు జ్ఞప్తినాశ్రయించి విషయ జ్ఞప్తిబుద్ధిని విడువుము అజ్ఞప్తికి (జడపదార్థమునకు) దుఃఖహేతుత్వ ముండుటవలన సుఖార్థివగు నీవు జ్ఞప్తి నాశ్రయింపుము

**అజ్ఞప్తి విషయో జీవః కూటస్థో జ్ఞప్తిగోచరః ।**
**హేయోపాదేయతా సిద్ధా ధర్మధర్మిత్వతస్తయో : ॥**

మఱియు అజ్ఞప్తి విషయుండు జీవుడగును కూటస్థుండు జ్ఞప్తిగోచరుడగును వారిరువురకును కార్యకారణస్వభావంబువలన క్రమంబుగ హేతుత్వము (విడుచుటయు), ఉపాదేయత్వము (గ్రహించుటయు)ను సిద్ధమైనవి

**ఆద్యా జాగరితాఽవస్థా ద్వితీయా సుప్తిరూపకా !**
**తృతీయా సుప్తిరూపాఽన్యా తురీయా చిత్సుఖాత్మికా ॥**

మొదటి యవస్థ జాగ్రత్తనియు, రెండవది స్వప్నమనియు, మూడవది సుషుప్తియనియు, తదన్యమైనది జ్ఞానానందస్వరూపమైన తురీయ మనియు జెప్పబడును

**ఏకాత్మ ప్రత్యయం సారం ప్రపంచోపశమం శివమ్ ।**
**శాంతం చతుర్థమద్వైతం మన్యంతే బ్రహ్మవాదినః ॥**

అయినను అద్వితీయాత్మజ్ఞానముచే అనుసరింపదగినదియు, జాగ్రదాది ప్రపంచ సంశాన్త్యాత్మకంబును, శివరూపంబును, శాంతంబునునగు

చతుర్థమును అద్వైత స్వరూపమునుగా బ్రహ్మవాదులు తలంచెదరు

**నివృత్తేస్సర్వ దుఃఖానాం ఈశానః ప్రభురవ్యయః ।**
**అద్వైతస్సర్వభావానాం దేవస్తుర్యో విభుస్స్మృత : ॥**

ఇట్టి జ్ఞానముచే సర్వదుఃఖములు నివర్తించుటవలన తుర్యాత్మ ఈశానుడనియు, ప్రభువనియు, అవ్యయుడనియు, సర్వ ప్రపంచమునకు అద్వైతరూపుడనియు, దేవుడనియు, విభువనియుం జెప్పబడును

**అనాది మాయయా సుప్తో యదా జీవః ప్రబుద్ధ్యతే ।**
**అజమద్వైతమస్వప్నమనిద్రం బుధ్యతే తదా ॥**

అనాదియగు మాయచేత నిద్రించియుండు జీవుడు ఎప్పుడు జాగ్రత్తజెందునో, అప్పుడు పుట్టుకలేనట్టియు, ద్వైతశూన్యమైనట్టియు, స్వప్నము కానట్టియు నిద్రకానట్టి యునైన తుర్యాత్మస్వరూపము నెఱుంగుచున్నాడు

**తస్మాత్తురీయం సద్బ్రహ్మ యోగవృత్త్యైవ లక్షణైః ।**
**సచ్చిదానంద పూర్వైస్త్వం మదుక్తం విద్ధి ముక్తయే ॥**

అందువలన నాచే చెప్పబడిన తురీయ రూపమగు సత్యమైన బ్రహ్మమునే, యోగవృత్తితోటి సచ్చిదానంద పూర్వకములైన లక్షణములచేత ముక్తి కొరకు నీవెరుంగుము

**యత్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్।**
**సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవ త్వమేవ తత్॥**

మరియు ఏ చిదాత్మ పరబ్రహ్మ స్వరూపమో, సర్వస్వరూపమో, సూక్ష్మముకంటె అతిసూక్ష్మరూపమో నిత్యమో అదియే నీవు, నీవే అది

ఇప్పుడు ఐతరేయోపనిషత్తున తెలుపబడిన "ప్రజ్ఞానం బ్రహ్మ"అను విషయమును గురించి సంక్షిప్తముగా తెలుపబడెను ప్రజ్ఞానముయొక్క

పర్యాయ నామములు ఈ ఐతరేయోపనిషత్తున తెలుపబడినవి చూడుడు

**మూ॥ సంజ్ఞానమాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధా దృష్టిర్ధృతిర్మనీషా జూతిః స్మృతిః సంకల్పః క్రతురసుః కామోవశతిసర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవన్తి ॥**

1 సంజ్ఞానము, 2 ఆజ్ఞానము, 3 విజ్ఞానము, 4 ప్రజ్ఞానము, 5 మేధ, 6 దృష్టి, 7 ధృతి, 8 మతి, 9 మనీష, 10 జూతి, 11 స్మృతి, 12 సంకల్పము, 13 క్రతువు, 14 అసువు, 15 కామము, 16 వశము అను నీపదునారు నామధేయములు ప్రజ్ఞానమునకు పర్యాయములు వేదాంత పంచదశి యందు ప్రజ్ఞానసా॑క్షాత్కారము గలవాని సుఖ విషయమై యిటుల వర్ణించిరి

**అనాదావిహ సంసారే సంచితాః కర్మకోటయః ।**
**అనేన విలయం యాన్తి శుద్ధో ధర్మో వివర్ధతే ॥**

అనాదిగా నీ సంసారమునందు సంపాదింపబడిన శుభాశుభకర్మకోట్లు ఈ నిర్వకల్ప సమాధిచే నాశమును పొందుచున్నవి పరిశుద్ధమైన యవిద్యానివర్తక బ్రహ్మసాక్షాత్కారభూత ధర్మము వృద్ధిపొందుచున్నది

**ధర్మ మేఘమిమం ప్రాహుః సమాధిం యోగవిత్తమాః ।**
**వర్షత్యేష యతో ధర్మామృతధారాస్సహస్రశః ॥**

బ్రహ్మజ్ఞానులగు మహాత్ములు ఈ ప్రజ్ఞానం బ్రహ్మయను నిర్వికల్ప సమాధిని ధర్మమేఘముగా చెప్పుదురు మేఘము వర్షబిందువుల వర్షించు నటుల ఈనిర్వకల్ప సమాధి పుణ్యాలక్షణములయిన జ్ఞానామృతధారలను సహస్ర సంఖ్యాకములుగా వర్షించుచున్నది ఈ ప్రకారముగానే శ్రీపతంజలి మహర్షియు తెలిపిరి దానినిగాంచుడు

**తతః కృతార్ధానాం పరిణామక్రమ సమాప్తిర్గుణానామ్ ॥**

ఆధర్మమేఘ సమాధి యుదయించుటవలన సమాప్తకర్తవ్యములగు గుణములకు ఏ క్రమమున కార్యోత్పాదన రూప పరిణామము గలిగెనో

యాక్రమమునకు ముగింపు గలుగుచున్నది

**తతః క్లేశకర్మ నివృత్తిః ॥**

అధర్మమేఘ సమాధివలన సర్వవిధ క్లేశములయొక్కయు, కర్మల యొక్కయు నివృత్తి గలుగును అప్పుడు,

**తదా ద్రష్టుస్స్వరూపేఽవసానమ్ ॥**

అట్టి స్థితిలో ద్రష్టయగు యాత్మ తన నిజస్వరూపమగు ప్రజ్ఞానం బ్రహ్మయను స్వరూపస్థితిలో నిలుకడ గలదగును

ఇప్పుడు మాండూక్యోపనిషత్తున గల 'ప్రజ్ఞానం బ్రహ్మ' యను విషయ మును గురించి శ్రీ గౌడపాదకారికలనుండి కొన్నిటిని తెలిపెద శ్రీరామ చంద్రమూర్తి ముక్తికోపనిషత్తునందు ఆంజనేయుల కొఱకు అష్టోత్తర శతోప నిషత్తులను (108) ఉపదేశించిరి అత్తరి ఈలాగున వచించిరి ఈ నూట యెనిమిది ఉపనిషత్తులను పఠించినచో బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము గలుగు ననియు, అట్లు అష్టోత్తరశతోపనిషత్తుల పఠింప సాధ్యముగానిచో, వానిలో ముఖ్యములగు 36 ఉపనిషత్తుల పఠించిన చాలుననియు, దానికిని సాధ్యము కానిచో వానిలో ప్రధానములగు ఈశావాస్యాది దశోపనిషత్తుల పఠన మొనర్చిన చాలుననియు, దీనికిని సామర్థ్యము లేక పోయిన ఈ మాండ్యూకోపనిషత్తు నొకదానిని మాత్రము పఠించిన ముక్తి గలుగుననియు నుపదేశించిరి ఈ విషయము ముక్తికోపనిషత్తున గనందగును

"మాండ్యూక మేకమేవాలం ముముక్షూణాం విముక్తయే" ముముక్షువుల విముక్తికొఱకు ఈ మాండూక్యోపనిషత్తొకటియే చాలును

**మం॥ ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽన్తర్యామ్యేష యోనిస్సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానామ్ ॥**

ఈ ఆత్మ సర్వేశ్వరుడు, ఈ ఆత్మ సర్వజ్ఞుడు, ఈ ఆత్మ అన్త ర్యామి ఈ ఆత్మ సమస్తమునకు కారణము ఈ ఆత్మ సకల భూతముల

యుత్పత్తి లయములకు స్థానభూతుడు

**మూ॥ బహిప్ర్రజ్ఞో విభుర్విశ్వో హ్యా న్తఃప్రజ్ఞస్తు తైజసః ।**
**ఘనప్రజ్ఞ స్తథా ప్రాజ్ఞ ఏక ఏవ త్రిధా స్మృతః ॥**

బహిః ప్రజ్ఞ గలిగి వ్యాపకుడై యుండువాడు విశ్వుడనంబడును అన్తః ప్రజ్ఞ గలవాడు తైజసుడనంబడును ఘనీభూత ప్రజ్ఞగలవాడు ప్రాజ్ఞుడనం బును ఆత్మ యొక్కడే యైనను ఇటుల ముగ్గురుగా చెప్పబడుచున్నాడు ఆత్మ క్రమముగా జాగ్రదాదిస్థానత్రయము నందుండుటచేతను, స్వప్నాది ద్రష్టయగువాడే తానని స్మృతి గలిగి యుండుటచేతను ఈస్థానత్రయము కంటె వేరుగా నుండువాడనియు, ఒక్కడే యనియు, పరిశుద్ధుడనియు, అసంగుడనియు సిద్ధించుచున్నది

**మూ॥ ప్రపంచోపశమం శాన్తం శివమద్వైతం**
**చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః ॥**

జాగ్రదాదిరూప ప్రపంచ విరహితమైన వానిగను, శాంతమయినవాని గను, మంగళస్వరూపునిగను, భేదవికల్పరహితునిగను తలంచుచున్నారు ఆతురీయుడే ఆత్మ ఆ ఆత్మయే తెలిసికొనదగినవాడు అట్టి తురీయుడే జాగ్రదాది మూడింటికి సాక్షియై నాల్గవవాడగును

**మూ॥ అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచో**
**పశమశ్శివోఽద్వైత ఏవమోంకార ఆత్మైవ**
**సంవిశత్యాత్మనాఽఽ త్మానం య ఏవం వేద ॥**

మాత్రారహితమగు ఓంకారము తురీయమగు ఆత్మయే వ్యవహ రింపశక్యముకానిది, సర్వానర్థ మూలభూతమగు ప్రపంచముయొక్క ఉపశమము గలది, పరమానంద స్వరూపమయినది, ద్వైతవిరహితమైనది ఏవడీవిధముగా నెఱుంగునో, వాడు ఆత్మచేత ఆత్మస్వరూపమును పొందు చున్నాడు

**మూ॥ ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృది సంస్థితమ్‌!**
**సర్వవ్యాపినమోంకారం మత్వా ధీరో న శోచతి ॥**

ప్రణవమును అందఱియొక్క హృదయమునందున్న ఈశ్వరునిగా తెలిసికొనవలయును బుద్ధిమంతు డోంకారమును అంతట వ్యాపించిన దానినిగా దలంచి దుఃఖింపడు అనగా దుఃఖరహితుడగుచున్నాడు ప్రణవ మని చెప్పుటచే ప్రణవ ప్రతిపాద్యమగు పరబ్రహ్మమని యెఱుంగవలయును

**మూ॥ వీతరాగ భయక్రోధైర్మునిభిర్వేదపారగైః ।**
**నిర్వికల్పో హ్యయం దృష్టః ప్రపంచోపశ మో ఽ ద్వయః ॥**

నశించిన రాగము, భయము క్రోధము గలిగినట్టియు, వేదాంత తత్త్వార్థము నెఱిగినట్టియు, మననశీలురగు మునులచే వికల్పనాశూన్యమయి నట్టియు, సంసారదుఃఖ వినాశకరమైనట్టియు అద్వయమగు నీయాత్మ చూడబడినదగుచున్నది

పై జెప్పిన లక్షణములు గలవారు మాత్రమే ఆత్మను దర్శింపగలరు

**మూ॥ తత్త్వమాధ్యాత్మికం దృష్ట్వా తత్త్వం దృష్ట్వా తు బాహ్యతః ।**
**తత్త్వభూత స్తదారామః తత్త్వాదప్రచ్యుతో భవేత్‌ ॥**

దేహలక్షణమయిన తత్త్వమును చూచి, వెలుపలనుండెడి తత్త్వమునుజూచి తత్త్వస్వరూపుడయి ఆత్మక్రీడగలవాడై తత్త్వస్వరూపమగు ఆత్మనుండి తొలగనివాడు కావలయును

అస్త కరణ ధర్మములకును, బాహ్యధర్మములకును సాక్షియైయుండు తనయాత్మస్వరూపమందు నిలకడగలవాడై యుండవలయును

**మూ॥ అకల్పకమజం జ్ఞానం జ్ఞేయాభిన్నం ప్రచక్షతే ।**
**బ్రహ్మజ్ఞేయమజం నిత్యమజేనాజం విబుద్ధ్యతే ॥**

బ్రహ్మవేత్తలు కల్పనారహితమైనట్టియు, అజమైనట్టియు, జ్ఞానము

జ్ఞేయమునగు బ్రహ్మముకంటె అభిన్నమైనదని పలుకుచున్నారు బ్రహ్మము జ్ఞేయము, అజము, నిత్యము అగుచున్నది అజమగు బ్రహ్మము అజమగు జ్ఞానము చేతనే తెలిసికొనబడుచున్నది

శ్రీ కృష్ణభగవానుడు త్రయోదశాధ్యాయమున గీతలో ఈలాగుననే వచించెను "జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్"

**మూ॥ మనసో నిగ్రహోయత్తమభయం సర్వ యోగినామ్ ।**
**దుఃఖక్షయః ప్రబోధశ్చాప్యక్షయా శాంతిరేవ చ॥**

సకలయోగుల మనస్సును నిగ్రహించుటవలన అభయము, దుఃఖనాశకము, ప్రబోధస్వరూపము, అక్షయము, శాంతియునగు మోక్షము సిద్ధించు చున్నది

**మూ॥ ఆదిబుద్ధాః ప్రకృత్యైవ సర్వే ధర్మాస్సునిశ్చితాః ।**
**యస్యైవం భవతి క్షాంతిస్సోఽమృతత్వాయ కల్పతే ॥**

స్వభావముచేతనే ఆత్మలన్నియు నిత్యబోధస్వరూపములని చక్కగా నిశ్చయింపబడినవి ఏవని కీవిధముగా క్షాంతి యగుచున్నదో వాడు అమృతత్వము కొరకు సమర్థుడగుచన్నాడు

ఆదిబుద్ధులు, నిత్యబోధస్వరూపులు అని శ్రుతిసారమగుటచేతనే గౌతమబుద్ధుడు తన మతమునకు బుద్ధమతమని పేరిడుటకు కారణము

**మూ॥ ఆదిశాన్తా హ్యనుత్పన్నాః ప్రకృత్యైవ సునిర్వృతాః ।**
**సర్వే ధర్మాస్సమాభిన్నా అజం సామ్యం విశారదమ్ ॥**

ఆత్మలన్నియు నిత్యశాంతిరూపములు ఉత్పత్తిరహితములు స్వభావముచేతనే నిత్యముక్త స్వరూపములు, సమములు, అభిన్నములు అయినవి కనుక ఆయాత్మస్వరూపము అజమనియు, సమమనియు, నిర్మలమనియు చెప్పబడుచున్నది



# స్వరాజ్య స్వారాజ్యములు

స్వరాజ్యస్వారాజ్యములనెడు రెండు రాజ్యములు గలవు స్వరాజ్యము ప్రవృత్తిమార్గమనియు, స్వారాజ్యము నివృత్తిమార్గమనియు వచింతురు ఇవి దేహముతోను, ఆత్మతోను సంబంధించవలసియుండును సామాన్యముగా భూర్భువఃసువర్లోకములని లోకములు మూడని వర్ణించియున్నారు దేవతలు స్వర్గలోకవాసులనియు, మానవులు భూలోకవాసులనియు, పితృదేవతలు భువర్లోకవాసులనియు వచింతురు ఇదిన్నీగాక మరల లోకములను మూడు విభాగములుగా చేసియున్నారు అవి స్వర్గలోక, భూలోక, పాతాళలోకముల నియు శాస్త్రసమ్మతము భూలోకవాసులు మనుష్యులనియు, స్వర్గలోక వాసులు దేవతలనియు, తిర్యగ్జన్తువులు అనగా మృగపక్ష్యాదులు తిర్యగ్జన్తువు లనియు వర్ణించడమైనది మానవులు మధ్యమలోక వాసులగుటచే కొంత మృగత్వమున్నూ, కొంత దేవత్వమున్ను కలిగియున్నారు అనగా దేహ సుఖము మాత్రము లక్ష్యముగాగలవి మృగములు, దేవత్వము మాత్రము లక్ష్యములో నుంచుకొనినవారు దేవతలు వీరికి ఈ లోకసుఖములతో సంబంధము లేదు మానవులో దేహసుఖమున్నూ, ఆత్మసుఖమున్నూ కోరు వారగుటచే దేవతలకున్నూ, మృగములకున్నూ మధ్యతరగతికి చేరినవారు కావున వీరికి స్వరాజ్య స్వారాజ్యములతో సంబంధము గలదు కావుననే ప్రపంచసుఖమును మాత్రము లక్ష్యములో నుంచి దైవసుఖమును కొంచె మైనను తలంచనివారిని మృగప్రాయులని చెప్పుదురు అందువల్లనే

**ఆహారనిద్రాభయమైధునాని సామాన్యమేతత్పశుభిర్నరాణామ్ ।**
**జ్ఞానం నరాణామధికో విశేషః జ్ఞానేన హీనః పశుభిస్సమానః ॥**

అని శాస్త్ర ముద్ఘోషించుచున్నది దీని యర్థము అందరికిన్ని విదితము అందువల్లనే ఆత్మజ్ఞానము లేనివారిని పశుప్రాయులని చెప్పు దురు ప్రాపంచిక సుఖమున్నూ అనగా ఇహసుఖమున్నూ దైవసుఖమున్నూ పొందదగినవారు మానవులు ఈరెండున్నూ వస్త్రమునకు ఓత ప్రోతముల వంటివి భిత్తియు, చిత్తరువు వలె పరస్పర సంబంధము కలిగియేయున్నవి

భిత్తిలేనిచో చిత్తరువును చిత్రించుటకు సాధ్యము గాదు చిత్రము లేనిచో గోడ శోభించదు కావున పతనమైన స్వరాజ్యమును మన గాంధీ మొదలైన కాంగ్రెసువారు ఉద్ధరించి ఉన్నతస్థానమున సుప్రతిష్ఠించిరి, ఇక మనకు మిగిలియుండు రెండవది యగు స్వారాజ్యోద్ధారణము గలుగ వలయును ఆపని నివృత్తి మార్గస్థులైన విరక్తులైన సాధువులయొక్కయు, సన్న్యాసుల యొక్కయు, భక్తులయొక్కయు, కార్యమై యున్నది స్వరాజ్య సంపాదనము కొరకు కాంగ్రెసుకు సంబంధించిన బ్రాహ్మణాది జాతులున్నూ సన్న్యాసాది ఆశ్రమస్థులున్నూ, స్త్రీలున్నూ, పురుషులున్ను ఏలాగున ఏకమై విశ్రాన్తి నొందక ప్రయత్నించి కార్యమును సాధించిరో ఆలాగున సర్వవర్ణస్థులున్నూ, ఆశ్రమస్థులున్నూ నివృత్తి మార్గములో నుండు స్త్రీ పురుషులందరున్నూ ప్రయత్నించిన మాత్రమే యీ స్వారాజ్యప్రాప్తిని పొందగలుగుదురు అయితే కొంత కాలము వరకు మాత్రము మానవుల కుండదగిన ఈ స్వరాజ్యప్రాప్తి కొరకే యింతమంది త్యాగులై తదేక కార్యదీక్ష వహించినప్పుడు శాశ్వతమగు స్వారాజ్యప్రాప్తి కొరకు ఎంతమంది ప్రయత్నము చేయవలయునో అదిన్నీ ఆలోచించుకొనవలయును స్వరాజ్యము కొరకే యెందరో, సర్వసంగ పరిత్యాగ మొనర్చిరి అట్లుండగా, స్వారాజ్య సిద్ధి కొరకు ఎంత త్యాగము చేయవలెనో అదిన్నీ జ్ఞాపకములో నుంచుకొని కార్యములో ప్రవేశింప వలయును అప్పుడే మానవుండు పూర్ణసుఖమును పొందగలుగును

అట్లుభయలోకములున్నూ బొందక స్వరాజ్యమునుగాని లేక స్వారాజ్యమునుగాని మాత్రము పొందిన వారియొక్క గతి యెటువంటిదనగా, ఒక కాలువిరిగిన వారి గమనము వంటిదనియు, ఒక చక్రముచెడిన బండిలో యాత్రవంటిదనియు గ్రహించుకొనవలయును లేక లోభాగము చెడి వెలిభాగము మాత్రము శుద్ధముగానున్న యంత్రము యొక్క గతియనియు, లేక లోభాగము శుద్ధముగానుండి వెలి భాగము విరిగిన యంత్రమురీతిగా నుండుననియు గ్రహించుకొనవలయును. అట్లుగాక సూక్ష్మదేహమగు మానసేంద్రియములు చెడి, స్థూలదేహముమాత్రము గట్టిగానుండు మాన

వుని స్థితి వంటిదనియు, లేక మానసేంద్రియములు శుద్ధముగానుండియు స్థూలదేహము కృశించిన మనుష్యుని స్థితి వంటి దనియు ముముక్షువులు గ్రహించుకొనవలయును ఈ స్థూల సూక్ష్మ శరీరములయొక్క సంబంధ మెటువంటిదో స్వరాజ్యస్వారాజ్యములయొక్క స్థితియు నటువంటిదే

అయితే ఇట్టి ఘనతర కార్యము మనచే సాధ్యము గాదనియు, ఇది యవతార పురుషులచేతనే సాధ్యమగుననియు తలంచ వలదు లేక తపస్సుచేసి సిద్ధిని పొందవలయుననిగాని, యోగమహిమ సంపాదించవలెనని గాని, లేక వేదములు కడవరకు చదివి పాండిత్యము సమకూర్చవలెననిగాని తలంచబనిలేదు స్వరాజ్య సంపాదన విషయమై కూడ జనులు ఈలాగుననే చెప్పుచుండిరి ఈ గాంధీచేతను, వారి అనుయాయుల చేతను రాజ్యము సంపాదింపవీలగునా? సూర్యాస్తమయము లేని యఖండ సామ్రాజ్యమును పాలించెడు ఇంగ్లీషు వారిని వీరు జయింప గలరా? అని లోకమంతా ప్రతిధ్వనించిన కాలమున గాంధీగారు అప్పుడు గూడ ఈలాగున మీరెవరున్నూ భయపడనక్కరలేదనియు, సత్యాహింసలచేతనే సులభముగా స్వరాజ్యమును సంపాదించుకొన వచ్చుననియు, తనకు నమ్మకము గలదని పలుమారు చెప్పుచుండిరి అయితే ఇంగ్లీషువారు మీపై కరుణ గలిగి స్వరాజ్యమును మూటగట్టి మీనెత్తిపై బెట్టరుగాని మీరే దానిని స్వప్రయత్నముచే సంపాదించుకొనవలెననియు, దానికి త్యాగము ముఖ్యముగా నుండవలయు ననియు బోధించుచుండిరి అది యిప్పుడు ప్రత్యక్షమైనది గదా!

ఆలాగున స్వారాజ్యమును సంపాదించుటకున్నూ ఒక సులభ మార్గము గలదు అది మీ చేతిలోనే యున్నది దీనిని వినియోగపరచక పోయిన అవతార పురుషులు వచ్చినను, తపస్సిద్ధిని పొందినను, యోగమహిమను సంపాదించినను, వేద వేదాంత పారంగతులయినను ఇసుమంతైన ప్రయోజన ముండదు ఆ మహాదివ్యాస్త్ర ప్రయోగ మెట్టిదనిన ఆ మహామంత్ర మెట్టిదనిన మీ హృదయములో నొక పిడికెడు అన్నము పడిన మాజన్మము ధన్యమగును మా వంశము పావనమగును అను

విశ్వాసము జనులకు గలిగేలాగున మీ హృదయము పావనముగా నుండిన చాలును అట్లుగానిచో మీరు బ్రాహ్మణులై జన్మించినను, సన్న్యాసులై యుండినను, శాస్త్రముకడవరకు చదివినను ఈషణ్మాత్రము ప్రయోజన ముండదు ఆత్మశుద్ధి గలుగునప్పుడు జీవత్వగుణములు రహితములై దేవత్వము గలుగుచుండును అట్టి యవస్థలో ఆ మహనీయాత్ముని సంకల్పములన్నియు నీశ్వరసంకల్పమువలె తప్పక ఫలించును ఇదే దీనిలో గల పరమరహస్యము ఇదే దైవరహస్యము ఈ గురుకీలకము తెలియక పోవుటయే 'మా మాటలెవరున్నూ వినుట లేదే, మేము చెప్పినట్లు ఎవరున్నూ చేయుట లేదే' యని సందేహపడుటకు కారణము నిస్సంకల్ప స్థితి గలిగిన కల్పవృక్షసిద్ధియు, నిశ్చింతత గలిగిన చింతామణి సిద్ధియు యోగికి గలుగును పూర్వీక ఋషుల సంకల్పసిద్ధి యిట్టిదే యగునుసుమీ! గాంధీగారే దీనికి తార్కాణము ఆ మహనీయాత్ముడు సంస్కృతము, శాస్త్రము మొదలగునవి ఎక్కువ చదువలేదు ఘోరమైన తపస్సేమియు చేయలేదు అష్టాంగ యోగముచే అణిమాది సిద్ధులును సంపాదించలేదు మహామంత్రము జపమొనర్చి మంత్రసిద్ధిని గాంచలేదు ఆయనకు వీనిలో విశ్వాసమున్నూ లేదు ఆత్మశుద్ధికన్న మించిన యేశక్తియున్నూ లోకమున లేదనియే ఆయన విశ్వాసము గలిగి యుండెను అట్టి దివ్యశక్తిని ఆయన సంపాదించెను అయితే తపస్సుగాని, యోగసాధనగాని, దివ్యమంత్రాదులను ఆయన జపించి సిద్ధిపొందలేదని కాదు ఆయన జపించిన శ్రీరామమంత్రము అంత్యకాలమునగూడ జపించియే, స్మరించియే ఈ పాంచభౌతిక దేహ మును చాలించి దివ్య పదమునుపొందెను యథార్థసారమిదియే ఆయన తనవలెనే అందరిని చూచినారు తన ఆత్మయు ఇతరుల ఆత్మయు నొకటే యని గ్రహించినారు వేదాంతులు చెప్పునట్టియు వేదముల కొసలో తెలుపునట్టిదియునగు పరమసత్య మిదియే మన వేదాంతులు, సన్న్యాసులు, గురువులు చెప్పునదియున్నూ ఇదియే అయితే యీయనకు గల దివ్యశక్తి పైచెప్పిన వారలకు ఏల గలుగలేదని సందేహింపబనిలేదు పైవారు వాక్కుతో

మాత్రము చెప్పినారు ఈయనో ఆచరించి చూపినారు అంతే వారుభయు లకు గల భేదము

**సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి ॥**

సర్వభూతములయందు తన్నును, సర్వభూతములను తనయందును సమముగా నెవడు చూచుచున్నాడో అట్టి యాత్మయజ్ఞము చేయువాడు స్వారాజ్యమును, ఆత్మరాజ్యమును, మోక్షమును పొందుచున్నాడని మను మహర్షి యుపదేశించెను ఈ విషయమై గీతలో చెప్పినది ఆరవ అధ్యాయ మున చూడుడు

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥**

ఎవ్వడు చరాచర ప్రపంచమంతటను నన్ను (భగవంతుని) చూచు చున్నాడో, సమస్త ప్రపంచమును నాయందు చూచుచున్నాడో వానికి నేను కనబడకపోను వాడున్నూ నాకు కనబడకపోడు

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥**

ఓ అర్జునా! ఎవడు సమస్త జీవులయందలి సుఖమునుగాని, దుఖమునుగాని, తన సుఖముగాను, దుఃఖమునుగాను తలంచునో అనగా అన్ని ఆత్మలున్నూ తన యాత్మయున్నూ ఒకటేయని యెరుంగుచున్నాడో అట్టి ధ్యానయోగి యోగులలో శ్రేష్ఠుడని నా మతము

ఈ గంభీరాశయము చూచుకొనిన నిప్పుడుండు సన్న్యాసులు, యోగులు, భక్తులు ఎంతవరకు ఉన్నతాశయస్థితిలోనికి వచ్చియున్నారో తెలిసికొనవచ్చును

**అంతస్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకః ।**
**న నశ్యతి తమో నామ కృతయా దీపవార్తయా ॥**

రాత్రి కాలమున గృహాంతరాళమున గల చీకటి తొలగవలసియుండిన దీపముయొక్క పేర్లు ఎన్నిసార్లు చెప్పినను ఎట్లు నశించదో, దీపము వెలిగించిన నేలాగున కారుచీకటి సైతము మటుమాయమై పోవునో, ఆలాగున హృదయములో గల అజ్ఞానమనెడు తమస్సు వేదాంత వాక్యము లుచ్చరించిన మాత్రమే తొలగదు సరియైన అనుష్ఠానముచే జ్ఞానజ్యోతిని వెలిగించ వలయును

**ఫలం కతకవృక్షస్య యద్యప్యమ్బు ప్రసాదకమ్ ।**
**న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి ॥**

బురద నీటిని తెచ్చి చిల్లగింజ పేరును ఎన్నిసార్లుచ్చరించినను నీరేలాగున శుభ్రము గాజాలదో, ఆలాగున మలిన హృదయముగలవారు, ఆత్మశుద్ధిలేనివారు వేదాంత వాక్యములను పలుమార్లు వల్లించినను ఆత్మ శుద్ధి గలుగదు చిల్లగింజ నీటిలో నరుగదీసిన మాత్రమే బురద యడుగంటి నీరు శుభ్రమగునట్లు అంతరాత్మలో యథార్థమైన వేదాంత విచారణ, ధ్యానమొనర్చిన మాత్రమే అవిద్య తొలగి జ్ఞాన ముదయమగును

కాన వాచావేదాంతులకున్ను అనుష్ఠానవేదాంతులకున్ను గల తారతమ్య మిచ్చటనే తెలుసుకొనవచ్చును మఱియు ఒక్క రహస్యము గూడ నిచ్చోట మనము గ్రహించుకొనవలసియున్నాము అదేమన నిద్రలో నుండువారిని లేపదలంచువాడు తాను నిద్ర నుండి లేచినవాడుగను, జాగ్రత్తలో నుండువాడుగను నుండవలయును ఇతరుల బంధనముల తొలగించ దలంచువాడు బంధనము లేనివాడుగాని, తన బంధనమును ద్రుంచినవాడుగాని యుండవలెను. అట్లు నిద్రనుండి ముందుగా లేచినవాడు గాని, లేక నిద్రలేనివాడుగా గాని యుండువాడు మాత్రమే సుషుప్తిలో నుండు ఇతరులను మేల్కొలుప సమర్థుడగును ఆలాగున బంధింపబడనివాడుగాని,

తన బంధమును ద్రుంచిన వాడుగాని బంధనము లుండువారిని బంధ విమోచనము చేయుట కర్హుడగును అప్పుడే దైవ రహస్యమున్నూ, గురు కీలకమున్నూ అర్థమగును అత్తరి మీకు ఏమి యుదయమగునన, ఈ విద్య పుస్తకములు చదివిన వచ్చునది కాదనియు, మస్తకము (హృదయము) జదివిన గలుగుననియు స్పష్టమగును అత్తరి లోకోద్ధారకమునకు ఆరంభించుటకు ముందుగా తన ఆత్మోద్ధారకము చేసుకొనవలయునని శాస్త్రములో గల రహస్యము బట్టబయలగును అప్పుడు మీరు సత్యము యొక్క దగ్గరకున్నూ, దైవముయొక్క దగ్గరకున్నూ చేరగలరు

సంస్కృత పాండిత్యముయొక్క స్వరూపము నెరింగిన వారు గాంధీ గారు గీతలోగల పండిత శ్లోకములను ఆయన తన ఆత్మలో జీర్ణముచేసు కొన్నారు

**విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః ॥**

వేదార్థ పరిజ్ఞానముతోడను, వినయముతోడను కూడుకొనిన బ్రాహ్మ ణునియందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్క మాంసమును దిను శ్వపచునియందును సమదృష్టిగవారు పండితులగుదురు (జ్ఞానులు) అని శ్రీకృష్ణవచనము ఆలాగున

**యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః ।**
**జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః ॥**

ఎవనియొక్క కార్యారంభములు కామము (స్వార్థము) యొక్క ఉద్దేశ్యముతో విడువబడినవో, అట్టి వానిని ఆత్మబోధము గలవారు పండి తునిగాను, జ్ఞానమనెడు అగ్నిచే దహింపబడిన కర్మలు గలవానినిగాను చెప్పు దురు ఈ రెండు శ్లోకములు పండిత లక్షణమును గురించి శ్రీకృష్ణ భగ వానుడు గీతలో స్వయముగా వ్యాఖ్యానించినాడు పండితస్వరూపమును గురించి యీ రెండు శ్లోకములు మాత్రమే గీతలో గలవు ఈ భావమును

గాంధీగారు తనయాత్మలో ఐక్యము జేసుకొన్నారు ఈ 'విద్యా వినయ సంపన్నే' అను శ్లోకమునకు సంస్కృతము మాత్రము చదువుకొని ఆత్మ సంస్కరణము లేని పండితుల నడిగిన విద్యా వినయ సంపన్నుడగు బ్రాహ్మణుని నుండి శ్వపాకుని వరకు గల వారందరియందును ఒక్కే ఆత్మయే గలదని అర్థమును వచింతురు అందరిలోను ఒక్కే యాత్మయైన తనలోనూ అదే యాత్మగదా యుండును అట్లైన తన అవయవములవలె అందరి శరీరములను జూచినప్పుడే అవి నిజార్థమగును ఇట్టి గుణము గాంధీగారి యందు మూర్తీభవించి యున్నది కావుననే ఆయనయే నిజమగు పండితుడగును మరియు 'జ్ఞానాగ్ని దగ్ధకర్మాణ' మనునదిన్నీ వారికే తగును తపస్సును గురించి చూచిన వారికే అది సరిపోవును వారు ఎటువంటి నియమము గలవారు! ఒక్కొక్కసారి 21 రోజులు నిరాహారులై యుండిన విషయము అందరికిన్నీ తెలిసినదే ఆలాగున ఎన్నియోసారులు ఉపవాసము లొనర్చిరి

మఱియు మనవారు ఉపన్యాసవేదికలపై నుండి ఓ సోదరీ సోదరులారా! అని గంభీరముగా నుద్ఘోషింతురు వారి సోదరీ సోదరత్వము నకు ఉపన్యాసవేదికనుండి క్రిందకు దిగువరకే ప్రాణముండును దీని కల్పాయుస్సేగాని పూర్ణాయుస్సు లేదు గాంధీగారట్లుగాక తన జీవితాంతము వరకు సర్వులను సోదరీసోదరభావముతో ఆచరణలో చూపిరి కావున అట్లు చేయుటకు సాహసించనివారు సభ్యులారా! అని సంబోధించుటయే మంచిది అట్లు గాకపోయిన మనోవాక్కాయ క్రియల కేకత్వముండదు త్రికరణశుద్ధి యెపుడు లేదో యది బూటకప్రవర్తనము, ధూర్త లక్షణమనియే శాస్త్రము చెప్పును అందువలననే

> మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనః ।
> మనస్యన్యద్వచస్యన్యత్కర్మణ్యన్యద్దురాత్మనః ॥

అని శాస్త్రము నిర్ణయించినది

మఱియొక్క రహస్యము వేదాన్తము గాంధీగారికి తెలయదనియు, వారికి "సోఽహం"భావన లేదనియు కొందరు వేదాంతులమని చెప్పుచు తిరుగువారు బలుకుదురు అయితే అట్లు వచించువారు "సోఽహం" భావనకు ఈలాగున అర్థము తెలుపుదురు అదేమన "సోహం"అను పదములో "సః" అనియు "అహం"అనియు రెండు పదములు గలవు దాని యర్థము "సః" ఈశ్వరుడు, "అహం"నేను అనగా ఆ యీశ్వరుడే నేనే అని వారి భావార్థము ఇది ఒక్క విధముగా నుండునుగాక! దానికి మరియొక్క యర్థము గాంధీ గారు తన యాత్మలో కల్పించిరి అదేమన - సః = వాడు, అహం = నేను, మన యెదుట కనిపించెడు ఆ మానువుడున్నూ, నేనున్నూ ఒక్కటేగాని భిన్నులు గారని యర్థము అనగా నీవలెనే యితరుని గూడ చూడుము దీనినే మరియొక విధముగా చెప్పునప్పుడు "హంసోహం" అని కూడ కొందరు జపింతురు దీనికిన్నీ పైజెప్పిన విధముగానే యర్థమగును

అప్పుడు నేనే వాడు, వాడే నేను, నేనే యీశ్వరుడు ఈశ్వరుడే నేను అనునది వేదాంతుల యర్థము గాంధీగారు నేను వాడు, వాడే నేను అనగా నావలెనే ఆ మానవుడున్నూ, ఆ మానవుని వలె నేనున్ను అను అర్థమునే యా మహాపురుషుండు భావన జేసుకొన్నారు స్వపరభేదములను పాటింపక తనవలెనే యితరుని గూడ జూచుకొన్నారు ఇట్టి యర్థమునే ఆ దివ్యపురుషుడు అవగాహనము జేసికొనక పోయిన సోఽహం భావనకు అర్థము వ్యాఖ్యానించెడు ఏ మహాభాష్యకర్తలనుగాని, జగద్గురు పీఠాధిపతులనుగాని, మండలేశ్వరులనుగాని, ఆయన ఆశ్రయించి వారివద్ద వేదాంతార్థమును శ్రవణముచేసియుండును కృష్ణభగవానుడు చెప్పిన వాక్యములోనే ఆయనకు నమ్మకము గలిగియుండెను

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥**

అను భగవద్వాక్యమునే ఆయన విశ్వసించెను దీనియర్థముపైన నిరూ

పించడమైనది ఆయనకు ప్రస్తుత కాలపు వేదాంతులు జెప్పెడు సోహం భావన వ్యాఖ్యానమందు నమ్మకము లేదు సోహం భావన వేదాంతము యొక్క పరమకాష్ఠయైనను, శైవమతస్థుల అహంగ్రహోపాసనయే యగును అయినను నిజముగా తనవలెనే ఇతరుని, యితరుని వలెనే తనను చూచే యవస్థయే సత్యమైనదని ఆయనకు గోచరించుట వలననే, తనవలెనే యితరులను చూచి యితరుల క్షేమము కొరకు యత్నించెడు లోకసేవకులను, పరోపకార పారాయణులను, స్వార్థ త్యాగులను ఆయన ప్రేమించుటకున్నూ అట్టివారి దగ్గఱకు వెళ్ళుటకున్ను కారణమని లోకము తెలుసుకొనుగాక!

సోఽహం భావన చేయు సన్న్యాసులతోగాని, గురువులతోగాని ఆయన చేరకపోవుటకు మఱియొక కారణము గలదు అదేమన జీవుడే శివుడు, శివుడే జీవుడు అని యర్థము అట్టి వారికి అనుభవము గలిగిన లేక సిద్ధించిన శివుడు వలె అనగా దేవునివలెనే యట్టి వారుండవలయును అట్టి యనుభవము గల వారిని వారు చాల మందిని వెదకిరిగాని కనుపించలేదు దేవుడైనచో, నేలా గున సర్వజీవరాసులలోను ఏకరూపముగా నుంటున్నాడో యాలాగున నట్టి వారున్ను ఉండవలసి యుందురు అట్లు కానుపించని కారణము చేతనే ఎవరైన గాంధీగారిని మీకు గురువు గలడా యని అడిగినచో గురువుకొరకు వెదుకుచున్నానని ఆయన సమాధాన మిచ్చిరి అయితే ఆయన ఎవరినీ దూషించలేదు సోఽహం భావనయొక్క యర్థము పైజెప్పిన విధముగా నుండునని తనలో తాను నిశ్చయించుకొని తన కార్యమును తాను చేయుచుండెను ఈశ్వరాదేశము ప్రకారము ఆత్మవంచనలేక తన కార్యము తాను నిర్వహించుకొని కృతార్థుడాయెను "తత్త్వమసి" కీ యర్థ మునే ఆయన నిశ్చయించుకొన్నారు

"తత్, త్వం అసి"అనుదానిలో మూడు పదములు గలవు "తత్" తత్పదవాచ్యుడగు నీశ్వరుండు, "త్వం" త్వంపదవాచ్యుడగు జీవుడు, "అసి" అయితివి అనగా ఐక్యమును ప్రతిపాదించునని లక్ష్యార్థమగును బ్రహ్మము

నకున్నూ ప్రత్యగాత్మకున్నూ ఐక్యము గలుగుచున్నదని వేదాంతుల యర్థము గాంధీగారి యర్థమట్లుగాదు "తత్" వానియందును, అనగా మీ యెదుట గనుపించెడు మానవునియందుగల దైవ చైతన్యమున్నూ, త్వంపదార్థమగు మీయందుగల జీవచైతన్యమున్నూ ఒకటియేగాని భిన్నము గాదు. అవి పదము ఐక్యమును బోధించుచున్నది అనగా మీయందు గల యాత్మయు మీబోటి ఇతర మానవునియందుగల యాత్మయు నొకటేగాని రెండుగాదని అర్థమును అనుష్ఠించిన కారణముచేతనే ఆయన మహాత్ముడాయెను వేదాంతులలో జీవబ్రహ్మల యేకత్వము కనుగొనువరకు అనుభవమునకు దెచ్చువరకు నింద్రియ నిగ్రహము గలిగి యనుష్ఠింపనందుచేతనే ఆత్మోద్ధారణము జేయ శక్తి లేకపోయినది స్వారాజ్యోద్ధారణ గావలసి యుండిన ఆత్మోద్ధారణము ముందుగా గలుగజేసుకొనవలయును అప్పుడే లోకోద్ధారకము గలుగును జీవేశ్వరుల యైక్యము జెప్పుకొనుచు జీవగుణ మును రహితమొనర్చక పోయినను, బ్రహ్మగుణముల నలవరచక పోయినను జీవబ్రహ్మల ఐక్యముజెప్పెడు భాష్యములను మాత్రము జదువు కొని బోధించుచు కాలము గడుపుచుండిన చీకటి గదిలో కూర్చుండి దీప వాక్యములు మాత్రము వల్లించుచుండు వాని గతివలెనుండునని, బురద నీటిని దెచ్చి చిల్లగింజ పేర్లు మాత్రము జపించుచు మంత్రమును ఉచ్చారణ జేయువానికన్న ఆధిక్యము ఏమాత్రమున్నూ పొందజాలరని లోకము గ్రహించుకొనుగాక! దీపము వెలిగించవలసియుండిన ప్రమిద, చమురు, వత్తి, గాలి లేనిస్థలము ముందుగా చూచుకొనవలయును తరువాత వెలిగించిన వెలుగుచే చీకటి పటాపంచలైపోవును ఈలాగున చిల్లిగింజ దెచ్చి అరగదీసిన గంధమును పంకిలజలమున గలిపిన బురద విరిగిపోయి నిర్మలోదకమగును అది పానయోగ్యముగా, ఆరోగ్య ప్రదముగాను నుండును అట్లుగాక పోయిన బురద నీటిని దెచ్చి కతకకాయ పేరు జెప్పి త్రాగిన యేగతి గలుగునో అట్టి స్థితియే గలుగునని మరువకుందురుగాక! కావుననే యుపనిషత్తీలాగున వర్ణించినవి

**అవిద్యాయామంతరే వర్తమానాః**
**స్వయం ధీరాః పండితంమన్యమానాః ।**
**దంద్రమ్యమాణాః పరియన్తి మూఢాః**
**అంధేనైవ నీయమానాయథాఽంధాః ॥**

అజ్ఞానముయొక్క నడుమ నుండు వారున్ను తమకు తామే పండితు లని తలంచువారున్ను, మాయామోహమందు దిక్కుదెలియక తిరుగు చుండు వారుననగు మూఢులు ఏగతిని పొందుదురనగా గ్రుడ్డివానివల్ల దారి చూపబడిన మరియొక గ్రుడ్డివాని దుర్గతి యెటువంటిదో అట్టి గతియే గలుగును

**అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే ।**
**ప్రతిబింబిత శాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్॥**

మూఢుడైనవాడు అనుభవములేక వ్యర్థముగా బ్రహ్మానందము బొంది నట్లు వాక్కుతో చెప్పుచు ఆనందము బొందినట్లు నటించుచుండును ఇదెటువంటిదన జలాశయ తీర్థమున చెట్లలో పండియుండు ఫలములు నీటిలో ప్రతిబింబించుచుండగా దానిని జూచి జలములో దిగి పండ్లను తీసు కొని తినుటకు యత్నించువానివలె నుండునని భావము అదెటువంటి వ్యామోహమో సరియైన యనుష్ఠానముచే బ్రహ్మానుభవమును బొందకయుం డువారి స్థితియు నీలాగున నుండునని ఉపనిషత్తుపదేశించుచున్నది

ఇదివరలో జెప్పినదానియొక్క సారమేమన పతనమైన స్వారాజ్య మును, ఆత్మరాజ్యమును, జ్ఞానమతమును, సనాతన మతమును, వేదమతమును, వేదాంతమును పునరుద్ధరించ దలంచువారు గాంధీగారు సోఽహం భావనకున్ను, తత్త్వమసికిన్ని ఏ యర్థమును గ్రహించుకొన్నారో అట్టి యర్థమునే గ్రహించుకొనవలయును గాంధీగారి జీవితము ఎంత సునిశ్చిత నియమములతో గూడినదో, యెంత సునిర్మలభావముతో గూడినదో, యెంత సుతీవ్రవ్రతముతో గూడినదో, యెంత సుదృఢ

సంకల్పముతో గూడినదో, యెంత పరిశ్రమతో సమన్వయమైనదో ఆలాగున తమ జీవితమును, మార్పు జేసుకొనవలయును ఏలన ఎవరు ఎట్టి ప్రయత్నముతో నెట్టి కార్యము సాధించిరో, ఆలాటి కార్యమును సాధించదలంచువారు గూడ అట్టి సాధనము వల్లనే దానిని సాధింపగలరు స్వరాజ్య స్వారాజ్యములకు పరస్పర సంబంధము గలదు కావుననే యీ విషయమై యిచట నింత గాఢముగా దెలుపడమైనది

**అకృత్వా శత్రుసహారమగత్వాఽఖిల భూశ్రియమ్ ।**
**రాజాహమితి శబ్దాన్నో రాజా భవితుమర్హతి ॥**

శత్రువులను నిశ్శేషముగ సంహరించి అఖిల భూమండలాధిపత్యము వహించిన వాడే రాజగునుగాని, నేను రాజును, నేను రాజును అని చెప్పినంత మాత్రమున రాజు కాజాలడు ఇది స్వరాజ్యమును గురించినది ఈలాగున స్వారాజ్యమును గురించినది గూడ వినుడు కామక్రోధాధి శత్రువర్గమును సంహరించి మనోరాజ్యమును జయించి ఆత్మారాముడై యుండువాడే స్వారాజ్యమును పొందగల్గును వాడే మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుడు కాగలడు

**తీర్త్వా మోహార్ణవం హత్వా రాగద్వేషాది రాక్షసాన్ ।**
**యోగీ శాంతి సమాయుక్త ఆత్మారామో విరాజతే ॥**

రాముడు సముద్రమును దాటి రాక్షసుల జంపి సీతను బొందినవాడై తిరిగి అయోధ్యకు వచ్చి రాజ్య పట్టాభిషిక్తుడై ప్రకాశించినట్లు, స్వారాజ్య పట్టాభిషిక్తుడు గాదలంచువాడు అనుష్ఠానమనెడు వంతెనచేత మాయా మోహమను సముద్రమును దాటి కామక్రోధాది స్వారాజ్య ప్రతిరోధులగు రాక్షసులను నశింపజేసి ఉపరతియను శాంతిని పొందినవాడై నిత్యానంద స్వరూపిగా ప్రకాశించుచుండవలయును

**సర్వేఽత్ర సుఖినస్సన్తు సర్వే సన్తు నిరామయాః ।**
**సర్వే భద్రాణి పశ్యన్తు మాకశ్చిద్దుఃఖమాప్నుయాత్ ॥**



# భుక్తి

ఇప్పుడు వ్రాయంబూనిన యీ వ్యాసములో భుక్తిని గురించి మాత్రము తెలుపంబూనడమైనది అయితే ఇది సాత్త్విక, రాజస, తామసాహారములను గురించి వ్రాయంబూననది కాదు అట్టి సాత్త్విక రాజస తామసాహారములను గురించి ఇది వరలో వ్రాయంబడిన గ్రంధములలో అచ్చటచ్చట విస్తారముగా తెలుపబడియే యున్నది ఇదట్టిది కాదు బ్రహ్మనిష్ఠులు ఇతరులపై ఆధారపడక ఎటుల జీవించి మోక్షమును పొందవచ్చునో, అను విషయమై మాత్రము నిరూపించవలసియున్నది అది సాధ్యమగునా? లేదా? అను విషయమును గ్రహించుట మాత్రమే ఈవ్యాసముచే గలిగెడు ప్రయోజనము

శాస్త్రములలో భుక్తి, ముక్తులు అను ప్రయోగమే కానుపించుచున్నది కాని ముక్తి భక్తులు అను ప్రయోగము లేదు కావున దీనిని బట్టి యోచించిన దీనియందేదో యొక రహస్యము గలదు సామాన్యముగా యోచించిన భుక్తిని ముందుగా సంపాదించేలాగున యోచించుకొనిన తర్వాత, ముక్తి కొరకాలోచించుకొన వచ్చుననియే అర్థమగుచున్నది వ్యాకరణ వార్తిక మిట్లు గలదు "లోకతః అర్థప్రయుక్తే శబ్ద ప్రయోగే శాస్త్రేణ ధర్మనియమః = లోకమువలన, అర్థముచే ప్రయుక్తమగు శబ్దప్రయోగమందు శాస్త్రము వలన ధర్మ నియమము తెలియదగినది" వ్యాకరణవార్తికమ్ 'సిద్ధే శబ్దార్థసంబన్ధే' శబ్దార్థ సంబంధము సిద్ధించగా, సిద్ధ రూపము సిద్ధముగనే ప్రయోగించవలయును

అయితే ఈ విషయమై గొప్ప ప్రజ్ఞావంతులకు గూడ ఒక్క గొప్ప సందేహము గలుగవచ్చును అదేమనగా ముక్తి గొప్పదిగా నుండగా భుక్తి యెటుల గొప్పదగును? లోకము తలంచినటుల అదియున్ను గొప్ప సంగతియే అయినను ఫలమే ముఖ్యమైనను వృక్షమును పోషింపక ఫలమెటుల సిద్ధించదో, ఆలాగున దీపముచే అన్ధకారము నశించునది, సత్యమైనను, తైలములేనిచో దీపమెటుల ఉండజాలదో, ఆలాగున భుక్తి లేనిచో ముక్తి గలుగదనియే గ్రహించుకొనవలయును "ఫలస్య కారణం పుష్పం"

ఫలమునకు పుష్పము కారణము పుష్పమునకు వృక్షము కారణము ఆలాటి ధర్మముల ననుసరించియే భుక్తి ముక్తుల ప్రయోగమును గూడ తెలియవలెను మఱియు "పలాలమివ ధాన్యార్థీ" ధాన్యమునకు పైరు ఎటుల కారణమో, పైరును సంరక్షింపకపోయిన ధాన్యమెటులలభించదో, ఆలాగుననే ముక్తిఫలమే దుఃఖశాన్తిని, ఆనందప్రాప్తిని గలుగజేయునదయినను భుక్తి లేనిచో ముక్త్యుపాయమును సంపాదింపజాలరు అన్నము, పండ్లు భుజించిన మాత్రమే ఆకలి శాంతియు, ఆనందప్రాప్తియు గలుగునది సత్యమైనను, అన్నము పండ్లు వీటి కొరకు పైరు వృక్షములను సంరక్షించక పోయిన నెటుల సిద్ధించదో, ఆలాగున నుంటున్నది ఈలాటి ప్రయోగములలో కారణము నకు ముఖ్యత్వమున్ను, కార్యమునకు గౌణత్వమున్ను యోచించదగినది

దీపతైలాదులు నిటులనే యని నిశ్చయించదగినవి అయితే ఈ విషయమై గొప్ప ప్రజ్ఞావంతులకు గూడ నొక సందేహము గలుగవచ్చును అదేమన భుక్తిని సంపాదించుకొని ముక్తిని సంపాదించుటకు సాధ్యమగునా? అనునదియే సందేహము ఇది కొంచెము క్లిష్టసమస్యయేగాని సామాన్యమయి నది కాదు కావుననే విద్యావంతులలో కొందఱున్ను, ప్రజ్ఞావంతులలో కొంద ఱున్ను సర్వసంగపరిత్యాగులై విరాగులై గృహము వదలి పోవుచున్నారు అయితే అట్టి ప్రజ్ఞావంతులయొక్కయు విద్యావంతుల యొక్కయు త్యాగ మునకున్ను వైరాగ్యమునకున్ను ఇప్పుడుండు చాలా మంది వైరాగ్యమున కున్ను తిల పర్వతభేదము గలదు ఒకవేళ నిజమైన వైరాగ్యము గలిగి గృహ త్యాగము జేసివచ్చిన విరక్తులు ఇప్పుడు సంచరించుచుండు యాచకులవలె గాని, ద్రిమ్మరులవలెగాని, కేవల ముదర నిమిత్తము తిరుగుచుండు వారి వలెగాని యుండక, విలక్షణముగానే వారు ప్రవర్తన గలిగి యుందురు సామాన్యముగా అట్టివారలు ఎచ్చోటనైన ఏకాంతమున తపమొనరించుచు ఏకాలమున విధిననుసరించి యేదిదొరికిన దానివలన కాలముగడుపు వారు గానే యుందురు. ఇది యుత్తమపక్షము అట్లుకానిచో మంచి మధ్యాహ్నము వరకు బ్రహ్మనిష్ఠలోనుండి ఆకలి బాధించునప్పుడు మాత్రము బైటకు వచ్చి

ఆ సమయమున నేది దొరికిన అనగా ఎవరేదిచ్చినను దానివలన తృప్తి నొంది మరల తపఃస్థలమునకు వెళ్లి ధ్యాననిష్ఠ సమాధిలోనే యుందురు ఇది మధ్యమ పక్షము వీరున్ను ఒకపూట మాత్రమే భుజింతురు అట్టి వారిని ఎవరున్ను పవిత్ర భావముతో సత్కరింతురు అట్టివారికి త్వరలోనే తాముండు స్థలమునకు ఆహారమెవరైనను తెచ్చిపెట్టుదురు అటుల వైరాగ్యము లేనివారు తన జీవనమునకు మాత్రము ఏదైన పాపములేని పనిని జేసికొని జీవించుచు తపమొనరించుటయే చక్కని మార్గమని యీ వ్యాసము యొక్క ఉద్దేశము

అందరున్ను జీవనోపాయమగు పనినిచేసి తపోధ్యానాదులు చేయవలయునని తలంచవలదు దైవానుగ్రహముచే పూర్వపుణ్యము వలన జీవనము గడుపుటకు ధనముండిన దానివలన జీవింపవచ్చును ఈలాగున ధనముండియు గొందరు ఆ ధనమును ధర్మకార్యములోగాని, పుణ్య విషయములోగాని వినియోగపరచక భార్యలపై, పుత్రులపై, పుత్రికాది దేహ బంధువులపైగాని వ్రాసిపెట్టుకొని టిక్కెట్టులేక రైలులో ప్రయాణము జేయుట ఇతరుల యాచించి జీవితమును గడుపుట మాత్రము కడుంగడు శోచనీయమైనది ఇదియున్ను ఒకవిధమగు మోసకృత్యమనియే తలంచవలయును ఇట్టి స్థితిలో నుండువారు పైజెప్పిన ఉత్తమ మధ్యమాధికారులవలె జీవించిన సరిలేక తన జీవనమునకు తగిన పాపము లేని పనిని జేసుకొని జీవించుటయే పవిత్రమార్గము ఇట్టివారు చేయు తపస్సులలో చాలా భాగమున్ను అన్నదాతలకు జెందును ఇట్టి సంకుచిత బుద్ధిగల వారు ఎప్పటికిన్ని యున్నత స్థితిలోనికి రాజాలరు ఏలన "యా మతిస్సా గతిర్భవేత్" మతి యెంతో గతి యంతే

మరియొక్క మార్గము గూడ గలదు ఇది నవీనమని తలంచవలదు పురాతనమైనదే ఇది చాల పవిత్రమైనదేగాక శ్రుతిసారమగును అదేమన పూర్వజన్మపుణ్య సుకృతవిశేషముచే సర్వేశ్వరుండు జీవనోపాయమునకు తగిన ధనము ఇచ్చియుండినచో ఆ ధనమును తనకున్ను, తనకు సంబం

ధించిన భాగస్థులకున్ను ధర్మబుద్ధితో విభాగమొనర్చి తనభాగము తన జీవనము కొరకు వినియోగపరచుకొనుట చాల శ్రేష్ఠమైన మార్గమగును తీర్థయాత్రలు వెళ్ళునప్పుడుగాని ఇతర పుణ్యాశ్రమములలో, పుణ్యతీర్థము లలో, పుణ్యక్షేత్రములలో కొంతకాల ముండదలంచిన అచటగూడ తన స్వంతసొమ్మును వాడుకొనవచ్చును తన అవసరమునకు తనకు సకాల మున దానిని తనకు అందచేయుటకు తగిన విశ్వాసపాత్రులపై ఆ ధనము గాని ఇతర స్థిర వస్తువులుగాని యుండిన ఉంచుకొనవచ్చును తన జీవనమున కన్న మిగిలియుండినచో ఒక్కరినిగాని, ఇద్దరినిగాని, నలుగురిని గానీ, వీనికన్న అధికముగాని ఆదాయముండిన సాధువులనుగాని, విరక్తు లనుగాని, బ్రహ్మనిష్ఠులనుగాని, విద్యార్థులనుగాని పోషించుకొనవచ్చును లేక తాను ప్రత్యేకమొక్క ఆశ్రమమును నిర్మించి శక్త్యనుసారము పై జెప్పిన వారలను అచ్చటనే యుంచి పోషింపవచ్చును తానెచ్చటకు పోదలంచిన ఒక్కరినిగాని, ఇద్దరినిగాని అవసరముండునని తోచిన కూడ తీసుకొని వెళ్ళ వచ్చును ఈ కాలమునకు ఈ పద్ధతి చాల నిపుణతరమైనది

అట్టి ఆహారముగూడ ఎంత తగ్గించిన అంత ప్రపంచములో పని తగ్గిపోవును అదియు వారాలోచించుకొనవలయును తనయొక్క తపోధ్యానా దులకు ఎంతమాత్రము కావలయునో అంతటితో తృప్తిని పొందవలయును అంతమాత్రము లేనిచో తపోధ్యానాదులకు శరీరమనుకూలపడదు ఇట్టివారు ఎక్కువ కాలము ఆలాగున శ్రమ పడనవసరము లేదు. భగవంతుడు కరుణాస్వరూపుడగుటచే ఏ పుణ్యాత్ముల హృదయములోనైనా ప్రేరణచేసి ఈ తపోనిష్ఠునకు అనుకూలమగు పరిస్థితిని ఏర్పాటు జేయగలడు అప్పుడుగూడ ఆ తాపసి జాగరూకుడై యుండవలయును లేనిచో "కౌపీన సంరక్షణార్థమయం పటాటోపః" అను దుస్థితి కలుగనీయక చూడవల యును అయితే ఋషులందరు సర్వసంగ పరిత్యాగులై యుండి గదా వనమున తపమొనరించి మోక్షమునొందిరని తలంతురేమో అది ఈ యాచన జీవితము వంటిది కాదు అది చాలా పవిత్రమైనది పరాధీనము

కానట్టిదని విచారణ శీలురెఱుంగ గలరు అట్టి మునులు స్వతంత్ర జీవులు, ధీరులు, సంయములు కావుననే వారు వనములో దొరికిన కందపక్వ ఫల మూలాదులను స్వయముగా సంపాదించి జీవితమును గడుపుచు తప మొనరించు చుండిరి

అయితే అట్టి వానప్రస్థులకు తాపసులకు గోధనము మాత్రము బాగుగానుండెను ఆ గోవులు అరణ్యములో స్వేచ్ఛగా మేయుచు దండిగా పాలిచ్చుచుండెను అయినను అట్టి ఆశ్రమములు గూడ ఎక్కువగా నుండలేదు ఎక్కువ మంది మునులున్ను వనములో దొరికెడు కందపక్వ ఫలమూలాదులను మాత్రమే భుజించుచు తపోధ్యానాధ్యయనాదుల నొనరించుచుండిరి అయితే అట్టి కాలమునకున్ను ప్రస్తుత కాలమునకున్ను చాలా మార్పు గలిగినది ఇప్పుడు పూర్వీక ఋషుల కాలమువలె వనమున కందపక్వ ఫలమూలాదులు దొరకు స్థలమరుదు అనియే చెప్పవలయును! లేదనియే చెప్పవచ్చును కావున పైజెప్పిన ప్రకారము విరాగులై ఏకాంతమున జేరి తపమొనరించెడు స్థలమున నెవరైనా కొనియిచ్చు దానితో తృప్తి పొందు స్థితి గలుగువరకున్ను, లేక మధ్యాహ్నము వరకు ధ్యాననిష్ఠ తపస్సులలో నుండి క్షుద్బాధ సహింపరాని స్థితిలో గ్రామమునకు వచ్చి భిక్షాటనము చేసికాని, లేక యెవరైనా యేది యిచ్చినను దానివలన తృప్తి నొందెడు స్థితి గలుగువరకు భుక్తికి తగిన పాపములేని పని జేసి తపోధ్యానాదులు జేయుటయే సరియగుమార్గము అట్లు చేయకపోవుటే సాధువులపై, సన్న్యాసులపై, భక్తులపై జనులకు విశ్వాసము లేకపోవుటకున్ను ఆదరణ లేకపోవుటకున్ను, హాస్యమునకు పాత్రులగుటయు జరుగుచున్నది దీనివలననే బ్రహ్మ విద్యయందు జనులకు విశ్వాసము లేకపోవుచున్నది

అయితే ఎంతకెంతకు ఇన్ద్రియ సుఖములను తగ్గించుకొనిన అంత కంతకు ఆత్మసుఖము గలుగును ప్రపంచములో గల సంబంధమున్ను తొలగిపోవును సుఖమెక్కువ కావలసియుండిన ప్రపంచముతో సంబంధ మున్ను ఎక్కువగా తప్పక గలుగును అట్టి ప్రపంచ సంబన్ధ మతిశయించిన

తీవ్ర బ్రహ్మనిష్ఠలో కొరత గలుగును ఇదియు నిశ్చయము

అయితే ప్రారంభదశలో మాత్రమే ఇంత జాగ్రత్త వహించవలసి యుండును అప్పుడు మాత్రము అంత శ్రమపడిన చాలును అదియున్ను చూచు వారికి శ్రమగా తోచవలసినదేకాని, తనకు మాత్రము పరమానందముగా నుండవలయును అదే మనస్సు ఆత్మలో, దైవములో లీనమొందిన దానికి గురుతు అదే యుపరతిని జెందిన దాని చిహ్నము తరువాత భక్తులు తెచ్చి యిచ్చెడు పదార్థములలో జాగ్రత్త వహించనిచో తపస్సు తమస్సుగా మారును యోగము భోగరూపమై పరిణమించును పతనము గూడ గలుగ వచ్చును ఇది యెల్లప్పుడున్ను మరువరాని మహా మంత్రము చాలా మంది విరక్తులు కష్టకాలమును వైరాగ్యబలముతో సుఖముగా దాటిపోయిరి కాని సౌఖ్య భోగములు వచ్చినప్పుడు చిన్నగా జారిపోయిరి అట్టి వారిని చేతివ్రేళ్ళపై లెక్కపెట్టిన మిగిలియే యుందురు మీ దృష్టిలోనే అట్టి దుస్థితి గలిగిన వారిని చాలా మందిని కనుగొనగలరు

యోగమునకును, భోగమునకును సంబంధము లేదు అవి పరస్పర విరుద్ధమార్గములు అవి యుత్తర దక్షిణ మార్గములని మరువకూడదు ఉత్తర మార్గము శివలోకమునకున్ను, దక్షిణమార్గము యమలోకమునకున్ను వెళ్లు చుండుననియే మన పూర్విక ఋషులు తెలిపిరి కావుననే హృషీకేశము, హరిద్వారము, ఉత్తర దిక్కున నేర్పడుటకును, ఉత్తరముఖముగా కూర్చుండి ధ్యానించుదురు కావుననే శ్రీశంకరాచార్యులిటుల తెల్పిరి

**ఆజీవితం త్రయస్సేవ్యాః వేదాంతో గురురీశ్వరః ।**
**ఆదౌ జ్ఞానాప్తయే పశ్చాత్ కృతఘ్నత్వనివృత్తయే ॥**

జీవన్ముక్తుడైనను జీవించియుండువరకు గురుదేవు డుపదేశించిన యనుష్ఠానమున్ను, వేదాంత శాస్త్ర విచారణయు, ఈశ్వరునియందు భక్తియు వీటిని విడువరాదు ఏలననగా మొదట ఈ గురువేదాంతేశ్వరుల యను గ్రహమువలననే జ్ఞానప్రాప్తిగలిగెను అందువలన పైజెప్పిన మూడింటిలోను

కృతజ్ఞత గలిగియుండవలయును లేనిచో కృతఘ్నుడై పోవును కృతఘ్నతా బుద్ధి పాపజీవికే కలుగును పుణ్యాజీవి యెల్లప్పుడును కృతజ్ఞతాబుద్ధి గలిగి యుండును ఈ సత్యమునంతయు నెఱింగియే వాసిష్ఠమున శ్రీ వసిష్ఠు లీలాగున సెలవిచ్చిరి

**అత్రాహారార్థం కర్మ కుర్యాదనిన్ద్యం**
**కుర్యాదాహారం ప్రాణసంధారణార్థమ్ ।**
**ప్రాణాస్సంధార్యా స్తత్త్వ సంపాదనార్థం**
**తత్త్వం సంపాద్యం యేన భూయోన జన్మ ॥**

విరక్తుడై ఆహారము సంపాదించి యెటుల బ్రహ్మనిష్ఠ చేయవలయునో అది ఈ శ్లోకమున తెలుపడమైనది ఈ లోకమున ఆహారముకొరకు పాపము లేని పనిని జేయుట ధర్మము ప్రాణము నిలిచి తన యనుష్ఠానము జేయుట కెంత ఆహారము కావలయునో, అంతటితో పూర్తి చేయవల యును ప్రాణ సంధారణ యేల చేయవలయుననగా తత్త్వజ్ఞాన సంపాదన కొరకే తత్త్వజ్ఞానమేల సంపాదించవలయుననగా మరల జననము గలుగని మోక్షముకొరకే యనియు మరువకూడదు పూర్వకాలపు యోగులు తపోవంతులు ఈలాగుననే జీవించిరి

**మితాశనో భవేన్నిత్యం భిక్షుర్మోక్ష పరాయణః ।**
**కామదర్పాదయో దోషాః న భవన్తి మితాశినః ॥**

బ్రహ్మనిష్ఠ కనుకూలమగు మితమగు నాహారమునే మోక్షాపేక్ష గల ముముక్షువు భుజించవలయును. అట్టి మితాహార స్వభావము గలవానికి కామ, క్రోధ, లోభ, మోహ, దర్పాది దోషములు గలుగవు

**హితం మితం సదాఽశ్నీయాత్ యత్సుఖేనైవ జీర్యతే ।**
**ధాతుః ప్రకుప్యతే యేన తదన్నం వర్జయేద్యతిః ॥**

సులభముగా నేది జీర్ణమగునో, అట్టి ఆహారమును (హితమైనదిన్ని,

మితమైనదిన్ని) ఎల్లప్పుడు బ్రహ్మనిష్ఠుడు భుజింపవలయును ధాతు ప్రకోపము, కామప్రేరణము ఏ యాహారముచే గలుగునో, అట్టి ఆహారమును విరక్తుడు వదలవలయును

**ఆత్మ సమ్మితమాహారమాహరేదాత్మవాన్యతిః ।**
**అత్యన్తక్షుధితస్యాపి సమాధిర్నైవ జాయతే ॥**

ఆత్మనిష్ఠాపరుడు మిక్కిలి మితమగు నాహారమును మాత్రమే స్వీకరించవలయును ఎక్కువగా తినువానికిన్ని మిక్కిలి క్షుద్బాధగలవానికిన్ని సమాధి నిష్ఠయందు మనస్సు నిలువజాలదు ప్రశ్నోత్తరమణిరత్నమాల యందు శ్రీ శంకరులు బ్రహ్మనిష్ఠుల యొక్క జీవనముగూర్చి తెలిపినది చూడుడు

"కిం జీవనం? దోషవివర్జితం యత్"

ప్రశ్న - జీవనమెట్టిదిగా నుండవలయును?

ఉత్తరము - దోష రహితమైన జీవనమే సరియయినది

"జీవన్ మృతః కస్తు? నిరుద్యమో యః"

ప్రశ్న - బ్రతికియుండియు చచ్చినవాడెవడు?

ఉత్తరము -బ్రతికి యుండియు తన జీవనోపాయమునకు ప్రయత్నిం చని వాడెవడో వాడే ఈ విషయమై గీతాచార్యుడగు శ్రీకృష్ణభగవానులు నిష్కామకర్మయోగమున కాధిక్యమిచ్చుటకున్ను ఇదియే కారణము

**నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వ పరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥**

దేనియందును ఆశలేనివాడు, చిత్తమును దేహమును వాక్కును స్వాధీనములో, నుంచుకొన్నవాడును, సర్వవిధములుగా పరవస్తుపరిగ్రహము జేయనివాడును, శరీరముమాత్రము నిలుచుటకు తగిన నిషిద్ధముకాని పనిని

కృతజ్ఞత గలిగియుండవలయును లేనిచో కృతఘ్నుడై పోవును కృతఘ్నతా బుద్ధి పాపజీవికే కలుగును పుణ్యజీవి యెల్లప్పుడును కృతజ్ఞతాబుద్ధి గలిగి యుండును ఈ సత్యమునంతయు నెఱింగియే వాసిష్ఠమున శ్రీ వసిష్ఠ లీలాగున సెలవిచ్చిరి

**అత్రాహారార్థం కర్మ కుర్యాదనిన్ద్యం**
**కుర్యాదాహారం ప్రాణసంధారణార్థమ్ ।**
**ప్రాణాస్సంధార్యా స్తత్త్వ సంపాదనార్థం**
**తత్త్వం సంపాద్యం యేన భూయోన జన్మ ॥**

విరక్తుడై ఆహారము సంపాదించి యెటుల బ్రహ్మనిష్ఠ చేయవలయునో అది ఈ శ్లోకమున తెలుపడమైనది ఈ లోకమున ఆహారముకొరకు పాపము లేని పనిని జేయుట ధర్మము ప్రాణము నిలిచి తన యనుష్ఠానము జేయుట కెంత ఆహారము కావలయునో, అంతటితో పూర్తి చేయవల యును ప్రాణ సంధారణ యేల చేయవలయుననగా తత్త్వజ్ఞాన సంపాదన కొరకే తత్త్వజ్ఞానమేల సంపాదించవలయుననగా మరల జననము గలుగని మోక్షముకొరకే యనియు మరువకూడదు పూర్వకాలపు యోగులు తపోవంతులు ఈలాగుననే జీవించిరి

**మితాశనో భవేన్నిత్యం భిక్షుర్మోక్ష పరాయణః ।**
**కామదర్పాదయో దోషాః న భవన్తి మితాశినః ॥**

బ్రహ్మనిష్ఠ కనుకూలమగు మితమగు నాహారమునే మోక్షాపేక్ష గల ముముక్షువు భుజించవలయును. అట్టి మితాహార స్వభావము గలవానికి కామ, క్రోధ, లోభ, మోహ, దర్పాది దోషములు గలుగవు

**హితం మితం సదాఽశ్నీయాత్ యత్సుఖేనైవ జీర్యతే ।**
**ధాతుః ప్రకుప్యతే యేన తదన్నం వర్జయేద్యతిః ॥**

సులభముగా నేది జీర్ణమగునో, అట్టి ఆహారమును (హితమైనదిన్ని,

స్వర్గమును గలుగజేయనిదియును, అపకీర్తికి కారణమైన ఈ శోకరూపమగు పిరికితనమును నీకెటుల కలిగెను?

క్లైబ్యం మా స్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప! ॥

ఓ అర్జునా! నీవు అధైర్యమును పొందకుము నీవధైర్యమును పొందుట తగదు ఓ పరంతపా! హీనమైన ఈ అధైర్యమును విడిచి పెట్టిలెమ్ము ఇచట క్లైబ్యశబ్దమును ప్రయోగించుటకు కారణమేమనగా పిరికి తనముగల స్త్రీని గాని పురుషునిగాని నపుంసకుని స్వభావమని పరిహాసముగా చెప్పడమైనది అర్జునునిది స్వరాజ్యము గురించి యైనను అంతరార్థమున స్వారాజ్యమును గురించినదిగా ముముక్షువులు గ్రహించుకొనవలయును బాహ్య శత్రువులను జయించి రాజ్యపట్టాభిషిక్తు డగుటకు అర్జునుడున్ను, ఆంతరిక మోక్షప్రతి బంధ శత్రువులను జయించి ఆత్మరాజ్య పట్టాభిషిక్తులగుటకు ముముక్షువులున్ను గ్రహించుకొనవలయును

స్వే స్వేకర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మ నిరతస్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥

మనుజుడు తన తన కర్మయందు ఆసక్తుడై ఆచరించుటవలన యుత్తమ సిద్ధిని పొందుచున్నాడు తన కేర్పడిన కర్మయందు ప్రవర్తించువాడు ఏ ప్రకారము సిద్ధిని పొందుచున్నాడో దానిని వినుమా!

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥

ఎవనివలన సమస్త భూతములకు ప్రవృత్తి గలుగుచున్నదో, ఎవనిచేత ఈ సమస్త ప్రపంచము వ్యాపింపబడియున్నదో అట్టి ఈశ్వరుని మనుజుడు స్వకర్మచే నారాధించి ఉత్తమ సిద్ధిని పొందుచున్నాడు

కృతజ్ఞత గలిగియుండవలయును లేనిచో కృతఘ్నుడై పోవును కృతఘ్నతా బుద్ధి పాపజీవికే కలుగును పుణ్యజీవి యెల్లప్పుడును కృతజ్ఞతాబుద్ధి గలిగి యుండును ఈ సత్యమునంతయు నెఱింగియే వాసిష్ఠమున శ్రీ వసిష్ఠు లీలాగున సెలవిచ్చిరి

**అత్రాహారార్థం కర్మ కుర్యాదనిన్ద్యం**
**కుర్యాదాహారం ప్రాణసంధారణార్థమ్।**
**ప్రాణాస్సంధార్యా స్తత్త్వ సంపాదనార్థం**
**తత్త్వం సంపాద్యం యేన భూయోన జన్మ ॥**

విరక్తుడై ఆహారము సంపాదించి యెటుల బ్రహ్మనిష్ఠ చేయవలయునో అది ఈ శ్లోకమున తెలుపడమైనది ఈ లోకమున ఆహారముకొఱకు పాపము లేని పనిని జేయుట ధర్మము ప్రాణము నిలిచి తన యనుష్ఠానము జేయుట కెంత ఆహారము కావలయునో, అంతటితో పూర్తి చేయవల యును ప్రాణ సంధారణ యేల చేయవలయుననగా తత్త్వజ్ఞాన సంపాదన కొఱకే తత్త్వజ్ఞానమేల సంపాదించవలయుననగా మరల జననము గలుగని మోక్షముకొఱకే యనియు మఱువకూడదు పూర్వకాలపు యోగులు తపోవంతులు ఈలాగుననే జీవించిరి

**మితాశనో భవేన్నిత్యం భిక్షుర్మోక్ష పరాయణః।**
**కామదర్పాదయో దోషాః న భవన్తి మితాశినః ॥**

బ్రహ్మనిష్ఠ కనుకూలమగు మితమగు నాహారమునే మోక్షాపేక్ష గల ముముక్షువు భుజించవలయును. అట్టి మితాహార స్వభావము గలవానికి కామ, క్రోధ, లోభ, మోహ, దర్పాది దోషములు గలుగవు

**హితం మితం సదాఽశ్నీయాత్ యత్సుఖేనైవ జీర్యతే।**
**ధాతుః ప్రకుప్యతే యేన తదన్నం వర్జయేద్యతిః ॥**

సులభముగా నేది జీర్ణమగునో, అట్టి ఆహారమును (హితమైనదిన్ని,

సర్వసంగ పరిత్యాగియైనను, భిక్షాన్నముతో జీవించినను, గృహస్థాశ్రమములో గల పాప నివారణ కొరకై వారు బ్రహ్మనిష్ఠులకు భిక్షాన్న మొసంగుచున్నారు అప్పుడు దానియందును పాపము గలదు అయితే అది అనివార్యమగుటచే బ్రహ్మనిష్ఠవలన అట్టి పాపమును రహిత మొనరించు కొనవలయును అందు వలననే ఈ క్రింది శ్లోకము ఈలాగున నుపదేశించుచున్నది

**అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।**
**నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥**

సమస్త కర్మల యందనాసక్త చిత్తుడును, మనోనిగ్రహము గల వాడును, భోగమునందును దేహమందును ఆశ లేనివాడునునై సర్వసంగ పరిత్యాగము చేయుటచేత సర్వోత్కృష్టమైన విష్కామ కర్మచే పొందుగతిని ఆత్మశుద్ధిని పొందుచున్నాడు ప్రకృతి దోషము నశించి ధ్యానమందు మనస్సుకు స్థిరత్వము గలుగువరకు దేహముతో కర్మము చేయక పోయినను మనస్సు మాత్రము ప్రపంచ విషయములో సంచరించుచుండునని ఈ క్రింది శ్లోకముచే తెలుపడమైనది

**న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్।**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥**

ఎవడును, ఒకప్పుడును క్షణకాలమైనను, కర్మను ఆచరింపనివాడై యుండడు ప్రతివాడును ప్రకృతి స్వభావముచే గలిగిన గుణములచేత అస్వ తంత్రుడై కర్మను చేయుచుండును

ఇట్టి ప్రకృతి గుణములు క్షయ మొందువరకు స్వకర్మానుష్ఠానపరుడై బ్రహ్మనిష్ఠ చేయవలయును అనగా జీవనోపాయమును సంపాదించుకొని తపోధ్యానాదు లాచరించవలయును

**కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।**
**ఇంద్రియార్థాన్విమూఢాత్మా మిధ్యాచారస్స ఉచ్యతే ॥**

ఏ మూఢబుద్ధి గలవాడు కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను తత్తద్ధర్మకార్యములలో ప్రవేశింపనీయక ఇంద్రియ విషయములను మనస్సుచేత స్మరించుచు ఉంటున్నాడో వాడు కపటాచారము గలవాడని చెప్పబడుచున్నాడు

**యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।**
**కర్మేంద్రియైః కర్మయోగమసక్తస్స విశిష్యతే ॥**

ఓ యర్జునా! ఎవడైతే మనస్సుచేత ఇంద్రియములను అణచి పెట్టి కర్మేంద్రియములచేత కర్మాచరణమును నిష్కాముడగుచు ప్రారంభించుచున్నాడో వాడు శ్రేష్ఠుడగుచున్నాడు

ముందు జెప్పిన శ్లోకములో తెలిపిన వాడు కపట స్వభావముగలవాడు ఈ శ్లోకములో తెలిపిన వాడు నిష్కపటుడు అందువలన వీడు త్వరలో శుద్ధాత్ముడై జ్ఞాననిష్ఠను అందుకొనగలడు

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీర యాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥**

కర్మము చేయకుండుటకంటే నిష్కామ కర్మాచరణము శ్రేష్ఠమైనది కాబట్టి నీవు ఆచరించుటకు శాస్త్రముచే నియమితమైన నిష్కామ కర్మమును చేయుము ఏలయనగా ఆలాగున నీవు అసక్తుడై కర్మము చేయక పోయిన నీకు జీవితము గూడ నిర్వహించుటకు కష్టముగా నుండును

పై జెప్పినట్లు ఇప్పుడు నివృత్తిమార్గపరులై యుండువారిలో చాలా మంది స్థితియు ఈలాగున నేర్పడినది యాచకులై యుండుటచేత జీవనోపాయము గూడ జరుగలేదు

**యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః ।**
**తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసంగస్సమాచర ॥**

ఓ యర్జునా! యజ్ఞార్థమైన కర్మముకంటె ఇతరమగు కామ్యకర్మ

మందు ఈ లోకము కర్మముచే కట్టుబడియున్నది కనుక యజ్ఞార్థమైన కర్మ మును నిరపేక్షకుడవై ఆచరింపుము

యజ్ఞార్థమనగా భగవత్ప్రీతికరమై, లోకసంరక్షణ విషయమై, బ్రహ్మ నిష్ఠ చేయుటకు మాత్రము జీవనోపాయము కొరకు చేయుపనియు బన్ధన మును కలుగజేయదు ఏలన అది బన్ధనివృత్తికొర కుపయోగపడునదగుటచే బంధము కాదు

**తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।**
**అసక్తో హ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః ॥**

పై జెప్పిన కారణమువల్ల ఫలాపేక్ష లేని వాడవై చేయదగిన కర్మమును చేయుము ఏలయనగా పురుషుడు ఫలాపేక్షలేనివాడగుచు కర్మమును చేయుచున్నవాడైనను మోక్షమును పొందుచున్నాడు

జీవ సంరక్షణ కొరకు మాత్రము విధిచోదిత కర్మము చేయుట వలన అతడు పరమపురుషార్థమైన మోక్షము పొందుటలో ఏలాటి సందేహమున్నూ లేదు

**సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।**
**కుర్యాద్విద్వాంస్తథాఽసక్తః చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥**

ఓ యర్జునా! అజ్ఞానులు కర్మమునందు ఫలాసక్తి గలవారై ఎట్లు చేయుచున్నారో, ఆలాగున ఆత్మనిష్ఠాభిలాష గలవాడు ఫలాసక్తి లేనివాడై జనులకు మంచిమార్గమును చూపుటను చేయనిచ్ఛగలవాడై చేయ వలయును.

కబీరుదాసు, ఘోరాకుంభార, వీరబ్రహ్మయ్యగారు, తిరువళ్లూరు నాయనగారు మొదలగు మహాత్ములందరు స్వతంత్రముగా జీవనోపాయము నకు మాత్రము విధినిశ్చిత కర్మను అనుసరించియే జీవన్ముక్తిని బ్రహ్మ సాక్షాత్కారమును బొందిరి

**సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్।**
**ఏతద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః ॥**

పరాధీనము సర్వము దుఃఖమే, ఆత్మాధీనము సర్వము సుఖమే సుఖముయొక్కయు, దుఃఖముయొక్కయు లక్షణము ఈ లాగున నుండునని సంగ్రహముగా గ్రహించుకొనతగినదని మనువుపదేశించెను

**స్వాతన్త్ర్యాత్సుఖమాప్నోతి స్వాతన్త్ర్యాల్లభతే పరమ్।**
**స్వాతన్త్ర్యాన్నిర్వృతిం గచ్ఛేత్ స్వాతన్త్ర్యాత్పరమం పదమ్ ॥**

స్వాతన్త్ర్యముచేత మాత్రమే పూర్ణ సుఖము గలుగును స్వాతన్త్ర్యము చేత మాత్రమే శ్రేష్ఠమైన పదవి పొందగలుగును స్వాతన్త్ర్యముచేతనే నిర్వాణ మును బొందగలుగును స్వాతన్త్ర్యముచేత మాత్రమే పరమపదము లభించును

జనురాలా! స్వాతన్త్ర్యముయొక్క మహిమ యెటువంటిదో దీనివలన తెలిసికొనవచ్చును

**పరాన్నేన తు భుక్తేన మైధునం యోఽధిగచ్ఛతి ।**
**యస్యాన్నం తస్య తే పుత్రా అన్నాచ్ఛుక్లం ప్రవర్తతే ॥**

గృహస్థాశ్రమములో నుండు దంపతులు వంశోద్ధారకులై, లోకోద్ధారకులై, ధర్మజ్ఞులై, మాతాపితరుల నుద్ధరించు సంతానమును కనవలసి యుండిన, భార్యాభర్తలు పుత్రోత్పత్తికి కారణమగు విషయములో ప్రవర్తించుటకు ముందుగా ఆహార నియమములో జాగ్రత్తపడవలయును ఏలనన మానవులు భుజించెడు అన్నపానములే స్త్రీలకు రక్తముగాను, పురుషులకు శుక్లముగాను నేర్పడును దానివల్ల నేర్పడెడు సంతతియు అట్టియన్నము ననుసరించియే పుట్టును అది శుద్ధాన్నమైన పుణ్యాజీవులున్ను, అశుద్ధాన్నమైన పాపజీవులున్ను పుట్టుదురు అయితే వస్తువు మాత్రము శుద్ధముగా నుండిన చాలదు శుద్ధమైన వస్తువున్ను సత్యమార్గమందు వచ్చినదిగా నుండవల

యును ఆలాగున బ్రహ్మనిష్ఠుడు గూడ శుద్ధముగాను, సత్యముగాను వచ్చెడు అన్నాదులచే భుజింపవలయును ఏలన అన్నపానాదుల ననుసరించియే దేహము ఇంద్రియములు మనస్సు బుద్ధి యేర్పడును అన్నము శుద్ధముగాను సత్యముగాను కానిచో మనోబుద్ధులు గూడ మలినములై విషయములో ప్రవర్తించును ఈ సత్యమును దెలియకనే గొందరు మనస్సే ప్రధానమని యెంచి మాయలో బడిపోవుచున్నారు కావున పరాధీనముకాని స్వతంత్రజీవితము నేర్పరచుకొనవలయునని చెప్పిన రహస్యము కావుననే ఋషుల జీవితమును గురించి మీకు తెలుపడమైనది

**అన్నం పుంసాఽశితం త్రేధా జాయతే జరరాగ్నినా।**
**మలం స్థవిష్ఠో భాగస్స్యాత్ మధ్యమో మాంసతాం వ్రజేత్॥**
**మనః కనిష్ఠో భాగస్స్యాత్ తస్మాదన్నమయం మనః ॥**

పురుషుడు భుజించెడు అన్నము ప్రాణాపానజరరాగ్నులవలన మూడు విధములుగా మారుచుండును స్థూలభాగము మల మూత్రములుగాను, మధ్యమ భాగము రక్తమై మాంసముగాను మారును కనిష్ఠ భాగము మనస్సుగా పరిణమించును కావున ఏయన్నమును ఎవరు భుజింతురో వారి మనస్సు గూడ ఆలాగే యుండునని సుశ్రుతము

**అల్పాన్నాభ్యవహారేణ రహఃస్థానాసనేన చ ।**
**హ్రియమాణాని విషయైః ఇన్ద్రియాణి నివర్తయేత్॥**

**ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేష క్షయేన చ ।**
**అహింసయా చ భూతానామమృతత్వాయ కల్పతే ॥**

అల్పాన్నమును భక్షించుటచేతను, (మితాహారము చేతను), ఏకాన్త ప్రదేశమున నుండుటచేతను, విషయములనుండి యిన్ద్రియములను స్వాధీనములో నుంచవలయును అట్టి యిన్ద్రియములయొక్క నిరోధము చేతను, రాగద్వేషములను నశింపచేయుటచేతను, ప్రాణికోట్లలో గల యహింసచేతను మానవు డమృతత్వమును పొందుచున్నాడు అనగా

మోక్షమును పొందుచున్నాడు

**అవ్రతా హ్యనధీయానా యత్ర భైక్షచరా ద్విజాః ।**
**తం గ్రామం దండయేద్రాజా చోరభుక్తి ప్రదో హి సః ॥**

బ్రహ్మచర్యాది వ్రతానుష్ఠానములు లేని వారును, మంత్ర దీక్షానుష్ఠానము లేనివారును, ఉపనిషద్గీతాద్యధ్యయనము చేయని వారును అగు బ్రాహ్మణులుగాని, సన్న్యాసులుగాని యెచ్చోట భిక్షాన్న భోజనపరులై యుంటున్నారో, అట్టి వారికి భిక్షాన్నమును నిడిన వారినేగాక, ఆ గ్రామమునుగూడ (గ్రామస్థులను)రాజు దండించవలయును ఏలననగా చోరులకు సహాయము చేయువారు గూడ ఎటుల దండనార్హులో వీరుగూడ వేషధారులై యుండువారగుటచే శిక్షార్హులు అని పరాశర స్మృతి

**దానమిజ్యాతపశ్శౌచం తీర్థం వేదాశ్రుతం తథా ।**
**అశాన్తమనసః పుంసః సర్వమేతదపార్థకమ్ ॥**

శాన్తిలేని మనస్సు గలవానియొక్క దానము, యాగము, తపస్సు, శుచిత్వము, తీర్థాటనము, వేదాధ్యయమును, వేదాంతశ్రవణము మొదలగునవన్నియు నిరర్థకములు

**సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా ।**
**హృదయే నాస్తి సర్వాస్థా ముక్త ఏవోత్తమాశయః ॥**

నిరంతరము సమాధినిష్ఠలో నుండినను సరే లేక లోకోపకారార్థము నిష్కామ కర్మల నాచరించినను సరే, యెవని హృదయములో సమస్త సంకల్పములు కోరికలు నశించియుండునో అట్టి నిర్మలాశయము గలవాడు ముక్తాత్ముడే సందేహము లేదు

**నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తి రుపజాయతే ।**
**ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ ॥**

ఆత్మజ్ఞానముయొక్క స్వరూపమును తెలియని వానికి నివృత్తిగూడ

ప్రవృత్తి రూపముగానే మారును ఆత్మస్వరూపజ్ఞానము గల శుద్ధాత్ముని యొక్క లోకోద్ధరణ రూపప్రవృత్తి నివృత్తినే గలుగజేయును

> నాస్తి శ్రద్ధాసమం పుణ్యాం నాస్తి శ్రద్ధాసమం సుఖమ్ ।
> నాస్తి శ్రద్ధాసమం తీర్థం సంసారే ప్రాణినాం నృప !

ఇది నారద మహర్షిచే ఒకానొక రాజుకొఅకు పదేశింపబడినది ఓ రాజా! ఈ సంసారములో గల మానవులకు శ్రద్ధకు సమానమైన పుణ్యము లేదు శ్రద్ధకు సమానమైస సుఖమున్ను లేదు శ్రద్ధకు సమానమైన తీర్థాటనము లేదు శ్రద్ధయనగా ఏ సమయములో ఏ పని నేలాగున చేయవలయునో, ఆలాగున శుద్ధముగా చేయుటయే శ్రద్ధ యనబడును



# ముక్తి

ముక్తి యను పదము "ముచ్ల్ మోక్షణే" అను ధాతువు నుండి జనించినది దీనికి విడుచట యని అర్థము మోక్ష శబ్దమునకు నిదే యర్థము బంధనము నుండి విడుదల పొందుట ఇందుచే బంధమును తొలగించిన, ముక్తియు అప్రయత్నముగానే సిద్ధించును కావున బన్ధనివృత్తిని జేసికొనుటయే ముముక్షువుల కర్తవ్యము అట్లైన మోక్షముకొరకు మరల జేయవలసిన పని యేమియు నుండదు ఒక వృక్షములో గల కాయను పడద్రోయవలసి యుండిన వృక్షముతో గల బన్ధనమగు తొడిమను ఛేదించిన చాలును అప్పుడు కాయ స్వయముగానే క్రిందపడిపోవును. కావున జీవునికిగల ప్రకృతి బన్ధమేదియో తెలిసికొని దానిని ఖండించిన చాలును అప్పుడు మోక్షము తనకు తానే గలుగును. ఆలాగున స్తంభమునకు గాని, మ్రానుకు గాని ఒక పశువును బంధించి యుండిన ఆ పాశమును త్రెంపుటయో లేక దానిని విప్పి వేయుటయో చేసినచో పశువు స్వయముగానే బంధవిమోచన గలది యగును ఆలాగున ఈ జీవునకు ప్రకృతితో గల బంధనమును తెలిసికొని

నివృత్తిజేసికొనిన విమోచనము గలుగును ఆలాగున కృతార్థుడు గావలసి యుండి కృతకృత్యుడైన చాలును కృతకృత్యుడుగానిచో ఏకాలమునకున్ను కృతార్థుడు కాజాలడు కృతమనగా చేయబడినది ఏదియనగా కృత్యము నీవు చేయవలసిన కృత్యమును చేసిన వాడవగుదువేని తప్పక కృతార్థుడవు గాగలవు అటులయిన కృతార్థతకొరకు నీవు చేయవలసిన దేదియు లేదు ఎటులననగా పరీక్షలో తప్పక యుత్తీర్ణుడు కావలసియుండిన పాఠము లన్నిటిని చక్కగా జదివి పరీక్షా సమయములో ఒప్పజెప్పిన చాలును అప్పుడు పరీక్షలో తప్పక యుత్తీర్ణుడు కాగలడు అటుల చదువవలసిన పాఠములను చక్కగా చదువనిచో ఎన్ని సంవత్సరములకైనా పరీక్షలో నుత్తీర్ణుడు కాజాలడు

అయితే యీ విషయమై ఒక సందేహము జనింపవచ్చును అదేమనగా సిఫారస్సు చేతగాని, లంచమును ఇచ్చిగాని కొందఱు పరీక్షలో నుత్తీర్ణులగుదురు మరియు ఆలాగున చక్కగా పాఠములను జదివిన వారిని గూడ కొందఱు అసూయచేత ఉత్తీర్ణులనుగా చేయకపోవచ్చును అట్టి సందేహము ఈ మోక్షవిషయములో, జ్ఞానవిషయములో, దైవవిషయములో, సత్య విషయములో గలుగదు ఈశ్వరుండు ప్రాకృత మానవులవలె అసూయ గలవాడుగాని, లంచము తీసికొనువాడుగాని కాడు సత్యముపై నిలుచు వాడు రెండవవారి సహాయము లేకనే సర్వమును తెలిసికొను శక్తిగలవాడు కావున మీకృత్యమును మాత్రము కొరత లేక జేసికొనిన చాలును అప్పుడు కృతార్థులు కాగలరు మీకు సంశయము లేదు

మరియు చెరువులో నీళ్లు నిండుగా నున్నప్పుడు పొలములోనికి ఆ నీళ్ళను తెచ్చికొనుటకు నీటి విషయమై మనము జేయవలసిన దెద్దియు లేదు ఏ అడ్డుచేత జలము ప్రవహించలేదో అట్టి అడ్డునుమాత్రము తూమునుండి తొలగించిన చాలును నీళ్ళు స్వయముగానే ప్రవహించును ఆలాగున దైవజ్ఞానము సర్వులలోను మనస్సుయొక్క పైభాగమున ఒకే విధముగా, పూర్ణముగా వెలయుచున్నది అయితే మనస్సులో గల ప్రకృతి గుణములగు ఆటంకములను తొలగించిన చాలను అప్పుడు జ్ఞానమ ప్రయత్నముగానే

గలుగును ఈ విషయమై శ్రీ పతంజలి ముని యుపదేశించిది చూడుడు

**సూ॥ నిమిత్తమప్రయోజకం ప్రకృతీనాం వరణ భేదస్తు తతః క్షేత్రికవత్॥**

రైతు చెరువు నుండి నీటిని పొలములోనికి తీసికొని వచ్చుటకు ఆ నీటిపి చేతితో లాగుకొని రావలసిన పని లేదు నీరు పారకుండుట కాటంక మేది కలదో అట్టి అడ్డును తొలగించిన చాలును అప్పుడు జలమప్రయత్న ముగా పొలములోనికి ప్రవహించునటుల, జ్ఞానమున కేది ఆటంకముగా నున్నదో అట్టి అడ్డును తొలగించిన చాలును ముముక్షువు చేయవలసిన కర్తవ్యమిదియే అప్పుడు జ్ఞానము స్వయముగా గలుగును ఈశ్వరుడు అన్నిటిలోను సమానముగా నుంటున్న దానికి శ్రుతి ప్రమాణము

**మూ॥ అపాణిపాదో జవనో గ్రహీతా**
**పశ్యత్యచక్షు స్స్వశృణోత్యకర్ణః ।**
**స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా**
**తమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్ ॥**

ఆ మహాత్ముడగు ఈశ్వరుడెట్టివాడనగా చేతులు లేనివాడయ్యు అనంతప్రాణికోట్లకు కర్మఫలము నిచ్చువాడు కాళ్లులేనివాడయ్యు అతి వేగముగా పరుగెత్తువాడు, నేత్రములు లేనివాడయ్యు సమస్త ప్రాణికోట్ల కర్మ లను చూచువాడు చెవిలేని వాడయ్యు అనంతప్రాణికోట్ల సంకల్పములతో సహ చక్కగా వినువాడు, అతడు సమస్తము నెఱుంగు వాడు ఆ మహాత్ముని సంపూర్ణముగా నెవరును ఎరుంగ జాలరు అతడన్నిటికన్న శ్రేష్ఠుడు, ఆది పురుషుడు అతడే మహాత్ముడు కావున అతడు మానవునివలెగాక స్వయముగా తెలిసికొనుశక్తి గలవాడగుటచే అసూయగాని, లంచము తీసికొనుటగాని మరియొక సిఫార్సును అపేక్షించుటగాని లేనివాడు బంధ నివృత్తి గలిగిన ముక్తి స్వయముగా గలుగునను దానికి వేదాంత పంచదశి ప్రమాణము

**దేహాత్మజ్ఞానవత్ జ్ఞానం దేహాత్మ జ్ఞానబాధకమ్ ।**
**ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే ॥**

ఏ పరమాత్మ విషయకజ్ఞానము పామరులకు దేహమే నేనను జ్ఞానము వలె దృఢముగా నుండునో, ఆజ్ఞానము దేహమే నేనను మిధ్యాజ్ఞానమును తొలగించును ఇటువంటి వాడు మోక్షము పొందవలయునని కోరిక లేని వాడై నను తప్పక ముక్తినొందును శ్రీభగవద్గీతయందు శ్రీకృష్ణభగవాను డీలాగే వచించెను

**ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాన్త రజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥**

మిక్కిలి శాంతి నొందిన మనస్సు గలవాడును, శమించిన రజోగుణ తమోగుణములు గలవాడును, పాపరహితుడును, బ్రహ్మస్వరూపుడును నగు, ఈ యోగిని శాశ్వతమగు బ్రహ్మానందము స్వయముగా వచ్చి పొందు చున్నది పై జెప్పిన లక్షణములు గల ధ్యానయోగిని మోక్షము ఇచ్చుటనే వచ్చి పొందుచున్నది అనగా మోక్షముకొరకు అట్టి ధ్యాననిష్ఠుడు వెదకి వెళ్లనవసరము లేదు ఆమహాత్ముని వెదకి యిచ్చుటికి వచ్చి మోక్షము పొందు చుండును జీవునికి బంధమేమనగా -

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥**

ఓ యర్జునా! నాశరహితుడైన ఆత్మను దేహమునందు ప్రకృతి వలన బుట్టిన సత్త్వరజస్తమో గుణములు బంధించుచున్నవి కావున ఈ మూడు గుణముల బంధనములను త్రెంపిన చాలును మరియు శ్రుతి,

**అనాత్మభూతే దేహాదావాత్మబుద్ధిస్తు దేహినామ్ ।**
**సాఽవిద్యా తత్కృతో బంధ స్తన్నాశో మోక్ష ఉచ్యతే ॥**

అనాత్మ స్వరూపములగు దేహేంద్రియములయం దాత్మబుద్ధి యేది

గలదో అదియే ప్రాణులకు బంధము, అదియే అవిద్య, అదియే మాయ, దాని యొక్క నాశమే మోక్షమనంబడును

**మూ॥ భయాదస్యాగ్ని స్తపతి భయాత్తపతి సూర్యః**
**భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః ॥**

ఆ పరమేశ్వరునియొక్క భయమువలననే అగ్ని దహించుచున్నాడు సూర్యుడు ప్రకాశించుచున్నాడు ఇంద్రుడు పాలించుచున్నాడు వాయువు వీచుచున్నాడు మృత్యువు ప్రాణులను యమలోకమును పొందించు చున్నాడు

ఈశ్వరుడు సత్యస్వరూపుడనియు, పక్షపాతము లేనివాడనియు నిరూపించుటకు ఈ కఠోపనిషత్తు యొక్క వాక్యమిచ్చోట నుద్ధరింపబడినది పై జెప్పిన అగ్ని సూర్యవాయు మృత్యు ఇంద్రాదులు తమ తమ కార్యమును సత్యముగా నిర్వహింపక పోయిన సర్వేశ్వరుని ఆజ్ఞను అతిక్రమించిన వారమగుదు మను భయముతో వారి వారి కార్యములను నియమానుసారముగా చేయుచున్నారు

ఇక ముండక శ్రుతియున్ను ఈ సత్యమార్గము చేతనే ఋషులు మోక్షమును పొందుచున్నారని తెలుపుచున్నది దానిని చూడుడు -

**మూ॥ సత్యమేవ జయతే నానృతం**
**సత్యేన పంథా వితతో దేవయానః ।**
**యేనాక్రమంత్ర్యృషయో హ్యాప్తకామా**
**యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్ ॥**

సత్యమే జయించుచున్నది అసత్యము జయము నొందదు సత్యము చేతనే దేవయానమను పేరుగల ముక్తి మార్గము విస్తారమై యున్నది సత్య మార్గము చేత పొందబడిన సకలమైన కోరికలు గల వారగుటచేత బ్రహ్మ వేత్తలు (ఋషులు) ఏపరబ్రహ్మమునందు ఆ యాత్మతత్త్వమును పొందు

చున్నారో అదియే సత్యమునకు శ్రేష్ఠమైన స్థానమగుచున్నది

కొందఱు వేదాంతులు ఈలాగున చెప్పుదురు ఆత్మ స్వప్రకాశమైన వస్తువు, దానిని పొందుటకు నీవు చేయవలసిన దేమియు లేదనియు, మఱి కొందఱు కాలమాసన్న మగునప్పుడు అది స్వయముగానే యుదయమగును నీ ప్రయత్నమవసరము లేదనియు వచింతురు అట్లైన అధికారిని గురించిన విధియే నష్టమైపోవును శమ దమాదిగుణములు గలవాడును, శ్రవణమననా ద్యనుష్ఠానములు గలవాడు మాత్రమే ముక్తుడగునను విధివాక్యమే నిరర్థ కము అయితే పై జెప్పిన వారి మాటలలో ఆత్మ సత్యమనియు, స్వప్రకాశమనియు, జ్ఞానస్వరూపమనియు తెలిపినది మాత్రము నిజము ఆ విషయమై వేదాంతమేమి చెప్పుచున్నదనగా అది ఘటస్థ దీపము వలె నుండు ననియు, దీపము ప్రకాశించుచుండినను ఘటావరణము నుండుట వలన బైటికి ప్రకాశించుటలేదనియు, ఘటావరణము ధ్వంసమొనర్చిన స్వయ ముగా ప్రకాశించునటుల ఆత్మయొక్క ఆవరణమును అనుష్ఠాన సాధనము లను దండముచే విధ్వంస మొనర్చిన ఆత్మ స్వప్రకాశముగా నిరావరణమై ప్రకాశించుననియు తెలియవలెను ఇదియే నిజమగు సత్యము లేనిచో అందఱికిని ఆత్మజ్ఞానోదయము కావలసియుండును అట్లు కనిపించుట లేదు కావున అనుష్ఠానపరుడు ఆత్మదర్శనమును దైవదర్శనమును చేయ వలెను



# ప్రవృత్తి నివృత్తి మార్గములు

1 ఈ ప్రవృత్తి నివృత్తి మార్గములే మానవుని ఊర్ధ్వగతికిన్నీ, అధో గతికిన్నీ తీసుకొనిపోవుచుండును ప్రకృతి గుణములను అనుసరించి మాన వుడు ఎంతవరకు ప్రవర్తించుచుండునో, అంతవరకు ప్రవృత్తి మార్గములో నుండువాడగును ప్రకృతిగుణముల నుండి ఎప్పుడు నివృత్తి మార్గములోనికి

ప్రవేశించునో అప్పుడే నివృత్తి మార్గములోనికి అడుగు పెట్టినవాడగును ప్రవృత్తి మార్గమున వెళ్ళువాడు సంసార సాగరమును పొందును నివృత్తి మార్గమున ప్రయాణము చేయువాడు పరబ్రహ్మమును పొందును ఈ విషయమును మనుమహర్షి తెలిపినది చూడుడు

**సుఖాభ్యుదయికం చైవ నైశ్శ్రేయసికమేవ చ।**
**ప్రవృత్తిం చ నివృత్తిం చ ద్వివిధం కర్మవైదికమ్॥**

వైదిక కర్మ స్వర్గాది సుఖప్రాప్తిని గలిగించు జన్మములకు హేతువైన ప్రవృత్తికారణముగా నుండుటవలన ప్రవృత్తి కర్మమనియు, సంసారని వృత్తి హేతువైన కర్మము నివృత్తికర్మమనియు నిఋతెగలచే భిన్నమై యున్నది

**ఇహ చాముత్ర వా కామ్యం ప్రవృత్తం కర్మ కీర్త్యతే।**
**నిష్కామం జ్ఞాన పూర్వం తు నివృత్త ముపదిశ్యతే॥**

ఈ లోకంబున వర్షము మున్నగువానికి గారణము, స్వర్గము మున్నగు వాని గలిగించునదియు, సంసార హేతువగునదియునగు కర్మము ప్రవృత్త కర్మమనబడును ఇహ ఫలముగాని, ఆముష్మిక ఫలముగాని లేక బ్రహ్మజ్ఞానము నలవరించుటవలన సంసార నివృత్తి హేతువగు కర్మము నివృత్తి కర్మమనబడును

**అకామోపహితం నిత్యం నివృత్తం చ విధీయతే।**
**కామేన తు కృతం నిత్యం ప్రవృత్తముపదిశ్యతే॥**

ఫలాపేక్ష లేక నిత్యము చేయబడు విరక్తి పరమగు కర్మ నివృత్త కర్మ మనబడును ఫలాపేక్షతో చేయబడు కర్మము ప్రవృత్తి కర్మమనబడును

**ప్రవృత్తం కర్మ సంసేవ్య దేవానామేతి సామ్యతామ్।**
**నివృత్తం సేవమానస్తు భూతాన్యత్యేతి పంచ వై॥**

ప్రవృత్తకర్మలగు యజ్ఞదానాదుల ననుష్ఠించుటచే దేవతలతోడ సమాన లోకత్వమును బొందును నివృత్తికర్మాభ్యాసముచేత శరీర కర్మలను

గలిగించు పంచ భూతములను దాటుచున్నాడు (అనగా మోక్షము నొందు చున్నాడు )

**వేదాభ్యాసస్తపో జ్ఞానమింద్రియాణాం చ సంయమః ।**
**అహింసా గురుసేవా చ నిశ్శ్రేయసకరం పరమ్ ॥**

ఉపనిషదాదులను పఠించుట, వాని యర్థము నెఱుంగుట, కృచ్ఛ్రము మొదలగు తపంబు లొనర్చుట, బ్రహ్మజ్ఞానము, ఇంద్రియముల నణచుట, హింసలను వదలుట, గురుశుశ్రూష ఇవియెల్లను ముఖ్యమగు మోక్ష సాధనములు

**సర్వేషామపి చైతేషామాత్మజ్ఞానం పరం స్మృతమ్ ।**
**తద్ధ్యగ్ర్యం సర్వ విద్యానాం ప్రాప్యతే హ్యమృతం తతః ॥**

ఈ వేదాభ్యాసాదులలో నన్నింటను నుపనిషత్ ప్రతిపాద్యమగు బ్రహ్మను గూర్చిన జ్ఞానమే శ్రేష్ఠము ఆ జ్ఞానమువలననే మోక్షము గలుగును కావున నది అన్ని విద్యలలో ప్రధానమును, సంపాద్యమునై యున్నది

**యధోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః ।**
**ఆత్మజ్ఞానే శమే చ స్యాత్ వేదాభ్యాసే చ యత్నవాన్॥**

ద్విజుడు శాస్త్ర విహితములగు నగ్నిహోత్రాది కర్మల పరిత్యజించి యైనను పరమాత్మ చింతనము, ఇంద్రియ జయము, ప్రణవజపము, ఉపనిష దాది పఠనము వీనియందైనను ప్రయత్న పరుడై యుండవలయును

మనువు తన అంత్య సందేశమును ఈ శ్లోకమున తెలుపడమైనది అదేమన ఇతరములైన కర్మలు సాధనలు ఒకవేళ చేయకపోయినను ముముక్షువైనవాడు అధ్యాత్మ జ్ఞానమందును, ఉపనిషత్ పఠన మందును, ప్రణవజప మందును, ఇంద్రియ నిగ్రహమందును అయిన ప్రయత్నపరుడై యుండవలెను.

2 ఇప్పుడు ప్రవృత్తి నివృత్తి మార్గములలో మనస్సు ప్రవేశించుటలో

గల ఊర్ధ్వాధో గమనములను గురించి తెలిపెద మనస్సు అచింత్య వేగము గల ఊర్ధ్వాధో లోకములలో తిరుగుచుండెడు ఒక విచిత్రమైన యంత్రము వంటిది అది ఈ జీవుని శివత్వముగాను, పశుత్వముగాను నొనర్చు శక్తి గలది నేను దేహముగాను, కర్మేంద్రియములుగాను, జ్ఞానేంద్రియములు గాను, వీటియన్నిటికిన్నీ సాక్షియై యుండు ప్రత్యగాత్మ స్వరూపము, శివము, ఆనందము అని భావనచేసి పోవుచుండిన భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములను దాటించి అది ఈ జీవుని శివలోకమును చేర్చును అనగా శివత్వ మొనర్చును అట్టి మనస్సే నేను బుద్ధితో, మనస్సుతో, చిత్తముతో, జ్ఞానేంద్రియములతో, కర్మేంద్రియము లతో గూడిన వాడను, ఫలాని జాతివాడను, ఫలాని ఆశ్రమమువాడను లేక పురుషుడను, స్త్రీ యను భావములోనికి దిగినచో ఈజీవుని అతల వితల పాతాళ లోకములలోనికి తీసుకొని వెళ్ళి పశుత్వ మొనర్చును ఇదే ప్రవృత్తి నివృత్తి మార్గములలో ప్రవేశించిన గలిగెడు ఫలితము ఈ మనస్సు ఒక్క క్షణ కాలములోనే మహామేరు అగ్రస్థానములో నుండువానిని పాతాళ లోకము లోనికి తీసుకొని వెళ్ళి పడవేయును ఊర్ధ్వ లోకములేడింటిని దాటించి శివలోకమును చేర్చునది ఈ మనస్సే అధోలోకము లేడింటికి కనురెప్ప పాటులో తీసుకొనివెళ్ళి ఈ శివత్వమగు జీవుని పశుత్వమొనర్చునదిన్నీ ఈ మనస్సే

విజ్ఞాన శాస్త్రజ్ఞులు వస్తు పరిశోధకులు జలము యొక్కయు, అగ్ని యొక్కయు, వాయువు యొక్కయు, ఆకాశముయొక్కయు, విద్యుత్ యొక్కయు వేగమును గంటకు ఇన్ని మైళ్ళు ప్రయాణము చేయుచున్నవని కనిపెట్టిరే కాని ఈ మనోవేగమును గంటకెన్ని మైళ్ళ దూరము వెళ్ళగలదని కనుగొనిన పరిశోధకులెవరున్నూ భూలోకమున పుట్టియుండలేదు కావుననే మనోవేగము ఎవరికిన్నీ ఎప్పటికిన్నీ సాధ్యము కాదని విజ్ఞులు త్రోసివేసిరి పతంజలి మొదలగు మహర్షులు ప్రాణవాయువునకున్ను, మనసుకున్నూ సంబంధము గలదని తెలిసికొనియే ప్రాణాయామముచే మనో నిరోధము

చేయవచ్చునని తెలిపిరి వసిష్ఠాది బ్రహ్మవేత్తలు సంకల్పమునుండియే మనస్సు ఆవిర్భవించుచున్నదనియు కావున నిస్సంకల్పస్థితి గలిగిన మనస్సును అరికట్టవచ్చుననియు వచించిరి

మరియు ఈ మనస్సే మానవుని దేవునిగాను దెయ్యముగాను మార్చు శక్తి గలదిగానున్నది అదిన్నీగాక చిత్తైకాగ్రతతో మనస్సుయొక్క నాట్యమును చూచుకొనిన అది అమృతమును విషముగాను, విషమును అమృతముగాను మార్చు శక్తిగలదని తెలిసి కొనవచ్చును ఓహో దీనియొక్క మహిమను గురించియేమి చెప్పగలను! మిత్రుని శత్రువుగాను, శత్రువును మిత్రునిగాను ఒక్క క్షణములోనే మార్పు చేయగల మహిమ గలది మనస్సు ఇంత మాత్రముగాదు అమేధ్యము వంటి దానిని మహామేధ్యముగాను, నిర్మల మైనదానిని మాలిన్య సంకులముగాను గలుగ జేయునది ఈమనస్సే అంతలో దానియొక్క పని పూర్తిగాజాలదు పాపమును పుణ్యమునుగాను, పుణ్యమును పాపముగాను మార్పు చేసి చూపు నదిన్నీ ఈ మనస్సే ఉన్న దానిని లేనిదిగాను, లేని దానిని ఉన్నదిగాను, సత్యమును అసత్యముగాను, అసత్యమును సత్యముగాను మార్పుచేసి చూపు నదిన్నీ ఈ మనస్సే ఏ యింద్రజాల నిపుణుడుగాని మహేంద్రజాల కుశలుడుగాని ఈ మనస్సు కలుగజేసెడి మార్పును చేయజాలడు కావున ప్రకృతికి పరమగు పరబ్రహ్మ మును పొందదలంపుగల వారు ప్రవృత్తినుండి నివృత్తి మార్గము లోనికి తమ ప్రయాణమును మార్పుచేసుకొనవలెను కావుననే నివృత్తిమార్గమును బోధిం చెడు ఉపనిషచ్ఛాస్త్రము ఈలాగున తెలుపుచున్నది

**నేతి నేతీతి నేతీతి శేషితం యత్పరం పదమ్ ।**
**పరిత్యక్తుమశక్యత్వాత్ తదస్మీతి సుఖీ భవ ॥**

ఇది కాను, ఇది కాను, ఇది కాను అని దేహము మొదలు కర్మేంద్రియ ములు, జ్ఞానేంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగు వీటినన్నిటిని త్యజించి బుద్ధికి సాక్షి యగు ఏ ఆత్మవస్తువు గలదో, అన్నిటిని వదలినను

దేనివలన అన్నియు వదలబడినవో అట్టి స్వయం ప్రకాశజ్ఞాన స్వరూపమగు ఏ ఆత్మ మిగులుచుండునో అదియే నీ యొక్క నిజస్వరూపమగు బ్రహ్మమని యెరింగి శాశ్వత సుఖమును పొందుమా అని తెలుపడమైనది

3 ప్రవృత్తి నివృత్తి మార్గములను గురించి మరియొక్క విషయమును మీకు తెలిపెద అచేతనములగు కర్రలు, ప్రాణముపోయిన జంతువుల మానవుల దేహములు, మనుష్యులు లేని పడవలు ఇవన్నియు నదీ ప్రవాహము ఏ వైపున ప్రవహించుచుండునో ఆ ప్రవాహ వేగము ననుసరించి ప్రయాణమొనర్చి క్రమ క్రమముగా సముద్రములోనికి చేరుచుండును అవి నిర్జీవములనియు, అ ప్రాణములనియు పేరు గలిగియున్నవి ఆలాగున తన స్వభావము ననుసరించి తన ప్రకృతి గుణము ననుసరించి ప్రవర్తించువాడు గూడ వాసనా రూపమగు ప్రవాహ వేగమునకు లోబడి క్రమ క్రమముగా పయనము సాగించుచు కట్టకడకు సంసారసాగరములోనికి చిన్నగ చేరు చుండును అదిన్నీ గాక అప్రాణవస్తువులను ప్రవాహము కొట్టుకొనివెళ్ళును పెద్దసుడిలోగాని, మెరకయందుగాని చేర్చుటయో లేక ఏ రాతికిగాని కొండకు గాని కొట్టుకొని శిథిలమొనర్చుటయో తప్పక సంభవించును అదేరీతిగ ప్రవృత్తి మార్గావలంబులను కర్మరూప ప్రవాహము కొట్టుకొని వెళ్ళి సంశయ మను సుడిలో పడవేయుటగాని అహంకారమను తిప్పపై చేర్చుటగాని లేక కఠినమగు గుండురాతిలో కొట్టుకొనుటగాని అజ్ఞానకొండతో ఢీకొని నశించుటగాని కలుగును కట్టకడకు "నదీనాం సాగరో గతిః"అని దీర్ఘ దర్శులు చెప్పినట్లు సంసార సాగరములోనే చేరవలసి యుండును

ఇక నివృత్తిమార్గమెట్టిదో దానిని వినుడి అది జీవములతో గూడిన లేక ప్రాణములతో గూడిన జంతువులవంటివనియు, ఇంజన్‌తో గూడిన బోటువంటిదనియు గ్రహించు కొనవలయును జలమెంత వేగముగా దిగువ ప్రదేశమునకు ప్రవహించు చుండినను ఇంజనుతో గూడిన పడవయేలాగున జల వేగమును అతిక్రమించుకొని ముందుకు సాగుచుండునో, సుడి, మెట్ట, రాతిగుండు, కొండ మొదలగు అపాయములను తప్పించుకొని తన

గమ్యస్థానమును చేరుచుండునో మరియు ప్రాణములతో గూడిన చేపలు, పాములు, ఎండ్రకాయలు, కప్పలు, తాబేళ్ళు, ప్రవాహ వేగము నతిక్రమించి ముందుకు ముందుకు వెళ్ళుచుండునో అట్లే నివృత్తి మార్గస్థుడు వాసనారూపమగు కర్మ ప్రవాహములను నెమ్మదిగా దాటి దుఃఖరహితమగు నిరతిశయానంద సుఖమగు ఆత్మను అనగా మోక్షమును పొందుచున్నాడు ఇదే ప్రవృత్తి నివృత్తి మార్గస్థులయొక్క గమ్యస్థానమని ముముక్షువులు ధీరులు గ్రహించుకొనవలయును కావుననే వేదాంత మీలాగున ఉపదేశించుచున్నది

**నాహం దేహో న చ ప్రాణో నేంద్రియాణి మనో న హి ।**
**సదా సాక్షిత్వ రూపత్వాత్ శివ ఏవాస్మి కేవలః ॥**

నివృత్తి మార్గస్థుడు నిట్టి మార్గమవలంబించియే బ్రహ్మ పదమును పొందుచుండును నేను దేహము గాను, ప్రాణము గాను, ఇంద్రియములు గాను, మనస్సు గాను ఎల్లప్పుడున్నూ వీనినన్నింటిని ప్రకాశింపజేయుచు సాక్షి రూపుడనై స్వప్రకాశుడనై యుండు శివస్వరూపుడను

**వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా ।**
**మలినా జన్మ హేతుస్స్యాత్ శుద్ధా జన్మవినాశినీ ॥**

మానవునియొక్క సంస్కారము, స్వభావము, మనోవాసన రెండు విధములుగా నుంటున్నది అవి మలిన వాసనయని, శుద్ధ వాసనయని పేర్లు గలవి. మలిన వాసన ప్రవృత్తిమార్గముగా వెళ్ళుచూ పునర్జన్మమును కలుగ జేయును. శుద్ధవాసన నివృత్తిమార్గముగా ప్రవహించుచు జన్మరహితమైన మోక్షమును కలుగజేయును.

**శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనాసరిత్।**
**పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి ॥**

మానవునియొక్క పూర్వజన్మ సంస్కార రూపవాసనయనెడు నది రెండు మార్గములుగా ప్రవహించుచున్నది కావున జిజ్ఞాసువు తన వాసన

ప్రవృత్తి మార్గమైన సంసార విషయమై ప్రవహించుచున్నదా లేక నివృత్తి మార్గపరమై జ్ఞానము నుద్దేశించి ప్రవహించుచున్నదా అని తెలిసికొని ప్రవృత్తి మార్గముగా ప్రవహించుచుండినచో పురుష ప్రయత్నముచే నివృత్తి మార్గ ముగా ప్రవహించులాగున దానిని చేయవలయును

**మూ॥ ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం పూర్వం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ। అధర్మచర్యయా పూర్వో వర్ణో జఘన్యం వర్ణమాపద్యతే జాతి పరివృత్తౌ ॥ (ఆపస్తంబము)**

నిమ్నస్థితిలోనుండు వాడు కూడా ధర్మానుష్ఠానముల వలన పూర్వ పూర్వ వర్ణమును పొందుచున్నాడు జాతి యనునది ఊర్ధ్వాధోముఖముగా తిరిగెడు స్వభావము గలది ఆలాగున ఉత్తమ వర్ణములో నుండువాడైనను అధర్మ ప్రవృత్తిచే నిమ్న నిమ్న వర్ణమును పొందుచుండును జాతియను నది పరివర్తనము గల్గియుండు స్వభావము గలదియే గాని మొకస్థిరత గలదికాదు ఆలాగున మలినమై ప్రవృత్తి మార్గములో ప్రవర్తించెడు మనస్సైనను శుద్ధ మొనర్చి నివృత్తి మార్గములోనికి నడిపి ముక్తి పదమును పొందుటకు సందేహము లేదు

4 ప్రవృత్తి నివృత్తి మార్గములను గురించి ఇకను ఒక విషయము తెలిపెద సృష్టినుండి పర్వత పంక్తులలోనుండి యేర్పడిన కాలువలు, వాగులు, నదులు మొదలైనవి ప్రవహించుచు వచ్చుచుండినను అనాది నుండి ఏ మార్గముగ అవి ప్రవహించుచుండునో, ఇప్పుడు ఏ లాగున పురుష ప్రయ త్నముచే వానికి ఆనకట్టగట్టి మనకిష్టమగు దారిలోనికి త్రిప్పగలుగు చున్నామో, ఆలాగున సృష్టిఆరంభమునుండియు అనాది కాలము నుండియు మనయొక్క స్వభావము ప్రవృత్తిమార్గముగా పోవుచుండినను అభ్యాస వైరాగ్యములచే ప్రవృత్తి మార్గము నరికట్టి నివృత్తి మార్గములోనికి వెళ్ళ గలము పురుష ప్రయత్నము లేనిచో ఆ నదులు సముద్రమున పోయి చేరునట్లు జీవితమున్ను దుఃఖసాగరములోనే పరిసమాప్తిని పొందును

సర్వేశ్వరుండు మన సుఖము కొరకొసగిన వర్షజలమున్ను, మనము ప్రయత్న హీనులమై పోయినచో భగవానుడొసంగిన జీవితమున్ను గూడ దుఖమయ మగును కొన్ని ప్రదేశములలో జలాధారము సరిగాలేని చోట్లలో ఇప్పుడు ఆనకట్టలుకట్టి రిజర్వాయర్లు నిర్మించి నీటిని వ్యర్థము చేయక సస్యముల కుపయోగపరచుట వలన దుర్భిక్షము నశించి జనులు ఏలాగున సుభిక్షితులై, సుఖపరులై యుంటున్నారో ఆలాగున ప్రవృత్తిమార్గములో ఉండెడు మనస్సును నివృత్తి మార్గములోనికి ప్రవేశపెట్టిన మనము నిరతిశయా నందపరులమై శాశ్వత మోక్షమును పొందగలము

కొన్ని ప్రదేశములలో జలాది వేగముచే ఆనకట్టలు తెగిపోవుట గూడ గలదు అయినను అంతటితో దానిని విడిచి పెట్టక ఏ కారణముచే కట్ట తెగినదో అది కనుగొని మరల గట్టి భూప్రదేశమున పూర్వాధిక దృఢముగా ఆనకట్టలు కట్టి సస్యశ్యామలముగా భూమిని కలుగజేసుకొని ఎట్లు సుఖజీవిత పరులైయున్నారో, ఆలాగున మీ సాధనలో, అనుష్ఠానములలో, వ్రతము లలో ప్రకృతి బలవేగముచే ఒక్కప్పుడు భంగము గలిగినను, పతనము నొంది నను, దానితో ఆగిపోవక ఏ కారణముచే అనగా సహవాస దోషముచేగాని, నివాస దోషముచేగాని, ఆహార దోషముచేగాని, అనుష్ఠానములోగల మార్పు చేతగాని భంగముగలిగెనో దానిని కనిపెట్టి అట్టిసహవాసము, అట్టి ప్రదేశము, అట్టి నివాసము, అట్టి ఆహారము, అట్టి సాధనను మార్పుచేసుకొని మొదటి కన్న ఎక్కువ సాధనపరులై యుండవలయును అట్టి పవిత్ర మార్గములో ప్రాణము పోయినను మనకు మంగళకరము అనెడి మనోదార్ఢ్యము గలిగి యుండవలయును అట్టి పావన మార్గములో దేహము వీడి పోయినను మరల దానిని సాధించుటకు ఏ దేశములో, ఏ కాలములో, ఏ జాతిలో, ఏ పుణ్యవతి గర్భములో పుట్టిన మనము పై జెప్పిన అనుష్ఠానము పూర్తిజేసి ముక్తిని పొందగలమో అట్టి దేశ, కాల, జాతి, గర్భములలో పుట్టగలము కావుననే గీతలో "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే" అనియు "అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్"అనియు "నహి కల్యాణకృత్క

శ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి" అని ఆనంద భావముతో, అతిహర్షముతో ఆశీర్వాదపూర్వకముగా శ్రీకృష్ణభగవానుడు గీతలో అనుగ్రహ పూర్వకముగా మనల ననుగ్రహించిన పరమ పావన వాక్యమందు నమ్మకము గలిగి యుండుడు

**ఇంద్రియాణాం హి చరతాం విషయేషు స్వభావతః ।**
**బలాదాహరణం తేషాం ప్రత్యాహారస్స ఉచ్యతే ॥**

ప్రవృత్తిమార్గము నుండి నివృత్తిమార్గములోనికి మనస్సు తిరుగు నప్పుడు గలిగెడు స్థితి ప్రత్యాహార మనంబడును చక్షురాది ఇంద్రియములు తత్త ద్విషయములలోనికి పరుగెత్తిపోవుట స్వభావమైయున్నది అట్టి ఇంద్రియములను విషయములలోనుండి ప్రయత్న పూర్వకముగా మరలించి ఆత్మలో చేర్చుటయే ప్రత్యాహార మనంబడును అదే ప్రకారముగా

**యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్ ।**
**తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్॥**

ఇదిన్నీ ప్రవృత్తి మార్గమునుండి నివృత్తి మార్గములోనికి ప్రవేశించెడు ఉపాయమునే తెలుపుచున్నది మనస్సు ఏ యే విషయములలోనికి బోవు చుండునో చంచలమైన అట్టి మనస్సును ఆ యా విషయములనుండి మరలించి తన స్వరూపమగు ఆత్మలోనే నిలుపవలయును అట్లు మనస్సును ప్రవృత్తి మార్గము నుండి నివృత్తిమార్గములోనికి ప్రవేశపెట్టనిచో గలిగెడు అపాయమును ఈ క్రింది శ్లోకము తెలుపు చున్నది

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥**

విషయముల మీదికి బోవుచున్న ఇంద్రియముతో చేరుకొని మనస్సు విషయముల మీదికి బోయెనేని అట్టి మనస్సు సముద్రమందలి ఓడను తుఫానుగాలి ముంచి వేయు విధముగ బ్రహ్మనిష్ఠుని యొక్క ఆత్మజ్ఞాన మును నశింపజేయుచున్నది అనగా అట్టి వాడు సంసార సాగరములో

మునిగి పోవును

**పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూః**
**తస్మాత్పరాఙ్పశ్యతి నాన్తరాత్మన్ ।**
**కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్**
**ఆవృత్తచక్షురమృతత్వమిచ్ఛన్ ॥**

బ్రహ్మదేవుడు మొదట ఇంద్రియములన్నిటిని బహిర్ముఖముగానే సృజించెను అందువలన అంతరాత్మను చూడక యున్నాడు ఒకానొకడు అన్తఃకరణశుద్ధి గలవాడై నివృత్తి మార్గానుష్ఠానము గలవాడై యిన్ద్రియ ములనన్నిటిని ప్రవృత్తి మార్గమునుండి నివృత్తి మార్గమునకు మరలించిన వాడై, అమృతత్వమందు (మోక్షమందు) కోరికగలవాడై అన్తరాత్మను దర్శించుచున్నాడు అని కఠోపనిషత్తు ఎవరైనను నొకయద్దమును బహిర్ముఖ ముగా తన చేతిలో పట్టుకొనియుండిన దానియందు తన దేహము కనపడదుగాని విశ్వమంతయు అద్దములో కనుపించును ఆ దర్పణమునే తన వైపు త్రిప్పిపట్టుకొనిన దృశ్యమేమియు దానియందు కనపడదు కాని తన శరీరము స్పష్టముగా నేలాగున గోచరించునో బాహ్యదృష్టియొక్కయు, అంత ర్దృష్టియొక్కయు, ప్రవృత్తినివృత్తి మార్గముల యొక్కయు స్థితి ఈలాగున నుండునని ప్రజ్ఞావంతులు గ్రహించుకొందురు గాక!

**అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్।**
**విద్యాఽవిద్యాం నిహంత్యేవ తేజస్తిమిరసంఘవత్॥**

ప్రవృత్తి మార్గ పరమగు కర్మలు అవిద్యతో దనకు విరోధము లేమిచేత అజ్ఞానము నుండి మరలింపజాలవు జ్ఞానమన్ననో నివృత్తి మార్గపరమగుటచే వెలుగు అంధకారముయొక్క సమూహమును రహిత మొనర్చుచున్నట్లు అజ్ఞానమును రహిత మొనర్చుచున్నది

**నిషిధ్య నిఖిలోపాధీన్ నేతి నేతీతి వాక్యతః ।**
**విద్యాదైక్యం మహావాక్యైః జీవాత్మ పరమాత్మనోః ॥**

సమస్తమైన కించిద్ జ్ఞత్వ సర్వజ్ఞత్వాది రూపోపాధులను నేతినేతి అనే మహావాక్యము వల్ల త్రోసి వేసి జీవాత్మ పరమాత్మ ఐక్యమును అఖండానంద స్వరూపార్థమును తెలుసుకొనవలయును

**జీవన్ముక్తిస్తు తద్విద్యాత్ పూర్వోపాధిగుణాంస్త్యజేత్।**
**స సచ్చిదాది ధర్మత్వాత్ భేజే భ్రమర కీటవత్॥**

నివృత్తి మార్గపరుడు ముందున్న స్థూల సూక్ష్మ కారణోపాధులను, సత్వరజస్తమోగుణములను విడిచి పెట్టుచున్నాడనునది యేది కలదో అది జీవన్ముక్తియని తెలియవలెను అటువంటి స్వభావము గల నివృత్తి మార్గ స్థుడు పురుగు తుమ్మెదను భావించి భావించి తుమ్మెదయగునట్లే నివృత్తి మార్గముగా ప్రయాణము చేసి చేసి బ్రహ్మమును పొందుచున్నాడు

**శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః।**
**జీవస్సర్వ మలాన్ముక్తః స్వర్ణవద్ద్యోతతే స్వయమ్॥**

నివృత్తి మార్గస్థుడు శ్రవణ, మనన, నిదిధ్యాసనములచే మిక్కిలి ప్రకా శింపజేయబడిన జ్ఞానమను తేజస్సుచేత చక్కగా దహింపబడిన సమస్త సంసారములకు హేతువైన అజ్ఞానమువలన విడువబడినవాడై స్ఫుటము చేయబడిన మలినబంగారము శుద్ధమయ్యేలాగున శుద్ధాత్ముడై ప్రకృతి దోష రహితుడై తనకు తానే ప్రకాశించుచున్నాడు

**జ్ఞానాజ్ఞానే పదార్థౌ ద్వావాత్మనో ముక్తి బంధనౌ।**
**జ్ఞానాన్ముక్తిర్నిబంధోఽన్యాదితి వేదాంత డిండిమః॥**

జ్ఞానమని, అజ్ఞానమని రెండువస్తువులుగలవు జ్ఞానముచేత ముక్తియు, అజ్ఞానముచేత బంధనమును ఆత్మకు కలుగుచున్నవి ఇదే సమస్త వేదాంతముయొక్క సారము నివృత్తి మార్గస్థుడు మోక్షమును, ప్రవృత్తి మార్గస్థుడు బంధనమును పొందునని భావము ఈలాగున వేదాంత భేరి ఉచ్చధ్వనితో ఘోషించుచున్నది

**జ్ఞానకర్మపదార్థౌ ద్వౌ వస్తుకర్త్రాత్మతంత్రకౌ ।**
**జ్ఞానాన్మోక్షో న కర్మభ్య ఇతి వేదాంత డిండిమః ॥**

జ్ఞానమని, కర్మమని రెండు పదార్థములు గలవు ఇందు జ్ఞానము ఆత్మవస్తువు ననుసరించియు, కర్మ కర్తయగు జీవుననుసరించియు నడుచును ఈ రెండింటి మార్గములు తెలిసికొనుటవల్ల మోక్షము కలుగును ప్రవృత్తి మార్గమగు కర్మ జీవుని బంధించును నివృత్తి మార్గమగు జ్ఞానము మోక్షము కలుగజేయును

**దృగ్ దృశ్యౌ ద్వౌ పదార్థౌస్తః పరస్పర విలక్షణౌ ।**
**దృగ్ బ్రహ్మ దృశ్యం మాయా స్యాదితి వేదాంత డిండిమః ॥**

దృక్కనియు, దృశ్యమనియు రెండు పదార్థములు గలవు ఇవి రెండును పరస్పర వ్యతిరేక స్వభావము గలవి ఇందు దృక్కు బ్రహ్మముగాను, దృశ్యము మాయగాను ఉన్నది నివృత్తి మార్గస్థులు బ్రహ్మమును, ప్రవృత్తి మార్గస్థులు మాయను పొందుచుందురు

**పురుషార్థ త్రయావిష్టాః పురుషాః పశవో ధ్రువమ్ ।**
**మోక్షార్థీ పురుషశ్శ్రేష్ఠ ఇతి వేదాంత డిండిమః ॥**

ధర్మార్థ కామములు అను మూడింటిలో ప్రవర్తించెడు పురుషులు పశుసదృశులు పరమ పురుషార్థమగు మోక్షమును కోరువాడే శ్రేష్ఠుడగు పురుషుడగును ప్రవృత్తి మార్గస్థుడు పశుప్రాయుడగును నివృత్తి మార్గస్థుడు మాత్రమే శ్రేష్ఠ పురుషుడనబడును

**న కామ్య ప్రతిషిద్ధాభిః క్రియాభిర్మోక్ష వాసనా ।**
**ఈశ్వరానుగ్రహాత్సా స్యాదితి వేదాంత డిండిమః ॥**

కామ్య కర్మలచేతను, నిషిద్ధ కర్మల చేతను మోక్ష వాసన గలుగదు. అట్టి మోక్షవాసన ఈశ్వరానుగ్రహమాత్రము చేతనే గలుగును

**అవిజ్ఞాతే జన్మ నష్టం విజ్ఞాతే జన్మ సార్థకమ్।**
**జ్ఞాతురాత్మా స దూరే స్యాదితి వేదాంత డిండిమః ॥**

పరతత్వము నెఱుగక పోయిన ఈ మానవ జన్మము వ్యర్థము ఎరింగినచో జన్మసార్థకమగును అట్టి ఆత్మతత్త్వము ఎరుంగ తలంపు గల వానికి దగ్గరలోనే యున్నది అని వేదాంత భేరి ఘోషించుచున్నది

**నామ రూపాభిమానస్స్యాత్ సంసార స్సర్వ దేహినామ్।**
**సచ్చిదానంద దృష్టిస్స్యాత్ ముక్తిర్వేదాంత డిండిమః ॥**

సమస్త జీవులకున్నూ, దేహాత్మ బుద్ధియే బంధముగాను, సచ్చిదానంద దృష్టియే మోక్షముగాను ఉన్నది ప్రవృత్తి మార్గస్థుడు దేహేంద్రియాభిమానము గలవాడై బంధనమును, నివృత్తి మార్గస్థుడు సచ్చిదానందాత్మ స్వరూపమును భావనజేసి ముక్తిని బొందుచున్నాడు

పైన నిరూపించినది శ్రీశంకరభగవత్పాదుల ఆశయము ఇప్పుడు ముండకోపనిషత్తుయొక్క అభిప్రాయమును చూడుడు

**మూ॥ ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా**
**అష్టాదశోక్త మవరం యేషు కర్మ**
**ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా**
**జరామృత్యుం తే పునరేవాపి యంతి ॥**

అస్థిరులయి, యజ్ఞమును నిర్వర్తించునట్టి ఈ పదునెనిమిది సంఖ్యగల ఋత్విగాదులు నశించు వారలు గదా! ఏపదునెనిమిది యందు చెప్పబడిన కర్మ శ్రేష్ఠమైనది కాదో, ఏ అజ్ఞానులు ప్రవృత్తి పరమగు కర్మయే మోక్షకారణమని సంతసించుచున్నారో, అట్టి వారలు జరామరణ ములను తిరిగి పొందుచున్నారు

**మూ॥ పరీక్ష్య లోకాన్కర్మచితాన్బ్రాహ్మణో**
**నిర్వేదమాయా న్నా స్త్యకృతం కృతేన।**

**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛే**
**త్సమిత్పాణి శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥**

బ్రహ్మవిచారము గలవాడు లోకములను కర్మచేత నిర్వర్తింపబడి నవిగా పరీక్షించి మోక్షము చేయబడిన కర్మము చేతలేదని వైరాగ్యమును పొందవలయును అట్టి వైరాగ్యము పొందిన బ్రహ్మ విచారణాభిలాష గలవాడు ఆ యమృత స్వరూపమును తెలిసికొనుటకు సమిధలు (ఫల పుష్పాదులు) హస్తమునందు గలవాడై శ్రోత్రియుడున్నూ, బ్రహ్మనిష్ఠుడును అగు గురువును గూర్చియే పోవలయును ఇది నివృత్తి మార్గస్థుని లక్షణము సూత సంహిత యందు తెలిపినది చూడుడు

**యదా జన్మజరావ్యాధి దుఃఖానామేకభేషజమ్ ।**
**కేవలం బ్రహ్మవిజ్ఞానం జాయతేఽసౌ సదాశివః ॥**

జన్మ జరావ్యాధి దుఃఖములన్నిటికి ఒకటే ఔషధము అది కేవలము బ్రహ్మజ్ఞానము మాత్రమే అగుచున్నది అట్టిజ్ఞానముగలవాడు సాక్షాత్ శివుడే

**తస్మాద్విజ్ఞానతో ముక్తి ర్నాన్యథా కర్మకోటిభిః ।**
**. కర్మసాధ్యస్య నిత్యత్వం న సిధ్యతి కదాచన ॥**

అందువలన నివృత్తి మార్గపరమగు జ్ఞానముచేతనే ముక్తి కలుగును గాని, ప్రవృత్తి మార్గ సంబంధమగు కర్మకోట్లవల్ల మోక్షము కలుగదు కర్మ సాధ్యమైన ఫలమునకు శాశ్వతమైన మోక్షము ఎప్పటికిన్నీ కలుగదు కర్మము నకు ఫలములు (1) ఉత్పత్తి, (2) ప్రాప్తి, (3) సంస్కారము, (4) వికారము వీనియందు జ్ఞానము లేదు అది నిష్కామ పరమగు నివృత్తి పరమైనచో, అంతఃకరణశుద్ధిని గలుగజేసి క్రమముగా మోక్షములోనికి చేర్చును

**వహ్నేరివౌష్ణ్యం సౌగన్ధ్యం కుసుమస్యేవ సర్వదా ।**
**అవినాభావి విమలం రవేరివ చ వాసరమ్ ॥**

అగ్నికి ఉష్ణము వలెను, పుష్పమునకు సుగంధము వలెను, సూర్యునికి

నిర్మలమైన ప్రకాశే దివసము వలెను మహాత్ములైన వారికి పరోపకార బుద్ధియున్ను అవినా భావమైన సంబంధము గలిగియుండును ఉష్ణత్వమును విడిచి అగ్నియు, సుగంధమును విడిచి పుష్పమున్ను, ప్రకాశమును విడిచి సూర్యుడున్ను ఎట్లు ఉండుట లేదో, ఆలాగున పరోపకారపరమగు కరుణను విడిచి మహనీయులు గూడ ఉండుట లేదు

**ప్రవృత్తి లక్షణం కర్మ జ్ఞానం సన్న్యాసలక్షణమ్ ।**
**తస్మాద్జ్ఞానం పురస్కృత్య సన్న్యసేదిహ బుద్ధిమాన్ ॥**

కామ్యకర్మము ప్రవృత్తి లక్షణమనియు, నివృత్తి పరమగు జ్ఞానమే సన్న్యాస లక్షణమనియు గ్రహించుకొనవలయును అందువలన బుద్ధిమంతు డగు ముముక్షువైన వాడు జ్ఞానమును పురస్కరించుకొని సమస్త బంధము లను త్యజింపవలయును

ఓమ్

